# యుద్ధం - శాంతి

## WAR AND PEACE



## టాల్‌స్టాయ్

YUDDHAMU-SANTHI - II

by

TOLSTOY

TRANSLATED BY

RENTALA GOPALA KRISHNA

BELLAMKONDA RAMADASU

JAYANTI PUBLICATIONS
Vijayawada-520 002.

Edition :
OCTOBER 1991

Price :
Rs. 100/-



Prinres :
JAYASRI PRESS
Vijayawada.

# ఆరవ కాండం

## 1

**1808** వ సంవత్సరంలో అలెగ్జాండర్ చక్రవర్తి నెపోలియన్‌తో మరో పర్యాయం సంభాషించడానికై ఎర్‌ఫర్ట్ వెళ్ళాడు. ఈ సామ్రాట్టుల సమావేశ వైభవం చాలా కాలం వరకు పీటర్స్‌బర్గ్ అభిజాత సమాజీయులలో ప్రధాన చర్చనీయాంశమైంది.

ఈ ఉభయ చక్రవర్తులను విశ్వవిధాతలని పిలిచేవారు. లోక భద్రతకు నిర్ణేతలు వీరే. 1809 వచ్చేసరికి ఇరువురికి గాఢ మైత్రి ఏర్పడింది. నెపోలియన్ ఆస్ట్రియాపై యుద్ధం ప్రకటించిన వెంటనే అలెగ్జాండర్ చక్రవర్తి రష్యన్ సేనా నివహంలోని ఒక దళాన్ని సరిహద్దు దాటి, ఆస్ట్రియా చక్రవర్తిపై దండయాత్ర వెడల వలసిందని ఆజ్ఞాపించాడు. ఆస్ట్రియా చక్రవర్తి పూర్వం తన మిత్రుడు, నెపోలియన్ శత్రువు. కాని చరిత్ర వ్యత్యస్తమైంది. అంతేకాదు—నెపోలియన్‌కు రష్యన్ చక్రవర్తి చెల్లెండ్రలో ఒకతెకు వివాహ యత్నాలు సాగుతున్నవని కూడా ఒక వార్త అల్లుకున్నది.

తన విదేశాంగ విధానం యొక్క ఫలితంగా ఏర్పడిన ఆందోళనలు, పథకములు అలా ఉంచి రష్యా ప్రతి పరిపాలనా శాఖలోనూ అనేక సంస్కరణలు తీసుకుని రావడం విషయంలో ఆసక్తి వహిస్తోంది. ఈ ప్రముఖ విషయాలన్నీ ఇలా ఉండగా నిత్య జీవితం- అంటే ప్రతి వ్యక్తియొక్క సాధారణ జీవితం- అతని ఇల్లూ, వాకిలి, పెళ్ళాం, బిడ్డలు, ఆరోగ్యం, అనారోగ్యం, పనీ పాటా, ఆదర్శాలు, అభిరుచులు, శాస్త్రం, సంగీతం, కవిత, ప్రేమ స్నేహాలు, ఎత్తుపల్లాలు వీటితో కూడిన సామాన్య జీవితం సాఫీగా సాగిపోతూనే ఉంది. చల్లగా సాగిపోయే ఈ జీవిత వాహినిని నెపోలియన్‌తో ఒడంబడికలు చేసుకోడం కాని, వాటిని అతిక్రమించడం కాని, సంస్కరణలు కాని కల్లోలితం కావించడం లేదు. వాటితో సంబంధం లేకుండా చల్లని వాగులా సాఫీగా సాగిపోతూంది ఈ జీవితం.

ఇహ పీటర్ విషయం, పీటర్‌కు పట్టుదల అనేది తక్కువ. అతను ధార్మిక జీవనాన్ని గురించి అనేక కలల మేడలు కట్టుకున్నాడు. అనేక ఊహాగానాలు చేశాడు. అనేక పథకాలు వేసుకున్నాడు. కాని అవేమీ ఫలవంతం కాలేదు. అయినా ఇవన్నీ ఆంద్రూ రాకుమారుడు అమలు గావించాడు. అతను తన గ్రామంలో ఇల్లు దాటి అడుగు బైట పెట్టలేదు. ఆట్టే ఆడంబరం కాని, అవరోధం కాని

లేకుండా వీటిని ఆచరణలో పెట్టి ఫలవంతం చేసుకోసాగాడు. తన స్నేహితునిలో ప్రధానంగా ఏ లక్షణం లోపించిందో ఆ లక్షణం తనలో ఉంది. అది ఒక పని తలపెట్టాడంటే దాన్ని సాధించి తీరే వరకూ వదిలిపెట్టక పోవడం. అంతేకాదు, దాన్ని సాధించే విధం కూడా స్పష్టంగా తెలియడం. పెద్ద యత్నం కాని, శ్రమ కాని గాభరా కాని లేకుండా ఒక కార్యక్రమానికి ఎలా పూనుకోవాలో అతనికి చక్కగా తెలుసు. అతని ఎస్టేట్లలో ఒక ఎస్టేటులో మూడు వందల మంది రైతులు కాయ కష్టం చేసుకుంటూ బ్రతుకు తున్నారు. వారందరినీ స్వతంత్రులను చేశాడు. విముక్తులను కావించాడు. ఈ విముక్తి ఉద్యమంలో ఇది తొలి సంఘటనలలో ఒకటి. బొగొచారోవ్ తన స్వంత ఖర్చుపై ఒక మంత్రసానిని ఒక నర్సును ఏర్పాటు చేయించాడు. రైతుల యొక్క, సేవకుల యొక్క పిల్లలకు చదువు సంధ్యలు నేర్పినందుకై మత గురువుకు అదనపు స్టైఫండు కూడా ఇచ్చే ఏర్పాటు చేశాడు. అతను కొంత కాలం తన కుమారుడు పెంపకంలో ఉన్న లిస్సీ-గోరీ లోనూ, మరి కొంతకాలం తన తండ్రి ఆశ్రమ మని పిలిచే బొగొచారోవ్‌లోనూ గడుపుతున్నాడు. పీటర్‌పట్ల ఆండ్రూ రాకుమారుడు ఒక విధమైన అనాసక్తి, అనాదృతీ చూపుతున్నప్పటికీ, దినదినం జరిగే సంఘటనలను ఎంతో శ్రద్ధా సక్తులతో గమనిస్తున్నాడు. బహుళంగా గ్రంథ పఠనం కూడా కావిస్తున్నాడు. ఈ సందర్భంలో మరో విషయం అతనికి ఎంతో ఆశ్చర్యం కలిగించింది. పీటర్స్‌బర్గ్‌లో తన తండ్రి వద్దనుంచి ఎందరో తనను చూచి పోవడానికి వచ్చేవారు. జాతీయ అంతర్జాతీయ రాజకీయాలు వారికి అమూలాగ్రంగా తెలిసి ఉండాలి. ఎక్కడో గ్రామంలో మారుమూల నివసిస్తున్న తనకు తెలిసినంత మాత్రం కూడా వారికి తెలియకపోవడం ఆండ్రూ రాకుమారునికి ఆశ్చర్యం కలిగించింది.

ఎస్టేట్ల అజమాయిషీ, గ్రంథపఠనం,- ఈ రెంటివల్ల అతని కాలం చాలా వరకు హరింపబడినప్పటికీ ఆండ్రూ రాకుమారుడు గత రెండు దండయాత్రలను గురించి వాటివల్ల కలిగిన నష్టాలను గురించి పరిశీలనాత్మకంగా ఒక చరిత్ర వ్రాయడానికి తీరిక చేసుకున్నాడు. సైనికవ్యవస్థ నియమావళిలో సంస్కరణ తీసుకుని రావడానికై ఒక పథకాన్ని కూడా తయారుచేయ బూనుకున్నాడు.

1808-9 శీతాకాలం చివరలో, రియజాన్‌లో తన చిన్నకుమారుని ఎస్టేట్లలో ఒక ఎస్టేటును పరిశీలించడానికై ప్రయాణమైనాడు ఆండ్రూ రాకుమారుడు. ఆ ఎస్టేటు మంచిచెడ్డలు, వ్యవహారాలు చూస్తున్నది తనే. తన కచ్చడంలో హాయిగా ఆసీనుడై ప్రయాణం సాగిస్తున్నాడు. ఆండ్రూ రాకుమారుడు ఏదో అవ్యక్తమైన స్వాప్నికస్థితిలో తేలిపోతున్నాడు. ఏవేవో కలలు కంటూ కుడి ఎడమల ప్రకృతిని పరిశీలిస్తున్నాడు. ఇరుప్రక్కలా చక్కని చెట్ల వరసలు, చెట్లు అప్పుడప్పుడే చివు

రిస్తున్నాయి. ఆ తొలిపూత పసిమి, అగాధ నీలాకాశంలో పరుగులెత్తుతున్న మబ్బు తునకల శోభా అతని వ్యక్తిత్వాన్ని యావత్తూ విశాల వికసితం కావించాయి. నది అడ్డు వచ్చింది. గత సంవత్సరం పీటర్‌తో కలిసి ఈ నదినే ఒక చిన్న పడవలో దాటాడు. నది దాటగానే ఒక చిన్న కుగ్రామం. పేదరికం లుకలుక లాడుతున్న గ్రామం.

బండి ఒక అడవిలో ప్రవేశించింది. దోవకు ఇరుప్రక్కలా అడవి ఒత్తుగా ఉంది. గాలి అల్లలాడడం లేదు. ఉక్కపోసేటంత వెచ్చగా ఉంది. ఒక చిన్న చిరు గాలి తెర కూడా ఆకులను అల్లలాడించటం లేదు. మృదుల స్నిగ్ధములయిన ఆకు రెమ్మలు అప్పుడప్పుడే మొలకలెత్తాయి. అక్కడక్కడ ఆకులు లేని పైన్‌చెట్లు కని పిస్తూ ఉంది—గడిచిపోయిన శీతాకాలాన్ని జ్ఞాపకం చేస్తూంది. శీతాకాలపు విషాద భారానికి చిన్నెలాగుంది. గుర్రాలు తలలూపి సకిలించాయి. అవి చెమటలు కారుస్తు న్నాయా అన్నంత బిగువుగా వుంది గాలి. ఆండ్రూతో ప్రయాణం చేస్తున్న సేవ కుడు పీటర్ బండివానితో ఏదో చెప్పాడు. అతను అవునన్నాడు. అంతతో వాడు సంతృప్తి చెందక యజమాని వంకకు తిరిగి 'ఎంత కన్నుల పండుగ్గా వుంది అయ్య గారు, అన్నాడు.

ఎక్కడో ఏదో ఆలోచిస్తున్న ఆండ్రూ రాకుమారుడు 'ఏమిటీ— ఏమి టన్నావూ?' అన్నాడు.

'అంతా ఎంత చక్కగా ఉంది?'

"అవును!" అన్నాడు ఆండ్రూరాకుమారుడు. మళ్ళీ తనలో ఇలా అనుకో సాగాడు. "వసంతం వచ్చింది.సందేహం లేదు. నిజంగా వసంతమే! ఎంతలో వచ్చింది వసంతం! అప్పుడే అంతా పచ్చగా కనిపిస్తుంది! ఆపిల్, అడవినేరేడు, మర్రి, — చెట్లన్నీ ఎంత పచ్చగా వికసించాయి! కాని ఓక్‌చెట్లు మాత్రం ఎక్కడా కనిపించడం లేదే?...... అదిగో! అక్కడొకటుంది.

అతనికి చేరువలోనే చేతికి అందేటట్టుగా రోడ్డుప్రక్కన కొందరావి చెట్లకు పదింతలు పెద్దదిగా ఒక ఉత్తాలమైన ఓక్ (సింధూర) వృక్షం కనిపిస్తుంది. దాని చుట్టూ దాని తమ్ముళ్ళలాగా చిన్న చిన్న చెట్లున్నాయి. వంకరలు తిరిగిన కొమ్మలను విశాలంగా వ్యాపింప చేస్తూ ఉంది. బాగా బెరడు వలచిన చోట తొర్రలు కనిపిస్తు న్నాయి. సన్నగా జడలుతీరి పొడుగ్గా ఉన్న కొమ్మలతో నిండిన ఆ వృక్షం తన ముసలి వయస్సునూ, తన చుట్టూవున్న యౌవనాన్ని చూచి వికృతంగా నవ్వుతోన్న దయ్యంలా కనిపిస్తుంది. వసంతాన్నీ ఎండనూ చూచి నవ్వుతున్నట్టుగా ఉంది.

"వసతం, ప్రేమ—ఆనందం! ఇంకా ఈ ఎండమావుల్లోనే పరుగిడు తున్నావా? ఇంకా ఆ అసత్యాల కథనే అల్లుకుంటున్నావా? ఇంకా ఆ పాతకట్టుకథనే

చెప్పుకుంటున్నావా?వసంతమనేది, ప్రేమనేది, ఆనందమనేది లేనే లేదు..ఇటు చూడు! తుపానుకు దెబ్బతిన్న ఈ సర్వీచెట్ల వంక చూడు! నా వికృత దేహంనుంచి పొడుచుకుని వస్తున్న ఈ వికృత అవయావాలవంక చూడు! అవి ఎలా ఉన్నాయో నేనలాగే ఉన్నాను! నీ కలల్లో నీ ఆశల్లో నాకే మాత్రం నమ్మకం లేదు."

అని చెపుతున్నట్టుగా ఉంది ఆ ముసలి ఓక్ వృక్షం.

ఆంద్రూ రాకుమారుడు బండిలో వెడుతూ ఆ చెట్టువంక మళ్ళీ మళ్ళీ తిరిగి చూచాడు. తనలో దాచుకున్న ఏదో అవ్యక్త రహస్యాన్ని ఆ చెట్టు తనకు చెపుతుందేమో విందామన్నట్టుగా తిరిగి చూచాడు. కాని ఆ ఓక్‌చెట్టు మాత్రం అక్కడే— ఆ గడ్డిమధ్య, ఆ పూలమధ్య నిశ్చలంగా నిలవబడి ఉంది.

"ముసలి ఓక్‌చెట్టు చెప్పింది నిజం. యౌవనాన్ని దాని కలలకే వదిలెయ్యాలి, కాని మనకు మాత్రం జీవితమంటే ఏమిటో తెలుసు. ఇహ మనకు జీవితం ఇవ్వబోయేది ఏమీ లేదు..." అనుకున్నాడు ఆంద్రూ రాకుమారుడు. అతని మనస్సులో ఎన్నో మధురమైన భావాలు, విషాద భరితమైన భావాలు ముసురుకొని వచ్చాయి. ఒక్కమాటు తన గత జీవితం వంక తిరిగి చూచుకున్నాడు. అతని హృదయం కుమిలిపోయింది. కాని అందులోనే ఒక విధమైన ఓదార్పు కనిపించింది. ఇహ తన జీవితంలో చేయవలసిందేమీ లేదనీ, చెడుచేయకుండా హాయిగా ఉండడం మంచిదనీ నిశ్చయించుకున్నాడు.

# 2

ఆంద్రూ రాకుమారుడు తన కుమారుని సంరక్షకుడుగా తన బాధ్యతలు నిర్వర్తించడానికై జిల్లా మార్షల్ అయిన కౌంట్ ఇల్యా ఆంద్రొవిచ్ రోస్టోవ్‌ను కలుసుకునేందుకు వెళ్ళాడు. మే నెల మధ్యలో అతనక్కడికి బయలుదేరాడు. ఈ పాటికి అడవులు నిండుగా ఆకులు తొడిగాయి. వేడి, దుమ్ము, చాలా ఎక్కువగా ఉంది. ఒక సన్నటి దారపు పోగు లాంటి వాగు కనిపిస్తే చాలు, దారినపోయే ప్రయాణీకుడికి అందులో మునిగి స్నానం చేద్దామనిపిస్తుంది. ఆంద్రూ ఆలోచిస్తూ ప్రయాణం చేస్తున్నాడు. అతని మనస్సు కౌంట్‌ను కలుసుకోవాలనే పనులు ఆలోచనలతో నిండివుంది. అత నలా ఆలోచిస్తూ ఉండగానే బండి 'అ్రెడ్‌నో' భవనానికి వెళ్ళే దోవలోకి వచ్చింది. వెంటనే ప్రక్కనున్న చెట్లపొదలలోంచి కిల కిల లాడుతున్న కంఠస్వరాలు వినిపించాయి. ఒక ఆడపిల్లల గుంపు, తన బండిని చూడ్డానికై పరుగెత్తుకుంటూ వచ్చింది. అందరికంటె ముందుగా వచ్చిన పిల్ల చక్కగా ఒక చిన్న మెలికలా ఉంది. నల్లని కళ్ళు, పసుపుపచ్చటి గౌను, గాలికి ఎగురుతున్న జుట్టుకు చేరుమాలు కట్టుకుంది. ఏదో మాట్లాడుకుంటూ అతని దగ్గరికి పరిగెత్తుకొని

వచ్చింది. కాని తనకు తెలియని అపరిచితుడు కంటపడగానే, మళ్ళీ అతని వంక తిరిగి చూడకుండా తెరలు తెరలుగా నవ్వుతూ మళ్ళీ పరుగెత్తుకుని వెళ్ళింది.

ఎంచాతనో కాని, ఆంద్రూకు బాధ కలిగింది. ఆ రోజు ఎంతో హాయిగా ఉంది. తళ తళ ఎండ కాస్తోంది. గాలి హాయితో నిండినట్టుగా ఉంది. అంతా, రెబ్బలా ఉన్న ఈ పిల్లతో సహా ఆనందంలో పొంగిపోతున్నట్టుగా ఉంది. ఆ పిల్ల కూడా తన లోకమే తన దన్నట్టుగా ఉండి అతన్ని గురించి పట్టించుకోనూ లేదు, అతనెవరని అడగనూ లేదు. అతను తనలో తాను ఇలా అనుకున్నాడు :

"ఈ పిల్ల ఎంచాతనో ఇంత హాయిగా ఉంది! ఈ అమ్మాయి మనస్సులో ఏముందో ? మిలటరీ చట్టాలు, శిస్తు వసూళ్ళు మాత్రం కావు. అంతవరకు నిజం."

కౌంట్ ఇల్యా ఆంద్రొవిచ్ రోస్టోవ్ ఎప్పటిలాగానే, వేట వినోదాలు, విందులు, సంగీత కచేరీలు ఇస్తూ తన అతిథులను ఆనందపరుస్తూ అత్రెడ్‌నో భవనంలోనే కాలం గడుపుతున్నాడు. ఎవరైనా అక్కడికి రావచ్చు. హాయిగా కాల క్షేపం చేయవచ్చు అందరినీ ఆహ్వానిస్తాడు. వచ్చిన వారందరినీ ఉండిపొమ్మంటాడు. ఈ విధంగా ఆంద్రూ రాకుమారుడు కూడా అక్కడ ఉండిపోవలసి వచ్చింది.

ఆ రోజంతా మందంగా గడిచింది. ముసలి కౌంట్ పేరు పెట్టుకున్న రోజు దగ్గరికి వస్తున్నందున, అతని ఇల్లంతా అతిథులతో క్రిక్కిరిసి ఉంది. ఆంద్రూకు ఒక్క నిముషంకూడా తీరిక చిక్కలేదు. వారితో కలిసి రోజంతా గడపవలసి వచ్చింది. ఏమైనా యువకులతోను, యువతులతోను కాలం గడుపుతున్న నటాషాను చూచి, అతను మాటిమాటికీ తనలో తాను "ఈ పిల్ల ఏమాలోచిస్తూ ఉందో ? ఎంచాత ఇంత హాయిగాను, ఆనందంగాను ఉందో ?" అనుకోసాగాడు.

ఆ రాత్రి అతనికి చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు. కాసేపు చదువు కున్నాడు. తరువాత దీపం ఆర్పివేశాడు. మళ్ళీ దీపం వెలిగించుకున్నాడు. గదిలో చెడ్డ ఉక్కగా ఉంది. కిటికీ తలుపులుమూసి ఉన్నాయి. ఈ మతిలేని ముసలివాడు తనను ఇక్కడ ఉంచినందుకు అతను చిరాకు పడ్డాడు. తను అతని మాటలు విన్నందుకు కూడా విసుకుపడ్డాడు.

కిటికీ తెరవడానికి లేచాడు. తలుపులు తెరవగానే అంతవరకూ బయట కాచుకుని కూచున్న వెన్నెల గదిలోకి పరుగెత్తుకుంటూ వచ్చి, గదినిండా నిండింది. రాత్రి చల్లగా హాయిగా ఉంది. గాలి శుభ్రంగా ఉంది. కిటికీలో నుంచి పొడుగ్గా చివరలు కత్తిరించి ఉన్న ఒకపొద కనిపిస్తోంది. ఒకవైపు నీడ, మరోవైపు సన్నగా వెన్నెల వెండి తీగెలా ఆ పొదపై ప్రాకి వుంది. చెట్ల క్రింద గరిక, ఆకులు,

మొక్కలు మొలిచి ఉన్నాయి. వాటి మధ్యలో వెన్నెల చుక్కలు పడినట్లుగా కని పిస్తోంది. ఆ నల్లని చెట్ల వరుస కవతల మంచుకప్పిన చూరు మిలమిల మెరుస్తోంది. కుడివైపు చెట్టు కొమ్మలు పరుచుకుని ఉన్నాయి. నిర్మలమైన ఆకాశంలో ప్రయాణం చేస్తున్న నిండు వెన్నెలా చెట్టు బెరడుపై ప్రతిఫలించి జాలువారుతోంది. ఆండ్రూ రాకుమారుడు కిటికీ అంచుపై మోచెయ్యి ఆనించి ఆ దృశ్యానంతా అవలోకిస్తూ నిల్చున్నాడు. తరువాత అతనికి కబుర్లు చెప్పుకుంటున్న కొంతమంది స్త్రీల కంఠ స్వరాలు వినిపించాయి.

అయితే వాళ్ళు నిద్ర పోలేదన్న మాట।

"ఏదీ మరోసారి" అంటోంది ఒక కంఠస్వరం. ఆండ్రూ రాకుమారుడు వెంటనే ఆ కంఠస్వరాన్ని గుర్తు పట్టాడు.

"మరి నీవు నిద్రపోతావేమిటి ?" అంటోంది మరో కంఠస్వరం.

"నిద్ర రాకపోవడం నా తప్పుకాదు. ఏదీ మరోసారి...."

రెండు గొంతులూ కలిసి మెల్లగా ఒక తీయని కూనిరాగం తీశాయి.

"ఎంత చక్కగా ఉంది। ఇహ నిద్రపోదాం."

"పోతే నీవు పో. నాకు మాత్రం నిద్ర రావడం లేదు."

ఆ మాట్లాడుతున్న అమ్మాయి దుస్తుల మడతల సన్నని రుసరుసలు అతను వినగలిగాడు. ఆ అమ్మాయి ఊపిరి పీల్చుకోవడం కూడా అతను వినగలడు. ఇప్పుడా అమ్మాయి కిటికీలోంచి బయటికి చూస్తూ ఉంటుంది. తరువాత అంతా నిశ్శబ్దం. వెన్నెలలోని వెలుగు నీడలు అలాగే నిలిచిపోయినట్లుగా ఉన్నాయి. ఆండ్రూ కదలకుండా అలాగే నిల్చున్నాడు.

"సోనియా। సోనియా।" అని పిలిచింది మొదట గొంతుక. "ఎలా నిద్ర పోతున్నావు ? ఇటు చూడు, ఈ వెన్నెల ఎంత చక్కగా ఉందో। లే, నిద్ర లే. ఇంత చక్కటి రాత్రిని మనం ఎన్నడూ చూచి ఉండం ఇలా రా ఇటు చూడు..."

సోనియా ఏదో గొణుగుతూ జవాబు చెప్పింది. "ఇలారా, ఇటు చూడు! ఈ చందమామ వంక చూడు, ఎంత బాగుందో. ఇలా కూచుని, ఇలా మోకాళ్ళు పట్టుకుని సరాసరి అక్కడికి ఎగిరి పోవాలనిపిస్తోంది. అదే నేను కోరేది." అన్నది మొదటి గొంతుక.

"ఎగిరిపోకు. మధ్యలో జారిపడేవు।" అన్నది సోనియా.

తరువాత ఒక చిన్నమాట మీద మాట వినిపించిది. సోనియా ఏదో

"రెండు గంటలైంది తెలియడం లేదా ఏమిటి !" అన్నది.

"అబ్బ, పోవే, నా హాయి అంతా పాడుచేస్తున్నావు."

తరువాత మళ్ళీ నిశ్శబ్దం ఆంద్రూకు మాత్రం ఆ అమ్మాయి నిశ్వాసాలు, కొద్దిపాటి కదలికలు మాత్రం వినిపిస్తున్నాయి. ఆ అమ్మాయి అక్కడ ఉన్నదన డానికి అదే గుర్తు.

"అబ్బబ్బ ! ఇహ వెళ్ళి పడుకుంటా" అంటూ ఆ పిల్ల కిటికీ తలుపు చటుక్కున మూసేసింది.

"వీళ్ళకు నా సంగతి ఏం పడుతుంది ?" అనుకున్నాడు ఆంద్రూ తనలో.

ఎంచాతనో కాని ఆ అమ్మాయి మాట్లాడుతూ మాట్లాడుతూ, మధ్యలో తన పేరు చెప్పుతుందేమోనని అతను ఆశించాడు. భయపడ్డాడు కూడా.

మళ్ళీ ఆ అమ్మాయే ! కావాలనే వచ్చినట్టుగా ఉంది..."

ఒక్కమాటుగా అతనిలో ఎన్నెన్నో ఆశలు, ఆవేశాలు కలగా పులగంగా అలముకుని పోయాయి. అవి అతని మనస్సుకు అలవాటు పడినవి కావు. అంచాత వాటిని అతను సరిగా అర్థం చేసుకోలేక పోయాడు. పక్కమీద వాలి వెంటనే నిద్ర పోయాడు.

# 3

మరుసటిరోజు ఉదయం ఆంద్రూ రాకుమారుడు, కౌంట్ దగ్గర సెలవు తీసుకుని ఆడవాళ్ళెవరికీ కనిపించకుండానే తిరిగి వచ్చాడు. జూన్ నెల, 'ఆశ్ర మానికి' తిరిగి వస్తున్న ఆంద్రూకు కొండరావి చెట్లతో నిండిన అడవి కనిపించింది. అడవిలోంచి వెడుతోంటే పూర్వంలాగా బండిగంటలు వినిపించడం లేదు. ఆకులు దట్టంగా ఉన్నాయి. అంతటా నీడగా వుంది.

"ఇక్కడే అనుకుంటాను, నన్ను బాగా అర్థం చేసుకున్న ఒక ముసలి ఓక్ చెట్టును చూచాను" అనుకున్నాడు ఆంద్రూ. తన ఎడమవైపుకు చూస్తూ. అతనికి వెంటనే తను వెదుకుతున్న ఆ చెట్టు కనిపించింది. కాని ఆ ఓక్‌చెట్టు పూర్తిగా మారి పోయింది. ఒక దట్టమైన ఆకుల చాందినీ పరుచుకుని కొమ్మలు మెల్లగా ఊగు తున్నాయి. ముళ్ళు వేసుకున్న గాట్లుపడిన కొమ్మలు ఇప్పుడు కనుపించడం లేదు. అప్పటి విచారము, అప్పటి విషాదము ఇప్పుడు కనిపించడం లేదు. కొత్తగా మొగ్గదొడిగిన పచ్చటి ఆకులు తప్ప మరేమీ కనిపించడం లేదు.

"ఇదే ఆ చెట్టు !" అనుకున్నాడు ఆంద్రూ. ఒక్కమాటుగా ఈ పునరుజ్జీ వంలోని ఆనందమంతా అతని హృదయంలోకి పరుగులు తీస్తూ వచ్చింది. అతని జీవితంలోని ఎన్నో ప్రియతమమైన, గంభీరమైన జ్ఞాపకాలు అతని కళ్ళముందు నిలిచాయి. నిర్మల నీలాకాశం....ఆస్టర్‌లిడ్జ్‌లో అతను చూచిన నీలాకాశం, భార్య ముఖంలోని మౌననింద, తెప్పమీద నది దాటుతూ పీటర్‌తో చేసిన సంభాషణ,

9 గంటలకు ఆంద్రూరాకుమారుడు కౌంట్ హాల్లో హాజరైనాడు. అతనితో ఆంద్రూకు వ్యక్తిగతంగా పరిచయం లేదు. అతన్ని గురించి ఆంద్రూ విన్న మాటలు కూడా అతని పట్ల గౌరవాన్ని కలిగించేవి కావు.

"ఏమైతేనేం? అతను యుద్ధమంత్రి. చక్రవర్తికి అతనిమీద నమ్మకముంది. అతని వ్యక్తిగత విషయాలతో నాకు పనేమిటి?" అనుకున్నాడు ఆంద్రూ తనలో తాను.

తను సహాయ సేనాధిపతిగా ఉన్న రోజులలో అనేకమంది పెద్దలను కలుసుకోవడం, ప్రతివారిలోనూ ఏదో ఒక విచిత్రత కనిపించడం అతనికి అనుభవంలో ఉన్న విషయమే. ఏమైనా ఈ సమయంలో ఈయన్ను కలుసుకున్నప్పుడు కలిగిన అనుభవం మాత్రం ఆంద్రూకు అన్నిటికంటే ప్రత్యేకంగాను, విచిత్రంగాను కనిపించింది. అక్కడ కూచున్న వారందరూ తమ ముఖాలలోని ఆందోళనను ఏదో విధంగా కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

ఈలోగా తలుపు తెరుచుకుని అందరి ముఖాల్లోనూ హఠాత్తుగా భయం కనిపించింది. ఆంద్రూరాకుమారుడు, అక్కడున్న ఆఫీసర్‌తో తను వచ్చినట్లుగా తెల్పవలసిందని అడిగాడు. కాని ఆ ఆఫీసర్ అతని వంతు కూడా రాకపోదని వ్యంగ్యపూరితంగా సమాధానం చెప్పాడు. ఒక మిలిటరీ ఉద్యోగిని లోపలికి ప్రవేశపెట్టారు. అదివరకే మాట్లాడిన మరి కొందరు ఉద్యోగులను బయటికి పంపిస్తూ ఉన్నారు. ఈ సమావేశం చాలా దీర్ఘకాలం సాగింది. లోపలనుంచి కర్కశంగా ఉన్న స్వరం, మధ్య మధ్యలో ఏవో కేకలు వినిపిస్తున్నాయి. వెంటనే ఆఫీసర్ వణికిపోతోన్న పెదవులతోను, పాలిపోయిన ముఖంతోను, తలపట్టుకొని హాలులోకి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

ఈమాటు వంతు ఆంద్రూరాకుమారునిది. "కిటికీ ప్రక్కన, కుడిప్రక్కకు వెళ్ళండి" అన్నారు అతని చెవిలో ఎవరో.

అతన్ని ఒక ప్రయివేటు గదిలో ప్రవేశపెట్టారు. గది శుభ్రంగానే ఉంది. కాని పెద్దపెద్ద సోఫాలు కాని, కుర్చీలు కాని ఏమీ లేవు. అతని కెదురుగా ఒక నలభై ఏండ్ల వ్యక్తి—దీర్ఘకాయుడు కూచుని ఉన్నాడు. అతని తల కూడా పొడుగైనది. జుట్టు వత్తుగా కత్తిరించబడి ఉంది. ముఖంలో మడతలు, దట్టంగా ఉన్న కనుబొమలు, పచ్చగా వున్న కళ్ళు, ముందుకు జారుతున్న ఎఱ్ఱటి ముక్కు. ఇతను ఆంద్రూరాకుమారునివైపు తల తిప్పి అతని వంక చూడకుండానే "నీకేం కావాలి?" అని అడిగాడు.

"ఏమీ అక్కర్లేదు యువర్ ఎక్సలెన్సీ!" అన్నాడు ఆంద్రూరాకుమారుడు ప్రశాంతంగా.

అరషేవ్ కళ్ళెత్తి చూచాడు. ఆంద్రూను కూర్చోమన్నాడు.

"నీవు బోల్‌కోన్‌స్కీ రాకుమారుడివి కదూ?" అని అడిగాడు.

"అవును కాని, నాకేమీ అక్కర్లేదు. నేను వ్రాసిన రిపోర్టు మీ దగ్గరికి పంపమని చక్రవర్తి కోరాడు..."

"అబ్బాయ్! నేనొక విషయం చెప్పనా? నేనా రిపోర్టు చదివాను. నీవు కొన్ని నియమాలను సూచించావు. ఇప్పటికే పాతనియమాలు చాలా ఉన్నాయి. కాని వాటిని అమలులో పెట్టేవా రెవరూ లేరు. ఈ రోజుల్లో చాలామంది వ్రాస్తారు. ఆ పని చాలా చులకనైపోయింది" అన్నాడు అరషేవ్. మొదట్లో అతను కాస్త చనువుగా మాట్లాడాడు కాని తరువాత కోపంగా మాట్లాడాడు.

"తమరు నేను వ్రాసినదాన్ని గురించి ఏమి సూచిస్తారో తెలుసుకోవడం కోసం మిమ్మల్ని కలుసుకోవాలని చక్రవర్తి అభిమతం" అన్నాడు ఆంద్రూ.

"నేను నా అభిప్రాయంతో సహా ఆ రిపోర్టును కమిటీకి పంపాను. నేను దాన్ని ఒప్పుకోవడం లేదు" అన్నాడు అరషేవ్ అక్కడనుంచి లేస్తూ, తన టేబిల్ మీద నుంచి ఒక కాగితం తీసి ఆంద్రూకు ఇస్తూ "ఇదిగో చూడు" అన్నాడు.

ఆ కాగితం వెనకాల తప్పులతో పెన్సిల్‌తో ఇలా వ్రాసి వుంది. మధ్యలో కామాలు, ఫుల్‌స్టాపులు కూడా లేవు;

"ఈ రిపోర్టు హేతుయుతంగా లేదు. ఫ్రెంచి చట్టాన్నుంచి కాపీ చేసింది. మనదానికి దీనికి సంబంధం లేదు. పైగా ఒక హేతువు కూడా కనిపించడం లేదు.

"దీన్ని గురించి ఏ కమిటీ విచారణ చెయ్యాలి?" అని అడిగాడు ఆంద్రూ రాకుమారుడు.

"మిలిటరీ న్యాయచట్ట పునఃపరిశీలన కమిటీ దీన్ని విచారణ చేస్తుంది. నీ పేరు అన్ని పేర్లకంటే ముందుగానే ఉంచాను" అన్నాడు అరషేవ్.

ఆంద్రూరాకుమారుడు చిరునవ్వు నవ్వాడు. "మరో విధంగా అయితే నేను అందులో చేరి ఉండకపోయేవాడ్ని" అన్నాడు.

"గౌరవసభ్యుడు అంటే నీ కర్థమయ్యే ఉంటుందనుకుంటాను. మంచిది. ఇక సెలవు. తరువాత ఎవరు?" అంటూ కేక వేశాడు అరషేవ్, ఆంద్రూను బయటికి పంపిస్తూ.

# 5

కమిటీ మెంబరుగా తను నియోగింపబడాలనే ఉద్దేశంతో ఆంద్రూరాకుమారుడు, అధికారంలో వున్న తన పరిచయస్థులను, కలుసుకున్నందు వల్ల తనకు లాభం కలుగుతుందని అనుకునేవారిని కలుసుకున్నాడు. ఒక యుద్ధం చివర అత

నిలో కలిగిన ఆశ్చర్యం లాంటి ఆశ్చర్యమే ఇప్పుడు కూడా—ఈ పై వర్గాల వారిని కలుసుకుంటున్నప్పుడు అతనిలో కలిగింది. పైవారి చిరాకు, తెలుసుకోగోరే వారి ఆతురతలు, తెలుసుకున్న వారి నింపాదినీ, ఒక అంతూ పంతూ లేని కమిటీ మీటింగులను; ఇవన్నీ గమనించిన తరువాత ఆంద్రూకు ఈ 1809వ సంవత్సరంలో పీటర్స్‌బర్గ్‌లో ఒక పౌరయుద్ధం తయారవుతున్నదని ఊహ కలిగింది. ఈ సంవత్సరం స్పెరాన్‌స్కీ, జనరల్ కమాండర్ కానున్నాడు. స్పెరాన్‌స్కీ పట్ల ఆంద్రూ రాకుమారుడికి ఒక అనూహ్యమైన ఆకర్షణ ఉంది. అందుచేత తన రిపోర్టు ఏమవుతుందో అనే ఆలోచనకంటే స్పెరాన్‌స్కీని గురించి, అతని సంస్కరణల గురించి ఎక్కువగా ఆంద్రూ ఆలోచించసాగాడు. అతని అంతస్థు, అతని పదవి; ఈ అభిజాత వర్గాలలోని ప్రతిపక్షంలో అతనికి ప్రవేశం కలిగించాయి. సంస్కరణలు కావాలనే పక్షం అతన్ని సానుభూతితో ఆహ్వానించింది. అతని ప్రత్యేకమైన బుద్ధి సూక్ష్మతవల్లను, విజ్ఞానం వల్లను, తన ఎస్టేట్లలో పని చేసే వారిపట్ల అతను చూపిన ఔదార్యం వల్లను, అతనిలా ఆహ్వానింపబడడం జరిగింది. కాలం అతన్ని చాలా వరకు మెత్తపరిచింది. అతని పూర్వపు గర్వము, అవీ చాలావరకు తగ్గిపోయాయి. వయస్సుతోపాటు ఒకవిధమైన నిండు నింపాది వచ్చాయి.

అరక్షేవ్‌ను కలుసుకున్న మరుసటిరోజు ఆంద్రూరాకుమారుడు, కౌంట్ కోషుబే ఇంటికి ఒక సాయంకాలపు పార్టీకి వెళ్ళాడు. తను తన సమావేశాన్ని గురించి కోషుబేతో చెప్పాడు. కోషుబే కూడా సిలా ఆంద్రొవిచ్‌ని గురించి (అరక్షేవ్) ఆంద్రూ లాగానే వ్యంగ్యపూరితంగా మాట్లాడాడు. అతని ధోరణి ఆ హాలులో ఉన్న వారందరితోపాటు బోల్‌కోన్‌స్కీకి కూడా విచిత్రంగా కనిపించింది.

"అబ్బాయ్!" అంటూ మొదలెట్టాడు కోషుబే; "నీవు కమిటీలో ఒకడుగా ఉన్నప్పటికీ కూడా మైఖేల్ నికోలవిచ్ స్పెరాన్‌స్కీ లేకుండా నీకు గడవదు. అతను చాలా గొప్పవాడు. అతనితో ఈ సాయంత్రం మాట్లాడతాను. అతను ఆ రిపోర్టు చూస్తానని వాగ్దానం చేశాడు..." అన్నాడు కోషుబే.

"కాని స్పెరాన్‌స్కీకి మిలిటరీ న్యాయచట్టంలో ఏమిటి శ్రద్ధ?" అని అడిగాడు ఆంద్రూరాకుమారుడు.

అతని అమాయకత్వాన్ని చూచి కోషుబే చిరునవ్వు నవ్వి తల పంకించాడు.

"నిన్ను గురించీ.... నీవు పనివారికి స్వేచ్ఛ ఇవ్వడాన్ని గురించి మేము మాట్లాడుకున్నాం...." అన్నాడు కోషుబే.

"ఓహో! అయితే పనివారికి స్వేచ్ఛ ఇచ్చింది నీవేనా రాకుమారా?" అన్నాడు అక్కడున్న వారిలో ఒక వృద్ధుడు. లాథెరైన్ రాణినాటి మంచిరోజులు జ్ఞాపకమున్న వృద్ధు డతను.

"అది చాలా చిన్న ఎస్టేటు. వచ్చే రాబడి కూడా కొద్ది" అన్నాడు ఆంద్రూ ఆ విషయం అంత పట్టించుకోవలసింది కాదన్నట్టుగా.

"నీవు చాలా తొందరపడుతున్నావు!" అని వృద్ధుడు కోషబే వంక తిరిగి "నేను ఒక విషయం తెలుసుకోవాలనుకుంటున్నాను. రైతులకు ముక్తి కలిగిస్తే ఇహ భూమి దున్నేవాళ్ళు ఎవరంటాను? నా మాట వినండి. చట్టాలు చేయడం సులభమే కాని వాటిప్రకారం పరిపాలించడం కష్టం. మరో విషయం అడుగుతున్నాను కౌంట్. అందరూ పరీక్షలకు వెళ్ళేటట్టయితే ఇహ ప్యాస్ అయినట్టు నిర్ణయించే దెవరు?" అని అడిగాడు.

"ప్యాస్ చేయకలవాళ్ళే నిర్ణయిస్తారనుకుంటాను" అన్నాడు కోషబే.

"చూడండి : ఉదాహరణకు ప్రియనిషింకోవ్ ఉన్నాడనుకోండి. అతను చాలా ముఖ్యమైన వ్యక్తి. కాని అతనికి అరవై ఏండ్లు. అతను ఎలా పరీక్ష ప్యాసవుతాడంటారు ?" అని అడిగాడు వృద్ధుడు.

"అవును ఆ విషయంలో కొంత చిక్కు వున్నమాట వాస్తవమే. చాలా మందికి ఈ విషయం అట్టే తెలీదు కూడా. కాని...." అని ఈ వాక్యం ముగించేలోగానే కోషబే, ఆంద్రూ రాకుమారుని చెయ్యి పట్టుకుని అప్పుడే గదిలోకి వచ్చిన ఒక పొడుగాటి వ్యక్తిని కలుసుకోవడం కోసం తీసుకుని వెళ్ళాడు.

ఆ వచ్చిన వ్యక్తికి నలభై సంవత్సరాల కంటే ఎక్కువ ఉండవు. తల మాత్రం బట్టతల అయిపోయి కొద్దిగా వెంట్రుక లున్నాయి. పొడుగైన ముఖం, కొంచెం బొద్దుగా పొడుగ్గా వున్న చేతులు, చాలా రోజులపాటు ఆసుపత్రిలో ఉన్న సోల్జెర్ శరీరంలా పాలిపోయిన శరీరం. నీలపురంగు కోటు వేసుకున్నాడు. ఆంద్రూ అతనివంక చూడగానే అతనెవరో గుర్తుపట్టి కొంచెం ఉలికిపడ్డాడు. ఇతనే స్పెరాన్స్కి ప్రభుత్వ కార్యదర్శి. స్పెరాన్స్కి జార్ చక్రవర్తికి కుడిభుజం లాంటివాడు. ఎర్ఫైర్‌లో జార్‌కు తోడుగా వున్నాడు. అనేక పర్యాయాలు ఫ్రెంచి చక్రవర్తితో మాట్లాడాడు కూడా.

అతను రాగానే అందరివంక ఒకమాటు కలియ చూచాడు. కాని వెంటనే ఎవరితోనూ మాట్లాడలేదు. అతని ప్రతి కదలికనూ ఆంద్రూ గమనించాడు. అతను మాట్లాడిన ప్రతిమాటనూ శ్రద్ధగా ఆలకించాడు. అతన్ని గురించి పూర్వమే విని వుండడంవల్ల అతనిలో అన్ని మంచి లక్షణాలూ కుప్పపోసుకుని వుంటాయని ఆంద్రూ అనుకున్నాడు.

తను త్వరలో అక్కడికి రాలేకపోయినందుకు స్పెరాన్స్కి కోషబేకు క్షమాపణ చెప్పుకున్నాడు. తను రాజభవనంలో వుండిపోవలసి వచ్చిందని చెప్పాడు.

చక్రవర్తి వుండి పొమ్మన్నాడని మాత్రం అనలేదు. ఆంద్రూ అతని మాటలోని ఈ మర్యాదను, వినయాన్ని గమనించాడు. కోషుబే, ఆంద్రూను అతనికి పరిచయం చేయగానే, అతను మెల్లగా కళ్ళెత్తి ఒకటి రెండు నిమిషాలు మాట్లాడకుండా చిరునవ్వు నవ్వుతూ చూచాడు. తరువాత ఇలా అన్నాడు.

"నీ పరిచయం కావడం నాకెంతో సంతోషం. నిన్ను గురించి చాలా విన్నాను."

కోషుబే కొద్ది మాటలలో ఆంద్రూ అరక్షేవ్‌ను కలుసుకున్న విషయాన్ని గురించి చెప్పాడు. స్పెరాన్‌స్కీ చిరునవ్వు నవ్వి మళ్ళీ ఇలా అన్నాడు.

"కమిషన్ ప్రెసిడెంటైన మిష్టర్ మెగ్నిట్‌స్కీ నాకు స్నేహితుడు. నీకిష్టమైన పక్షంలో నీ వతనితో స్వయంగా మాట్లాడే ఏర్పాటు చేస్తాను" అతను ఈ మాటల్లో ప్రతిమాటా స్పష్టంగా అన్నాడు. వాక్యం పూర్తి చేసిన తరువాత "అతను మర్యాదగా వుంటాడనీ, అవసరమైన పని చేస్తాడని అనుకుంటాను" అన్నాడు.

ఇప్పటికొక చిన్న గుంపు వారి చుట్టూ పోగయింది. స్పెరాన్‌స్కీలోని నింపాదిని చూచి ఆంద్రూ రాకుమారుడు ఆశ్చర్యపోయాడు. కొత్త సంస్కరణలు ప్రవేశపెట్టిన వృద్ధునికి జవాబు చెపుతూ అతను చూపుతున్న ఈ నింపాది ఆంద్రూకు మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది.

కొద్దిసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్న తరువాత స్పెరాన్‌స్కీ లేచి ఆంద్రూ రాకుమారుని గది చివరకు తీసుకుని వెళ్ళాడు. అక్కడైతే తన అభిప్రాయాలు అతనితో ముచ్చటించవచ్చు.

"ఆ వృద్ధుడి మాటల్లోపడి నీతో రెండు మాటలు కూడా మాట్లాడే అవకాశం లేకపోయింది రాకుమారా" అన్నాడు స్పెరాన్‌స్కీ.

అతనిలా అనగానే ఆంద్రూ రాకుమారుడు పొంగిపోయాడు.

"నిన్ను నేను కలుసుకోకపోయినా నిన్ను గురించి చాలా రోజులబట్టి వింటున్నాను" అని చెప్పసాగాడు స్పెరాన్‌స్కీ. "మొదట్లో నీవు నీ రైతాంగానికి విముక్తి కలిగించడాన్ని గురించి విన్నాను. అందరూ అనుసరించవలసిన మార్గం అది. తరువాత ఇటీవల జరిగిన కోర్టు పదవుల తగ్గింపుపట్ల నిరసన తెల్పని కోర్టు సలహాదారుడవు నీ వొక్కడవే నన్న విషయం నాకు తెలిసింది" అన్నాడు.

"అవును. నా ప్రత్యేక అవకాశాలు నేను వినియోగించుకోవడం మా నాన్నగారి కిష్టంలేదు.. అందుచేత నేను క్రిందిమెట్టు మీదినుంచి నా వృత్తి ప్రారంభించాను" అన్నాడు ఆంద్రూ.

"మీ నాన్నగారు పాత తరం వాడైనప్పటికీ దీన్ని విమర్శిస్తున్న మా సమకాలికులందరి కంటె ఎంతో ఉత్తముడు. అయినా న్యాయాన్ని స్రకమంగా పునర్నిర్మించడమే దీని ఉద్దేశం."

"అయినప్పటికీ కొంత విమర్శకు తావులేక పోలేదని నా ఉద్దేశం" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు. అతని ప్రభావం నుంచి కొంచెం విడుదల పొందాలనే తలంపుతో.

అతను చెప్పిన ప్రతిమాటకూ తల ఊపడం ఆంద్రూకు కొంచెం విసుగని పించిది. ఒక్క విషయంలోనైనా అతని మాట కాదు అందామనుకున్నాడు.

"అంటే నీ విమర్శ ఆత్మాశయంమీద ఆధారపడి ఉందన్న మాట !" అన్నాడు స్పెరాన్‌స్కీ మెల్లగా.

"కొంత వరకు ఆ విషయం నిజం కావచ్చు. కాని నా ఉద్దేశంలో ప్రభుత్వం యొక్క శ్రేయస్సుకూడా దృష్టిలో ఉంచుకునే చెపుతున్నాను."

"అదెలాగ ?"

"నేను మాంటెస్క్యూ శిష్యుణ్ణి 'రాచరికానికి ఆధారం ప్రతిష్ఠ' అన్న అతని సూత్రం నాకు నిర్వివాదాంశమైనదిగా కనిపిస్తుంది. కొన్ని ప్రత్యేక హక్కులు, అవకాశాలు దీన్ని భద్రంగా కాపాడతాయని కూడా నా నమ్మకం" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు.

ఈ మాటలు వినగానే స్పెరాన్‌స్కీ ముఖంలోని చిరునవ్వు చెరిగిపోయింది. ఆంద్రూ అన్న మాటలో అతనికి ఆసక్తి కలిగి మళ్ళీ ఇలా అన్నాడు.

"అయితే నీ విషయాన్ని ఆ దృష్టినుంచి చూస్తున్నావన్న మాట !"

ఈ మాట ఎప్పటిలాగానే నింపాదిగా అన్నాడు. కాని కొద్ది కష్టంతో ఫ్రెంచి భాషలో అన్నాడు.

"ఉద్యోగ ధర్మాలకు హక్కులు ప్రమాదకరంగా పరిణమించినప్పుడు హక్కులు ప్రతిష్ఠను కాపాడవు" అని చెప్పాడు మాంటెస్క్యూ. అంచాత చెడు పనులు చేయకుండా ఉండడంలోను లేక వాటి తాలూకు ఫలితాలు మనం ఆశించ కుండా ఉండడంలోను ప్రతిష్ఠ ఆధారపడి వుంటుంది. ఇలాటి ప్రతిష్ఠను ఇనుమడింప జేయడానికి ప్రయత్నించే ఏ సంస్థ అయినప్పటికీ కూడా ఫ్రెంచి చక్రవర్తి యొక్క 'లీజియన్ ఆఫ్ ఆనర్'లాగా గొప్పది. అంచాత నా ఉద్దేశంలో దీన్ని విమర్శించ డం చిలిపితనంలాగా కనిపిస్తోంది. ఇది ఉద్యోగ వృత్తులలోని మంచిని మాత్రమే ఎక్కువ చేస్తుంది" అన్నాడు స్పెరాన్‌స్కీ.

"ఈ విషయం నేను ఒప్పుకుని తీరతాను. కాని తారతమ్యాలు కూడా దీనికే దారితీస్తాయని అనుకుంటాను" అన్నాడు ఆంద్రూ.

"అయినప్పటికీ నీవు నీ కోసం పీటిని ఉపయోగించుకో లేకుండా వున్నావు రాకుమారా" అన్నాడు స్పెరాన్‌స్కీ, వాదాన్ని సులువు చేస్తూ, "సరే నీవు నన్ను బుధవారంనాడు కలుసుకో. నేను అప్పటికి మెగ్నిట్‌స్కీని కలుసుకుని ఉంటాను.

నీకు కొన్ని వివరాలు కూడా చెపుతాను. ఏమైనా నీతో అప్పుడు ఎక్కువ మాట్లాడ టానికి ఎక్కువ అవకాశం ఉంటుంది" అని స్పెరాన్‌స్కీ సెలవు తీసుకోకుండానే ఫ్రెంచి పద్ధతిలో అక్కణ్ణుంచి జారిపోయాడు.

# 6

శ్రీ పీటర్స్‌బర్గ్‌లో ఉన్న మొదటిరోజుల్లో ఆంద్రూ రాకుమారుడు, ఒంటరిగా ఉన్నప్పుడు తనలో మొలకెత్తిన భావాలు ఇప్పుడు ఇక్కడ తన చుట్టూ ముసిరిన అనేక పనులవల్ల తన మనస్సులో ఎక్కడో మాటు మణిగి పోవడం గమనించాడు. ప్రతి సాయంత్రం ఇంటికిరాగానే తన నోటుపుస్తకంలో మరుసటిరోజున తను కలుసు కోవలసిన వారిని గురించి వ్రాసుకుంటూ వచ్చాడు.

ఆ మరుసటి బుధవారం నాడు స్పెరాన్‌స్కీని చూడడానికి వెళ్ళాడు. చాలా సేపు అతనితో ముచ్చటించాడు. తను జీవితంలో ఆశిస్తున్న ఆదర్శాన్ని ఇతర్లలో చూడాలనే ఆతురతలో తను ఊహించుకుంటున్న గుణగణాలు, బుద్ధిసూక్ష్మత స్పెరాన్‌స్కీలో నిండి ఉన్నాయనుకున్నాడు ఆంద్రూ. ఆ మంత్రి కూడా తన లాగానే తన వర్గానికి చెందిన వాడైనట్టయితే, వారివిద్య, జీవితంలో వారి అలవాట్లు, విషయాలను వారు అర్థం చేసుకుని నిర్ణయించే పద్ధతులు ఒకలాటివే అయినట్లయితే అతని శీలంలోని మానవ బలహీనతను అతను త్వరగా గ్రహించి ఉండేవాడు. కాని అతను పూర్తిగా అర్థంచేసుకోక పోవడం వల్లనే అతని బుద్ధి సూక్ష్మత ఆంద్రూను ఆకర్షించింది. అందుచేత అతనిపట్ల ఆంద్రూకు ఒకవిధమైన గౌరవం కూడా కలి గింది. దానికి కారణం ఆంద్రూ దానిని పూర్తిగా గ్రహించక పోవడమే; ఆయన మాత్రం ఆంద్రూ రాకుమారునికి ఎంతో చనువు ఇచ్చాడు. దానికి కారణం అతను ఆంద్రూలో ఉన్న శక్తి సామర్థ్యాలు గ్రహించడమే.

"మనలాటి వాళ్ళకు అన్నీ నిత్య కార్యక్రమంలోని భాగాలే. సాధారణమైన అంతస్థుకంటె పై అంతస్థు మనది ..." లేక "మనం చూచావ్! తోడేళ్ళను మేకలను ఒకేగట్టున కలిపి మేపాలి. ఇది మీకు తెలిసిన విషయమే" లేక "వాళ్ళు మనలను అర్థంచేసుకోలేరు. వాళ్ళ విలువ ఏమిటో మన విలువ ఏమిటో నీకూ నాకూ తెలుసు."

ఈ రెండవ పర్యాయం ఇంత చనువుగా స్పెరాన్‌స్కీతో సంభాషించిన తరు వాత, తను తొలిగా సంభాషించినప్పుడు ఎలాంటి అభిప్రాయం ఏర్పడిందో ఆంద్రూ మనస్సులో అలాంటి అభిప్రాయమే ఏర్పడిపోయింది. స్పెరాన్‌స్కీలో గొప్ప బుద్ధి శాలిని, ఆలోచనా పరుణ్ణి, స్వశక్తివల్ల పైకి వచ్చిన వ్యక్తిని ఆంద్రూ రాకుమారుడు

చూచాడు. ఇంతకాలం బోల్‌కోన్‌స్కీ వెదుకుతూ వచ్చిన తాత్వికుడు అతనే. తనూ ఇలాంటి తాత్వికుడు కావాలనే అతను ఇనాళ్ళనుంచీ కోరుకున్నాడు. అతని యొక్క రహస్యాలను తర్కదృష్ట్యా వెదుకుతూ ఇంగితానికి విరుద్ధమైన దాన్ని దేన్నీ ఒప్పుకోకుండా ప్రతిదాన్నీ హేతువాద దృష్ట్యా పరిశీలిస్తూ ఆంద్రూ ఇన్నాళ్ళనుంచీ తను ఇలాంటి తాత్వికుడు కావాలనే కోరుకున్నాడు.

అతని బుద్ధి సూక్ష్మతకు ఒక ప్రత్యేక లక్షణముంది. బుద్ధి శక్తిలోను, బుద్ధి యొక్క హక్కులలోను స్థిరమైన నమ్మిక అది. బోల్‌కోన్‌స్కీకి అనుమానించడం అలవాటు. కాని స్పెరాన్‌స్కీకి మటుకు అలాంటిదేమీ లేదు. తన భావాలను వెలిబుచ్చ లేకపోవడం కాని, తన నమ్మకాలను అనుమానించడం కాని జరిగి అతను ఒక్కసాటు కూడా అవస్థపడినట్లు లేదు. స్పెరాన్‌స్కీలోని ఈ ప్రత్యేక లక్షణమే ఆంద్రూను ఎక్కువగా ఆకర్షించింది.

కొద్దిలో చెప్పాలంటే ఆంద్రూ రాకుమారునికి నెపోలియన్ పట్ల ఎలాంటి అభిమానము, మెప్పుదల ఏర్పడ్డాయో ఈ మంత్రిపట్ల కూడా అలాంటి అభిమానము, మెప్పుదల ఏర్పడ్డాయి. స్పెరాన్‌స్కీ ఒక మతగురువు కొడుకు. అంచాత కొందరతన్ని నిరసిస్తూ ఉండేవారు. కాని ఆంద్రూ రాకుమారునిలో మాత్రం అతని ఉత్సాహం కొద్దీ అతనిపట్ల మెప్పుదల ఎక్కువైంది.

"సెనేట్‌కు ఇప్పుడు మనం కొత్త న్యాయాధికారాలు ఇవ్వబోతున్నాం. కాని ఇప్పుడసలు మనకు చట్టాలే లేవు. కాని రాకుమారా! ఇలాంటి సమయంలో నీలాంటి వాళ్ళు దూరంగా ఉండడం ఏ మాత్రం మంచిది కాదు" అన్నాడు స్పెరాన్‌స్కీ.

ఆంద్రూ రాకుమారుడు ఇలాంటి విషయాలకు ప్రత్యేకంగా విద్య నేర్చుకున్నవాడు అవసరమని అన్నాడు. 'ఏరి? అలాంటి వాళ్ళెక్కడున్నారో చూపు? ఇదొక విషవర్తులం! దీనినుంచి బయటపడే మార్గం లేదు' అన్నాడు స్పెరాన్‌స్కీ.

ఒక వారం తరువాత ఆంద్రూ రాకుమారుడు మిలిటరీ న్యాయ చట్ట పునర్నిర్మాణ కమిటీలో సభ్యుడుగా నియమింపబడ్డాడు. అంతేకాక తను అనుకోకుండానే లెజిస్లేటివ్ కమిషన్‌లో ఒక శాఖకు అధ్యక్షుడుగా కూడా నియోగింపబడ్డాడు. స్పెరాన్‌స్కీ ప్రత్యేక కోరికపై ఆంద్రూ ఈ పదవిని అంగీకరించాడు. 'సివిల్‌లా' చదవడం మొదలెట్టాడు. జస్టినియన్, నెపోలియన్ ఏర్పరచిన చట్టాలు కూడా మళ్ళీ చదివి 'వ్యక్తుల హక్కులు' అనే శీర్షిక గల శాఖపై పని చేయడం మొదలెట్టాడు.

# 7

ఇది జరగడానికి రెండు సంవత్సరాల ముందు—1808 లో పీటర్ తన ఎస్టేట్లలో పర్యటించి వచ్చిన తరువాత పీటర్స్‌బర్గ్‌లోని స్వచ్ఛంద సన్యాసులకు అనుకోకుండా తనే నాయకుడయినాడు. అనేక చోట్ల ధర్మసత్రాలు, మరికొన్ని చోట్ల

పెంకులు కప్పిన ధర్మసత్రాలు ఏర్పరిచాడు. వీటి కోసం దస్తావేజులు కూడా ఏర్పరిచాడు. ప్రచారం కూడా సాగిస్తున్నాడు. ఆలయ నిర్మాణానికి డబ్బిచ్చాడు. సభ్యులు సకాలంలో డబ్బివ్వరు కాబట్టి తన జేబులోనుంచే ధర్మాల కోసం డబ్బు కేటాయించాడు. ఇలా తన సొంత సొమ్మునే ఖర్చుచేస్తున్నా, తను మాత్రం పూర్వపు పద్ధతిలోనే జీవితాన్ని సాగిస్తున్నాడు. హాయిగా తినడం, హాయిగా తాగడం బ్రహ్మచారుల మధ్య తిరుగుతూ విలాసజీవితాన్ని గడుపుతున్నాడు. అవి అవినీతికరమని అనుకుంటున్నప్పటికీ ఆ ఆనందాలకు దూరంగా మాత్రం ఉండ లేదు. ఇలా ఉత్సాహం కొద్దీ అనేక ప్రయత్నాలు సలిపినప్పటికీ ఒక సంవత్సరం అయ్యే సరికి ఈ జీవితంలోని బండారం బయటపడసాగింది. ఒక ఎత్తైన భూమిపై అడుగు పెట్టి ఒక గుంటలో కూరుకుపోయే వ్యక్తిలాగా అనిపించింది. తరువాత మరోకాలు పెట్టి చూస్తాడు. అప్పుడు పూర్తిగా మోకాళ్ళవరకూ దిగబడిపోయి బయటికి రాలేకుండా పోతాడు.

పీటర్స్‌బర్గ్ లాడ్జీలతో ఏ మాత్రం సంబంధంలేని బస్‌డియెవ్ ఇప్పుడు మాస్కో వదిలిపెట్టి అసలు వెళ్ళడమే లేదు. పీటర్ రోజూ కలుసుకుంటున్న తన సోదరులు అందరి మనుష్యుల్లాగానే కనిపిస్తున్నారు. ప్రిన్స్ బి. మిస్టర్ డి; వీరుకూడా మామూలు మనుష్యుల్లాగానే బలహీనతలతో వుండడం పీటర్ గమనించాడు. వారి పై పై ముసుగులచాటున వారి యూనిఫారాలు, పతకాలు కనిపిస్తూనే వున్నాయి. అసలు వారి జీవితాదర్శాలే అవి. పీటర్ తరుచుగా చందాలు పోగు చేస్తూ వున్నప్పుడు, సగం మంది సభ్యుల తరుపున తనే చందాలు ఇవ్వవలసి వచ్చేది. వారు వాగ్దానాలైతే చేసేవారు గాని చందాలు మాత్రం ఇచ్చేవారు కాదు. పైగా వారు కూడా తనలాగే శ్రీమంతులు. తమ వస్తువులు ఇతరులకు ఇవ్వాలనే నియమమైతే వున్నది. అయినా వారిలో చేసినప్పుడు పీటర్‌కు ఎన్నెన్నో అనుమానాలు కలిగేవి.

అతను సోదరులందరినీ నాలుగు తరగతులుగా విభజించాడు. మొదటి తరగతి లాడ్జీ వ్యవహారాల్లో కాని, మానవసేవ విషయంలో కాని ఎలాంటి పాలు పంచుకోదు. కేవలం ధ్యానంలోనే వుండిపోతుంది. అభ్రకం, పాదరసం, ఉప్పు ఏవో ఇలాంటి విషయాలను గురించి ఆలోచిస్తూ ఉంటుంది. ఇవి పీటర్‌ను ఏ మాత్రం ఆకర్షించేవి కావు.

రెండో తరగతి వారందరూ తనలాంటి వాళ్ళే. పూర్తిగా ఒక నిశ్చయమంటూ లేనివాళ్ళు. వీళ్ళకు అసలుదోవ ఇంతవరకూ దొరక్కపోయినప్పటికీ ఏదో ఒకరోజు దొరుకుతుందనే ఆశమాత్రం ఉంది.

ఇహ మూడో తరగతివారు పూజలు పునస్కారాల సంగతి మాత్రమే ఆలోచించే వాళ్ళు. వాటి అర్థంతో వీరికి పనేమీ లేదు.

నాలుగో తరగతివారు దేంట్లోనూ నమ్మకం లేనివాళ్ళు. దేనికోసమూ ఆశించని వాళ్ళు. ఏదో శ్రీమంతులతో పరిచయం ఏర్పడుతుందనీ దానివల్ల కొంత లాభిస్తుందనీ ఆశించినవాళ్ళు వీళ్ళు.

అనేక విధాలైన ఈ కార్యకలాపాలు పీటర్‌కు అసంతృప్తికరంగా కనిపించాయి. అప్పుడు పీటర్స్‌బర్గ్‌లో ఉన్న పద్ధతిలో ఈ శాఖ ఏ మాత్రం బాగా లేదనీ, తప్పుదోవలో ప్రయాణం చేస్తున్నదనీ అనుకున్నాడు పీటర్. అంచాత పరదేశాలకు వెళ్ళి దాని తాలూకు రహస్యాలు తెలుసుకుని వద్దామని నిశ్చయించుకున్నాడు.

1809వ సంవత్సరం వేసవికాలంలో మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చాడు. రష్యాలోని ఈ స్వచ్ఛంద మతగురువు అందరూ పీటర్ పరదేశాలు తిరిగి వచ్చాడనీ, ఈ రహస్యాలన్నీ తెలుసుకున్నాడనీ, అతను పై వర్గం వారి మన్ననలను సంపాదించుకున్నాడనీ అనుకున్నారు. అతనెన్నో కొత్త పథకాలతో తిరిగి వచ్చాడనుకున్నారు. అతను తిరిగి రాగానే ఒక సాధారణ సమావేశం ఏర్పాటు చేసి ఆ సమావేశంలో పీటర్ తన సందేశాన్ని అందజేస్తాడని అనుకున్నారు. లాడ్జిలో అంతా సమావేశమైన తరువాత, మామూలు మర్యాదలన్నీ పూర్తి అయిన తరువాత పీటర్ ఈ క్రింది విధంగా ఉపన్యసించాడు:

"సోదరులారా!" అన్నాడు కొంచెం తటపటాయిస్తూ. అతనిచేతిలో ఉపన్యాసం వ్రాసిపెట్టుకున్న కాగితం ఉంది. "సోదరులారా! మనం లాడ్జిలో ఒంటిగా కూచుని ధ్యానించడం మాత్రంతో సరిపోదు. మనం పని కూడా చెయ్యాలి" ఇలా అని తరువాత తను వ్రాసిపెట్టుకున్న ఉపన్యాసాన్ని చదవడం మొదలెట్టాడు:

"సత్యాన్ని వ్యాపింపజేయడం కోసం, మంచిని పైకి తీసుకుని రావడం కోసం మనం ఇతర్ల లో ఉన్న చెడు అభిప్రాయాలను పారదోలాలి. కాలానికి అనుగుణ్యంగా నియమావళిని ఏర్పరచాలి. యువకులను విద్యావిజ్ఞానాలు కల్గించాలి, వైజ్ఞానికులందరితోనూ దగ్గరి సంబంధాలు పెట్టుకుని అవిశ్వాసాన్ని పారదోలాలి. ఇప్పుడున్న రాజకీయ సంస్థలు, ఈ మన ఆదర్శాలకు వ్యతిరేకంగా ఉన్నాయి. అలాటప్పుడు మనం ఏం చెయ్యాలి? తిరుగుబాటు తీసుకు రావాలా? సంఘాన్ని తారుమారు చెయ్యాలా? కాని మనం అలాటి చిలిపి పనులేవీ చెయ్యం. విజ్ఞానానికీ హింసకూ ఎలాటి సంబంధమూ లేదు.

"మనసోదరులు మంచివారికి వారు నివసిస్తున్న అజ్ఞానం నుంచి విముక్తి కలిగించనంతవరకూ మనం మన ఆదర్శాన్ని క్రమంగా సాధించలేం. ఒక్క మాటలో చెప్పాలంటే, ఇప్పుడు మనం మన ఆదర్శాన్ని అమలులో పెట్టడానికి వీలుకలిగిస్తున్న ఈ పరిపాలనా పరిస్థితులను, సాంఘిక సంబంధాలను తారుమారు చెయ్యకుండానే మనం విశ్వజనీనమైన ఒక ప్రభుత్వాన్ని స్థాపించడానికి అవకాశమున్నది. మన మతం కూడా మొదటిరోజుల్లో ఇదే విషయాన్ని చెప్పింది.

"ప్రపంచం అంధకారంలో మునిగివున్నప్పుడు వట్టిబోధతో మాత్రమే సరిపోయింది. కాని ఆనాడు బోధించిన సత్యాల్లోని కొత్తదనం ఇప్పుడు చాలా వరకు తరిగిపోయింది. అంచాత మనం మళ్ళీ నూతన పద్ధతులను కనిపెట్టవలసి వుంది. మంచినతంపట్ల మానవుడికి ఆకర్షణ కలిగేటట్లుగా చెయ్యాలి. ఉద్రేకాన్ని, ఉద్వేగాన్ని పూర్తిగా అణచి వెయ్యకూడదు. వాటిని ఒక పరిమితిలో ఉపయోగించుకోవడానికి వీలైన ఒక పద్ధతిని మనం కనిపెట్టాలి.

ఇందుకోసం ప్రతి దేశంలోనూ కొందరు సంఘంగా ఏర్పడాలి. అందులో ప్రతి సభ్యుడూ తనే కేంద్రంగా ఉండి మరో సంఘాన్ని ఏర్పరచడానికి ప్రయత్నించాలి. ఈ విధంగా అందరూ కలియడంవల్ల ఎలాంటి అవరోధాలూ లేకుండా పోతాయి."

ఈ ఉపన్యాసం అందరిలోనూ ఎంతో చలనం కలిగించింది. లాడ్జిలో కూడా ఎంతో చలనం వచ్చింది. కాని ఎక్కువమంది దీనిని ప్రమాదకరంగా భావించి దీనిపట్ల సానుభూతి చూపించకపోవడం పీటర్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది. పూజ్యులైన గురువుగారు కూడా ఈ విషయంలో జోక్యం కలిగించుకుని ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఆ సమావేశంలో చాలా గొడవలు బయలు దేరాయి. సభ్యులలో అనేక మతాలు కూడా ఏర్పడ్డాయి. కొందరు పీటర్‌ను నిందించారు, కొందరు అతన్ని సమర్థించారు. మొట్టమొదటి సాఠిగా అతనికి ఏ ఇద్దరు మనుష్యులు కూడా సత్యాన్ని ఒకే విధంగా చూడరనే విషయం తెలిసి అతను ఆశ్చర్యపోయాడు. తనతో అంగీకరించేవారు కూడా ఏవో అభ్యంతరాలు చెపుతూనే ఉన్నారు.

పూజ్యులైన గురువుగారు కూడా పీటర్ ఉద్వేగంతో మాట్లాడాడని వ్యంగ్య ధోరణిలో చెప్పాడు. పీటర్ ఆ మాటకేమీ సమాధానం చెప్పలేదు. తన సూచనను ఒప్పుకుంటారా లేదా అని ముక్తసరిగా అడిగాడు. వారు స్పష్టంగా ఒప్పుకోమని చెప్పగానే పీటర్ మామూలు మర్యాదలు పాటించకుండా వెంటనే తన ఇంటికి వెళ్ళిపోయాడు.

## 8

శ్రీ పీటర్ ఇంటికి వెళ్ళిన తరువాత ఆ మరుసటి మూడురోజులూ సోషాలోనే గడిపాడు. ఎక్కడికీ కదల్లేదు.

ఈ సమయంలో అతనికి భార్య దగ్గర నుంచి ఒక ఉత్తరం వచ్చింది. అతను ఒకమాటు కలుసుకోవడానికి అనుమతించమనీ, వియోగంవల్ల తానెంతో పరితపిస్తున్నాననీ, ఇకముందు తన జీవితమంతా అతని కోపమే గడుపుతాననీ, కొద్దిరోజులలోనే పీటర్స్‌బర్గ్ వస్తున్నాననీ ఆమె వ్రాసింది.

ఇది జరిగిన కొద్దిరోజులకే ఒక మతప్రచారకుడు అతన్ని చూడ్డానికి వచ్చి

అతనితో వివాహసౌఖ్యాన్ని గురించి మాట్లాడుతూ అతని భార్యపట్ల అతని ప్రవర్తనను గురించి నిరసన తెలిపాడు. క్షమించడమే మంచిదన్న విషయాన్ని తెలియజేశాడు.

తరువాత అతని అత్తగారు—బేసిల్ రాకుమారుని భార్య కొద్దినిముషాలు అతనితో మాట్లాడాలని అతనికి కబురు పంపింది. పీటర్ ఇదంతా ఏదో కుట్రగా ఉన్నదని అనుమానించాడు కాని ప్రస్తుతం ఉన్న పరిస్థితిలోను,అతని కలవరంలోను, అతను తప్పకుండా జరిగి తీరుతుందన్న ఈ పునస్సంయోగాన్ని గురించి అతను అట్టే పట్టించుకో లేదు. ఇప్పుడేదీ అంత ముఖ్యంగా కనిపించడం లేదు కూడా.

'ఎవరిదీ తప్పు కాదు, ఎవరిదీ ఒప్పు కాదు. ఆమె కూడా అమాయకురాలే' అనుకున్నాడతను. ఆమె అతనితో జీవించినా, జీవించలేకపోయినా ఒకటేనా? ఏమైనప్పటికీ తన అనాసక్తిని పారదోలుకుని మాస్కో వెళ్ళి బన్‌డియెవ్‌తో సంప్రదించి తన జాబును అందజేద్దా మనుకున్నాడు.

## పీటర్ డైరీలోని భాగాలు :

"మాస్కో, నవంబరు 15—నే నిప్పుడే గురువుగారిని చూచి ఇంటికి తిరిగి వచ్చాను. ఆయన చాలా తక్కువ ఖర్చుతో జీవయాత్ర గడుపుతున్నాడు. మూడు సంవత్సరాల నుంచి ఒక జబ్బుతో బాధపడుతున్నాడు. కాని దాన్ని గురించి ఎవరికీ చెప్పి ఎరుగడు. ఎన్నడూ గొణుగుకోడు కూడా. ప్రొద్దుటినుంచి రాత్రిచాలా ప్రొద్దుపోయే వరకూ కొద్ది నిముషాలు అల్పాహారం కోసం మినహాయిస్తే, తతిమ్మా సమయాన్నంతా కేవలం శాస్త్రీయ పరిశోధనకే వినియోగిస్తాడు. నన్నెంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు. నన్ను ప్రక్కనే కూచోబెట్టుకున్నాడు.

'పీటర్స్‌బర్గ్, నవంబరు 23—నేను మళ్ళీ నా భార్యతో నివసిస్తున్నాను. మా అత్తగారు నా దగ్గరకొచ్చి కన్నీళ్ళు పెట్టుకొని హెలెన్ ఇక్కడే ఉందనీ, నాతో మాట్లాడాలని కోరుతున్నదనీ, ఆమె నిర్దోషి అనీ, అమాయకురాలనీ, నీవు విడిచిపెట్టినందుకు ఎంతో చింతిస్తున్నదనీ చెప్పింది. నేను మళ్ళీ ఆమెను నా దగ్గరికి వచ్చినట్లయితే ఆమె కోరికలను నిరాకరించే ధైర్యం నాకు లేదని నాకు తెలుసు. ఏం చేయాలో నాకు తెలీదు. ఎవరిని సలహా అడగాలో కూడా నాకు తెలీలేదు. నేను నా గదిలోకి వెళ్ళి ఆలోచించుకుని నాలో ఒక భాగమైన ఆమెను, నిరాకరించకూడదనే నిశ్చయానికి వచ్చాను. మంచి చెయ్యడం కోసం నేనామెను క్షమించిన పక్షంలో అదే నా ఉద్దేశం కాబట్టి మా పునస్సమాగమం కేవలం ఆత్మగతమైనదే అవుతుంది. ఈ విధంగా నిశ్చయించుకుని ఈ విషయాన్నే బన్‌డియెవ్‌కు వ్రాశాను. నా భార్యతో, గత జీవితాన్ని మరచి పొమ్మనీ నేను తప్పుచేసిన పక్షంలో నన్ను క్షమించమనీ

కోరాను. ఆమెను నేను క్షమించవలసిన విషయం ఏదీ లేదన్నాను. అలా అనడం నాకెంతో ఆనందం కలిగించింది. ఆమెను మళ్ళీ చూడడం నాకెంత కష్టం కలిగించిందో ఆమె ఎప్పటికి తెలుసుకోకుండా ఉంటుంది గాక:'

# 9

అప్పుడు. దర్బారులో కాని, నాగరికుల బాల్ నృత్యాల్లో కాని కలుసుకుంటూ ఉండే పీటర్స్‌బర్గ్ సమాజంలోని పై వర్గాల వారు ఎప్పటిలాగానే వివిధ వర్గాలుగా విభజింపబడి ఉండేవారు. ప్రతి వర్గానికీ ఒక ప్రత్యేక లక్షణం ఉంటూ ఉండేది. ఈ వర్గాలన్నిటిలోకీ పెద్ద వర్గాన్ని ఫ్రెంచివర్గం అని పిలుస్తుండేవారు. నెపోలియన్‌తో మైత్రిని ఒప్పుకునే వర్గం ఇది. ఈ వర్గం శామియన్‌ట్‌జోవ్, కాలియన్ కోర్ట్‌లకు చెందినది. తన భర్తతో మళ్ళీ సమాధానం కుదరగానే హెలెన్ మళ్ళీ ఈ వర్గంలో ఒక ప్రధానమైన స్థానాన్ని ఆక్రమించుకుంది. చమత్కారానికీ, చనువుకూ, మర్యాదకూ ప్రసిద్ధి చెందిన అనేక మంది రాజకీయ అభిజ్ఞ వర్గాల వారిని ఆమె తన ఇంటికి ఆహ్వానిస్తూ ఉండేది.

ఎర్‌ఫర్ట్‌లో చక్రవర్తుల సమావేశం జరిగినప్పుడు ఆమె అక్కడే ఉంది. యూరప్‌లోని ప్రఖ్యాత వ్యక్తులందరితోనూ, నెపోలియన్ పరివారంలోని వారితోనూ ఆమె పరిచయం ఏర్పరచుకుంది. ఆమె ఎర్‌ఫర్ట్‌లో అద్భుతంగా అందరినీ ఆకర్షించింది. నెపోలియన్ కూడా థియేటర్‌లో ఆమెను చూచి ఆకర్షింపబడి 'ఎంత చక్కటి పిల్ల!' అని ఆమెను ప్రశంసించాడు. అందగత్తె అయిన యువతిగా ఆమె ఇలా అందరి మన్ననలనూ చూరగొనడం ఆమె భర్తకేమీ ఆశ్చర్యం కలిగించలేదు. ఎంచాతనంటే వయస్సు వచ్చేకొద్దీ ఆమె పూర్వం కంటె ఎక్కువ అందంగా కనిపిస్తోంది. కాని అతనికి ఆశ్చర్యం కలిగించిందల్లా ఈ రెండు సంవత్సరాల్లోనూ ఆమె ఒక ఆకర్షణీయమైన స్త్రీగా ప్రఖ్యాతి సంపాదించడమే. ఆమె ఎంత అందమైనదో అంత తెలివైనది కూడా అని అంతా అంటున్నారు. ప్రసిద్ధుడైన డీలిన్ రాకుమారుడు ఆమెతో ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా నెరపుతున్నాడు. ఒక్కోమాటు ఎనిమిది పేజీల ఉత్తరం వ్రాస్తున్నాడు.

బిలిబైన్ తన చమత్కారాలన్నీ ఆమె ముందే ప్రదర్శించడానికి భద్రపరుచుకుంటున్నాడు. ఆమెకు డ్రాయింగ్ రూంలో ప్రవేశం కలిగిందీ అంటే దాన్ని మేధస్సుకు, ప్రతిభకు, ఒక యోగ్యతా పత్రంగా భావిస్తున్నారు. ఆమె ఇంట్లో జరిగే పార్టీలకు వెళ్ళబోయే ముందు యువకులు అక్కడ మాట్లాడడం కోసం ఏదో ఒకటి చదివి కాని వెళ్ళరు. రాయబారులు, రాయబార వర్గాల కార్యదర్శులు; వారి వారి రహస్యాలు కూడా ఆమెకు ఎంతో నమ్మకంగా చెపుతారు. ఒక విధంగా ఆమెకు

ఒక అధికారం ఉన్నదీ అనిపిస్తుంది. ఆమెకు అంతగా తెలివితేటలు లేవని పీటర్‌కు తెలుసు. అతను ఆమె పార్టీలకు వెళ్ళినప్పుడు అక్కడ రాజకీయాలు, తత్వశాస్త్రం, కవిత్వం చర్చించుకోవడం ఎంతో ఆశ్చర్యంతో వింటూ ఉండేవాడు. ఏ క్షణంలోనైనా తమ రహస్యం బయటపడి పోతుందేమోనని భయపడే మంత్రగాడిలా ఉండేవాడతను. కాని ఆమె రహస్యాన్ని ఎవరూ కనుక్కునే వారు కాదు. ఆ పార్టీ ఒక వెర్రివాళ్ళ స్వర్గంలాగా కనిపించేది. మోసం చేసేవారు మోసగింప బడడానికి కూడా ఇచ్చగిస్తారా అనిపించేది. ఆకర్షణీయమైన స్త్రీ గాను పేరు పడిన కౌంటెస్ బెషోవ్(హెలెన్) ఏ విషయాన్నైనా తన ధోరణిలో తన ఇష్టం వచ్చినట్టు మాట్లాడేది. ఆమె మాట్లాడే ప్రతి మాటా అంతా ఎంతో శ్రద్ధతోను, మెప్పుతోను ఆలకించేవారు. అందులో ఏదో గొప్ప అర్థం ఉన్నదనుకునేవారు. కాని నిజంగా అంత గొప్ప అర్థమున్నట్లు ఆమెకు కూడా తెలీదు.

పీటర్ సరిగ్గా ఆమెకు తగిన భర్త. అతని పరధ్యానం, విచిత్ర ధోరణి, ఠీవి ఈ గుణాలన్నీ అతన్ని ఆమెకు తగిన భర్తగా చేశాయి. తను డ్రాయింగ్ రూంలో ఉన్నప్పటికీ అతను ఎందులోనూ జోక్యం కలిగించుకునేవాడు కాదు. ఒక వైపు తన తీరు,మరోవైపు తన భార్య ఉత్సాహము ఎంతో విచిత్రంగా కనిపించేవి. పోయిన రెండు సంవత్సరాల నుంచీ అతని మనస్సు ఆలోచిస్తున్న విచిత్రమైన భావాలు, తనకు కాని ప్రతి విషయంపట్ల అతని నిరసన— వీటివల్ల అతను తన భార్యయొక్క సమాజీయులలో తనకేమీ పట్టనట్లుగాను, అనాసక్తంగాను ఉండేవాడు. తన భార్య డ్రాయింగ్ రూంకు అదొక నాటకశాల అన్నట్లుగా ప్రవేశించేవాడు. అందరితోనూ పరిచయం చేసుకునేవాడు. అందరితోనూ చనువుగా ఉండేవాడు. ఒక్కొసారి అనాసక్తంగానూ వుండేవాడు. ఎప్పుడైనా తనకు తోచిన విషయాన్ని గురించి కొద్దిగా మాట్లాడేవాడు. అక్కడ రాయబార వర్గంవారు ఉన్నప్పటికీ తన అభిప్రాయాలు అస్పష్టంగా చెప్పేవాడు.ఆనాడు అందరూ అనుకునే మాటలే అతను చెప్పేవాడు. కాని పీటర్స్ బర్గ్‌లోకెల్లా ప్రఖ్యాత స్త్రీ భర్తయైన ఈ విచిత్ర వ్యక్తి మాటలు ఎవరూ అంతగా పట్టించుకునేవారు కారు.

ఈ ఇంటికి తరచుగా వచ్చే యువకుల్లో బోరిస్ డ్రౌబెట్‌స్కాయ్ ఒకడు. అతనిప్పుడు మంచిదశలోనే ఉన్నాడు. హెలెన్ అతన్ని ఒక కుర్రవాణ్ణి చూచినట్టుగా చూచేది. అందరినీ చూచినప్పుడు ఎలా చిరునవ్వు నవ్వేదో అతన్ని చూచినప్పుడు కూడా అలాగే చిరునవ్వు నవ్వేది. కాని ఆ చిరునవ్వు పీటర్‌కు కష్టం కలిగించేది. బోరిస్ మాత్రం ఇంటి యజమానిని ఒక విధమైన గౌరవంతో చూచేవాడు. అతనిలా చూడడం పీటర్‌కు చిరాకు కలిగించేది. మూడు సంవత్సరాల క్రితం ఒక

మాటు ఇలాటి అనుభవం కలిగిన తరువాత మళ్ళీ అదే అనుభవం కలగకుండా ఉండడం కోసం అతను జాగ్రత్తపడ్డాడు.

అతను ఆమెను గురించి ఆలోచిస్తూ ఆమె ఈ వయస్సులో ఇప్పుడు కూడా చిన్ననాటి ఉద్వేగాలకు లోనవుతుందా అనుకున్నాడు. అయిన్పటికీ బోరిస్‌ను చూచి నప్పుడు ఆతనికొక పవిత్రమైన భావం కలిగేది. ఆ భావం అతనికే అర్ధమయ్యేది కాదు. ఇది ఏదో చిత్రంగా ఉందే అనుకునేవాడు.

ఈ విధంగా పీటర్ ప్రపంచం దృష్టిలో ఒక పెద్దమనిషిగాను, ఒక చక్కని ఆకర్షణీయమైన భార్యకు ఆమె విషయాలు పట్టించుకోని ఒక వెర్రి భర్తగా పరిగణింప బడుతూ వచ్చాడు. విచిత్రనమైన మనిషే కాని, తెలివి కలవాడు, ఎవరి విషయమూ పట్టించుకోడు. మంచి కుర్రవాడు అని అతన్ని గురించి అనుకుంటూ వచ్చారు. కాని అతని హృదయంలో మాత్రం ఒక మార్పు జరుగుతోంది. ఆ మార్పులో ఎన్నో కొత్త విషయాలు అతనికి గోచరమవుతూ వున్నాయి. కొత్త ఆనందాలు, కొత్త అనుమానాలు కూడా మొలకట్టుతున్నాయి.

# 10

## పీటర్ డైరీలోని భాగాలు

'నవంబరు 24 :— ఎనిమిది గంటలకు నిద్ర లేచాను. 'గాస్పెల్స్' చదివాను. సమావేశానికి వెళ్ళాను. (బస్‌డియెవ్ సలహా మీద పీటర్ కమిటీ మెంబరు అయినాడు.)తరువాత ఇంటికి తిరిగి వచ్చి భోజనం చేశాను.నాకు ఇష్టంలేని సమాజం కౌంటెస్ చుట్టూ వుంది. సులువుగా భోజనం చేసి పానీయం పుచ్చుకున్నాను. తరువాత కొన్ని కాగితాలు ఎత్తి వ్రాశాను. సాయంకాలం కౌంటెస్‌ను కలుసుకున్నాను. 'బి' ని గురించి ఒక కథ చెప్పాను. కౌంటెస్ పెద్దగా పగలబడి నవ్వింది. అందు చేత మళ్ళీ ఆమెకు అలాటి కథ చెప్పకూడ దనుకున్నాను. తరువాత వెళ్ళి హాయిగా నిద్రపోయాను.'

'నవంబరు 27:— ఆలస్యంగా నిద్రలేచాను. పక్కమీద చాలా సేపు అలాగే పడుకున్నాను. 'భగవంతుడా, సహాయం చెయ్యి, నన్ను రక్షించు' అని ప్రార్థించు కున్నాను. 'గాస్పెల్స్' చదివాను. కాని అంత ధ్యానంతో చదవలేదు.

వారుసోవ్ సోదరుడు ఈ ప్రపంచపు నిరర్ధకత్వాన్ని గురించి చక్రవర్తి సంస్కరణ పథకాన్ని గురించి మాట్లాడడానికి వచ్చాడు. నేను వాటిని విమర్శించ బోయాను. కాని మా నియమాలు, బస్‌డియెవ్ నాకు చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చి మానేశాను. నిజమైన మతప్రచారకుడు కూడా ప్రభుత్వంలో ఒక భాగమే. అందు

చేత తనకు సంబంధం లేని విషయాల్లో తను ఊరికే సాక్షీభూతుడుగా ఉండాలి కాని తను జోక్యం కలిగించుకోరాదు. నా నాలికే నాకు శత్రువు. సోదరులు వి.జి.ఓలు, కొత్తగా మా మతంలో ప్రవేశిస్తున్న ఒక వ్యక్తిని గురించి మాట్లాడడానికి నా దగ్గరికి వచ్చారు. నన్ను ఉపదేశకునిగా బాధ్యతను వహించమని కోరారు. కాని నేను దానికి అర్హుణ్ణి కానని అనుకున్నాను. తరువాత అతడు ఏడు స్తంభాలు- ఏడు సోపానాలు, ఏడు శాస్త్రీలు, ఏడు గుణాలు, ఏడు వరాలు, వీటి అర్థాన్ని గురించి చర్చించడం మొదలెట్టాడు. ఒక సోదరుడు చాలా ఉద్వేగంతో మాట్లాడాడు. ఆ కొత్త వ్యక్తిని ఇవాళ సాయంత్రమే ప్రవేశ పెట్టారు. లాడ్జీలో జరిగి కొత్త ఏర్పాట్లు కూడా ఎంతో ఆకర్షణీయంగా ఉన్నాయి. బోరిస్ డ్రౌబెట్ స్కొయ్‌ని కూడా ప్రవేశ పెట్టారు. నేనే అతనికి ఉపదేశకుణ్ణి. అతనితో ఒంటిగా మాట్లాడుతున్నప్పుడు ఒక విచిత్రమైన భావం నన్ను కలవర పెట్టింది. అతనిపట్ల ద్వేషం కలిగింది. నేను దాన్ని జయించడానికి ఎంతో ప్రయత్నించాను. అందుచేత అతని మంచిమార్గంలో ప్రవేశ పెట్టడానికి ఎంతో కాంక్షించాను. కాని నా చెడ్డ భావాలు మాత్రం నన్ను వదిలి పెట్టలేదు. అతను ఈ మతంలో చేరడానికి కారణం లోకదృష్టిలో పరువు,ప్రతిష్ట, అంతస్థు ఉన్నవారి మన్ననలను సంపాదించడమే అన్నట్లు నాకు కనిపించింది. అతను ఎన్నోసార్లు యన్.యస్ మా లాడ్జీలో వారేనా అని నన్ను ప్రశ్నించాడు కాని ఆ విషయం చెప్పలేక పోయాను. నే నతన్ని గమనిస్తూ ఉన్నాను. మా మతంలో చేరే గౌరవం అతనికి లేదు. అతనెప్పుడూ ఏదో ఒక వ్యవహారంలో మునిగి తేలుతూ ఉంటాడు. వట్టి ఉపరితలాలమీదనే సంచరిస్తూ ఉంటాడు. నే నేదైనా చెపితే చిరునవ్వు నవ్వేవాడు. కాని నా అనుమానాలను పూజ్యులైన మా గురువుగారు పంచుకునేలా చేయలేకపోయాను' (ఇక్కడ పుస్తకంలో మూడు పేజీలు ఖాళీగా ఉన్నాయి. తరువాత మళ్ళీ ఇలా వ్రాసివుంది:) 'సోదరుడు 'బి',తో చాలాసేపు మాట్లాడాను. సోదరుడు 'ఎ',ను కని పెట్టుకుని ఉండమని నాకు సలహా ఇచ్చాడు. నాకు అర్హత లేకపోయినప్పటికి ఎన్నో విషయాలు నాకు తెలియజేశాడు. ఈ విశ్వాన్ని సృష్టించిన వానిపేరు ఎడోనియస్. పరిపాలించే వాని పేరు ఇలోయిమ్. మూడో పేరు చెప్పకూడదు. సోదరుడు 'బి',తో ఈ చర్చలు నాలో విశ్వాసాన్ని బలపరిచాయి. స్వచ్ఛం చేశాయి. వీటిముందు ఇక అనుమానాలకు ఎలాటి తావూ లేదు. శాస్త్రపాఠాలకూ, మా దృష్టికీ ఎంతభేదం వుందో ఇప్పుడు నాకు అర్థమవుతోంది. మానవశాస్త్రం అర్థంచేసుకోవడం కోసం ప్రతిదాన్నీ విభజిస్తుంది. పరిశీలించడం కోసం ప్రతిదాన్నీ చంపివేస్తుంది. కాని మా శాస్త్రం మాత్రం అలా కాదు. మా శాస్త్రంలో అంతా ఒకటే—అంతా జీవితమే. గంధకం, పాదరసం, ఉప్పు; ఈ మూడూ అన్నిటికీ మూలపదార్థాలు. ఈ మూడింటినీ కలపడంవల్లనే వస్తువులన్నీ ఉత్పత్తి చెందినవి."

'డిసెంబరు. 8: — ఆలస్యంగా లేచాను. 'గాస్పెల్స్' చదివాను. గదిలోంచి బయటికి వచ్చాను. చదువుకునే గదిలో అటూ ఇటూ తిరుగుతున్నాను. ధ్యానం చేద్దామనుకున్నాను. నాలుగు సంవత్సరాల క్రితం జరిగిన ఒక విషయం మీదికి మనస్సు పోయింది. ద్వంద్వ యుద్ధం జరిగిన తరువాత డొలొహోవ్‌ను మాస్కోలో కలుసుకున్నాను. అతను, నా భార్య విదేశాల్లో ఉన్నప్పటికీ నేను ప్రశాంతంగానే ఉన్నానని తను ఆశిస్తున్నానని చెప్పాడు. అప్పుడతనికి ఏ సమాధానం చెప్పాలో నాకు తోచిందికాదు. ఇప్పుడా సమావేశం జ్ఞప్తికి తెచ్చుకుని మానసికంగా అతన్ని ఎన్నోవిధాల ఆడిపోసుకున్నాను. తరువాత ఈ భావాలన్నిటినీ పారద్రోలడానికి ప్రయత్నించాను. కాని అది పూర్తిగా సాధ్యపడలేదనే నా ఉద్దేశం— బోరిస్ డ్రొబెట్‌స్కొయ్ నా దగ్గరికి వచ్చి నాకు అనేక కథలు చెప్పాడు. అతను నా దగ్గర ఉండడం నాకెంతో చిరాకు కలుగజేసింది. అతను చెప్పిన విషయాలన్నీ కాదన్నాను. అతను కూడా నాకు ఎదురు జవాబు చెప్పగా నేను కొంచెం నిక్కచ్చిగా మాట్లాడాను. అతను మళ్ళీ నాకు ఎదురు జవాబు చెప్పాడు. తరువాత అతనేమీ మాట్లాడలేదు. అతని విషయంలో నిగ్రహించుకునే శక్తి నాకు లేదు. దీనికి కారణం నా ఆత్మవంచనే. నే నతని కంటె అధికుణ్ణని అనుకుంటానే కాని అది నిజంకాదు. నే నతన్ని నాకంటె తక్కువ చూస్తానే కాని,అతను మాత్రం నా బలహీనతలన్నీ ఒప్పుకుంటాడు. భగవంతుడా! నా తప్పులు నేను తెలుసుకునేటట్టుగా చెయ్యి, భోజనం చేసిన తరువాత నిద్రపోయాను. ఎవరో నా చెవిలో 'నీరోజు' అంటున్నట్టుగా నాకు వినిపించింది. నాకు చీకట్లో నడుస్తున్నట్టు హఠాత్తుగా నా చుట్టూ కుక్కలు మూగినట్టు కల వచ్చింది. కాని నాకు భయం కలగలేదు. తరువాత ఆ కుక్కల్లో ఒక పెద్ద కుక్క నా ఎడమకాలు పట్టుకుని నన్నక్కడ నుంచి కదలనివ్వడం లేదు. నేను దానిగొంతు నులుమబోయాను. నేను దాన్ని విదిలించుకోగానే మరో పెద్దకుక్క వచ్చి నన్ను కరవడం మొదలెట్టింది. నేను దాన్ని లేవనెత్తాను. నేను దాన్ని లేవనెత్తే కొద్దీ అది మరింత బరువెక్క సాగింది. హఠాత్తుగా నాకు సోదరుడు 'ఎ', కనిపించాడు. నన్ను చెయ్యిపుచ్చుకుని ఒక భవనం వైపుకు తీసుకుని వెళ్ళాడు. ఒక సన్నని బద్దీమీదుగా నడిచి ఆ భవనంలోకి వెళ్ళాలి. దానిమీద కాలుపెట్టాను. అది క్రిందపడి పోయింది. నేనొక కంచె పట్టుకుని పైకి ప్రాకుతున్నాను. కొసవరకూ చేతులతో ప్రాకడానికి వీలులేక పోయింది. ఇంకా చాలా సేపు ప్రాకిన తరువాత నెమ్మదిగా పైకి వచ్చి ఒక వైపునా ముందుదేహన్ని ఒకవైపు నా కాళ్ళను వుంచాను, తిరిగి చూచేసరికి నా సోదరుడు 'ఎ', కనిపించాడు. కంచెమీద నిల్చుని పెద్దతోటను, తోటలో చక్కని బంగళాను

చూపిస్తున్నాడు. తరువాత నాకు మెలకువ వచ్చింది. నా కలలో కనిపించిన బంగళాకునే నెప్పుడు చేరగలను?"

"డిసెంబరు 7:—మళ్ళీ నాకొక కల వచ్చింది. బస్‌డియెవ్ మా ఇంటికి వచ్చాడు. నే నతనికి విందు ఇద్దామనుకున్నాను. నేను మరెవరితోనో మాట్లాడుతున్నాను. అతన్ని వెళ్ళి కలుసుకుందామనుకున్నాను. అతని దగ్గరికి వెడుతోంటే అతని ముఖం హఠాత్తుగా మార్పు చెందుతోంది. ముఖం చిన్నవాడి ముఖంలా అవుతోంది. అతను నా చెవిలో చెపుతాడు. తరువాత మేమంతా గదిని విడిచిపోతాం. అందరం నేలమీద కూచుంటాం. అతను నాతో ఏదో చెపుతున్నాడు. నేను నా భావాలు అతనికి తెలియజేద్దామనుకుంటాను. అతను చెపుతున్నది నాకు వినిపించదు. నన్ను గురించే నేను ఆలోచిస్తుంటాను. నా కళ్ళల్లో నీళ్ళు నిండుతాయి. అతను నా వంక చూస్తాడు. అలా చూచినందుకు నాకు సంతోషం కలుగుతుంది. అతను నా వంక చిరాకుతో చూచి, లేచి నిల్చుని తన సంభాషణ ఆపివేస్తాడు. నాకు భయం కలుగుతుంది. అతను చెప్పిన విషయాలు నన్ను గురించేనా అని అడుగుతాను. అతను చెప్పాడు గాని నా వంక నింపాదిగా చూస్తాడు. తరువాత మళ్ళీ మేము మా పడకగదిలోకి వెడతాం. అక్కడ ఇద్దరు పడుకునే మంచం ఒకటి ఉంటుంది. అతను ఆ మంచం మీద ఒక ప్రక్కనే పడుకుని అతన్ని కౌగలించుకోవాలనిపిస్తుంది. అతను నన్నొక ప్రశ్న అడుగుతాడు. 'నీకు అన్నిటికంటె దేనిమీద ఎక్కువ కోరిక? నీవా విషయం తెలుసుకున్నావా?' అని ఈ ప్రశ్న నన్ను కలవరపరుస్తుంది. సోమరితనం ఒక్కటే నా ముఖ్యమయిన దోషమని జవాబు చెపుతాను. అతను సంశయాత్మకంగా నా వంక చూచి తల ఊపుతాడు, తరువాత నా కలవరం మరింత ఎక్కువౌతుంది. అతని సలహా ప్రకారం మళ్ళీ నా భార్యను స్వీకరించినప్పటికీ, భర్త భార్యతో ఉండే విధంగా నే నామెతో ఉండడం లేదని చెపుతాను. దీనికి ఆయన, నా భార్యకు నా లాలింపులు లేకుండా చేసే హక్కు నాకు లేదని నాకు చెపుతాడు. హఠాత్తుగా అంతా అదృశ్యమై పోతుంది, నిద్రలేచాను. ఈ రోజున బస్‌డియెవ్ దగ్గర్నుంచి నాకో ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంలో భర్త యొక్క విధులను గురించి నాకు వ్రాశాడు."

"డిసెంబరు 9:—మళ్ళీ నాకో కల వచ్చింది. వణుకుతున్న హృదయంతో లేచాను. మాస్కోలో నా ఇంట్లో బస్‌డియెవ్ చిన్న డ్రాయింగ్ రూంలో నుంచి పెద్ద హాలులోకి వస్తున్నట్టుగా కనిపించింది. నే నతన్ని కలుసుకోవడానికి పరుగెత్తుకుంటూ వెళ్ళాను. అతడి చేతులు ముద్దాడాను. అతను 'నా ముఖం మారిపోయింది చూచావా?' అన్నాడు. నేను అతని వంక చూచాను. అతని ముఖం ఎంతో మారి

పోయింది. యౌవనంతో తొణికిసలాడుతోంది. తల మీద జుట్టు లేదు. కాని అతని ముఖ లక్షణాలు పూర్తిగా మారిపోయాయి. 'మనం ఎక్కడ కలుసుకున్నప్పటికీ నిన్ను గుర్తుపట్టి ఉండేవాణ్ణే' అన్నాను నేను. అతను హఠాత్తుగా ఒక శవంలా పడుకుని మళ్ళీ బ్రతుకుతున్నట్లుగా నాకు కనిపించింది. అతను ఒక పుస్తకం చేత బట్టుకుని నన్ను తీసుకుని నా చదువుకునే గదిలోకి వెడుతున్నాడు. ఆ పుస్తకం వ్రాసింది నేనే. అతను అవునన్నట్టు తల వంచుతాడు. నేనా పుస్తకం తెరుస్తాను. ప్రతి పేజీమీద ఒక చక్కని బొమ్మ కనిపిస్తుంది. ప్రతి బొమ్మలోనూ ఆత్మ, ఆత్మ యొక్క ప్రేమికుడు, వాళ్ళ ప్రణయ కలాపాలు చిత్రించబడి ఉంటాయి. వలిపం లాంటి బట్ట కట్టుకున్న ఒక కన్య పల్చని దేహంతో ఆకాశంలోకి తేలిపోతున్నట్టు కనిపిస్తోంది. ఈ కన్యకే 'పాటలపాట' అని నాకు తెలుసు. ఈ బొమ్మలవంక చూస్తూ నేను నా కళ్ళు మరల్చుకోలేకుండా ఉంటాను. ఓ ప్రభూ! నాకు తోడ్పడు: నేనిలా విడిచిపెట్టడం నీ సంకల్పమే అయినట్టయితే, ఇది ఇలాగే జరుగుతుంది. కాని అలా కాక ఇందుకు నేనే కారకుడనై నట్టయితే, నేను యేం చేయవలసి ఉందో నాకు బోధించు: నీవు నన్ను వదిలి పెట్టినట్టయితే నేను ఈ కశ్మలంలో పడి నశించి పోతాను."

# 11

రెండు సంవత్సరాలు పూర్తిగా గ్రామంలో గడిపినప్పటికీ కూడా కౌంట్ రోస్టోవ్ వ్యవహారాలేవీ చక్కబడ లేదు.

నికోలస్ తన మాటప్రకారం ఇంకా అదే దళంలో పని చేస్తున్నాడు. అయినా ఈ దళంలో కూడా అతను పైకి వచ్చే సూచనలేమీ కనిపించడం లేదు. అతను కొద్ది ఖర్చుతోనే గడుపుకుంటున్నాడు. కాని 'అట్రెడ్‌నో'లో వారు నివసిస్తున్న పద్ధతి, మిటెంకా ఎస్టేట్ల రాబడి మొదలైన వ్యవహారాలు సరిగా లేకపోవడం; వీటివల్ల అప్పు నానాటికీ అంతు లేకుండా పెరిగిపోతోంది. వృద్ధకౌంట్‌కు ఈ చిక్కుల నుంచి తప్పించుకునే మార్గం ఒకటే కనిపించింది. తను ఏదైనా ప్రభుత్వోద్యోగాన్ని చూచుకోవడం, అంచాత మళ్ళీ కుటుంబమంతా పీటర్స్‌బర్గ్‌కు తరలి వెళ్ళింది. అక్కడికి వారంతా చేరగానే బెర్గ్‌వచ్చి వేరాను వివాహమాడతానని సూచించాడు. అందుకు వారు అంగీకరించారు కూడా.

మాస్కోలో రోస్టోవ్‌లు, సమాజంలోని పై వర్గాలలో చేర్చుకో బడ్డారు. కాని పీటర్స్‌బర్గ్‌లో వారి పరిచితులు అనేక రకాలుగా ఉండేవారు. మాస్కోలో వారి ఆతిథ్యం స్వీకరించిన అనేక మంది వారిని గ్రామీణుల క్రింద లెక్కవేస్తూ పీటర్స్

బర్గ్ వారిని తమకు తెలీనట్టుగా నటిస్తున్నారు. అయినప్పటికీ వారు, అందరినీ తమ ఇంటికి ఆహ్వానిస్తూనే వున్నారు. వారిచే విందులకు విచిత్రమయిన అతిథులు అనేక రకాలవారు చేరుతూ ఉన్నారు. కొద్దిమంది పౌరుగువారు, అంత శ్రీమంతులు కాని వారు, అట్రెడ్‌నో నుంచి వచ్చినవారు, వారి కుమార్తెలు, మార్యాఇగ్నటోవ్‌నా పెరోన్‌స్కీ అను పేరుగల రాజాంతఃపుర సఖురాలు కౌంటెస్ స్నేహితురాలు, పీటర్, పీటర్స్‌బర్గ్‌లో ఉద్యోగంచేస్తున్న ఒకజిల్లా పోష్టుమాస్టర్ కొడుకు; వీరంతా వస్తూ ఉండేవారు. ఆ ఇంటికి తరుచుగా వచ్చే పరిచితులలో బోరిస్ డ్రౌబెట్‌స్కాయ్ కూడా ఉన్నాడు. బెర్గ్ కూడా రోజంతా అక్కడే గడుపుతూ, కాబొయ్యే వరుడు పెళ్ళికుమార్తె పట్ల చూపే మర్యాదలన్నీ కౌంటెస్ వేరాపట్ల చూపుతున్నాడు. ఆస్టర్‌లిడ్జ్ సమరంలో గాయపడిన తన చేతిని గర్వంతో చూపిస్తూ ఎడమచేత్తో కత్తి పట్టుకుంటున్నాడు. అతను అనేక పర్యాయాలు ఆ కథ చెప్పడంవల్ల అతనికి రెండు సార్లు బహుమతులు కూడా ఇచ్చారు.

ఫిన్‌లెండ్‌లో యుద్ధం జరిగినప్పుడు బెర్గ్ ఒక ప్రత్యేకతను సంపాదించుకున్నాడు. ఒక సహాయ సేనాధిపతిని చంపిన ఒక తుపాకిగుండు ముక్కను తీసుకుని వెళ్ళి కర్నల్‌కు చూపించాడట. ఈ విషయాన్ని గురించి మళ్ళీ అందరితోనూ చెప్పేవాడు. దాంతో అందరూ ఒప్పుకోక తప్పక మళ్ళీ అతనికి బహుమానం ఇచ్చారు. ఈ విధంగా 1809లో ఒక రక్షకదళానికి అతను కెప్టెన్ అయ్యాడు. అతని జీతం కూడా హెచ్చింది. కొందరు అసూయపరులు ఇప్పటికీ అతన్ని ఆడిపోస్తూనే వున్నారు. అయినప్పటికీ అతను సాహసం కల సైనికుడనడంలోను; తన విధిని సక్రమంగా నిర్వర్తిస్తాడనడంలోను, పై ఆఫీసర్ల మన్ననలను సంపాదించుకొనడంలోను, ప్రవర్తన విషయంలోను, అతనికి చక్కని భవిష్యత్తు ఉన్నదనడంలోను ఏ మాత్రం సందేహం లేదు.ఇప్పటికే మంచి పదవిలో ఉన్నాడు.

నాలుగు సంవత్సరాల క్రితం ఒకనాటి సాయంత్రం మాస్కో థియేటర్‌లో బెర్గ్, వేరా రోస్టోవ్‌ను చూచాడు. తన ప్రక్కనే ఉన్న తోటి ఆఫీసర్‌కు ఆమెను చూపిస్తూ 'అదిగో! నేను పెళ్ళిచేసుకొనే పిల్ల!' అని చెప్పాడు బెర్గ్, ఇప్పుడు తన అవకాశాలన్నీ సరిగా చూచుకున్న తరువాత, తన అంతస్థు వారి అంతస్థు ఆలోచించుకున్న తరువాత అతనొక నిశ్చయానికి వచ్చాడు.

మొట్ట మొదటిలో అతను ఆమెను వివాహం చేసుకుంటానని సూచించినప్పుడు అందరికీ ఆశ్చర్యం కలిగింది. వారు దాన్ని పొగడ్తగా తీసుకోలేదు.

ఒక పేరు లేనివాని కొడుకు,పదవి లేని పెద్ద మనిషి; లిథూనియానుంచి వచ్చిన

వాడు కౌంటెస్ రోస్టోవ్ కర్రగహణాన్ని ఎలా ఆశిస్తాడు అనుకున్నారు. కాని అతనిలో ఒక ప్రత్యేక లక్షణం ఉంది. ఒక అమాయకమైన ఆత్మాశయం అది. దానివల్ల చిక్కులన్నీ తేలిపోయినాయి. తన గుణగణాల్లో తనకు గట్టి నమ్మకం ఉండడంవల్ల క్రమక్రమంగా ఆ నమ్మకమే కుటుంబానికంతా వ్యాపించి చివరకు పెళ్ళయితే చాలు అనేటంతవరకూ వచ్చారు. రోస్టోవ్‌ల సంపద చాలా వరకు తరిగి పోయింది. ఆ విషయం అతనికి తెలిసి కూడా ఉండాలి. వేరాకు ఇరవై నాలుగేండ్ల వయస్సు. చూపులకు చక్కనిది. మర్యాదగా ప్రవర్తించే పిల్ల, అయినప్పటికీ ఇంతవరకూ ఏ వరుడూ వచ్చి ఆమెను కోరినదంటూ లేదు. అందుకే ఈ సంబంధానికి తల్లిదండ్రులు ఒప్పుకున్నారు.

"చూచావా?" అంటూ బెర్గ్ తన స్నేహితునితో చెప్పడం మొదలెట్టాడు. "నేను అన్ని ఏర్పాట్లూ పూర్తి చేశాను. ఏదైనా అడ్డుపుల్ల తగిలితే మాత్రం పెళ్ళి చేసుకోను. ఇప్పుడు నేను మా నాన్నకూ. అమ్మకూ చేయవలసిందేమీ లేదు. వారికి పింఛను వచ్చే ఏర్పాటు చేశాను. నాకు వచ్చే జీతంతోను నాకుగల ప్రపంచజ్ఞానంతోను నా ప్రియురాలి కొద్ది సంపదతోను పీటర్స్‌బర్గ్‌లో నేను ఇప్పుడు హాయిగా జీవించగలను. నేను ఆమెను డబ్బు కోసం పెళ్ళాడడం లేదు. ఆ పని మంచిదికాదు. భర్తతోపాటు భార్య కూడా గృహవ్యవహారాల్లో పాలు పంచుకోవాలి. నా వైపు నుంచి నా ఉద్యోగంలో నా పదవి, ఆమె వైపు నుంచి ఆమె పుట్టిన కుటుంబం ఆమె సంబంధ బాంధవ్యాలు, కొద్దిపాటిదైనా ఆమె ఆస్థి, ఈ రెండూ విలువగలవే. వీటితో మేమిద్దరమూ హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చు. అదీకాక ఆమె చక్కనిది, మంచి గుణవంతురాలు. నన్నే ప్రేమిస్తోంది" అని మళ్ళీ కొంచెం సిగ్గుతో "నేనూ ఆమెను ప్రేమిస్తున్నాను. ఆమె చాలా మంచిది. ఆమె స్వభావానికీ ఆమె చెల్లెలు స్వభావానికీ చాలా తేడా ఉంది. ఆమె స్వభావం ఆమె చెల్లెలు స్వభావంలాగా విచిత్రమైందికాదు. ఆమె చెల్లెలు వట్టి డొల్లమనిషి. ఆ కుటుంబంలో ఎలా పుట్టిందా అనుకుంటాను. కాని నా వేరా మాత్రం అలాంటిదికాదు. ముత్యంలాంటిది. నీవే చూస్తావుగా, నీవు కూడా వస్తుంటావు కదూ?" అని చెపుతూ భోజనానికి అనబోయి కొంచెం ఆలోచించి 'టీ తీసుకోవడానికి' అన్నాడు. ఇలా అని తన ఆనందానికి చిహ్నంగా కాల్చే చుట్ట పొగను చక్కని సున్నాలాగా వదిలిపెట్టాడు.

వారు, వేరాను ఇద్దామా వద్దా అని. ఆ తొలి నిశ్చితత్వం వదిలిపెట్టిన తరువాత పెళ్ళి దగ్గరకొస్తున్న ఒక పండుగ వాతావరణం వారందరిలో కనిపించసాగింది. వారెంత దాచుకుందామని ప్రయత్నిస్తున్నప్పటికి వేరా తమ చేతుల్లోంచి దాటిపోతూ ఉందే అని ఒక సంకోచం కూడా వారిలో కనిపిస్తోంది. వృద్ధకౌంట్ డబ్బుకు చాలా ఇబ్బందిపడుతూ ఉన్నాడు. తన కూతురుకు డబ్బు ఇచ్చే విషయంలో ఒక నిర్ణయా

నికి రాలేనంత అప్పుల్లో మునిగి ఉన్నాడు. ఆయనకు ఆడపిల్లలు కలిగినప్పుడు, ప్రతి పిల్లకూ ఒక ఎస్టేటు వారి వివాహ సందర్భంలో ఇద్దామనుకున్నాడు. కాని ఇప్పుడొక గ్రామాన్ని అమ్మివేశాడు. ఇతర ఎస్టేట్లను తాకట్టు పెట్టాడు. ఆ తాకట్లుమీద పెరిగే వడ్డీ కూడా ఆ ఎస్టేట్లను అమ్మవలసినంత ఎక్కువగా పెరిగి పోయింది. అందుచేత ఇహ ఎస్టేట్లు ఇవ్వడమనే సమస్యే లేకుండా పోయింది. డబ్బు కూడా లేదు. పోతే పెళ్ళి వారం రోజులే ఉంది. ప్రధానం జరిగి నెలరోజులు కావస్తున్నా, ఇంతవరకూ బెర్గ్‌తో ఆ విషయం ప్రస్తావించనే లేదు. వేరాకు రెయిజాన్ ఎస్టేటు ఇవ్వాలా? లేక ఒక అడవి అమ్మాలా? లేక డబ్బు అప్పుతీసుకు రావాలా? ఇలా వృద్ధకౌంట్ ఆలోచిస్తుండగా ఒకనాటి ఉదయాన బెర్గ్ ఆయన గది లోకి వచ్చాడు. మర్యాదగా చిరునవ్వు నవ్వుతూ వేరా విషయంలో ఆయన ఏం నిశ్చయించుకున్నాడని ఆ మాటలూ ఈ మాటలూ మాట్లాడుతూ అడిగాడు. అతనిలా అడిగేసరికి కౌంట్ చాలా కలవరపడ్డాడు. అతనలా అడుగుతాడని ఆయనకు తెలుసు. అంచాత ఏదో తప్పుకున్నట్టుగా సమాధానం చెప్పాడు.

"అబ్బాయ్! నీకేమీ కొరత కలిగేలా చేయను. నేనుచేసే ఏర్పాట్లన్నీ నీకు పూర్తి సంతృప్తికరంగానే ఉంటాయి. మంచిది మంచిది" అంటూ ఆయన తన కాబోయే అల్లుడి భుజం తట్టాడు. అంతటితో ఆ విషయాన్ని ముగిస్తున్నట్టుగా తరువాత అక్కడ నుంచి లేచాడు.

బెర్గ్ మాత్రం ఇంకా చిరునవ్వు నవ్వుతూనే ప్రశాంతంగా తన భార్య ద్వారా తనకు వచ్చే ఆస్తి 'ఇంతా' అని తనకు ఖచ్చితంగా తెలీకపోయినట్టయితే, అందులో కొంతభాగమైనా పెళ్ళినాడు తన చేతుల్లోకి రాకపోయినట్టయితే, ఇహ తను ఈ నటనను ముగింపుచేసుకోవలసి ఉంటుందని అన్నాడు.

"భార్యకు ఏ మాత్రం ఆస్థి వస్తుందో ముందుగా తెలుసుకోకుండా ఆమెను పెళ్ళాడడం ఏ మాత్రం మంచిది కాదనుకుంటాను. మీరు నా ఉద్దేశంతో ఏకీభవిస్తారనుకుంటాను కౌంట్!" అన్నాడు బెర్గ్.

కౌంట్ తన ఉదారగుణాన్ని చూపించే ఉద్దేశంతోను, ఇహముందు ఈ చర్చ రాకుండా ఉండే ఉద్దేశంతోను, ఎనభైవేల రూబుళ్ళ బిల్లు సంతకం చేయడానికి ఒప్పుకుంటూ అప్పటికా సంభాషణ ముగింపు చేశాడు.

బెర్గ్ తన కాబొయ్యే మామగారి భుజం మీద ముద్దాడి, ముప్ఫయివేల రూబుళ్ళుకాని లేక ఇరవై వేల రూబుళ్ళుకాని ఇంటి ఏర్పాట్లకు అవసరముంటుందని చెప్పి, అదిపోగా బిల్లు అరవై వేల రూబుళ్ళు మాత్రమే అవుతుందని అన్నాడు.

"మంచిది మంచిది" అన్నాడు వృద్ధుడు, ఆతురతతో "కాని అబ్బాయ్! ఎనభైవేలతో పాటు మరో ఇరవై వేలు కూడా ఇస్తాను...నా మాట నమ్ము. తప్ప కుండా ఇస్తాను— ఇహ ఆ విషయం నీవేమీ అడగవలసిన పని లేదు" అన్నాడు.

# 12

నటాషా కిప్పుడు పదహారు సంవత్సరాలు. నాలుగు సంవత్సరాల క్రితం బోరిస్, ఆ తొలిముద్దు ఇచ్చిన తరువాత ఈనాటి వరకూ నటాషా అతనికోసం వేచి వుంది. ఇది 1809 వ సంవత్సరం. అతనిపేరు తన ముందు ఎవరైనా చెప్పినప్పుడు నటాషాకు బిడియం కలిగేది కాదు. ఆమెకు అదొక చిన్ననాటి చేష్టగా కనిపించింది అంతే. అయినప్పటికీ ఆమె తన హృదయంలో తను బాలికగా చేసిన వాగ్దానం నిజ మైన వాగ్దానం అవునా కాదా అని రహస్యంగా అచ్చరువు పడుతూ ఉండేది.

బోరిస్ సేనకు వెళ్ళినప్పటి నుంచీ అనేక పర్యాయాలు మాస్కోకు వచ్చి నప్పటికీ, ఆట్రెడ్‌నోకు దగ్గరలో ఉన్నప్పటికి ఇంతవరకూ రోస్టోవ్‌లను చూడ్డానికి రాలేదు.

"ఈ రోజుల్లో పాత స్నేహితులను మరిచిపోవడం ఒక అలవాటై పోయింది" అని అంటూ ఉండేది కౌంటెస్.

బోరిస్ తల్లి కూడా ఎప్పుడో కాని వారిని చూడ్డానికి వచ్చేది కాదు. తన కొడుకు తెలివితేటలవల్ల పైకి రావడంవల్ల ఆమెలో ఒకవిధమైన ఠీవి వచ్చింది. ఇప్పుడు రోస్టోవ్‌లు ఎప్పుడైనా పీటర్స్‌బర్గ్ వచ్చినా బోరిస్ ఏదో చూడక తప్ప దన్నట్టుగా వాళ్ళను వెళ్ళి చూస్తుండేవాడు. నటాషాతో అతని ప్రణయకలాపం అతని మనస్సులో ఒక తీయని జ్ఞాపకంగా మాత్రమే మిగిలిపోయింది. అదొక కులాసా పరిచయం మాత్రమేనని వారికి తెల్పాలని అతను కోరుకుంటూ ఉన్నాడు. కౌంటెస్ బెఝోకోవ్‌తో అతనికి దగ్గరి స్నేహం ఉండడంవల్ల సమాజంలో అతనికి పెద్ద స్థానం ఏర్పడింది. ఒక పెద్ద పదవిలో ఉన్న వ్యక్తి యొక్క నమ్మకాన్ని, రక్షణను అతను సంపాదించుకుంటున్నందువల్ల అతను త్వరత్వరగా పైకి వెళ్ళాడు. ఒక శ్రీమంతురాలైన వారసురాలిని పెళ్ళిచేసుకుంటే అతనికి పట్టిన అదృష్టం పూర్తి అయినట్టే. ఆ కల కూడా సులభంగానే ఫలిస్తుంది. అతను వచ్చినప్పుడు నటాషా, డ్రాయింగ్ రూంలో లేదు. అతను వచ్చాడని తెలియగానే సిగ్గుతో పరుగెత్తుకుని వెళ్ళింది. ఒక అమాయకమైన చిరునవ్వు ఆమె ముఖాన్ని వెలిగించింది. ఎప్పుడూ పొట్టిగా ఉన్న జాకెట్టు వేసుకుని, నల్లటికళ్ళతో చెదురుగా ఉన్న జుట్టుతో, కిలకిల నవ్వులతో ఉండే పిల్లగా ఆమెను ఎరిగిన బోరిస్ ఇప్పుడామెను వయస్సు వచ్చిన

ఒక కన్నెపడుచుగా చూచేసరికి ఆశ్చర్యపోయి, తనలో తనకు తెలీకుండానే వచ్చిన మెప్పుదలను దాచుకోలేక పోయాడు.

"నీ చిన్ననాటి అల్లరిపిల్లను గుర్తుపట్టావా?" అన్నది కౌంటెస్.

బోరిస్, నటాషా చెయ్యి ముద్దాడి తనకు తెలీకుండానే "ఎంత చక్కని పిల్లవైనావు!" అన్నాడు.

"అవును!" అని మిలమిలలాడే ఆమెకళ్ళు జవాబు చెప్పాయి

నటాషా, వారి సంభాషణలో పాల్గొనలేదు. తన చిన్ననాటి వరుని చూస్తూ కూచుంది. ఆమె తనవంక ఇలా చూస్తోందని బోరిస్‌కు తెలుసు. అతను కూడా మధ్య మధ్యలో ఆమె వంక చూస్తున్నాడు. ఆమె అతని యూనిఫారము, అతని స్టాకింగ్‌లు, అతను జుట్టు కత్తిరించుకున్న తీరు; ఇవన్నీ ఇటీవలి నాగరిక పద్ధతిలోనే ఉన్నాయని గమనించింది. అతను పడకకుర్చీలో నిటారుగా కూచుని కుడిచేత్తో, ఎడమచేతికి వేసుకున్న తెల్లని గ్లోవ్‌ను మెత్తగా రుద్దుకుంటూ ఉన్నాడు. రాజధానిలోని వినోద విలాసాలను గురించి అతనొక విధమైన నిరసనతో కూడిన దర్జాతో మాట్లాడుతున్నాడు. అక్కడ సమాజాన్ని గురించి, పరిచయస్థులను గురించి కూడా మాట్లాడుతున్నాడు. అతను రాయబారవర్గాలలో జరిగిన ఒకబాల్‌ను గురించి, మరి రెండు విందులకు తనను ఆహ్వానించడాన్ని గురించి మాట్లాడినప్పుడు కూడా నటాషా ఏమీ మాట్లాడలేదు. తరువాత ఆమె మౌనం, ఆమె తనను పరిశీలించడం అతనికి కొంచెం చిరాకు కలిగించాయి. అతను మాట్లాడుతూ మధ్య మధ్యలో ఆగి ఆమె వంక చూడసాగాడు. పదినిముషాలున్న తరవాత సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. నటాషా అతని వంకే చూస్తోంది. బోరిస్, ఆమె ఎప్పటిలాగానే అందంగా ఉన్నదని ఒప్పుకోక తప్పింది కాదు. ఆమె ఎప్పటికంటె కూడా అందంగా ఉంది, కాని ఆమెను పెళ్ళిచేసుకోవాలని మాత్రం అతను ఊహించకూడదు. ఎందుచేతనంటే ఆమెకు సంపత్తి లేకపోవడం తన భావికి ఒక అవరోధమవుతుంది. వాళ్ళ పాత పరిచయాన్ని మళ్ళీ తిరగతోడుకోవడ మనేది అసాధ్యం. అందుచేత ఇకముందు ఆమెకు దూరంగానే ఉందామని అతను నిశ్చయించుకున్నాడు. అయినప్పటికీ కొద్ది రోజుల తరువాత అతను మళ్ళీ రోస్టోవ్‌ల ఇంటికి వచ్చి రోజులో చాలా భాగం అక్కడే గడపడం మొదలెట్టాడు.

బోరిస్ అనేకసార్లు ఆమెతో ఈ విషయం చెబుదామనుకున్నాడు. చిన్ననాటి విషయాలను మరిచిపొమ్మనీ, ఏమైనప్పటికీ తాను పెళ్ళి చేసుకోననీ ఆమెకు తెలియజేద్దామనుకున్నాడు. కాని ఎన్నడూ ఆ ప్రస్తావన తీసుకుని రాగలిగేవాడు కాదు. అందుచేత తను ఆలోచించకుండా క్రిందివాలుగా జారిపోతున్నాడు. నటాషా మటుకు ఎప్పుడూ బోరిస్‌ను గురించే ఆలోచిస్తున్నట్టుగా ఉంది. తను మామూలుగా పాడే పాటలు పాడేది. తన ఆల్బమ్‌లు అతనికి చూపించేది. వాటిమీద అతనితో పద్యాలు

వ్రాయించుకునేది. గతాన్ని గురించి అతనెప్పుడూ మాట్లాడనిచ్చేది కాదు. ప్రస్తుతం ఎంత బాగుందీ మాత్రమే అతనికి తెలియనిచ్చేది. అంచాత ప్రతి సాయంత్రమూ కూడా ఒక విధమైన అనిశ్చయ స్థితిలోనే అతను ఆమెను వదిలి వెళ్ళేవాడు. ఎప్పుడూ కూడా తను చెప్పదలుచుకున్న మాట చెప్పగలిగేవాడు కాదు. ఇకముందు ఇదంతా ఎలా ముగుస్తుందో కూడా అతను ఊహించగలిగేవాడు కాదు. హెలెన్ అతను రాలేదంటూ నిందిస్తూ అతనికి రోజూ చీట్లు వ్రాసి పంపినా అతను వాటిని లెక్కచేసేవాడు కాదు. మళ్ళీ మరుసటి రోజున నటాషా దగ్గరే తయారయ్యేవాడు.

# 13

ఒకనాటి రాత్రి కౌంటెస్ జుట్టు ముడుచుకుని, డ్రెస్సింగ్ గౌను వేసుకుని, తలకు నైట్-కాప్ పెట్టుకుని, దైవ ప్రతిమల ముందు నిశ్వసిస్తూ మూలుగుతూ,గొణుక్కుంటూ కూచుంది. అప్పుడు హఠాత్తుగా తలుపు తెరుచుకుని నటాషా అక్కడికి వచ్చింది. ఆమె కాళ్ళకు చెప్పుల్లేవు. డ్రెస్సింగ్ గౌను వేసుకుంది. సుడిగాలిలా అక్కడికి దూసుకుని వచ్చింది. "ఈనాటి పడక నాకు సమాధి అయితే...' అంటూ తన కడపటి ప్రార్థన ముగిస్తున్న తల్లి తిరిగి చూచి తన ప్రార్థన ఆపు చేసింది. నటాషా సిగ్గుపడుతూ ఆమె ప్రార్థన చేసుకోవడం చూచి అక్కడే ఆగిపోయి ఏదో తప్పు చేస్తున్నప్పుడు బయట పడిపోయిన పసిపిల్ల వాడిలాగా నాలిక బయటపెట్టి అక్కడే నిల్చుంది. తన తల్లి ప్రార్థనలు ఒక ముగింపుకు రాకపోవడం చూచి మెల్లగా పిల్లి అడుగులు వేస్తూ పక్క దగ్గరికి వెళ్ళి, పక్క దుప్పట్లలో దూరి పడుకుంది. ఆ పక్క దుప్పట్లంటే కౌంటెస్‌కు ఎంతో భయం కూడా. అది చాలా ఎత్తైన పడక. ఎన్నో పరుపులు వేసి ఉన్నాయి. అనేక రకాల సైజులలో దిండ్లు అయిదు అంతస్తులుగా పేర్చి ఉన్నాయి. నటాషా పూర్తిగా పక్కలో మునిగి పోయింది. ఈకల దుప్పటి తీసి దాని క్రింద దూరి ముసుగు పెట్టుకుని మధ్య మధ్యలో తల్లి ఏం చేస్తున్నదో అని ముసుగు తీసి చూస్తోంది.కౌంటెస్ తన కడపటి ప్రార్థనలను ముగించుకుని పక్క దగ్గరికి వచ్చి నిల్చుని చిరునవ్వు నవ్వింది.

"సరే అప్పుడే పక్కలో దాక్కున్నావే!" అన్నది.

"అమ్మా!కాసేపు మాట్లాడుకోవద్దూ?"అన్నది నటాషా. 'ఒక చిన్న ముద్దు-అక్కడే, గడ్డం దగ్గర' అన్నది. తన తల్లి చుట్టూ చేతులు పెనవేసింది. కాని మెల్లగాను, మృదువుగాను ఆమెకు నొప్పి తగలకుండా పెన వేసింది.

"సరే ఇవాళ రాత్రికి నీవు చెప్పదలచుకున్నది ఏమిటమ్మాయ్?" అన్నది తల్లి, తను కూడా ఆమె ప్రక్కనే దిండ్లలో దాక్కుంటూ నటాషా బంతిలాగా అటూ ఇటూ దొర్లుతూ తల్లి దగ్గరికి వచ్చి నిటారుగా పడుకుంది.కౌంట్ క్లబ్ నుంచి

రాక పూర్వం వారు రాత్రిళ్ళ ఇలా కలుసుకోవడం, ఆమె తల్లి తీయని ముద్దు ముచ్చటల్లో ఒకటి.

"సరే, అదేమిటో చెప్పమ్మా? నీతో కూడా మాట్లాడాలను కుంటున్నాను." అన్నది తల్లి.— నటాషా తన తల్లి పెదవులకు చెయ్యి అడ్డం ఉంచింది....

"బోరిస్‌ను గురించి కదూ. నాకు తెలుసు. అందుకనే నేను నీ దగ్గరి కొచ్చాను. అమ్మా! అతను చాలా మంచివాడు. చాలా మంచివాడు కాదమ్మా?" అన్నది నటాషా.

"నటాషా! నీ కిప్పుడు పదహారేండ్లు. నీ ఈడుకు నాకు పెళ్ళయింది. అతను చాలా మంచివాడని కదూ నీ వడుగుతున్నది? అవును. చాలా మంచివాడు. నాకు నా కొడుకు ఎలాంటి వాడో అతనూ అలాంటి వాడే. కాని నీవు కోరుతున్న దేమిటి? చెప్పు నీవు దేన్ని గురించి ఆలోచిస్తున్నావు. నాకు మాత్రం ఒకటి అర్థమవుతోంది. నీ వతని మనస్సును దొంగిలించేశావు. ఇహ ఏం జరుగనున్న దో?"

కౌంటెస్, కుమార్తె వంక చూచింది. ఆ అమ్మాయి నిశ్చలంగా పడుకుని విశాలమైన ప్రక్క మూలల్లో ఉన్న ప్రతిమల వంక చూస్తోంది. ఆ చిన్నదాని ముఖం తీరు కౌంటెస్‌కు ఆశ్చర్యం కలిగించింది. నటాషా ఏదో వింటూ ఏదో ఆలోచిస్తున్నట్టుగా వుంది.

"ఇహ ఏం జరగనున్న దో?" అని మళ్ళీ అన్నది కౌంటెస్. 'అతని మనస్సు ఎందుకు ప్రుచ్చిలిస్తున్నావు? ఏం కోరి? అతన్ని నీవు పెళ్ళి చేసుకోలేవు కదా? ఆ విషయం నీకు తెలిసిందే' అన్నది.

"ఏం ఎంచాత?" అన్నది నటాషా కదలకుండా.

"అతను చిన్నవాడు. డబ్బు లేనివాడు మనకు దగ్గరి చుట్టం. నీ వతన్ని ప్రేమించడమూ లేదు."

"అలా అని ఎవరు చెప్పారు?"

"నాకు తెలుసు అది మంచి పని కాదమ్మాయ్."

"కాని నేను కోరితే?"

"వెర్రి వాగుడు వాగకు."

"కాని నేను కోరితే?"

"నా మాట విను. నేను ఊరికే చెప్పడం లేదు..."

ఆ వాక్యం పూర్తిచేసే లోగానే నటాషా బొద్దుగా ఉన్న తన తల్లి చెయ్యి పుచ్చుకుని అటూ యిటూ ముద్దాడి, ఒక్కొక్క వ్రేలే లెక్కిస్తూ, "జనవరి, ఫిబ్రవరి మార్చి, ఏప్రియల్, మే..." అంటూ వ్రేళ్ళు ముడిచి "సరేనమ్మా, అయితే ఏమం టావ్?" అన్నది.

తల్లి కూతురు వంక చూచి కన్నుల పండుగ చేసుకుంటూ మాట్లాడకుండా ఊరుకున్నది.

"నీవు చేస్తున్నది తప్పమ్మాయ్"అన్నది కొంచెం ఆగి,'పిల్లలుగా మీకున్న చనువు ఎవరికీ జ్ఞాపకం లేదు. అతను నీతో చనువుగా వుండడం వల్ల ఇతర యువకులకు నీవు విడ్డూరంగా కనిపించవచ్చు. అదీకాక అతన్ని గురించి అనవసరంగా మథనపడడం ఎందుకు?అతను ఇప్పటికే ఒక కలవారి పిల్లను ఎన్నుకొని ఉంటాడు, అతను కోరేదీ అదే. పైగా ప్రస్తుతం అతని బుర్ర అతని దగ్గర లేదు."

"ఏం? పోగొట్టుకున్నాడా?" అని అడిగింది నటాషా.

"నీకు ఇలాంటిదే ఒక విషయం చెపుతాను. అది నన్ను గురించిన విషయమే. నాకు ఒక చుట్టం ఉండేవాడు..."

"అవును. నాకు తెలుసు. సిరిల్ మాట్వీవిచ్ కదూ ? అతను చాలా ముసలాడే ?"

"ముసలాడైతే ఏం ? ఎప్పటికి ముసలాడవుతాడా ?... సరే బోరిస్‌తో మాట్లాడతా. అతనిక్కడికి ఇంత తరచుగా రాకూడదు."

"ఏం ఎంచాత రాకూడదు, అది అతనికిష్టమైనప్పుడు ?"

"దానివల్ల మంచేమీ రాదు."

"అలా అని నీవెలా చెప్పగలవు? అతనితో మాత్రం ఆ మాట చెప్పకమ్మా, నేను నిన్ను అడుగుతున్నాను' అన్నది నటాషా, తనదైన వస్తువును ఎవరో దొంగిలించుకుని పోతోంటే అందుకోసం అడిగినట్టుగా, నీకిష్టం లేకపోతే, నేనలాగే అతన్ని పెళ్ళిచేసుకోను. కాని అతని కిష్టమైనప్పుడు అతనిక్కడికి వస్తే తప్పేమిటి? నాకూ అతనిక్కడికి రావడం ఇష్టమే. మమ్మలను ఇలాగే సాగిపోనీయి" అన్నది.

"ఇలాగే అంటే ఎలాగే నా చిట్టి తల్లీ?" అని అడిగింది తల్లి.

"ఇలాగే అంటే— ఇప్పుడున్నట్లుగానే అన్నమాట నేనతన్ని పెళ్ళి చేసుకోని మాట నిజమే కదా?"... ఇహ మమ్మల్ని ఇలాగే ఉండి పోనీయి" అన్నది నటాషా.

తల్లి తెరలు తెరలుగా నవ్వసాగింది."ఇలాగే, ఇలాగే, ఇలాగే ఉండిపోనీయి" అంటూ నవ్వసాగింది.

"ఊరుకో అమ్మా, అలా నవ్వకు. ప్రక్క వణికిపోతోంది. నీవు కూడా నాలాగే నీకు కూడా నవ్వు ఇట్టే వచ్చేస్తుంది. ఒక్క నిముషం ఆగు" అంటూ నటాషా తల్లి చెయ్యి పుచ్చుకుని జ్యోతిష్యం చెప్పనారంభించింది. జూన్, జూలై, ఆగస్టు— అమ్మా! అతను చాలా ప్రేమలో ఉన్నాడు. ఇలా నిన్నెవరైనా ప్రేమించారూ? చాలా మంచివాడు, చాలా మంచివాడు, కొంచెం నా కంటికి ఆగడనుకో. మన భోజనపు గదిలో పొడుగ్గా వున్న గడియారం వుంది చూచావ్? అలా సన్నగా

పొడుగ్గా ఉంటాడు. తెలిసిందా? అలా పొడుగ్గా పల్చగా సన్నగా ఉంటాడు" అన్నది.

"ఏమిటీ వెర్రివాగుడు?"

నీ కర్థం కావడం లేదూ? నికోలస్‌కైతే బాగా అర్థమయ్యేది. బెషోృవ్‌ను చూస్తే నాకో చదరం జ్ఞాపకం వస్తుంది.అలాగే బోరిస్‌ను చూస్తే పొడుగ్గా ఉండే గడియారం జ్ఞాపకం వస్తుంది."

"నీవు అతనితో కూడా ఇలాగే ఆటలు సాగిస్తున్నావా ఏమిటి?"

"అబ్బే అదేం లేదు."

అంతలో 'చిన్న కౌంటెస్ ఇంకా నిద్రపోలేదా?' అంటూ కౌంట్ తలుపు దగ్గరికి వచ్చాడు. వెంటనే నటాషా ప్రక్క మీది నుంచి ఎగిరి గంతేసి వచ్చింది. స్లిప్పర్లు వేసుకుని ఎదురు గదిలోకి పారిపోయింది.

ఆ అమ్మాయి నిద్రబోయేసరికి చాలా పొద్దుపోయింది వందల కొలదీ ఆలోచనలు ఆమె మనస్సులోకి వస్తున్నాయి. తనకర్థమైనట్లుగా ఎవరికీ అర్థం కాదనీ...అందులో సగం కూడా అర్థం కాదనీ అనుకుంటోంది.

"సోనియా మాత్రం నన్ను అర్థం చేసుకో కలుగుతుందా ?" అనుకుని ప్రక్కనే చిన్న బంతిలాగా చుట్టముట్టుకుని పడుకున్న సోనియా వంక చూచింది.

"అబ్బే, దానికీ అర్థం కాదు. అది మహాగుణవంతురాలు. నికోలస్‌ను ప్రేమిస్తోంది. ఇహ ప్రపంచంలో దానికే విషయమూ పట్టదు. అమ్మ విషయం కూడా పట్టదు. నిజంగా చాలా చిత్రం. నేను చాలా తెలివైన దాన్ని ...అది ఎంత అందగత్తె।" అనుకున్నది తన మనస్సులో ఊహించుకుంటూ మరొక వ్యక్తిని గురించి ఆలోచిస్తూ "దానికి లేనిదంటూ లేవు. అన్నీ దానికే. అన్నీ దానికే అనుకూలం" అన్నది. ఈ అనూహ్య దేవతను గురించి ఆలోచిస్తూ 'ఎంత ఆకర్షణీయంగా ఉంటుంది। అప్సరసల్లే వుంటుంది. చక్కగా ఈత వచ్చును. ఎంత చక్కని గొంతు ఎంత చక్కని గొంతు!"

నటాషా తనకు ఎంతో ఇష్టమైన ఏవేవో కూనిరాగాలు తీసుకుంటూ పడుకుంది. తరువాత ప్రక్కమీద ఒత్తిగిలి, హాయిగా చిరునవ్వు నవ్వుతూ పరిచారిక డౌనేషాను పిలిచి దీపం ఆర్పేయమని చెప్పింది. అది గదిలోంచి వెళ్ళి వెళ్ళకముందే అప్పటికే నటాషా కలల లోకంలోకి వెళ్ళింది. అక్కడ కూడా ఇక్కడి లాగానే అంతా మృదువుగాను, ముచ్చటగాను కనిపిస్తోంది.

ఆ మరునటి రోజు కౌంటెస్, బోరిస్‌తో చాలా సేపు మాట్లాడింది. అప్పటి నుంచీ అతను ఆ ఇంటికి రావడం మానేశాడు.

# 14

**1809** డిసెంబరు 31వ తారీఖున కాథెరైన్ రాణీ కాలంనాటి ప్రసిద్ధుడైన ఒక దర్బారు పెద్ద ఒక అద్భుతమైన విందు ఇచ్చాడు. రాయబార వర్గమంతా కూడా ఆ విందుకు ఆహ్వానింపబడింది. చక్రవర్తి కూడా వస్తానని వాగ్దానం చేశాడు.

ఆ భవనం అప్పటికే దీపాలతో తళతళ లాడిపోతుంది. వాకిట్లో ఒక తెర దించారు. నగరంలో పెద్దలందరు, పోలీసువారు; అంతా అప్పటికే పేవ్‌మెంట్ మీద చేరి ఉన్నారు. బండ్ల రాకపోకలు సాగుతూ సందడిగా ఉంది. సేవకులు వస్తూ పోతూ ఉన్నారు. భవనం ముందు వచ్చి నిలిచిన గుర్రపు బగ్గీల తలుపులు తెరుస్తూ ఉన్నారు. అతిథులు దిగుతోంటే మెట్లు చప్పుడౌతున్నాయి. బంగారు లేసులతో తళ తళ లాడుతున్న దుస్తులు ధరించిన సివిల్ ఉద్యోగులు, మిలటరీ ఉద్యోగులు దిగుతూ ఉన్నారు. సిల్కు దుస్తులు వేసుకున్న స్త్రీలు కూడా దిగి మెల్లగా చప్పుడు కాకుండా ఎర్రటి పల్చని తెరదించిన నడవలోంచి నడిచి పోతున్నారు.

ఒక్కొక్క బండే వస్తోంటే, అక్కడ చేరిన వారంతా తమ హేట్లు దీసి "ఆ వస్తున్నది జారేనా ?" ...అహ, కాదు. ఎవరో ఒక మంత్రి — ఒక పరదేశపు యువరాజు—ఒక రాయబారి. చూచావా అతని తలలో ఉన్న ఈక ?" ఇలా అనుకుంటున్నారు. అప్పుడు ఇతర్లకంటె చక్కగా ముస్తాబైన ఒక వ్యక్తి ఆ వస్తున్న వారందరినీ పేరు పేరున చెపుతున్నాడు.

రావల్సిన అతిథుల్లో సగం మందికి పైగా అప్పటికే అక్కడ సమకూడారు. అప్పుడు రోస్టోవ్‌ల గృహంలో ఇంకా ముస్తాబులే పూర్తి కాలేదు. ఇంకా పట్టుబట్టల మడతలు రుస రుస లాడుతూ, ముస్తాబులు ముగింపులోనే ఉన్నాయి. ఈ విందు కోసం వాళ్ళు ఎన్నాళ్ళనుంచి ఎన్ని విధాలుగా తయారవుతున్నారో, ఎంతగా తహ తహ లాడుతున్నారో మరి ? ఇంతకూ వీరిని పిలుస్తారా ? సమయానికి వీరు ముస్తాబులు పూర్తి అవుతాయా ? అనుకున్నట్లు అన్నీ జరుగుతాయా ?

వీరితోపాటు ఆ విందుకు ఆ రోజున వృద్ధురాలైన ఒక అంతఃపుర పరిచారిక మేరియా ఇగ్నటోవ్‌నా పెరోన్‌స్కీ తోడుగా వస్తుంది. ఆమె సన్నగా, బక్క పలుచగా ఉంటుంది. ఆమె కౌంటెస్ రోస్టోవ్‌కు పాత స్నేహితురాలు. చుట్టమూ కూడా. పది గంటలకల్లా టరైడ్ భవనానికి వెళ్ళి ఆమెను తీసుకుని వెళ్ళాలని ముందుగా ఏర్పాటు చేసుకున్నారు. కాని అయిదు నిమిషాల తక్కువ పది కావస్తున్నప్పటికీ, వయసు పిల్లల ముస్తాబులింకా పూర్తి కానేలేదు.

నటాషా వెళుతున్న మొట్టమొదటి గొప్ప విందు ఇదే. అందుకని ప్రొద్దున ఎనిమిది గంటలనుంచీ ఆమె ఇల్లంతా తిరుగుతూ తొక్కిసలాడుతోంది. ఆమె కిప్పు

డొక్కటే ఉద్దేశం. తనూ, తన తల్లీ, సోనియా ఎక్కడా నలుసంత మచ్చఅయినా లేకుండా ముస్తాబు కావాలి. ఈ బాధ్యత అంతా కూడా తనదే. ఆ రోజు కౌంటెస్ ఒక చక్కటి ఎర్రని మఖమల్ దుస్తులు వేసుకోవలసి ఉన్నది. పిల్లలిద్దరూ జుట్టు చక్కగా ముడుచుకుని తెల్లని సిల్కు గౌనులు వేసుకుని వాటిమీద గులాబీలు అలంక రించుకొనవలసి ఉన్నది.

వారి ముస్తాబులో ముఖ్యమైనదంతా పూర్తయి పోయింది. ముఖాలకూ, గొంతులకూ, పౌడర్లు రాసుకుని సెంట్లు పూసుకున్నారు. చివరకు చేతులు, చెవులు కూడా వదిలి పెట్టలేదు. సిల్కు లేసులల్లిన స్టాకింగ్‌లు చిన్ని కాళ్ళకు ఒత్తుగా తొడుక్కున్నారు; తెల్లని శాటిన్ స్లిప్పర్లు వేసుకున్నారు. పరిచారిక వారి తలలు సర్దుతోంది. సోనియా ముస్తాబంతా పూర్తి చేసుకుని గదిమధ్యలో నిలుచుని రిబ్బన్‌లో గుండా గట్టిగా వ్రేళ్ళతో నొక్కుతూ పిన్ను పెట్టుకుంటోంది. నటాషా అన్నీ ఎలా జరుగుతున్నాయో పరిశీలిస్తూ అద్దం ముందు కూచుని,సన్నని భుజాలమీద డ్రెస్సింగ్ తువాలు వేసుకుని ఉంది. ఆమె ముస్తాబింకా పూర్తికానే లేదు.

"అలా కాదు సోనియా, అలా కాదు" అన్నది నటాషా. హఠాత్తుగా తల తిప్పి రెండు చేతులతోనూ తల పట్టుకుంది. పరిచారిక ఇంకా తలకట్టు సర్దడం పూర్తి కాలేదు.

"ఇలారా" అని పిలిచింది నటాషా.

సోనియా వచ్చి నటాషా దగ్గర కూచుంది. నటాషా తనకు తోచిన విధంగా ఆమెకు రిబ్బన్ పెట్టింది.

"అలా కదిలితే ఎలాగ ?" అన్నది పరిచారిక.

"అది ! అలా ఉండాలి. చూడు సోనియా అదీ !" అన్నది నటాషా.

"అంతా తయారైనారా ?" అంటూ ప్రక్క గదిలోనుంచి కౌంటెస్ అడి గింది. 'పదిగంటలు కావస్తోంది" అన్నది.

"ఒక్క నిముషంలో వస్తున్నానమ్మా. నీవు తయారైనావా ?" అని అడిగింది నటాషా.

"నేను నా టోపీ పెట్టుకోవాలి. అంతే" అన్నది కౌంటెస్.

"నేను వచ్చేదాకా ఉండు. నీకు సరిగ్గా చేతరాదు."

"కాని అప్పుడే పది గంటలై పోయిందే ?"

పదిన్నరకు వారు విందు దగ్గర ఉండాలి. ఈలోగా వెళ్ళి మేరియాను కూడా తీసుకెళ్ళాలి. నటాషా ఇంకా తయారు కానేలేదు. ఆమె జుట్టు ముడిపించు కోవడం పూర్తి కాగానే, ఆమె ఎగిరి ఒక్క గంతువేసి నిల్చుంది. సోనియా ముస్తాబును పరిశీలించడానికి ఒక్క పరుగులో వెళ్ళింది. అక్కణ్ణుంచి ప్రక్క గది

లోకి వెళ్ళి తల్లిటోపీ ఆమె తలకు పెట్టి, ఆమె నెరిసిన జుట్టును గట్టిగా ముద్దాడింది. వెంటనే తిరిగి పరుగెత్తుతూ తన పరిచారికలున్న చోటికి వచ్చింది. వారు దారాలు కొరికేస్తూ ఆమె వేసుకునే సిల్కు గౌను పొడుగు తగ్గేటట్టుగా చేస్తూ ఉన్నారు. ఇద్దరు పరిచారికలు ఆ గౌను సరిచేస్తూ అటూ ఇటూ తిరుగుతున్నారు. మరో పరిచారిక ఆ గౌనునంతా తన చేతుల్లో పట్టుకొని నిలబడి ఉంది.

"త్వరగా కానీయి మరూష్కా."

"ఏదీ ఆ అంచు ఇలా ఇవ్వండమ్మా."

"అంతా తయారైనారా ?" అంటూ కౌంట్, తలుపు దగ్గరికొచ్చాడు. "మేరియా పెరోన్స్కీ ఇప్పటికే మీ కోసం చూచి చూచి విసుగెత్తిపోయి ఉంటుంది. ఇదిగో। మీ కోసం సెంటు తెచ్చాను" అన్నాడు.

"అయిపోయిందమ్మా" అంటూ పరిచారిక ఆ పల్చని గౌనును నటాషా తల మీదిగా ఎత్తి పట్టుకుని, రెపరెపలాడే ఆ గౌను పల్చదనాన్ని చూపుతున్నట్టుగా దాన్ని ఒక్కమాటు ఉఫ్ అని ఊదింది.

"నాన్నా। నీవు మాత్రం రాకు" అన్నది నటాషా, తన తలనంతా మబ్బు తెరలాంటి ఆ ఓణీలో దాచుకుంటూ, "సోనియా ! తలుపు మూసెయ్యి" అన్నది. సోనియా తలుపు మూసింది.

ఒక క్షణం తరువాత కౌంట్ లోపలికి వచ్చాడు. ఆయన కూడా బాగా ముస్తాబైనాడు. నీలపుకోటు వేసుకుని, సెంటు, వాసిలైనూ రాచుకుని బఫూనులా తయారైనాడు.

"నాన్నా ! ఎంత చక్కగా ఉన్నావు !" అన్నది నటాషా.

"ఒక్క నిముషం ఉండండమ్మా !" అన్నది పరిచారిక ఆమె కాళ్ళ దగ్గర కూచుని గౌను ముడతలు సరిదిద్దుతూ।

సోనియా, నటాషా ఓణీవంక పరిశీలనగా చూస్తూ "నీవేమైనా చెప్పు, ఓణీ ఇంకా పొడుగ్గానే ఉంది" అన్నది.

నటాషా కొద్ది దూరం నడిచి వెళ్ళి నిలువుటద్దంలో తన పాపను చూచుకుంది. ఓణీ ఇంకా పొడుగ్గానే కనిపించింది.

"లేదమ్మా, ఒక్క పిసరు కూడా పొడుగ్గా లేదు" అన్నది మరూష్కా. ఆమె వెనకాలే తను మోకాళ్ళపై నడుస్తూ.

"అవును, పొడుగ్గానే ఉంది. మనం మరో ముడతకు పిన్ను పెడదాం" అన్నది డౌనీషా; తన చేతిరుమాలు నుంచి ఒక పిన్ను తీసి, పిన్ను పెట్టడం మొదలెట్టింది.

ఈ సమయంలో కౌంటెస్ సిగ్గుపడుతూ, మెల్లగా అడుగులు వేస్తూ గదిలోకి వచ్చింది.

"ఎంత చక్కగా ఉంది ! మీ అందరికంటె కూడా బాగుంది !" అంటూ కౌంట్, తన భార్యను ముద్దాడడానికి దర్జాగా దగ్గరికి వెళ్ళాడు. కాని పడిపోతానేమో నని భయంతో, ఆయన్ను ఒక ప్రక్కకు తొలిగించి కౌంటెస్, కన్నెపిల్లలా సిగ్గు పడింది.

"అమ్మా ! టోపీ ఇంకా కొంచెం ప్రక్కకు పెట్టుకోవాలి. నేను పిన్ను పెడతాను ఉండు" అంటూ నటాషా హఠాత్తుగా తల్లి దగ్గరికి వెళ్ళింది. ఆమె అలా వెళ్ళేటప్పుడు ఆమె ఓణీ కొద్దిగా చిరిగింది.

"అయ్యో ! ఇదేమిటి ? నా తప్పు కాదమ్మా" అన్నది మరూష్కా.

"ఫర్వాలేదు. కనిపించదులే" అన్నది డొనీషా.

"ఎంత బాగున్నారు ! నా అందకత్తెలు. నా రాణులు !" అంటూ వృద్ధ నర్సు అక్కడికి మెల్లగా వచ్చింది. "సోనియా కూడా తయారైందే ! అంతా ఎంత బాగున్నారు !" అన్నది.

చిట్టచివరకు పదింపావుకు వారంతా బయలుదేరి బండిలో వెడుతున్నారు.

వృద్ధురాలై అసహ్యంగా కనిపిస్తున్నప్పటికీ కూడా పెరోన్స్కీ కూడా ఈ ముస్తాబంతా చేసుకుంది. కాని ఆమెకు ఈ ముస్తాబు చేసుకోవడం అలవాటే కావడం వల్లఅంత తొందరపడి చేసుకోకుండా మెల్లగా ముస్తాబైంది. వయస్సు మళ్ళిన తన దేహానికి కూడా స్నానం చేయించి, పౌడరు, సెంటు రాచుకుంది. తన నర్సు కూడా తన ముస్తాబును చూచి ఎంతో పొగిడింది. తల్లీ కూతుళ్ళు రాగానే వారి ముస్తాబులు చూచి తనూ ఎంతో పొగిడింది. ఇలా ఒకరినొకరు పొగుడుకోవడం అయిపోయిన తరువాత పదకొండు గంటలకు అంతా తమ ముస్తాబులు సర్దుకుంటూ బండ్లుఎక్కి బయలుదేరారు.

## 15

ఆ రోజంతా నటాషాకు ఒక్క క్షణం కూడా తీరుబడి లేకపోయింది. తను వెళ్ళేచోట ఏం చేయాలో కూడా ఆలోచించుకో లేకపోయింది. కాని చల్లని గాలిలో అటూ ఇటూ ఊగుతున్న బండిలో ఒకమూల ఒదిగి కూచున్నప్పుడు, ఆమెకు ఆలోచించుకోడానికి కావల్సినంత తీరిక చిక్కింది. తను వెళ్ళనున్న బాల్ దృశ్యాన్ని ఊహించుకోసాగింది; ఆ గది కొవ్వొత్తులతో వెలిగిపోతోంది—సంగీతం, పూలు, నృత్యం, చక్రవర్తి పీటర్స్‌బర్గ్‌లోని యువకులంతా అక్కడే చేరతారు.

నటాషా అద్దాలలో ఆశ్చర్యంగా తన పాపను చూచుకుంది గాని, తనకూ

ఇతరులకూ ఉన్న భేదాన్ని తెలుసుకోలేక పోయింది. కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్న ఆ సమావేశంలో అంతా కలగాపులగంగా, చెదురు చెదురుగా కనిపిస్తోంది. మొదటి గదిలో ప్రవేశించిన తరువాత కంఠస్వరాలు, అతిథుల సందడి, స్వాగత వాక్యాలు, దీపాల తళతళలు; ఇవన్నీ చూచి ఆమె కళ్ళు చెదిరిపోయాయి. అరగంట నుంచీ తలుపు దగ్గర నిల్చుని, వస్తున్న అతిథులను "మీరాక మాకెంతో సంతోషం" అని స్వాగత వాక్యాలు చెపుతున్నారు ఇంటి యజమాని, యజమానురాలు. రోస్టోవ్‌లు కూడా వారి వంతు వచ్చినపుడు వారు కూడా అందరిలాగా అదే మాట విన్నారు.

తలల్లో గులాబీ పెట్టుకుని ఒకే విధంగా ముస్తాబై ఉన్న అక్కచెల్లెండ్రిద్దరూ ఒకే పర్యాయం ఒకే విధంగా తమ మర్యాదను తెలిపారు. కాని ఇంటి యజమానురాలు మాత్రం ఎక్కువసేపు తనకు తెలీకుండానే నాజూగ్గా కనిపిస్తున్న నటాషా వంక దృష్టి నిలిపి చూచింది. ఇతరుల వంక చూచి నవ్విన విధంగా కాకుండా నటాషా వంక చూచి నప్పుడు మరో విధమైన చిరునవ్వు నవ్వింది. బహుశా ఆ అమ్మాయిని చూచినప్పుడు ఆమెకు తన చిన్ననాటి దినాలు తను వెళ్ళిన తొలి విందు జ్ఞాపకం వచ్చి ఉంటాయి. ఆమె భర్తకూడా నటాషా వంక చూచి, ఆ ఇద్దరు పిల్లలలో ఆయన కుమార్తె ఎవరని కౌంట్‌ను అడిగాడు:

"చాలా ముచ్చటగా ఉంది !" అన్నాడు తన మునివ్రేళ్ళు ముద్దాడుతూ.

బాల్‌రూంలో తలుపు దగ్గర జార్ కోసం అంతా గుమికూడి ఉన్నారు. కౌంటెస్ తనుకూడా వారందరి ముందూ నిలుచుంది. ఎందరో తనను గురించి అడగడం నటాషాకు వినిపించింది. దీనివల్ల ఆమె ఉద్వేగం కొంతవరకు ఉపశమించింది. "కొందరు మాలాగే అందంగా ఉన్నారు. మరికొందరు లేరు" అనుకుంది తనలో తాను.

మేరియా పెరోన్‌స్కీ వారికి కొందరి పేర్లు చెప్పింది.

"ఆ నెరిసిన జుట్టుగల వ్యక్తి చూచావా ? అతను డచ్‌మంత్రి" అన్నది ఒక వృద్ధుణ్ణి చూపిస్తూ. ఆ వృద్ధుని చుట్టూ స్త్రీలు మూగి ఉన్నారు. అతను ఏవో కబుర్లు చెపుతోంటే వారు పగలబడి నవ్వుతున్నారు. "అదిగో ! పీటర్స్‌బర్గ్ రాణి, కౌంటెస్ బెషోక్వ్ !" అని చూపించింది. అప్పుడు పీటర్ భార్య హెలెన్ అక్కడికి వచ్చింది.

"ఎంత చక్కగా ఉంది! ఆమె ప్రక్కనే మేరియా అంటోనోవ్‌నా కూడా ఉంది. పెద్దవాళ్ళు, చిన్నవాళ్ళు కూడా ఆమెకు అభినందనలు తెల్పడానికి పరుగెత్తుకుంటూ వెడుతున్నారు. ఆమె అందగత్తె, తెలివి కలది. రాకుమారుడు ఆమెను ఎంతో ప్రేమిస్తున్నాట్ట! ఆ ఇద్దరు స్త్రీలూ అంత అందంగా లేరు కాని, హెలెన్ కంటె కూడా వారిని ఎక్కువగా గౌరవిస్తున్నారు. వారిద్దరూ ఒక లక్షాధికారి భార్య,

కూతురూను. ఆ ప్రక్కనే వస్తున్నది అనెటోవ్ కారగైన్" అంటూ మేరియా పెరోన్స్కి ఒక పొడుగాటి చక్కని యువకుని చూపించింది. అతను తలను ఠీవిగా పైకెత్తి వారిని చూడకుండానే వారి ప్రక్కనుంచి నడిచి వెడుతున్నాడు. "అతను అందంగా లేడూ? ఆ లక్షాధికారి కుమార్తెను అతను పెళ్ళాడబోతున్నాడు. మీ బంధువు ద్రౌబెట్స్కాయ్ రాకుమారి కూడా వారికి తగిన గౌరవం తెలుపుతోంది. ఆ వస్తున్నది ఫ్రెంచి రాయబారి కలైన్కోర్ట్" అన్నది మళ్ళీ ఆమె, కౌంటెస్ అడిగిన ప్రశ్నకు జవాబు చెబుతూ. "అతను రాజు కావలసినవాడు. ఈ ఫ్రెంచి వారంతా ఎంతో చనువుగా ఉంటారు. నలుగురితో ఎంతో కలయగలుపుగాను, ఆకర్షణీయంగాను నడుచుకుంటారు. అదిగో! అప్పుడే వచ్చేస్తోంది మన చక్కని మేరియా ఆంటోనోవ్నా! ఎంత నిరాడంబరంగా, ఎంత చక్కగా ముస్తాబు చేసుకున్నదో చూడు" అని చెప్పింది ఆమె.

పీటర్ ఆ గుంపులోగుండా దోవ చేసుకుంటూ వస్తూ ఉన్నాడు. నటాషా తనకు పరిచితమైన ఆ ముఖం వంక చూచింది. తను కూడా విందుకు వస్తానని పీటర్ ఆమెకు అంతకుముందే వాగ్దానం చేశాడు. అతను వారి దగ్గరికి వచ్చేలోగా మధ్యలో ఆగి తెల్లని యూనిఫారం వేసుకున్న ఒక ఆఫీసర్‌తో మాట్లాడుతూ నిల్చున్నాడు. ఆ ఆఫీసర్, పొడుగ్గా ఉన్న మరో వ్యక్తితో మాట్లాడుతున్నాడు. అంత ఎత్తు లేని ఆ ఆఫీసర్ బోల్కోన్స్కి. నటాషా అతన్ని చూడగానే గుర్తు పట్టింది. అతను పూర్వం కంటె ఎంతో ఆనందంగాను, ఆరోగ్యకరంగాను, వయస్సులో ఉన్నట్టుగాను ఆమెకు కనిపించాడు.

"అడుగోనమ్మా! మనకు తెలిసిన వ్యక్తి మరొకతను ఉన్నాడు" అంటూ నటాషా ఆంద్రూరాకుమారుని చూపించి "అతనొకమాటు ఆట్రెడ్నోలో మన ఇంట్లో పడుకున్నాడు. జ్ఞాపకం ఉందా?" అన్నది. "ఆయన్ను మీరెగుదురా ఏమిటి?" అని అడిగింది మేరియా పెరోన్స్కి. "ఆయన ఇప్పుడు చాలా ఉన్నత స్థితిలోకి పోతున్నాడు. స్పెరోన్స్కి, ఆయన పెద్ద మిత్రులు. ఆయన చూడు! స్త్రీలతో ఎలా ప్రవర్తిస్తున్నాడో! ఒక స్త్రీ మాట్లాడుతోంటే ఆయన జవాబు కూడా చెప్పడం లేదు. నాతో అలా ప్రవర్తిస్తే నేనేం చేసేదాన్నో?" అన్నది.

## 16

హఠాత్తుగా అక్కడున్న వారందరిలో ఒక సంచలనం బయలుదేరింది. అందరూ ముందుకూ వెనక్కూ వెడుతూ తోవచేయడానికే ప్రయత్నిస్తున్నారు. బ్యాండు వాయిద్యాలు మ్రోగుతుండగా జార్ చక్రవర్తి ప్రవేశించాడు. ఆయన వెనకాలే ఇంటి యజమాని, యజమానురాలు వస్తున్నారు. జార్ చక్రవర్తి ఈ

స్వాగతాల గొడవ త్వరగా వదిలించుకుందామన్నట్టుగా కుడి ఎడమ ప్రక్కలకు తిరిగి అభినందనలు అందుకుంటూ త్వరత్వరగా నడిచిపోతున్నాడు. త్వరగా ప్రక్కనున్న డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాడు. అక్కడున్న వారంతా గుంపులు కట్టుకుని తోసుకుంటూ ఆయన వెంట వెళ్ళారు. తలుపుదాకా వెళ్ళి ఆగిపోయారు. లోపల జార్ ఇంటి యజమానురాలితో మాట్లాడుతున్నాడు. ఈలోగా బయట సంగీత గాయకులు "అలెగ్జాండర్, ఎలిజబెత్! మా హృదయాలను ఎప్పటికీ ఆకర్షిస్తూనే ఉంటారు" అని ఒక గీతాన్ని ఆలాపించసాగారు. ఆందోళనతో ఉన్న ఒక పెద్దమనిషి స్త్రీలను దయచేసి వెనక్కు నిలుచోవలసిందని అర్థించాడు. కాని స్త్రీలు చాలామంది మర్యాద మన్ననలు కూడా మరిచిపోయి, బట్టలు చిరుగుతాయేమో అని కూడా లెక్క చెయ్యకుండా త్వరత్వరగా ముందుకు చోటుచేసుకుంటూ వచ్చారు. అప్పటికే జంటలు జంటలుగా వ్యక్తులు గీతానికి, అనుకూలంగా చేరుతూ ఉన్నారు.

స్థలమంతా ఖాళీ అయింది. చక్రవర్తి చిరునవ్వు నవ్వుతూ తన చేతిని ఇంటి యజమానురాలికి అందించి, అడుగులు వేస్తూ నృత్యాన్ని మొదలు చేశాడు. తరువాత ఇంటియజమాని అందకత్తె అయిన మేరియా ఆనెటోవ్నా నారియష్కైన్‌తో కలిసి తను కూడా నృత్యంలో కలిశాడు. తరువాత రాయబారులు, మంత్రులు, అంతా నృత్యంలో కలిశారు. స్త్రీలలో చాలామందికి జంటలు దొరికారు. అంచాత నృత్యం చేసేవారి వరుసలో ఉన్నారు. నటాషా తన తల్లితోను, సోనియాతోను కలిసి కొద్ది మందితోపాటు గోడప్రక్కన నిల్చుంది.ఆమె సన్నని చేతులు పని లేకుండా ప్రక్కలకు వ్రేలాడుతున్నాయి. పసరుమొగ్గల్లాగా ఉన్న ఆమె వక్షోజాలు మెల్లగా ఉబ్బి తగ్గుతూ ఉన్నాయి. ఆమె ఊపిరి బిగపట్టుకుని మిలమిల మెరుస్తూ భయంతో చలిస్తున్న కళ్ళతో నలుప్రక్కలా చూస్తోంది. అప్పుడామె కళ్ళలో ఉన్న భావం అపరిమితమైన ఆనందమూ కావచ్చు. లేక అంతులేని దు:ఖమూ కావచ్చు. జార్ కాని, మరే పెద్దలుకాని ఇప్పుడామెను ఆకర్షించడం లేదు. ఇప్పుడామె మనస్సులో ఒకటే భావం ఉంది.

"ఎవరూ నా దగ్గరికి రారా? నన్ను నృత్యం చేయమని కోరరా?నేను యిలా ఈ సాయంత్రమంతా అందరికంటె ముందుగా ఉండి నృత్యం చేయకుండా నిల్చోవలసిందేనా? వీరిలో ఎవరూ నన్ను గుర్తిస్తున్నట్టు లేరు. ఒకవేళ గుర్తిస్తున్నప్పటికీ నన్ను లెక్కచేస్తున్నట్టుగా లేరు. నావంక చూచి 'ఈ అమ్మాయివల్ల లాభం లేదు. అనవసరం ఈ అమ్మాయి వంక చూడడం!' అనుకుంటున్నట్టుగా ఉన్నారు. నేను నృత్యం చేయాలని ఎంత పడిచచ్చిపోతున్నానో, నేనెంత చక్కగా నృత్యం చేస్తానో, నాతో నృత్యం చేస్తుంటే నేను వారిని ఎంతగా సంతోషింపచేస్తానో, వీరెవరూ అర్థం చేసుకున్నట్టు లేరు" అనుకున్నదామె తనలో.

కూతురూను. ఆ ప్రక్కనే వస్తున్నది ఆనెటోవ్ కారగైన్" అంటూ మేరియా పెరోన్స్కీ ఒక పొడుగాటి చక్కని యువకుని చూపించింది. అతను తలను తీవిగా పైకెత్తి వారిని చూడకుండానే వారి ప్రక్కనుంచి నడిచి వెడుతున్నాడు. "అతను అందంగా లేడూ? ఆ లక్షాధికారి కుమార్తెను అతను పెళ్ళాడబోతున్నాడు. మీ బంధువు డ్రౌబెట్స్కాయ్ రాకుమారి కూడా వారికి తగిన గౌరవం తెలుపుతోంది. ఆ వస్తున్నది ఫ్రెంచి రాయబారి కలైన్కోర్టు" అన్నది మళ్ళీ ఆమె, కౌంటెస్ అడిగిన ప్రశ్నకు జవాబు చెబుతూ. "అతను రాజు కావలసినవాడు. ఈ ఫ్రెంచి వారంతా ఎంతో చనువుగా ఉంటారు. నలుగురితో ఎంతో కలయగలుపుగాను,ఆకర్షణీయంగాను నడుచుకుంటారు. అదిగో! అప్పుడే వచ్చేస్తోంది మన చక్కని మేరియా ఆంటోనోవ్నా! ఎంత నిరాడంబరంగా, ఎంత చక్కగా ముస్తాబు చేసుకున్నదో చూడు" అని చెప్పింది ఆమె.

పీటర్ ఆ గుంపులోగుండా దోవ చేసుకుంటూ వస్తూ ఉన్నాడు. నటాషా తనకు పరిచితమైన ఆ ముఖం వంక చూచింది. తను కూడా విందుకు వస్తానని పీటర్ ఆమెకు అంతకుముందే వాగ్దానం చేశాడు. అతను వారి దగ్గరికి వచ్చేలోగా మధ్యలో ఆగి తెల్లని యూనిఫారం వేసుకున్న ఒక ఆఫీసర్‌తో మాట్లాడుతూ నిల్చున్నాడు. ఆ ఆఫీసర్, పొడుగ్గా ఉన్న మరో వ్యక్తితో మాట్లాడుతున్నాడు. అంత ఎత్తు లేని ఆ ఆఫీసర్ బోల్కోన్స్కీ. నటాషా అతన్ని చూడగానే గుర్తు పట్టింది. అతను పూర్వం కంటె ఎంతో ఆనందంగాను, ఆరోగ్యకరంగాను, వయస్సులో ఉన్నట్టుగాను ఆమెకు కనిపించాడు.

"అడుగోనమ్మా! మనకు తెలిసిన వ్యక్తి మరొకతను ఉన్నాడు" అంటూ నటాషా ఆంద్రూరాకుమారుని చూపించి "అతనొకమాటు ఆట్రెడ్‌నోలో మన ఇంట్లో పడుకున్నాడు. జ్ఞాపకం ఉందా?" అన్నది. "ఆయన్ను మీరెగుదురా ఏమిటి?" అని అడిగింది మేరియా పెరోన్స్కీ. "ఆయన ఇప్పుడు చాలా ఉన్నత స్థితిలోకి పోతున్నాడు. స్పెరోన్స్కీ, ఆయన పెద్ద మిత్రులు. ఆయన చూడు! స్త్రీలతో ఎలా ప్రవర్తిస్తున్నాడో! ఒక స్త్రీ మాట్లాడుతోంటే ఆయన జవాబు కూడా చెప్పడం లేదు. నాతో అలా ప్రవర్తిస్తే నేనేం చేసేదాన్నో?" అన్నది.

## 16

హఠాత్తుగా అక్కడున్న వారందరిలో ఒక సంచలనం బయలుదేరింది. అందరూ ముందుకూ వెనక్కూ వెడుతూ తోవచేయడానికే ప్రయత్నిస్తున్నారు. బ్యాండు వాయిద్యాలు మ్రోగుతుండగా జార్ చక్రవర్తి ప్రవేశించాడు. ఆయన వెనకాలే ఇంటి యజమాని, యజమానురాలు వస్తున్నారు. జార్ చక్రవర్తి ఈ

స్వాగతాల గొడవ త్వరగా వదిలించుకుందామన్నట్టుగా కుడి ఎడమ ప్రక్కలకు తిరిగి అభినందనలు అందుకుంటూ త్వరత్వరగా నడిచిపోతున్నాడు. త్వరగా ప్రక్కనున్న డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాడు. అక్కడున్న వారంతా గుంపులు కట్టుకుని తోసుకుంటూ ఆయన వెంట వెళ్ళారు. తలుపుదాకా వెళ్ళి ఆగిపోయారు. లోపల జార్ ఇంటి యజమానురాలితో మాట్లాడుతున్నాడు. ఈలోగా బయట సంగీత గాయకులు "అలెగ్జాండర్, ఎలిజబెత్! మా హృదయాలను ఎప్పటికీ ఆకర్షిస్తూనే ఉంటారు" అని ఒక గీతాన్ని ఆలాపించసాగారు. ఆందోళనతో ఉన్న ఒక పెద్దమనిషి స్త్రీలను దయచేసి వెనక్కి నిలుచోవలసిందని అర్థించాడు. కాని స్త్రీలు చాలామంది మర్యాద మన్ననలు కూడా మరిచిపోయి, బట్టలు చిరుగుతాయేమో అని కూడా లెక్క చెయ్యకుండా త్వరత్వరగా ముందుకు చోటుచేసుకుంటూ వచ్చారు. అప్పటికే జంటలు జంటలుగా వ్యక్తులు గీతానికి, అనుకూలంగా చేరుతూ ఉన్నారు.

స్థలమంతా ఖాళీ అయింది. చక్రవర్తి చిరునవ్వు నవ్వుతూ తన చేతిని ఇంటి యజమానురాలికి అందించి, అడుగులు వేస్తూ నృత్యాన్ని మొదలు చేశాడు. తరువాత ఇంటియజమాని అందకత్తె అయిన మేరియా ఆనెటోవ్నా నారియష్కైన్‌తో కలిసి తను కూడా నృత్యంలో కలిశాడు. తరువాత రాయబారులు, మంత్రులు, అంతా నృత్యంలో కలిశారు. స్త్రీలలో చాలామందికి జంటలు దొరికారు. అంచాత నృత్యం చేసేవారి వరుసలో ఉన్నారు. నటాషా తన తల్లితోను, సోనియాతోను కలిసి కొద్ది మందితోపాటు గోడప్రక్కన నిల్చుంది.ఆమె సన్నని చేతులు పని లేకుండా ప్రక్కలకు వ్రేలాడుతున్నాయి. పసరుమొగ్గల్లాగా ఉన్న ఆమె వక్షోజాలు మెల్లగా ఉబ్బి తగ్గుతూ ఉన్నాయి. ఆమె ఊపిరి బిగపట్టుకుని మిలమిల మెరుస్తూ భయంతో చలిస్తున్న కళ్ళతో నలుప్రక్కలా చూస్తోంది. అప్పుడామె కళ్ళలో ఉన్న భావం అపరిమితమైన ఆనందమూ కావచ్చు. లేక అంతులేని దుఃఖమూ కావచ్చు. జార్ కాని, మరే పెద్దలుకాని ఇప్పుడామెను ఆకర్షించడం లేదు. ఇప్పుడామె మనస్సులో ఒకటే భావం ఉంది.

"ఎవరూ నా దగ్గరికి రారా? నన్ను నృత్యం చేయమని కోరరా?నేను యిలా ఈ సాయంత్రమంతా అందరికంటె ముందుగా ఉండి నృత్యం చేయకుండా నిల్చోవలసిందేనా? వీరిలో ఎవరూ నన్ను గుర్తిస్తున్నట్టు లేరు. ఒకవేళ గుర్తిస్తున్నప్పటికీ నన్ను లెక్కచేస్తున్నట్టుగా లేరు. నావంక చూచి 'ఈ అమ్మాయివల్ల లాభం లేదు. అనవసరం ఈ అమ్మాయి వంక చూడడం!' అనుకుంటున్నట్టుగా ఉన్నారు. నేను నృత్యం చేయాలని ఎంత పడిచచ్చిపోతున్నానో, నే నెంత చక్కగా నృత్యం చేస్తానో, నాతో నృత్యం చేస్తుంటే నేను వారిని ఎంతగా సంతోషింపచేస్తానో, వీరెవరూ అర్థం చేసుకున్నట్టు లేరు" అనుకున్నదామె తనలో.

అంతవరకూ సాగుతున్న గీతాలాపన ఆమెకొక విషాదగీతంలా వినిపించింది. ఆమెకు ఏడుపువచ్చేటంత పనైంది.

పెరోన్‌స్కీ కూడా వారి విషయం పట్టించుకోవడం లేదు. కౌంట్, గదిలో ఒక మూల నిల్చుని ఉన్నాడు. ఈ అపరిచితుల మధ్య వారు ఒంటిగా పడి వుండి వారి కోసం ఎవరూ లెక్క చెయ్యనట్లుగా ఉన్నారు ఆంద్రూరాకుమారుడు ఒక స్త్రీతో కలిసి వారి దాపునుంచి వెళ్ళాడు. కాని వారిని గుర్తించలేదు. ఆనెటోవ్ చిరునవ్వు నవ్వుతూ తన జంటతో మాట్లాడుతూ నటాషావంక చూచాడు కాని, ఆమె కూడా గోడలో ఒక భాగమైనట్టుగా ఆమెను పట్టించుకోలేదు. బోరిస్ రెండు పర్యాయాలు వారి ప్రక్కనుంచే వెళ్ళాడు. కాని వారిని పట్టించుకోలేదు. మరోవైపు చూస్తూ వెళ్ళాడు.

అద్భుతంగా ఉన్న ఈ బాల్‌రూంలో జరుగుతోన్న ఈ పండుగ నటాషా గర్వాన్ని చాలా నొప్పింపజేసింది. తమ విషయం ఎవరూ పట్టించుకోవటం లేదని ఆమె బాధపడుతోంది. అంచాత వేరా తమ ముస్తాబును గురించి చెపుతున్న మాటలు కూడా ఆమె వినిపించుకోవడం లేదు.

ఎలాగైతేనేం జార్ తన మూడో నృత్యవర్తులాన్ని పూర్తిచేశాడు. ప్రతి నృత్యానికి ఒక కొత్త జంటను ఎన్నుకున్నాడు. సంగీతం ఆగిపోయింది. ఆందోళనతో ఉన్న ఒక సహాయ సేనాధిపతి రోస్టోవ్‌ల దగ్గరికి పరుగెత్తుకుని వెళ్ళి, వారు గోడకు చేరగిల బడి ఉన్నా, వారిని ఇంకా వెనక్కు.... నిల్చోమని కోరాడు. మళ్ళీ మెల్లగా సంగీతం మొదలయింది. చక్రవర్తి చిరునవ్వు నవ్వుతూ ఒకమాటు స్త్రీలందరి వంకా చూచాడు. ఇంకా ఎవరూ గది మధ్యలోకి వెళ్ళలేదు. ఒక క్షణం నిశ్శబ్దం. ఎవరూ అడుగు ముందుకు వెయ్యలేదు. అక్కడ జరుగుతున్న ఉత్సవానికంతా యజమానిగా పని చేస్తున్న ఒక సహాయసేనాధిపతి కౌంటెస్ బెషోక్టోవ్ దగ్గరికి వెళ్ళి ఆమెను నృత్యానికి ఆహ్వానించాడు. ఆమె మెల్లగా తన చెయ్యి అతని భుజం మీద ఉంచింది. ఆఫీసరు తన చెయ్యి ఆమె నడుము చుట్టూ వేసి ఆమెనొక ఖాళీ స్థలంలోకి తీసుకు వెళ్ళాడు. ఇద్దరూ మెల్లగా గదిని దాటుకుంటూ గది చివరకు వెళ్ళారు. తరువాత అతను ఆమె చేతిని తీసుకుని ఆమెను చుట్టూ తిప్పడం మొదలెట్టాడు. సంగీతం హెచ్చేకొద్దీ ఆమెను బొంగరంలాగా తిప్పుతూ వున్నాడు. అందగత్తె అయిన హెలెన్ గౌను ఆ సంగీతానికి అనుకూలంగా తెరచాపలాగా తేలిపోసాగింది. నటాషా అసూయతో వారి వంక చూస్తుంది. తనను తొలి నృత్యానికి పిలవనందుకు ఎంతో నొచ్చుకుంటూ వుంది.

తెల్లని యూనిఫారము, సిల్కు స్టాకింగ్‌లు నృత్యపు చెప్పులు వేసుకున్న

ఆంద్రూ రాకుమారుడు అక్కడున్న వారికి కొంచెం ముందుగా నిల్చుని ఎంతో ఉత్సాహంతో బేరన్ ఫిరోతో ఆ మరుసటి రోజు జరుగనున్న సమావేశాన్ని గురించి ఏదో మాట్లాడుతూ ఉన్నాడు. బోల్కోన్స్కీకి, స్పెరాన్స్కీకి గల స్నేహ సంబంధాలను గురించి తెలిసిన బేరన్, ఆనాడు అందరిచేతా చర్చించబడుతున్న విషయాన్ని గురించి కొంత సమాచారాన్ని సేకరిస్తూ ఉన్నాడు. కాని ఆంద్రూ రాకుమారుడు మాత్రం అతని మాటలు అట్టే పట్టించుకోవడం లేదు. మొదట్లో జార్ వంక, తరువాత నృత్యానికి జంటలను ఏరుకుంటున్న అతిథుల వంక, అక్కడున్న పెద్దల వంక చూస్తూ ఉన్నాడు. తను ఒక నిశ్చయానికి రాలేకుండా ఉన్నాడు. అమితమైన ఆశ్చర్యంలో చక్రవర్తి దగ్గర సిగ్గుపడుతున్న పెద్దలను, పురుషులను, తమను నృత్యం చెయ్యమని ఎవరు కోరతారా అని పడిచచ్చి పోతున్న స్త్రీలను గమనిస్తూ ఉన్నాడు.

ఈ సమయంలో పీటర్ అతని దగ్గరికి వచ్చి "నీ వెప్పుడూ నృత్యం చేసేవాడివి కదా? నీవు నా చిన్ని స్నేహితురాలైన కౌంటెస్ నటాషాను నీతో నృత్యం చేయమని కోరతావా?" అని అడిగాడు.

"ఏదీ ఆమె?... క్షమించు బేరన్, మళ్ళీ మాట్లాడుకుందాం. ఇక్కడ మన డ్యూటీ డాన్సు చెయ్యడమే" అంటూ ఆంద్రూ రాకుమారుడు, పీటర్ చూపించిన చోటుకు వెళ్ళాడు.

దుఃఖంతో చలిస్తూ ఉన్న నటాషా చిన్ని ముఖం అతన్ని వెంటనే ఆకర్షించింది. అతను ఆమెను గుర్తించాడు. ఆమె భావాలను అర్థం చేసుకోగలిగాడు. ఆ నాడు వెన్నెల రాత్రి కిటికీ దగ్గర ఆమె చెప్పిన మాటలు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. తనే స్వయంగా కౌంటెస్ దగ్గరికి వెళ్ళాడు.

"నా కుమార్తెను పరిచయం చేయనివ్వండి" అన్నది కౌంటెస్ సిగ్గుపడుతూ.

ఆమె పరిచయ భాగ్యం నాకు ఇదివరకే కలిగింది. కాని నేను మాత్రం ఆమెకు జ్ఞాపకం ఉన్నానో లేదో నాకు తెలీదు" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు మర్యాదగా.

అతని మర్యాద, మన్నన నటాషాను ఎంతో ఆకర్షించాయి. నటాషాను తనతోపాటు నృత్యం చేయమని అడిగీ అడక్కముందే అతను ఆమె నడుం చుట్టూ చెయ్యివేశాడు. తనతో నృత్యం చేయమని కోరాడు. ఆమె ముఖం హఠాత్తుగా వెలుగొందింది. పసిపిల్ల చిరునవ్వులాంటి ఆనందంతో కూడిన చిరునవ్వుతో ఆమె పెదవులు విప్పారాయి. ఆ చిరునవ్వు ఆమె కళ్ళల్లోంచి కన్నీరు తుడిచివేస్తూ "నీ కోసం నేను ఎంతకాలం నుంచి వేచి ఉన్నాననుకున్నావ్? అని అంటున్నట్లుగా ఉన్నది.

నృత్యం చేసేవారిలో వారు రెండోజంట· ఆనాటి గొప్పనర్తకులలో ఒకడుగా ఆండ్రూ పరిగణింపబడేవాడు. ఆమె కూడా ఎంతో చక్కగా నృత్యం చేస్తుంది. ఆమె చిన్ని కాళ్ళు తళతళ మెరుస్తున్న ఆ నున్నని నేలమీద ఏ మాత్రం సిగ్గుతో తడబడకుండా తేలిపోసాగాయి. ఆమె సన్నని భుజాలు, కోనలు తేరివున్న చేతులు, పసిపిల్ల లాంటి ఆమె రూపం, హెలెన్ భుజాలతోను, చేతులతోను పోల్చడానికి వీల్లేదు. హెలెన్ చేతులపై, భుజాలపై ఎన్నో వేల కళ్ళు చూచిన ఛాయలు కనిపిస్తాయి. నటాషా మాత్రం అలాకాదు. నటాషా అప్పుడే విచ్చుకుంటూ ఉన్న పసిమొగ్గ. ఆమె మెడక్రిందికి ఉన్న గౌను వేసుకోవడం ఇదే తొలిసారి. అలా నగ్నంగా కనిపించడం మామూలే అని ఎవరైనా ఆమెకు గట్టిగా చెప్పకపోతే ఆమె ఎంతో సిగ్గుపడి ఉండేదే!

ఆండ్రూ రాకుమారునికి నృత్యమంటే ఎంతో ఇష్టం. అతను తనకు విసుకెత్తిస్తున్న రాజకీయ చర్చలనుంచి తప్పించుకోవడానికి, జార్ సాన్నిధ్యంలో తను పడుతున్న సంకటాన్నుంచి తప్పించుకోవటానికి, తన కంటపడిన మొదటి అందమైన ముఖం నటాషాదే కాబట్టి ఆమెను తన జంటగా ఎన్నుకున్నాడు. కాని ఆమె సన్నని నడుముచుట్టూ తన చెయ్యి వెయ్యగానే, తన దాపులో· తన కౌగిట్లో ఆమె ముందుకు వంగి తేలిపోవటం గమనించగానే, తన పెదవులకు దాపులో ఉన్న ఆమె పెదవులపై గల చిరునవ్వుకు మారుగా తను చిరునవ్వు నవ్వగానే, ఆమె అమాయకమైన సౌందర్యం తాలూకు ఆకర్షణ ఒక కొత్త పానీయపు కైపులాగా అతని తలకు ఎక్కిపోయింది. గదంతా తిరిగిన తరువాత అలుపు తీర్చుకోవడం కోసం కొద్ది నిముషాలు ఒకరినొకరు వదిలిపెట్టి ఇతరులవంక చూస్తూ ఇద్దరూ నిల్చుండిపోయారు. తనలో మళ్ళీ ప్రాణం, యౌవనం వచ్చినట్లుగా అతనికి అనిపించింది.

# 17

తరువాత బోరిస్, మరి చాలామంది నటాషాతో కలిసి నృత్యం చేశారు. నటాషా వారిలో కొందరిని సోనియాకు అందించింది. ఆ సాయంత్రమంతా ఆమె నృత్యం చేస్తూనే వుంది. రానురాను ఆమె ఎరు పెక్కిపోయింది. తన్నుతాను మరచి ఆమె నృత్యంచేస్తూనే ఉంది. తన చుట్టూ ఏం జరుగుతున్నదో కూడా ఆమె గమనించడం లేదు.

"నీతో ఉండడమే నా కిష్టం. నేను చాలా అలసిపోయాను. కాని చూడు వీళ్ళు నన్నెలా పిలుస్తున్నారో! నేను రానంటున్నా వీళ్ళు నన్నెత్తుకుని పోతున్నారు. ఈ సాయంత్రం నా కెంతో సంతోషంగా ఉంది. నీవు నన్ను అర్థం చేసుకోవూ?" అంటున్నట్టుగా ఉంది ఆ చిరునవ్వు.

ఎన్నెన్ని విషయాలు చెపుతోంది ఆ చిరునవ్వు!

నటాషా నృత్యం ముగించిన తరువాత మరో ఇద్దరు స్త్రీలను నృత్యం చేయమని కోరడానికి గది చివరకు వెళ్ళింది.

"ఆమె ముందు తన అక్కతో మాట్లాడిన తరువాత ఆ ప్రక్కనున్న స్త్రీతో మాట్లాడితే ఆమె నా భార్య అవుతుందన్నమాట! అనుకున్నాడు ఆండ్రూ రాకుమారుడు. తను ఇలా అనుకోవడం అతనికే ఆశ్చర్యం కలిగించింది. అతనలా అనుకుంటూ ఉండగానే ఆమె వెళ్ళి సోనియా ముందు నిలిచింది.

"ఏమిటీ నా బుర్రలోకి ఇలాంటి వెర్రి ఆలోచనలు వస్తూ వుంటాయి? కాని ఒక విషయం మాత్రం నిజం. ఈ అందమైన అమ్మాయికి ఒక నెలలోగా తప్పకుండా వివాహం జరిగితీరుతుంది. ఈ అమ్మాయితో పోల్చదగిన వాళ్ళు ఇక్కడెవరూ లేరు." అనుకున్నాడు ఆండ్రూ తనలో తాను. అతనలా అనుకుంటూ ఉండగానే మళ్ళీ నటాషా వచ్చి అతని ప్రక్కనే కూచుని తన గౌనునుంచి ఊడిపడుతున్న గులాబీ పువ్వును సరిచేసుకుంటూ వుంది.

నృత్యం ముగిసిన వెంటనే వృద్ధకౌంట్ వారి దగ్గరికి వచ్చి ఆండ్రూ రాకుమారుని ఒకమాటు రమ్మని కోరాడు. తన కుమార్తెను సుఖంగా ఉన్నావా అని ప్రశ్నించాడు. ఆమె సమాధానం చెప్పక ఒక చక్కని చిరునవ్వు నవ్వింది. "ఇలాంటి ప్రశ్న ఆయన ఎలా అడగ గలిగాడు?" అన్నట్లుగా ఉంది ఆ చిరునవ్వు.

"నే నెంత సుఖంగా ఉన్నాను! నా జీవితంలో ఎన్నడూ ఇంత సుఖంగా లేదు!" అన్నదామె. ఆమె సన్నని చేతులు తండ్రిని కౌగలించు కోవడం కోసం ముందుకు చాచడం ఆండ్రూ రాకుమారుడు గమనించాడు. కాని మళ్ళీ వెంటనే ఆమె చేతులు వాలిపోయాయి. నిజానికి ఆమె ఆనందం పరిపూర్ణత పొందింది. ఒక్క ఆనందం మాత్రమే మనలో మంచినీ,దయనూ కలుగచేసేటంత ఉచ్ఛస్థితిలో ఉన్నది ఆమె ఆనందం. ఎలాంటి చెడునుకాని, దుఃఖాన్ని కాని మనం నమ్మలేనంతగా ఉచ్ఛదశలో ఉన్న ఆనందం అది.

పీటర్ మాత్రం అందరిలాగా లేడు. అతని మనస్సు నొచ్చుకుంటూ ఉంది. ఈ పై వర్గాలలో అతని భార్య పరిస్థితి అతని మనస్సుకు ఏదో నొప్పి కలుగజేస్తూ ఉంది. అతను నిశ్చలంగాను, పరధ్యానంగాను కిటికీదగ్గర నిలబడి ఉన్నాడు. అతను ఎవరివంక చూడడం లేదు. నిశ్చలంగా శూన్యంలోకి చూస్తున్నాడు. నటాషా భోజనానికి వెడుతూ అతని ప్రక్కనుంచే వెళ్ళింది. అతని ముఖంలోని భావం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

అతన్ని ఓదార్చాలనుకున్నది. అతనికి తన ఆనందాన్ని అందించాలను కున్నది. "ఎంత హాయిగా ఉంది! లేదూ?" అన్నది.

"అవును. హాయిగానే ఉంది." అన్నాడు పీటర్ పరధ్యానంగా చిరునవ్వు నవ్వుతూ.

"ఈ సాయంత్రం ఎవరు మాత్రం ఎలా దిగులుగా ఉండగలరు?" అను కున్నది నటాషా. అందులోనూ అంతమంచివాడు దిగులుగా ఉండడం ఎలాసాధ్యం? అందరూ సాయంత్రం దయగాను, మంచిగాను ఉండాలనీ, అందరూ ఆనందంగా ఉంటారనీ ఆమెకు తోచింది.

# 18

ఆ మరునటి రోజు ఉదయం పోయినరాత్రి జరిగిన నృత్యం తాలూకు జ్ఞాపకాలు ఒక క్షణంపాటు ఆంద్రూ రాకుమారుని మనసులో మెరిశాయి.

"ఎంత హాయిగా ఉంది! ఎంత చక్కగా ఉందీ ఆ రోస్టోవ్‌లపిల్ల! అప్పుడే విచ్చుకుంటోన్న పసిమొగ్గలాగా ఉంది. పీటర్స్‌బర్గ్‌లోని ఇతర పిల్లలకూ, ఈ పిల్లకూ ఎంత భేదం ఉందీ!" అనుకున్నాడు.

తరువాత టీ తాగి తనపనిలో పడిపోయాడు. కాని ఏమైనా అలసటచేతనో లేక ఆలస్యంగా నిద్రపోవడం వల్లనో అతనికి సరిగ్గా సాగలేదు. ఈలోగా బిట్స్కీ అనే వ్యక్తి దగ్గరికి అతను వెళ్ళవలసి రావటం అతనికి కొంచెం హాయి అనిపించింది. అనేక కమిటీలలో ఉన్న ఈ బిట్స్కీ పీటర్స్‌బర్గ్‌లోని అన్నివర్గాలవారినీ ఆహ్వానిస్తూ వుంటాడు. పైగా స్పెరాన్స్కీపట్ల ఇతనికెంతో అభిమానం కూడా. ఆ నాటి పుకార్లన్నీ అతని నోటిమీదనే వుంటాయి. బట్టలు వేసుకోవడం దగ్గరనుంచి అన్ని విషయాల్లోనూ ఆనాడు అమలులోవున్న ఫ్యాషన్‌లను అతను అనుసరిస్తూ వుంటాడు. అందుచేత ప్రతికొత్త సిద్ధాంతానికీ అతను అనుకూలుడే అని అంతా అనుకుంటారు. అతను ఆంద్రూ రాకుమారుని గదిలోకి వచ్చీ రావడంతోటే, హేటు తీసివేసి ఆ వుదయం జరిగిన రాజసభలోని వివరాలన్నీ చెప్పడం మొదలెట్టారు. చక్రవర్తి ఇచ్చిన వుపన్యాసాన్ని గురించి చెపుతూ తను ఎంతో ఉత్సాహాన్ని పొందాడు. ఆ ఉపన్యాసం అన్నివిధాలా రాజ్యాంగానికి అనుకూలుడైన చక్రవర్తికి తగినట్టుగా వున్నదన్నాడు.

"చక్రవర్తి ప్రభుత్వానికి ముఖ్యమైనవి, పునాదుల్లాంటివి కౌన్సిలూ స్టేటూ అనీ, ప్రభుత్వం కొన్ని ఖచ్చితమైన సూత్రాలపై ఆధారపడి ఉండాలికాని తగాదారు అవకాశమిచ్చే సూత్రాలపై ఆధారపడి ఉండకూడదని అన్నాడు. ఆర్థికశాఖ పున ర్నిర్మించాలనీ, బడ్జెట్లు అందరికీ తెలియజేయాలనీ అన్నాడు" అని చెపుతూ "అవును

చక్రవర్తి అన్నమాట నిజం" అన్నాడు బిట్సికీ కళ్ళు పెద్దవి చేస్తూ "ఇది మన చరిత్రలోని ఒక కొత్త అధ్యాయం" అన్నాడు.

ఎంతో ఆతురతతో ఈ కౌన్సిల్ సమావేశం కోసం కాచుకునిఉన్న ఆండ్రూ రాకుమారుడు ఇంతా ఈ సమావేశం జరిగేసరికి అది తనకే మాత్రం ఆసక్తి కలిగించకపోవడం వల్ల ఆశ్చర్యాన్ని పొందాడు.

సమావేశంలో చక్రవర్తి ఏం మాట్లాడితేమటుకు దానివల్ల తనకూ బిట్సికీ వచ్చేదేమిటనీ, ఆయన ఏం మాట్లాడినా వారింతకంటె బాగుపడేదీ సుఖంగా ఉండేదీ ఏమీ లేదనీ వ్యంగ్యపూరితంగా బిట్సికీ సమాధానం చెప్పాడు.

ఈ ఆలోచన ఇంతవరకు అతనికి సమావేశంలో ఉన్న ఆసక్తిని చల్లార్చి వేసింది. స్పెరాన్స్కీ ఇంటికి ఆరోజు అతను విందుకు కూడా వెళ్ళాడు. దాన్ని ఒక ప్రత్యేక సమావేశంగా భావించాడతను. తను ఎంత అభిమానిస్తున్నా ఆ వ్యక్తి ఇంటికి దగ్గరి మిత్రులతో సహా వెళ్ళడం అతన్ని ఎంతో ఆకర్షించి ఉండి ఉండవలసింది. ఇంతవరకు అతను ఎన్నడూ స్పెరాన్స్కీని అతని ఇంట్లో కుటుంబ సహితంగా ఉండగా కలుసుకోలేదు. కాని ఎందుచేతనో టౌరైడ్‌తోటలకు అట్టే దూరంలో లేని స్పెరాన్స్కీ ఇంటికి వెళ్ళడం ఆరోజు అతనికి విసుగ్గా కనిపించింది. ఆండ్రూ కొంచెం ఆలస్యంగా వెళ్ళాడు. అయిదు గంటలకు అతనక్కడికి వెళ్ళేసరికి అప్పటికే అతిధులంతా అక్కడ చేరి ఉన్నారు.ఎంతో శుభ్రంగా అమర్చి ఉన్న ఆ ఇల్లు అతన్ని ఎంతో ఆకర్షించింది. స్పెరాన్స్కీ కూతురు, ఒక చిన్న పిల్ల, ఆ అమ్మాయి గవర్నెస్. ఇదే అతని కుటుంబం. వచ్చిన అతిధులు గెర్వియస్, మాగ్నెట్స్కీ, స్టోలిపైన్‌లు, హాలులో ప్రవేశించగానే అతనికి వీరి కంఠస్వరాలు, నవ్వులు వినిపించాయి. ముఖ్యంగా ఒక గొంతుక-అది స్పెరాన్స్కీ గొంతుకే. అతను మరింత పెద్దగా నవ్వడం వినిపించింది, ఆండ్రూకు అతని నవ్వు వినడం ఇదే మొదటిసారి.

వచ్చిన పెద్దలంతా కిటికీ ఎదురుగా ఒక టేబిల్ చుట్టూ కూచుని ఉన్నారు. టేబిల్‌మీద * జకౌస్కా అమర్చబడి ఉంది. స్పెరాన్స్కీ బూదిరంగు కోటు వేసుకున్నాడు. తెల్లని వెస్ట్‌కోటు, ఎత్తుగా వున్న స్టాకింగ్‌లు వేసుకున్నాడు. కులాసాగా హాయిగా నవ్వుతూ మాగ్నెట్స్కీ చెపుతున్న ఒక కథ వింటున్నాడు. ఆండ్రూ లోపలికి రాగానే అతను చెపుతున్న మాటలన్నీ వారు బిగ్గరగా నవ్విన నవ్వులో మణిగిపోయాయి. స్టోలిపైన్ జున్ను తింటూ నవ్వుతూ ఉన్నాడు. గెర్వియస్ కూడా నురుగులు తేలుతున్న ద్రాక్షరసంలాగా నవ్వుతున్నాడు.

---

* భోజనానికి ముందు వడ్డింపబడే ఒకానొక అల్పాహార పదార్థము.

"నీ రాకకు ఎంతో సంతోషిస్తున్నాం రాకుమారా!" అంటూ అతను తన తెల్లని చక్కని చెయ్యి చాచి కరస్పర్శ చేసి మాగ్నెట్‌స్కీ వంక తిరిగి "ఒక క్షణం పున ఒప్పందం జ్ఞాపకముందా? భోజనమంటే సంధి అన్నమాట. ఇక్కడ వ్యవహారాలేమీ మాట్లాడకూడదు" అని మళ్ళీ నవ్వసాగాడు.

అంద్రూరాకుమారునికి ఆశాభంగం కలిగిందనే చెప్పాలి. అతనికి ఈ ఆనందం చిరాకు కలుగజేసింది. స్పెరాన్‌స్కీ అంటే ఇతనేనా? అతని పట్ల ఇంతవరకు ఉంటూ వచ్చిన అవ్యక్తమైన ఆకర్షణ ఇంతలో మాసిపోయింది.

మళ్ళీ వారు కథలమీద కథలు చెప్పుకోవడం సాగించారు. ఒకడు కథ ముగించగానే మరొకడు కథ మొదలుపెట్టేవాడు. ఈ కథలన్నీ ఆఫీసర్లని గురించే. కథలన్నీ వారిని ఎగతాళి చేస్తూ చెప్పుకునేవే.

తన పనులు, వ్యవహారాలు ముగించుకున్న తరువాత కాస్త తేరుకోవడం కోసం స్పెరాన్‌స్కీ తన స్నేహితులతో కలిసి కాలక్షేపం చేస్తున్నాడు. అతని స్నేహితులు కూడా ఆనందిస్తూ, ఆయన్ను ఆనందపరుస్తూ ఉన్నారు. కాని అంద్రూ రాకుమారుని! మాత్రం ఈ కులాసా విసుగెత్తించింది. అతనికి ఇదంతా కపటంగా కనిపించింది. స్పెరాన్‌స్కీ నవ్వులు, మాటలు అతని కెంతో రోత పుట్టించాయి. నవ్వులు అతనికి శ్రుతికటువుగా వినిపించాయి. ఈ కులాసాలో అతనికి పాలు పంచుకోవాలనిపించలేదు. కాని తన భావాలు ఎక్కడ బయటపడిపోతాయో అనే ఉద్దేశంతో సంభాషణలో పాల్గొనడానికి ప్రయత్నించాడు. అయినప్పటికీ సాధ్యపడలేదు. ఎంత ప్రయత్నించినా అతను సరైన మాట మాట్లాడలేకపోయాడు. ప్రతి మాటకూడా వెనక్కు తంతున్న బిరడాలాగా వ్యర్థంగా మళ్ళీ తనదగ్గరికే రాసాగింది. తను చెపుతున్న మాటలో అభిరుచి తక్కువని కాదు, తప్పనీ కాదు కాని ఆ మాటలో అలాటి కులాసా సందర్భానికి తగిన అందమైన సూక్ష్మత్వం కాని, పరిమళం కాని లేకుండా పోయాయి.

భోజనం ముగిసిన వెంటనే స్పెరాన్‌స్కీ చిన్నకూతురూ, ఆమె గవర్నెస్సూ లేచారు. తండ్రి కూతుర్ని దగ్గరికి తీసుకుని లాలించసాగాడు. కాని ఈ లాలింపులు కూడా బోల్‌కోన్‌స్కీకి విడ్డూరంగా కనిపించాయి.

అతిధులు మాత్రం ఇంగ్లీషు పద్ధతిలో పోర్టువైను తాగుతూ టేబిల్ దగ్గరే కూచుని వున్నారు. అందరూ స్పెయిన్‌లో జరుగుతోన్న యుద్ధాన్ని గురించి చర్చించుకుంటున్నారు. ఆ విషయంలో నెపోలియన్ అనుసరించిన పంథా ఒప్పుకున్నారు. అంద్రూ మాత్రం అందుకు వ్యతిరేకమైన తన అభిప్రాయాన్ని వెలిబుచ్చలేకుండా ఉండలేకపోయాడు. స్పెరాన్‌స్కీ చిరునవ్వు నవ్వి ఆ విషయాన్ని మరల్చడం కోసమై ఆ సందర్భానికి ఏమాత్రం సంబంధం లేని మరో కథ చెప్పసాగాడు. తరువాత కొద్ది నిముషాలపాటు అందరూ మాట్లాడకుండా ఊరుకున్నారు.

ఈ విరామాన్ని అవకాశంగా తీసుకుని ఇంటి యజమాని మరో వైనుసీసా మూత తెరిచి ఆ సీసాను సేవకునికి అందిస్తూ "మంచి ద్రాక్షరసమనేది రోజూ దొరికేది కాదు" అన్నాడు. తరువాత అక్కడున్న వారంతా తమ సంభాషణ వదిలి పెట్టిన చోటునుంచి ప్రారంభించి ఆ ఇంటి యజమానితో కలిసి డ్రాయింగ్ రూం లోకి వెళ్ళారు. అక్కడికి వెళ్ళగానే ఒక ప్రత్యేక వ్యక్తి రెండు పెద్ద ఉత్తరాలను తీసుకువచ్చి ఆయన చేతుల్లో ఉంచాడు. ఆయన ఆ ఉత్తరాలు అందుకుని తన గది లోకి వెళ్ళాడు. ఆయన అలా తన గదిలోకి వెళ్ళాడో లేదో వారిలో ఉత్సాహం తగ్గి పోయింది, మెల్లగా మాట్లాడుకోసాగారు. కాని ఇంతలో స్పెరాన్‌స్కీ మళ్ళీ తిరిగి వచ్చాడు.

"ఏవైనా పద్యాలు చదివి వినిపించండి" అన్నాడు మాగ్నెట్‌స్కీతో. "ఇతనికి పద్యాలు చదవడంలో మంచి ప్రతిభ ఉంది" అన్నాడు ఆంద్రూరాకుమారుని వంక తిరిగి.

మాగ్నెట్‌స్కీ సరేనని లేచి నిల్చుని ఫ్రెంచిభాషలో తను వ్రాసిన కొన్ని పద్యాలు చదివాడు. వాటినిండా పీటర్స్‌బర్గులోని కొందరు పెద్దలను గురించి వ్యంగ్యాలు ఉన్నాయి. అతను పద్యాలు చదువుతోంటే మధ్య మధ్యలో వారతన్ని మెచ్చుకోసాగారు. అతడు చదవడం ముగించగానే ఆంద్రూరాకుమారుడు సెలవు తీసుకోవడం కోసం లేచాడు.

"అప్పుడే వెడుతున్నారా? ఇంత త్వరగా ఎక్కడికి పోతున్నారు?"

"ఈ సాయంకాలం నేనొక చోటికి వెళ్ళాలి" అన్నాడు ఆంద్రూ. తరువాత ఇద్దరూ మాట్లాడకుండా ఊరుకున్నారు. ఆంద్రూ అప్పుడు తను అర్థం చేసుకోలేని ఆయన కళ్ళవంక చూచాడు.

"ఈ వ్యక్తిని ఇన్నాళ్ళూ ఇంత గొప్పగా గౌరవించడం ఎంత హాస్యాస్పదం" అనుకున్నాడు తనలో తాను.

ఇంటికి రాగానే ఒక విధమైన చింతలో మునిగిపోయాడు.

# 19

ఆ మరుసటిరోజు ఆంద్రూరాకుమారుడు అనేకమంది ఇండ్లకు వెళ్లాడు. రోస్టోవ్‌ల ఇంటికి కూడా వెళ్ళాడు. బాల్‌సందర్భంలో వారితో అతనికి మళ్ళీ పరిచయం ఏర్పడింది. కాని అతనిలా మర్యాదకోసం వారిని చూడడానికి వెళ్ళినప్పటికీ, అతని ముఖ్యోద్దేశం అందగత్తె అయిన ఆ అమ్మాయిని స్వగృహంలో చూడడమే.

అతను ఇంట్లో అడుగుపెట్టగానే మొట్టమొదట అతన్ని ఆహ్వానించింది ఆమే. ముదురుగా ఉన్న నల్లని నీలపురంగు ఉదయకాలపు దుస్తులు వేసుకుని ఉంది. బాల్

ముస్తాబులోకంటె ఈ ముస్తాబులో ఆమె అతని కళ్ళకు ఎక్కువ అందంగా అగుపించింది. ఒక పాతస్నేహితుణ్ణి ఆహ్వానించినట్టు వారందరూ అతన్ని ఆహ్వానించారు. ఎంతో నిరాడంబరంగాను, మర్యాదగాను అతన్ని ఆహ్వానించారు.

"వీరెంతో మంచివారు, నటాషా వీరికొక పెన్నిధి లాంటిది. ఆ పెన్నిధిని వీరు గుర్తించలేకుండా ఉన్నారు. జీవంతోను, ఆనందంతోను పొంగిపోతున్న ఆమె ఈ కుటుంబానికంతా ఒక దీపం లాంటిది" అనుకున్నాడు ఆండ్రూ తనలో తాను.

ఇంతవరకూ అతనికి కనిపించకుండా దాగివున్న ఒక కొత్త ప్రపంచంలోని నూతన సౌఖ్యాలు, ఆనందాల అతనికి కనిపించసాగాయి. అట్రెడ్‌నోకు వెళ్ళే తోవలో తొలిగా ఈ సౌఖ్యాలు, అతని మనస్సులో తొలకరించాయి. తరువాత జలతారులా తళతళ లాడుతున్న వెన్నెలరాత్రి, తెరచిన కిటికీ దగ్గర ఈ ఆనందాలు అతన్ని పలకరించాయి. ఇంత కాలం తను ఆనందానికి దూరంగా ఉన్నందుకు తనమీద తనకే కోపం వచ్చింది. ఇప్పుడు తాను దాని దగ్గరికి వచ్చాడు. అందులో ప్రవేశించాడు. దాన్ని గుర్తించాడు. అందులో ఎన్నడూ ఎరుగని కొత్తకొత్త ఆనందాలు కనిపెట్టసాగాడు.

భోజనం పూర్తి కాగానే అతని కోరికపై నటాషా పియానో దగ్గరికి వెళ్ళి ఒక పాట పాడింది. అతను కిటికీ ప్రక్కన నిల్చుని కొందరు స్త్రీలతో మాట్లాడుతూ ఆ పాట విన్నాడు. హఠాత్తుగా మౌనం వహించాడు. అతను మాట్లాడుతోన్న వాక్యం అంతలోనే ఆగిపోయింది. అతని గొంతుకు ఏదో అడ్డుపడినట్టుగా తోచింది. కళ్ళలో నీళ్ళు నిండాయి. ఎంతో స్వచ్ఛమైన, మృదువైన కన్నీళ్ళు అవి. అతను ఈ జీవితంలో మళ్ళీ ఆ నాటి కన్నీళ్ళు రాలుస్తానని అనుకోలేదు. నటాషా వంక చూచాడు. హఠాత్తుగా ఒక ఆనందరేఖ అతనిలో తొంగిచూచింది. ఒకే మాటుగా విషాదము, ఆనందము అతన్ని ముంచెత్తాయి. తన కళ్ళలో నీళ్ళెందుకు తిరిగాయా అని ఆశ్చర్యపోయాడు.

పాట పూర్తి కాగానే నటాషా అతని దగ్గరికి వచ్చి పాట ఎలా ఉన్నదని అడిగింది. అలా అడుగుతూ తనా విధంగా అడగడం ఉచితమా కాదా అని సిగ్గుపడింది. అతను చిరునవ్వు నవ్వి ఆమె పాట, ఆమె చేసే ప్రతి పనిలాగానే అతన్ని ఎంతో ముగ్ధపరిచిందని చెప్పాడు.

ఆండ్రూ రాకుమారుడు చాలా సేపటివరకూ అక్కడే ఉన్నాడు. తరువాత ఇంటికి వెళ్ళి మామూలు ప్రకారం పడుకోవటానికి వెళ్ళాడు. కాని వెంటనే నిద్ర పట్టలేదు. పక్కమీదినుంచి లేచి దీపం వెలిగించి కాసేపు అటూ ఇటూ తిరిగాడు. తరు

వాత మళ్ళీ పడుకున్నాడు. అయినప్పటికీ అతని నిద్రలేమి అతనికే మాత్రం అలసట కలిగించనట్టుగా లేదు.

"నా స్వేచ్ఛను, నా వయస్సును నేను వినియోగించుకోవాలి. ఆనందంగా. ఉండాలంటే ఆనందంలో నమ్మకం ఉంచాలి. ఇప్పుడు నా కా నమ్మకం కలుగుతోంది మనం హాయిగాను, ఆనందంగాను జీవించాలి" అనుకున్నాడు.

# 20

ఒకనాటి ఉదయాన కర్నల్ అడాల్ఫ్ బర్గ్ మచ్చలేని చక్కని యూనిఫారంతో ముస్తాబై పీటర్‌ను చూడడం కోసం వెళ్ళాడు. మాస్కోలోను, పీటర్స్‌బర్గ్‌లోను అందరితోనూ పీటర్‌కు పరిచయమైనట్టే, ఇతనితో కూడా పీటర్‌కు పరిచయమైంది.

"ఇప్పుడే మీ భార్య కౌంటెస్ దగ్గరనుంచి వస్తున్నాను. ఆమె నా మనవి పట్టించుకునేటట్లుగా లేదు. మీరైనా నా మనవి వింటారని మీ దగ్గరికి వచ్చాను" అన్నాడతను చిరునవ్వుతో.

"ఏమిటది కర్నల్? నేను మీ మనవి వినడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు పీటర్.

"ఇప్పుడు మేం కొత్త ఇంట్లో కాపురం పెట్టాం" అని చెప్పసాగాడు బెర్గ్. "ఒక చిన్న పార్టీ ఇచ్చి నా భార్య స్నేహితులను, నా స్నేహితులను పిలుద్దామనుకున్నాం. కౌంటెస్‌ను, మిమ్మల్ని టీకి, భోజనానికి ఆహ్వానించడం కోసం వచ్చాను" అని చిరునవ్వు నవ్వి తన వాక్యాన్ని ముగించాడు.

కౌంటెస్ హెలెన్‌కు బెర్గ్ దంపతులు తనకంటె తక్కువవారనే అభిప్రాయం ఉంది. అందుచేత ఈ ఆహ్వానాన్ని ఆమె వెంటనే తిరస్కరించింది. కాని బెర్గ్ మాత్రం పీటర్‌కు తను ఇలా కొద్ది మందిని ప్రత్యేకంగా ఎందుకు ఆహ్వానిస్తున్నాడో వివరించి చెప్పాడు. ఎన్నడూ డబ్బు వృథాచెయ్యని తను ఇలా విందునిచ్చే సందర్భంలో ఎందుకు చెయ్యి జార విడుస్తున్నాడో; అన్ని వివరాలు పీటర్‌కు చెప్పాడు.

"ఇంకా సమయం మించిపోలేదు కౌంట్, ఎనిమిదికి పదినిమిషాలున్నదనగా మీరు దయచేసి రావాలి. మా జనరల్ కూడా వస్తున్నాడు. ఆయనకు నేనంటే ఎంతో ఇష్టం. పేకాట, భోజనం ఉంటాయి. మీరు తప్పక వస్తారనుకుంటాను" అన్నాడు బెర్గ్.

ఎప్పుడూ ఆలస్యంగా వెళ్ళే పీటర్ ఆ రోజు అక్కడికి అయిదు నిముషాలు ముందుగా వెళ్ళాడు.

బెర్గ్, అతని భార్య; తమ పనులన్నీ ముగించుకొని డ్రాయింగ్‌రూంలో అతిధుల కోసం కాచుకుని ఉన్నారు. బొమ్మలతో, ప్రతిమలతో, దీపాలతో డ్రాయింగ్‌రూం చక్కగా అలంకరింపబడి ఉంది. బెర్గ్ చక్కని యూనిఫారం ధరించి తన భార్య వేరా ప్రక్కన కూచుని తమకంటె పై వారితో పరిచయం ఏర్పరచుకోవడం ఎందుకు అవసరమో ఆమెకు చెపుతున్నాడు. పై వారితో పరిచయం ఏర్పరచుకోవడంవల్ల ఎన్నో లాభాలుంటాయి.

"ఈ విధంగా చేస్తే మనం వారిని ఏవైనా అడగటానికి వీలుంటుంది. నాకు మొదటి ప్రమోషన్ వచ్చినప్పటినుంచీ నే నిదే పద్ధతి అనుసరిస్తూ వచ్చాను. (బెర్గ్ ఎప్పుడూ సంవత్సరాల వారీగా లెక్కించడు, ప్రమోషన్ల వారీగా లెక్కిస్తాడు.) నా తోటివాళ్ళను చూడు. నామరూపాలు లేకుండా ఉన్నారు. నే నొక పదవిలో ఉన్నాను. ఒక చిన్న దళానికి అధిపతినయ్యాను. నిన్ను భార్యగా చేసుకొని ఒక ఇంటివాడనై నిన్ను 'భార్య' అని పిలిచే గౌరవాన్ని దక్కించుకున్నాను" అని చెప్పి బెర్గ్, వేరా చెయ్యి ముద్దాడి, మడతపడిన తివాసీ కొసను మళ్ళీ సరి చేసి "పదవి ఎలా సంపాదించాననుకున్నావ్? నా పరిచయస్థులను జాగ్రత్తగా ఎన్నుకోవడం వల్లనే.... పని కూడా జాగ్రత్తగా చేస్తాననుకో!" అన్నాడు.

ఇలా అని బెర్గ్ చిరునవ్వు నవ్వాడు. ఒక బలహీనురాలయిన స్త్రీ పైన, భార్యపైన తన ఆధిక్యతను చూపుతూ ఆ చిరునవ్వు నవ్వాడు. ఆమె ఎంత అందకత్తె అయినప్పటికీ స్త్రీలందరి లాగానే ఆమె కూడా అబలే. పురుషుని పరిపూర్ణత ఆమెకేమీ తెలీదు. ఆమె అర్థం చేసుకోలేదు. భర్త చిరునవ్వు నవ్వగానే ఆమె కూడా చిరునవ్వు నవ్వింది. ఆమె నవ్వటానికి కూడా కారణం ఇదే — ఈ భర్తపై తనకు కూడా ఆధిక్యత ఉన్నదని ఆమెకు తెలుసు. నిజానికతను కేవలం వట్టి మతిలేనివాడు, ఆత్మవంచకుడు అయినప్పటికీ, జీవితాన్ని గురించి అతని దృష్టి సరైనదీ కానప్పటికీ, అతను చాలా తెలివికలవాడినని అనుకుంటూ ఉన్నాడు. బెర్గ్ తన భార్య నడుముచుట్టూ చెయ్యి వేశాడు. తను ఎంతో డబ్బు ఖర్చుచేసి కొన్ని లేసు రుమాలు చిరిగిపోతుందేమో అన్న భయంతో ఎంతో జాగ్రత్తగా చెయ్యి వేసి సరిగ్గా ఆమె పెదవుల మధ్య తూచినట్టు ఒక చిన్న ముద్దు పెట్టుకున్నాడు.

"మనకు పిల్లలు అక్కర్లేదు కదూ? ఏమంటావ్?" అని అడిగాడు.

"అయ్యో, మనకు పిల్లలెందుకూ! నలుగురి మెప్పుదలకోసం బ్రతికితే అంతే చాలు" అన్నది వేరా.

"యుసొపోవ్ రాకుమారునికికూడా ఇలాంటిదే చిన్న భార్య ఉంది" అన్నాడు బెర్గ్, తన భార్య చేరుమాలు ముద్దుగా తాకుతూ.

కౌంట్ బెఝోకోవ్ వచ్చినట్టు తెలియచేశారు. భార్యాభర్తలు ఒకరి వంక ఒకరు ఎంతో ఆప్యాయతతో చూచుకున్నారు.

"గొప్పవారితో పరిచయం ఉండటంవల్ల వచ్చే లాభం ఇదే! సరిగా నడుచు కోవడంవల్ల వచ్చే లాభమూ ఇదే!" అనుకున్నాడు బెర్గ్.

"కాని చూడండి! నేను మిమ్మల్ని ఒకటి కోరుతున్నాను. నేను మాట్లాడుతున్నప్పుడు మాటి మాటికి మధ్యలో వచ్చి అడ్డు తగలకండి. ఎవరికి ఏది కావాలో, ఎవరితో ఎలా మాట్లాడాలో నాకు బాగా తెలుసు" అన్నది వేరా.

"కాని మేం మాట్లాడుకునే విషయాలు చాలా వుంటాయి" అన్నాడు బెర్గ్.

ఈలోగా పీటర్ లోపలికి వచ్చాడు. డ్రాయింగ్‌రూం నల్నుప్రక్కలా కలయ చూచాడు. చిన్నదైనప్పటికీ అంత చక్కగా అమర్చి ఉన్న డ్రాయింగ్ రూంలో ఏ వస్తువూ చెక్కు చెదరకుండా తను కూచోవలసినచోటు అతనికి కనిపించలేదు. బెర్గ్ మాత్రం దాన్ని చెదరగొట్టడానికి తయారుగానే ఉన్నాడు. అతను ఒక పడక కుర్చీని ముందుకూ ఒక సోఫాను వెనక్కూ లాగాడు. తమ అతిథి హాయిగా ఎక్కడయినా కూచోవచ్చునన్నట్టుగా అతనికి చోటు చూపించాడు. తమ విందు ఇంత చక్కగా మొదలయినందుకు బెర్గూ, అతని భార్య ఎంతో ముచ్చటపడ్డారు. తమ అతిథిని ఆనందింప చేయడం కోసం ఆ దంపతులిద్దరూ ఒకరితో ఒకరు పోటీలు పడ్డారు. వేరా తన తెలివితేటలన్నీ ఉపయోగించి, ఆ సందర్భంలో మాట్లాడవలసిన విషయం ఫ్రెంచి రాయబార వర్గాన్ని గురించేనని నిశ్చయించుకుని, దానికి సంబంధించిన ప్రస్తావన తీసుకుని వచ్చింది. బెర్గ్ అంతకంటె గొప్ప విషయాన్ని మాట్లాడాలని, ఆమె మాట్లాడుతూ ఉండగా మధ్యలో అడ్డు తగిలి ఆస్ట్రియా సమరాన్ని గురించి మాట్లాడడం మొదలుపెట్టాడు. ఇలా అతను తన సంభాషణకు అడ్డు తగలడం వేరాకు కోపం తెప్పించినప్పటికీ, దంపతులిద్దరూ తమ విందు ఇంత చక్కగా జరుగుతున్నందుకు ఎంతో సంతోషంతో పొంగిపోయారు. తమరిచ్చిన విందు కూడా అందరి విందులలాగానే కొవ్వొత్తి దీపాలతో, టీ టేబిల్‌తో, బెదురు బెదురు సంభాషణలతో ఎంతో ముచ్చటగా ఉంది.

తరువాత బోరిస్ వచ్చాడు. బెర్గ్ దంపతులపట్ల అతని ప్రవర్తన, వారికంటె అతను ఔన్నత్యంలో ఉన్నట్లు, వారిపట్ల అతనొక విధమైన దయ చూపుతున్నట్లు కనిపించసాగింది. తరువాత ఒక కర్నలూ అతని భార్య, ఒక జనరలూ, రోస్టోవ్‌లూ వచ్చారు. పార్టీ నిండుగా ఉంది.

# 21

వృద్ధ కౌంట్‌తోనూ, కర్నల్‌తోనూ, జనరల్‌తోనూ బోస్టన్ పేకాట ఆడడానికి పీటర్ ఆహ్వానించబడ్డాడు. అది అతని అదృష్టమనే చెప్పాలి. అతను అదృష్టవశాత్తూ నటాషా కెదురుగా కూచున్నాడు. బాల్ జరిగిన నాటి రాత్రి నుంచీ

ఆమెలో వచ్చిన మార్పు అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఆమె ఒక్కమాట కూడా మాట్లాడటంలేదు. ఎంతో నింపాదిగాను, ఏమీ పట్టనట్లుగాను కనిపిస్తుంది. "ఏమిటి ఇలా ఉంది?" అనుకున్నాడు పీటర్. ఆమె తన చెల్లెలు ప్రక్కన కూచుని తన ధ్యానం ఎక్కడో పెట్టుకుని అతని వంక చూడకుండా కూడా బోరిస్ అడుగుతోన్న మాటలకు సమాధానం చెపుతోంది. పీటర్ అయిదు ఆటలు ముగించాడో లేదో, ఎవరో వచ్చిన అడుగుల చప్పుడు, అతన్ని మర్యాదగా అహ్వానించడం అతనికి వినిపించింది. అతనికి తెలీకుండానే అతని కళ్ళు నటాషా వైపుకు మరలాయి.అతను ఆశ్చర్యపోయాడు. "ఏమిటిది ?" అనుకున్నాడు. ఆమె ముఖం పైకెత్తింది. సిగ్గు పడుతోంది. ఆమె ఎదురుగా నిల్చుని తనవైపు ఎంతో మృదువుగా చూస్తూన్న ఆండ్రూ రాకుమారునితో మాట్లాడుతూ, ఎగిసి వస్తున్న తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తనే నిగ్రహించుకోలేక ఎగరొప్పుతూ ఉంది. తన హృదయంలో ఆమె పెంపొందించుకున్న దీప్తి ఆమెలో మళ్ళీ ఇప్పుడు మార్పు తీసుకుని వచ్చింది. ఒక క్షణం క్రితం ఆమె పూర్తిగా కోల్పోయినట్టు కనిపించిన సౌందర్యం ఇప్పుడు మళ్ళీ ఆమెలోకి తిరిగి వచ్చింది. ఈమే తను బాల్‌లో చూచిన నటాషా.

బోల్‌కోన్‌స్కీ, పీటర్ దగ్గరికి వెళ్ళాడు. పీటర్‌కు అతని ముఖంలో కొత్త సౌందర్యము, సంతోషము కనిపించాయి. ఆ సాయంత్రమంతా వారిరువురినే చూస్తూ పేకాట దగ్గర కూచున్నాడు. వీరిద్దరి మధ్యా ఏదో సాగుతుందని తనలో తాను అనుకున్నాడు. వారిని చూస్తూ ఒక విధమైన ఆనందంతో తన దుఃఖాన్ని కూడా మరిచిపోయాడు. ఆరు ఆటలు ముగిసిన తరువాత "ఇక ఈ ఆట విసుకెత్తిస్తోంది" అన్నాడు జనరల్. నటాషా ఇప్పుడు సోనియాతోను బోరిస్‌తోను మాట్లాడుతోంది. వేరా ఆండ్రూ రాకుమారునితో మాట్లాడుతోంది. అతను నటాషాపట్ల చూపుతున్న శ్రద్ధను ఆమె గమనించింది. అందుచేత ప్రేమకలాపాల విషయంలోను ముఖ్యంగా తన చెల్లెలు విషయంలోను అతనికి కొన్ని సూచనలు ఇవ్వడం భావ్యంగా అనుకున్నది. అతను చాలా సూక్ష్మంగా గ్రహించగలడనే విషయం తెలిసి, తన చాకచక్యాన్నంతా అతనిపట్ల వినియోగించడానికి ప్రయత్నించింది. అతన్ని ఒక్క నిముషం కూడా విడిచిపెట్టకుండా వసపోసిన పిట్టలాగా ఏదో మాట్లాడుతూ కూచుంది. ఆండ్రూ ఆమె మాటలు వింటున్నాడు.

"నీ ఉద్దేశం ఏమిటి చెప్పు ?" అన్నది వేరా. "నీవు ఒక్క చూపులోనే ఎటువంటి విషయాన్నైనా గ్రహించగలవు. నటాషాను గురించి నీ ఉద్దేశం చెప్పు ? కొందరు స్త్రీలలాగా ఆమె ఒకమాటు ప్రేమించిన వ్యక్తిపట్ల విశ్వాసంగా ఉండాలనా నీ అభిప్రాయం ? అదే కదా నిజమైన ప్రేమంటే ? నీవేమంటావు రాకుమారా ?" అని అడుగుతోంది వేరా.

"నాకామె విషయం అట్టే తెలీదు" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు. తన కలవరాన్ని కప్పిపుచ్చుకుంటూ. "అందుచేత ఆమెను గురించి ఒక అభిప్రాయాన్ని ఎలా ఏర్పరచుకోగలను ? కాని ఒక విషయం మాత్రం చెప్పగలను. స్త్రీ ఎంత తక్కువ ఆకర్షణీయంగా ఉంటే అంత ఎక్కువగా ఒకరిపట్ల విశ్వాసం కలిగి ఉంటుంది" అన్నాడు.

"నిజమే, కాని మా రోజుల్లో ..." అని ఏదో చెప్పబోయింది వేరా. వేరా తన రోజులను గురించి మాట్లాడబోయింది. స్వభావాలు వయస్సును బట్టి మారతాయని నమ్మకం కలవారిలాగా, ఇతర్లకంటె తమ రోజుల్లోని ప్రవర్తనలలో ప్రత్యేకతల విషయం తనకు ఎక్కువ తెలిసిన దానిలాగాను మాట్లాడసాగింది. "ఈ రోజుల్లో యువతులకు ఎంతో స్వేచ్ఛ ఉన్నది. అందుచేత ఎన్నో విధాలైన ఆకర్షణలకు లోనవుతుంటారు. నటాషా కూడా ఇలాంటి ఉద్వేగాలకు ఎంతో సులభంగా లోనవు తుందని నా ఉద్దేశం" అన్నది వేరా. ఆమె మళ్ళీ నటాషా పేరు తీసుకు రావడం ఆంద్రూ రాకుమారుని కలవరపెట్టింది.

అతను లేచి వెళ్ళబోయాడు. కాని వేరా మాత్రం మరింత లలితంగా చిరునవ్వు నవ్వుతూ "ఇతర పిల్లలందరి కంటె దీన్ని ఎక్కువగా కోరుకుంటారు. కాని ఇటీవల వరకూ ఎవరూ దీని మనస్సును చూరగొనలేకపోయారు. ఈ విషయం నీకూ తెలుసు కౌంట్" అన్నది పీటర్ వైపుకు తిరిగి, మళ్ళీ "కాని మనలో మాట. అందగాడైన బోరిస్ ఆమెనెంతో ప్రేమిస్తూ వచ్చాడు. నీకవన్నీ బాగా తెలుసు కదూ రాకుమారా" అన్నది ఆంద్రూతో.

"అవును, మాకు బాగా పరిచయం ఉన్నది" అన్నాడు ఆంద్రూ.

"అయితే అతను నీతోచెప్పే ఉంటాడనుకుంటాను – కుర్రాడుగా అతను నటాషాను ప్రేమించిన విషయం" అన్నది వేరా.

"అవును. కుర్రాడుగా" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు, సిగ్గుపడుతూ.

"బంధువుల మధ్య ఇలాంటి పరిచయం ప్రేమకు దారితీస్తుందని నీకుతెలిసిన విషయమే కదా ? బంధువుల్లో చాలా ప్రమాదకరమైన మిత్రులుంటారు" అన్నది వేరా.

"అవును. నిజమే" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు.

తరువాత బంధువులపట్ల జాగ్రత్తగా ఉండమని పీటర్‌ను హెచ్చరించి అతన్ని తీసుకుని ప్రక్కకు వెళ్ళాడు ఆంద్రూ రాకుమారుడు.

"ఏమిటది ?" అని అడిగాడు పీటర్, నటాషా వంక అతను చూచిన చూపు, అతని ఉద్వేగాన్ని చూచి ఆశ్చర్యపోతూ.

"నీతో మాట్లాడాలనుకుంటున్నాను. మన గ్లోవ్‌లు చూచావూ ? నాకు ...." అంటూ ఏదో నసిగాడు ఆంద్రూ.

వణికిపోతూ శూన్యంలోకి చూస్తూ, జరిగిన విషయాలన్నీ తల్లితో చెప్పింది. అతను తన్నెలా పొగిడిందీ, పరదేశాలకు వెడతానన్నదీ, బోరిస్‌ను గురించి అతను ప్రశ్నించిందీ, ఈ వేసవి తామెక్కడ గడుపుతారని అడిగిందీ; అన్నీ చెప్పింది.

"ఎన్నడూ నాకిలా లేదు. నే నెంత భయపడ్డాననుకున్నావ్? ఏమిటిదంతా? ఈ మాటు...అది నిజమే ననుకుంటాను. అమ్మా! అప్పుడే నిద్రపోయావేం?"

"లేదమ్మాయ్. నాకు భయంగా ఉంది. నీవు వెళ్ళి నిద్రపో" అన్నది తల్లి.

"ఇప్పుడు నిద్రా! ఇప్పుడు నిద్ర ఎలా వస్తుంది? అమ్మా! నా కెప్పుడు ఇలా అనిపించలేదు" అన్నది నటాషా.

ఏదో ఆశ్చర్యము, భయము ఆమెను కలవరపెట్టసాగాయి.

తను అట్రెడ్‌నోలో మొట్టమొదటి సారిగా ఆంద్రూను చూచినప్పుడు తను అతన్ని ప్రేమించానని నటాషాకు తోచింది. తను ఎన్నడూ ఊహించుకోని ఈ ఆనందం ఆమెకు భయం కూడా కలిగించింది.

"ఇదంతా ఏమిటి? అంతా అనుకుని జరిగినట్టుగా ఉంది! అతను మొదట పీటర్స్‌బర్గ్‌కు రావడం, సరిగ్గా ఆ సమయానికే మేం ఇక్కడ ఉండడం, అతను నన్ను బాల్‌లో కలుసుకోవడం; దీన్నంతా ఏమనాలి? అప్పుడే—నా కతన్ని చూడగానే ఎంతో విచిత్రంగా తోచింది" అన్నది నటాషా.

"అతను నీతో ఏం చెప్పాడు? ఏవీ ఆ పద్యాలు? అవి నాకు చదివి వినిపించు" అన్నది తల్లి, ఆంద్రూ తన కూతురు ఆల్బమ్‌లో వ్రాసిన పద్యాలు జ్ఞాపకం తెచ్చుకుంటూ.

"అమ్మా! భార్య పోయిన వాణ్ణి పెళ్ళి చేసుకోవడం తప్పు కాదా?" అని అడిగింది నటాషా.

"ఏమిటీ వెర్రి నటాషా? భగవంతుణ్ణి ప్రార్థించుకో. పెళ్ళిళ్ళు జరగడం భగవంతుని చేతిలో ఉంది" అన్నది తల్లి.

"అమ్మా! నీవంటే నాకెంత ప్రేమ అనుకున్నావ్?" అంటూ కూతురు తల్లిని కౌగలించుకుంది.

సరిగ్గా ఆ సమయంలోనే ఆంద్రూ తను నటాషాను ప్రేమించాననీ, పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకున్నాననీ పీటర్‌తో చెపుతున్నాడు.

కౌంటెస్ హెలెన్ ఇంట్లో ఒక పెద్దపార్టీ జరుగుతోంది. ఫ్రెంచి రాయబారి కూడా అక్కడే ఉన్నాడు. రోజూ అక్కడికి వస్తున్న పరదేశపు యువరాజు కూడా అక్కడే ఉన్నాడు. ఎందరో గొప్పవారైన స్త్రీలు, పురుషులు అక్కడ చేరి ఉన్నారు. అతను వారి మధ్యలో తన ప్రభావాన్ని వెదజల్లుతూ వున్నాడు. పీటర్ ఒకమాటు గదులన్నీ తిరిగి చూచాడు. అందరూ అతని పరధ్యానాన్ని గమనించారు. బాల్

పీటర్ స్వీకరించిన మతానికి చెందినవారు తన ప్రేమకు అర్హులనుకున్న స్త్రీకి గ్లోవ్‌లు బహూకరిస్తారు.

"నాకు అహ ఏమీలేదు. ఆ, అదే, అదే!" అంటూ మళ్ళీ నసిగాడు ఆండ్రూ.

అతని కళ్ళలోకి ఏదో విచిత్రమైన కొత్త కాంతి వచ్చింది. అతను ముఖం ప్రక్కకు తిప్పుకుని తన కలవరాన్ని దాచుకోవడానికి ప్రయత్నిస్తూ, అవతలికి వెళ్ళి నటాషా ప్రక్కన కూచున్నాడు.

పీటర్ ఆమెనేదో అడిగాడు. ఆమె అతనికి జవాబు చెపుతూ సిగ్గుపడింది. కాని ఈ సమయంలో బెర్గ్ అతని దగ్గరికి వచ్చి, కర్నలూ, జనరలూ స్పానిష్ వ్యవహారాలను గురించి మాట్లాడుకుంటున్న చర్చలో పాల్గొనవలసిందని అతన్ని ఒత్తిడి చేశాడు.

బెర్గ్ ఆ రోజంతా ఎంతో సంతోషంగా ఉన్నాడు.

## 22

ఆ మరుసటి రోజు కౌంట్ ఆహ్వానంపై ఆండ్రూ రాకుమారుడు రోస్టోవ్‌ల ఇంటికి విందుకు వెళ్ళాడు. ఆ రోజంతా అక్కడే గడిపాడు. అతనెవరికోసం విందుకు వచ్చాడో తెలియని వారు వారిలో ఒక్కరూ లేరు. అతను ఆ విషయాన్ని దాచుకోవడానికి ప్రయత్నించ లేదు కూడా. నటాషా ఆనందం యొక్క అఖరు స్థాయిలో ఉంది. ఏదో ఒక గొప్ప విషయం జరుగనున్నదని ఆమె ఊహించుకుంటూ ఉంది. ఆమె ఒక్కతే కాదు; ఇంట్లో అందరూ అదే విధంగా అనుకుంటూ ఉన్నారు. ఆండ్రూ నటాషాతో మాట్లాడుతోంటే కౌంటెస్ అతనివంక గంభీరంగాను, విచారంగాను చూడసాగింది. అతను ఆమె వంక చూచినప్పుడల్లా తను ఏదో విషయం ప్రస్తానకు తీసుకు రా సాగింది. సోనియా కూడా నటాషాను ఒక్క నిముషమయిన వదిలి వెళ్ళడానికి భయపడింది. తను అక్కడుంటే వారికి అడ్డు కలుగుతుందేమో అని కూడా భయపడింది. ఒక్క క్షణం ఒంటరిగా ఆండ్రూతో ఉన్నప్పటికీ నటాషా, ముఖం పాలిపోయి ఆమె ఏదో కలవరపడింది. అతని బిడియం ఆమెను కలవరపరిచేది అతను ఆమెతో ఏదో చెప్పాలను కుంటున్నాడనీ, కానీ చెప్పలేకపోతున్నాడని ఊహించుకున్నది. అలా సాయంత్రం వరకూ ఉండి ఆండ్రూ సెలవు తీసుకుని వెళ్ళిపోయిన తరువాత, తల్లి నటాషా దగ్గరికి వచ్చి "సరే ఏమిటే అమ్మాయ్, చెప్పు?" అన్నది మెల్లగా.

"అమ్మా నన్నిప్పుడేమీ అడగకు. నేనిప్పుడేమీ చెప్పలేను" అన్నది నటాషా.

కాని ఆ రాత్రి మాత్రం నటాషా చాలా సేపు తన తల్లి పక్కలోనే పడుకుంది.

జరిగినప్పటినుంచీ, చక్రవర్తి సలహాదారుల్లో ఒకడుగా తను నియమింపబడి నప్పటి నుంచీ, పరదేశపు యువరాజు రోజూవచ్చి కౌంటెస్‌ను చూస్తూ ఉన్నప్పటి నుంచీ, అతనికెంతో మనోవ్యధగా వుంది. ఆ వ్యథ నుంచి ఒక్క క్షణం కూడా అతను విముక్తి పొందలేదు.

ఆ సాయంత్రం తన భార్య గదిలోనుంచి వెళ్ళిన తరువాత—పదకొండు పన్నెండు గంటల మధ్య తనగదిలోకి వెళ్ళి కూచున్నాడు. గదంతా పొగాకు వాసన వేస్తోంది. మాసిపోయిన డ్రెస్సింగ్ గౌను వేసుకుని, కూచుని వ్రాసుకుంటున్నాడు. అప్పుడు ఆంద్రూ అక్కడికి వచ్చాడు.

"ఓ! నీవా?" అన్నాడు పీటర్, అవ్యక్తంగా. "నేను పనిలో ఉన్నాను. చూస్తున్నావు కదా? అన్నాడు, ఏదో ఒక పనిలో పడి తన దుఃఖాన్ని మరిచిపోవ డానికి యత్నించే వ్యక్తిలాగా.

ఆంద్రూ రాకుమారుడు ఎంతో ఆనందంతోను, ఉత్సాహంతోను ఉండడం వల్ల తన స్నేహితుని విచారాన్ని గమనించ లేదు. హాయిగా చిరునవ్వు నవ్వుతూ అతని ముందు నిల్చున్నాడు.

"అబ్బాయ్! నా మాట విను. నిన్నటి నుంచీ నీతో మాట్లాడాలను కుంటు న్నాను. ఇవాళే నా మనసు నిశ్చయం చేసుకున్నాను. అందుకనే ఇక్కడికి వచ్చాను. నేను ప్రేమిస్తున్నానబ్బాయ్!" అన్నాడు ఆంద్రూ.

పీటర్ బరువుగా నిశ్వసించి ఆంద్రూ రాకుమారుడు కూచున్న సోఫాలో అతని ప్రక్కనే కూలబడి పోయాడు.

"నటాషా రోస్టోవ్‌ను కదూ నీవు ప్రేమిస్తున్నది?" అని అడిగాడు పీటర్.

"అవును. మరెవర్ని ప్రేమిస్తాను? నేనే నమ్మలేకపోయాను. కాని ఈ ఉద్వేగం నన్ను పూర్తిగా ఆకట్టుకుంది. నిన్నమటుకు నిన్న నేనెంతో మనోవ్యథ చెందాను. కాని ఆ మనోవ్యథలోనే నాకు ఆనందం కనిపించింది. ఇంతవరకూ నేనెన్నడూ జీవించలేదు! ఇప్పుడు జీవిస్తున్నాను! నాకామె కావాలి! నన్నామె ప్రేమి స్తుందా? నేను పెద్దవాడనై పోయాను. అలా మాట్లాడకుండా కూచుంటావేం? చెప్పు?" అన్నాడు ఆంద్రూ.

"నన్నేం చెప్పమంటావ్?" అన్నాడు పీటర్. అక్కణ్ణుంచి లేచి గదిలో అటూ ఇటూ తిరుగుతూ, "ఆ అమ్మాయి ముత్యంలాంటిది, అబ్బాయ్ నా మాట విను. ఇహ నీవు ఏ మాత్రం ఆలోచించవలసిన పని లేదు. ఎంత త్వరలో వీలైతే అంత త్వరలో ఆమెను పెళ్ళిచేసుకో. నీకంటె అదృష్టశాలి, సుఖజీవి ఈ లోకంలో ఎవడూ ఉండడు! ఏ మాత్రం సందేహం లేదు" అన్నాడు.

"మరి ఆమె మాట?"

"ఆమె కూడా నిన్ను ప్రేమిస్తోంది."

"పరాచకం ఆడకు" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు చిరునవ్వు నవ్వుతూ.

"నాకు తెలుసు." అన్నాడు పీటర్.

"నామాట విను. ఇప్పుడు నా మనస్సు ఎలా ఉందో నీవు తెలుసుకో లేకుండా ఉన్నావు. నా హృదయాన్ని విప్పి చెపుతాను విను. నా హృదయం నిండుగా వుంది." అన్నాడు ఆంద్రూ.

"చెప్పు. నిజంగా నేనెంతో సంతోషిస్తున్నాను." అన్నాడు పీటర్.

అతని ముఖకవళికలన్నీ మారిపోయాయి. అతని ముఖంలోని విచారం పోయి ఆనందం కనిపించసాగింది. ఆంద్రూ రాకుమారుడు ఇలా మారిపోవడం చూచే సరికి అతనికెంతో సంతోషం కలిగింది. అతని నిరాశ, జీవితంపట్ల అతని నిరసన, విఫలమైపోయిన అతని కలలు, ఇవన్నీ ఇప్పుడేమైనాయి? ఆంద్రూ రాకుమారుడు తన హృదయాన్నంతా విప్పి చెప్పేది ఒక్క పీటర్‌కే. ఒక్కడి పైననే అతనికి విశ్వాసముంది. పీటర్‌కు అన్ని విషయాలూ చెప్పాడు. తన భావిజీవితాన్ని గురించిన పథకాలు, తన తండ్రి కోసం తన జీవితమంతా త్యాగం చెయ్యడం కోసం తను సిద్ధంగా లేకపోవడం, నటాషా పట్ల తన ప్రీతి, తన వివాహము. తన తండ్రి ఒప్పుకోని పక్షంలో ఆయన ఒప్పుదల లేకుండానే తను వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకోవడం; ఈ విషయాలన్నీ చెప్పాడు. ఒక తుపానులా తనను ముంచెత్తుతూ ఉన్న ఈ అనుభవాన్నంతా ఒకేమారు చెప్పకుండా ఉండలేక పోయాడు.

"కొద్ది రోజులక్రితం నేనిలా ప్రేమించ గలుగుదునని నాకెవరైనా చెప్పి ఉన్నట్లయితే నేను నవ్వి ఉండేవాణ్ణి. ఇలా జరుగుతుందని నేననుకోలేదు. నాకిప్పుడు రెండే ప్రపంచాలు కనిపిస్తున్నాయి. ఒకటి ఆమెతో నిండిన ప్రపంచం—అక్కడ ఆనందం, వెలుగు, ఆశ ఉన్నాయి. రెండోది ఆమెలేని ప్రపంచం—అక్కడ నిరాశ, చీకటి నిండి ఉన్నాయి." అన్నాడు ఆంద్రూ.

"అవును. నాకు తెలుసు." అన్నాడు పీటర్.

"వెలుగును నేను ప్రేమించలేకుండా ఉండలేను. అది నాకు సాధ్యం కాదు. తెలిసిందా? నేనెంతో సుఖంగా ఉన్నాను. నీవూ సుఖంగానే ఉన్నావనుకుంటాను." అన్నాడు ఆంద్రూ.

తన స్నేహితుని భవిష్యత్తు ఉజ్వలంగా కనిపించే కొద్దీ పీటర్‌కు తన భవిష్యత్తు నిరాశతో నిండి కనిపించ సాగింది.

# 23

తను తన తండ్రి ఒప్పందం లేకుండా వివాహం చేసుకోవడానికి వీల్లేదు కాబట్టి ఆండ్రూ రాకుమారుడు తన తండ్రిని చూడడం కోసం ఆ మరుసటిరోజే తన గ్రామానికి బయలుదేరి వెళ్ళాడు.

వృద్ధ రాకుమారుడు చెప్పిన మాటలు బయటికి మాత్రం ఏ మాత్రం చలించకుండా విన్నాడు. కాని లోపల మాత్రం కోపంతో కాగిపోతూనే ఉన్నాడు.

కాని ఇలాటి సమయాల్లో తాను సహజంగా చూపే చాక చక్యమంతా చూపించి ఆయన తన కుమారునితో ఈ విషయాన్ని ఎంతో నింపాదిగా చర్చించాడు. మొదటి విషయం-కుటుంబ విషయంలో కాని,సంపద విషయంలోకాని, అంతస్థు విషయంలో కాని, అతను ఎన్నుకున్న సంబంధం ఏ మాత్రం తగింది కాదు. రెండోవిషయం-ఆండ్రూకు తొలి వయస్సు గడిచిపోయింది. అంచాత ఆరోగ్యం సున్నితమైంది. ఆ విషయంలో శ్రద్ధ తీసుకోవాలి. (ఈ విషయం ప్రత్యేకంగా చెప్పాడు వృద్ధుడు) పైగా పిల్ల చిన్నది. ఇహ మూడో విషయం-అతనికొక కొడుకు ఉన్నాడు. ఆ పిల్లవాణ్ణి చిన్నపిల్ల అయిన ఈ సవతి చేతుల్లో వదిలి పెట్టడం ఏ మాత్రం మంచిది కాదు. పోతే నాలుగో విషయం:- వ్యంగ్య పూరితంగా నవ్వుతూ తన కొడుకు వంక చూచి.

"ఇది నాలుగో విషయం. నిన్నొక విషయం అడుగుతున్నాను. ఒక సంవత్సరం వరకూ ఈ వివాహ విషయాన్ని అవతల ఉంచు. విదేశాలకు వెళ్లు. ఆరోగ్యం బాగుచేసుకుని రా. నికావే రాకుమారుని కోసం ఒక జర్మన్ ట్యూటర్‌ను తీసుకుని రా. ఒక సంవత్సరం తరువాత—నీవంటూ ఉన్న ఈ ఉద్వేగం, ఈ ప్రేమ, ఈ పట్టు, ఇవన్నీ ఇలాగే ఉండే పక్షంలో అప్పుడు వివాహం చేసుకో,ఇదే నే చెప్పే చివరిమాట-తెలిసిందా? ఇదే నా చివరి మాట." అంటూ వృద్ధుడు, ఇహ తన నిశ్చయం ఏ మాత్రం మారదన్నట్టుగా చెప్పడం ముగించాడు.

ఆండ్రూకు మాత్రం ఒక విషయం స్పష్టంగా తెలిసింది. ఒక సంవత్సరం వరకూ ఈ పరీక్షకు తన కుమారుడు కాని, ఆ పిల్లకాని నిలవలేరనీ, లేక అప్పటికి తను చనిపోతావని వృద్ధుడు ఆశిస్తున్నట్టుగా ఆండ్రూ రాకుమారుడు అర్థం చేసుకున్నాడు. అందుచేత తన తండ్రిమాట వినడానికే నిశ్చయించుకున్నాడు. వివాహం చేసుకుంటానని వారికి తెలియజేసి ఒక సంవత్సరం వరకూ మాత్రం ఆపి ఉంచాలని అనుకున్నాడు.

రోస్టోవ్‌ల ఇంటికి వెళ్ళిన మూడువారాల తరువాత ఆండ్రూ మళ్ళీ పీటర్స్ బర్గ్ తిరిగి వచ్చాడు.

నటాషా తన తల్లితో మాట్లాడిన తరువాత ఆ మరుసటి రోజంతా ఆంద్రూ వస్తాడని ఎదురు చూచింది. కాని చాలా రోజులు గడిచినప్పటికీ అతను తిరిగిరాలేదు. అతను పీటర్స్‌బర్గ్ విడిచి వెళ్ళాడని తెలియక అతను ఎందుచేతరాలేదో ఆమె అర్థం చేసుకోలేకపోయింది.

ఈ విధంగా మూడువారాలు గడిచాయి. నటాషా ఎక్కడికీ వెళ్ళడం లేదు. ఏమీ తోచకుండా ఒక నీడలాగా ఇంట్లోనే గదినుంచి గదికి తిరుగుతోంది. రాత్రిళ్ళు ఒంటరిగా ఏడుస్తోంది: తల్లితో కూడా మాట్లాడడం లేదు. ఏమాట మాట్లాడినా సిగ్గు పడుతూ కలవరం చెందుతోంది. అందరికీ తన మనోవ్యథ- తన ఆశాభంగం తెలిసి ఉంటుందనీ, అందరి దృష్టిలోనూ అపహాస్యాల పాలవుతుందనీ లేక అందరూ తనను చూచి జాలిపడుతున్నారనీ అనుకుంటోంది. లోపల ఎంత బాధపడుతున్న ప్పటికీ ఆమె మనస్సు ఇలా గాయపడడం ఆమె బాధను మరింత హెచ్చు చేస్తోంది.

ఒక రోజు ఆమె ఏదో మాట్లాడబోయి హఠాత్తుగా దెబ్బలు తిన్న పిల్లలాగా వెక్కి వెక్కి ఏడ్చింది. కౌంటెస్, కుమార్తెను ఓదార్చబోయింది కాని ఇంతలోనే ఆమె కలిపించుకుని,

"అమ్మా! ఇహ మాట్లాడకు. నేనతన్ని గురించి ఆలోచించడమే మానేశాను. ఊరికే అతను గమ్మత్తు కోసం ఇక్కడికి వచ్చాడు! అతనికి విసుకెత్తింది. ఇక అత నిక్కడికి రాడు. అదీ సంగతి! ఇక నేనెప్పటికీ పెళ్ళి చేసుకోను." అని వణుకు తున్న గొంతును అణుచుకుని మళ్ళీ నింపాదిగా "పూర్వంలాగానే అతనంటే నాకు భయంగా ఉంది. ఇప్పుడంతా గడిచిపోయింది. ఇప్పుడు మళ్ళీ నా మనస్సు హాయిగా ఉంది." అన్నది.

ఆ మరుసటిరోజు నటాషా తనకెంతో ఇష్టమైన ఒక పాతగౌను వేసుకుని మళ్ళీ తన మామూలు పనులలో పడిపోయింది. బాల్ జరిగిన నాటిరాత్రి నుంచీ కూడా తను విడిచిపెట్టిన పనులు మళ్ళీ చెయసాగింది.

గదిలో అటూఇటూ నడవసాగింది. ముందు కాలిమడమలను, తరువాత ముని వ్రేళ్ళను తళ తళ మెరుస్తున్న నేలపై చప్పుడు చేస్తూ నడవసాగింది. మడమవ్రేళ్ళు, చేస్తున్న చప్పుడు వింటోంటే తన కంఠ స్వరం వింటున్నప్పుడు ఎలాటి ఆనందం కలిగిందో అలాటి ఆనందమే ఆమెకు కలిగింది. అద్దం దగ్గరికివెళ్ళి తన పాపను చూచుకుంది.

"అవును! నేనే ఎంత బాగున్నాను! నాకెవరూ అక్కర్లేదు." అంటున్నట్టుగా ఉంది ఆ పాప.

ఒక సేవకుడు గది తుడవడానికి వచ్చేవాడే కాని ఆమె అతన్ని రానివ్వలేదు.

మళ్ళీ తన పాపను తను చూచుకుంటూ, ఆనందిస్తూ గదిలో అటూ ఇటూ తిరగ సాగింది.

బయట తలుపు తెరుచుకుని "ఇంట్లోవారున్నారా?" అని ఒక గొంతుక వినిపించింది. అడుగుల చప్పుడు వినిపించింది. ఆమె అద్దంలో తన పాపను తను చూసుకుంటున్నదేకాని ఆ పాప ఆమెకు కనిపించడంలేదు.ఆ గొంతుక ఆమెధ్యానాన్ని పూర్తిగా మరల్చింది. ఆమె వళ్ళంతా చెవులు చేసుకుని విన్నది. ఆమెకు బాగా తెలుసు, ఆ వచ్చింది అతనే! తలుపులన్నీ మూసివున్నప్పటికి ఆ అడుగుల చప్పుడు ఆమెకు వినిపించింది.

ముఖమంతా పాలిపోయి భయంతో ఆమె ప్రక్కగదిలోకి పరుగెత్తుకుని వెళ్ళింది.

"అమ్మా! ఆంద్రూ వచ్చాడు! నేనెలా భరించగలను? నన్ను హింసిస్తారా" అన్నది.

తల్లి జవాబు చెప్పేలోగానే ఆంద్రూ లోపలికి వచ్చాడు. అతని ముఖం గంభీరంగా ఉంది. ముఖంలో ఉద్వేగం కనిపిస్తోంది. నటాషాను చూడగానే అతని ముఖం వెలుగొందింది. కౌంటెస్‌చేతినీ,ఆమె కుమార్తె చేతినీ ముద్దాడి తరువాత కూచున్నాడు.

"నిన్ను చూచి చాలారోజులు కావస్తోంది." అని కౌంటెస్ చెప్పడం మొదలెట్టగానే ఇంతలో ఆంద్రూ జోక్యం కలిగించుకుని క్షమాపణలు చెప్పుకోవడం మొదలు పెట్టాడు.

"నేను మా నాన్నగారిని చూడడానికి వెళ్ళాను. అందుచేత రాలేకపోయాను. ఆయనను ఒక విషయం అవసరంగా మాట్లాడవలసివచ్చింది. నిన్న రాత్రే తిరిగి వచ్చాను." అని ఆంద్రూ రాకుమారుడు ఒకమాటు నటాషా వంక చూచి "నీతో కొన్ని మాటలు మాట్లాడాలి కౌంటెస్." అన్నాడు.

ఆమె కళ్ళు దించుకుని బరువుగా నిశ్వసించింది. "నేనెప్పుడూ సిద్ధమే. అన్నది.

నటాషాకు తను అక్కణ్ణుంచి వెళ్ళిపోవాలని తెలుసు. కాని ఆమె అక్కణ్ణుంచి కదల్లేక పోయింది. ఆమె గొంతుకు ఏదో అడ్డుపడినట్టు తోచింది. ఆమెకు ఊపిరి సలపలేదు. కళ్ళు ఇంతలు చేసుకుని ఆంద్రూ రాకుమారుని వంక చూచింది. "ఇప్పుడా? ఇప్పుడేనా? అసాధ్యం!" అనుకున్నది.

అతను మళ్ళీ ఆమెవంక చూచాడు. అవును. అప్పుడే—ఆ క్షణంలోనే నిశ్చయం జరుగుతుందని ఆమె అనుకున్నది.

"నీవు వెళ్లు నటాషా. నీ కోసం మళ్ళీ కబురుపంపుతాను" అన్నది తల్లి మెల్లగా.

నటాషా ఒకమాటు తల్లివంక, ఒకమాటు ఆంద్రూవంక ప్రతిమాలుకున్నట్టు చూచి గదిలోంచి వెళ్ళి పోయింది.

"నేను మీ కుమార్తె కరగ్రహణాన్ని అర్థించడానికి వచ్చాను." అన్నాడు ఆంద్రూ రాకుమారుడు.

కౌంటెస్ సిగ్గుపడింది. వెంటనే మాట్లాడలేకపోయింది.

"నీ కోరిక..." అంటూ ఆమె కలవరంతో చెప్పసాగింది. "నీ కోరిక... ఎంతో సంతోషమైంది. నామటుకు నేను ఒప్పుకుంటున్నాను— నాకెంతో సంతోషం. నా భర్త కూడా ఒప్పుకుంటాడనుకుంటాను. కాని దాని విషయమే.... ముఖ్యంగా అదే ఒప్పుకోవాలి." అన్నది.

"మీరు నిక్కచ్చిగా ఒకమాట చెపితే నేను ఆమెతో మాట్లాడతాను. అయితే మీరు ఒప్పుకున్నట్లేనా?"

"అవును." అన్నది కౌంటెస్, తన చెయ్యిచాచి, అతను ముందుకు వంగి ఆమె చెయ్యి ముద్దాడాడు. ఆమె కలవరంతోను, అనురాగంతోను అతని నుదురు ముద్దాడింది. అతన్ని కొడుకులా ప్రేమించాలని ఆమె ఉద్దేశం అయినప్పటికీ, ఈ అపరిచితుడు ఆమెలో ఒక విధమైన కలవరాన్ని కలుగజేశాడు. అతన్ని చూచి ఆమెకు భయం కూడా కలిగింది.

"నా భర్త నేను చెప్పినట్లే చేస్తాడు. కాని మీనాన్నగారి విషయమో?" అని అడిగిందామె.

"నా ఉద్దేశాన్ని మా నాన్నగారితో చెప్పాను. ఒక సంవత్సరం ఆగాలని అన్నాడు. ముఖ్యంగా నేనీవిషయం మీతో చెప్పదలుచుకున్నాను." అన్నాడతను

"నటాషా చాలా చిన్నది. అయినా అంతకాలం ఆగడమా?"

"మరి గత్యంతరం లేదు." అన్నాడు ఆంద్రూ నిశ్వసిస్తూ.

"నేను అమ్మాయిని నీ దగ్గరికి పంపుతాను." అంటూ కౌంటెస్ లోపలికి వెళ్ళింది. "భగవంతుడా! మమ్మల్ని కరుణించు." అంటూ కూతురు కోసం వెదుక సాగింది.

నటాషా పడక గదిలో ఉన్నదని సోనియా చెప్పింది. ఆమె వెళ్ళి చూచేసరికి నటాషా పక్కమీద కూచుని ఉంది. ముఖం పాలిపోయింది. కళ్ళు పొడిగా ఉన్నాయి. దైవప్రతిమలవంక చూచి ఏదోగొణుక్కుంటూ ఆమె దగ్గరికి వచ్చింది.

"అమ్మా! ఏం జరిగిందో చెప్పవూ?" అని అడిగింది.

"వెళ్ళు అతను నీ కోసం కాచుకుని ఉన్నాడు. నిన్ను పెళ్ళాడాలని కోరుతున్నాడు." అన్నది కౌంటెస్ నిక్కచ్చిగా మళ్ళీ "వెళ్ళు" అన్నది తల్లి.

కూతురు వెడుతోంటే ఆమె నిశ్వసించి విచారంగా ఏదో గొణుక్కుంది.

నటాషా తను డ్రాయింగ్ రూములోకి ఎలా వచ్చిందో తనకే తెలియదు. తలుపు దగ్గరికి రాగానే ఆంద్రూను చూచి ఆగిపోయింది. "ఈ అపరిచితుడే ఇప్పుడు నాకు అంతా అయినాడా?" అనుకున్నది. వెంటనే సమాధానం తోచింది.

"అవును అంతా అతనే! ఈ ప్రపంచం అంతటికంటె అతనే నాకు అయిన వాడు!" అనుకున్నది.

ఆంద్రూ రాకుమారుడు కళ్ళు మూసుకుని ఆమె దగ్గరికి రాసాగాడు. ఆమెతో మాట్లాడుతూ కళ్ళెత్తి చూశాడు.

"తొలిగా నిన్ను చూచినప్పటి నుంచీ నిన్ను ప్రేమించాను. నా కేమైనా ఆశ ఉందా?" అని అడిగాడు. తరువాత అతను కళ్ళెత్తి ఆమె వంక చూచాడు. ఆమె ముఖంలోని తీవ్రమైన ఉద్వేగం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"అందరికీ తెలిసిన విషయమే. అనుమానిస్తా వెందుచేత? మన భావాలు చెప్పలేనప్పుడు ఆ మాటలతో మనకు అవసర మేమిటి?" అంటున్నట్టుగా ఉన్నది ఆమె ముఖం.

ఆమె ఒక అడుగు ముందుకు వేసి ఆగిపోయింది. అతను ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని ముద్దాడాడు.

"నీవు నన్ను ప్రేమిస్తున్నావా?" అని అడిగాడు.

"అవును, అవును" అన్నదామె తీవ్రంగా, కోపంతో అన్నట్టుగా అన్నది. ఊపిరి బిగపట్టుకుని ఎగరొప్పుతూ వెక్కి వెక్కి ఏడవ సాగింది.

"ఏమిటి? ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగా డతను.

"ఎంత హాయిగా ఉన్నది!" అన్నదామె. ఆ కన్నీళ్ళలోంచి చిరునవ్వు నవ్వుతూ.

అతనికి దగ్గరగా వచ్చి ఒక్క నిముషం ఆగింది. తను అతన్ని ముద్దాడ గలనా అనుకుంది. ముద్దాడింది.

ఆంద్రూ రాకుమారుడు ఆమె రెండు చేతులూ పట్టుకుని సూటిగా ఆమె కళ్ళలోకి చూచాడు, అప్పుడు అతని ప్రేమలో ఒక మార్పు కనిపించింది. పూర్వం అతని హృదయంలో కనిపిస్తూ వచ్చిన ప్రేమ తాలూకు ఛాయలు కనిపించలేదు. అవ్యక్తమైన, కవితాత్మకమైన ఆ ప్రేమ పోయి అబలయైన ఆ పిల్ల పట్ల ఒక మృదువైన జాలి, ఆమె తనను భక్తితో నమ్మినందుకు తను ఆమెను ఎక్కడ నొప్పిస్తానోనన్న భయము, ఆమెకూ, తనకూ మరింత దగ్గరి అనుబంధం ఏర్పరచిన ఒక బాధ్యత, ఆ స్థానే అతనిలో ఏర్పడ్డాయి. సంతోషము, ఒక విధమైన సంకోచము కూడా అతనిలో కలిగాయి. ఈ భావం అతనిలో పూర్వం కలిగినంత ఆనందమయ మైనదీ, కవితాత్మక మైనదీ కాకపోయి నప్పటికీ అంతకంటె దృఢ మైనదీ, అగాధమైనదీను.

"ఒక సంవత్సరం వరకూ నిన్ను పెళ్ళాడలేనని మీ అమ్మ నీతో చెప్ప లేదా?" అని అడిగాడు, ఇంకా ఆమె కళ్ళలోకి చూస్తూ.

"నేనింకా నటాషా అనే చిన్న పాప నేనా? ఇంతలోనే ఈ అపరిచితుడికి సమానస్థురాలనూ, భార్యనూ అయిపోయానా? మా నాన్నగారు కూడా ఎంతో గౌర వించే ఈ అందగాడికీ, ఈ తెలివైన వాడికీ భార్య నైనానా? ఇది నిజమేనా? ఇహ ముందునుంచీ జీవితంలో ఆడుకోవడ మనేది లేనే లేదా? నే నిప్పుడే పెద్దదాన నై పోయానా? నేను మాట్లాడే ప్రతి మాటకూ, చేసే ప్రతి పనికీ ఒక బాధ్యత ఏర్పడిన మాట నిజమేనా?... ఇంతకూ అతనేమిటీ నన్ను అడిగింది?" అనుకున్న దామె తనలో తాను. మళ్ళీ ఆ ప్రశ్న తనకు అర్థంకాక "ఏమీ లేదు." అని తనకు తనే సమాధానం చెప్పుకుంది.

"క్షమించు! నీవు చాలా చిన్నదానివి. నేను చాలా అనుభవం కలవాణ్ణి, నీ విషయం చూస్తే నాకు భయం కలుగుతోంది. నీ విషయం నీకే తెలియదు." అన్నాడతను.

నటాషా అతని మాటలు ఎంతో శ్రద్ధగా విన్నది. కాని వాటి భావం మాత్రం గ్రహించలేక పోయింది.

"ఈ సంవత్సరమంతా భరించడం నాకు చాలా కష్టమే. కాని ఈ లోగా నిన్ను నీవులాగా బాగా అర్థం చేసుకోడానికి వ్యవధి ఉంటుంది. ఒక సంవత్సరంలో వచ్చి నన్ను వివాహం చేసుకుని నన్ను ఆనందింప చేయమని నిన్ను కోరతాను. అంతవరకూ ఈ విషయం రహస్యంగా అట్టిపెట్ట బడుతుంది. అప్పుడు నీవు నన్ను ప్రేమించడం లేదని గ్రహించిన పక్షంలో, మరెవరినైనా ప్రేమించిన పక్షంలో...." అన్నాడు ఆండ్రూ తెచ్చిపెట్టుకున్న చిరునవ్వు నవ్వుతూ.

నటాషా మధ్యలో కలిగించుకుని "ఆ మాట లెందుకు? మిమ్మల్ని ఆట్రె డెనోలో చూచినప్పటినుంచీ మిమ్మల్ని ప్రేమిస్తూనే ఉన్నాను." అన్నది తను నిజం చెపుతున్నట్లుగా.

"ఒక సంవత్సరంలో నిన్ను నీవు...." అంటూ అతను మళ్ళీ ఏదో చెప్ప సాగాడు.

"ఒక సంవత్సరము? ఒక సంవత్సరమా!" అన్నది నటాషా, తానా విషయం ఇప్పుడే గ్రహించినట్టుగా, "ఒక సంవత్సరమా? ఎందుకు ఒక సంవత్స రం?" అన్నది మళ్ళీ.

ఈ ఆలస్యానికి కారణం ఆండ్రూ రాకుమారుడు చెప్పసాగాడు. కాని ఆమె దాన్ని పట్టించుకున్నట్టు లేదు.

"మరోలా చేయడానికి వీలు లేదా?" అని అడిగింది. అతను జవాబు చెప్ప లేదు.

"ఎంత ఘోరం! ఒక సంవత్సరమా? నేను చచ్చిపోనూ?" అన్నది వెక్కి వెక్కి ఏడుస్తూ.

అతని ముఖం వంక చూచింది. అతని ముఖంలో ఆశ్చర్యము, జాలి కని పించాయి "లేదు, లేదు అన్నిటికీ ఒప్పుకుంటాను. నా కెంతో హాయిగా ఉన్నది." అన్నది ఏడుపు ఆపుకుంటూ.

తల్లి దండ్రులు గదిలోకి వచ్చారు. వారు తమ ఆశీస్సులను ఇచ్చారు. ఆ రోజు నుంచీ ఆంద్రూ రాకుమారుడు రోస్టోవ్‌ల ఇంటికి వారికి కాబోయే అల్లుడిగా వస్తూ వచ్చాడు.

# 24

ప్రధానం నిరాడంబరంగా జరిగింది. ఆంద్రూ ప్రత్యేకంగా కోరడంవల్ల ఆ విషయం ఎవరికీ తెల్పలేదు. పెళ్ళి ఆలస్యం కావడానికి తనే కారణం కావడంవల్ల తనే ఆ భారమంతా వహిస్తానని ఆంద్రూ చెప్పాడు. తన మాట ప్రకారం తను చెప్పిన ప్రతి మాటా తను నిలువబెట్టుకునే బాధ్యత తనకు ఉన్నదనీ, నటాషాను ఏమాత్రం కట్టుబాటులో ఉంచడం లేదనీ,ఆమెకు పూర్తిస్వేచ్ఛ ఉన్నదనీ చెప్పాడు. మరో ఆరు నెలల్లో ఆమె తను ప్రేమించడం లేదని అనుకున్న పక్షంలో ఆ విషయం చెప్పడానికి ఆమెకు పూర్తిగా హక్కున్నదని అన్నాడు. ఈ విషయం ఎన్నో పర్యాయములు చెప్పాడు. కాని నటాషా కాని, ఆమె తల్లి దండ్రులు గాని, ఇలాంటిది సాధ్యమవుతుందని ఏ మాత్రం అనుకోలేదు. ఏమైనప్పటికి ఒక వరునికి ఉండే హక్కులు తనకు ఉండాలని ఆంద్రూ ఎప్పుడూ కోరలేదు. నటాషాతో ఒక విధమైన మర్యాదతో సంచరిస్తూ వచ్చాడు.

ఆంద్రూ రాకుమారుడు ఎప్పుడూ వారింటికి రావడం ఆ కుటుంబానికి మొదట్లో కొంత సంకటంగానే కనిపించింది. అతను తమకు సంబంధించని మరో వర్గానికి చెందిన వ్యక్తి లాగా వారికి కనిపించ సాగాడు. వారు అతన్ని అర్థం చేసు కునేటట్లు చేయడం కోసం నటాషా ఎన్నోసార్లు ఎంతో ప్రయత్నించింది. అతన్ని చూచి తను ఏ మాత్రం సిగ్గు చెందడం లేదనీ, వారు కూడా ఆ విధంగా భయపడ వలసిన అవసరం లేదనీ, అతను కూడా పైగా ఆ విధంగా కనిపించక పోయినప్ప టికీ అందరిలాంటి వాడేననీ, అందుచేత ఎవరూ బిడియపడవలసిన అవసరం లేదనీ

అందరితోనూ ఎన్నోసార్లు గర్వంగా చెప్పసాగింది. కొద్దిరోజుల తరువాత వారతని రాకపోకలకు అలవాటు పడిపోయారు.

సాధారణంగా వధూవరుల చుట్టూ ఉండే ఒక విధమైన నిశ్చలమైన వాతావరణం ఆ ఇంటినంతా ఆవరించింది. ఒక్కోమాటు ఎవరూ ఒక్కమాట కూడా మాట్లాడకుండా అంతా కలిసి కూచునేవారు. ఒక్కోమాటు వారు లేచి వెళ్ళిపోయి, అక్కడ వధూవరులు మాత్రమే మిగిలిపోయినప్పటికీ కూడా మాట్లాడుకునేవారు కాదు. వారి భావి జీవితాన్ని గురించి మాట్లాడుకున్నది ఒక్కసారి లేదు. ఆండ్రూ రాకుమారుడు ఆ ప్రస్తావన తీసుకురావాలంటే భయపడేవాడు కూడా. అందుచేత ఎంతో జాగ్రత్తగా ఆ ప్రస్తావనను నటాషాతో తీసుకొని వచ్చేవాడు కాదు. ఆమె కూడా అతని మనస్సు అర్థం చేసుకుని అతనితో పాలుపంచుకునేది. ఒక మాటు ఆమె అతని కుమారుని గురించి అడిగింది. అతను తరుచుగా సిగ్గుపడినట్టుగానే అప్పుడు కూడా సిగ్గుపడ్డాడు. అతనిలా సిగ్గుపడడం నటాషాకు ఎంతో ముచ్చటగా కనిపించేది. అతనలా సిగ్గుపడి తన కొడుకు తమతోపాటు ఉండడని చెప్పాడు.

"అదేమి?" అన్నది నటాషా, కలవరంతో.

"నేను పిల్లవాణ్ణి, తాతగారి దగ్గర్నుంచి తీసుకుని రాలేను. అదీకాక...."

"నాకా పిల్లవాడంటే ఎంత ఇష్టం అనుకున్నారూ? కాని నాకు తెలుసు. మీరు మా మీద నింద రాకుండా ఉండడం కోసం ఈ పని చేస్తున్నారు."

వృద్ధకౌంట్ తరుచుగా ఆండ్రూ రాకుమారుని వద్దకు వెళ్ళి అతన్ని ముద్దాడి, నికోలస్‌ను గురించీ, పెట్యాను గురించీ అతని సలహా అడుగుతూ ఉండేవాడు. కౌంటెస్ వధూవరులను చూచి నిశ్వసిస్తూ ఉండేది. సోనియా కూడా వారికి తను భంగం కలిగిస్తానేమో అనే భయంతో, వారు ఒంటిగా ఉండదలుచుకోక పోయినప్పటికీ వారిని ఒంటిగా వదిలి వెడుతుండేది. ఆండ్రూ ఎప్పుడూ ఏదో ఒక విషయం చెపుతూ ఉండేవాడు. ఎంతో చక్కగా మాట్లాడేవాడు. నటాషా అతని మాటలు ఎంతో గర్వంగా వింటూ ఉండేది. తను మాట్లాడుతూ ఉన్నప్పుడు అతను తనను శ్రద్ధతో పరిశీలించడం ఆమెకు ఆనందం, భయం, కలవరం కలుగజేసేవి.

"నాలో దేనికోసమని వెతుకుతున్నాడు? నాలో ఏమున్నదని అలా చూస్తున్నాడు? అతను అనుకున్నది నాలో దొరక్కపోతే?" అని తనలో తాను ఆందోళనతో అనుకునేది.

ఇక తను రేపు వెడతాననగా ఆండ్రూ పీటర్‌ను రోస్టోవ్‌ల ఇంటికి తీసుకుని వచ్చాడు. పీటర్ వారి ఇంటికి వచ్చి చాలా రోజులైంది. అతను పరధ్యానంగాను, కలవర పడుతున్నట్టుగాను ఉన్నాడు. ముఖ్యంగా కౌంటెస్‌తో మాట్లాడుతూ కూచు

న్నాడు. నటాషా అప్పుడు సోనియాతో చదరంగం ఆడుతూ కూచుంది.ఆంద్రూను దగ్గరికి పిలిచింది.

"నీకు బెషోవ్ చాలాకాలం నుంచీ తెలుసు కదూ?అతనంటే నీకిష్టమేనా?" అని అడిగాడు ఆంద్రూ.

"ఆ ఇష్టమే. అతను చాలా మంచివాడు. కాని చాలా చిత్రమైన మనిషి" అన్నది నటాషా.

అతని పరధ్యానాన్ని గురించి అల్లిన కట్టుకథలెన్నో చెప్పసాగింది.

"మన రహస్యం అతనితో చెప్పాను. అతను నాకు చిన్నతనం నుంచీ స్నేహితుడు. అతని హృదయం చాలా మంచిది. కాని ఒక విషయం నటాషా. నీవు నాకో వాగ్దానం చేయాలి. నేను నిన్ను విడిచి పెడుతున్నాను. తరువాత ఏం జరుగుతుందో ఆ దేవుడికే తెలియాలి. నీవు నన్ను ప్రేమించకపోవచ్చు. అప్పుడు నీ మనస్సు మారిపోవచ్చు! నేనలా అనకూడదనుకో. అయినా నీవు నా విషయం వాగ్దానం చెయ్యి.కాని నేను లేని సమయంలో ఏదైనా జరిగితే..." అని చెప్పసాగాడు ఆంద్రూ.

"ఏం జరుగుతుంది?" అని ఆమె అడిగింది.

"ఏదైనా విపత్తు జరిగితే సలహా కోసం ఒక్క అతని దగ్గరికే మాత్రమే వెళ్ళు. మరెవరి దగ్గరికీ వెళ్ళకు. అతను చాలా పరధ్యానం కల మనిషి. కాని చాలా మంచివాడు" అన్నాడు ఆంద్రూ.

ఈ రానున్న వియోగం నటాషాను ఎంత కలవర పరిచిందో ఎవరూ ఊహించలేకపోయారు. ఆమె తల్లి కానీ, తండ్రి కానీ, సోనియా కానీ చివరకు ఆంద్రూ కూడా ఊహించలేకపోయాడు. ఉబ్బిన చెక్కిళ్ళతోను, మిలమిలలాడుతూ పొడిగా ఉన్న కళ్ళతోను, బాధతో ఉద్వేగంతో నటాషా ఆ రోజంతా ఇల్లంతా తిరుగుతోంది. తను ఏం చేస్తున్నదీ తనకు తెలీక పోయినా ఏవేవో చిన్న చిన్న పనులు ఎన్నెన్నో చేస్తోంది.అతను వెడుతూ ఆమె చెయ్యి ముద్దాడినప్పుడు కూడా ఆమె ఒక కన్నీటి బొట్టు కూడా రాల్చలేదు. "వెళ్ళొద్దు" అని మాత్రం అన్నది. ఒక్క నిముషం అతను వెళ్ళడానికి తటపటాయించాడు. ఆ గొంతుక ఆ తరువాత చాలా కాలంవరకూ అతడికి జ్ఞాపకం వస్తూనే వుంది.అతను వెళ్ళిపోయిన తరువాత కూడా ఆమె ఏడవలేదు. రోజుల తరబడి తన గదిలోనే కూచుని ఎందులోనూ శ్రద్ధ చూపకుండా ఉంటూ వచ్చింది. మధ్య మధ్యలో మాత్రం "నన్ను విడిచి ఎందుకు వెళ్లాడు?" అనుకుంటోంది.

ఒక పదిహేను రోజుల తరువాత ఈ స్థితిలో నుంచి మళ్ళీ మేలుకుని మామూలు ధోరణిలో పడి తన కుటుంబాన్నంతా ఆశ్చర్య పరిచింది. ఎప్పటిలాగా

కులాసాగా ఉంటోంది. ఆమెలో ఆంతరంగికంగా మార్పు కనిపించి నప్పటికీ, ఒక పెద్ద జబ్బుపడి లేచిన తరువాత పసిపిల్లల ముఖం మారినట్టుగా మాత్రమే ఆమె పైకి కనిపిస్తోంది.

# 25

తన కొడుకు దగ్గరలేని సమయంలో వృద్ధ రాకుమారుడు బోల్కొనెస్కీ ఆరోగ్యం, రానురాను మరీ సన్నగిలి పోతోంది. ఆయన స్వభావంలో కూడా మార్పు వచ్చింది. నానాటికీ చిరాకు, కోపము, హెచ్చు అవుతున్నాయి. ఆయన ధోరణికి ఒక అర్థం అంటూ లేకుండా పోయింది. తరుచుగా ఈ కోపతాపాలను అసహాయురాలైన తన కూతురిపై చూపిస్తున్నాడు. ఆయన ప్రత్యేకంగా తన కుమార్తె మనస్సులోని అతి సున్నితమైన ప్రదేశాలను కనిపెట్టి వాటిని నొప్పించి తను ఆనందిస్తున్నట్టుగా ఉన్నాడు. ఇప్పుడు మేరియా రాకుమారి బ్రతుకులోని ఆనందమంతా రెండు విషయాల్లోనే ఇమిడి ఉంది. ఒకటి మతము రెండవది తన చిన్న మేనల్లుడు. అందుచేత ఆమెకెంతో ప్రియతమమైన ఈ రెండు విషయాలనే ఆమె తండ్రి వెక్కిరిస్తూ, స్త్రీల మూఢ విశ్వాసాలను వారు పిల్లలను ఎక్కువ చనువుగా పెంచి పాడుచేయడాన్ని, ఆయన తూలనాడుతూ ఉన్నాడు.

"నీవు ఇలాగే కనుక పెంచితే చిన్ని నికోలస్‌ను నీలాగే ఒక ఆడ పిల్లలా తయారుచేస్తావు మొత్తం మీద చాలా మంచిపని చేస్తున్నావు! ఆంద్రూకు కావల సింది కొడుకు కాని కూతురు కాదు" అనేవాడు. మదాం బోరిన్‌తో కూడా ఇలాగే మతాన్ని గురించీ, పిల్లల పెంపకాన్ని గురించీ పరిహాసా లాడుతూ ఉండేవాడు.

ఏ చిన్న అవకాశం వచ్చినప్పటికీ పిచ్చిపిల్ల అయిన మేరియా రాకుమారిని ఎంతో కఠినంగా నొప్పించ కుండా ఉండే వాడుకాదు. ఆమె మాత్రం ఒక్క మాట కూడా మారుమాట్లాడేది కాదు.

శీతాకాలంలో ఆంద్రూ రాకుమారుడు కొన్నాళ్ళపాటు లిస్సీ-గోరీలో గడి పాడు. అతను ఆ రోజుల్లో ఎంతో హాయిగాను, కులాసాగాను ఉండడం వల్ల అతనిలో ఏదో మార్పు వచ్చిందని అతని చెల్లెలు ఊహించుకుంది. కాని ఆంద్రూ వెళ్ళిపోయే ముందు తన తండ్రితో చాలాసేపు మాట్లాడడం ఆమె గమనించింది. ఆంద్రూ మాట్లాడి వెళ్ళిపోయిన తరువాత ఇద్దరూ కూడా అసంతృప్తిగానే కనిపిం చారు. అంతకు మించి ఆమెకు వివరాలేమీ తెలియలేదు.

తరువాత కొద్ది రోజులకు ఆమె తన స్నేహితురాలైన జూలియా కారగైన్‌కు ఒక పెద్ద ఉత్తరం వ్రాసింది. టర్కీ యుద్ధంలో తన అన్న చంపబడడం వల్ల జూలియా ఇప్పుడు విచారంలో మునిగి ఉంది. ఆడపిల్లలందరి లాగానే మేరియా

కూడా ఒక పగటి కల కంటూ ఉండేది. జూలియా, ఆంద్రూను పెళ్ళి చేసుకుం టుందని అనుకుంటూ ఉండేది. ఆమె వ్రాసిన ఉత్తరం ఇది :

"ప్రియమైన స్నేహితులారా!"

లోకంలో అందరికీ దుఃఖం తప్ప మరేమీ లేదు. నీకు సంభవించిన నష్టం ఎంతో పెద్దది.కాని నిన్నూ నీ తల్లినీ పవిత్రం చెయ్యడం కోసం ఇది భగవంతుడు ఇచ్చిన వరమే అనుకుంటాను. స్నేహితురాలా!ఒక్క భగవంతుడు మాత్రమే మన లను ఓదార్చి, దుఃఖం నుంచి కాపాడగలడు.

మా నాన్నగారి ఆరోగ్యం నానాటికీ క్షీణించి పోతోంది. ఏ మాత్రం వైరు ధ్యం కలిగినా ఏ మాత్రం ఎదురుమాట చెప్పినా ఆయన ఓర్చుకునే పరిస్థితిలో లేడు. సహజంగా ఆయనకు ఉండే చిరాకు రాజకీయ చర్చలవల్ల మరింత ఎక్కువవు తుంది. బోనపార్టీ యూరప్‌లోని చక్రవర్తులందరి లాగానే ఒక చక్రవర్తి అని ఎప్ప టికీ ఒప్పుకోడు. కాథై రెన్ మనమడితో కూడా సమానమని ఒప్పుకోడు. ఎప్పటిలా గానే నేను ప్రపంచంలో జరిగే విషయాలేమీ పట్టించుకోను. అయినప్పటికీ మైఖేల్ ఇవనోవిచ్‌తో మా నాన్నగారి సంభాషణలు వింటోంటే నాకీ రాజకీయ విషయాలు తెలుస్తూ ఉంటాయి. నెపోలియన్‌కు గల చక్రవర్తి అనే బిరుదాన్ని, అతను గొప్ప వాడనే విషయాన్ని, అతనిపట్ల అందరూ చూపిస్తున్న గౌరవాన్ని ఒక్క లిస్సి- గోరీలో తప్ప మరెక్కడా కాదనేవారు లేరు. ఈ విధంగా మా నాన్నగారు మాస్కో వచ్చేటట్లయితే ఆయన కక్కడ జీవించడం చాలా కష్టమై పోతుంది. ఆయన విష యం ఎలా ఉన్నప్పటికీ నెపోలియన్ గొప్పతనాన్ని మాత్రం అందరూ ఒప్పుకొని తీరతారు.

"ఇక్కడ మాత్రం పెద్ద మార్పేమీ లేదు. ఒక్క మా అన్న మాత్రం లేని లోటు కనిపిస్తోంది. నీకు పోయినసారి వ్రాసిన ఉత్తరం అతనెంత మారిపోయాడో వ్రాశాను. ఇటీవలే కాస్త మళ్ళీ మామూలు ధోరణిలో పడుతూఉన్నాడు. మా వదినె పోయినప్పటి నించీ ఇలా లేడు. ఇటీవలే మళ్ళీ మామూలు ధోరణిలో పడి మృదువు గాను, అనురాగంగాను, మంచిగాను ఉంటున్నాడు. అతనితో పోల్చదగినవాను ఎవరూ లేరు. అతని జీవితం ఒక ముగింపుకు రాలేదని అతను తెలుసుకున్నాడు. కాని మరోవైపున అతని మనస్సు పరిపక్వమౌతోన్న కొద్దీ అతని ఆరోగ్యం మాత్రం క్షీణిస్తోంది. సన్నబడి చిక్కిపోతున్నాడు, కొంచెం ఉద్రేకపడుతున్నాడు కూడా.

నాకు కూడా అతని విషయం అంత హాయిగా కనిపించడం లేదు. అందుచేత అతని ఆరోగ్యం బాగుపడుతుందని పరదేశాలకు ప్రయాణం చేసిరావడానికి నేను కూడా ఒప్పుకున్నాను. పీటర్స్‌బర్గ్‌లో అతను మంచిపేరు సంపాదించు కున్నాడనీ,తెలివి కల యువకుల్లోనూ, బాగా శ్రమపడి పనిచేసే యువకుల్లోనూ ఒక

డుగా అతను పరిగణింప బడుతున్నాడనీ వ్రాశావు. ఆ విషయంలో నాకేమాత్రం సందేహం లేదు. అతని చెల్లెలుగా నా గర్వానికి నీవు నన్ను క్షమిస్తావనుకుంటాను. ఇక్కడ కూడా అతనికి అలాంటి మంచిపేరే ఉంది. ఈ ప్రశంస అతనికి తగినదేకాని తగనిది కాదు.

"నాకో విషయం మాత్రం ఆశ్చర్యం కలిగిస్తోంది. మీ అందరిలోనూ అతను మళ్ళీ పెళ్ళిచేసుకుంటాడని కొన్ని కట్టుకథలు వ్యాపించాయి, ఆ కథలు చాలాదూరం ప్రయాణం చేశాయి కూడా—పీటర్స్‌బర్గ్ నుంచి మాస్కోవరకూ. అందులోనూ ఆ రోస్టోవ్‌ల పిల్లను పెళ్ళి చేసుకుంటాడట!

"ఆంద్రూ మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకుంటాడని నేననుకోను. ఏమైనప్పటికీ నటాషాను మాత్రం అతను కోరుకోడు! అతను బయటికి చెప్పకపోయి నప్పటికీ అతని భార్యతాలూకు స్మృతి ఇంకా అతని హృదయంలో హత్తుకునే ఉంది. ఆ స్థానాన్ని మళ్ళీ ఇంకొకరి కివ్వడు. మా చంటివాడికి ఒక సవతిని తీసుకుని రాడు. ఏమైనప్పటికీ నా ఉద్దేశంలో మాత్రం-నీకు నిజం చెప్పాలంటే అతను ఆ పిల్లను పెళ్ళిచేసుకుంటాడని నేనే మాత్రం కోరుకోను.

"నాకు మాత్రం ఈ పుకార్లన్నీ సిగ్గుగలిగిస్తున్నాయి. ఇప్పటికే రెండు కాగితాలు వ్రాశాను. ఇక సెలవు తీసుకుంటాను. స్నేహితురాలా! భగవంతుడు నిన్ను కాపాడు గాక! మదాం బోరిస్ కూడా తన అనురాగాన్ని తెల్పమని కోరు తోంది.

ఇట్లు,
మేరియా"

# 26

ఆ వేసవిలో మేరియాకు తన అన్నదగ్గర నుంచి ఒక ఉత్తరం వచ్చింది. స్విట్జర్లాండు నుంచి వ్రాశాడు. తనకు కౌంటెస్ నటాషా రోస్టోవ్‌తో ప్రధానం జరి గిన విషయం వ్రాశాడు. ఆమెకు ఊహించు కోలేనంత ఆశ్చర్యం కలిగింది. ఆ ఉత్తరం నిండా పొంగి పొరలుతున్న ప్రేమ, తన చెల్లెలిపట్ల ఎంతో అనురాగము విశ్వాసము కురిపించాడు. ఇప్పుడు తను ప్రేమిస్తున్నట్లుగా ఎన్నడూ ప్రేమించ లేదనీ, ఇప్పుడు తనకు జీవితం అర్థమయినట్లుగా ఎప్పుడూ కాలేదనీ, లిస్సీ-గోరీలో ఉన్నప్పుడు తన రహస్యాలు ఆమెకు చెప్పకుండా దాచి ఉంచినందుకు తనను క్షమిం చమనీ కోరుతూ వ్రాశాడు. అప్పుడు ఆ విషయం ఆమెకు చెపితే ఏం జరుగుతుందో అని భయపడ్డానని కూడా అతను వ్రాశాడు.

"అప్పుడు పరిస్థితులు ఇంత పరిపక్వమూ కాలేదు. ఇంత నిశ్చయంగానూ

లేవు. నాన్నగారు ఒక సంవత్సరం పాటు వేచి చూడమని కోరారు. అప్పటికి ఆరు నెలలు గడిచాయి. కాని ఇప్పటికీ నా నిశ్చయం మాత్రం మారకుండా అలాగే ఉంది. ఇప్పటికీ డాక్టర్లు నన్నిక్కడే ఉండమని కోరుతున్నారు. లేకపోతే ఈపాటికి ఇంటికి వచ్చి ఉండేవాణ్ణి, కాని ఇక మూడు నెలలవరకూ నేను ఇంటికి రావడానికి వీల్లేదు. నాన్నగారూ, నేనూ ఏ పద్ధతిలో జీవిస్తామో నీకు తెలియని విషయం కాదు. నేనెప్పుడూ ఆయన్ను ఏమీ అడగను. కాని ఈ చివరిరోజుల్లో ఆయనకు ఎదురు మాట చెప్పి ఆయన ఉద్దేశానికి వ్యతిరేకంగా నడుచుకుని ఆయనకు కోపం తెప్పిస్తే నాకు నా ఆనందంలో సగం తరిగిపోతుంది. ఇప్పుడు మళ్ళీ ఆయనకు వ్రాస్తున్నాను. అనువైన సమయం చూచి ఈ ఉత్తరం ఆయనకు అందజెయ్యి. ఆయన ఈ ఉత్తరం ఎలా స్వీకరించాడో, ఆయన ఉద్దేశాలేమిటో, మూడు నెలల సమయాన్ని తగ్గించే ఆశ ఏమైనా ఉన్నదేమో నాకు తెలియజెయ్యి."

ఎంతో తటపటాయించిన తరువాత, ఎన్ని విధాలనో ప్రార్థించుకున్న తరువాత మేరియారాకుమారి తన అభీష్టాన్ని నెరవేర్చింది.

పైకి ఏమాత్రం కోపం చూపించకుండా ఉత్తరం అంతా చదివిన తరువాత ఆమె తండ్రి "మీ అన్నకు ఇలా బదులు వ్రాయి. 'నా చావు వరకూ అతను కని పెట్టుకుని ఉండాలి. అంతే! అదీ దగ్గరిలోనే ఉంది. ఆ తరువాత అతని ఇష్టప్రకారం అతను నడుచుకోవచ్చు' అని చెప్పాడు.

మేరియా రాకుమారి భయభయంగా తన మాట చెప్పబోయింది. కాని తండ్రి జోక్యం కలిగించుకుని గొంతుక హెచ్చించి "సరే పెళ్ళిచేసుకో నాయనా. చాలా మంచి కుటుంబం. తెలివి కలవాళ్ళు కదూ? చాలా ఉన్నవాళ్ళు కూడా కదూ? నికోలష్కాకు చాలా చక్కటి సవతితల్లిని తీసుకొస్తున్నావులే! తరువాత నేను బోరిన్‌ను పెళ్ళి చేసుకుంటా. అప్పుడు వాడికీ నీకూ కూడా ఒక సవతితల్లి వస్తుంది. అప్పుడు ఇంటి నిండా ఇంతమంది చక్కటి ఆడవాళ్ళు ఉండడంవల్ల ఇహ వాడెక్కడికయినా వెళ్ళి హాయిగా కాలక్షేపం చేయవచ్చు. నీవు కూడా వాడితో వెళ్ళు, సరిపోతుంది. మంచిది మంచిది..." అన్నాడు.

ఆ తరువాత మళ్ళీ ఎప్పుడూ ఆ ప్రస్తావన తీసుకురాలేదు. కాని కొడుకు బల హీనత పట్ల తనకు కలిగిన కోపం ఆ వృద్ధుడు తన కూతురిమీద చూపిస్తున్నాడు. అదీగాక పాత విద్దూరాలతో పాటు ఒక కొత్త విద్దూరం కూడా కనిపించసాగింది. ఒక కొత్త సవతి రావడం, యువతి అయిన ఫ్రెంచి స్త్రీ పట్ల తను ముచ్చటగా మసలుకోవడమూను.

"ఏం నేనామెను ఎందుకు పెళ్ళి చేసుకోకూడదూ? ఆమె కూడా ఒక చక్కని రాకుమారి అవుతుంది" అంటూ ఉండేవాడు.

నిజానికి కూడా మదాంబొరీస్ పట్ల తన తండ్రి ప్రవర్తన మేరియా గమనించి భయపడింది. ఆయన ఎక్కువసేపు ఆమెతో కాలం గడుపుతున్నాడు. తను వ్రాసిన ఉత్తరం వల్ల కలిగిన విషమ ఫలితాలనన్నిటినీ వివరిస్తూ ఆమె తన అన్నకు మరో ఉత్తరం వ్రాసింది. కాని తను మాత్రం ఇంకా ఆశ కోల్పోలేదు.

చిన్న నికోలస్, ఆండ్రూ, వీరు మాత్రమే ఆమె జీవితంలోని ఆనందాలు. కాని ప్రతి జీవిలాగానే ఆమె కూడా కొన్ని వ్యక్తిగత వాంఛలు లేకుండా బ్రతకలేదు. ఆమె తన హృదయంలో ఒక కలను పెంపొందించుకుంటూ ఉంది. ఎప్పుడూ ఆమె ఆత్మను సజీవంగా ఉంచే ఒక అవ్యక్తమైన ఆశను ఆమె పెంచుకుంటూ ఉంది. తన తండ్రికి తెలీకుండా తన ఇంటికి వచ్చిపోయే యాత్రికులు కూడా ఈ ఆశకు ప్రోత్సాహం కలిగిస్తున్నారు. ఆమె జీవించేకొద్దీ—జీవితాన్ని పరిశీలించే కొద్దీ ఆమెకొక విషయం ఎంతో ఆశ్చర్యకరంగా కనిపిస్తోంది. ఈ లోకానికి సంబంధించిన వాంఛలు తీర్చుకోవడం కోసం ఆరాటపడేవారి అంధత్వం ఆమెకు స్పష్టంగా కనిపిస్తోంది. అందుకోసం వారు ఎంతో పోరాడతారు, ఎంతో బాధపడతారు, ఒకరినొకరు హింసించుకుంటారు. అందరాని ఈ ఆశలవెంట పరుగెత్తడాన్నే ఒక ఆనందమని అనుకుంటూ ఉంటారు. భార్యను ప్రేమిస్తూ వచ్చిన తన అన్న మరో స్త్రీని ప్రేమించడంలో ఆనందాన్ని అందుకోవడం తను చూడలేదా? వారు తమకంటె తక్కువవారని అందుకు తన తండ్రి ఒప్పుకోక కోపగించుకోవడం కూడా తను చూడలేదా?....వీరందరూ ఒకరి తప్పుల వల్ల ఒకరు బాధపడుతున్నారు. మెరుపు తీగెల్లాంటి ఆనందాలను సౌఖ్యాలను అందుకోవడం కోసం తమ ఆత్మను పోగొట్టుకుంటూ ఉన్నారు. "ఒక్క మన అనుభవం వల్లనే కాదు. జీసస్ చెప్పిన మాటలను బట్టి కూడా మన జీవితం ఒక అంతరం మాత్రమేననీ, ఒక వ్యవధి మాత్రమేననీ, అయినప్పటికి కూడా మనం ఆనందాన్ని వెదకకుండా ఉండమనీ తెలుస్తోంది. అయినా ఈ విషయం గ్రహించేవారు ఎవరూ లేరు.ఒక్క మా ఇంటికి వచ్చేయాత్రికులు మాత్రమే ఈ విషయాన్ని గ్రహించారు. ఇల్లూ వాకిలీ వదిలి, లౌకికమైన భోగభాగ్యాలు వదిలి ఒకచోట నిలవకుండా ఎవరికీ నొప్పి కలిగించకుండా దేశదేశాలు తిరిగే జీవితం మాత్రమే నిజమైన జీవితం. జీవితానికి అర్థమిదే. ఒక్క ఈ చిన్న అంతరంలో మాత్రమే ఆనందం కోసం వెదకడం ఎంత పొరపాటు?" అనుకున్నది మేరియా తనలో తాను.

ఇలాంటి యాత్రికుల్లో మేరియా రాకుమారిని ముఖ్యంగా ఆకర్షించిన స్త్రీ ఒకతె ఉంది. ఆమె సన్నగా ఉంటుంది. బక్కచిక్కిన శరీరం యాభై ఏండ్లు. ఆమె పేరు ఫెడోషియష్కా. ముప్పయి సంవత్సరాల నుంచీ కాలినడకన ఉన్ని దుస్తులు ధరించి లోకమంతా తిరుగుతోంది. ఒకనాటి సాయంత్రం మసక మసకగా

వెలుగుతోన్న దీపాలవెలుతురులో కూచుని ఆమె చెపుతోన్నకథవింటూ ఉంటేమేరియా రాకుమారికి కూడా ఆమె వెళ్ళిన తోవే సరైనదనీ, తను కూడా అదే తోవ అను సరించాలనీ అనిపించింది. ఆమె వెళ్ళిన తరువాత మేరియా అలాగే చాలా సేపు ధ్యానిస్తూ కూచుని తను కూడా ఆ విధమైన జీవితమే గడపాలని నిశ్చయించుకున్నది. తన గురువుగారైన హియసింత్‌తో ఈ విషయాన్ని చెప్పింది. ఆయన ఒప్పుకున్న తరువాత, ఒక యాత్రికురాలికి తను బహూకరిస్తాననే మిషతో తనకు కావల్సిన దుస్తులన్నీ సేకరించుకున్నది. ఉన్ని చొక్కా, గడ్డిచెప్పులు, గౌను, మెత్తని ఊలు చేరుమాలు: ఇవన్నీ సేకరించుకున్నది. బట్టల బీరువా ముందు నిల్చుని అనేక పర్యా యాలు ఆందోళనతో ఆ సమయం ఎప్పుడు వస్తుందా అని తన్ను తాను ప్రశ్నించు కున్నది.

అన్నిటినీ వదిలి ఈ యాత్రికురాండ్రతో పాటు తను కూడా వెళ్లాలని ఎన్ని సార్లు అనుకున్నదో మేరియా! వారి కథలు ఆమెను ఎంతో విచిత్రంగా ఆక ర్షించేవి. ఆమె హృదయంలో నాటుకుని పోయేవి. ఆమె ఇలా ఊహించుకునేది : దుమ్ము నిండిన రోడ్డుమీద ఫెడోషియష్కా ప్రక్కనే చేతికర్రతో తను కూడా ఆమె లాగానే చిరుగుబట్టలు వేసుకుని భుజంమీద మూటతో, ఈ లోకంతో ఏమాత్రం సంబంధం లేకుండా, కోరికలేమీ లేకుండా ఒక చోటినుంచి ఒక చోటికి యాత్రిక జీవితం గడుపుతూ అవధి చేరే వరకూ ప్రయాణం చేస్తున్నట్టుగా ఊహించు కునేది.

"ఒకచోట ఆగుతాము. అక్కడ ప్రార్థన చేస్తాము. తరువాత అక్కడే ఆగి ఆ చోటికి అలవాటు పడిపోకుండా మరో చోటికి వెళతాము. నా కాళ్ళు ఎంతవరకు ఎక్కడికి లాక్కుని వెడితే అంతవరకు అక్కడికి వెడతాను. తరువాత పడు కుంటానో, చనిపోతానో ఏమైతే మటుకు ఏం? కడకు విచారం లేని శాంతిమందిరాన్ని చేరతాను."

కాని తరువాత? ఆమెకు తన తండ్రి, చంటివాడు జ్ఞాపకం రాగానే ఆమె నిశ్చయం సడలిపోయేది. భగవంతునికంటె ఎక్కువగా మనుష్యులను ప్రేమించ గలిగినందుకు ఒంటిగా కూచుని ఆమె ఎన్నో వెచ్చని కన్నీళ్ళు కార్చేది.

# ఏడవ కాండం

## 27

బైబిల్ మనకొక విషయం చెపుతోంది. మనిషి పతనం కాకముందు అతని ఆనందం పనీపాటా లేకపోవడంలోనే ఉన్నదని చెపుతోంది. కాని పతితుడైన మానవుడికి కూడా ఆ విషయంపైనే మక్కువ హెచ్చు. అయినప్పటికి తను పనీ పాటా లేకుండా ఉండలేడు. కారణం చెమటోడ్చి పనిచేసి పొట్టపోసుకోవాలనే ఆ శాపం ఒక్కటే కాదు. అతని స్వభావం కూడా ఇందుకు వ్యతిరేకమే. సోమరితనం మహా పాపమని ఒక రహస్యమైన గొంతుక అతన్ని ఎప్పుడూ హెచ్చరిస్తూ ఉంటుంది.

నికోలస్ రోస్టోవ్ 1807 నుంచీ అదే దళంలో ఉంటూ ఈ అవకాశాలన్నీ హాయిగా అనుభవించాడు. ఇప్పుడు, పూర్వం డెనిసోవ్ నాయకత్వాన ఉన్న దళానికి తను నాయకుడుగా ఉంటున్నాడు.

ఇప్పుడతనికి చాలా స్థిమితత్వం కూడా కుదిరింది. మంచి కుర్రవాడైనాడు. అలనాట్లు మాత్రం కొంచెం నాజూగ్గా ఉండవు. అతని మాస్కో పరిచయస్థులు కూడా దాన్ని గురించి అట్టే పట్టించుకోరు. కాని అతని పట్ల కొందరికి అమిత గౌరవంకూడా ఉంది. అతని స్నేహితులు అతన్ని ప్రేమిస్తూ ఉన్నారు కూడా. అతని కంటె క్రిందివారూ, పైవారూ కూడా అతనితో పూర్తిగా సంతృప్తి చెందారు. ఒక్క తల్లి వ్రాసిన ఉత్తరాలు తప్ప ఇప్పుడతని మనశ్శాంతిని మరేదీ అంతగా చెదర గొట్టడం లేదు. ఇటీవల తల్లి ఎక్కువగా ఉత్తరాలు వ్రాస్తూ ఉంది. కుటుంబ పరిస్థితులను గురించి, డబ్బు లేకపోవడాన్ని గురించి ఎక్కువగా వ్రాస్తోంది. వెంటనే ఇంటికి తిరిగివచ్చి వృద్ధులైపోయిన తల్లిదండ్రులను ఓదార్చి వారి మనస్సునకు స్థిమితం చేకూర్చమని ఆ తల్లి, కుమారుణ్ణి మాటమాటకీ కోరుతుంది. తన తల్లి అడిగే ప్రశ్నలకు తను మారు మాటాడకుండా సమాధానం కూడా చెప్పవలసి ఉంటుంది. "ప్రియమైన అమ్మా !" అని మొదలుపెట్టి "నీ పుత్రుడు" అని ముగిస్తూ తల్లికి ఉత్తరాలు వ్రాస్తుండేవాడు.

1810ఈ నటాషాకు బోల్‌కోన్‌స్కీకి జరిగిన ప్రధానాన్ని గురించి అతనికి తెలియజేశారు. ఆ వివాహం వృద్ధ రాకుమారుడు ఒప్పుకోక పోవడంవల్ల ఒక సంవత్సరం పాటు వాయిదా వేయబడిందని కూడా తెలియపరిచారు. వార్త నికోలస్‌ను ఎంతో కష్టం కలిగించింది. నటాషా ఇల్లు వదిలిపెట్టి వెళ్ళడాన్ని అతను ఊహించు కోలేక పోయాడు. నటాషా అతనికి ప్రియమైన స్నేహితురాలు, చెల్లెలు కూడా.

అదీకాక తను తక్కువ పదవిలోవాడు కాబట్టి, బోల్కోన్స్కీతో ఈ సంబంధం అతని మర్యాదకు అంతగా తగింది కాదని చెప్పే అవకాశం తనకు లేకపోయి నందున విచారపడ్డాడు. ఒక వేళ అతనంత ప్రేమిస్తున్నట్టయితే పిచ్చివాడైన అతని తండ్రి ఒప్పుకోలేదని కారణం చెప్పి వివాహం మానుకోవచ్చు. ఇప్పుడతను ఏం చేయాలి ? సెలవు తీసుకుని వెళ్ళి నటాషాను చూడాలా ? అతనొక నిముషం ఆలోచించు కున్నాడు. ఈ కడపటి అవస్థలో ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయ కుండా వెంటనే వచ్చి తమను ఈ ప్రమాదంనుంచి కాపాడమని కోరుతూ తల్లి అతనికి ఉత్తరం వ్రాసింది.

ఈ ఉత్తరం వల్ల తగిన ఫలితం కూడా వచ్చింది. సామాన్యమైన ఇంగిత జ్ఞానంకల నికోలస్ ఇక తను వెళ్ళడం తప్ప మార్గంలేదని, తను వెళ్ళి తీరాలని అనుకున్నాడు.

అతను మధ్యాహ్నం నిద్రపోయి లేచినతరువాత తన పాత గుర్రం మార్స్‌ను తెప్పించాడు. కొంతకాలం నుంచీ అతనీ గుర్రం ఎక్కలేదు. ఇప్పుడా గుర్రం ఎక్కి ఎక్కడికో వెళ్ళి కొన్ని గంటల తరువాత తిరిగి వచ్చాడు. అప్పుడు తన సేవకుడైన లావ్‌రుష్కాతోను మరికొందరు మిత్రులతోను తను సెలవు తీసుకుని తన కుటుం బాన్ని చూడడానికి వెడుతున్నానని చెప్పాడు. తను పై పదవికి వెళ్ళక ముందే ఇలా ఇంటికి వెళ్ళవలసి రావడం వారికి ఆశ్చర్యంగా కనిపించింది. కౌంట్ గొలా కోవిస్కీకి తను అమ్మవలసిన మూడు గుర్రాలను ఇంత వరకు అమ్మలేదు. మూడు వారాల బట్టి బేరాలు చేస్తున్నారు. రెండువేల రూబుళ్ళకు అమ్ముతానని కూడా చెప్పాడు రోస్టోవ్. పానీ జట్-జుడ్స్కా వారికి ఇవ్వబోయే బాల్‌కు కూడా అతను హాజరుకాడన్న మాట. పానీబొరాజొవస్కా ఇచ్చే బాల్‌కు కూడా అతను వెళ్ళడన్న మాట. ఈ హాయిని, ఈ సుఖాన్ని అంతా వదులుకుని ఆ గొడవల్లోకి వెళ్ళడం నిజంగా ఎంత విసుగెత్తించే పని ! అతని సెలవు మంజూరు చేశారు. అతని తోటి ఆఫీసర్లు తలా పదిహేను రూబుళ్ళు వేసుకుని అతనికొక విందు, సంగీతం ఏర్పాటు చేశారు. నికోలస్ నృత్యం కూడా చేశాడు.

ప్రయాణంలో సగం దూరం గడిచేవరకూ క్రెమెన్‌షో దగ్గర నుంచి క్యూ వరకూ, నికోలస్ హృదయం తన దళంపైనే ఉంది. కాని అతను వెళ్ళే కొద్దీ దాని తాలూకు చిత్రాలు అతని మనస్సులో నుంచి మాసిపోవడం మొదలుపెట్టాయి. ఆందోళన, ఆశ్చర్యం కలుగసాగాయి. ప్రయాణం ముగియ వస్తున్న కొద్దీ ఆట్రేడ్ నోలో జరగబోయే విషయాలను తన కళ్ళ ముందు స్పష్టంగా ఊహించుకోసాగాడు. ఈ భావం ఒక భౌతికమైన ఆకర్షణలాగా అతనిలో హెచ్చు కాసాగింది. చివరి పోస్టుహౌస్ చేరగానే మూడు రూబుళ్ళు గుర్రపువాడికి విసిరివేశాడు. పోస్టుహౌస్ ముందుకు రాగానే ఉద్రేకంతో బండిలోనుంచి ఒక్క దూకు దూకాడు.

ఇంటికి తిరిగివస్తూ ఉన్న తొలి ఆందోళన గడిచిపోగానే అతనికి ఇంటి తాలూకా నగ్నసత్యం స్ఫురించింది. అతని ఉద్వేగమంతా చల్లారి పోసాగింది. ఇంత తొందరపడి ఇంత ఉద్వేగంతో ఇంటిమొహం పట్టామేమిటా అని విచార పడసాగాడు. అతనికి సంతోషం కలిగించిందేమీ లేదు. కాని క్రమక్రమంగా గృహ జీవితానికి అలవాటు పడిపోయాడు. అతనికి ఇంట్లో కనిపించిన పెద్ద మార్పుకూడా ఏమీలేదు. తల్లిదండ్రులు ముసలివారై పోయారు. అంతే. ఒక, విషయంలో మాత్రం వారిలో ఒక చిన్న మార్పు కనిపిస్తోంది. వారు పూర్వం ఉన్నంత చనువుగా ఉండడం లేదు. ఒకరికొకరు కొద్ది దూరంలో ఉంటున్నారు. ఇలా వారు ఒకరి పట్ల ఒకరు ప్రవర్తించుకోడానికి కారణం డబ్బు చిక్కులే.

సోనియాకిప్పుడు ఇరవై ఏండ్లు. నిండైన అందంతో పొంగిపోతోంది. ఇంత కంటె ఇక ఎక్కువ వికసిస్తుందని చెప్పడానికి వీల్లేదు. కాని ఇప్పుడు తను ఉన్నంతలో చూచిన వారందరినీ ఆకర్షిస్తోంది. నికోలస్ ఇంటికి వచ్చినప్పటి నుంచీ ఆమె ఆనందంతోను, ప్రేమతోను పొంగిపోతోంది. ఆ విశ్వాసము, ప్రేమ ఆ యువకునికి ఎంతో ఆనందాన్ని చేకూరుస్తున్నాయి. పేట్యాలోను, నటాషాలోను వచ్చిన మార్పు చూచి అతనెంతో ఆశ్చర్యపడ్డాడు కూడా. కుర్రవాడికిప్పుడు పదహారేండ్లు. చక్కగా ఎదిగి వచ్చాడు. పొడుగ్గా ఉన్నాడు. ముఖంలో కాంతి. తెలివితేటలు కనిపిస్తున్నాయి. గొంతులో కూడా మార్పు వస్తోంది. నటాషాలో కనిపించిన మార్పు అతనికి మరింత ఆశ్చర్యం కలిగించింది. ఆశ్చర్యపడుతూ ఆమెను గమనిస్తున్నాడు అప్పుడప్పుడు నవ్వుతూ.

"నీలో ఎంత మార్పు వచ్చింది ! పూర్వం చూచిన వాళ్ళు నిన్ను అసలు గుర్తుపట్టలేరు" అంటున్నాడు.

"నేను మంచికి మారానంటావా ? లేక చెడ్డకు మారానంటావా ?" అని ఆమె అడుగుతోంది.

"మంచికే మారావు. ఎంత లేవి రాకుమారి !" అంటున్నా డతను.

"అవును. అవును" అంటోంది ఆమె.

ఆంద్రెడ్‌నోకు ఆంద్రూ రాకుమారుడు వచ్చినప్పటి నుంచీ తన చిన్న ప్రణయ గాధను నటాషా, నికోలస్‌కు చెప్పింది. తను వ్రాసిన కడపటి ఉత్తరం నికోలస్‌కు చూపిస్తూ.

"నీకు సంతోషంగా లేదా? నా కెంతో సంతోషంగాను, హాయిగాను ఉంది" అన్నది.

"ఇంతకంటె కావల్సిందేముంది ! అతను చాలా మంచివాడు. కాని నీవు నిజంగా అతన్ని ప్రేమిస్తున్నావా ?" అని అడిగాడు నికోలస్.

"నేనేం చెప్పను ? నేను పూర్వం బోరిస్‌ను ప్రేమించాను. సంగీతంమాస్టరు డెనిసోవ్‌ను ప్రేమించాను. కాని ఇది మాత్రం అలాంటి ప్రేమ కాదు. ఇప్పుడు హాయిగాను, సుఖంగాను ఉన్నాను. ఇప్పుడు నేలమీద నిల్చుని ఉన్నట్టుగా ఉంది. మనిషి ఎంత మంచివాడు కావడానికి వీలుందో అతనంత మంచివాడు... ఇప్పుడు నాకెంతో సుఖంగా ఉంది—ఇలాటి ప్రేమ నే నెన్నడూ ఎరగను"

పెళ్ళి ఆలస్యమవుతున్నందుకు తన కలవరాన్ని వెలిబుచ్చాడు నికోలస్. కాని నటాషా మాత్రం అది అలా జరక్క తప్పదనీ, తనే అందుకోసం ఒత్తిడి చేశాననీ, మామగారి అనుమతి లేకుండా అత్తగారింటికి వెళ్ళడం భావ్యం కాదని తనలా చేశాననీ చెప్పింది.

"నీకేం తెలియదులే" అన్నాడు నికోలస్. మరేమీ మాట్లాడలేదు.

తరువాత తరువాత ఆమె అనుమానించకుండా ఆమెను గమనిస్తూ వచ్చాడు. కాని ప్రియుడు దూరంలో ఉన్నప్పుడు ప్రేయసి పొందే ఆవేదన తాలూకు ఛాయలు ఆమెలో అతనికి ఏ మాత్రం కనిపించేవి కావు. ఆమె ఎంతో కులాసాగాను, హాయిగాను ఉండేది. ఆమె స్వభావంలో పెద్ద మార్పేమీ కనిపించడం లేదు.

ఒక రోజున అతనీ విషయాన్ని గురించి తల్లితో ప్రస్తావిస్తూ వుండగా ఆమె కూడా తనలాగే లోలోపల ఇలా అనుమాన పడడం గమనించి నికోలస్ ఆశ్చర్య పోయాడు. కూతుళ్ళ సుఖాన్ని గురించీ, వారి భవిష్యత్తును గురించీ మాట్లాడే తల్లి కంఠస్వరంతో ఆమె "చూడు" అంటూ చెప్పడం మొదలెట్టింది. "చూడు అతను డిసెంబరు వరకూ రాడట. ఇంతకాలం ఎందుకు రాడో మరి? అతను జబ్బుగా వుండి ఉంటాడు. అతని ఆరోగ్యం కూడా బాగాలేదు. కాని ఈ విషయం మాత్రం నటాషాతో చెప్పకు. అది సుఖంగా వుంటే అంతేచాలు, అది కన్నెవయస్సు హాయిగా గడుపుకుంటున్న కడపటి రోజులివి. అతని దగ్గరనుంచి ఉత్తరాలు వచ్చినప్పుడు దాని మనస్సు ఎలా ఉంటుందో నాకు తెలుసు. అయినప్పటికీ ఎవరు మాత్రం ఏం చెప్పగలరు? అతను చాలా మంచివాడు, ఉదారుడు. భగవంతుని దయ వల్ల అది అతనితో హాయిగా సుఖించవచ్చు" అని చెప్పిం దామె.

# 28

ఇటీవల కొద్ది రోజులనుంచీ నికోలస్ పరధ్యానంగా ఉంటూ ఉన్నాడు. ప్రతిక్షణం తల్లి కోర్కెలు నెరవేర్చడానికి ప్రయత్నించవలసి రావడం, వ్యవహారాలన్నీ చక్కదిద్దుక రావడం; అతని మనస్సును ఎంతగానో కలవర పరుస్తున్నాయి. అతను ఇంటికి వచ్చిన మరుసటి రోజునే అన్ని విషయాలూ ఒక్కమాటుగా పరిష్కరించి వేద్దామనుకున్నాడు. ఆ చేదు మందు ఒక్క గుక్కలో తాగి వేద్దామనుకున్నాడు. సరాసరి మిటెంకా ఉన్న గదిలోకి వెళ్ళి తాల్రిప్రశ్నలకేమీ

సమాధానం చెప్పకుండా అతన్ని లెక్కలన్నీ చూపించమని కోరాడు. అలా లెక్కలన్నీ చూపించమనడంలో తన ఉద్దేశ్యం ఏమిటో నికోలస్‌కు తెలియదు. అతనిలా అడగ్గానే గాబరాపడిన మిటెంకాకు కూడా దాని ఉద్దేశ్యం తెలీదు. అందు చేత అతను చెప్పిన సమాధానాలన్నీ కూడా చిందరవందరగాను కలగాపులగంగాను ఉన్నాయి. ముందు హాలులో వేచివున్న గ్రామోద్యోగులు కూడా భయంతోను-కాని ఒక విధమైన సంతృప్తితోను కౌంట్ పెద్దగొంతుతో కేకలువేస్తూ అతన్ని అరవడం విన్నారు.

"వెధవ! దొంగ; కుక్క! నిన్ను చంపేస్తాను..."

తరువాత చాలా సేపటికి అందరినీ గాభరాపరుస్తూ నికోలస్ బయటికి వచ్చాడు. అతని కళ్ళు ఎర్రగా ఉన్నాయి. ముఖం కోపంతో కందగడ్డలా అయింది. మిటెంకాను కాలరుపట్టుకుని బయటికి ఈడ్చుకుంటూ వస్తూ, అతన్ని కాళ్ళతో తన్నుతూ "వెళ్ళిపో వెధవ! వెళ్ళిపో! నాకు మళ్ళీ ముఖం చూపించకు" అని అరుస్తూ వున్నాడు.

ఇలా ముందుకు తోయబడిన మిటెంకా ఆరు మెట్లు క్రిందికి జారి ఒక పెద్ద పొదలో పడిపోయాడు. ఏదైనా తప్పుచేసినప్పుడు ఆ్రటెడ్నో ప్రజలు సాధారణంగా ఈ పొదల్లోనే దాక్కుంటూ వుంటారు. మిటెంకా కూడా పట్నానికి వెళ్ళి తాగివచ్చినప్పుడు ఇక్కడే దాక్కుంటూ వచ్చేవాడు. అతనికే కాక చాలామందికి ఇదే ఆశ్రయమైంది. మిటెంకా, అతని భార్య, చెల్లెలు భయపడిన ముఖాలతో తలుపు సగం తెరిచి చూచారు. సగంతెరిచిన తలుపులోనుంచి టీ కాస్తున్న పొగలు వస్తున్నాయి. పక్క కూడా కనిపిస్తోంది. అటునుంచి నికోలస్ నడిచి వెళ్ళటం వాళ్ళు చూచారు.

ఈ జరిగిన విషయాన్ని తీసుకెళ్ళి వెంటనే పరిచారికలు కౌంటెస్‌కు తెలియచేశారు. ఇలా జరిగింది కాబట్టి ఇక చిక్కులన్నీ తీరిపోయినట్టే అని నిశ్చయానికి వచ్చింది కౌంటెస్. అయినప్పటికీ ఆందోళనతో తన కొడుకు ఎలా ఉన్నాడో చూద్దామని అతని గది తలుపు దగ్గరికి మాటిమాటికీ వెళ్ళి చూచింది. అతను గదిలో కూచుని మెల్లగా పైప్ కాల్చుకుంటున్నాడు.

ఆ మరుసటి రోజు ఉదయాన తండ్రి "అబ్బాయ్! నీవొక విషయం తెలుసుకోవాలి. నీవు అనవసరంగా మిటెంకా మీద చెయ్యి చేసుకున్నావు. అతను నా కా విషయమంతా చెప్పాడు" అన్నాడు.

"అవును నాకు తెలుసు" అన్నాడు నికోలస్. "పిచ్చాసుపత్రిలా ఉన్న ఈ ఇంటిని ఒక్కమాటుగా సరిచేద్దా మనుకున్నాను" అన్నాడు.

"ఏడు వందల రూబుళ్ళు ఇవ్వనందుకు నీవు అతని మీద కోపపడ్డావు. కాని అవి మొత్తంలో కలిపి వున్నాయి...నీవు పుస్తకం పేజీ తిప్పిచూడలేదు." అన్నాడు తండ్రి.

"నాన్నా! నీకో విషయం చెపుతున్నాను. వాడు దొంగ, వెధవ! అందుకే అలా చేశాను. అయినప్పటికీ మీరు కోరితే ఇక ఎన్నడూ ఆ విషయం మీ ముందు తీసుకురాను." అన్నాడు నికోలస్.

"అది కాదబ్బాయ్ నేను చెపుతున్నది. ఆ విషయం మరోమాటు పరిశీలించి చూడమన్నాడు. నేను పెద్దవాడనై పోయాను..." అని ఆగిపోయాడు కౌంట్. తను కూడా వ్యవహారాలు సరిగా చూచుకోలేననీ, అందువల్లనే తను పిల్లల పట్ల తప్పులు చేశాననీ అవి ఇప్పుడు దిద్దుకోలేననీ ఆయనకూ తెలుసు.

"నాకా విషయాలు అంతగా తెలియవు నాన్నా. నేను మిమ్మలను విసుకెత్తించి ఉంటే, నన్ను క్షమించండి. ఈ లెక్కలూ, డొక్కలూ ఏమైతే మటుకు నాకేమిటి? నాకు తెలిసిందల్లా పేకాట లెక్కలే. ఏం చేయాలో తోచడం లేదు."ఇలా అనుకుని నికోలస్, ఇక ముందు తనే విషయాల్లోనూ జోక్యం కలిగించుకో కూడదని ఒట్టు పెట్టుకున్నాడు.

ఒకరోజు తల్లి, అన్నా మైఖలోవ్నా ఇస్తానన్న రెండువేల రూబుళ్ళ విషయంలో సలహా అడిగింది. కొన్నాళ్ళ క్రితం రెండువేల రూబుళ్ళు మైఖలోవ్నా ఆమెకు అప్పుగా ఇచ్చింది.

"ఉన్నమాట ఉన్నట్టుగా చెపుతున్నాను. నన్ను సలహా అడుగుతున్నావు కాబట్టి, నాకు అన్నా మైఖలోవ్నా అన్నా, బోరిస్ అన్నా ఇష్టం లేదని చెపుతున్నాను. కాని వారిని స్నేహితుల్లా చూచుకున్నాం. వారు పేదవారు, ఇంతకంటె చేయవలసింది కూడా ఏమీ లేదు..."అని చెప్పి నికోలస్, ఆ బిల్లు చింపి పారేశాడు. అందుకతని తల్లి ఎంతో ఆనందించింది. అప్పటి నుంచీ నికోలస్ మరే విషయాలూ పట్టించుకోవడం లేదు.

# 29

శిశిర వర్షాలతో తడిసిన భూమిపై తెల్లని తొలిమంచు సన్నని మంచు పొరలు పరిచింది. ఇది వేటకు అదునైన కాలం.

నికోలస్ వేట కుక్కలు బాగా తయారైన వైనప్పటికీ, ఇప్పటికే, ఎక్కువగా వేటకు వెళ్ళి ఉండడంవల్ల బాగా అలసిపోయి ఉన్నాయి. మూడురోజులు విశ్రాంతి తీసుకున్న తరువాత సెప్టెంబరు 16వ తారీఖున వేటకు వెళ్ళవచ్చని అంతా ఒప్పుకున్నారు.

14వ తారీఖున చలి ఎక్కువ కావడం మొదలుపెట్టింది. ఆ రోజంతా సన్నని మంచు కురిసింది. కాని సాయంత్రం అయ్యేసరికి గాలి కొంచెం పల్చబడింది. అందుచేత 16వ తారీఖు ఉదయాన నికోలస్ డ్రెస్సింగు గౌను వేసుకుని, వాతా

వరణం ఎలా ఉందా అని వాకిట్లోకి వచ్చి చూచాడు. గాలి అనుకూలంగా ఉంటే వేటకు బయలుదేరి వెడదా మనుకున్నాడు. పచ్చగా ఉన్న ఆకాశం మెల్లగా కరిగి ప్రవహించి క్రిందికి జాలువారు తున్నట్లుగావుంది. గాలి అల్లల్లాడడంలేదు· రాలుతున్న మంచు బిందువులు—కంటికి కనిపించనంత చిన్నచిన్న బిందువులు ఒక్క నిముషం పాటు ఆకులు లేని మొలకలపై పడి తళతళలాడి, తరువాత క్రిందికి జారి ఆకుల మీద పడి, ఒక ఆకుమీదనుంచి మరో ఆకు మీదికి జారిపోతున్నాయి. తోట పొలం నల్లగా మిలమిల లాడుతూ కొద్ది దూరం వెళ్ళేసరికి, మంచుతెరల్లో మాయమై పోతోంది. నికోలస్ ముందు వరండాలోకి వచ్చి చూచాడు. అక్కడంతా మంచు సోనలు వారుతూ తేమగా ఉంది. గాలి, శిశిర ఋతువులో వాడిపోతున్న అడవుల తాలూకు విచిత్ర పరిమళాన్ని మోసుకుని వస్తోంది. మిల్కా అనే ఆడకుక్క తన యజమాని రావడం చూడగానే కాళ్ళు ముందుకు చాచి మేల్కొన్నది. ఒక్క దూకులో ముందుకు వచ్చి అతని ముఖాన్ని మెల్లగా నాకింది. అప్పుడు మరో కుక్క తోటలో నుంచి పరుగెత్తుకుంటూ వచ్చి నికోలస్ వంటికి రాచుకున్నది,

అదే సమయంలో 'ఓహియో!' అని ఒక పెద్ద కేక వినిపించింది.అది వేట గాడు వేసిన కేక. ఆ కేక సన్నగా వినిపించింది. ఇంటిప్రక్కనుంచి వేటగాడు డేనిలో వచ్చాడు. అతని జుట్టు ఒత్తుగా కత్తిరించి ఉంది. చేతిలో మంచి పొడుగైన కమ్చీ ఉన్నది. అతని ముఖంలో దేన్ని చూచినప్పటికీ అసహ్యమే కనిపిస్తోంది. అలాటి చూపు వేటగాళ్ళకు మాత్రమే ఉంటుంది. అతను తన యజమానిని చూడ గానే టోపీ తీశాడు. నికోలస్ అతన్ని చూడగానే అతను తనకు తగిన వేటగాడని అనుకున్నాడు.

"ఏయ్ డేనిలో!" అని కేక వేశాడు నికోలస్. అతన్ని వేటకు సంబంధిం నిన ఆనందం ముంచెత్తింది. అది అతను వేటకు వెడుతున్న రోజు. కుక్కలను, వేటగాణ్ని చూడగానే,ప్రియురాలిముందు ప్రియుడిలాగా అతను అన్ని విషయాలూ మరిచిపోయాడు.

"ఏమిటి తమ ఉత్తర్వు దొరగారూ?" అని అడిగాడు వేటగాడు.

"ఈరోజు వేటకు తగిన రోజు కదూ?" అని అడిగాడు నికోలస్ మిల్కా చెవులు లాగుతూ.

"ఓవర్కా ఇవాళ ప్రొద్దున్నే వెళ్ళిపోయింది. అ్రెడనోవ్ దగ్గరి తోపులోకి వెళ్ళిపోయింది. అక్కడ దాని అరుపులు వినిపిస్తున్నాయి" అన్నాడు వేటగాడు.

దీని అర్థం అతను పట్టుకున్న ఒక ఆడ తోడేలు పిల్లలతో సహా తోపులోకి వెళ్ళిపోయిందని. ఆ తోపు ఊరికి దూరంగా ఉంది.

"మనం కూడా దాని వెంటనే వెడదాం. ఓవర్కాను తీసుకురావాలి. ఏమంటావ్?" అన్నాడు నికోలస్.

"అలాగే."

"ఆగు, వాటికేమీ తినడానికి పెట్టకు.

"అలాగే" అన్నాడు వేటగాడు.

అయిదు నిముషాల తరువాత దేనీలో, ఓవర్కాను పట్టుకుని గదిలోకి వచ్చాడు. చక్కగా సామాన్లతో అలంకరింపబడి ఉన్న ఆ గదిలో దేనీలో ఒక గుర్రం లాగానో, ఒక ఎలుగుబంటి లాంటివానో కనిపిస్తున్నాడు. అతనికి కూడా ఆ విషయం తెలుసు. అందుచేత తలుపు దగ్గరిగా నిల్చుని మెల్లగా మాట్లాడుతున్నాడు. అక్కడ తను ఏ వస్తువునైనా పడేసి పగులగొడతానేమో అనే భయంతో త్వరత్వరగా తాను చెప్పవలసినదంతా చెప్పి మళ్ళీ అవతలికి–గాలిలోకి, విశాలమైన ఆకాశం క్రిందికి ఎప్పుడు వెళ్ళిపోదామా అని ఆతురత పడుతున్నాడు.

నికోలస్ కూడా అతన్ని పదేపదే అడిగిన తరువాత వేటకు గుర్రాలు తీసుకు రమ్మని చెప్పాడు.

వేటగాళ్ళు వెడుతూ ఉండగా నటాషా అక్కడికి పరుగెత్తుకుని వచ్చింది. ఆమె జుట్టు దువ్వుకుని ముస్తాబై లేదు. తన నర్సు వేసుకునే పెద్ద శాలువా కప్పుకుని ఉంది.

"మీరు బయలుదేరుతున్నారని అన్నాను నేను. కాని సోనియా కాదన్నది. సరే, సుఖంగా వెళ్ళి రండి" అన్నది నటాషా.

"అవును" అన్నాడు నికోలస్. అతను తనతో పేట్యాను నటాషాను తీసుకుని వెళ్ళదలుచుకోలేదు. "మీ కీ వేట ఏం బాగుంటుంది?" అని అడిగాడు.

"కాదు మాకూ ఎంతో ఇష్టం. మాతో చెప్పకుండా నీవిలా వెళ్ళడం. నీవు చేస్తున్న పనేం బాగాలేదు" అన్నది నటాషా.

"మాకు అడ్డంకులనేవి లేవు. మేమూ నీతో వస్తున్నాం" అంటూ పేటియా కూడా తన అక్క వెనకాలే వచ్చాడు.

"అమ్మ మిమ్మల్ని పంపించదు. మీకు తెలుసుగా?" అన్నాడు నికోలస్ మళ్ళీ.

"ఏమైనా కానీ, నేనూ వస్తాను" అన్నది నటాషా. "దేనీలో! నా గుర్రాలను కూడా తయారు చెయ్యమని చెప్పు. నా వేట కుక్కలను కూడా తీసుకురమ్మని మైఖేల్‌తో చెప్పు" అని ఉత్తర్వచ్చింది నటాషా.

దేనీలో అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

# 30

వృద్ధకౌంట్ ఎప్పుడూ పెద్దఎత్తున వేటలు సాగిస్తున్నప్పటికీ కూడా అవన్నీ తన కొడుక్కు అప్పచెప్పినప్పటి నుంచీ తను వేటకు వెళ్ళడం మానేశాడు. అయినప్పటికీ సెప్టెంబరు 15వ తారీఖున ఎంతో కులాసాగా తను కూడా వారితో కలిశాడు.

వేటగాళ్ళు, గుర్రాలు ఇంటిముందు పోగయ్యారు. నికోలస్ తన పనులు తాను చూచుకుంటున్నాడు. అందుచేత నటాషా, పేట్యాలు చెపుతున్న మాటలు విని పించుకోవడం లేదు. వేటకు సంబంధించిన ఏర్పాట్లన్నీ తనే స్వయంగా చూచుకున్నాడు. వేటగాళ్ళను, కుక్కలను ముందు పంపించాడు. తను గుర్రం ఎక్కి తన కుక్కలను ఈలవేసి పిలుస్తూ పొలాల్లోంచి తోపువైపు సాగిపోయాడు. ఒక సేవకుడు మరో గుర్రం ఎక్కి అతని వెనకాలే వెళ్ళాడు.

యాభైనాలుగు వేటకుక్కలు, నలభై బూదిరంగు వేటకుక్కలు, మరెన్నో కుక్కలు, ఆరుగురు వేటగాళ్ళు, వందమంది కాపలాదారులు, ముప్పయి కుక్కలతో సహా, ఇరవైమంది గుర్రపు రౌతులతో సహా ఒక్కమాటుగా వేటకు బయలుదేరారు. ప్రతి కుక్కకూ ఎవరి మాట వినాలో తెలుసు. అతని పేరు పిలిస్తే మారు పలికేవి. ప్రతి మనిషికీ తన పని తనకు తెలుసు. వారందరూ తోపు దాటిన తరువాత మెల్లగా రహదారిపై అడుగుపెట్టారు. కొంతసేపు రహదారిపై ప్రయాణం సాగించిన తరువాత బురదగా ఉన్న పొలాల్లోగుండా వెడుతున్నారు. మంచు మెల్లగా రాలుతోంది. మధ్య మధ్యలో ఒక వేటగాని ఈల నిశ్చలంగా ఉన్న గాలిలో వినిపిస్తోంది. గుర్రాల సకిలింపులు, కుక్కలు పరుగెత్తడం వినిపిస్తున్నాయి, ఇలా ఈ గుంపంతా సగం దూరం వెళ్ళిందో లేదో హఠాత్తుగా మరో అయిదారుగురు ఆశ్వికులు మంచులోంచి బయటికి రోస్టోవ్‌లను కలిశారు. వారికి ముందుగా ఒక చక్కని వృద్ధుడు కూచుని ఉన్నాడు.

"అభివందనాలు మామయ్యా" అన్నాడు నికోలస్.

"మంచిది. ముందుకు సాగండి" అన్నాడా క్రొత్తవ్యక్తి. అతను ఆ ప్రక్క గ్రామంలో ఒక చిన్న భూస్వామి. రోస్టోవ్‌లకు దూరపుచుట్టం. "నాకు తెలుసు, మీరు తప్పకుండా వస్తారని. ఇది వేటకు మంచి సమయం. ఇక పదండి త్వరగా అడవిలోకి వెళ్ళాలి. ఇప్పటికే ఇలాగైన్‌లు వేటకు వెళ్ళారట. మనం ముందుగా వెళ్ళకపోతే వాళ్ళు అన్నీ తీసుకుని వెళ్ళిపోతారు" అన్నాడు.

"నేను సరాసరి అక్కడికే వెడుతున్నాను. మన సామానులన్నీ కలిపి తెద్దామా?"

ఉత్తర్వు అందజేశారు.... ఇద్దరూ పక్క పక్కనే వెళ్ళడం మొదలు పెట్టారు.

నటాషా నిండా ముసుగు కప్పుకుని త్వరలో వారిని వచ్చి కలిసింది. ముసుగు లోంచి ఆమె ముఖం, మిలమిల మెరుస్తున్న కళ్ళు తప్ప మరేమీ కనిపించడం లేదు. ఆమె వెనకాలే పేట్యా, వారి సేవకుడు మిశేలియో కూడా వచ్చారు. పేట్యా మాటిమాటికి అర్థం లేకుండా నవ్వుతూ తన కమ్చీతో గుర్రాన్ని తోలుతూ ఉన్నాడు. నటాషా అందంగాను, చక్కగాను జీనుపై కూచుని తన గుర్రాన్ని ఎంతో నేర్పుతో నడుపుతోంది.

చిన్ని మామయ్యకూడా వారెందుకు వేటకు వస్తున్నారా అని ఆ చిన్నపిల్లల వంక చూస్తున్నాడు. "అభివందనాలు చిన్న మామయ్యా! మేం కూడా వేటకు వస్తున్నాం" అన్నాడు పేట్యా.

"మంచిది, మంచిది" అన్నాడు వృద్ధుడు.

"నికోలస్! ట్రౌనీలా ఎంత మంచి కుక్క! నన్ను చూడగానే తెలుసుకుంది" అన్నది నటాషా తన ప్రియమైన పెంపుడుకుక్కను ఈలవేసి పిలుస్తూ. "మొదటి విషయం ట్రౌనీలా వట్టి కుక్క కాదు. వేటకుక్క" అన్నాడు నికోలస్ తన చెల్లెలిపట్ల తనకున్న ఆధిక్యతను, ఆమెకూ తనకూ ఉన్న అంతరాన్ని తెలియ చేస్తూ.

ఆమె అర్థం చేసుకున్నది.

"మేం మీతోపాటు రాము. చిన్నమామయ్యా! మేము మీకు అడ్డు రాంలే, మేం ఉన్నచోటే ఉంటాం" అన్నది నటాషా.

"అంతకంటె మంచి పనిలేదు చిన్ని కౌంటెస్. కాని గుర్రం మీదనుంచి పడకుండా జాగ్రత్తపడండి. అలా పడితే మిమ్ములనెవరూ లేవనెత్తరు" అన్నాడు వృద్ధుడు.

ఈపాటికి వారు తోపుకు రెండువందల గజాల దూరంలోకి వచ్చారు. నికోలస్, చిన్నిమామయ్య ఏ వైపునుంచి వేట ప్రారంభించాలా అని ఆలోచించి నిశ్చయించుకుని నికోలస్ నటాషాకు ఆమె ఎక్కడ నిల్చోవాలో చూపించాడు.

"అల్లుడా! జాగ్రత్తగా ఉండు. ఆ వెడుతున్నది తల్లి. పట్టు తప్పిపోనివ్వకు" అన్నాడు వృద్ధుడు.

"చూద్దాంగా" అంటూ నికోలస్ "కేరీ" అని కుక్కను పిలిచాడు. ఆ కుక్క ముసలిదైనప్పటికీ ఒంటిగానే ఆడతోడేలును వెంటాడగలదు.

తన అనుభవాన్ని బట్టి వృద్ధ కౌంట్‌కు తన కొడుకు ఏ విధమైన వేటగాడో తనకు తెలుసు. అందుచేత ఆయన కూడా త్వరగా వచ్చి పార్టీలో కలిశాడు. అందరూ వచ్చి ఎవరి స్థానాల్లో వారు ఉన్నారో లేదో బండి వచ్చి చదునుగా ఉన్న నేలమీద

ఆయన ముందుగా నిల్చుంది. కౌంట్ తనకోసం ముందుగా ప్రత్యేకింపబడిన స్థలంలో వెళ్ళి కూచున్నాడు. ఆయన ముఖంలో ఎంతో ఉత్సాహం కనిపిస్తోంది. ఉన్ని కోటు వేసుకున్నాడు. తరువాత తన గుర్రాన్ని ఎక్కి బండివానితో గుర్రపుబగ్గీని ఇంటికి తీసుకెళ్ళమని చెప్పాడు. ఆయనకు వేటలో అంత అభినివేశం లేదు. కాని వేటకు సంబంధించిన సూత్రాలన్నీ తూచ తప్పకుండా అనుసరిస్తాడు. ఏర్పాట్లన్నీ పూర్తి చేసుకుని తన గుర్రంమీద ఎక్కి కూచున్న తరువాత ఒకమాటు చిరునవ్వు నవ్వుతూ తన చుట్టూ కలయచూచాడు....

ఆయన ప్రక్కనే ఆయన సేవకుడు శమన్‌షేక్‌మార్ ఉన్నాడు. అతను మంచి ఆశ్వికుడు, కాని పండుముసలి. మూడు వేటకుక్కలను కలిపిపట్టుకుని ఉన్నాడు.

శమన్‌షేక్‌మార్ సన్నగా ఉంటాడు. లోతుగా ఉన్న బుగ్గలు. అతను కూడా చక్కగా గుర్రంమీద కూచుని తన యజమాని వంక చూస్తున్నాడు. గత ముప్ఫయి సంవత్సరాల నుంచీ వారిద్దరూ ఎప్పుడూ ఒకరిని విడిచిపెట్టి ఒకరు వుండలేదు. యజమాని హాయిగా ఉండటం చూచి సేవకుడు ఆయనతో మాట్లాడడం మొదలు పెట్టాడు. ఈలోగా మరో వ్యక్తి గుర్రంపై అక్కడికి వచ్చాడు. అతను వృద్ధుడు. తెల్లగా నెరసిపోయిన గెడ్డం. స్త్రీలు వేసుకునే ఓణీ వేసుకుని ఉన్నాడు. మెల్లగా అక్కడికి వచ్చి కౌంట్‌కు కొద్ది దూరంలో నిలిచిపోయాడు.

"ఏం నాస్టాషియా ఇవనోవ్‌నా—నాస్టాషియా ప్రక్క గ్రామంలోని ఒక హాస్యగాడు. నీవేం చేస్తున్నావో తెలుసా? నీవు నా గుర్రానికి ఏ మాత్రం ఆటంకం కలిగించినా డేనీలో నీకు సమాధానం చెప్పవలసి వుంటుంది" అన్నాడు మెల్లగా. అతనివంక చూచి కళ్ళార్పాడు. "నేను మాత్రం ఊరిక కూచున్నాననుకుంటు న్నారా?" అన్నాడు నాస్టాషియా ఇవనోవ్‌నా.

"మాట్లాడకు, మాట్లాడకు" అన్నాడు కౌంట్. తరువాత శమన్‌వంక చూచి "నీవు నటాషాను చూచావా? ఎక్కడుంది?" అని అడిగాడు.

"ఆమె అన్నతోపాటు యారో ప్రక్కన వున్న పొద దగ్గర వుంది. చిన్న పిల్లలు వుండదగిన చోటే అది!" అన్నాడు శమన్.

"ఆమె గుర్రం ఎక్కితే చక్కగా లేదూ సెమన్? ఆమె ఎంత చక్కగా గుర్రపు స్వారీ చేస్తుంది!"

"నిజమే అద్భుతంగా వుంది. ఆమెకు దేన్నిచూచినా భయమేలేదు. గుర్రం మీద ఎంతచక్కగా కూచున్నదనుకున్నారు!"

"నికోలస్ ఎక్కడున్నాడు?"

"లియడోవ్‌ను దాటి పోయాడు. ఏ మాత్రం భయపడడు. ఎక్కడ వేట బాగా జరుగుతుందో అతనికి తెలుసు. ఎంత చక్కగా స్వారీ చేస్తాడు! నేనూ డేనీలో

కూడా ఒక్కొక్కమాటు ఆయన్ను చూచి ఆశ్చర్యపోతుంటాం" అన్నాడు శమన్ తన యజమానిని చూచి పొగుడుతూ.

"గుర్రపు స్వారీ బాగా చేస్తాడు కదూ?" అని అడిగాడు మళ్ళీ కౌంట్.

"చూచి తీరాలి! మొన్నమటుకు మొన్న జవర్జెయిన్ లోయలో అతను గుర్రం ఎక్కి నక్కను వేటాడు తోంటే చూడడానికి కళ్ళు చాలలేదు. వెయ్యి రూబుళ్ళు ఖరీదు చేసే ఆ గుర్రాన్ని ఎంత చక్కగా పరుగెత్తించాడనుకున్నారు! కాని గుర్రపు రౌతు ఖరీదు ఎవరు చెప్పగలరు ? అప్పుడాయన ఎంత చక్కగా ఉన్నాడను కున్నారు! ఆయనకు తగిన పెళ్ళికుమార్తె దొరకడానికి నిజంగా చాలా రోజులు పడుతుంది.

"అవును నిజమే." అంటూ కౌంట్, తన ఉన్నికోటు జేబులు తడుము కోవడం మొదలుపెట్టాడు.

"తరువాత — ఆ మరుసటిరోజు ఉంది చూచారూ?" అంటూ శమన్ మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

తన మాటలు యజమానిని ఎంత ఆనంద పరుస్తున్నాయో అతను గ్రహించాడు. "చర్చినుంచి బయటికి రాగానే ఆయన్ను మైఖేల్సి డొరొవిచ్ కలుసుకున్నాడు..." ఇలా చెపుతూ శమన్ మధ్యలో ఆగిపోయాడు. అందరూ త్వరగా పరుగెత్తడం, కుక్కలు అరవడం అతనికి వినిపించింది. అతను తలవంచి కౌంట్‌ను మాట్లాడవద్దని మెల్లగా సైగచేశాడు.

"వాడప్పుడే ఆరా తీశాడు. లియడోవ్ వైపుకు పరుగెత్తుతున్నారు" అన్నాడు.

శమన్ చెప్పిన కడపటి మాటలకు చిరునవ్వు నవ్వుతూ ఇంకా అలాగే కూచున్నాడు కౌంట్. ఆయన చేతిలోని నశ్యం డబ్బా అలాగే ఉంది. అటువైపే చూస్తూ ఒక చిటికెడు నస్యం పీల్చడం కూడా మరిచిపోయాడు. డేనిలో ఊదిన బూరా వినిపించింది. తోడేలు కనిపించిందని ఆ బూరా వారికి హెచ్చరిక చేసింది. ముందుగా మూడు వేట కుక్కలు వెడుతూ ఉండగా అందరూ వాటివెంట వెళ్ళారు. తోడేలు కనిపించినట్లు ఇప్పుడందరూ సైగలు చేసుకుంటున్నారు. ఇప్పుడంతా ఉత్సాహంగా ఉన్నారు. అన్ని గొంతుకల్లోకి డేనీలో గొంతుక మరింత దగ్గరగా వినిపిస్తోంది. అడవి నిండా అరుపుల ధ్వనులే.

కౌంట్, అతని సేవకుడు ఆ వేట కుక్కల గుంపు రెండు భాగాలు కావడం గమనించారు. ఒక భాగం అరుస్తూ ముందుకు వెడుతోంది. అడవిలో ఉన్న చోటు నుంచి కొద్ది అడుగులు ముందుకు వెడుతోంది. ఆ చప్పుడువల్ల వేట ఆవలి వైపుగా సాగుతూ ఉన్నదని తెలుస్తుంది. శమన్ నిశ్వసించి ఒక వేట కుక్కను తన జట్టు

లోనుంచి వదలిపెట్టాడు. కౌంట్ కూడా నిశ్వసించి మళ్ళీ తన నశ్యం డబ్బీవిషయం జ్ఞాపకంవచ్చి డబ్బీ తెరిచి ఒక చిటికెడు నశ్యం పీల్చాడు.

"వెనకాలే ఉండు" అని అరిచాడు శమన్, ముందుకు వెడుతున్న ఒక వేట కుక్కను అదిలిస్తూ.

కౌంట్ ఉలికి పడ్డాడు. ఆయన చేతిలో ఉన్న నశ్యం డబ్బా చేతిలో నుంచి జారి క్రింద పడింది.

హఠాత్తుగా, సహజంగా ఇలాంటి సందర్భాల్లో జరిగే విధంగా వేటగాళ్ళ జట్టు వారి వైపునకే వస్తోంది. వారి అరుపులు, కేకలు తమకు దగ్గరలోనే వినవస్తున్నాయి.

కౌంట్ కుడివైపుకు చూచాడు. మిట్కా కనిపించాడు. అతని కళ్ళు ముందుకు ఊడిపడేటట్లుగా ఉన్నాయి. ఎదురుగా ఉన్నవైపుకు చూడమని సైగ చేస్తున్నాడు. "అటు చూడండి!" అని కేకవేశాడు. కుక్కలను వదిలిపెట్టి వౌడు తీస్తూ వెళ్ళాడు.

కౌంట్, శమన్ అడవిలోనుంచి బయటికి పరుగెత్తుతూ వచ్చారు. వారి ఎడమ వైపునుంచి ఒక తోడేలు మెల్లగా దూకుతూ తొందరపడుతున్నట్టు కనిపించడంలేదు. వేట కుక్కలు దాని త్రోవకు అడ్డు తగిలాయి.

అది అక్కడ ఆగిపోయింది. ఒకమాటు ఆ కుక్కలవంక చూచింది. జబ్బుతో బాధపడుతున్న మనిషిలాగా చూచింది. తరువాత తోక ఆడించుకుంటూ రెండు దూకుళ్ళలో ప్రక్కనున్న పొదలోకి వెళ్ళి మాయమైంది. అదే క్షణంలో తోపు ఎదురువైపునుంచి ఒక కుక్క వచ్చింది. దాని వెంటనే మరోకుక్క వచ్చింది. తరువాత కుక్కలన్నీ గాభరాగా వచ్చి అక్కడ గుంపులుగా చేరాయి. డేనిలో గుర్రం కూడా నోటివెంట నురుగులు కక్కుతూ పోకచెట్ల మధ్యనుంచి దోవ చేసుకుంటూ వచ్చింది.రౌతు తలవంచి చెమటలు కారుతోన్న ముఖంతో కుక్కలనన్నిటినీ ఒకచోట చేర్చడానికి కేకలు వేస్తున్నాడు. కౌంట్‌ను చూడగానే అతని కళ్ళు ఎరుపెక్కాయి. "ఇలాంటి వేటగాళ్ళు ఆటనంతా పాడుచేస్తారు!" అన్నాడు అతను.

అతని వాలకం చూచి కౌంట్ భయపడ్డాడు. డేనిలో ఎత్తిన కొరడా దెబ్బ గుర్రానికి తగిలింది. గుర్రం వేటకుక్కలతో కలిసి చెట్లలో మాయమైపోయింది. కౌంట్ ఈ సాహసానికి చిరునవ్వు నవ్వి, ఏం చేయాలో తోచక శమన్ వంక జాలిగా చూచాడు. కాని శమన్ అక్కడ లేడు. అతను తోపులోకి వెడుతూవస్తూ, తోడేలును మళ్ళీ బయటికి రప్పించడానికి ప్రయత్నిస్తూ ఉన్నాడు. వేటకుక్కలు కూడా అటూ ఇటూ పరుగులు తీస్తున్నాయి. కాని తోడేలు మాత్రం ఎలాగో తప్పించుకుని పోయి తన గుంపులో కలిసింది.

# 31

నికోలస్ ప్రతి నిముషం తోడేలుకోసం ఎదురు చూస్తున్నాడు. కదలకుండా ఉన్నచోటే ఉన్నాడు. ఒకసాటు దగ్గరలోను మరోసాటు దూరంలోను దాని అరుపు వినవస్తోంది. వేటకుక్కల అరుపులు వివిధ రకాలుగా వినిపిస్తున్నాయి. అన్నివైపులా అరుపులూ, కేకలూ వినిపిస్తున్నాయి దాన్నిబట్టి అతను ఏం జరుగుతున్నదో ఊహించుకో గలిగాడు. తను గెలుపొందాలని భగవంతుణ్ణి కూడా ప్రార్థించుకోవడం మొదలు పెట్టాడు.

"ఈ ఒక్క వరాన్ని నాకు ఇవ్వు. ఆ రెండు తోడేళ్ళలో ఒక్కటైనా నాతోవకు అడ్డు వచ్చేటట్టు చెయ్యి. నా వేటకుక్క కేరీ దాని గొంతు పట్టుకుని నా దగ్గరికి లాక్కొస్తుంది. చిన్ని మామయ్య కూడా కళ్ళారా చూడగలుగుతాడు." అని ప్రార్థించుకోసాగాడు. ఈ అరగంటలోనూ అతనుపడ్డ ఆదుర్దా ఇంతా అంతా అని చెప్పడానికి వీల్లేదు. తన ముందున్న ప్రతి బాటనూ ఎంతో జాగ్రత్తగా పరిశీలించి చూచాడు. తోపులో ప్రతి అంగుళాన్ని కొలిచి చూచాడు. రెండు పెద్ద ఓక్ చెట్ల ప్రక్క తోపులోనుంచి కనిపిస్తున్నాయి. నీటి వరవడికి కోసుకుపోయిన ఒడ్డుకట్టలతో లోయ కనిపిస్తూ ఉంది.

"ఎప్పుడూ ఇంతేనా ? యుద్ధంలోనూ ఆటలోనూ కూడా ! నేను ఒక్క పెద్ద తోడేలునైనా చంపకూడదా ?" అనుకున్నాడు నికోలస్ తనలో.

తన కళ్ళను తనే నమ్మలేక పోయాడు. ఆ వస్తున్నది తోడేలే. ఏ మాత్రం సందేహం లేదు. ఒక ముసలి తోడేలు మెల్లగా అడుగులు వేస్తూ వస్తోంది.

నికోలస్ ఊపిరి బిగపట్టుకుని తన కుక్కల వంక చూచాడు. కొన్ని పడుకుని ఉన్నాయి. కొన్ని నిల్చునిఉన్నాయి. కాని కేరీతో సహా ఏ కుక్క కూడా తోడేలు రావడం చూడలేదు. కేరీ తన తల వెనక్కు మళ్ళించి అరమూతల కళ్ళతో దవుడలు ఆడిస్తూ వెనక కాలి దగ్గర మూగిన ఈగలను తోలుకుంటూ ఉంది. "కుక్కల్లారా లేవండి. తోడేలు వచ్చింది !" అన్నాడు నికోలస్ మెల్లని గొంతుకతో.

కుక్కలు చెవులు నిక్కించాయి. కేరీ తన వెదుకులాటను ఆపివేసి ఉలికిపడి లేచి తోక ఆడిస్తూ నిలుచుంది.

'కుక్కలను విడిచిపెట్టనా ?' అనుకున్నాడు నికోలస్ తనలో తాను.

తోడేలు పొదదాటి ఏ మాత్రం అనుమానం లేకుండా ముందుకు వస్తోంది. అతను ముందుకు వెళ్ళేవాడల్లా హఠాత్తుగా అక్కడే ఆగిపోయాడు.

"అదిగో తోడేలు ! అటువైపు !" అని కేకవేశాడు నికోలస్. అతని కేక

ఒక శరంలాగా ఆతోడేలు వెనకాలే ఆ పొదల్లోకి దూసుకుని పోయింది. వేట కుక్కలు మెరుపు తీగల్లాగా వెంటనే దానివెంట పడ్డాయి. నికోలస్ మరేం చెయ్యాలో తోచక పెద్ద వేగంతో దౌడు తీస్తున్నాడు. అతనికి తనముందు పరుగెత్తుతున్న తోడేలు తప్ప మరేమీ కనిపించడం లేదు. ఆ తోడేలు అటూఇటూ చూడకుండా మరింత వేగంతో బొరియలో దూరడానికి సరాసరి పరుగెత్తుతోంది. మిల్కా అనే పెద్ద వేట కుక్క దానికంటె ముందుగా పరుగెత్తింది. సరిగా దగ్గరికి వెళ్ళి దాన్ని పట్టుకో బోయేలోగా అది ఒక ప్రక్కకు తిరిగి చూడగా మిల్కా దానిమెడ పట్టుకోవడానికి మారుగా దాన్ని తోకదగ్గర పట్టుకుంది.

"అదిగో తోడేలు ! అటు పరుగెత్తండి !" అని మళ్ళీ కేకవేశాడు నికోలస్. లుయుబైెన్ అనే పెద్ద బొచ్చుకుక్క మిల్కా వెనకాలే పరుగెత్తుతూ తోడేలు వీపును పట్టుకుని మళ్ళీ వెనక్కు తగ్గింది. తోడేలు ఒక క్షణంపాటు ముడుచుకుని పళ్ళు చూపించి మళ్ళీ పరుగెత్తసాగింది. దానికీ దాని వెనకాల పరుగెత్తుతున్న వేటకుక్కలకూ మధ్య ఒక్క రెండు అడుగుల దూరం మాత్రమే ఉంది.

కేరీ ముసలిదైనప్పటికి తన శక్తి చాలినంత వరకు దేహాన్నంతా చాచి ఆ జంతువు వెంటనే—ప్రక్క ప్రక్కనే పరుగెత్తుతోంది. దాని కంటె ముందు పరుగెత్తి ముందునుంచి దానికి అడ్డుతగలాలని ప్రయత్నిస్తోంది. కాని నికోలస్ మాత్రం, ఆ తోడేలు మెరుపు తీగలా పరుగు దీయడంవల్ల, కుక్క దానిని అందుకోలేక పోయి నందువల్ల, అది పట్టుబడదనీ ఈ ప్రయత్నం విఫల మవుతుందనీ అనుకున్నాడు. కుక్కలకూ, పొదకూ ఉన్న దూరం రానురాను దగ్గర పడుతున్నందువల్ల తోడేలు తప్పించుకు పోతుందేమో అనుకున్నాడు. కాని ఒక్క క్షణంలో మళ్ళీ అతనికి ఆశ కలిగింది. తోడేలుకు దూరంగా అవతలివైపునుంచి ఒక వేటగాడు, అనేక కుక్కలు దగ్గరికి రావడం అతను చూచాడు. తనకు తెలియని ఒక నల్లరంగు వేటకుక్క తోడేలు మీదపడీ దాన్ని క్రింద పడేసింది. కాని మళ్ళీ ఇంతలో అదిలేచి నిలుచుని కుక్కను ఎదుర్కొని దాన్ని కరవసాగింది. కుక్క ఏం చేయాలో తోచక పక్కల్లో తగిలిన దెబ్బలవల్ల తలవంచి అరవ సాగింది.

"కేరీ ! త్వరగా వెళ్ళు," అని అరిచాడు నికోలస్.

ముసలి కేరీవల్ల కొత్త ప్రమాదం వస్తుందని ఊహించిన తోడేలు దానితోవకు అడ్డుతగిలి తోక ముడుచుకుని పెద్ద వేగంతో పరుగెత్తసాగింది. కాని ఆశ్చర్యం ఏమిటంటే - కేరీ దాని వీపుమీద దూకి దాని గొంతు పట్టుకుంది. తరువాత తోడేలు, కుక్క ఒకదాన్ని ఒకటి కరుచుకుని ప్రక్కనున్న గుంటలో దొర్లసాగాయి.

వేటకుక్కల గుంపంతా వాటిమీదికి పరుగు తీసింది. ఎన్నో వేటకుక్కల [illegible]్య ఆ తోడేలు ఆ గుంటలోపడి వాటితో పోరాడుతోంది. మధ్యమధ్యలో దాని [illegible], తన్నుకుంటున్న దాని వెనకాలి కాలు, దాని చెవులు మాత్రమే కనిపిస్తు

న్నాయి. ఇలాటి దృశ్యాన్ని నికోలస్ ఎన్నడూ చూడలేదు. ఈ దృశ్యం అతని కెంతో ఆనందం కలిగించింది. అతను జీనుపై చెయ్యి ఉంచి దాన్ని ఆఖరు చెయ్యడం కోసం గుర్రం దిగబోయాడు. కాని ఇంతలో అది కుక్కలపైగా తల ఆడిస్తూ తన వెనకాలి కాళ్ళతో లేచి నిలుచుంది, తరువాత పళ్ళు చూపించి, తోక ఆడిస్తూ ఒక్క క్షణంలో—ఒక్క దూకులో పరుగెత్తి వెళ్ళింది. కేరీకి గాయాలు తగిలాయి. మెల్లగా ప్రాకుకుంటూ ఆ గుంటలోనుంచి బయటికి వస్తోంది.

"అయ్యో !" అనుకున్నాడు నికోలస్.

అదృష్టవశాత్తూ అతని చిన్న మావయ్య తన కుక్కలతో సహా తోడేలు వెంట పరుగుతీయ సాగాడు.

మళ్ళీ ఆ తోడేలు చుట్టూ అందరూ చేరారు. నికోలస్, అతని సేవకుడు. చిన్ని మామయ్య, అతని వేటగాడు; వీరంతా దాని చుట్టూ చేరి కుక్కలను "అదిగో తోడేలు ! అటు వెళ్ళండి." అని అదిలిస్తున్నారు. తోడేలు పొదవైపుకు పరుగెత్తుతూ ఉంది. అది ప్రాణం కాపాడుకోవాలంటే ఆ పొద ఒక్కటే దానికి గత్యంతరం.

ఈ సమయంలో డేనీలో, తోపులోనుంచి బయటికి వచ్చాడు. తోడేలు చిక్కిందనే అనుకున్నాడు. కాని అది తప్పించుకొని పోవడం చూచి అతను పొద వైపు తన గుర్రాన్ని దౌడు తీయించాడు. చిన్ని మామయ్య వేటకుక్కలు కూడా అటువైపుకే పరుగెత్తు తున్నాయి. డేనీలో ఒక్కమాట కూడా మాట్లాడకుండా గుర్రాన్ని అదిలిస్తూ పరుగు తీయిస్తున్నాడు. నికోలస్‌ను దాటేసి పరుగెత్తి వెళ్ళాడు. హఠాత్తుగా నికోలస్ కెవరో క్రింద పడిపోవడం వినిపించింది. అది డేనీలోయే. అతను తోడేలు మీద దూకి దాని చెవులు పట్టుకున్నాడు. ఇది ఆఖరు అని అందరికీ తెలుసు. ఆ విషయం తోడేలుకు కూడా తెలుసు. ఒక్కమాటు అది పట్టు వదిలించు కోవడానికి ప్రయత్నించింది. కాని వేటకుక్కలు గట్టిగా పట్టుకున్నాయి. నికోలస్ రొప్పుతున్న ఆ జంతువును పొడవడానికి దగ్గరికి వెళ్ళాడు.

"అవసరంలేదు. దాని నోటికి ఏదన్నా అందిద్దాం" అన్నాడు డేనీలో. తరువాత అతను దాని గొంతుమీద కాలువేసి ఒక చిన్న కొయ్యను దాని నోట్లో దూర్చాడు. తరువాత దాని కాళ్ళు కట్టేసి మోసుకుని వెళ్ళారు.

ఇప్పటికి అందరూ అలిసిపోయారు. కాని వేటలో గెలిచారు. అందరూ కలిసి తోడేలును డేనీలో గుర్రానికి కట్టేశారు. గుర్రం భయంతోను, కలవరంతోను వణికి పోతోంది. వేటగాళ్ళంతా పోగయ్యే చోటుకు దాన్ని తీసుకొని వెళ్ళారు. వెనకాతే కుక్కలన్నీ వస్తున్నాయి. అక్కడికి తీసుకువెళ్ళిన తరువాత అంతా దాన్ని చూడ టానికి పోగైనారు. దవుడల మధ్య కొయ్యపెట్టి ఉండడంవల్ల ఆ తోడేలు బరువుగా

తలదించుకొని ఉంది. అది తన గాజు కళ్ళతో అక్కడ మూగిన జనం వంక, కుక్కలవంక చూస్తోంది. దాని వంటిని ఎక్కడ తాకినా అది వణికిపోతోంది. కౌంట్ ఇలియా ఆంద్రేవిచ్ అందరితోటు దాని దగ్గరికి వచ్చి "అరె! చాలా ముసలిదే కదూ?" అన్నాడు డేనీలోతో.

"అవును, చాలా ముసలిదే." అన్నాడు డేనీలో, సగౌరవంగా తన టోపీ తీస్తూ.

"ఇంతకు ముందు నీ వెంత కోపంలో ఉన్నావో నీకు తెలుసా?"

డేనీలో జవాబు చెప్పలేదు. చిరునవ్వు నవ్వి సిగ్గుపడిన పసిపిల్లవాడిలాగా ఊరుకున్నాడు.

# 32

వృద్ధకౌంట్ మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చాడు. నటాషా, పేట్యా అతని వెన కాలే వస్తామని చెప్పారు. ఇంకా బాగా పొద్దెక్కలేదు. అందుచేత వారు మరి కొంత దూరం కులాసాగా స్వారి చేయడానికి నిశ్చయించుకున్నారు. రెండు కుక్కలను ఒక తోవలోకి పంపించారు. నికోలస్ అందరూ తనకు కనిపించేటటువంటి స్థానంలో నిలుచున్నాడు. అతను వేటాడవలసిన జంతువు అతని కెదురుగా ఒక గుంటలో పోకచెట్ల చాటున దాగివుంది. వారు పిలిచారో లేదో వారి వేట కుక్కలు కనుచూపు దాటిపోయాయి. కొద్దిసేపట్లో ఆ ఎదురుగా ఉన్న లోవలో కుక్కల అరుపులు విని పించాయి.

కుక్కలగుంపు ఆ బయలులోకి పరుగెత్తుకుంటూ వెళ్ళింది. నికోలస్, నక్కను కనిపెట్టి చూస్తూ వేటగాళ్ళు ఎర్రని టోపీలతో ఎదురుగా స్వారీచేస్తూ వెళ్ళడం గమ నించాడు. అతని సేవకుడు కుక్కలను వదిలిపెట్టాడో లేదో, ఒక ఎర్రని కుక్క— విచిత్రమైనది పరుగెత్తుకుంటూ వచ్చింది. కుక్కల గుంపు ఒక్క క్షణంలో దాన్ని చుట్టుముట్టాయి. కుంచె తోకతో నేలమీద ఈడ్చుకుంటూ ఆ నక్క చుట్టూ తిరి గింది. అప్పుడొక తెల్లని కుక్క, తరువాత ఒక నల్లని కుక్క, పిమ్మట కుక్కలన్నీ కలిసి దాన్ని పట్టుకున్నాయి. కుక్కలన్నీకూడా దాని చుట్టూ గుంపుగా చేరి, ఒక వర్తులంగా ఏర్పడ్డాయి. కాని అతను వాటి కదలికలను సరిగా గమనించలేకపోయాడు. ఇద్దరు వేటగాళ్ళు—ఎర్రని టోపీ వేసుకున్న వాడొకడు, పచ్చని కోటు వేసుకున్న వాడొకడు కలిసి దాని దగ్గరికి వెళ్ళారు.

"ఏమిటిదంతా? ఈ విచిత్రమైన వేటగాడు ఎక్కడనుంచి వచ్చాడు ? నా చిన్ని మామయ్య వేటగాడు కాదే!" అనుకున్నాడు నికోలస్.

వేటగాళ్ళు నక్కను పట్టుకున్నారు. కాని దూరంనుంచి చూస్తున్న అతని

దృష్టికి వారింకా చుట్టుగా నిల్చుని ఉన్నట్టే కనిపిస్తున్నది. కొన్ని కుక్కలు పడు కొని ఉన్నాయి. వేటగాళ్ళు ఏవో సైగలు చేసుకుంటున్నారు. సరిగ్గా ఆ సమ యంలో ఒక తగాదా బయలుదేరిందని సూచిస్తూ ఒక కూత వినిపించింది.

"ఇలాగైన్ వేటగాళ్ళలో ఒకడు ఇవాన్‌తో పోట్లాడుతున్నాడు." అని సేవ కుడు చెప్పాడు

నికోలస్ నటాషాను, పేట్యాను తీసుకురమ్మని అతన్ని పంపించి తను మెల్లగా స్వారీ చేస్తూ వేటకుక్కలున్న చోటికి వెళ్ళాడు. ఇవాన్‌తో పోట్లాడిన వ్యక్తి నక్కను తన జీనుకు తగిలించుకొని తన చిన్న యజమాని వైపు స్వారీచేస్తూ వచ్చాడు. హేటు తీసివేసి తను కోపంతో ఉన్నప్పటికీ కూడా ఎంతో వినయంగా కనిపించాలని ప్రయత్నించాడు.

"ఇప్పుడేం జరుగుతున్నది? అని అడిగాడు నికోలస్.

"మన వేటకుక్కలతో వారు వేటాడుతున్నారు. అసలు ఈ నక్కను పట్టు కున్నది నా ఎరుపురంగు కుక్క ... అతను నా మాట వినకుండా నక్కను పట్టు కోవడానికి ప్రయత్నించాడు. నేను దగ్గరికి వచ్చేసరికి నేను అతన్ని, అతని కుక్కను అవతలికి దొర్లించివేశాను. ఈ నక్కను జాగ్రత్తగా పట్టుకొని వచ్చాను. మీకీ నక్క రుచిస్తుందనుకుంటా" అని చెప్పసాగాడు ఆ వేటగాడు.

నికోలస్ పేటియావంక,నటాషా వంక తిరిగి తన వ్యవహారాన్ని పరిష్కరించే వరకూ వేచి ఉండమని కోరాడు. వేటలో విజయం పొందిన వేటగాడు తను సాధిం చిన విజయాలను గురించి తన తోటి వేటగాళ్ళతో చెపుతున్నాడు. వారూ ఎంతో ఆశ్చర్యంతో వింటున్నారు.

ఆ రోజు ఇలాగైన్ కూడా అక్కడికే వేటకు వచ్చాడు. ఆచారాన్నిబట్టి ఆ స్థలం ఎన్నాళ్ళబట్టో రోస్టోవ్‌లదిగా పరిగణింప పడుతూ ఉంది. అతనికి, కౌంట్‌కూ మధ్య ఒక దావా వ్యవహారం కూడా జరుగుతోంది. వారిద్దరికీ సంబంధాలు కూడా అంత బాగా లేవు. అందుచేత ఇలాగైన్ అక్కడికి పనికట్టుకుని వచ్చినట్టుగా అను కున్నారు. కేవలం తగాదా కోసం అతను ఆ నక్కను వేటాడినట్టుగా వారు భావిం చారు.

నికోలస్‌కు అభిప్రాయ విషయంలో కాని, ఉద్రేకాల విషయంలోకాని ఒక పరిమితి అంటూ ఎరుగడు. అతనికి ఇలాగైన్‌తో ఎట్టి పరిచయమంటూ లేదు. అందు చేత మధ్యవారు చెప్పిన కొన్ని విషయాలను నమ్మి అతనిపై కోపంతో ఒక్క నిముషం కూడా ఆలోచించకుండా అతనిపైకి తగవుకు వెళ్ళాడు. అడవి నుంచి బయటికి రాగానే అతనికొక గుర్రపురౌతు కనిపించాడు. అతనొక టోపీ పెట్టుకొని చక్కని గుర్రాన్ని ఎక్కి ఇద్దరు సేవకులతో వస్తూ ఉన్నాడు. అతనే ఇలాగైన్.

కాని అతన్ని చూడగానే నికోలస్ అతనొక శత్రువులాగా కనిపించకుండా ఒక పెద్ద మనిషిలాగా కనిపించాడు. అతనిని పరిచయం చేసుకుందామని నికోలస్‌కు అనిపించింది. తగాదా జరిగినందుకు అతను తన విచారాన్ని వెలిబుచ్చాడు. వేట గాళ్ళు తన భూమిలో కాకుండా ఇతరుల భూమిలో వేటాడినందుకు శిక్షార్హులనీ, రోస్టోవ్‌లను తన భూమిలో వేటాడటం కోసం రమ్మనీ ఆహ్వానించాడు.

నటాషా, వారిరువురికీ మధ్య ఏం తగాదా జరుగుతుందో అని భయంతో తన అన్నదాపుకు వచ్చింది. కాని వారిద్దరూ ఒకరినొకరు చూచుకుని గౌరవించుకోవడం గమనించి ఆమె కూడా వచ్చి వారిలో కలుసుకుంది. ఇలాగైన్ వెంటనే తన టోపీని తీసి ఆ పిల్ల వేటగత్తెను ఎంతో మెచ్చుకున్నాడు. ఆమె ఆట విషయంలో కాక అందం విషయంలో కూడా దయానా అనే దేవతలా ఉందని పొగిడాడు. రోస్టోవ్‌ను వెంటనే వచ్చి కుందేటి వేటను మొదలుపెట్టమని కోరాడు. నికోలస్ తన వేటగాళ్ళతో కలిసి మళ్ళీ వేటకు వెళ్ళాడు.

వారు ఆ పొలాల్లో గుండా, గ్రామసీమల్లో గుండా స్వారీ చేస్తూ వెళ్ళారు. పెద్దలందరూ కలిసి స్వారీ చేస్తున్నారు. ఒకరి వేటగుంపును ఒకరు చూచుకుంటు న్నారు. ఎవరి వేటకుక్కలు మంచివో, పరిశీలిస్తున్నారు.

నికోలస్ హఠాత్తుగా ఇలాగైన్ వైపు తిరిగి "నీ కుక్క ఎంతో బాగుంది. చక్కని కుక్క!" అన్నాడు. "ఓ అదా! అది మంచికుక్కే. చక్కగా వేటాడు తుంది. తన పని తాను చక్కగా చేసుకుంటుంది" అన్నాడు ఇలాగైన్, దానిపైన అంత లక్ష్యం లేనట్టుగా, అయినప్పటికి మూడు సేవకుల కుటుంబాలను పోషించి దానికి అయ్యేఖర్చు ఆ ఒక్క ఇర్జాకోసం అవుతోంది.

"అయితే ఈ సంవత్సరం మీకు కూడా పంటలు బాగా లేవన్నమాట." అన్నాడు ఇలాగైన్ మళ్ళీ సంభాషణ ప్రారంభిస్తూ. తరువాత అతన్ని మళ్ళీ అభి నందించడాని కన్నట్టుగా "కౌంట్! నీ కుక్క కూడా బాగుంది. ఆ నల్లని చుక్కలు గల కుక్క." అన్నాడు.

"మిల్కా విషయమా మీరు చెపుతున్నది? అవును. అది మంచి కుక్కే. చక్కగా వేటాడుతుంది. మీరు త్వరలోనే చూస్తారు." అని నికోలస్ తనలో తాను "ఒక ముసలి కుందేటిపైకి దాన్ని వదిలిపెడితే అప్పుడు తెలుస్తుంది అదెలాంటిదో." అనుకున్నాడు.

ఇలా అని సేవకుని వంక తిరిగి "ఎవరైనా కుందేటిని తీసుకొచ్చిన పక్షంలో ఒక రూబుల్ ఇస్తానని" చెప్పమన్నాడు.

"ఒక విషయం నా కర్థం కావడంలేదు. ఈ వేట విషయంలోనూ, వేటకుక్కల విషయంలోనూ ఒకర్ని చూచి ఒకరు ఇంత అసూయగా ఎలా ఉంటారో అర్థం

చేసుకోలేకుండా ఉన్నాను. నాపుటుకు నాకు ఇదంతా ఒక పెద్ద ఆటగా కనిపిస్తోంది. అంటూ ఇలాగైన్ నటాషా వంక తిరిగి "నేను తలలు, తోళ్ళు లెక్కించుకునేవాణ్ణి కాదు. అది నా పద్ధతి కాదు. నిజం చెప్పాలంటే దానికి నేను లెక్క చెయ్యను." అన్నాడు.

"అవును, నిజమే." అన్నది నటాషా.

"నా కుక్క సరిగా పరుగెత్తలేకపోతే మటుకు ఏమిటి? దాన్ని కూడా నేను ఎంతో కులాసాగా చూచుకుంటాను. అదీ కాక...."అన్నాడు ఇలాగైన్.

ఈ లోగా ఒక సన్ననికేక వేటగాళ్ళ దగ్గర నుంచి వినిపించింది. ఒకడు కొండ కొమ్మున నిల్చుని మళ్ళీ కేక వేశాడు. ఒక కుందేటిపిల్ల తనకు కొద్ది దూరంలోనే వెడుతున్నదని గుర్తుగా అతను హెచ్చరిక చేశాడు.

"దొరికినట్టుగా ఉంది. వెళ్ళి పట్టుకుందాం" అన్నాడు ఇలాగైన్.

"వెడదాం రండి- అంటూ నికోలస్, ఇర్జావంక, మామయ్య కుక్క రూగా వంక, మిల్కా తోటి కుక్కల వంక ఒకమాటు చూచాడు. "ఈ మాటు కుందేటి పిల్లను పట్టుకుని తీరతాం" అంటూ ముందుకు వెళ్ళాడు.

"అది ముసలికుందేలా?" అని అడుగుతూ ఇలాగైన్ ఇర్జాను పిలుస్తూ ఈల వేశాడు. "మైఖేల్! నీవు కూడా వస్తావు కదూ?" అంటూ చిన్నిమామయ్య వైపుకు తిరిగాడు.

"నేను రాను. మీ కుక్కలు మంచి కుక్కలే! అవేం పట్టుకుంటాయి?"అంటూ చిన్నిమామయ్య తన కుక్క రూగాను పిలిచాడు.

నటాషా కూడా ఈ విషయం అర్థం చేసుకుని తన అన్న ఉద్వేగంలోను, ఆందోళనలోను తనూ పాలు పంచుకున్నది.

వేటకుక్కలు, మిగతా వేటగాళ్ళు; అందరూ బయలుదేరారు. కుందేటి పిల్లను పట్టుకున్న వేటగాడు ఇంకా అక్కడే నిల్చుని వారికోసం ఎదురు చూస్తున్నాడు.

మిల్కా కుందేటి పిల్లను పట్టుకొన పోతూ ఉండగా, కుందేటిపిల్ల హఠాత్తుగా ఆగిపోయింది. ఇర్జా ఇప్పుడు ముందుకు వచ్చింది. అది మీదికి రాగానే కుందేటి పిల్ల ముందుకు దూకింది.

తను దానిపై దూకవలసిన దూరాన్ని సరిగా లెక్కించుకున్నట్టుగా వుంది ఇర్జా.

"ఇర్జా! మంచిపని చేశావు ఇర్జా!" అని కేకవేశాడు ఇలాగైన్. కాని అది ఆ మాట వినలేదు. అది పట్టుకోబోగానే మళ్ళీ కుందేటిపిల్ల తప్పించుకొని మైదానంలోకి వెళ్ళి పోయింది. ఇర్జా, మిల్కా, కుందేలు వెంట పక్క పక్కనే పరుగెత్తుతున్నాయి. కాని దాన్ని పట్టుకోలేకుండా ఉన్నాయి.

"రూగా!రూగా!నీవు వెళ్ళి దాన్ని పట్టుకో"అని మరో గొంతుక వినిపించింది.

రూగా పరుగెత్తుకుంటూ వెళ్ళి ఒక పెద్ద ప్రయత్నం మీద కుందేటి పిల్లను పట్టుకుంది. పొలంలో నుంచి ఈడ్చుకుని వస్తోంది. ఒకమాటు వదిలి మళ్ళీ పట్టు కుంది.

అందరూ దాని చుట్టూ పోగయ్యారు. చిన్ని మామయ్య ఆనందంతో గుర్రం దిగి, దాన్ని తీసుకుని దాని వంటికి అంటుకున్న బురద మరకలను దులిపాడు. అతని కళ్ళు ఉత్సాహంతో మెరుస్తున్నాయి. అన్ని వైపులకూ ఆనందంతో చూస్తు న్నాడు. అతని మాటలు కూడా అస్పష్టంగా, పొందిక లేకుండా ఉన్నాయి.

"చూచారా, ఎంత మంచికుక్కో...అన్నిటినీ కలిపినా దీనితో సరి తూగవు. వేటాడే వస్తువును తప్పకుండా పట్టి తీరుతుంది...మంచి కుందేటిపిల్ల దొరికినా..." అంటున్నాడు చిన్ని మామయ్య, అతనికి ఊపిరి సలపడం లేదు. ఆ ఉత్సాహంలో అందరివంక కోపంగా చూస్తున్నాడు.

"వెయ్యి రూబుళ్ళు చేసే మీ కుక్కలను చూడండీ; ఈ రూగాను చూడండి" అంటున్నాడు.

కుందేటి వంటికి అంటుకున్న ఒక బురదమట్టను విదిలించాడు.

మూడుసార్లు వేటకుక్కల నుంచి తప్పించుకోవడం వల్ల ఎంతో అలసి పోయిం దీ కుందేలుపిల్ల" అన్నాడు నికోలస్.

"ప్రక్కనుంచి వెళ్ళి పట్టుకుంది" అన్నాడు అతని సేవకుడు.

"ఇద్దా ముందుగా వెళ్ళి కుందేటిపిల్లను అడ్డుకున్నప్పుడు ఇక ఏ కుక్క అయినా వెళ్ళి దాన్ని పట్టుకోవడంలో కష్టమేముంది?" అన్నాడు ఇలాగైన్.

నటాషా కూడా ఎంతో ఉద్రేకంతో అరుస్తూ కేకలు వేస్తోంది. మరోచోట అయినట్లయితే అలా కేకలు వెయ్యడానికీ, అరవటానికి సిగ్గుపడి ఉండేదే. ఆ విధంగా తనలో దాచుకోలేని ఉద్వేగాన్ని వెలిబుచ్చుతూ ఉంది. చిన్ని మామయ్య కుందేటి కాళ్ళను కట్టివేసి గుర్రపు జీనుకు వ్రేలాడదీశాడు. నికోలస్, ఇలాగైన్; ఎంతో నొచ్చుకున్నప్పటికి వేటగాళ్ళలాగా ఎంతో నిర్లక్ష్యంతో రూగాను చాలాసేపు చూస్తున్నారు. రూగా తన యజమాని గుర్రం వేనకాలే వెడుతోంది.

"నేనూ అన్ని కుక్కలలాగానే కనిపిస్తాను-కాని పని వచ్చినప్పుడు మాత్రం నా విషయం వేరు!" అని అన్నట్టుగా ఉంది అది.

ఈ సంఘటన జరిగిన తరువాత చిన్ని మామయ్య నికోలస్‌ను పలకరించాడు. అదొక గౌరవంగానే ఎంచుకున్నాడు ఆ కుర్రవాడు.

# 33

ఇలాగైన్, తోస్టోవ్ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళేసరికి చాలా ఆలస్యమై పోయింది. అప్పటికి కాని నికోలస్‌కు తమ ఇంటి నుంచి చాలా దూరం వచ్చామన్న

విషయం తెలిసింది కాదు. చిన్ని మామయ్య మైఖేల్ ఆహ్వానంపై వారు ఈ రాత్రి అతని ఇంట్లో ఆగిపోయారు. "మీరక్కడికి రాండి. ఏమంటారు? మీరక్కడికి వస్తారా? సాయంత్రం కూడా చల్లగా ఉంది. మీరక్కడ కాసేపు విశ్రాంతి తీసుకో వచ్చు. చిన్ని కౌంటెస్‌ను తరువాత మెల్లగా బండిలో ఇంటికి పంపించ వచ్చు" అన్నాడు మైఖేల్.

అందరూ ఈ ఆహ్వానాన్ని సంతోషంతో అంగీకరించారు. అ్రాడెడ్ నోవ్‌కు వెళ్ళి బండి తీసుకు రమ్మని ఒక సేవకుణ్ణి పంపించారు. తరువాత పార్టీ అంతా చిన్ని మామయ్య ఇంటికి బయిలుదేరింది. వారు ఇంటి వద్దకు చేరగానే అక్కడ నలుగు రయిదుగురు సేవకులు వారికోసం ఎదురు చూస్తున్నారు. ఒక డజను మంది స్త్రీలు-పెద్దలు, పిన్నలు తలుపు దగ్గరికి వచ్చారు. ఈ పార్టీని చూచినప్పుడు వారి ఆశ్చర్యం ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేదు. ముఖ్యంగా నటాషాను చూడగానే ఒక స్త్రీ గుర్రం యెక్కి రావటం గమనించేసరికి వారి ఆశ్చర్యం మరింత ఇనుమడించింది. త్రొక్కిసలాడుకుంటూ ఆమెను పరిశీలించడానికి ముందుకు వచ్చారు. వారిలో కొందరు ధైర్యంకల స్త్రీలు ఆమె ముఖంలోకి చూచారు కూడా. వారి మాటలు విని అర్థం చేసుకోలేని ఒక అతీతవ్యక్తి అయినట్టుగా ఆమెను గురించి మాట్లాడుకో సాగారు.

"చూడు అరీనా! ఆమె గుర్రం మీద ఒక ప్రక్కకు కూచుని ఉంది. ఆమె ఓణీ క్రిందికి జారుతూ ఉంది. ఆమెకు ఒక కొమ్ము కూడా వుంది! అదేమిటీ?

"అయ్యో! అదే కాదు. ఒక కత్తి కూడా వుంది!"

"నీవిలా ఎలా కూచోగలిగావు?" అని అడిగింది. ఒక సాహసం గల స్త్రీ, నటాషాను.

చిన్ని మామయ్య మెట్ల దగ్గరికి రాగానే గుర్రం దిగాడు. ఆ ఇల్లు కలపతో కట్టింది. సరిగ్గా పెంపకం చెయ్యని ఒక పెద్దతోట మధ్యలో ఉంది. అక్కడ నిలుచున్న వారందరినీ వెనక్కు వెళ్ళమని అతడు సైగ చేశాడు. తరువాత అతిధులందరికీ విందులు, వినోదాలు కల్పించడం కోసం తగిన ఆజ్ఞలను తీసుకొని లోనికి వెళ్ళాడు. తరువాత నటాషా దగ్గరికి తిరిగి వచ్చి ఆమెకు చెయ్యి అందించి ఆమెను గుర్రంమీది నుంచి దింపాడు. కొయ్యతో చేసిన మెట్లు ఎక్కించి లోనికి తీసుకెళ్ళాడు.

ఇంట్లో లోపలిభాగం అంత పరిశుభ్రంగా లేకపోగా దూలాలకు సున్నం కూడా కొట్టలేదు. ప్రతి చోటా—ఎక్కడ చూచినా మరకలు. మురికి కనిపిస్తున్నాయి.

అందరినీ కూచోమని కోరి, కొద్ది నిముషాల్లో వస్తానని చెప్పి తను వెళ్ళాడు. రూగా ఈలోగా గదిలోకి వచ్చింది. అది ఇంకా నీటితో వళ్ళు కడుక్కున్నట్లులేదు. అది తను మామూలుగా కూచునే సోఫాలో కూచుని నాకుతూ తోక ఆడిస్తూ ముస్తాబు చేసుకోసాగింది. ఆ గదికి మరోతలుపు తెరుచుకుని వుంది. మూలకిగా ఉన్న ఒక తెర వేలాడ తీసిఉంది. స్త్రీల నవ్వులు, కంఠస్వరాలు వినవస్తున్నాయి. నటాషా నికోలస్, పేట్యా; వారివారి కోట్లు విడిచి సోఫాలో హాయిగా కాళ్ళు చాచి పడుకున్నారు. పేట్యా తలక్రింద చేతులు పెట్టుకుని కొద్ది క్షణాలలోనే నిద్రపోయాడు. చలిగాలి వీస్తున్నప్పటికీ నికోలస్, నటాషా ఎంతో కులాసాగా ఉన్నారు. వారికెంతో బాగా ఆకలి వేస్తోంది. నికోలస్ ఇప్పుడు ఎంతో చనువుగా తన చెల్లెలు పరాచకాలకన్నిటికీ సమాధానాలు చెపుతున్నాడు. ఆమె కూడా హాయిగా తన అన్నతో మాట్లాడుతూ కూచుంది. చిన్ని మామయ్య దుస్తులు మార్చుకుని మళ్ళీ వచ్చాడు. చిన్న జాకెట్టూ, లాగు వేడుకున్నాడు. అ[క్రెడ్‌నోలో ఉండగా నటాషాకు ఈ ముస్తాబు ఎంతో హాస్యాస్పదంగా కనిపించేది. ఆమె ఎప్పుడూ ఈ ముస్తాబును గురించి మాట్లాడుతూ పరాచకా లాడుతూ ఉండేది. కాని ఇప్పుడు మాత్రం ఆ ముస్తాబు అందరి ముస్తాబుల్లాగానే సామాన్యంగా కనిపించ సాగింది. చిన్నిమామయ్య వారితో కలిసి కులాసాగా తను కూడా నవ్వసాగాడు.

"మంచిది. మంచిది చిన్న కౌంటెస్. యౌవనం అనేది ఎంతో మెచ్చుకోతగ్గది .... ఈ అమ్మాయిని నేనేప్పుడూ ఇంత చక్కగా చూడలేదు." అని అంటూ ఒక పొడుగైన టర్కిష్ పైప్‌ను నికోలస్‌కు అందించాడు.

తను కూడా పొట్టిగా ఉన్న ఒక పైప్‌ను మూడు వేళ్ళతో ముచ్చగా పట్టుకుని పుగాకుతో నింపుకోసాగాడు.

ఈ సమయంలో ఒకపిల్ల తలుపు తెరుచుకుని వచ్చింది. ఆ అమ్మాయి కాళ్ళకు చెప్పుల్లేవు. అందుచేతనే ఆ అమ్మాయి వస్తోంటే కాళ్ళచప్పుడు కాలేదు. ఆ అమ్మాయి తలుపు తెరిచి ఒక నలభైఏండ్ల స్త్రీని ప్రవేశపెట్టింది. ఆ స్త్రీ కొంచెం బొద్దుగా మిసమిస లాడుతూ ఉంది. ఆమె పెదవులు పగడపు రంగుగా లావుగా ఉన్నాయి. ఒక పెద్ద ట్రే (ఫలహారాలు పానీయాలు తీసుకుని వచ్చే పళ్ళెరం)తీసుకుని వచ్చింది. లావుపాటి చేతులతో ట్రే, టేబిల్‌మీద ఉంచి సీసాలు, గ్లాసులు, ఫలహారాలు సర్ది పెట్టింది. తరువాత తలుపు దగ్గరికి వెళ్ళి ఒక క్షణంపాటు చిరునవ్వు నవ్వుతూ నిలుచుంది. "నా వంక చూడండి!" అంటున్నట్లుగా ఉంది ఆమె.

ఇలా ఒకమాటు వారివంక చూచి తరువాత ఆమె గదిలోంచి వెళ్ళిపోయింది.

"ఇప్పుడు మీకు చిన్నిమామయ్య విషయం అర్థమైందా?"

అర్థం కాకుండా ఎలా ఉంటుంది! ఒక నికోలస్ కాక నటాషా కూడా,

అనీషియా గదిలోకి వచ్చి నప్పుడల్లా ఆమె ముఖంలో గల ఆందోళనలోని, గర్వం లోని ఉద్దేశాన్ని ఊహించుకో గలిగారు.

ఆ ట్రేలో ఆమె ఉంచని పదార్థమంటూ ఏముంది? పండ్లరసాలు, మూలికల నుంచి తయారు చేసిన పానీయాలు, ఊరగాయలు, గోధుమతో, మొక్కజొన్నతో చేసిన రొట్టెలు వెన్న, పుట్టతేనె, మాంసము, ఆపిల్‌పండ్లు, ఖర్జూరాలు, ఉడక పెట్టిన పోకలు, తేనెలో నానవేసిన పోకలు, పంచదారతో జామపండ్లతో చేసిన రసాలు; ఇలా ఎన్నెన్నో పదార్థాలు ఆమె ఆ ట్రేలో పెట్టి తెచ్చింది. అన్నీ ఆమె స్వయంగా వండి తయారు చేసింది. వాటి రుచి తెలుసుకోవడం కోసం,ఆ పదార్థాలను ముందుగా ఆమె వాసన చూచినట్టుగా కూడా ఉంది. ఆమెను-మనిషిని చూస్తేనే ఆ విషయం తెలుస్తోంది.

"ఇది కొంచెం తిను.అదిగో కొంచెం తీసుకో కౌంటెస్." అంటోంది,ఒక్కొక్కటే నటాషాకు అందిస్తూ.

నటాషా అవురావురున అన్నీ తిన్నది. ఆమె ఎన్నడూ ఇలా తినలేదు ఇంత రుచిగల పదార్థాలను, కోడిమాంసాన్ని, ఇంత కమ్మని ఊరగాయలను, పోకలను, పండ్లరసాలను; ఆమె ఎప్పుడూ రుచి చూడలేదు. నికోలస్, చిన్నమామయ్య,భోజనం చేస్తూ మధ్యమధ్య పండ్లరసాలతో గొంతులు తడుపు కుంటున్నారు. గడిచిన వేటలను, రానున్న వేటలను, రూగా గుణగణాలను, ఇలాగైన్ వేటకుక్కలను గురించి మాట్లాడుకుంటున్నారు. నటాషా సోఫామీద కూచుని మిలమిల లాడుతున్న కళ్ళతో వారి మాటలన్నీ వింటున్నది. మధ్యమధ్యలో పేట్యాను భోజనం చేయడం కోసం నిద్రలేపుతున్నది.

కొద్ది క్షణాలపాటు వారంతా మాట్లాడకుండా ఉన్నారు. ఒక గృహస్తు తొలిసారిగా అపరిచితులను ఆహ్వానించి ఆతిథ్యం ఇస్తున్న సందర్భాలలో సాధారణంగా ఇలా జరుగుతూ ఉంటుంది. చిన్నమామయ్య తన మనస్సులో పొడచూపిన ఏదో ప్రశ్నకు తానే సమాధానం చెప్పుకుంటూ "ఇలాగే నా జీవితం చల్లగా వెళ్ళిపోతే చాలు. అంతకంటె నేను కోరేదేమీ లేదు. నా తరువాత కూడా ఎవరూ లేరు." అన్నాడు.

"మళ్ళీ ఈ మాటు మీ పనులపై మీరు వెళ్ళరా చిన్నమామయ్యా?"

"ఇంతవరకూ సేవచేశాను అంతేచాలు...దానివల్ల వచ్చే పెద్దలాభం కూడా లేదు. నీ విషయం వేరు. కాని నామటుకు నేను దానివల్ల పొందే లాభమేమీ లేదు.ఇక వేట విషయ మంటావా? దాని సంగతి వేరు. దాంట్లో ఒక పద్ధతి అంటూ ఉంది. ఇంతకూ ఆ తలుపు మూశారేం? ఎవరు ఆ తలుపు మూసింది?"

వసారాకు ఆవలివైపున ఉన్న తలుపు మూసి ఉంది. అవతలి గదిలో వేట గాళ్ళు సాధారణంగా భోజనం చేస్తూ ఉంటారు. అవతలి ప్రక్కగా ఒకపిల్ల అడుగుల చప్పుడు వినిపించింది. కనిపించని ఒక చెయ్యి తలుపు తెరిచింది. 'బలాలిక' అనే ఒక విధమైన గిటార్ సంగీతం వినిపిస్తోంది.

"నా గుర్రపు బగ్గీ తోలే మిట్కా ఆ పాట పాడుతూ ఉన్నాడు. ఒకటోరకపు ఈ వాయిద్యాన్ని అతనికి కొనిపెట్టాను. నాకిలాంటి సంగీతమంటే ఎంతో ఇష్టం."

వేట నుంచి తిరిగి వచ్చినప్పుడల్లా మిట్కా ఈ విధంగా పాడడము, అతని యజమాని వినడము, ఒక అలవాటు.

"నిజంగా పాట ఎంతో చక్కగా ఉంది!" అన్నాడు నికోలస్ ఒక విధమైన అనాసక్తితో, ఆ సంగీతాన్ని తను మెచ్చుకున్నట్టు చెప్పడానికి సిగ్గుపడుతున్నట్టుగా అతను కనిపించాడు.

"అదేమిటి అలా అంటావ్? చాలా బాగుంది! ఇంత బాగుందని చెప్పడానికి వీల్లేనంత బాగా ఉంది." అన్నది నటాషా, కొద్ది కోపంతో.

అనీషియా తెచ్చిపెట్టిన తీయతీయని పదార్థాల్లాగానే, నిజానికి కూడా ఆమె వింటున్న ఆపాట ఒక దేవతా సంగీతంలా ఆమెను ఆకర్షించింది.

"ఏదీ? మరొకమాటు ఆ పాట పాడు." అన్నది నటాషా, ఆ పాట ఆగి పోయిన వెంటనే.

మిట్కా మళ్ళీ వాయిద్యానికి శ్రుతి పెట్టాడు. అనేక తరహాల్లో మరోరాగంలో బరీనా పాట పాడడం మొదలు పెట్టాడు.

"ఆ పాటను విను కౌంటెస్." అన్నది ఆమె, తను కూడా చిరునవ్వు నవ్వుతూ. "ఎంతో చక్కగా పాడతాడు." అన్నది.

"అదికాదు పద్ధతి. మరింత వేగంగా పాడాలి." అన్నాడు చిన్నిమామయ్య.

"నీవు కూడా 'బలాలికా' వాయిస్తావా?" అని అడిగింది నటాషా, కొద్ది ఆశ్చర్యంతో.

"అనుష్కా! నా గిటార్ తీగెలు సరిగా ఉన్నాయో లేదో చూచిరా. నేను దాన్ని తాకి చాలా రోజులైంది!" అన్నాడతను చిరునవ్వు నవ్వుతూ.

అనీషియా వెంటనే ఆ వాయిద్యాన్ని తీసుకుని వచ్చింది. అతను జాగ్రత్తగా దాన్ని అందుకుని దానిపై ఉన్న దుమ్మును ఊది, సన్నని వ్రేళ్ళతో తీగెలు శ్రుతి పెట్టాడు. తరువాత నింపాదిగా కూచుని, ఎడమచెయ్యి నుంచి తీగెలు సరి చూచి, ఒక మాటు అనీషియా వంకచూచి ఒక రాగాన్ని మొదలు పెట్టాడు.

"ఎంత చక్కగా ఉంది. ఎంత చక్కగా ఉంది!" అంటూ నటాషా ఎగిరి గంతేసి లేచి చిన్నిమామయ్య మెడచుట్టూ చేతులు పెనవేసి ఆయన్ని ముద్దాడింది.

తన అన్నను కూడా తన ఆశ్చర్యంలో పాలు పంచుకోమని కోరుతున్నట్టుగా "నికోలస్, నికోలస్!" అన్నది. సరే, సరే, తరువాత ఏమిటి?" అన్నది, ఆ మరు క్షణంలో జరగబోయే దానిమీద తన బ్రతుకంతా ఆధారపడి ఉన్నట్టుగా.

చిన్నిమామయ్య లేచి నిలుచున్నాడు. అతనిలో ఇద్దరు వ్యక్తులున్నారా అని పించింది, చిరునవ్వు నవ్వుతున్న వ్యక్తి ఒకడు, సంగీతానికి అనుకూలంగా నాట్యం చేయమని ప్రేరేపిస్తున్న వ్యక్తి మరొకడు.

"సరే, ముందుకురా చిన్నకోడలా." అన్నాడు చిన్ని మామయ్య.

నటాషా తన శాలువాతీసి అవతల విసిరేసి, ఒక్క గంతులో గది మధ్యలోకి వచ్చి నిలుచుంది. చేతులు నడుముపై ఉంచి, కొంచెం అల్లల్లాడిస్తూ వేచి ఉంది.

అదేం చిత్రమో కాని ఈ చిన్ని కౌంటెస్ ఒక ఫ్రెంచి పరదేశి చెప్పిన పాఠాలవల్ల నృత్యాన్నంతా ఆకళించుకున్నది. తను పుట్టిన తన దేశానికీ తన జాతికీ సహజమైన ఈ విచిత్రమైన కదలికలను, ఈ శాలువా నృత్యాన్ని ఇంత చక్కగాను ఇంత స్వాభావికంగాను ఎలా నేర్చుకున్నదా అనిపిస్తోంది. కళ్ళలో చిలిపితనము, పెదవులపై చిరునవ్వు కనిపిస్తూ ఉండగా నాట్యం మొదలుపెట్టడం కోసం కాచుకుని నిలుచున్నది. నికోలస్, ఇతరులూ, తదేకంగా చూస్తూ ఉన్నారు. ఇంక వారా నృత్యాన్ని ఒక గారడీని చూసినట్టుగా చూడవలసిందే!

ఆమె ప్రతి కదలిక ప్రతి భంగిమ ఎంతో చక్కగా ఉంది. అనీషియా ఆమెకు చేరుమాలు అందించింది. ఒకే పర్యాయం నవ్వుతూ కన్నీరు పెట్టుకుంటూ నిలుచుంది. తీగెలాంటి ఈ చక్కని చుక్క చూపిస్తున్న భంగిమలను, అడుగులను చూస్తూ నిలుచుంది. నిజానికి నటాషా కేవలం సిల్కు దుస్తుల్లో గారాబంగా పెరిగిన చిన్న కౌంటెస్ మాత్రమే కాదు. ఒక్క అనీషియా హృదయంలో మాత్రమేకాక,తన తండ్రీ, తల్లీ; ప్రతి వ్యక్తి హృదయంలోనూ స్పందనను ప్రతిస్పందించగలది.

"ఎంత బాగుంది చిన్న కౌంటెస్!" అన్నాడు చిన్ని మామయ్య ఉత్సా హంతో, ఆమె నృత్యం ముగించగానే. "ఇక నీకు ఒక చక్కని వరుణ్ణి చూచి పెళ్ళి చెయ్యాలి." అన్నాడు.

"చూడాల్సిన అవసరం లేదు. అప్పుడే దొరికాడు!" అన్నాడు నికోలస్.

"అయితే మరీ మంచిది." అన్నాడు వృద్ధుడు ఆశ్చర్యంతో.

నటాషా సంతోషంతో చిరునవ్వు నవ్వుతూ తల ఊపి "దొరకడమే కాదు; అతను అందగాడు కూడా." అన్నది.

ఆయన పాడిన పద్ధతే వేరు. రాగం కోసం కాకుండా ఒక్క మాటల కోసమే పాడే రైతులాగా పాడాడు. రాగం పాటకు తోడుగా వస్తుంది కాని, అంతకంటె దానికి ప్రాధాన్యతలేదు, పక్షుల పాటలలాంటి ఈ రకమైన పాటలంటే చిన్న మామ

య్యకు ఎంతో ఇష్టం.నటాషా ఇక నుంచి తను ఎన్నడూ తంత్రీవాద్యాన్ని ముట్టననీ, గిటార్ నేర్చుకుంటాననీ అన్నది.

ఆ రాత్రి పది గంటలయ్యేసరికి ఒక చిన్న బండి,మరో పెద్ద బండి, ముగ్గురు గుర్రపు రౌతులు; వీరిని వెతుక్కుంటూ వచ్చారు. "కౌంట్, కౌంటెస్సూ, వీరేమై నారో అని గాభరా పడుతున్నారు" అని చెప్పాడు సేవకుడు.

నిద్రపోతున్న పేట్యాను అలాగే చిన్న బండిలో పడుకోబెట్టారు. నికోలస్, నటాషా పెద్ద బండిలో ఎక్కారు. చిన్ని మామయ్య వారికి శాలువాలు కప్పాడు. వంతెన వరకూ వారి బండి వెనకాలే వారిని అనుసరించాడు. వంతెనకు అవతలి ప్రక్క తన మనుష్యుల్ని దీపాలు పట్టుకుని నిలుచోమని చెప్పాడు.

"ఇక సెలవు తీసుకొంటాను చిన్ని కోడలా" అన్నాడు. ఆ చీకట్లో నటాషా విన్న కడపటిమాట ఇదే. ఆ గొంతుక ఆయన పాటలాగానే వినిపిస్తోంది.

బండ్లు సాగిపోతున్నాయి. గుడిసెల్లో చలిమంటలు మిల మిల లాడుతూ కని పిస్తున్నాయి.

చిన్ని మామయ్య ఎంత మంచివాడు!" అన్నది నటాషా, బండ్లు రహదారి పైకి రాగానే.

"అవును" అన్నాడు నికోలస్. "నీకు చలి వేస్తోందా?" అని అడిగాడు.

"లేదు. చాలా హాయిగా ఉంది. వెచ్చగా ఉంది:" అన్నది ఆమె. తన ఆనం దానికి తనే కలవరపడుతూ.

తరువాత చాలా సేపు మౌనంగా ఊరుకున్నారు. చీకటి, మంచు దట్టంగా ఉన్నాయి. గుర్రాలు కూడా సరిగా కనిపించడంలేదు.బురద నేలలో వెడుతున్న వాటి గిట్టల చప్పుడు మాత్రమే వినిపిస్తోంది.

ఇప్పుడు ఈ అమ్మాయి హృదయంలో ఎలాంటి అనుభవాలు సాగుతు న్నాయో ఏం చెప్పగలం? ఎలాంటి చిన్న విషయాలైనా వెంటనే ముద్రితమయ్యే పసి హృదయం అది.ఏ ప్రభావమైనా ఆమె హృదయంలోకి ఇంతలో ప్రవేశిస్తుంది. ఈ ఉద్వేగాలన్నీ ఆమె ఎలా సమన్వయించు కుంటుందో! ఆమె సంతోషంగా ఉంది. ఆ మాట మాత్రం చెప్పగలిగింది. ఇల్లు ఇక కొద్ది దూరంలో ఉందనగా ఆమె హఠాత్తుగా గొంతుక ఎత్తి ఆమె చాలా సేపటి నుంచీ మననం చేసుకుంటూ ఇప్పుడే మనస్సుకు తట్టిన పాట, ఇప్పుడు పాడసాగింది.

"మంచి పాట!" అన్నాడు ఆమె అన్న.

"నికోలస్! ఇప్పుడు నీవు ఏమి ఆలోచిస్తున్నావు?" అని అడిగిందామె.

ఈ ప్రశ్న ఎప్పుడూ వారు ఒకరినొకరు అడుక్కుంటూ ఉంటారు.

"నేను రూగాను గురించి ఆలోచిస్తూ ఉన్నాను. చిన్ని మామయ్యకూ,

రూగాకూ చాలా పోలికలున్నాయి. రూగా కూడా మనిషే అయినట్టయితే, వేటకు వెళ్ళినప్పుడూ, పాట పాడినప్పుడూ మామయ్య ఎప్పుడూ తన ప్రక్కనే ఉంచుకునేవా డనుకుంటాను. మరి నీవో? నీవు ఏం ఆలోచిస్తున్నావు?" అన్నాడు నికోలస్.

"నేనా? ఆగు, చెపుతాను. నేను మన ప్రయాణాన్ని గురించి ఆలోచిస్తు న్నాను. కొద్ది నిముషాల్లో ఆట్రెడ్‌నోకు వెళ్ళడానికి మారుగా, ఈ రాత్రంతా ఒక మంత్రభవనంలో గడుపుతామేమో అనుకుంటున్నాను. అంతే. అంతకంటే మరేం లేదు."

"కాని నీవతన్ని గురించి ఆలోచిస్తున్నా వనుకున్నాను."

"లేదు" అన్నది నటాషా. కాని నిజానికి ఆమె అతన్ని గురించే ఆలోచిస్తూ ఉంది. అతనిప్పుడు ఇక్కడ వుంటే చిన్ని మామయ్యను గురించి ఏమనుకునేవాడో "అనీషియా రావడం పోవడం ఎంత చక్కగా ఉందా అని అనుకుంటున్నాను" ఇలా అని నటాషా హాయిగా నవ్వింది. ఇప్పుడు నేనున్నంత హాయిగా ఎప్పుడూ లేననుకుంటాను" అన్నది.

"ఏమిటి వెర్రి? మరీ విపరీతం" అన్నాడు నికోలస్. తనలోతాను "నటాషా ముత్యం లాంటి పిల్ల. ఇలాంటి స్నేహితురాలు నాకెన్నడూ దొరకలేదు... ఆమె ఎందుకు పెళ్ళి చేసుకోవాలి? జీవితమంతా ఇలాగే తిరుగుతూ గడపకూడదూ?....' అనుకున్నాడు.

"నికోలస్ ఎంత మంచివాడు!" అనుకున్నది నటాషా."చూడు! డ్రాయింగ్ రూంలో ఇంకా దీపాలు వెలుగుతూనే ఉన్నాయి" అన్నది కిటికీల వంక చూపిస్తూ.

మసక మసకగా ఉన్న ఆ చీకట్లో కిటికీలలో నుంచి ఆ దీపాలు కనిపిస్తు న్నాయి.

# 34

కౌంట్ రోస్టోవ్ జిల్లా మార్షల్‌గా తన పదవికి రాజీనామా ఇచ్చాడు. దానివల్ల అవుతున్న ఖర్చులు కారణంగా అలా చేశాడు. అయినప్పటికీ అతని వ్యవహారాలు బాగుపడే సూచనలేమీ కనిపించడం లేదు. నికోలస్, నటాషా తల్లి దండ్రు లెప్పుడూ ఏదో గుసగుస లాడుకోవడం వింటున్నారు. మాస్కోలో ఇంటిని అమ్మాలా, లేక ప్రక్కనున్న ఆస్థిని అమ్మాలా-అని వారు రహస్యాలోచనలు జరుపుతున్నారు. ఈ విధంగా ఏకాంత జీవితానికి అలవాటు పడిపోయిన కౌంట్, ఇప్పుడు పూర్వంలా ఆతిధ్యాలు ఇవ్వడం కాని, విందులు ఏర్పాటుచేయడం కాని లేదు. ఆట్రెడ్ నోలో జీవితం పూర్వంలాగా కులాసాగా, హాయిగా సాగడం లేదు. అయి నప్పటికీ ఇల్లు ఎప్పటిలాగానే అతిధులలో నిండి ఉంది. రోజూ భోజనానికి ఆరవై

మంది దాకా తయారవుతున్నారు. వీరిలో వారిపై ఆధారపడిన వారు, స్నేహితులు, పరిచితులు, వీరంతా ఉన్నారు. వారి కుటుంబంలో ఒక భాగంగా ఉంటున్నారు. ఏమైనప్పటికి వారా కుటుంబాన్ని వదల్లేక పోతున్నారు. వీరిలో డిమ్లర్ అనే పేరు గల ఒక గాయకుడు, అతని భార్య, డాన్సింగ్ మాస్టర్ ఓగెల్, అతని కుటుంబం, వృద్ధురాలైన మిస్‌బెలో, పేట్యా ట్యూటర్, ఆడపిల్లల పూర్వపు గవర్నెసూ, వీరంతా కూడా ఉన్నారు. తమ ఖర్చుమీద కాకుండా కౌంట్ ఖర్చు మీదనే జీవించడం వీరికెంతో హాయిగా కనిపించింది. అందుచేత ఆతిధ్యాలు, విందులు, వినోదాలు లేకపోయినప్పటికీ జీవితం పూర్వం లాగానే భారీ ఎత్తు ఖర్చు మీద సాగుతూ వుంది. యజమానికి కాని, యజమానురాలికి కాని ఎలాంటి మార్పూ వచ్చే సూచన కనిపించడం లేదు. నికోలస్ తన వేటకు పనికి వచ్చే పరికరాలను కూడా హెచ్చుచేశాడు. ఇంగా గుర్రపు శాలలో యాభై గుర్రాలున్నాయి. పదిహేను మంది బండితోలే వాళ్ళున్నారు. పుట్టినరోజు పండుగలు జరుగుతూనే ఉన్నాయి. చక్కటి బహుమతులు పంచుతూనే ఉన్నారు. చుట్టుప్రక్కల అందరినీ పిలిచి భోజనాలు పెడుతూనే వున్నారు. కౌంట్ చీట్లపేకలు కూడా ఆడుతూనే ఉన్నాడు. పేకాట సమయంలో తన పేకముక్కలు తన స్నేహితులకు చూపించక పోవడమంటూ ఉండదు. వారెప్పుడూ సరిగ్గా సమయానికి అతని టేబిల్ దగ్గర తయారై ఏ మాత్రం ఆలోచన లేకుండా కొన్ని వందల రూబుళ్ళు దోచుకొని పోతూనే వుంటారు. వారికి ముఖ్యంగా వచ్చే రాబడి కూడా అదే.

ఆయన సహచారిణి తన పిల్లల పతనాన్ని నాశనాన్ని చూడగలుగుతోంది. కాని భర్తను ఒక్క మాట కూడా అనలేకపోతోంది. అయినా ఈ వయస్సులో ఆయన్ను సరిదిద్దడం ఎలా? ఆమే స్వయంగా ఇందులో నుంచి తప్పుకోవడానికి ఏదో ఒక దోవ చూచుకోవాలి. స్త్రీగా ఆమె ఆలోచనలు తట్టినంత వరకూ ఒకేదోవ కనిపించింది. నికోలస్‌కు ఒక శ్రీమంతురాలిని తెచ్చి పెళ్ళి చేసినట్టయితే ఈ గొడవలు కొంత వరకు తప్పేటట్టుగా ఉన్నాయి. ఆమె కింతకన్నా ముక్తిమార్గం కనిపించ లేదు. కాని తాను చెప్పిన సంబంధం తాలూకు పిల్లను కొడుకు నిరాకరిస్తే అప్పుడు తను చేయగలిగిందేమిటి? ఇహ తన ఆస్తి వ్యవహారాలు సర్దుకునే కడపటి ఆశ కూడా అంతరించాయన్న మాటే. ఆమె దృష్టిలో ఉన్న పిల్ల కూడా ఎంతో గొప్ప కుటుంబానికి చెందినది. రోస్టోవ్‌లకు ఆ అమ్మాయిని పసిపిల్లగా వున్నప్పటి నుంచీ తెలుసు. ఆ అమ్మాయి జూలియా కారగైన్. తన రెండో అన్న చనిపోగానే ఆ ఆస్తి అంతా ఆమెకు వచ్చింది.

తన తల్లి కన్నీరు పెట్టుకుంటూ అనేకసార్లు తన వివాహం ఆమె చూడాలని కోరడం నికోలస్ విన్నాడు. ఇప్పుడు కూతుళ్ళకు వచ్చిన కొరత ఏమీ లేదు. ఇక

ఈ ఒక్క కొరత తీరితే తన కడపటి రోజులు హాయిగా గడిచిపోతాయని కౌంటెస్ అనుకుంటూ ఉండేది. మధ్య మధ్యలో ఆ చక్కటి పిల్లను గురించి చెప్పీ చెప్ప నట్టు చెపుతూ ఉండేది. ఒక రోజున జూలియా అందాన్ని గురించి, గుణగణాలను గురించి చెప్పి కొద్దిరోజులు కొడుకును మాస్కోలో గడిపిరమ్మని కోరింది. నికోలస్ తల్లి ఉద్దేశాన్ని వెంటనే ఊహించుకో గలిగాడు. ఆమె మనస్సులో ఉన్న ఉద్దేశ మేమిటో చెప్పమని కోరాడు. ఆమె వెంటనే ఉన్నమాట చెప్పేసింది. అతను జూలి యాను పెళ్ళి చేసుకోవడం వల్ల తమ ఆస్తి వ్యవహారాలన్నీ చక్కబడతాయని చెప్పింది.

"అయితే అమ్మా! నేనొక నిరుపేద పిల్లను పెళ్ళి చేసుకోవడం నీకిష్టం లేదన్నమాట. ఒక్క డబ్బు కోసం మాత్రమే నా హృదయాన్నీ, గౌరవాన్ని బలి చేయాలని కోరుతున్నావన్నమాట" అన్నాడు నికోలస్.

"కాదు నాయనా, కాదు నీవు నన్ను అపార్థం చేసుకుంటున్నావు" అన్న దామె. ఆమెకు తన ఆశలు ఎలా వెలిబుచ్చాలో తెలియ లేదు. "నీ సుఖం కోసమే చెపుతున్నాను" అన్నది. కాని వెంటనే తన ఉద్దేశం ఇది కాదని ఆమె గ్రహించి వెక్కి వెక్కి ఏడవసాగింది.

"అలా ఏడవకమ్మా. నీవు నిజంగా అలా కోరుతున్నావంటే అందులో వచ్చిన తప్పేమీ లేదు. నీ సుఖం కోసం నేనేమయినా చేస్తానని నీకు తెలుసు" అన్నాడు నికోలస్.

కాని అతని తల్లి ఉద్దేశం అది కాదు. ఆమె అతన్నుంచి ఎలాంటి త్యాగమూ కోరడం లేదు. అతనలా త్యాగం చేసినా ఆమె ఒప్పుకోదు కూడా. అవసరమైతే తనే త్యాగం చేస్తుంది.

"ఇక ఆ మాటలు ఎందుకులే నాయనా నీకు అర్థం కావు" అన్నది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

'ఈమె కిలాంటి సంబంధం ఎలా నచ్చిందో?' అనుకున్నాడు నికోలస్. 'సోనియా పేదపిల్ల అనీ, నేనా అమ్మాయిని ప్రేమించననీ అనుకుంటూ వుంది కాబోలు. కాని బొమ్మలాంటి జూలియాకన్న నాకు ఆ అమ్మాయితోనే వెయ్యిరెట్లు ఎక్కువ సుఖంగా ఉంటుంది' అనుకున్నాడు.

అతను అక్కడే ఉండిపోయాడు. మళ్ళీ తన తల్లి ఎన్నడూ ఆ ప్రస్తావన తీసుకు రాలేదు. అయినప్పటికీ ఆమె నికోలస్‌కూ, సోనియాకూ మధ్య నానాటికీ హెచ్చవుతున్న సన్నిహితత్వాన్ని చూచి ప్రతి చిన్న విషయంలోను సోనియాను ఆందోళన పరచకుండా ఉండలేక పోయింది. ఆ అమ్మాయితో అట్టే మాట్లాడడం లేదు కూడా. ఒక్కోసారి ఆ అమ్మాయిని అలా అయిన దానికీ కాని దానికీ సూటి

పోటి మాటలని కష్టపెడుతూ ఉన్నందుకు తనలో తాను ఆమె విచారపడుతూ ఉండేది కూడా. ఎంతో వినయంతో ఆ అమ్మాయి ఇదంతా భరిస్తూ ఉండడం, నిస్వార్థమైన ప్రేమతో నికోలస్‌ను ప్రేమిస్తూ ఉండడం, ప్రతి విషయంలోనూ ఎంతో వినయ విధేయతలు చూపిస్తూ ఉండడం' ఇవన్నీ గమనిస్తూ ఆ అమ్మాయిని యెంతో మెచ్చు కునేది కూడా.

ఈ సమయంలో ఆంద్రూ రాకుమారుని దగ్గర నుంచి ఒక పుత్తరం వచ్చింది. ఇది అతను వ్రాసిన నాలుగో ఉత్తరం. ఇప్పటికే ఇంటికి బయలుదేరి ఉండవల సిందనీ, కాని వేసవికాలపు వెచ్చదనం వల్ల తన గాయం మళ్ళీ సెలవేయగా జనవరి వరకూ తన ప్రయాణం వాయిదా వేసుకోవలసి వచ్చిందనీ వ్రాశాడు.

నటాషా, ఆంద్రూ రాకుమారుని గురించి ఎన్నో పగటికలలుకంటూ హాయిగా ఉన్నప్పటికీ, ఇంతకాలం నుంచీ జీవితాన్ని కులాసాగానే గడుపుతూ ఉంది. కాని ఇటీవలే నాలుగు నెలల నుంచీ ఒక విధమైన విచారంలో మునిగిపోతూ వచ్చింది. తన దుర్విధికి తన్ను తానే నిందించుకుంటూ వుంది. ఎప్పుడెప్పుడు ఆంద్రూ దాపుకు వస్తాడా, ప్రేమించి ప్రేమింపబడే ఆ క్షణం ఎప్పుడు దాపుకు వస్తుందా అని ఎదురు చూస్తూ వుంది. నికోలస్ కూడా ఇంచుమించు సెలవు కాలమంతా గడిపివేశాడు. రోస్టోవ్‌ల గృహం పూర్వం లాగా ఇప్పుడు హాయిగా లేదు.

# 35

క్రిస్‌మస్ పండుగ వచ్చింది. కాని క్రిస్‌మస్ పండుగలో జరిగిన ప్రత్యేక విశేషాలేమీ లేవు. పెద్ద ఎత్తున ఆడంబరంగా ప్రార్థనలు మాత్రం సలిపారు.

క్రిస్‌మస్ పండుగ మూడో రోజున భోజనాలైన తరువాత అందరూ ఎవరి మూలలకు వారు వెళ్ళి కూచున్న తరువాత ఇల్లంతా మాంద్యం ఆవరించుకుంది. ప్రక్క గ్రామాలు తిరిగి వచ్చిన నికోలస్, డ్రాయింగ్ రూంలో హాయిగా నిద్ర పోతున్నాడు. వృద్ధ కౌంట్ కూడా తన గదిలో నిద్రపోతున్నాడు. సోనియా తన గదిలో కూచుని ఒక డ్రాయింగ్ బొమ్మ కాపీ చేసుకుంటోంది, కౌంటెస్ 'పేషన్సు' పేకాట ఆడుకుంటూ కూచుంది.

నటాషా గదిలోకి వచ్చింది. ఒక నిముషం పాటు సోనియా పైకి వంగి,ఆమె చేస్తున్నపని పరిశీలించి తన తల్లి దగ్గరికి వెళ్ళి ఆమెకు ఎదురుగా నిలుచుంది.

కౌంటెస్ తల ఎత్తి చూచింది.

"ఎందుకిలా దయ్యం పట్టిన దానిలా ఇల్లంతా తిరుగుతున్నావ్?ఏం కావాలి?" అని అడిగింది తల్లి.

"ఏం కావాలి! అతను కావాలి" అని జవాబు చెప్పింది నటాషా, ముక్తసరిగా, ఆమె కళ్ళు వెలుగొందాయి.

ఆమె తల్లి ఆ అమ్మాయి ముఖం వంక ఆందోళనతో చూచింది.

"నా వంక అలా చూడకు. నాకు ఏడుపు వస్తుంది" అన్నది ఆ పిల్ల.

"ఇలా కూచో."

"అమ్మా! నా కతను కావాలి! నే నెందుకిలా చనిపోవాలి?..."

ఆమె గొంతుక రుద్ధమైంది, కళ్ళునీళ్ళతో నిండాయి. వెంటనే డ్రాయింగ్ రూంలో నుంచి త్వరత్వరగా పనివాళ్ళ గదిలోకి వెళ్ళింది. ఒక వృద్ధసేవకురాలు అప్పుడే పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చిన ఒక పిల్లను తిడుతోంది.

"దేనికైనా ఒక సమయమంటూ ఉంటుంది. ఆడుకోవాలంటే కావలసినంత సేపు ఆడుకోవచ్చు" అంటోంది వృద్ధురాలు.

"దాన్నిమీ అనకు" అన్నది నటాషా తరువాత ఆ పిల్లతో, "నీవు పరుగెత్తి వెళ్ళు మారూషా" అన్నది.

ఇలా తిరిగి తిరిగి నటాషా హాల్లోకి వచ్చింది. ఒక వృద్ధసేవకుడు ఇద్దరు కుర్రాళ్ళతో కలిసి పేకాడుకుంటూ కూచున్నాడు. ఆమె రాగానే వారు ఆటమాని లేచి నిలుచున్నారు.

"వీరికేం చెప్పను?" అనుకుంది నటాషా. "నికిటా, నీవు వెళ్ళు... నీతో ఏం చెప్పను?" ఒక కోడిని తీసుకురా...మీషా, నీవు వెళ్ళి ఒక పిడికెడు ధాన్యం తీసుకురా—" అన్నది.

"పిడికెడు ధాన్యమా?" అంటూ నవ్వాడు మీషా.

"వెంటనే వెళ్ళు" అన్నాడు వృద్ధుడు.

"ఫెడార్!! నీవు నాకొక సీమసున్నం ముక్క తెచ్చిపెట్టు" అని అడిగింది నటాషా.

తరువాత ఆమె సేవకుల హాల్లోకి వెళ్ళి అప్పటికింకా టీ తాగే సమయం కాక పోయినా పొయ్యి అంటించమని కోరింది. వృద్ధబట్లర్ ఫోకాపై తన అధికారం చూపు దామను కుంది. అతను ఎప్పుడూ ఎవరిమాటా విన్న పాపాన పోలేదు. నటాషా ఇలా చెప్పగానే ఆ బట్లర్ తన చెవులను తానే నమ్మలేక పోయాడు. ఆమె ఉద్దేశం ఏమిటని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"ఇంకా ఏం కావాలమ్మగారూ?" అని అడిగాడు.

అప్పుడు నటాషా ఇచ్చినన్ని ఆజ్ఞలు ఎన్నడూ ఇవ్వలేదు. సేవకులకు అప్పుడు చెప్పినన్ని పనులు ఆమె ఎన్నడూ చెప్పలేదు. ఒక సేవకుడు లోపలికి

రాగానే ఆమె వెంటనే పని కల్పించి చెపుతోంది. తనలా చేయకుండా ఉండలేక పోయింది. అందరి మీదా తన కధికారం చూపిద్దామనీ, ఒక రోజు కాకపోతే ఒక రోజైనా, ఒకరు కాకపోతే ఒకరైనా తనపై తిరుగుబాటు చేస్తారో లేదో చూద్దామను కుంది, కాని వారు ఒకరికంటె ముందుగా ఒకరు ఆమె ఉత్తర్వులు శిరసావహించ డానికి పరుగులు తీస్తున్నారు.

"ఇక నేనేం చెయ్యాలి? ఎక్కడికి వెళ్ళాలి?" అనుకున్నదామె. మెల్లగా వసారాలోకి నడిచి వెళ్ళింది. వసారాలోకి వెళ్ళగానే బఫూన్ కనిపించాడు.

"నాస్టాషియా ఇవనోవ్‌నా! నాకు పిల్లలు గలిగితే వాళ్ళు ఎలాటి వాళ్ళు అవు తారో చెప్పు?" అని అడిగింది.

"ఎందుకూ పనికిరాని బడుద్దాయిలు అవుతారు!" అని చెప్పాడు బఫూన్.

నటాషా అక్కణ్ణుంచి వెళ్ళింది. ఆమె 'ఎక్కడకు వెళ్ళినా ఏమీతోచడం లేదు. ఇదేం ఖర్మ? ఏం చేయను భగవంతుడా?' అనుకుంది.

ఒక్కొక్క అడుగే మెల్లగా వేసుకుంటూ మేడ మీదికి వెళ్ళింది. అక్కడ ఓగెల్ దంపతులు కనిపించారు. ఇద్దరు గవర్నెస్‌లు కూచుని వారితో మాట్లాడుతూ కబుర్లు చెపుతున్నారు. ఎండిన పండ్లు టేబిల్ మీద ఉన్నాయి. మాస్కోలోను, ఒడెస్సాలోను జీవించాలంటే ఎంత ఖర్చవుతుందా అని చర్చించు కుంటూ ఉన్నారు. నటాషా ఒక్క క్షణం పాటు అక్కడ కూచుని వారి సంభాషణ శ్రద్ధతో ఆలకిం చింది. వెంటనే గంతేసి లేచింది. 'మెడగాస్కర్‌దీవి' అని గొణుగు కున్నది. 'మె-డ-గా-స్కర్' అని ఆ మాటలు ప్రత్యేకంగా ఒక్కొక్క అక్షరం గొణు క్కున్నది. ఆ మాట ఆమె అనడంలోని అర్థం తెలుసుకోలేక ఆశ్చర్యపడిన మిసెస్ స్కాస్ అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఆమె అక్కణ్ణుంచి వెళ్ళి పోయింది.

తరువాత పెట్యాను, మరో స్నేహితుణ్ణి కలుసుకుంది. వారిద్దరూ ఆ సాయంత్రం తాము కాల్చుకున్న మతాబు సామానులతో ఆడుకుంటున్నారు.

"పెట్యా! నన్ను క్రిందికి మోసుకుని వెళ్లు." అన్నది నటాషా. వెంటనే అతడి వీపుమీద కూచుని, అతని మెడచుట్టూ చేతులు వేసి నవ్వుతూ, మెట్లవరస చివరకు వచ్చేవరకూ స్వారీ చేసింది.

"ఇక చాల్లే " అన్నది. మళ్ళీ "మెడగాస్కర్." అంటూ ఎగిరి గంతేసి దూకి, మెట్లవరుసమీద చెంగున దూకుతూ వెళ్ళిపోయింది.

ఇలా తన రాజ్యాలన్నీ చూచుకుని, తన శక్తి సామర్థ్యాలను పరీక్షించుకుని, తన సామంతులంతా విధేయులై ఉన్నారని తెలుసుకుని, వాటిలో కొత్త విశేషాలేమీ కనిపించక చివరకు నటాషా తన సంగీతపు గదిలోకి వెళ్ళింది. అక్కడ గిటార్

తీసుకుని తీగెలు మీటుతూ ఒక మూల కూచుంది. తనూ, ఆంద్రూ కలిసి పీటర్స్‌బర్గ్‌లో ఒక సంగీత నాటకంలో విన్న ఒక రాగాన్ని వాయించడానికి ప్రయత్నిస్తోంది. అలవాటు పడని ఆమె వ్రేళ్లు,మోగించడానికి ప్రయత్నిస్తూ ఉన్న అస్పష్టమైన శ్రుతులు శ్రుతిబద్ధంగా లేవని ఎంత అనుభవంలేని చెవికైనా వెంటనే తెలియవస్తోంది, అయినప్పటికీ ఆమె ఊహాపథంలో ఎన్నో జ్ఞాపకాలను ఆ శ్రుతులు మేలుకొలిపాయి. గోడకానుకుని కూచుని తలుపు సందులోనుంచి వస్తున్న ఒక సన్నని కాంతికిరణం వైపు చూస్తూ ఆ రాగం వింటూ గతాన్ని గురించి ఊహించసాగింది.

సోనియా, చేతిలో ఒక గ్లాసు పట్టుకుని గదిలోనుంచి అవతలికి వెళ్ళింది. నటాషా ఒక మాటు ఆమెవంక తిరిగి చూచి మళ్ళీ ఆ సన్నని కాంతికిరణం వైపు చూచింది.ఇలాటి అనుభవమే ఇదివరకొకమాటుఆమెకు జరిగినట్టుగా తోచింది ఇక్కడే-ఈ వస్తువుల మధ్య ఈ విధంగానే కూచుని సోనియా పాత్ర తీసుకుని వెడుతుండగా తాను చూచినట్టుగా అనిపించింది.

"అవును. మునుపు ఇలాగే జరిగింది." అనుకుంది తనలో. "సోనియా! ఈ రాగం ఏమిటి?" అని అడిగింది. కొన్ని శ్రుతులు వాయించి.

"ఏమిటీ నీవు ఇక్కడ ఉన్నావా?" అన్నది సోనియా ఉలికిపడి.

"నాకు తెలియదే." అంటూ దగ్గరకు వచ్చి "ఇది 'లాటెంప్టే' లోది కాకపోతే మరేదై ఉంటుంది?" అన్నది అనుమానంగా.

"అవును. ఇలాగే, జరిగింది! అప్పుడు కూడా ఈమె ఇలాగే ఉలికిపడింది. దగ్గరికి వస్తూ ఇలాగే మెల్లగా చిరునవ్వు నవ్వింది. అప్పుడూ నేను ఇలాగే అనుకున్నాను. ఆ అమ్మాయిలో కూడా ఏదో కొరత ఉంది లేదు." అని అనుకుంది నటాషా. తరువాత బిగ్గరగా. "నీవు తప్పు చెప్పావు. ఇది 'పోర్టర్‌డీ' అనే స్వరమేళలోది." అని అంటూ ఆ రాగం పాడింది. "ఎక్కడికి వెడుతున్నావు?" అని అడిగింది.

"బొమ్మ పూర్తి చేయడం కోసం కొంచెం మంచినీళ్ళు తెచ్చుకుందామని వెడుతున్నాను." అని చెప్పింది సోనియా.

"నీవెప్పుడూ ఏదో పనిలోనే ఉంటావు. నాకేమీ పని వుండదు... నికోలస్ ఏడీ ?"

"నిద్రపోతున్నాడను కుంటాను."

"వెళ్ళి అతన్ని లేపు సోనియా. ఒకమాటు వచ్చి పాడమని చెప్పు."

సోనియా వెళ్ళింది. నటాషా మళ్ళీ తన కలలో పడిపోయింది. ఇదంతా ఎలా జరిగిందా అని అచ్చెరువు పడుతోంది. ఆ చిక్కు సమస్యకు సమాధానం తోచక మళ్ళీ పాత స్మృతులను నెమరువేసుకుంటూ ఉంది. అతన్ని చూడగలదు—అతన్ని

అతని కళ్ళు తన ముఖంలోకి ఉంచడాన్ని చూడగలదు! "ఆ జ్ఞాపకాలు వద్దు.అతను మళ్ళీ రాడేమో?.... ఏమైనా నేను పెద్దదాన్ని అయిపోతున్నాను. ఇప్పుడు నేనెలా ఉన్నానో ఎప్పుడూ అలా ఉంటానా? ఎవరికి తెలుస్తుంది?ఎప్పుడూ అలా ఉండను. అతను బహుశా ఇవాళ వచ్చాడేమో? ఇక్కడే- ఈ డ్రాయింగ్ రూంలో ఉన్నాడేమో? నిన్ననే వచ్చాడేమో? నేను మరిచిపోయానేమో ?...." అనుకున్నది.

ఆమె లేచి గిటార్ అవతల పెట్టి ప్రక్క గదిలోకి వెళ్ళింది.ఇంటిలోని వారందరూ టీ టేబిల్‌చుట్టూ కూచుని ఉన్నారు. ప్రొఫెసర్లు, గవర్నెస్‌లు, అతిధులు, అంతా ఉన్నారు. సేవకుడు కూడా ఉన్నాడు.కానీ ఆంద్రూ మాత్రం లేడు.

"అదిగో అమ్మాయి వచ్చింది! రా అమ్మాయ్! కూచో." అన్నాడు తండ్రి, ఆమెను చూచి.

కాని నటాషా తండ్రి మాట పట్టించుకోకుండా తల్లి దగ్గరికి వెళ్ళి నిలుచుంది.

"అమ్మా ఆయన్ను నాకు తెచ్చిపెట్టవా ? ఆయన్ను నాకివ్వవే త్వరగా." అన్నది తల్లి చెవిలో.

తరువాత కూచుని అంతా మాట్లాడుకునే మాటలు వినడం మొదలుపెట్టింది. "అబ్బా! ఎప్పుడూ వీరే. ఎప్పుడూ ఒకటే విషయాలు.... నాన్న, ఎప్పుడూ పట్టుకున్నట్టుగానే తన కప్పు పట్టుకుంటాడు. నిన్నటిలాగానే ఇవాళ కూడా టీ చల్లార్చుకోవడానికి నాన్న ఆ టీని ఊదుతున్నాడు. రేపు కూడా ఇలాగే .. " అనుకున్నది.

ఆమెకు వారి పట్ల ఒక విధమైన హేయభావం కలిగింది. వారు ఎప్పుడూ ఒకే విధంగా ఉన్నందుకు ఆమె కలాంటి భావం కలిగింది.

టీ తాగిన తరువాత సోనియా, నటాషా, నికోలస్‌లు డ్రాయింగ్ రూంలో వారు మామూలుగా కూచునే మూల ముడుచుకుని కూచున్నారు. అక్కడే హాయిగా మాట్లాడుకుంటూ ఉంటారు.

## 36

"ఎన్నడైనా నీకిలా అనిపించిందా? జీవితంలో ఇక ముందు ఆశించవలసిందేమీ లేదంటూ, అనుభవించవలసిన సౌఖ్యమంతా అయిపోయినట్టూ- ఇక అలసట తప్ప మిగిలిందేమీ లేనట్లూ, ఎన్నడైనా నీకిలా అనిపించిందా?" అని నటాషా తన అన్నను అడిగింది.

"ఆ, అనేకసార్లు నా కలా అనిపించింది. తరుచుగా నేనెన్నోసార్లు నా స్నేహితులు కులాసాగా ఉండడం చూచాను. నేనూ వారితోపాటు ఎంతో కులాసాగా ఉండేవాణ్ణి. నన్ను హఠాత్తుగా విచారం ముంచెత్తింది. జీవితమంటే హేయభావం కలి

గేది. మనమంతా ఒక్కమాటుగా చనిపోతామని అచ్చెరువు పడేవాణ్ణి. ఒకరోజున నేను దళంలో ఉండగా, ఇలాగే జరిగింది. చక్కగా బ్యాండు మ్రోగుతూ వుంది.కాని నన్ను మాత్రం ఏదో విచారం ముంచెత్తింది.నేను అడుగు తీసి అడుగు కూడా పెట్ట లేకపోయాను" అని చెప్పాడు నికోలస్.

"నిజంగా ఎంత చక్కగా చెప్పావూ! నాకూ ఒక మాటు ఇలాగే జరిగింది" అని నటాషా చెప్పసాగింది. "అప్పుడు నేను చాలా చిన్న పిల్లను. ఏవో పండ్లు తిన్నందుకు నన్ను కొట్టారు. నిజానికి నేనాపని చేయలేదు. అప్పుడు మీరంతా నృత్యంలో మునిగివున్నారు. నేను ఒక్కతెనె గదిలో కూచుని ఉన్నాను .. అప్పుడు ఎలా ఏడ్చాననుకున్నావ్?ఎందుకు ఏడ్చానంటావా?నాపై నాకు ఎంతో జాలీ,సుఖంగా కాలం గడుపుతున్న మీపట్ల విసుగూ కలిగాయి."

"నాకూ జ్ఞాపకముంది. నేను నిన్ను ఓదార్చడానికి వచ్చాను. కాని నాకు నిన్ను ఓదార్చడం ఎలాగో తెలీలేదు... అప్పుడు మనం చాలా చిన్నపిల్లలం కదూ! అప్పుడు నా దగ్గర గలగలలాడే ఒక చిన్న బొమ్మ కూడా ఉండేది. దాన్ని నీకు బహుమతి కూడా ఇచ్చాను." "నీకు మరో విషయం జ్ఞాపకముందా?అంతకు ముందు చాలా కాలం క్రితం— అప్పుడు మనం వ్రేలెడంత పిల్లలం కూడా కాదు. మామయ్య మనలను తన గదిలోకి పిలిచాడు. గదంతా చీకటిగా ఉంది.హఠాత్తుగా మనం ఒకరిని చూచాం..."

"ఒక నీగ్రోను కదూ?" అన్నాడు నికోలస్, తన జ్ఞాపకానికి చిరు నవ్వు నవ్వుతూ, "అవును. ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్టుగా ఉంది. ఈ రోజుకూ అది కలా లేక నిజమా అని ఆశ్చర్యం కలుగుతూ ఉంది. లేక మనం తరువాత అలా ఊహించుకున్నామంటావా?"

"అతనివి తెల్లని పళ్ళు. నల్లటి కళ్ళతో మన వంక అదే పనిగా చూచాడు."

"అతను నీకు జ్ఞాపకమేనా సోనియా?"

"ఆ ఆ, కొంచెం మసక మసకగా జ్ఞాపకం."

"కాని అమ్మ, నాన్న మాత్రం ఎప్పుడూ నీగ్రో అనేవాడు మన ఇంటికి రాలేదని చెప్పారు—తరువాత కోడిగుడ్లు. నీకు కోడిగుడ్ల విషయం జ్ఞాపకమేనా? ఈస్టర్ పండుగకు మనం కోడిగుడ్లు ఎన్నో కూడబెట్టుకునేవాళ్ళం. ఒక రోజున ఇద్దరు ముసలి స్త్రీలు వచ్చి మన టేబిల్ చుట్టూ తిరిగారు."

"ఆ జ్ఞాపకమే, నాన్న తన ఉన్నికోటు వేసుకునేవాడు. బాల్కనీలో నిలుచుని తుపాకి కాల్చేవాడు.....జ్ఞాపకమేనా?"

ఇలా వారు ఒక్కొక్క విషయమే జ్ఞాపకం చేసుకోసాగారు. వృద్ధాప్యం తాలూకు చేదుస్మృతులు కాదు; పసితనం తాలూకు చక్కని చిత్రాలు-ఒక అవ్యక్త

మైన విదూర పథాంతరాలలో అవి అలా తేలి వాడిపోతుంటాయి. ఇలకూ కలకూ మధ్య ఉన్న ఒక రేఖపై ప్రయాణం చేస్తాయి. కాని ఆ పిల్లల జ్ఞాపకాలన్నీ ఒకే రకంగా ఉండడం సహజమే అయినప్పటికీ సోనియాకు మాత్రం అవి అంతగా జ్ఞాపకం లేవు. వారు తెచ్చుకున్నంతగా ఆమె జ్ఞాపకం తెచ్చుకో లేదు. ఆమెకు అలాటి అవ్యక్తమైన అనుభూతి కూడా కలగ లేదు. వారు సుఖంగా ఉన్నారు కాబట్టి తను కూడా సుఖంగా ఉన్నది. వారితో మిళితం కావాలని ఎంతో ప్రయత్నించింది కూడా. ఆ అమ్మాయికి తను ఆ ఇంట్లో మొట్టమొదట అడుగు పెట్టిననాటి స్మృతులు మాత్రమే జ్ఞాపకం. తను ఇంట్లో అడుగు పెట్టినప్పుడు నికోలస్‌ను చూచి ఎంతో భయపడేది.

"అప్పుడు నీవు తోటలోకి వెళ్ళి ఒక క్యాబేజీ మొక్క చాటున దాక్కున్నా వటగా?" అని అడిగింది నటాషా. "అది నిజం కాదని చెప్పడానికి అప్పుడు నే నెంతో భయపడ్డాను. కాని నే నెంతగా గాభరాపడ్డాననుకున్నావ్?"

ఈ లోగా తలుపు తెరుచుకుని ఒక స్త్రీ తల లోపలికి పెట్టి చూచి "అమ్మాయి గారూ, కోడిని పట్టుకున్నాను" అన్నది.

"ఇప్పుడు నా కక్కర్లేదు. మళ్ళీ పంపించెయ్యి పోలియా" అన్నది నటాషా.

ఈ లోగా గదిలోకి డిమ్లర్ వచ్చాడు. మూలనున్న తంత్రీవాద్యం దగ్గరికి వెళ్ళి దానిపై నున్న కవరు తీసి తీగెలు చెల్లా చెదురుగా మీటడం మొదలు పెట్టాడు.

"ఎడ్వర్డు కరలొవిచ్! నాకు ఇష్టమైన పాట-'పొలాలు' అనే పాట వుంది చూచావ్? ఆ పాట పాడు" అన్నది కౌంటెస్, ప్రక్కగదిలో నుంచి.

డిమ్లర్, ఒకమాటు తీగె మీటాడు. "పిల్లలేమిటి ఇంత ముచ్చటగా ఉంటు న్నారు!" అన్నాడు వారి వంక చూచి.

"మేము వేదాంతం మాట్లాడుకుంటున్నాములే" అన్నది నటాషా, తమ కల లను గురించి చెప్పుకుంటూ.

డిమ్లర్ పాట మొదలు పెట్టాడో లేదో, నటాషా మెల్లగా అడుగులు వేసు కుంటూ గదిలో ఒక మూలకు వెళ్ళి, అక్కడే టేబిల్ మీద వెలుగుతున్న ఒక కొవ్వొత్తి దీపాన్ని చేతపట్టుకొని ప్రక్క గదిలోకి వెళ్ళింది. ఆ దీపం అక్కడ పెట్టి మళ్ళీ తిరిగి వచ్చి తన స్థానంలో తను వచ్చి కూచుంది. ఇప్పుడు గదంతా చీకటిగా వుంది. ముఖ్యంగా ఆమె కూచున్న మూల మరింత చీకటిగా ఉంది. కాని వెన్నెల కిరణాలు తెరిచి ఉన్న విశాలమయిన కిటికీల్లోంచి వచ్చి నేల మీద మడుగు ల్లాగా పరుచుకుంటూ ఉన్నాయి.

"నీకో విషయం తెలుసా?" అని మొదలు పెట్టింది నటాషా. అప్పటికి డిమ్లర్ ఆలాపన ముగించి తీగెల కొసలమీద వేళ్ళు ఆడిస్తున్నాడు. ఆ తరువాత ఏ రాగం ఆలాపించాలా అని ఆలోచిస్తున్నాడు.

"చూచావ్? నేను ఒకదాని తరువాత ఒకటి వెనుకటి విషయాలు జ్ఞాపకం తెచ్చుకుంటూ ఉంటే, అలా వెనక్కు వెళ్ళగా వెళ్ళగా నేను పుట్టకముందు జరిగిన విషయాలు కూడా జ్ఞాపకం వస్తాయనుకుంటాను. ఆ తరువాత...." అన్నది నటాషా.

"దాన్ని జన్మాంతర శాస్త్రం అంటారు"అన్నది సోనియా, తను చిన్ననాడు నేర్చుకున్న పాఠాలు గుర్తుకు తెచ్చుకుంటూ. "మన ఆత్మలు మనం పుట్టక పూర్వం జంతువుల దేహాల్లో ఉండేవనీ, మనం చనిపోయిన తరువాత మళ్ళీఅక్కడికి వెడతాయనీ, ఈజిప్ట్ దేశీయులలో ఒక నమ్మకం ఉంది."

"నేనా విషయం నమ్మను" అన్నది నటాషా, మెల్లని గొంతుతో. "కాని నాకు మాత్రం ఒక నమ్మకం ఉంది. మనం ఒకప్పుడు దేవతలమై ఉంటాం! ఎక్కడో, ఎప్పుడో! ఇప్పుడు కూడా మనం దేవతలమే కావచ్చు. అందుచేతనే మన పూర్వజన్మకు సంబంధించిన విషయాలు కూడా జ్ఞాపకం ఉంటాయి.

"నేను వచ్చి మీలో కలవ వచ్చా?" అంటూ డిమ్లర్ వారి దగ్గరికి వచ్చాడు.

"మనం ఒకప్పుడు దేవతలమైతే, ఇప్పుడిలా పతనమై పోవడానికి కారణ మేమిటి?"

"పతనమైనామని ఎవరన్నారు? నే నిదివరకు ఎలా ఉన్నానో యెవరికి తెలుసు?" అన్నది నటాషా. "ఆత్మ అనశ్వరత్వం అయింది కాబట్టి, నేను భవిష్యత్తులో కూడా ఎప్పుడూ జీవిస్తాను కాబట్టి నేను పూర్వం కూడా ఉండే ఉంటాను.నా వెనకాల కూడా ఒక అనశ్వరత్వం ఉండే తీరుతుంది" అన్నదామె మళ్ళీ.

"అవును. కాని దాన్ని ఊహించడం ఎంతో కష్టం" అన్నాడు డిమ్లర్.

"ఏం? ఎందుచేత?" అని అడిగింది నటాషా. ఇవాళ గడిచిపోతే రేపు వస్తుంది. తరువాత ఆ మరుసటి రోజు వస్తుంది. ఇలా రోజులు గడిచి పోతాయి. గడిచిపోయింది నిన్న! వచ్చేది రేపు!" అన్నది.

"నటాషా! ఈ సారి నీ వంతు. నాకేదైనా పాటపాడి వినిపించు" అన్నది తల్లి. "ఏమిటి దొంగల్లాగా ఈ మూల కూచుని ఉన్నారు?" అని అడిగింది.

"నా కిప్పుడు మనస్సు బాగా లేదమ్మా" అన్నది నటాషా.

ఇలా అన్నప్పటికీ అక్కణ్ణుంచి లేచింది. నికోలస్ పియానో దగ్గర కూచున్నాడు. నటాషా మామూలుగా గది మధ్యలో నిలుచుని తన తల్లి ఎంతో ముచ్చట పడుతూ వచ్చే ఒక గీతం పాడింది.

తన మనస్సు బాగాలేదని ఆమె చెప్పినప్పటికీ, నటాషా ఈ విధంగా పాడి ఎంతో కాలమైంది. ఈ సాయంత్రం పాడినట్లు ఇదివర కెన్నడూ పాడలేదు. తన గదిలో మిటెంకాతో మాట్లాడుతున్న ఆమె తండ్రి ఆమె తొలి స్వరం వినగానే ఆట

కోసం పుస్తకాలు మూసేసి పరుగెత్తే బడి పిల్లవాడి లాగా తను చెప్పవలసిన విష యాలన్నీ త్వర త్వరగా ముగించి ఆపివేశాడు. తరువాత నిశ్శబ్దంగా కూచుని పాట వింటున్నాడు. మిటెంకా కూడా ఆయన ముందు నిలుచుని పాట ఆలకిస్తున్నాడు. నికోలస్ ఒక్క నిముషం కూడా తన చెల్లెలు ముఖం మీది నుంచి తన కళ్ళను తీయనే లేదు. సోనియా తనకూ తన స్నేహితురాలికీ ఉన్న వ్యత్యాసాన్ని గురించి ఆలోచిస్తూ ఉంది. తన స్నేహితురాలి లాగా తను పాడలేనని అనుకుంటూ ఉంది. 'పేషన్స్' పేకాట ఆడుకుంటున్న వృద్ధ కౌంటెస్ మధ్యలో ఆగి పాట వింటోంది. విచార పూరితమైన ఒక చక్కని చిరునవ్వు ఆమె పెదవులపై అల్లలాడింది. ఆమె కళ్ళు నీళ్ళతో నిండాయి. తన యౌవనాన్నీ, కుమార్తె భవిష్యత్తునూ, కానున్న ఆమె విచిత్రమైన వివాహాన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటూ తల ఊపింది.

డిమ్లర్ ఆమె ప్రక్కనే కూచుని అరమూతలు పడిన కళ్ళతో ఆ పాటను తన్మయుడై వింటున్నాడు. "నిజంగా ఎంత చక్కని ప్రతిభ! ఇక ఆమె నేర్చుకో వలసిందేమీ లేదు. ఎంతటి శక్తి, ఎంతటి తీయదనం, ఎంతటి నిండుదనం!..." అనుకున్నాడు.

"దాని సుఖం తలుచుకుంటే నా కెంతటి భయం వేస్తుందనుకున్నావ్?" అన్నది వృద్ధ కౌంటెస్. తన హృదయములోని జ్వాల ఒకప్పుడు తన బిడ్డ శాంతికి భంగం కలిగిస్తుందని ఆ తల్లికి తెలుసు.

నటాషా ఇంకా పాడుతూనే ఉంది. పేట్యా గదిలోకి గొడవగా దూసు కుంటూ వచ్చాడు.

"మొద్దు వెధవ!" అన్నది నటాషా, హఠాత్తుగా పాట ఆపివేసి. తరువాత ఆమె కుర్చీలో కూలబడి వెక్కి వెక్కి ఏడవ సాగింది. ఆమె తేరుకునే సరికి కొంత సేపు పట్టింది. "ఏం లేదమ్మా, నిజంగా ఏమీ లేదు" అన్నది చిరునవ్వు నవ్వడా నికి ప్రయత్నిస్తూ. "పేట్యా నన్ను భయపెట్టాడు. అంతకంటె మరేం లేదు" అన్నది.

చిన్నవారంతా అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు. కాని ఒక అరగంట తరువాత ఒక వృద్ధ జమీందారిణి మాసికలు వేసి కుట్టిన ఒక విచిత్రమైన ముస్తాబులో అక్క డికి వచ్చింది. అది ఎవరో కాదు. నికోలసే! పేట్యా తుర్కీ దేశస్థుల దుస్తుల్లో అక్కడికి వచ్చాడు. డిమ్లర్ బఫూన్ వేషం వేసుకుని అక్కడికి వచ్చాడు. నటాషా అశ్విక సైనికుడిలా ముస్తాబై వచ్చింది. సోనియా సర్ కాషియస్‌లాగా ముస్తాబై వచ్చింది. పిల్లలిద్దరూ కనుబొమలు చక్కగా తీర్చి దిద్దుకున్నారు. బొగ్గుతో మీసాలు దిద్దుకున్నారు.

వారిలా రక రకాల దుస్తుల్లో లోపలికి రాగానే అందరూ ఆశ్చర్య పోయారు. కొద్దిమంది, వారు వచ్చిన వెంటనే వారిని గుర్తించ గలిగారు.

"మీరందరూ వెళ్ళి ఆ ముసలివాణ్ణి భయపెట్టేస్తారు. అంతే" అన్నది కౌంటెస్. "మీరందరూ ఒక్కమాటుగా వెళ్ళడానికి కూడా ఆ ఇంట్లో చోటు లేదు. మీరు వెళ్ళ దలుచుకుంటే మెలుకోవ్‌ల ఇంటికి వెళ్ళండి" అన్నది.

మిసెస్ మెలుకోవ్ ఒక విధవరాలు. ప్రక్క గ్రామంలోనే ఉంటోంది. ఆమె ఇంటి నిండా పిల్లలున్నారు. రకరకాల వయస్సు గల పిల్లలు, ట్యూటర్లు, గవర్నెసులు ఉన్నారు. ఆమె ఉంటున్న ఊరు కూడా ఎంతో దూరంలో లేదు.

"మంచి మాట చెప్పావు. నేను కూడా వేషం వేసుకునిబయలుదేరుతున్నాను. మనమంతా వెళ్ళగానే వాళ్ళు ఉలిక్కి పడిపోతారు" అన్నాడు కౌంట్.

కాని ఆయన ఇలా అనడం ఆయన భార్య అభిప్రాయానికి ఏ మాత్రం అంగీకారంగా లేదు. ఆయన, వాచిన కాళ్ళతో ఈ చలిగాలిలో వెళ్ళడం ఏమాత్రం సమంజసంగా లేదు. కాని కౌంట్ వెడతానని పట్టు పట్టాడు. మిసెస్ కాస్, ఆడ పిల్లలకు వేషాలు వెయ్యడానికి తయారైంది. అందరి వేషాల్లోకి సోనియా వేషం ఎంతో బాగా కుదిరింది. తీర్చినట్టున్న ఆమె కనుబొమలు, మీసాలు ఎంతో అద్భుతంగా ఉన్నాయి. చక్కని ఆమె ముఖంలో ఏదో ఒక కొత్త భావం వచ్చింది. ఒక చక్కని యువకుడిలా ముస్తాబు చేసుకుంది. ఈ సాయంత్రంలోనే తన భావి అంతా ఆధారపడి ఉందని ఆమెకు లోలోపల ఏదో చెప్పింది.

కొద్ది నిముషాల్లో నాలుగు బండ్లు వచ్చి మెట్లముందు నిలుచున్నాయి. మూడు గుర్రాలు ఒక దానికి ఎదురుగా ఒకటి బండ్లకు కట్టారు. గంటలు గల గల లాడుతున్నాయి. మెట్లముందు బండ్లు వరుసగా నిలుచున్నాయి. పేరుకున్న మంచులో వస్తూ బండిగానులు చప్పుడు చేశాయి. అందరికంటె ముందుగా నటాషా బండిలో ఎక్కింది. అందరిలోకి ఆమె ఎంతో ఉత్సాహంగా ఉంది కూడా. ఆమెలోని ఆనందం ఒక జ్వరం లాగా అందరికీ అంటుకుంది. పిల్లలందరూ నవ్వుతూ కేకలు వేస్తూ ఆనందంతో మెట్లు దిగి వచ్చారు. రెండు బండ్లకు మామూలు గుర్రాలు కట్టారు. మూడో బండి కౌంట్ ఎక్కి వచ్చాడు. ఈ బండ్లలో ఒక బండికి ప్రసిద్ధమైన ఆర్లో గుర్రాన్ని కట్టారు. నాలుగో బండికి కట్టిన గుర్రం నికోలస్ స్వంత గుర్రం. జమీందారిణి వేషం ధరించి ఉన్న నికోలస్ గుర్రపు కళ్ళేలను చేతిలోకి తీసుకుని కూచున్నాడు. వెన్నెల పిండి ఆరబోసినట్లుగా ఉంది. ఆ వెన్నెల కళ్ళేల మీద పడి తళ తళ లాడుతోంది. ఆశ్చర్యంతోను కలవరంతోను అక్కడ చేరిన పిల్లలవైపు తలలు తిప్పి చూస్తున్న గుర్రాల కళ్ళలోను, తళ తళ లాడుతోంది.

నటాషా, సోనియా, మిసెస్ కాస్, మరిద్దరు స్త్రీలు నికోలస్ బండిలో ఎక్కారు. డిమ్లర్, అతని భార్య, పేట్యా, కౌంట్ బండిలో ఎక్కారు.

"నీవు ముందు వెళ్ళు జ్రకే!" అని నికోలస్ తన తండ్రి బండివాణ్ణి కేక వేశాడు.

ఆ బండి ముందు వెడితే కొద్ది సేపట్లోనే ఆ బండిని దాటించి తన బండిని తీసుకపోదామనే తలంపుతో ఇలా అన్నాడు నికోలస్.

కౌంట్ బండి అటూ ఇటూ ఊగిసలాడుతూ బయలుదేరింది. పేరుకున్న మంచులో అప్పటికే గాడిపెట్టిన బండిగానులు కర కరమని శబ్దం చేశాయి. గంటలు గణ గణా మ్రోగాయి. గుర్రాలు ఒక్కమాటు వెనక్కు తగ్గి బయలుదేరాయి. వెన్నెట్లో తళతళ లాడుతున్న మంచులో బండి అటూ ఇటూ పిండికొట్టిన పంచ దారలా చెదరగొట్టిస్తూ ముందుకు సాగిపోతుంది. ఆ తరువాత నికోలస్ తన బండి బయలుదేరదీశాడు. ఆ బండి వెనకాలే తక్కిన బళ్ళు సన్నగా ఉన్న ఆ తోవన బయలుదేరాయి. అలా వారు తోట ప్రక్కగుండా వెడుతూ వుండగా, పొడుగ్గా వున్న చెట్లనీడలు తోవలో పడుతున్నాయి. తోట దాటి రాగానే అన్ని వైపులా పెద్ద మైదానం కనిపించింది. తెల్లని వెన్నెల ఒక పెద్ద సరస్సు లాగా ఉంది. ఆ మైదానంలో వెన్నెల అనేక చోట్ల మడుగులు మడుగులుగా కట్టి తళ తళ లాడుతోంది.

"కుందేలు వెళ్ళిన జాడలు అవి!" అన్నది నటాషా. మంచుకు పేరుకున్నట్టుగా ఉన్న ఆ చలిగాలిలో ఆమె గొంతుక సన్నగా దూసుకుని పోయింది.

"ఎంత పల్చగా ఉన్నాయి ఈ జాడలు నికోలస్!" అన్నది సోనియా.

నికోలస్ చక్కటి ఆమె ముఖం వంక తిరిగి చూచాడు. నల్లని మీసాలతోను, తలపాగాతోను ఉన్న ఆమె ముఖం ఆ వెన్నెట్లో ఎంతో దూరంగాను, ఎంతో దగ్గరిగాను ఉన్నట్లు కనిపిస్తోంది.

"ఇది సోనియా కానేకాదు!" అన్నాడు నికోలస్ చిరునవ్వు నవ్వుతూ.

"ఏం? ఏమిటి సంగతి?"

"ఏమీలేదు" అన్నాడు.

వారి బండ్లు రహదారిపైకి వచ్చాయి. రోడ్డుపై గుర్రాల గిట్టల జాడలు, బండి గానుల జాడలు కనిపిస్తున్నాయి. అతని బండి గుర్రాలు ఎంతో వేగంతో పరుగులు తీస్తున్నాయి. ఒక గుర్రం తల తిప్పి మరింత వేగంతో పరుగిడుతోంది. మరోగుర్రం చెవులు నిక్కించి పరుగు అందుకోడానికి సమయం వచ్చిందా లేదా అని సందేహిస్తున్నట్లుగా ఉంది. జ్రకేబండి ఇప్పటికి ఎంతోదూరం వెళ్ళిపోయింది. తెల్లని మంచులో ఒక చిన్న చుక్కలాగా కనిపిస్తోంది. దూరం వెళ్ళేకొద్దీ గంటల చప్పుడు సన్నగిలుతోంది. కేకలు, పాటలు మాత్రం నిశ్శబ్దంగా ఉన్న ఆ చల్లని రాత్రిలో వినిపిస్తున్నాయి.

"పరుగెత్తండి నా చక్కని చుక్కల్లారా!" అన్నాడు నికోలస్. కళ్ళేలు కదిలించి గుర్రాలను అదిలిస్తూ, ఒక్కమాటు బండి ముందుకు దూకి నట్టనిపించింది. కాని వారి ముఖాలకు చురుగ్గా తగులుతున్న గాలి మాత్రమే, వారి బండ్లు ఎంత వేగంగా వెడుతున్నాయో వారికి తెలియచేస్తోంది. నికోలస్ వెనక్కు తిరిగి ఇద్దరు బండివాండ్ల వంక చూచాడు. వారు కేకలు వేస్తూ, అరుస్తూ గుర్రాలను అదిలిస్తున్నారు. నికోలస్ బండికి మధ్యలో కట్టిన గుర్రం, అదిలించగానే వేగం అందుకోడానికి సిద్ధంగా సమపాళంలో నడక సాగిస్తోంది.

త్వరలోనే మొదటి బండిని దాటిపోయారు. ఒక పల్లం దాటిన తరువాత ఒక అడ్డరోడ్డు వచ్చింది. అడ్డరోడ్డు ప్రక్కనే ఒక మైదానం ఉంది.

"ఇప్పుడు మనం ఎక్కడున్నట్టు?" అనుకున్నాడు నికోలస్.

"ఇది నదిప్రక్కనున్న పొలం, పల్లం అయి ఉంటాయి. అహ! కానట్టుందే! ఇప్పుడు మనం ఎక్కడున్నట్టు? ఇదంతా నాకేదో కొత్తగా వుంది. మనం ఎక్కడున్నామో తెలియడం లేదే? కానీ ఏం చేస్తాం?" అంటూ నికోలస్ తన బండిని సరాసరి పోనిచ్చాడు.

జక్రే ఒక నిముషంపాటు తన బండిని ఆపి, ఆ మంచులో గుండా బండిని ముందుకు తీసుకుని వస్తున్న నికోలస్ వంక చూచాడు.

"అక్కడే ఆగండయ్యా!" అని కేకవేసి ముందుకు వంగి గుర్రాలను అదిలించాడు. కొద్ది నిముషాలపాటు బండ్లు ప్రక్క ప్రక్కనే పరుగెత్తాయి. కాని కొద్ది సేపట్లోనే జక్రే ఎంత ప్రయత్నించినప్పటికీ నికోలస్ బండి వేగం అందుకుని మెరుపుతీగెలా ముందుకుపోయింది.ఒక చక్కని మంచుమబ్బు గుర్రాల గిట్టలు తాకి చెదిరి, వెనుక ఉన్న బండిపై వానజల్లులా కురిసింది. ఆడవాళ్ళు కెవ్వున కేక వేశారు. రెండు బండ్లూ ఏ బండి ముందు వెడదామా అని పోటీపడుతూ పోతున్నాయి. బండ్ల నీడలు ఒకదాని కొకటి అడ్డు తగులుతూ మంచులో కలిసిపోతున్నాయి.

తరువాత నికోలస్ తన బండి వేగాన్ని కొంచెం తగ్గించి ఒకమాటు తనచుట్టూ కలయచూచాడు. ముందు, వెనకా; అన్నివైపులా చక్కని దృశ్యం కనిపిస్తుంది. నక్షత్రాలు పొదిగి వెన్నెల తళ తళ లాడుతూ మడుగులు కట్టిన ఒక పెద్ద మైదానం.

"ఎడమ ప్రక్కకు వెళ్ళండయ్యా" అన్నాడు జక్రే.

"ఎడమ ప్రక్కకు ఎందుకు వెళ్ళాలి?" అనుకున్నాడు నికోలస్. మనం మెలుకోవ్ల ఇంటికి వెడుతున్నాం... కాని మనం ఎక్కడికి వెడుతున్నామో మనకే తెలియకుండా ఉంది. దోవ ఎక్కడికి తీసుకెడితే అక్కడికి పోతున్నాం. ఇదంతా ఎంతో విచిత్రంగా ఉంది" అనుకున్నాడు. ప్రక్కనున్న వాళ్ళవంక చూచాడు.

"అతని కనుబొమల వంక, మీసాల వంక చూడు! అవి ఎంత తెల్లబడి పోయాయో!" అన్నాడు. మీసాలు కనుబొమలు చక్కగా దిద్దుకున్నాడు ఒక "యువకుడు."

"అది నటాషా అనుకుంటాను" అనుకున్నాడు నికోలస్ తనలో తాను. "ఆ చిన్ని సర్ కాషియన్ ఎవరు? నాకు తెలియదే. కాని ఎంత ముచ్చటగా ఉన్నాడు! మీరు చలికి గడ్డ కట్టుకుని పోతున్నారా?" అన్నాడు.

పిల్లలిద్దరూ కిలకిల నవ్వారు. డిమ్లర్ జీర గొంతుకతో మాట్లాడుతూ ఏవో కబుర్లు చెపుతున్నాడు. అతను చెపుతున్న కబుర్లకు అంతా పగలబడి నవ్వుతున్నారు.

"బాగుంది బాగుంది! ఇప్పుడు మనం మంత్రాల అడవిలోకి వచ్చాం. ముత్యాలు పొదిగిన నేలపై నల్లని నీడలు పరుచుకున్నాయి. ముత్యాల వెలుగులతో కలిసిపోతున్నాయి. బహుశా అది ఒక మంత్ర భవనం అయి ఉంటుంది! పాల రాళ్ళతో, ముత్యాల ఇటుకలతో కట్టిన మంత్ర భవనం అది! దూరంగా జంతువుల అరుపులు వినిపిస్తున్నాయి...కాని ఇంతకూ ఇది మెలుకోవ్కా భవనమేనా? ఎంత దూరం తిరిగినా చివరకు రేవుకే చేరుకున్నట్లున్నామే!" అనుకున్నాడు నికోలస్ తనలో తాను.

నిజంగా అది మెలుకోవ్కా భవనమే. సేవకులు దీపాలు తీసుకుని వారిని కలుసుకోవడం కోసం వసారాలలోకి వచ్చారు.

"ఎవరక్కడ?" అని లోపల్నుంచి ఒక కంఠస్వరం వినిపించింది.

"కౌంట్ రోస్టోవ్ పిల్లల గొంతుకల్లాగా ఉన్నాయి!" అని సమాధానం చెప్పారు సేవకులు.

## 37

పెలాగెయా డేనిలోవ్నా మెలుకోవ్ తన పిల్లలతో కలిసి డ్రాయింగ్ రూంలో కూచుని ఉంది. ఆమె లావుగా బొద్దుగా వుంటుంది. చూడగానే కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. కళ్ళజోడు పెట్టుకుంది. పొడుగ్గా వ్రేలాడుతున్న గౌను వేసుకుంది. పిల్లలతో కలిసి డ్రాయింగ్ రూంలో కూచుని * మైనం కరిగిస్తూ పిల్లలను వినోదింప చేస్తోంది. గోడమీద పడుతున్న పిల్లల నీడలను చూస్తోంది. అప్పుడు ముందు హాలులో అడుగుల చప్పుడు, కంఠస్వరాలు వినిపించాయి. అశ్వికులు, మంత్రకత్తెలు, బఫూన్‌లు, ఎలుగుబంట్లు, చలికి గడ్డకట్టుకునిపోయిన ముఖాలు రుద్దుకుంటూ ఉన్నారు. బట్టలమీద పేరుకున్న మంచు దులుపుకుంటూ ఉన్నారు. ఉన్ని

---

* క్రిస్‌మస్ పండుగలో ఇలా చేసి సోదె చెపుతారు.

కోట్లు విప్పేసిన వెంటనే విశాలంగా ఉన్న పెద్ద డ్రాయింగ్ రూంలోకి పరుగెత్తుకుని వచ్చారు. వారు వచ్చిన వెంటనే డ్రాయింగ్ రూంలో దీపాలు వెలిగించారు. బఫూన్ వేషం వేసుకున్న డిమ్లర్, జమీందారిణి వేషంలో ఉన్న నికోలస్ ఒక నృత్యం చేశారు. ఇతరులు గోడకు దగ్గిరగా చేరగిలబడి నిలుచున్నారు. పిల్లలు కేకలు వేస్తూ ఆనందంతో అటూ ఇటూ గెంతుతున్నారు.

"ఎవరు ఎవరో చెప్పలేకుండా ఉన్నాం. అది నటాషాయేనా! అటు చూడు! నటాషాను చూస్తే మరెవరో జ్ఞాపకం వస్తున్నారు...అడ్వర్డ్ కారలొవిచ్! ఎంత చక్కగా ముస్తాబైనావూ? ఎంత చక్కగా నృత్యం చేశావూ? చక్కగా ఉన్న ఆ సర్‌కాషియన్ ఎవరు? సోనియాయే! ఇదంతా చూస్తుంటే ఎంత చిత్రంగా ఉంది! ఎవరీ కుర్రాడు? మిమ్మల్ని చూస్తుంటే ఎంత నవ్వొస్తూ ఉంది!" అంటూ మెలుకోవ్, తక్కినవాళ్ళు, అంతా ఒకేమాటు మాట్లాడుతూ పెద్దగా నవ్వుతూ కేకలు వేశారు.

నటాషా, మెలుకోవ్‌తోను, ఆమె పిల్లలతోను కలిసి వెంటనే వారి గదిలోకి వెళ్ళింది. బిరడాలు, అనేకరకాల వస్తువులు వారి దగ్గరికి తీసుకుని వచ్చారు. సగం తలుపు తెరుచుకుని నగ్నమైన భుజాలతో ఉన్న పరిచారికలు వీటినన్నిటినీ అందించారు. పదినిముషాల తరువాత ఇంట్లో ఉన్న పిల్లలందరూ అక్కడ గుంపుగా చేరారు. పెలాగెయా డెనిలోవ్నా కళ్ళజోడుతోను, మెల్లని చిరునవ్వుతోను వారందరి మధ్య అటూ ఇటూ తిరుగుతోంది. అందరికీ....వారూ వీరనకుండా సీట్లు సిద్ధం చేసి భోజనాలు అమర్చింది. ఒక్కొక్కరి ముఖం వంకే చూచింది. కాని ఎవరినీ గుర్తు పట్టలేకపోయింది. కొత్త ముస్తాబుల్లో ఉన్న తన పిల్లలను కూడా గుర్తు పట్టలేకపోయింది.

"అది ఎవరు?" అని అడిగింది తన గవర్నెస్‌ను, ఒక కాజన్ టార్టార్ ముందు ఆగి.

నిజానికి ఆ వేషంలో ఉన్నది తన కుమార్తె. "ఇది రోస్టోవ్‌ల పిల్లల్లో ఒక పిల్ల కదూ? నీ వెవరివి ఆశ్విక సైనికుడా? మీది ఏ దేశం?" అని నటాషాను అడిగింది.

తరువాత సోనియాను చూచి "ఈ తుర్కీ స్త్రీకి కొంచెం * 'పాస్టిలా' ఇవ్వండి" అని బట్లర్‌తో చెప్పింది.

రకరకాలయిన ముస్తాబుల్లో వున్న ఆ పిల్లలు అతి విచిత్రమైన నృత్యాలు చేస్తోంటే పెలాగెయా డెనిలోవ్నా తన చేరుమాలుతో ముఖం దాచుకుని నవ్వకుండా

---

* ఒక రకమైన వంటకం.

ఉండలేకపోయింది. ఆమె అలా ఆపు లేకుండా నవ్వుతోంటే ఆమె శరీరమంతా వణికిపోయింది. ఆ నవ్వులో ఎంతో నిర్మలత్వం కనిపించింది.

అన్ని విధాలైన నృత్యాలూ చేసిన తరువాత ఆఖరుకు 'హరోవడీ' అనే జాతీయ నృత్యాన్ని కూడా చేశారు. యజమానులు, సేవకులు, అందరూ కూడా ఒక పెద్ద వర్తులంగా నిలుచుని, ఒక పెద్ద తాడు పట్టుకుని, ఒక ఉంగరంతోను ఒక రూబుల్‌తోను ఆటలాడుకున్నారు. ఒక గంట తర్వాత నవ్వి, ఆడి, పాడి అంతా అలసిపోయారు. పెలాగెయా డెనీలోవ్‌నా అప్పుడు వారిని గుర్తించగలిగింది. అంత చక్కగా ముస్తాబై వారందరూ తనను ఆనందపరిచినందుకు ఆడపిల్లలందరినీ అభినందించింది. వారందరికీ డ్రాయింగ్ రూంలోను, సేవకులకు మాత్రం భోజనశాలలోను భోజనాలు ఏర్పాటు చేశారు.

"స్నానాల గదిలో జోస్యం చెప్పడమనేది చాలు, మిమ్మల్ని భయపెట్టడానికి" అన్నది మెలుకోవ్‌ల ఇంట్లో ఉండే ఒక వృద్ధపరిచారిక.

"అదేమి?" అని అడిగింది పెద్దపిల్ల.

"మీరెప్పుడూ అలాంటిపని చేయడానికి సాహసించ రనుకుంటాను."

"సరే, నేను వెడుతున్నాను" అన్నది సోనియా.

"మీరు ఎరిగి ఉన్న ఆ పిల్లకు ఏం జరిగిందో చెప్పండి" అన్నది మెలుకోవ్,

"ఒకప్పుడు ఒక పిల్ల స్నానాల గదిలోకి వెళ్ళింది. తనతోపాటు ఒక కోడిపుంజును, రెండు ప్లేట్లను కత్తులను ఫోర్కులను తీసుకెళ్ళిందట.నీవు కూడా అలాంటి పనే చెయ్యాలి సుమా! తరువాత ఆ అమ్మాయి స్నానాలగదిలో వేచి వుంది. హఠాత్తుగా గుర్రాల గంటల చప్పుడు వినిపించింది. ఎవరో వస్తున్నారు. ఎవరో ఆగి మేడ మీదికి వచ్చాడు. ఆ ఆఫీసర్ గదిలోకి రావడం ఆ అమ్మాయి చూచింది. నిజంగా కూడా అతను ఆఫీసరే. అతను వచ్చి ఆమెకు ఎదురుగానే కూచున్నాడు."

"ఎంత ఘోరం?" అన్నది నటాషా కళ్ళు పెద్దవి చేసుకుని. "అప్పుడతను ఆమెతో మాట్లాడాడా? నిజంగా మాట్లాడాడా?" అని అడిగింది.

"అవును! అతను ఒక మనిషిలాగానే మాట్లాడాడు. తన మాటలు వినిపించుకోమని ఆ అమ్మాయిని కోరాడు కూడా. ఆ అమ్మాయి మాత్రం అతని మాటలు వినడానికి నిరాకరించింది. కోడి కూసేవరకూ ఊరుకుంది. ఎంతో భయపడింది. చేతులతో ముఖాన్ని కప్పుకుంది. అతను ఆ అమ్మాయిని కౌగిట్లోకి తీసుకున్నాడు. అప్పుడు కాచుకుని ఉన్న పిల్లలు కొందరు లోనికి రాగానే ఆ అమ్మాయి కేక వేసింది."

"ఎందుకీ కథలన్నీ చెప్పి వాళ్ళను భయపెడతావ్?" అన్నది పెలాగెయా డెనీలోవ్నా.

"అది కాదమ్మా! మీరు జోస్యం చెప్పమన్నారు కదా? ఒకరు ఒకరి అదృష్టాన్ని ధాన్యపుకొట్లో కొలుచుకునేటట్లయితే అప్పుడు ఏం చెయ్యాలి చెప్పండి?" అని అడిగింది సోనియా.

"అదేముంది? అది చాలా చిన్న విషయం. మనం ధాన్యపు కొట్టు దగ్గరికి పోతాం. ఉదాహరణకు చెపుతాను విను. పంట మార్పిడి కనుక వినిపించినట్లయితే అది అదృష్టం కాదన్నమాట. ధాన్యం రాలడం కనుక వినిపించినట్లయితే అది అదృష్టం అన్నమాట."

"అయితే అమ్మా! అక్కడికి వెళ్ళినప్పుడు మీకేం జరిగిందో చెప్పండి?"

"ఇప్పుడు కాదు. నాకు జరిగి ఎంతో కాలమైంది. ఇప్పుడు నాకు జ్ఞాపకం కూడా లేదు. అదీగాక అలా చేయడానికి మీలో ఎవరికీ ధైర్యం కూడా చాలదు" అన్నది పెలాగెయా డెనీలోవ్నా.

"సరే ఇక నన్ను వెళ్ళనివ్వండి" అన్నది సోనియా.

"నీకు భయం లేకపోతే అలాగే వెళ్ళు."

"నేను వెళ్లొచ్చా మిసెస్ కాన్?" అని సోనియా తన గవర్నెస్‌ను అడిగింది.

ఇహ ఆటలాడుతున్నప్పుడు కాని, ఊరిక కూచున్నప్పుడు కాని, మాట్లాడుతున్నప్పుడు కాని ఆ సాయంకాలం నికోలస్, సోనియాను ఒక్క నిముషం కూడా వదిలిపెట్టి ఉండలేదు. అప్పుడతనికి అదే తొలిసారిగా ఆమెను చూచినట్టుగా ఉంది. ఆమె గుణగణాలన్నీ అతనికి ఇప్పుడే కనిపించినట్టుగా ఉన్నాయి. తన విచిత్రమైన ముస్తాబులో ఎంతో ముచ్చటగా కనిపిస్తున్న ఆ పిల్ల అతన్ని పూర్తిగా ఆకట్టుకుంది.

"నేనెంత పిచ్చివాణ్ణి!" అనుకున్నాడతను. మిలమిల లాడుతున్న ఆ కళ్ళ వంక, చక్కని ఆ చిరునవ్వు వంక చూస్తూ. ఇప్పుడు ఆమె బుగ్గలకు ఒక చిన్న సొట్ట కనిపించింది. ఇదివరకెన్నడూ అతను అది గమనించలేదు.

"నాకేమైనా భయం లేదు" అన్నది సోనియా. అక్కడి నుంచి లేచి ధాన్యపు కొట్టు దగ్గరికి దారి అడిగింది. అక్కడ ఆగి తను ఏం చేయాలో తెలుసుకుంది. తరువాత ఒక ఉన్నికోటు భుజాల మీద వేసుకుని ఒక మాటు నికోలస్ వంక చూచి అక్కడి నుంచి బయటికి వెళ్ళిపోయింది.

వసారాలోగుండా మెట్ల వరుస వెనకాల నుంచి క్రిందికి వెళ్ళింది. నికోలస్ గదిలో ఉక్కపోస్తూ ఉందని ముందు వాకిలిగుండా బయటికి వెళ్ళాడు. ఎప్పటిలాగానే చలిగా ఉంది. పూర్వం కంటె వెన్నెల ఎక్కువ.

నికోలస్ త్వరత్వరగా హాలులోనుంచి బయటికి వచ్చాడు. ఇంటి మూలను తిరిగి సోనియా వచ్చే ప్రక్కనున్న తలుపు దగ్గరికి వెళ్ళాడు. ధాన్యపు కొట్టు ఇక కొద్దిదూరంలోనే ఉంది చెట్ల నీడలు కనిపిస్తున్నాయి.

"సరాసరి అలాగే వెళ్ళమ్మాయ్, వెనక్కు తిరిగి చూడకు."

"నాకేం భయం లేదు" అన్నది సోనియా.

ఆమె చిన్ని చెప్పులు మంచు తివాసీపై మెల్లగా చప్పుడు చేయగా ఆమె పరు గెత్తుకుంటూ వెళ్ళి నికోలస్‌ను కలుసుకుంది. నికోలస్ ఒక్క రెండు గజాలదూరంలో మాత్రమే ఉన్నాడు. అయినా ఈ నికోలస్ తను రోజూ చూచే నికోలస్ కాదు. ఇవాళ అతను ఎంతో మారిపోయాడు ! అతనిలో ఈ మార్పు తీసుకొచ్చిందేమిటో? అతను ధరించిన స్త్రీ దుస్తులా లేక సాధారణంగా అతనిముఖంలో ఎప్పుడూ కనిపించని అందమైన చిరునవ్వా ? ఏమిటో మరి ?

"సోనియా ఎన్నడూ ఇలా లేదు. అయినా ఆమె ఆమెలాగానే ఉంది !" అనుకున్నాడు నికోలస్, వెన్నెట్లో వెలుగుతున్న ఆ చిన్నారి ముఖంవంక చూచి.

ఆమె కప్పుకున్న ఉన్ని కోటులో నుంచి తన చేతులు పోనిచ్చి ఆమెను దగ్గరికి తీసుకుని, ఆమె పెదవులు ముద్దాడాడు. ఇంకా ఆమె పెదవులు బొగ్గువాసన వేస్తూనే ఉన్నాయి.

"నికోలస్ !"

"సోనియా !"

ఒకరితో ఒకరు గుసగుస లాడుకున్నారు.సోనియా అతనిముఖాన్ని తన చిన్ని చేతులతో నిమిరింది. తరువాత చెట్టాపట్టాలు పట్టుకుని ధాన్యపుకొట్టు దగ్గరికి పరు గెత్తి తిరిగి వచ్చారు. తరువాత వారు వచ్చిన వేరు వేరు వాకిళ్ళ గుండానే మళ్ళీ తిరిగి వెళ్ళారు.

# 38

నటాషా ఇదంతా గమనిస్తూనే ఉంది. తిరిగి వెళ్ళేటప్పుడు తను మిసెస్ కాస్, డిమ్లర్ ఒక బండిలో వెళ్ళేటట్టూ; పరిచారికలు, నికోలస్, సోనియా ఒక బండిలో వెళ్ళేటట్టూ ఏర్పాటు చేసింది. నికోలస్ ఇంటికి వెళ్ళాలని తొందరపడడం లేదు. సోనియావంక చూచి, ఆ వేషంలో ఉన్న అసలైన సోనియాను, తన సోనియాను, తనను ఎన్నడూ విడిచిపోని సోనియాను కనుక్కోవాలని ప్రయత్నిస్తూ ఉన్నాడు. వెన్నెల, తీయనిపెదవులపై ఉంచిన ముద్దుతాలూకు జ్ఞాపకం, బొగ్గువాసన' మంచు కప్పిన నేల. నక్షత్రాలతో పొదిగిన నీలాకాశం, చల్లని గాలి—ఈ పరిసరాల వల్ల తను ఒక మంత్రలోకంలో ప్రయాణం చేస్తున్నట్టుగా ఊహించుకున్నాడు.

"సోనియా ! నీకు సంతోషంగా ఉందా ?" అని అడిగాడు.

"ఆ. మరి నీకూ ?" అన్నదామె.

నికోలస్ ఒక క్షణం ఆగి, కళ్ళేలు మరో బండివానికి ఇచ్చి నటాషా కూచున్న బండిలోకి వెళ్ళాడు.

"చూడు ! సోనియా విషయంలో నే నొక నిశ్చయానికి వచ్చాను" అన్నాడు మెల్లగా, ఫ్రెంచి భాషలో.

"ఆమెతో మాట్లాడావా ?" అని అడిగింది నటాషా, ఆనందంతో.

"నటాషా ! నీకా మీసాలు ఎంత చక్కగా ఉన్నాయి ! నీకు సంతోషంగా ఉందా ?"

"సంతోష మేమిటి ? ఎంతో ఆనందంగా ఉంది. నీతో నే నెప్పుడూ ఏమీ చెప్పలేదు. కాని నీతో నేను చాలా విసుగెత్తి పోయాను. ఆ అమ్మాయి ముత్యం లాటిది. నేను మాత్రం గడుసుపిల్లను ! ఆనందమంతా ఇప్పుడు నాకోసమే ఉంచుకోడానికి నాకిష్టం లేదు. నీవు మళ్ళీ ఆ అమ్మాయి దగ్గరికి వెళ్ళు."

"ఉండు ఒక్క క్షణం ఆగు. నీవెంత చిత్రంగా ఉన్నావు ?" అన్నాడు మళ్ళీ ఆమె ముఖంవంక చూస్తూ. ఆ ముఖంలోకూడా అతనికొక మృదుత్వము, ఆర్ద్రత కనిపించాయి. "నటాషా ! దీనికంతా వెనకాల ఏదో చిత్రం ఉందనుకుంటాను" అన్నాడు.

"నీవు తెలివిగానే నడుచుకున్నావు ఇక వెళ్ళు" అన్నదామె.

"ఈ క్షణంలో నటాషా ఎలా కనిపించిందో నాకు పూర్వంకూడా ఆమె అలాగే కనిపించి ఉన్నట్లయితే నేను ఆమె సలహా కోరి, ఆ ప్రకారం అక్షరాలా నడుచుకుని ఉండేవాణ్ణి. అప్పుడంతా సరిగా ఉండేది" అని నికోలస్ తనలో తాను అనుకుని మళ్ళీ ఆమెతో "అయితే నీకిప్పుడు సంతోషంగానే ఉందా ? నేను మంచి పనే చేశానంటావా ?" అన్నాడు.

"ఆ. అవును నిన్న నాకు అమ్మ మీద, నీమీద కోపం వచ్చింది కూడా. సోనియాయే నీ వెంట పడుతున్నదని అమ్మ అంటోంది. కాని నేను మాత్రం ఆ మాట ఎవరన్నా ఒప్పుకోను. సోనియా ఎంతో మంచిది. ఎంతో మంచిపిల్ల !"

"మంచిది" అంటూ నికోలస్ బండిలో నుంచి దూకి ఒక్క నాలుగు అడుగుల్లో వెళ్ళి తన బండిని కలుసుకున్నాడు. ఆ బండ్లో కూచున్న చిన్ని సర్కాషియన్ అతన్ని చిరునవ్వుతో ఆహ్వానించింది. ఆ సర్కాషియన్ సోనియాయే. సోనియా తనకు చిన్నభార్య అవుతుంది. తప్పకుండా అవుతుంది. ఏ మాత్రం సందేహం లేదు.

వాస ఇంటికి వెళ్ళగానే పిల్లలిద్దరూ కౌంటెస్ గదిలోకి వెళ్ళి జరిగిన విషయా లన్నీ ఆమెతో చెప్పారు. తరువాత పడుకోడానికి వెళ్ళారు. మీసాలు కూడా తుడుచు కోకుండా, ముస్తాబునుకూడా విప్పకుండా అలాగే మాట్లాడుకుంటూ నిలుచున్నారు. వారి ఆనందాన్ని గురించి, వారి భావిని గురించి ఎంతోసేపు మాట్లాడుకున్నారు.

"ఇదంతా ఎప్పటికి జరిగి తీరాలో ? ఏమవుతుందో ?" అన్నది నటాషా, రెండు నిలువుటద్దాలున్న టేబిల్ దగ్గరికి వెడుతూ.

"కూచో" అన్నది సోనియా. "అద్దంలో ముఖం చూచుకో ఏం కని పిస్తుందో ?" అన్నది.

నటాషా రెండు కొవ్వొత్తి దీపాలు వెలిగించి కూచుంది. "రెండు మీసాలు కనిపిస్తున్నాయి." అన్నది నవ్వుతూ.

"నీవు నవ్వకూడదు" అన్నది పరిచారిక.

నటాషా అద్దంలోకి తదేకంగా చూస్తూ కూచుంది. ఆమె ముఖం గంభీరంగా ఉంది. ఆమె మాట్లాడడం లేదు. చాలాసేపు ఏమి కనిపిస్తుందా అని అలాగే కూచుంది. ఒక శవపేటిక కనిపిస్తుందో ? లేక నిలమిలలాడుతున్న ఆ అద్దం వెనకాల ఆంద్రూ రాకుమారుడు ప్రత్యక్షమవుతాడో మరి ? అలా చూచిచూచి ఆమె కళ్ళు బాగా అలిసి పోయాయి. మినుకు మినుకుమంటున్న కొవ్వొత్తుల తళతళలు కూడా కనిపించడం లేదు. ఎంత ప్రయత్నించినా ఏమీ కనిపించడం లేదు. శవపేటికా లేదు, మనిషి ఆకృతీ లేదు. ఆమె అక్కణ్ణుంచి లేచింది.

"ఇతర్లకు అనేక విషయాలు కనిపిస్తాయి. నాకు మాత్రం అవేవీ కనిపించ వేం ? నీవిక్కడ కూచుని చూడు సోనియా, నాకు మారుగా నీవు చూడు, ఏం కనిపిస్తుందో ?" అన్నది.

సోనియా అద్దం ముందు కూచుని అద్ధంపై దృష్టి సారించింది.

"సోనియాకు తప్పకుండా ఏదో ఒకటి కనిపించి తీరుతుంది" అన్నది డొనీషా. "మీ రిలాటి మాటలు చెపుతుంటే నవ్వుతారు."

డొనీషా ఇలా అనడం సోనియా విన్నది. నటాషా ఆమెతో "అవును. ఆమె కేదో ఒకటి తప్పకుండా కనిపిస్తుంది. పోయిన సంవత్సరం కూడా కనిపించింది" అన్నది.

మూడు నిముషాలు ఇలా అందరూ మాట్లాడకుండా వేచి ఉన్నారు.

"తప్పకుండా ఏదో కనిపించి తీరుతుంది !" అన్నది నటాషా వణికి పోతూ.

సోనియా ఉలికిపడింది. ఒక చేత్తో ముఖం కప్పుకుని కేకలేసింది. "నటాషా !"

"ఏం కనిపించింది ? ఏమైనా కనిపించిందా ?" అన్నది నటాషా అద్దం దగ్గరికి వెడుతూ.

కాని సోనియా ఏమీ చూడలేదు. ఆమె కళ్ళు మసకలు కమ్ముతున్నాయి. ఆమె చూడడం ఆపివేద్దామనుకుంది. కాని ఈలోగా నటాషా అడిగిన మాట ఆమెను ఆపుచేసింది. వాళ్ళ ఆశలకు ఆమె భంగం కలిగించ దలుచుకోలేదు. కాని నిశ్చలంగా అలా కూచోవడమంటే ఎంతో అలసట కలిగించే విషయం. ఆమె ఎందుకలా కేక వేసిందో, ఎందుకలా ముఖం మూసుకుందో ఆమెకే తెలీదు.

"అతను కనిపించాడా ?" అని అడిగింది నటాషా.

"అవును. ఒక్క నిముషం ఆగు. అతన్ని చూచాను !" అన్నది సోనియా. 'అతను' అన్నప్పుడు అది నికోలస్సో, ఆంద్రూనో ఆమె నిశ్చయంగా చెప్పలేక పోయింది. 'నేనేదో చూచినట్టు వారి నెందుకు నమ్మించకూడ దూ?' అనుకుంది. 'ఇదివరకు చాలామంది ఇలా చేశారు. ఎవరూ కాదనలేదు.' అనుకుని "అవును. నే నతన్ని చూచాను" అన్నది.

"ఎలా ఉన్నాడు ? నిలుచుని ఉన్నాడా ? పడుకొని ఉన్నాడా ?"

"మొదట్లో ఏమీ కనిపించలేదు. తరువాత పడుకుని ఉన్నట్లుగా కని పించాడు."

"ఆంద్రూ పడుకుని ఉన్నాడా ? అయితే జబ్బుగా ఉన్నాడన్నమాట ?" అన్నది నటాషా భయంతో తన స్నేహితురాలివంక చూస్తూ.

"అబ్బే, అదేమీ లేదు. చాలా ఖులాసాగా ఉన్నాడు." అన్నది సోనియా.

"తరువాత సోనియా ? తరువాత ఏం కనిపించింది ?"

"తరువాత ఏమీ కనిపించలేదు. అంతా కలగాపులగంగా ఉంది."

"అయితే అతను మళ్ళీ ఇంటి కెప్పుడొస్తాడంటావ్ సోనియా ? అతన్ని మళ్ళీ ఎప్పుడు చూస్తాను ? అయ్యో, నాకెంత భయంగా ఉంది!"

సోనియా ఓదారుస్తున్నా వినిపించుకోకుండా నటాషా తన పక్కలో దూరి పడుకుంది. చాలాసేపటి వరకు-దీపాలు ఆరిపోయే వరకూ అలాగే మేలుకొని మంచుకప్పిన కిటికీ అద్దాలలోగుండా పడుతోన్న వెన్నెలవంక చూస్తూ పడుకుంది.

## 39

తరువాత చాలా రోజులకుకాని నికోలస్ సోనియాపట్ల తన ప్రేమను, తనామెను వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకున్నట్టు, తన తల్లికి వెలిబుచ్చాడు కాదు. ఎన్నాళ్ళనుంచో వారిద్దరిమధ్య జ్యరుగుతున్న ఈ విషయాలన్నీ గమనిస్తున్న కౌంటెస్, ఇలా జరుగుతుందనే అనుకున్నది. అతను చెపుతోంటే మెల్లగా అంతా

విన్నది. అంతా విన్న తరువాత అతను ఎవరినైనా పెళ్ళి చేసుకోవటానికి స్వేచ్ఛ ఉన్నప్పటికీ కూడా, తనుగానీ, అతని తండ్రికానీ ఇందుకు ఒప్పుకోవడం అసంభవ మని తెలిపింది. ఆ మాట వినగానే నికోలస్ అచ్చరువుపడ్డాడు తల్లికి తనపట్ల ఎంత ప్రేమ, గారాబం ఉన్నప్పటికీ ఆమె ఇప్పుడు తనపట్ల కోపంగా ఉన్నదనీ, ఎన్నటికీ తన నిశ్చయాన్ని మార్చుకోదనీ అనుకున్నాడు నికోలస్. ఆమె తన భర్త కోసం కబురు పంపింది. కొడుకు చెప్పిన విషయం నింపాదిగా ఆయనతో మాట్లాడదామని అనుకుంది. కాని తీరా చెప్పవచ్చే సరికి కోపం పట్టలేక వెక్కి వెక్కి ఏడుస్తూ ఆ గదిలోనుంచి వెళ్ళిపోయింది. వృద్ధకౌంట్ ముందు కొంచెం తటాపటాయించినా తరువాత నికోలస్‌ను తన ఉద్దేశం వదులుకోమని కోరాడు. కాని నికోలస్ మాత్రం తను మాట ఇచ్చాననీ, మాట తప్పడానికి వీలులేదనీ చెప్పాడు. కొడుకు ఇలా చెప్ప గానే తండ్రి ఏం చేయాలో తోచక ఒక్క మాటు నిశ్వసించి ఆ విషయం మార్చివేసి వెంటనే భార్యతోపాటు గదిలోనుంచి వెళ్ళిపోయాడు. తన కొడుకు పరిస్థితి ఇలా కావడానికి తనే కారణమనీ, అందుచేత శ్రీమంతుల సంబంధాన్ని వదులుకొని నిరు పేదరాలైనప్పటికీ సోనియాను భార్యగా ఎన్నుకున్నందుకు తను కొడుకును నిందించ లేననీ అనుకున్నాడు. తన అలవాట్లవల్ల ఈ ఎస్టేటు ఇలా పాడుకాకుండా ఉన్న ట్టయితే నిజంగా సోనియా తనకు కోడలే అయ్యేది.

ఈ తుపాను గడిచిన తరువాత కొద్ది రోజుల వరకూ ఇంట్లో అంతా మళ్ళీ ప్రశాంతంగానే ఉన్నారు. ఒకనాటి ఉదయాన కౌంటెస్ సోనియా కోసం కబురు పంపింది. ఆ అమ్మాయికి ఏ మాత్రం కృతజ్ఞత అనేది లేదనీ, తన కొడుకును వల్లో వేసుకోవడానికి ప్రయత్నిస్తున్నదనీ నిందించింది. ఆమె ఇలా అన్యాయంగా నిందిస్తూ ఉంటే సోనియా ఒక్క మాట కూడా జవాబు చెప్పకుండా కళ్ళు దించుకుని నిలుచుంది. తను ఏం చేయాలని వారు కోరుతున్నారో ఆమె ఊహించుకోలేకుండా ఉంది. తనకు ఆశ్రయం ఇచ్చిన వారికోసం ఎలాంటి త్యాగం చేయటానికయినా ఆమె సిద్ధంగా ఉంది. ఆమె వారికి సేవ చేస్తుండాలనే విషయంలో ఎలాంటి సందే హమూలేదు. కాని ఇప్పుడు ఈ విషయంలో తనేమి చేయాలో ఎంత ఆలోచించినా ఆమె మనస్సుకు తట్టిందికాదు. ఆమె వారందరినీ ప్రేమించకుండా ఉండలేదుకూడా. నికోలస్‌ను కూడా ప్రేమిస్తుంది. ఆమె లేకపోతే అతనికి సుఖమనేది కూడా ఉండదు. ఇక తను చేయవలసిందేమిటి?

తల్లితో ఈ తగాదా జరిగిన తరువాత సోనియాను రహస్యంగా పెళ్ళాడి తల్లిని భయపెట్టాలని యత్నించాడు నికోలస్. కాని చివరకు తన కోరిక ఈడేర్చ మని కోరడంలోనే సఫలత పొందాడు.

అతనిలా అడుగుతోంటే ఆమె ఏ మాత్రం పట్టించుకోకుండా జవాబు చెప్పింది.

ఇలా జవాబు చెప్పడంలో ఆమెకు సహజంకూడా కాదు. అతను పెద్దవాడయ్యాడనీ ఆంద్రూ రాకుమారుడు తండ్రి ఒప్పుదల లేకుండా పెళ్ళాడుతున్నట్టే అతను కూడా పెళ్ళాడవచ్చుననీ అన్నది. కాని ఆ అమ్మాయి తనకు కోడలు కావడం మాత్రం ఒప్పుకోనని చెప్పింది.

తల్లి మాట్లాడిన మాటలకు నికోలస్‌కు చెప్పరాని కోపం వచ్చింది. అంతటితో అతనితీరు మారిపోయి తన ప్రేమను, అనురాగాన్ని అమ్మడం ఆమె కోరిక అని అన్నాడు. మళ్ళీ ఒకమాటు ఆలోచించవలసిందని కోరాడు. లేకపోతే ఇక ఎన్నడూ ఆమె ముఖం చూడనని కూడా అనబోయాడు. కాని ఈలోగా తలుపు తెరుకుని నటాషా లోపలికి వచ్చింది. ఆమె ముఖం పాలిపోయి వివర్ణంగా ఉంది. ఆమె బయట ఉండి ఈ గొడవంతా వింటూనే ఉంది.

"నికోలస్! నీవేం మాట్లాతున్నావో నీకు తెలీడంలేదు. ఇక చాలించు" అన్నది తీవ్రంగా, అతనా వాక్యం ముగించేలోగానే. తరువాత తల్లితో "అమ్మా! అన్నయ్య ఉద్దేశం అదికాదు. నీకు తెలీదులే" అన్నది.

కౌంటెస్ ఇక తన గారాబు కొడుకుతో తెగతెంపులు చేసుకోవలసి వస్తుందని అతనివంక భయంతో చూచింది. అయినా అతని మాటకు ఒప్పుకోలేదు. అతని మొండితనము, అతని పట్టుదల ఆమెకెంతో కష్టం కలిగించాయి.

"నికోలస్! నీకో విషయం చెపుతాను-అమ్మా! నీవు కూడా విను..." అని ఏదో చెప్పబోయింది నటాషా. ఆమె మాటలు అస్పష్టంగా ఉన్నాయి. కాని అవి సాధించవలసిన ఉద్దేశాన్ని అవి సాధించాయి. కౌంటెస్ కన్నీళ్ళ పర్యంతమై కుమార్తె భుజంమీద తల దాచుకుని ఏడ్చింది. నికోలస్ రెండుచేతులతో తల పట్టుకుని గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

నటాషా, వారిద్దరికీ సమాధానం కుదురుద్దామని ఎన్నో ప్రయత్నాలు చేసింది. ఇక సోనియాను మాటలేమీ అనవద్దనీ తల్లిని కోరి ఆమెవద్ద వాగ్దానం తీసుకుంది. నికోలస్ కూడా తన తల్లిదండ్రులకు తెలీకుండా తొందరపడి ఏమీ చెయ్యనని చెప్పాడు.

కొద్ది రోజుల తరువాత ఇంట్లో గొడవలన్నీ ఇలా ఉండడంవల్ల నికోలస్ తిరిగీ తన దళంలో చేరడానికై బయలుదేరాడు. త్వరలో ఉద్యోగాన్ని వదలి ఇంటికి తిరిగివచ్చి సోనియాను పెళ్ళాడాలని నిశ్చయించుకున్నాడు కూడా.

తరువాత రోస్టోవ్‌ల గృహమంతా విచారంతో నిండిపోయింది. కౌంటెస్‌కు జబ్బుచేసి పడక పెట్టింది. సోనియాకు తనప్రియుడు దగ్గర లేకపోవడంవల్ల ఆ వియోగంలో వాడు పెడుతున్న బాధలు భరించడం మరీ కష్టంగా ఉంది. కౌంటెస్ మాట్లాడే ప్రతి మాటలోనూ ఆమెను ఎత్తిపొడుస్తూ ఉంది. కౌంట్ వ్యవహారాన్నీ

చిక్కుల్లో పడిపోయాయి. ఆయన చేతులు దాటిపోయినాయి కూడా. ఒక ఎస్టేటును మాస్కోలోగల ఒక ఇంటిని కూడా అమ్మవలసిన పరిస్థితి వచ్చింది. ఈ లావాదేవీ లన్నీ చూచుకోడానికి ఆయన వెళ్ళితీరాలి. కాని ఆయన భార్యఆరోగ్యం సరిగా లేకపోవడంవల్ల రోజురోజుకూ ఆయన ప్రయాణం వాయిదాపడుతూ వచ్చింది.

నటాషా తన ప్రియునినుంచి తొలి వియోగాన్ని మాత్రం ఎంతో ఓరిమితోను సంతోషంతోను భరించింది. కాని రానురాను ఆమెకు కూడా విచారం ఎక్కువవు తోంది. తన భర్తతో ఎంతో హాయిగా గడపవలసిన ఈ కాలం ఇలా వృథాగా గడిచిపోవడాన్ని గురించి ఆలోచించిన కొద్దీ ఆమెకు విచారం ఎక్కువకాజొచ్చింది. విదేశాలు చూస్తూ, కొత్త పరిచయాలు ఏర్పరుచుకుంటూ ఆంద్రూ అలా జీవితం గడ పడం ఆమె కిప్పుడు విసుగెత్తిస్తోంది. అతని ఉత్తరాలు ఎంత ఉత్సాహంగా ఉంటే, అవి చదివినప్పుడు ఆమె కోపం అంత ఎక్కువవుతోంది. అతనికి జవాబు వ్రాయా లని కూడా అనిపించడంలేదు. ఆమె జవాబు వ్రాసినప్పటికీ ఆ ఉత్తరాలు ఏదో నిస్సారంగాను, సాధారణంగాను ఉంటున్నాయి కాని వాటిలో జీవం ఏమీ కనిపించడం లేదు. ఒక్క మాటలో, ఒక్క చూపులో, ఒక్క చిరునవ్వులో చెప్పగలిగినదాన్ని ఆమె కాగితం మీద పెట్టలేక పోతోంది.

అందుచేత ఇక తప్పదన్నట్టుగా ఉత్తరాలు వ్రాస్తున్నదే కాని వాటిని గురించి అంత శ్రద్ధ తీసుకోవడంలేదు.

వారికి మాస్కోకు వెళ్ళవలసిన అవసరం రోజురోజుకూ ఎక్కువవుతోంది. ఆస్థిపాస్థుల అమ్మకం మాట అలా ఉంచి పెళ్ళి బట్టలు కూడా కుట్టించుకోవలసిన అవసరం ఉంది. అదీకాక ఆంద్రూ రాకుమారుని కూడా కలుసుకోవాలి. అతను ఏ రోజైనా అక్కడికి రావచ్చు. వృద్ధరాకుమారుడు శీతాకాలం అక్కడే గడుపు తాడు. ఈ పాటికి తనప్రియుడు విదేశాల నుంచి తిరిగి వచ్చే ఉంటాడనీ నటాషా అనుకుంది. అందుచేత కౌంటెస్‌కు ఇంకా ఆరోగ్యం బాగా కుదుటపడలేదు కాబట్టి, కౌంట్, ఇద్దరు పిల్లలూ కలిసి ఆమె లేకుండానే జనవరి ఆఖరులోగా మాస్కోకు ప్రయాణం కావాలని నిశ్చయింపబడింది.

# ఎనిమిదవ కాండం

# 40

ఉపదేశకుడు చెప్పిన సత్యాలలో పీటర్‌కు ఎంత నమ్మకం ఉన్నప్పటికీ, ఆత్మోద్ధరణ కోసం తొలిరోజుల్లో అతను ఎంత ప్రయత్నించినప్పటికీ, అతనికి ఈ కొత్తజీవితం తాలూకు ఆకర్షణ అంద్రూరాకుమారునికి నటాషాతో ప్రధానం జరిగిన తరువాతను, బజ్‌డియెవ్‌చనిపోయినకొద్దిరోజులలోగాను హఠాత్తుగానశించిపోయింది. ఈ జీవితం తాలూకు నిస్సారమైన విషయాలు తప్ప మరి అతనికేమీ మిగల్లేదు: అతని ఇల్లు, అతని భార్య, ఆమె స్నేహితులు, తన స్నేహితులు విసుగెత్తించే తన కోర్టు పనులు, ఇవీ అతనికి మిగిలినవి. అతను మళ్ళీ క్లబ్బుకు వెళ్ళడం, తాగడం—బ్రహ్మచారి అలవాట్లు మొదలుపెట్టాడు. తన మతసోదరులతో సంబంధం కూడా వదులుకున్నాడు. ఇక అతన్ని అదుపులో ఉంచడం కౌంటెస్ హెలెన్‌కు చాలా కష్టంగా కనిపించింది. పీటర్ ఆమె చెప్పిన ప్రతిమాట ఒప్పుకుని తన బస మాస్కోకు మార్చివేశాడు.

మళ్ళీ మాస్కోలో తన పెద్ద భవంతిలో ఉంటూ ఉన్నాడు. అతని బంధువులు, రాకుమార్తెలు, ఇంకా ఎంతోమంది ఆధారపడిన ఇతరులు: వీరంతా ఇంటినిండా పోగవుతున్నారు. ఇవరిస్కియా మేరీమాత చర్చికి వెళ్ళినప్పుడు వేల కొవ్వొత్తుల దీపాలముందు మేరీమాతను చూచినప్పుడు, మచ్చలేని మంచుతెరలో దాగిన క్రెమ్లిన్ కూడలిగుండా తాను వెడుతున్నప్పుడు దారిలో ఉన్న దుకాణాలను, వృద్ధులను, స్త్రీలను చూస్తున్నప్పుడు, విందులలోకి-ఇంగ్లీషుక్లబ్ నృత్యాలలోకి తాను వెడుతున్నప్పుడు అతనికి శాంతి దొరికినట్లుగా కనిపించింది. మాస్కోలో తన ఇంట్లో ఉన్నప్పుడు పగలంతా అలసిపోయిన తరువాత రాత్రిపూట పాత డ్రెస్సింగ్ గౌను వేసుకుంటే ఎలా హాయిగా వెచ్చగా ఉంటుందో అలా ఉన్నట్టు అనిపించింది అతనికి.

అతను ఇదివరకు విడిచిపెట్టిన సమాజమంతా మళ్ళీ అతన్ని చేతులు చాచి ఆహ్వానించింది. అతను లేని సమయంలో ఆ స్థానాన్ని ఎవరూ ఆక్రమించలేదు. ఆ స్థానం అతని కోసం సిద్ధంగా ఉంది: అతను వచ్చిన వెంటనే ఇక ఆ స్థానాన్ని ఆక్రమించుకోవడమే తరువాయి. అక్కడి వారందరూ పీటర్‌ను ఎంతో మంచివాడుగానే భావిస్తున్నారు. కొంచెం చపలచిత్తుడైనప్పటికీ, ఎంతో చనువు మర్యాద తెలిసినవాడు. పైగా తెలివిగలవాడు. పాతకాలపు మాస్కో పెద్దల్లాగా పరథ్యా

నంగా ఉన్నప్పటికీ ఎంతో ఉదారబుద్ధి కలవాడు. అతని పర్సు ఎప్పుడూ ఖాళీగా ఉన్నా దాన్ని తవడని వారుండరు.

అశక్తులైన కళాకారుల సహాయార్థం ప్రదర్శనాలు ఏర్పరచడానికి చెప్ప రానంత అసహ్యంగా కనిపించే శిల్పాలకు, లంబాడీనృత్యాలకు, విందులకు, దాన ధర్మాలకు, చర్చిల ఉపయోగార్థం ఇచ్చే దానధర్మాలకు, విలువగల పుస్తకాల ప్రచు రణకు, అతనెప్పుడూ ధనసహాయం చేస్తూనే ఉన్నాడు. ఎవరు వచ్చి అడిగినా ఎవరి మాట కాదనడం లేదు. తను ఎంతో ఖర్చు చేసిన ఇద్దరు స్నేహితులు సహాయానికి అక్కరకు వచ్చి అతన్ని ఆదుకోకపోయినట్లయితే అతను నిజంగా పూర్తిగా నాశ నమైపోయి ఉండేవాడు. క్లబ్‌లో అతను లేకుండా ఒక పార్టీగాని, విందుగాని జర గదు. అతను రెండు సీసాలు 'శాటీమార్గా' పానీయం తాగి తివాసీపై వచ్చి పడుకో గానే అతని చుట్టూ విచిత్రమైన జనమంతా పోగై మాట్లాడుతూ, నవ్వుతూ అతన్ని అనేకవిధాల పొగుడుతూ ఉంటారు.ఏదైనా తగాదా పొడసూపినప్పుడు,చనువైనఅతని చిరునవ్వు,సమయానికి అనుకూలమైన అతని పరాచకాలు,మళ్ళీ ఆ తగాదాను చల్లార్చి శాంతిని నెలకొనేలా చేసేవి. అతను లేకుండా ఏ పార్టీ, ఏ విందూ జరిగేది కాదు. విందులో జోడీలు తక్కువగా వున్నప్పుడు అతన్ని తమతోపాటు స్త్రీలు నృత్యం చేయమని కోరేవారు. వివాహితులైన స్త్రీలు కాని, అవివాహితులైన కన్యలు కాని, అందరూ అతనంటే ఎంతో ఇష్టపడేవారు. వారూ వీరనకుండా అందరితోనూ అత నెంతో చనువుగా ఉండేవాడు. అతనెంతో మంచివాడు, 'ఏ లింగానికీ చెందడు',అను కునేవారంతా. మాస్కోలో తన కడపటిరోజులు ఆఖరు చేసుకుంటున్న వందలమంది దర్బారుపెద్దలలో పీటర్ కూడా ఒకడు.

రష్యా ఒక రిపబ్లిక్ కావాలని ఎంతో ఇదిగా ఆకాంక్షించింది అతనే కదూ? ఒక తాత్విక రాజనీతిజ్ఞుడు కావాలని కూడా ఆకాంక్షించి అతనే కదూ?బోనపార్టీకాని, లేక బోనపార్టీని జయించే వ్యక్తికాని తను కానందుకు విచారపడింది కూడా అతనే కదూ? మానవుల పునరుజ్జీవనంలో నమ్మి వ్యక్తిగత పరిపూర్ణతకోసం ప్రయత్నిం చింది కూడా అతనే కదూ? బళ్ళు, ధర్మసత్రాలు, ఆసుపత్రులు కట్టించింది కూడా అతనే కదూ?

కాని ఇప్పుడతను ఎవరు? ఎలా ఉన్నాడు? ఏమైనాడు? అతను ఒక పెద్ద సంపత్తికి యజమాని. విశ్వాసం లేని ఒక భార్యకు భర్త! విరమించుకున్న ఒక దర్బారీయుడు. ఇంగ్లీషక్లబ్‌లో ఒక సభ్యుడు. మాస్కో సమాజపు చెడిపోయిన బిడ్డల్లో అతనూ ఒకడు! తినడమన్నా, తాగడమన్నా అతనికెంతో ఇష్టం. మధ్య మధ్యలో కులాసాగా విందుకుడిచిన తరువాత ప్రభుత్వంలోని లోపాలు ఎన్నుతూ ఉంటాడు.

ఏ ఆశలూ, ఆశయాలూ, బాధ్యతలూ లేకుండా విరమించుకున్న దర్బారీ

యుల్లో ఒకడుగా తను జీవిస్తున్న విషయం ఎంతో కాలానికిగాని అతనికి తట్టింది కాదు. ఏడుసంవత్సరాల క్రితం ఇలాంటి జీవితమంటే అతనెంతో రోతగా చూచు కునేవాడు. కాని ఒక్కోసారి ఇకముందు తన జీవితం ఇలాగే సాగిపోదని తన్ను తాను ఓదార్చుకునేవాడు. మళ్ళీ వెంటనే అతని స్మృతిపథానికి మరో విషయంకూడా తోచేది. తనకు పరిచయస్థులైన వారందరూ ఈ క్లబ్ జీవితానికి అలవాటుపడి అందులోనే మునిగిపోయారు. కాని దాని నుంచి బయటపడలేకపోయారు. వారు తల పుకు వచ్చినప్పుడల్లా అతని కెంతో కలవరం కలుగుతూ వుండేది.

ఒక్కోసారి అతను తన గర్వంకొద్దీ తను ఈ పెద్దల్లాంటివాణ్ణి కాననీ, సంతృప్తికరంగాను, నిస్సారంగాను జీవితం గడుపుతున్న వారిలో తానొకడు ఎంత మాత్రం కాదనీ తనకు తాను సమాధానం చెప్పుకునేవాడు.

"నే నెప్పుడూ ఏదో అసంతృప్తితో వేగిపోతుంటాను. ఎప్పుడూ దేని కోసమో అన్వేషిస్తుంటాను. ఎప్పుడూ ఏదో ఒకటి చేయాలనుకుంటాను,ఏం చేస్తానో ఎవరికి తెలుస్తుంది?" అనుకుని మళ్ళీ తనలో తాను "కాని వారు కూడా నా లాగానే జీవితంలో ఒక ప్రత్యేకమైన మార్గాన్ని తొక్కదామని చూచారు. అయినా పరిస్థితుల ఒత్తిడి, మనిషి ఎదుర్కోలేని స్థితిగతులు నన్ను చేర్చినచోటికి వారిని చేర్చి ఉండకుండా వచ్చు" అనుకున్నాడు.

ఈ విధంగా ఆలోచించుకుంటూ అతను కొద్దినెలలు మాస్కోలో గడిపాడు. ఆ తరువాత అతను తన స్నేహితులను అసహ్యించుకోవడానికి మారుగా తనను చూచి తను జాలి పడినట్టుగానే వారిని చూచి కూడా జాలిపడటం మొదలు పెట్టాడు.

తరువాత అతనికి జీవితంపట్ల రోత, విచారం తెరలుతెరలుగా రావడం క్రమ క్రమంగా తగ్గిపోయింది. తన చుట్టూ ఉన్న చెడుసు మరిచిపోవడానికి ఎంతో ప్రయ త్నిస్తున్నాడు కాని అది మాత్రం అతని మనస్సులో మాటిమాటికి సెలవేస్తోంది.

"మనం ఎందుకు జీవిస్తున్నట్లు? ఎందుకు పుట్టినట్లు? మనం ఈ లోకంలో ఏం చెయ్యాలి? మన కర్తవ్యం ఏమిటి?" అని ప్రతిరోజూ ఒక వందసార్లయినా తన్ను తాను ప్రశ్నించుకునేవాడు. కాని అనుభవంలో ఆ ప్రశ్నలకు సమాధాన మంటూ ఉండదని తెలుసుకుని, ఆ ప్రశ్నలు అవతల మూసిపెట్టి ఒక పుస్తకం తీసుకుని, లేకపోతే క్లబ్‌కు వెళ్ళి, లేక స్నేహితులతో కబుర్లాడుతూ కాలక్షేపం చేసే వాడు.

"నా భార్య తన జీవితంలో ఎప్పుడూ తన అందానికీ తప్ప మరి దేనికీ లెక్కచేసి ఎరగదు. ఇంత బుద్ధిమాలిన మనిషిని నే నెరుగను కూడా. కాని ఆమెను

అందరూ తెలివికలదని అనుకుంటూ ఉంటారు. ఈ విధంగా తలపోయసాగాడు పీటర్.

అన్ని వైపులా ఆవరించుకుని ఉన్న ఈ కపటత్వం అందరూ ఒప్పుకుని అంగీకరిస్తున్న ఈ కపటత్వం, అతనికి మాటిమాటికీ ఒక కొత్త విషయంలాగా అతనికి చెప్పరాని కోపం తెప్పిస్తోంది.

"అన్ని వైపులా ఇదే కనిపిస్తోంది. ఇతరులను నేనెలా మార్చగలను? నే నెంతో ప్రయత్నించి చూచాను. కాని లాభం లేదు. నా కీ విషయం తెలిసినట్లుగానే ప్రతివారికీ కూడా తెలుసు, కాని కావాలని కళ్ళకుగంతలు కట్టుకుంటున్నారు. ఇది మామూలే అనుకుంటాను" అనుకునేవాడు పీటర్.

డజన్లకొద్దీ పుస్తకాలు చదవడం మొదలుపెట్టాడు. చేతికి దొరికిన పుస్తకమల్లా చదవందే వదిలేవాడు కాదు. రాత్రిళ్ళు అతని సేవకుడు గౌను విడుస్తున్నప్పుడు పుస్తకం చదువుతూనే ఉండేవాడు. ఈ విధంగా ఒకరోజు గడిపిన తరువాత,ఆ మరు సటి రోజు క్లబ్‌లోనూ, డ్రాయింగ్ రూంల్లోను అర్థంలేని కబుర్లు చెపుతూ గడిపే వాడు. సాయంత్రాలపూట స్త్రీలతోను, పానీయాలతోను గడిపేవాడు. తాగుడు నానా టికీ ఎక్కువైపోతోంది. ఆ తాగుడు దైహికంగానే కాకుండా మానసికంగా కూడా ఒక అవసరమైంది. అతని ఆరోగ్యానికి భంగకరమని డాక్టర్లు ఎన్నివిధాల సలహాలు ఇచ్చినా అతను తాగుడు మానుకునేవాడు కాదు. ఎన్నో గ్లాసుల పానీయం తాగితే కాని అతని మనస్సు హాయిగా ఉండేది కాదు.

ఎవరో చెప్పగా అతని కొక విషయం జ్ఞాపకం ఉంది. కందకాల్లో ఉన్న సోల్జర్లు వారిపై కాల్పులు సాగుతూ ఉంటే ఆ ప్రమాదం నుంచి మనస్సు మరల్చు కోవడానికి ఏదో ఒక పద్ధతి, ఒక ఉపాయం ఆలోచించుకుంటారట. 'మనమంతా కూడా ఇంతే' అనుకున్నాడతను. "మనమంతా కూడా జీవితాన్ని చూచి భయపడి ఆ సోల్జర్లలాగానే రాజకీయాలను, స్త్రీలను, పానీయాలను,ఆటపాటలను ఇలాంటివేవో ఆశలు కల్పించుకుంటాము. ఈ విధంగా చేస్తే ముఖ్యమైనదంటూ ఏదీ కనిపించదు. చివరకు అన్నీ అంతమయ్యేది ఒక్కచోటే. మనం చేయగలిగిందల్లా దేన్నీ ముఖ మెత్తి సూటిగా చూడకుండా ఉండగలగడమే." అనుకున్నాడు.

# 41

శీతాకాలపు తొలి రోజుల్లో నికోలస్ బోల్‌కోన్‌స్కీ రాకుమారుడు మాస్కోకు వెళ్ళాడు. అతని పాత జీవితం, హాస్యధోరణి, చపలచిత్తం; ఇవన్నీ ఫ్రెంచి వారిపై ఆయనకు గల వ్యతిరేక అభిప్రాయాలతో కలిసి ఆనాడు మాస్కోలో ఉన్న నాగరిక ధోరణిని బట్టి ఆయనకు ఒక గౌరవాన్ని కలిగించాయి.

కాని రాకుమారుడికి ఇప్పుడు వయస్సు బాగా మళ్ళిపోయింది. ఆయన శక్తి

కూడా బాగా సన్నగిలిపోయింది. మధ్య మధ్యలో ఉండి ఉండి నిద్రమంపులు వస్తు న్నాయి. ఇటీవలే జరిగిన విషయాలు మరిచిపోవడమూ, ఎన్నాళ్ళ క్రితమో జరిగిన విషయాలు జ్ఞాపకముండడమూ జరుగుతోంది. ఆయన సాయంకాలం పూట టీ సమయంలో తన ఉన్నికోటు వేసుకుని, ముఖంకు పౌడరు అద్దుకుని వచ్చి తన చిన్ననాటి విషయాలు చెపుతోంటే అందరూ ఎంతో భయంతో ఆలకిస్తూ ఉంటారు.

పాపం మేరియా రాకుమారి పూర్వం ఉంటూ వచ్చిన ప్రియతమైన సుఖాలు కూడా ఇప్పుడు లేకుండా పోయాయి. ఇప్పుడు ఈశ్వర భక్తులతో మాట్లాడడం లేదు. ఆమె కష్టాలకు అన్నిటికీ ఓదార్పుగా ఉంటూ వచ్చిన ఒంటరితనం కూడా ఇప్పుడు లేదు. ఆమె ఇప్పుడు ఎవరితోను సఖ్యం చేసుకోవడం లేదుకూడా.

జూలియా, ఇద్దరు అన్నలు చనిపోయిన తరువాత ఒక పెద్ద ఆస్తికి వారసురాలైంది. ఆమె ఇప్పుడు ఎన్నో లౌకికమైన వినోద విలాసాల్లో మునిగిపోయి తనను వివాహం చేసుకుని సుఖింపచేసే ఒక భర్త కోసం ఎదురు చూస్తోంది. నానాటికీ కాలం ఒత్తిడి ఎక్కువవుతూ ఉంది. ఆమె కొద్ది కాలంలోనే నిండుగా వికసించిన కన్య అవుతుంది. ఇప్పుడే ఆమె ఎంతో జాగ్రత్తగా ఉండాలి. కొద్ది కాలంలోనే ఆమె భావి నిశ్చయింపబడుతుంది. ప్రతి గురువారం రాగానే మేరియా రాకుమారి విచారంతో చిరునవ్వు నవ్వుకునేది. తనిప్పుడు వ్రాయవలసిన ఉత్తరాలేమీ లేవు. ప్రతి వారం వచ్చి తనను చూచిపోయే స్నేహితురాలి రాకపట్ల కూడా ఆమెకొక విధమైన నిర్లక్ష్యం ఏర్పడింది. తను మెచ్చుకుంటున్న స్త్రీని వివాహం చేసుకోడానికి ఫ్రెంచి వరుడు నిరాకరిస్తూ అన్నమాట ఆమెకు జ్ఞాపకం వచ్చింది. "ఆమె నాకు భార్య అయితే నేను సాయంకాలాలు ఎక్కడ గడపను ?" అన్నాడతను. జూలియా ఎప్పుడూ కనిపిస్తూ ఉండడంవల్ల వారిద్దరికీ మధ్య ఉంటూ వచ్చిన చనువు చాలా వరకు తగ్గిపోయింది. ఇక తన మనస్సులో మాటలు ఎవరితో చెప్పకోవాలో మేరియాకు తోచడం లేదు. రోజులు బరువుగా సాగుతున్నాయి.

ఆంద్రూ రాకకోసం ప్రతిరోజూ ఎదురు చూస్తున్నారు. అతని పెళ్ళి రోజు దాపుకు వస్తోంది. కాని ఇప్పటికి కూడా తన తండ్రి అందుకు సుముఖంగా లేడు. పైగా రోస్టోవ్‌ల పేరు చెపితేనే చెప్పరానంతగా మండిపడుతున్నాడు. ఆయన కోపం నానాటికీ ఎక్కువవుతూ ఉంది. ఇప్పుడు మేరియా రాకుమారి తన చిన్న అల్లుడికి రోజూ చదువు చెపుతోంది. ఇప్పుడు వాడికి ఆరు సంవత్సరాలు. కాని వాడికి పాఠాలు చెపుతోంటే పూర్వం తన తండ్రి తనకు పాఠాలు చెబుతున్నప్పుడు తనమీద ఆయనకు కోపం వచ్చినట్లుగా ఇప్పుడామెకు ఆ పసివాడి మీద కోపం వస్తుంది. ఇలా కోపం వస్తున్నందుకు ఆమె ఎన్నోసార్లు విచారించేది కూడా. ఆమె ఆ కుర్రాడి తాలూకు పనులు ఎంత తేలిక చేయాలని యత్నించినప్పటికీ, తనకు వచ్చిన

విషయాలన్నీ వాడికి బోధించాలని యత్నించినప్పటికీ, ఆ కుర్రాడు ఆమె కోపానికి భయపడి ఎప్పుడూ తప్పుగానే సమాధానం చెపుతుండేవాడు. తరువాత ఆమె కలవర పడిపోయి కంఠస్వరం హెచ్చించుకుని, ఆ కుర్రాడిమీద కోపం తెచ్చుకుని వాణ్ణి ఈడ్చుకుంటూ తీసుక వెళ్ళి ఒక మూల కూచుండబెట్టేది. ఇలా చేసిన తరువాత తనిలా ఎందుకు ప్రవర్తించానా అని కన్నీళ్ళు పెట్టుకునేది. ఆ కుర్రాడు కూడా ఆ మూలనుంచి మెల్లగా తప్పటడుగులు వేసుకుంటూ వచ్చి తను కూడా ఏడుస్తూ ఆమె చేతులు ముద్దాడి ఆమెకు ఓదార్పు కలిగేటట్టుగా కౌగలించుకునేవాడు.

అన్నిటి కంటె ఆమెకు భరించరానిది, కనిపిస్తున్నది తన తండ్రి స్వభావం. నానాటికీ ఆయన కోపం చెప్పరానంతగా ఎక్కువవుతూ వుంది. ఆ కోపానికి తానే గురికావల్సి వస్తుంది. రాత్రిళ్ళంతా మేలుకుని కాలం గడపమన్నా, కొట్టినా, కట్టెలు కొట్టమన్నా లేక నీళ్ళు తోడమన్నా, ఆమె మారు చెప్పకుండా ఒప్పుకుని ఉండేది. కాని ఈ నిరంకుశుని స్వభావమే వేరు. ఆమెను ప్రేమిస్తున్నాడు కాబట్టే ఆమెపట్ల ఎంతో క్రూరంగా ఉంటున్నాడు. తన అనురాగం వల్లనే అన్నివిధాలా ఆమెను అవనతి కలిగించి ఆమెను నొప్పింప చేస్తున్నాడు. ప్రతి విషయంలోనూ ఆమె తప్పులు ఎంచుతూ ఉన్నాడు. గత కొద్దినెలల్లో మదాం బోరీన్‌పట్ల ఆయన చూపుతున్న ఆసక్తి మరింత స్పష్టంగా కనిపిస్తూ ఉంది. ఆండ్రూ రాకుమారుడు తన వివాహం చేసుకోవడానికి ఆయన ఒప్పుదలను అడిగినప్పుడు, తన కుమార్తెను ఆండ్రూను కలవర పెట్టడానికి మాత్రమే ఈ విదేశస్థురాలిని పెళ్ళి చేసుకుంటానని అన్నాడు. అప్పుడు పరిహాసానికి అన్న ఆ మాట ఇప్పుడొక ఆశగా పరిణమిస్తూ ఉంది. అయినప్పటికీ కూడా తన కుమార్తె మాత్రం ఆ విషయం నమ్మడం లేదు.

ఒక రోజు ఆమె దగ్గర ఉన్నప్పుడు వృద్ధ రాకుమారుడు మదాం బోరీన్ చేతిని ముద్దాడి ఆమెను దగ్గరికి లాక్కుని కౌగలించుకున్నాడు. రాకుమారి సిగ్గుపడి గదిలోనుంచి వెళ్ళిపోయింది. కొద్ది నిముషాల తరువాత మదాం బోరీన్ నవ్వుతూ కులాసాగా తన దగ్గరికి రాగానే, ఆమె త్వరత్వరగా కన్నీళ్ళు తుడుచుకుని తన్ను తాను నిబ్బరించుకోలేక ఆ ఫ్రెంచి స్త్రీని అయినవిధానా కానివిధాన ఆడిపోసింది.

"బలహీనతను అవకాశంగా తీసుకోవడం ఎంత నీచం...." అని తన వాక్యం ముగించకుండానే "గదిలోనుంచి వెళ్ళు" అని బిగ్గరగా వెక్కివెక్కి ఏడవసాగింది.

ఆ మరుసటిరోజు ఆమె తండ్రి జరిగిన ఈ దృశ్యాన్ని గురించి ఒక్కమాట కూడా అనలేదు. కాని భోజన సమయంలో ఫ్రెంచి స్త్రీకి ముందుగా వడ్డన చేశారు. అయినా వృద్ధుడైన బట్లర్ దురదృష్టవశాత్తూ తన యజమాని కోరిక మరచిపోయి కాఫీని మొదలుగా రాకుమారికి అందించగా, వృద్ధుడు పట్టరాని కోపంతో తన చేతి బెత్తాన్ని ఆ బట్లరుపై విసిరివేశాడు. తక్షణమే అతన్ని ఇంటినుంచి వెళ్ళిపొమ్మన్నాడు.

నీవు మరిచిపోయావు. నా ఉత్తర్వులు మరిచిపోయావు. నా అంతట నేనే చెప్పిన నా ఉత్తర్వులు మరిచిపోయావు. ఈ ఇంట్లో మొట్టమొదటి వ్యక్తి ఆమే! మీరు వింటూ ఉన్నారా ? ఆమె నాకు స్నేహితురాలు. ఇక మీరెప్పుడైనా ఇలా చేశారూ అంటే—" అని తన కుమార్తె వైపు తిరిగి "నీవు కూడా....నిన్న సాయంకాలంలాగా ఆమె ముందు నీవు నిన్ను నీవు మరిచిపోయి ప్రవర్తించావూ అంటే, ఈ ఇంట్లో ముఖ్యమైన వ్యక్తి ఎవరో నీకు తెలియచేయవలసి ఉంటుంది. నీవు వెంటనే గదిలోనుంచి వెళ్ళి ఆమెను క్షమాపణ కోరు" అన్నాడు.

తరువాత మేరియా రాకుమారి వెళ్ళి ఆమెను క్షమాపణ కోరుకుంది. ఎంతో ప్రయత్నం మీద, అసహాయురాలైన ఆ సేవకురాలిని క్షమించగలిగింది కూడా.

ఇలాంటి గొడవలు, దృశ్యాలు జరిగిన తరువాత పాపం ఆ పిల్ల,ఎన్నో విధాల తీవ్రమైన బాధలకు గురి కావలసి వచ్చింది. రెచ్చగొట్టబడిన అహానికీ, తన అంతరాత్మలోని రహస్యమైన పశ్చాత్తాపానికీ మధ్య ఊగిసలాడసాగింది. తను నిందిస్తున్న తన తండ్రి వృద్ధుడు, అసహాయుడు కూడా? కళ్ళజోడు కూడా సరిగ్గా పెట్టుకోలేడు. కళ్ళజోడు కోసం వెదుక్కోవాలి. జ్ఞాపకం కూడా సరిగ్గా ఉండదు. తడబడుతున్న అడుగులతో నడుస్తాడు. తన వార్ధక్యాన్ని ఎవరైనా చూస్తారేమో అని దాచుకోడానికి యత్నిస్తాడు. నడక కూడా సరిగా లేదు. భోజన సమయంలో మధ్యమధ్య నిద్ర మత్తులో పడిపోతాడు. తనకు కబుర్లు చెపుతూ తనను సంతోష పెట్టడానికి దగ్గర ఎవరూ లేనప్పుడు, తన పండిన తల ముందుకూ వెనక్కూ ఊగిస్తూ భోజనం ముందు కూచుంటాడు.

"ఆయన్ను నిందించే హక్కు నాకెక్కడుంది ?" అనుకున్నది మేరియా తనలో తాను. ఆయనపై తిరుగుబాటు చేయాలని కోరిక కలిగినందుకు తన్ను తాను నిందించుకున్నది.

# 42

ఆ రోజుల్లో ఒక ఫ్రెంచి డాక్టరు మాస్కోలో ఉంటూ ఉండేవాడు. అతను చాలా పొడగరి. అందగాడు. అందరితోనూ కలుపుగలుపుగా ఉండేవాడు. అతని దేశస్థులందరూ కూడా తగిన రీతిలో ఎలా నడుచుకోవలసిందీ బాగా తెలిసిన వారు. అతనిలా శ్రీమంతుల వర్గాలలో చాలా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. అతన్ని వారందరూ తమతో సమానస్తునిగాను, స్నేహితునిగాను చూచుకునేవారు.

వృద్ధ రాకుమారునికి వైద్య విధానాన్ని గురించి అనేక విడ్డూరములైన అభిప్రాయాలున్నాయి. అయినప్పటికీ మదాం బోరిన్ సలహాపై ఈ డాక్టరుతో సంప్ర

తించాడు. అప్పటినుంచీ మాన్‌షియర్ మెటిపీయర్‌కూ ఆయనకూ ఎంతో సంబంధం ఏర్పడింది. వారానికి రెండుసార్లయినా వచ్చి అతను వృద్ధుణ్ణి చూచిపోతుండేవాడు.

సెంట్ నికోలస్ పండుగరోజు మాస్కోలో వారందరూ అభినందనాలు అందించడం కోసం రాకుమారుని ఇంటికి వచ్చేవారు. కాని ఆయన ఎవరినీ కలుసుకునేవాడు కాదు. కొద్దిమంది పరిచితులను మాత్రమే విందుకు పిలిచేవాడు. వారి పేర్ల పట్టిక ఒకటి తయారుచేసి ముందుగా మేరియా రాకుమారికి ఇచ్చేవాడు.

అయినప్పటికీ మెటిపీయర్ ఆ అడ్డంకినిదాటి లోనికివెళ్ళి తన రోగిని చూడడం భావ్యమని అనుకున్నాడు. అప్పుడాయన చాలా తీవ్రపరిస్థితిలో ఉన్నాడు. రాకుమారుడు గదిలోనుంచి గదిలోకి తిరుగుతూ ఇతర్లు చెప్పిన మాటలు తనకు అర్థం కానట్లుగా నటిస్తున్నాడు. కావాలని తన కోపానికి ఏవో కారణాలు కల్పించుకోవాలని చూస్తున్నాడు. దాపుకు వస్తున్న ఈ తుపాను వాతావరణం మేరియా రాకుమారికి అలవాటు పడింది. ఆమె ఉదయంనుంచీ ఎప్పుడో ఒకప్పుడు ఈ తుపాను బ్రద్ద లవుతుందని ఊహించుకుంటూనే వుంది. కాని డాక్టరు వచ్చేవరకూ తుపాను బ్రద్దలు కాలేదు. అతను తన తండ్రి గదిలోకి వెళ్ళడానికి ఆమె ఒప్పుకుని తను ఒక పుస్తకం తీసుకుని చదువుకుంటూ డ్రాయింగ్ రూంలో కూచుంది.

అక్కడ నుంచి ఆమెకు లోపల జరిగే విషయాలు వినిపిస్తున్నాయి.

మొట్టమొదట ఆమెకు మెటిపీయర్ కంఠస్వరం వినిపించింది. తరువాత తండ్రి కంఠస్వరం వినిపించింది. తరువాత ఇద్దరూ కలిసి బిగ్గరగా మాట్లాడుకోవడం వినిపించింది. తలుపు తెరుచుకుంది. భయపడిపోయిన డాక్టరు, డ్రెస్సింగ్ గౌనులో ఉన్న ముసలాయన బయటికి వచ్చారు.

"అతనెందుకు వచ్చాడో నీకు తెలీదు. కాని నాకు తెలుసు. అతను ఫ్రెంచి గూఢచారి. బోనపార్టీ మనిషి!" అంటూ కోపంతో తలుపు మూసివేశాడు వృద్ధుడు.

మెటిపీయర్ ఏం జావాబు చెప్పాలో తోచక భుజాలు కదిలించి ముదాం బోరీన్‌ను కలుసుకోవడానికి వెళ్ళాడు. ఆమె ఈ చప్పుడంతా విని మరో గదిలో నుంచి పరుగెత్తుకుంటూ వచ్చింది.

ఆమెతో "ఇవాళ రాకుమారుడికి వంట్లో స్వస్థతగా లేదు. కొంచెం నరాలు ఉద్రేకపరిస్థితిలో ఉన్నాయి. కాని గాభరా పడకండి. రేపొచ్చి మళ్ళీ కలుసుకుంటాను" అని చెప్పి మెటిపీయర్ వెళ్ళిపోయాడు.

ఆ రోజంతా ఆయన్నెవ్వరూ కదిలించవద్దనీ, శాంతంగా ఒంటరిగా ఉండనివ్వమనీ సలహా చెప్పాడు. లోపలనుంచి రాకుమారుడు అటూ ఇటూ పచార్లు చేయడం వినిపిస్తూనే ఉంది.

"గూఢచారులు! అన్నివైపులా ద్రోహం! నా ఇంట్లో కూడా నన్ను శాంతిగా బ్రతకనివ్వరు!" అన్న మాటలు వినిపిస్తున్నాయి.

కొద్ది నిముషాల తరువాత వృద్ధుడు మేరియా రాకుమారిని పిలవనంపించాడు. ఆయన కోపతీవ్రతనంతా ఆమే భరించవలసి ఉంది. మేరియా రాకుమారి లోపలికి వెళ్ళగానే ఆమెపై ప్రశ్నలవర్షం కురిపించాడు. ఈ గూఢచారి ఇంట్లోకి వచ్చాడూ అంటే అది ఆమె తప్పేకదా?ఆమెకు తను ఇచ్చిన పేర్ల పట్టికను ఆమె ఏంచేసింది? ఆమె తనను శాంతిగా బ్రతకనివ్వడమూలేదు, చనిపోనీయడమూలేదు. ఈ తప్పంతా ఆమెదే.

"మనం వెంటనే విడిపోవాలి. స్పష్టంగా చెపుతున్నాను. మనం వెంటనే విడిపోవాలి. నేను దీన్నిక భరించలేను."అన్నాడు.

ఆయన గది వదలి వెడుతూ తన మాటలు ఆమె నిజం కాదని అనుకుంటూ ఉన్నదేమో అని మళ్ళీ తిరిగి వచ్చి ప్రశాంతంగా కనిపించడానికి ఎంతో ప్రయత్నం చేస్తూ "నేను ఏదో ఉద్రేకంలో ఇలా అన్నానని అనుకోకు. నేను నా మాటలన్నీ తూచి మాట్లాడాను. మనం విడిపోవడం మంచిది. మనం విడిపోయి తీరాలి. మరెక్కడయినా ఒక ఇల్లు చూచుకో. నీవు ఎక్కడ చూచుకున్నా నాకు ఒక్కటే"అన్నాడు. ఇలా అని ఒక క్షణంపాటు తను తెచ్చుకున్న శాంతిని మరిచిపోయి ఆమెపై కోపంగా చూస్తూ "ఈ వ్రేరిబాగులదాన్ని ఏ వెధవ పెళ్ళిచేసుకుంటాడు?"అని తన గదిలోనికి పరుగెత్తుకుని వెళ్ళి తలుపు గభీలుమని మూసుకుని మదాం బోరీన్ కోసం పిలవనంపాడు.

తరువాత కాసేపు వాన వెలిసినట్లుగా నిశ్శబ్దమైంది.

రెండు గంటలకు విందుకు ఆహ్వానింపబడిన ఆరుగురు అతిథులూ వచ్చారు. కౌంట్ రోస్టొషైన్, లఫక్షైన్ రాకుమారుడు, ఆయన అల్లుడు, జనరల్ షట్రోవ్, బోల్కోన్‌స్కీ రాకుమారుని పాతస్నేహితుడు పీటర్, బోరిస్ డ్రొబెట్స్కాయ్; ఈ ఆరుగురూ వచ్చారు. అందరూ డ్రాయింగ్ రూంలో చేరారు. సెలవు మీద మాస్కోలో ఉన్న బోరిస్‌రాకుమారునికి తనను పరిచయం చేయవలసిందని కోరాడు. ఇంటికి వచ్చిన తరువాత ఆ వృద్ధుని మన్ననలను కూడా సంపాదించాడు. బోరిస్ పెళ్ళిఈడు కుర్రవాడైనప్పటికీ రాకుమారుడు అతన్ని ఇంటికి రానిచ్చాడు.

మాస్కోలో సహజంగా సమాజీయులంతా చేరే ఇతర ప్రదేశాల వంటిదికాదు బోల్కోన్‌స్కీ గృహం.కాని పరిమితమైన ఈ చిన్న సమాజంలో ప్రవేశం దొరకడం కూడా ఒక ప్రత్యేకమైన గౌరవంగానే భావించబడుతూ ఉంది. కొద్ది రోజుల క్రితం బోరిస్ ఈ విషయాన్ని గ్రహించాడు. నగర గవర్నర్, సెంట్ నికోలస్ పండుగ రోజున కౌంట్ రోస్టొషైన్ ఆ ఆహ్వానాన్ని నిరాకరిస్తూ "నేను మరో చోటుకు వెళ్ళాలి తెలియదా? నేను వెళ్ళి నికోలస్ ఆంద్రొవిచ్ రాకుమారుని శేషచిహ్నాలను పూజించాల్సి వుంది"అన్నాడు.

"మంచిదే. ఆయన ఎలా వున్నాడు?"అని అడిగాడు నగర గవర్నర్.

ఇప్పుడా ఆరుగురు అతిథులూ విందుకోసం పాత తరహాలో విశాలంగా వున్న ఆ డ్రాయింగ్ రూంలో వేచి వున్నారు. ఆ ఆరుగురూ ఏదో ప్రధానమైన సమస్య ఆలోచించడం కోసం అక్కడ కూచున్నట్టుగా ఉన్నారు. మాట్లాడు కుంటు నప్పుడు కూడా చాలా మెల్లగా మాట్లాడుకుంటున్నారు. మధ్యమధ్యలో ఒక్కోసారి మాట్లాడం కూడా మానేస్తున్నారు. కొంతసేపటికి బోల్‌కోన్‌స్కీ రాకుమారుడు వచ్చి వారిలో చేరాడు. ఆయన ముఖం విచారపూరితంగాను, బెట్టుగాను ఉంది. ఆయన కుమార్తె ఎప్పటికంటె కూడా ఎంతో భయంగా ఉంది. అతిథుల మాట లకు ఎంతో ముక్తసరిగా జవాబు చెపుతోంది. ఎందుచేతనో కాని ఆమె ఇలా తన చుట్టూ జరుగుతున్న విషయాలను పట్టించుకోకుండా ఉండడం వారు గమనించారు. ఎక్కువగా మాట్లాడింది కౌంట్ రోస్టోప్షెన్ ఒక్కడే. మాస్కో సమాచారాలు, రాజకీయ వార్తలు; ఒకదాని తరువాత ఒకటి చెప్పసాగాడు. లఫక్‌షైనూ, షట్రోవ్ కొద్దిగానే మాట్లాడారు.

నికోలస్ రాకుమారుడు వారి మాటలన్నీ ఒక జడ్జీలాగా గంభీరంగా వింటూ కూచున్నాడు. అలా నిశ్శబ్దంగా కూచుని మధ్య మధ్యలో మాత్రం తల పంకించడం వల్లనో లేక ఒకమాట మాట్లాడడం వల్లనో వారు మాట్లాడుతున్నది తను గమ నిస్తున్నానని వారికి తెలియచేస్తున్నాడు. ఆ రోజున మాటల్లో వచ్చిన ముఖ్యమైన విషయం రాజకీయాలు. ఆనాటి సంభాషణను బట్టి రష్యన్ ప్రభుత్వం యొక్క ప్రవర్తన ఎంత మాత్రం బాగాలేదని తేలింది. నానాటికీ పరిస్థితులు తీసికట్టుగా ఉన్నాయని అనుకున్నారు. అన్ని విషయాల్లో ప్రభుత్వాన్ని ఆడిపోశారు. కాని చక్రవర్తిని గురించి తమ వ్యక్తిగత అభిప్రాయాలను తెల్పవలసి వచ్చినపుడు మాత్రం తమను తాము పరిమితం చేసుకొని మాట్లాడకుండా ఊరుకున్నారు. ఓల్డెన్ బర్గ్‌లో నెపోలియన్ చేస్తున్న పనిని గురించి, ఇటీవల అతనికి అందించబడిన వార్తను గురించి మాట్లాడుకున్నారు. ఆ వార్త అన్ని ఐరోపా రాజ్యాలకూ అందచేయబడిం దనీ అది నెపోలియన్‌కు వ్యతిరేకంగా ఉన్నట్లుక నిపిస్తున్నదనీ అనుకున్నారు.

"ఒక దొంగల నాయకుడు తను పట్టుకున్న ఓడను ఏ విధంగా చూచు కుంటాడో బోనపార్టీ కూడా యూరప్‌ను ఆ విధంగా చూస్తున్నాడు" అన్నాడు రోస్టోప్షెన్. అతనీ మాట అనడం ఇది మొట్టమొదటి సారికాదు. గత కొద్ది రోజుల నుంచీ అతను ఇదేమాట పదే పదే చెపుతూ వచ్చాడు. "అగ్రరాజ్యాలు ఇలా దీర్ఘ కాలం అవస్థపడడం, వారి గ్రుడ్డితనం చూస్తూ ఉంటే అర్థం కాకుండా వుంది. ఇప్పుడు బాధ్యత తీసుకోవలసింది ఇక "పోప్" ఒక్కడు మాత్రమే. కాథలిక్కు మతాన్ని తల్లక్రిందులు చేయడానికి నెపోలియన్ అన్ని విధాల ప్రయత్నిస్తున్నాడు. కాని ఒక్కడు కూడా నోరు కదపడం లేదు. ఓల్డెన్ బర్గ్ గ్రాండ్ డచీ ఆక్రమ ణాన్ని ప్రతిఘటించి తప్పని చెప్పగలిగింది ఒక్క జార్ చక్రవర్తి మాత్రమే. కాని

ఆయనకూడా..." అంటూ కౌంట్ ఆగిపోయాడు. అంతకు మించి చెప్పడానికి సాహసించ లేక పోయాడు.

"ఓల్డెన్ బర్గ్‌కు మారుగా మరో రాజ్యాన్ని ఆయనకు ఇచ్చారు." అన్నాడు బోల్‌కొన్‌స్కీ. "గ్రాండ్ డ్యూక్‌లంటే అతని కెంతో చులకనగా ఉంది. నేను నా క్రింద పనిచేసే రైతులను లిస్సీ-గోరీ నుంచి బొగుషొరోవ్ కుమారిస్తే ఎలా వుంటుందో ఇప్పుడు అతను చేస్తున్న పని అలా ఉంది. గ్రాండ్ డ్యూక్‌లను అతనింత చులకనగా చూస్తున్నాడు!" అన్నాడు.

"ఇలా తన పరిస్థితులు అదృష్టం, తారుమారు కావడం ఆ గ్రాండ్ డ్యూక్ ఎంతో మెచ్చుకోదగిన ఓరిమితో భరిస్తూ ఉన్నాడు." అన్నాడు బోరిస్. ఒకమాటు పీటర్స్‌బర్గ్‌లో అతన్ని గ్రాండ్ డ్యూక్‌కు పరిచయం చేశారు. తనకు గ్రాండ్‌డ్యూక్ తెలుసునని అతను ఇప్పుడు వారికి ఈ విధంగా తెలియచేయదలుచుకున్నాడు. బోరిస్ ఇలా అనగానే రాకుమారుడు అతనివంక ఒకచూపు విసిరివేశాడు. వ్యంగంగా ఏదో ఒక మాట అనాలని అనుకున్నాడు. కాని మళ్ళీ ఏమీ అనకుండా ఆగిపోయాడు. బహూశా అతను చాలాచిన్నకుర్రవాడని అనుకుని ఉంటాడు. అందు చేత అతని విషయం పట్టించుకోలేదు.

"నేను మన నిరసన పత్రాన్ని చదివాను. అది వ్రాసింది ఎవరోకాని అది ఏ మాత్రం బాగా లేదు;" అన్నాడు కౌంట్ రోస్టోఫైన్, తను మాట్లాడుతున్న విషయం తెలిసి మాట్లాడుతున్న వ్యక్తిలాగా.

"భాష శక్తివంతంగా ఉన్నప్పుడు శైలి ఎలా ఉంటే మటుకు ఏం?" అన్నాడు పీటర్.

"అబ్బాయ్! యాభై వేలమంది జనం ఉన్నప్పుడు ఆ మాత్రం కొద్ది శైలి వ్రాయలేవటోయ్" అన్నాడు రోస్టోఫైన్.

"ఈ రోజుల్లో కాగితాన్ని నల్లపరచని వాడంటూ ఎవరూ లేరు" అన్నాడు గృహయజమాని. "పీటర్స్‌బర్గ్‌లో వీరు ఇంతకంటె చేసే పని కూడా ఏమీ లేదు. మా అబ్బాయి ఆంద్రూ దేశానికి కావలసిన న్యాయ సూత్రాలన్నీ ఒక పెద్ద సంపుటం వ్రాశాడు...ప్రతివారూ ఏదో ఒకటి గిలకడం తప్ప మరేమీ చేయరు"అన్నాడు.

తరువాత సంభాషణ కాసేపు మందగించింది, జనరల్ షట్రోవ్ కొన్ని ప్రయత్నాలు చేసి మళ్ళీ సంభాషణ మొదలు పెట్టాడు.

"మొన్నమటుకు మొన్న పీటర్స్‌బర్గ్‌లో జరిగిన తనిఖీలో ఏం జరిగిందో విన్నారా? కొత్తగా వచ్చిన ఫ్రెంచి రాయబారి ఏం చేశాడో విన్నారా?" అన్నాడు జనరల్ షట్రోవ్.

"అవును. అతను చక్రవర్తికి యిచ్చిన జవాబును చాలా మంది విమర్శించారు."

"మీరే ఆలోచించుకోండి. జార్ దృష్టిని గ్రెనేడియర్ల దళం ఆకర్షించింది. వారు ఆయన దృష్టికి ఎంతో అద్భుతంగా కనిపించారు. రాయబారి మాత్రం ఆ విషయం ఏమీ పట్టించుకోనట్లుగా ఉన్నాడు. ఫ్రాన్సులో ఇలాంటి అల్ప విషయాలెవరూ పట్టించుకోరని కూడా అన్నాడట."

చక్రవర్తి ప్రస్తావన రావడంవల్ల తరువాత అంతా కొంతసేపు మాట్లాడకుండా ఊరుకొన్నారు.

"పొగరుబోతులు! పశువులు!" అన్నాడు వృద్ధ రాకుమారుడు కొంతసేపటికి. "మీకు మెటిపీయర్‌సు తెలుసు కదూ? ఇవాళ ఉదయాన్నే అతన్ని నేను నా ఇంట్లో నుంచి తరిమివేశాను. నేను ఇవాళ ఎవరినీ చూడనని ఉత్తర్వు లిచ్చినప్పటికీ అతను లోపలికి వచ్చాడు"

ఇలా అని తన కుమార్తె వంక కోపంతో చూచాడు. తరువాత తనకూ, డాక్టరుకూ మధ్య జరిగిన గొడవంతా చెపుతూ "అతను గూఢచారి తప్ప మరెవరూ కాదు" అన్నాడు. అలా అనుకోవడానికి కారణాలు కూడా చెప్పాడు. ఆయన చెప్పిన కారణాలు సకారణంగా లేకపోయినప్పటికీ వాటి నెవరూ కాదనడానికి సాహసించలేకపోయారు.

అందరికీ షాంపేన్ అందించిన తరువాత అతిధులందరూ ఆ విందు యజమానిని అభినందించడం కోసం లేచి నిలుచున్నారు. ఆయన కుమార్తె ఆయన్ను ముద్దాడడం కోసం దగ్గరికి వచ్చింది. ఆయన ఒకమాటు ఆమె వంక పైనుంచి కిందికి కఠినంగా చూచి ఆమె ముద్దాడడం కోసం నున్నగా ఉన్న తన చెక్కిలి అందించాడు. ఇవాళ ఉదయం జరిగిన విషయం తాను మరిచిపోలేదనీ, ఇంకా తన నిశ్చయం అలాగే వుందనీ, అతిధులు అక్కడ ఉండడం వల్ల వారి ముందు ఆ ప్రసక్తి తీసుకరావడానికి వీలు కలగడంలేదనీ, అతని తీరు తెలియచేస్తోంది.

చివరకు డ్రాయింగ్ రూంలో అందరికీ కాఫీలు అందించారు. ఆయన యువకుడిలాగా కొంచెం నిటారుగా కూచుని దాపుకు వస్తోన్న యుద్ధాన్ని గురించి తన అభిప్రాయాలు వెల్లడించాడు.

"మనం జర్మనీతో స్నేహం చేసుకోవడానికి తాపత్రయం పడినంత వరకూ నెపోలియన్‌తో మన పోరాటలవల్ల వచ్చే ఫలితం ఏమీ ఉండదు. టిల్‌సిట్ సంధి వల్ల కలిగిన దుష్ఫలితాల్లో ఇది ఒకటి. యూరప్‌లో వ్యవహారాలన్నీ కూడా ఇలాగే ఉంటాయి. ఆస్ట్రియాతో అనుకూలంగా కాని, ప్రతికూలంగా కాని చేరడం మనది తప్పు. మనం ఒక్క ప్రాచ్యరాజ్యాల మీదనే మన దృష్టి నిలపాలి. ఇక బోనపార్టీ

విషయం. మన సరిహద్దులను మనం సరిగా కాపాడుకుంటే అతను 1807లో లాగా మళ్ళీ మన దేశంలో అడుగు పెట్టడు." అన్నాడు బోల్‌కోన్‌స్కీ.

"కాని మనం ఫ్రాన్సుతో యుద్ధం చేయడమనేది ఎలా సంభవిస్తుందంటారు రాకుమారా?" అని అడిగాడు రోస్టోషైన్. "మనం మన యజమానులమీద—మన దృష్టిలో దేవతల మీద మనం ఎలా తిరుగుబాటు చేయగలం? మన యువకులను, యువతులను చూడండి! వీరికి ఫ్రెంచివారే ఆదర్శం. పారిస్ ఒక స్వర్గం!"అన్నాడు. తరువాత అందరినీ ఆకర్షించటం కోసం కంఠస్వరం హెచ్చించి "అన్ని విషయాల్లోనూ ఫ్రెంచి పద్ధతులే. ఫ్యాషన్ల లో, భావాల్లో; అన్నిట్లోనూ వారి పద్ధతులే. మీరు ఇవాళ మెటివీయర్‌ను తరిమివేశామంటున్నారు. కాని మన స్త్రీలంతా అతనికి జోహార్లు చేస్తున్నారు. నిన్నటి సాయంకాలం ఒక పార్టీలో స్త్రీలందరూ అతనితో ముచ్చటిస్తూ ఉండడం నేను చూచాను. ఇంకా ఎంత దూరం పోతుందో ఇదంతా!" అన్నాడు.

తరువాత ఎవరూ మాట్లాడలేదు. ఔనన్నట్లు తల ఊపాడు వృద్ధ రాకుమారుడు తన స్నేహితుని మాటలకు చిరునవ్వు నవ్వాడు.

"ఇక సెలవు తీసుకుంటాం ఎక్సలెన్సీ, మీరు మీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకోండి" అని రోస్టోఫైన్ లేచి కరస్పర్శ కోసం తన చెయ్యి అందించాడు.

"సెలవు మిత్రుడా! నీ మాటలు ఎంతో ముచ్చటగా ఉన్నాయి" అంటూ వృద్ధ రాకుమారుడు అతనితో కరస్పర్శ కావించాడు.

ఇతరులు కూడా రోస్టోఫైన్ లాగానే రాకుమారుని వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

# 43

మేరియా రాకుమారి అంతసేపూ వారి సభాషణలో ఒక్క మాట కూడా పట్టించుకోలేదు. ఆమెను ఒకే ఆందోళన కలవర పరుస్తూ ఉంది, తనకూ తన తండ్రికి మధ్య జరిగిన విషయం అతిథులకు తెలిసిపోతుందేమో అని కలవరపడుతూ ఉంది. డ్రౌబెట్‌స్కాయ్ చూపుతున్న మర్యాదలు కూడా ఆమె గమనించడం లేదు. అతను వారింటికి రావడం ఇది మూడోసారి. రాకుమారుడు తన స్నేహితులను గది వెలుపలి వరకూ సాగనంపి వచ్చాడు. పీటర్, హేటు చేతిలో పట్టుకుని తను మరి కొంత సేపు అక్కడ ఉండిపోవచ్చా అని మేరియాను అడిగాడు.

"తప్పకుండా" అన్నదామె. అతనేమైనా కనిపెట్టాడేమో అని అతని వంక ఆందోళనగా చూసింది. విందు తరువాత ఎప్పుడూ ఎంతో చనువుగా ఉండే పీటర్

ఇప్పుడు అస్పష్టంగా చిరునవ్వు నవ్వి "ఆ యువకుడు నీకు చాలా కాలంనుంచి తెలుసా రాకుమారీ?" అని అడిగాడు.

"ఏ యువకుడు అని?" అని అడిగిందామె.

"బోరిస్ ద్రోబెట్ స్కాయ్‌ని."

"లేదు. ఇటీవలే తెలుసు..."

"అతనంటే నీకిష్టమేనా?"

"ఆఁ. అతనెంతో హాయిగా ఉంటాడు. కాని ఈ విషయం నన్నెందు కడుగుతున్నావు?" అన్నదామె.

"ఒక యువకుడు మాస్కో వచ్చాడూ అంటే, శ్రీమంతురాలైన భార్యకోసం తప్ప మరెందుకూ రాడని నాకు తెలుసు" అన్నాడతను.

"నీవా విషయం గమనించావా?"

"అవును. ఒక శ్రీమంతురాలైన వారసురాలికి అతను దాపుగా ఉండడం నేనెప్పుడూ చూస్తున్నాను. అతన్ని నేనిట్టే గ్రహించగలను. అతను ప్రస్తుతం సంధిగ్ధావస్థలో ఉన్నాడు. నిన్ను ఎన్నుకోవాలో లేక మిస్ కారగైన్‌ను ఎన్నుకోవాలో నిశ్చయించుకోలేకుండా ఉన్నాడు."

"ఆమె ఇంటికి కూడా ఎక్కువగా వెడుతున్నాడా?"

"ఆ. చాలా ఎక్కువగా వెడుతున్నాడు. ఒక స్త్రీకి మర్యాద తెలిపే మార్గాలలో ఒక కొత్త మార్గాన్ని కూడా కనిపెట్టాడు" అంటూ పీటర్ కొంచెం చిలిపితనంగా "మాస్కో యువతుల మన్ననలు పొందాలంటే ఎవరైనా విచారంగా కనిపించడం అవసరం. మిస్ జూలియా కారగైన్‌తో అతనలాగే ఉంటున్నాడు" అన్నాడు.

"నిజంగా?" అన్నది మేరియా రాకుమారి. అతని ముఖంలోకి చూస్తూ తనలో తాను "నా మనస్సులో ఉన్న బాధ ఎవరితోనైనా చెప్పుకోవడం మంచిది. పీటర్‌కు చెప్పుకుంటాను. అతను ఉదారుడు. నాకేదైనా మంచి సలహా ఇవ్వవచ్చు" అనుకున్నది.

"నీ వతన్ని పెళ్ళాడతావా?" అని అడిగాడు పీటర్.

"ఆ. నే నెవరినైనా పెళ్ళాడటానికి ఒప్పుకున్న సమయాలున్నాయి. తొలిగా నన్నడిగిన వారిని పెళ్ళాడతానన్నాను" అన్నదా పిల్ల కన్నీళ్ళు తుడుచుకుంటూ, తరువాత తను అనుకోకుండానే "ఎవరినైనా మనం ప్రేమిస్తూ వారికి మనంభారంగా ఉండడం ఎంతో కష్టమైన విషయం. అందులోనుంచి బయట పడాలంటే అక్కణ్నుంచి వెళ్ళిపోవడం తప్ప మరి గత్యంతరం లేదు...కాని నే నెక్కడికి వెళ్ళను?" అన్నది.

"ఏమిటి రాకుమారీ నీవంటున్నది?"

"ఏమీలేదు. ఇవాళ ఇలా ఎందుకు మాట్లాడుతున్నానో నాకే తెలియడంలేదు" అని ఆమె కన్నీళ్ళు ఆపుకోలేక "నేను అన్న మాటలు పట్టించుకోకు" అన్నది.

పీటర్ చిలిపితనం కాస్తా మాయమైపోయింది. ఆమె మనస్సులో మాట చెప్పమని ఒత్తిడి చేయసాగాడు. కాని ఏమీ లేదనీ, తాను మరిచిపోయాననీ ఆమె తప్పించుకోసాగింది. ఆమె కిప్పుడున్న బాధల్లా దగ్గరికి వస్తున్న తన అన్న వివాహమేననీ, దాని వల్ల తండ్రీ కొడుకులకు తగాదాలు జరుగుతాయని తను భయపడుతున్నాననీ చెప్పింది.

ఆమె ఆ విషయం మారుస్తూ "నీకు రోస్టోవ్‌ల విషయం తెలుసా? అని అడిగింది. "వారు ఇక్కడికి వస్తున్నారట. నేను కూడా ప్రతిరోజూ ఆంద్రూ వస్తాడని కాచుకుని ఉంటున్నాను. వారిక్కడ కలుసుకోవడం నాకెంతో ఇష్టం" అన్నది.

"ఇప్పుడీ విషయం పట్ల ఆయన ఉద్దేశం ఏమిటి? అని అడిగాడు పీటర్. వృద్ధరాకుమారుని ఉద్దేశిస్తూ.

మేరియా రాకుమారి విచారంగా తల ఊపింది. "ఆయన ఉద్దేశం ఇప్పుడు మారిందేమీ లేదు. ఎప్పటిలాగానే ఉంది. ఇక వారు వేచి వుండడానికి వారికి గడువు పెట్టిన సంవత్సరంలో ఇక కొద్ది నెలలు మాత్రమే ఉన్నాయి. నే నా అమ్మాయిని గురించి ఇంకా తెలుసుకోవాలను కుంటున్నాను. నీకు చాలా కాలం బట్టీ వారుతెలుసు కదూ? నాకు దాచకుండా నిజం చెప్పు. ఆ అమ్మాయిని గురించి నీ ఉద్దేశం ఏమిటి? నాన్న మాటకాదని అంద్రూ ఆమెను వివాహం చేసుకుంటున్నాడు కాబట్టి నాకామెను గురించి ఎక్కువగా తెలుసుకోవాలని ఉంది ..." అన్నదామె.

ఆమె ఇలా ఒత్తిడి చేసి అడగడం వల్ల తన స్నేహితుని కానున్న భార్యపై ఆమె కంత మంచి ఉద్దేశం లేదని పీటర్ ఊహించాడు. నిజానికి కూడా మేరియా అతనేదో కాని మాట చెపుతాడనుకున్నది.

"నీ మాట కేం జవాబు చెప్పాలో నాకు తోచడం లేదు" అన్నాడతను. "ఇంతవరకెప్పుడూ నే నామె స్వభావాన్ని పరిశీలించలేదు. అందుచేత అది ఎంత వరకు ఉచితమో నేను చెప్పలేను. కాని ఆ అమ్మాయి మాత్రం ఎంతో ముచ్చటైన పిల్ల. అయినా ఇప్పుడు నన్ను చెప్పమంటే నే నేమీ చెప్పలేను" అన్నాడు.

మేరియా రాకుమారి నిశ్వసించింది.

"ఆమె తెలివికల పిల్లయేనా?" అని అడిగింది.

పీటర్ ఒక క్షణంపాటు ఆలోచించాడు. "కావచ్చు కాకపోనూవచ్చు. కాని ఎన్నడూ తన తెలివితేటలను చూపించడానికి యత్నించదు. ఆమె ఆకర్షణీయమైన పిల్ల. అంతే" అన్నాడు.

"నే నా అమ్మాయిని హృదయపూర్వకంగా ప్రేమించాలని కోరుతున్నాను" అన్నది మేరియా. "ఆ అమ్మాయి కనిపిస్తే ఈ విషయం చెప్పు" అన్నది.

వా రా ఊరికి రాగానే సాధ్యమైనంత త్వరలో తాను నటాషాను చూడడానికి నిశ్చయించుకున్నాననీ, కానున్న కొత్త కోడలివల్ల తన తండ్రిని అభిముఖం చేయడం కూడా, తమ చేతనై నంతవరకు ప్రయత్నించదలచుకున్నానని మేరియా చెప్పింది.

# 44

శ్రీ ఏటర్స్బర్గ్లో శ్రీమంతురాలైన వారసురాలెవరూ బోరిస్కు దొరక లేదు. అందుచేత అదే ఆట మాస్కోలో సాగిస్తూ ఉన్నాడు. తన దృష్టిలో ఇప్పుడు రెండు సంబంధాలు సిద్ధంగా ఉన్నాయి. జూలియా కారగైన్, మేరియా రాకుమారీను. రాకుమారి ముఖం సాధారణంగానే ఉన్నప్పటికీ ఆమె అతనికి మరింత ఆకర్షణీయంగా కనిపించింది. కాని వారింటికి వెళ్ళినప్పుడు విందు ముగిసిన తరువాత సున్నితమైన ఈ విషయాన్ని ప్రస్తావించడానికి అతను బిడియపడ్డాడు. అంత సేపూ ఆమెపట్ల అతను చూపిన శ్రద్ధంతా వృథా అయిపోయిందనే చెప్పొచ్చు. ఎందుచేతనంటే మేరియా రాకుమారి అతనిమాటల్లో ఒక్కమాటకు కూడా జవాబు చెప్పలేదు.

కాని జూలియా మాత్రం అలా కాదు. అతను చూపిన మర్యాద మన్ననలన్నింటినీ ఆనందంతో స్వీకరించింది. ఆమె కిప్పుడు ఇరవైఏడు సంవత్సరాల వయస్సు. ఎంతో ఆస్తి. కాని పూర్వం ఉన్నంత అందం ఇప్పుడామెలో లేదు. అయినప్పటికీ కూడా ఆమె వయస్సు పరిపక్వత చెందినా ఇంతకంటె అందంగాను ఆకర్షణీయంగాను ఆమె ఎప్పుడూ కనిపించలేదు. వయస్సును బట్టి ఆమె పురుషులకంత ప్రమాదకరం కాకపోవడం వల్ల ఆమె ఇచ్చే విందులను, భోజనాలను, ఆమె ఇంట్లో ఆమె చుట్టూ చేరే పార్టీలను, అందరూ పూర్తిగా వినియోగించుకున్నారు. అందువల్ల ఆమెకు లొంగవలసి వస్తుందని కాని, ఆమె మాయలో పడిపోవలసి వస్తుందని కాని ఎవరికీ భయం కూడా లేదు. పది సంవత్సరాల క్రితం జాగ్రత్తగా ఆమె కెంతో దూరం తొలగిపొయ్యేవారు కూడా ఇప్పుడు ప్రతిరోజూ ఆమె ఇంటికి వస్తున్నారు. ఆమె నిప్పుడు ప్రణయకలాపానికి అర్హురాలైన ఒక వధువుగా పరిగణించడంలేదు. ఒక ముచ్చటైన స్నేహితురాలిగా మాత్రమే పరిగణిస్తున్నారు. నిజానికి కూడా ఈ మాటు శీతకాలంలో కారగైన్ ఇచ్చిన విందులు, ఆహ్వానాలు ఎంతో అద్భుతంగా జరిగాయి. విందులు, సాయంకాలపు వినోదాలు మాత్రమే కాక ప్రతి

సాయంత్రం చాలామంది ఆమె ఇంట్లో పోగయ్యేవారు. కబుర్లు చెప్పుకున్న తరువాత అర్ధరాత్రి అయ్యేసరికి చక్కటి విందు కూడా తయారై ఉండేది. తెల్లవారు జామున మూడుగంటలకు కాని పార్టీ ముగింపుకు వచ్చేది కాదు.

జూలియా ఇప్పుడు ఒక్క బాల్‌గాని, ఒక్క ప్రదర్శనంకాని, ఒక్క వనభోజనంకాని పోగొట్టుకునేది కాదు. ఆమె దుస్తులు కూడా ఒకటో రకపు టైలర్ దగ్గర నుంచి తయారై వచ్చేవి. అయినప్పటికీ ఆమె లోకంలో కష్టనష్టాలు చూచి బ్రతుకంటే అంత ఆసక్తి లేని ఒక స్త్రీలాగా నటిస్తూ ఉండేది. స్నేహంలోను, ప్రేమలోను, ఏవిధమైన ఇహలోక సౌఖ్యంలోను నమ్మకం పోయిన వ్యక్తిలాగా కనిపించేది. ఆమెను చూచినవారంతా ఆమె ఏదో ఒక ప్రేమవిషయంలో దెబ్బతిన్నదనీ లేక ఆమె ఎంతో పూజిస్తూ వచ్చిన ఒక స్నేహితుణ్ణి పోగొట్టుకున్నదనీ అనుకునేవారు. కాని నిజం చెప్పాలంటే ఎప్పుడూ అలాటిదేమీ జరగలేదు. అయినప్పటికీ ఆమె తన జీవితమంతా కష్టాలతోను, వైఫల్యాలతోను నిండి ఉన్నదని ఇతరులను నమ్మించగలిగింది.

మరికొంతమంది యువకులు జూలియా కష్టగాథల్లో మరింత ఆసక్తి చూపించేవారు. ఈ లోకం యొక్క శూన్యత్వాన్ని గురించి మాట్లాడుతూ ఉండేవారు. ఆమె డ్రాయింగుల ఆల్బమ్‌లు, పద్యాల ఆల్బమ్‌లు తిరగవేస్తూ ఈ విషయాలు మాట్లాడేవారు. ఇలా చేసేవారిలో బోరిస్ కూడా ఒకడు. ఆమె బోరిస్ పట్ల ప్రత్యేకమైన మన్నన చూపేది. చిన్నతనంలో అతని వైఫల్యం పట్ల సానుభూతి, ఓదార్పు చూపేది. తను కూడా అతని లాగానే కష్టపడ్డా ననేది. ఆమె తన ఆల్బమ్‌ను మాత్రం అతని దగ్గర దాచిపెట్టేది కాదు. బోరిస్ ఆల్బమ్‌లో ఖాళీగా ఉన్న ఒక పేజీ మీద ప్రక్క ప్రక్కనే రెండు చెట్ల బొమ్మలు గీచి—

"ఓ చెడిపోయిన వృక్షాల్లారా! మీ కొమ్మలు నా చుట్టూ చీకటిని, విషాదాన్ని ఆవరింపజేస్తూ ఉన్నాయి" అని వ్రాశాడు.

మరో పేజీ మీద ఒక శవపేటిక బొమ్మగీచి దాని ప్రక్కన మరో గీతం వ్రాశాడు :

**"మృత్యువే మనకు సఖుడు, మృత్యువే మనకు మిగిలిన శాంతి!**
**సమాధిలోనే సమసిపోవు మన దుఃఖము, అశాంతి!"**

ఈ గీత పాదాలు చదివి జూలియా ఎంతో ఆనందించింది. తను చదువుకున్న నవలలో తనకు జ్ఞాపకమున్న కొన్ని వాక్యాలు అతనికి జవాబుగా చెప్పింది.

"విచార పూరితమైన చిరునవ్వు ఎంత అందంగా ఉంటుంది! చీకటిలో కాంతి కిరణంలాగా, విచార విషాదాలకు మధ్య ఉన్న రేఖలాగా ఓదార్పు అనే ఉదయాన్ని సూచిస్తున్న ఉషా రేఖ లాగా ఎంత అందంగా ఉంటుంది!"

బోరిస్ కృతజ్ఞతా పూర్వకమైన ఈ వాక్యాలను మళ్ళీ ఒక పద్య రూపంలో జవాబు చెప్పేవాడు :

**"ఓ విషాదమా! శాంతమైన-ఆర్ద్రమైన విషాదమా!**
**దుఃఖిత హృదయాలకు, శుష్కితమైన ఆత్మలకు**
**నీవే తొలకరి వానవు సుమా! నీవే ఆనందాన్ని**
**ప్రసాదిస్తావు సుమా!**

**ఓ విషాదమా! నన్ను ఓదార్చు!**
**నా ఏకాంత దుఃఖాల నుండి నన్ను ఓదార్చు**
**ఓదార్చి నాకు విశ్రాంతి చేకూర్చు !**
**ప్రశాంతమైన నీ రహస్య ఆకర్షణలతో**
**ప్రవహిస్తున్న నా వెచ్చని కన్నీటిని పన్నీటిగా మార్చు !**

జూలియా తరుచుగా తంత్రీ వాద్యం వాయిస్తూ ఉండేది. తన స్నేహితుణ్ణి ఆనందింప చేయడానికై ఎన్నో విషాద గీతాలు పాడుతూ ఉండేది.

అన్నామైఖలోవ్‌నా ఆ ఇంటికి తరుచుగా వస్తుండేది. మిసెస్ కారగైన్‌కు ఆమె విడిపోని తోడు అయింది. జూలియా ఆస్తిని గురించిన సమాచారాన్నంతా ఆమె దగ్గరనుంచి రాబట్టేది. 'పెంజా' రాష్ట్రంలో రెండు ఎస్టేట్లు. 'నిజ్నీ'లో ఒక పెద్ద అడవి; ఇవి జూలియా ఆస్తిపాస్తులని ఆమె త్వరలోనే తెలుసుకోగలిగింది. భారమంతా భగవంతుని మీదే వేసినదానిలాగా తన కుమారుడికీ, ఆమెకు సఖ్యం కలగడం భగవదేచ్ఛ అని అనుకుంటూ ఉండేది.

ఇక్కడ ఒక్కచోట మాత్రమే తనకు శాంతి లభిస్తుందని బోరిస్ ఎప్పుడూ అంటూ ఉంటాడు. మా అబ్బాయి ఎన్నోకలలు కన్నాడు, అన్నీ విఫలమైనాయి. వాడి ఆత్మ పువ్వులాంటిది" అని అన్నామైఖలోవ్‌నా తన కొడుకును గురించి జూలియా తల్లితో చెపుతూ ఉండేది.

"ఎంతో ముచ్చటగా ఉంటావు కాని ఎప్పుడూ విచారంగా ఉంటావు అమ్మాయి జూలియా" అని జూలియాతో అంటూ ఉండేది.

"అబ్బాయ్ నాకు జూలియా అంటే ఎంత ఇష్టమో నీకు తెలీదు. ఆ అమ్మాయిని నే నెంతగా ప్రేమిస్తున్నానో కూడా నీకు తెలీదు. ఆ అమ్మాయిని ప్రేమించకుండా ఉండడం అసాధ్యం. ఆ పిల్ల దేవత లాంటిది! ఆ అమ్మాయి తల్లి కూడా అలాంటిదే. మొన్నటి మటుకు మొన్న పెంజా నుంచి వచ్చిన ఉత్తరాల విషయంలోను, లెక్కల విషయంలోను ఎంత కలవర పడిందనుకున్నావు? తనకు సహాయ

పడేవారు లేనందున అందరూ ఆమెను దోచుకొంటున్నారని అన్ని వైపులనుంచీ చెపుతూ ఉండేది.

తల్లి చెపుతున్న ఇలాంటి మాటలు విని బోరిస్ చిరునవ్వు నవ్వేవాడు. అయిన ప్పటికీ మిసెస్ కారగైన్ ఆస్తి వ్యవహారాలు చూడడం విషయంలో అతనికి ఆసక్తి లేకపోలేదు.

జూలియా, తనను పూజిస్తున్న బోరిస్ వివాహ ప్రస్తావన ఎప్పుడు తీసుకొస్తాడా అని ప్రశాంతంగా వేచి వుంది. అతనా ప్రస్తావన తీసుకొనివస్తే తను దానిని మన్నించాలనే తన మనస్సులో నిశ్చయించుకుంది. కాని ఆమె సహజంగా అలాంటి ఆవేగం కనపరచక పోవడం, ఆమె నిమ్మళంగా ఉండడం, బోరిస్‌కు ఒక విధమైన వైమనస్యం కలిగించి అతను నిశ్చింతగా ఆ ప్రస్తావన ఆమె ముందు తీసుకుని రాలేకపోయేవాడు.

"అబ్బాయ్!" అంటూ ఆప్యాయతతో పిలిచి అన్నామైఖలోవ్‌నా బోరిస్‌తో ఇలా చెప్పింది. "బేసిల్ రాకుమారుడు తన కుమారుణ్ణి ఇక్కడికి జూలియాతో సంబంధం కోసం ఉద్దేశపూర్వకంగా పంపించాడని నాకు గట్టిగా తెలుస్తోంది. ఇందువల్ల నాకెంత విచారంగా ఉందో నేను చెప్పలేకుండా ఉన్నాను. ఆ అమ్మాయి అంటే నాకెంతో ప్రీతి. మరి నీవు ఈ విషయాన్ని గురించి ఏమనుకుంటున్నావు?"

ఇంత కాలాన్నీ ఇంత శక్తినీ ఇలా వృధా చేయడం, ఇన్ని నెలలు సేవ చేసినందుకు ఏ ఫలితమూ లేకుండా పోవడం,తన చేతుల్లోకి వస్తే తను ఎంతో చక్కగా వినియోగించే ఆస్థి అనెటోవ్ లాంటి ఒక అవ్యక్తుడి చేతుల్లో పడడం; ఇవన్నీ బోరిస్‌ను ఎంతో కలవరపెట్టాయి. అతను ఆ మరుసటిరోజే జూలియా కారగైన్‌తో తన వివాహ ప్రస్తావన తీసుకురావడానికి గట్టిగా నిశ్చయించుకున్నాడు. ఆ మరుసటి రోజు అతను ఆమె ఇంటికి వెళ్ళగా ఆమె ఒక లక్ష్యం లేని చిరునవ్వుతో అతన్ని స్వీకరించింది. పోయిన రాత్రి ఒక పార్టీలో ఎంతో కులాసాగా కాలక్షేపం చెప్పింది. ఎంతో మృదువుగాను,అప్యాయంగాను తన ప్రేమను వ్యక్తం చేయాలని నిశ్చయించుకుని అక్కడికి వచ్చినప్పటికీ బోరిస్ అలాచేయలేకపోయాడు. స్త్రీలందరూ చంచల స్వభావులనీ, వారు చేసే పనులలో ఒక తీరూ తెన్నూ ఉండదనీ, ఆకర్షణలకు ఇట్టే లొంగిపోతారనీ,వారికి తోచిన రీతిగా ఎవరిమీదంటే వారిమీద మమత్వం చూపుతారనీ అన్నాడు. జూలియాకు చాలా కోపం వచ్చి అతను చెప్పిన మాటలన్నీ నిజమేనన్నది. ఒకేవ్యక్తితో స్నేహం చేయడంకంటె భరించరానిది మరేదీలేదని అన్నది. బోరిస్ ఆ మాటకు సూటిగా సమాధానం చెప్పేలోగా ఒక విషయం అతన్ని ఆపుచేసింది. తను

ఏ పనిమీద మాస్కో వచ్చాడో ఆ పని కాకుండానే మాస్కో నుంచి వెళ్ళవలసి వస్తుందనే విషయం ఇప్పు డతని మనస్సుకు తట్టి ఆపు చేసింది. ఇలాటి అపజయం అతని కెన్నడూ అలవాటైంది కాదు.తన చూపుల్లోని కోపం కనిపించకుండా ఉండడం కోసం అతను కళ్ళు దాచుకుని మెల్లని కంఠ స్వరంతో :

"నేను నీతో పోట్లాడడం కోసం రాలేదు. పైగా..."అని ఇంకా తను చెప్ప వచ్చా అని అడిగినట్లుగా ఒకసారు ఆమె వంక చూచాడు. కలవరంతో కూడిన ఆమె చూపులు అతను ఏం చెప్పనున్నాడో అని ఆమె చూపులను కలిశాయి. "ఆమెను నేను చూడకుండా ఉండగలను.ఇక నేను చెప్పదలుచుకున్నది చెపుతాను," అని తనలో తాను అనుకున్నాడు. తరువాత అతని ముఖం కొంచెం సిగ్గుతో ఎర్ర బారింది. నీపట్ల నా భావాలను నీవు గ్రహించే ఉంటా వనుకుంటాను..."అన్నాడు.

ఈ మాత్రం చాలు అతను చెప్పడం. జూలియా ముఖం వెలుగొందింది. కాని అతను అంతా చెప్పేవరకూ ఆమె అతన్ని వదిలేటట్టు లేదు. ఆ పరిస్థితుల్లో సాధారణంగా అతను చెప్పవలసినదంతా చెప్పాడు. తను ఆమెను ప్రేమిస్తున్నాననీ, అలా ఎవరినీ ప్రేమించ లేదనీ చెప్పాడు. ఆమె కోరిన ఖరీదు ఆమె రాబట్టుకో గలిగింది.

"విషాదపు నీడలు పరిచిన చెట్ల కొమ్మలు" త్వరలోనే వారు మరిచిపోయారు. భావిని గురించి, రానున్న తమ చక్కటి గృహాన్ని అలంకరించుకోవడాన్ని గురించి ముచ్చటించుకుంటూ చక్కని ఆ జంట అందరి ఇళ్ళకూ వెళ్ళి చూడవచ్చి సాధ్యమైనంత త్వరలో అద్భుతంగా వివాహం చేసుకుని దంపతులు కావడానికి సిద్ధంగా ఉన్నారు.

# 45

కౌంట్ రోస్టోవ్ జనవరి ఆఖరున నటాషా సోనియాలతోకలిసి మాస్కోకు చేరుకున్నాడు. ఆయన భార్యకింకా జబ్బు నయం కాకపోవడంవల్ల ఆమె ఆట్రెడ్‌నోలోనే ఉంది. ఆంద్రూ రాకుమారుడు త్వరలోనే వస్తాడు. కాబట్టి వారు వెంటనే ప్రయాణం కావలసి వచ్చింది. అదీకాక వారు పెళ్ళి బట్టలు కుట్టించుకోవడం, ఆస్థి అమ్మడం, వృద్ధ రాకుమారుని కలుసుకుని కానున్న కోడలిని ఆయనకు పరిచయం చేయడం; ఇంకా ఇలాటి పనులెన్నో చేసుకోవలసి ఉన్నాయి. రోస్టోవ్‌లు వచ్చేసరికి ఆ శీతాకాలం కోసం వెచ్చచేయబడక పోవడంవల్ల వారి ఇల్లు వారికి తయారుగా లేదు. అందుచేత కౌంట్, మేరియా డిమిట్రోవ్‌నా ఇంట్లో ఆతిధ్యాన్ని స్వీకరించవలసి వచ్చింది. ఆమె ఎన్నాళ్ళ నుంచో వారిని తన ఇంటికి వచ్చి ఉండమని కోరుతోంది. అందుచేత ఒకనాటి సాయంత్రం కొంచెం ప్రొద్దు కూకిన తరువాత నాలుగు బండ్లు రోస్టోవ్‌లను వారి సామాన్లను తీసుకుని పాత స్టేబిల్సు స్ట్రీట్‌లో ఒక ఇంటిముందు

ఆగాయి. అది మేరియా డిమిత్రోవ్‌నా ఇల్లు. ఆ ఇంట్లో ఆమె ఒక్కతే ఉంటూ ఉంది. ఆమెకు ఒక కూతురు, నలుగురు కొడుకులూను. కొడుకులెక్కడో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. కూతురు పెళ్ళయి అత్తవారింటి కెళ్ళింది.

ఆమె ఎప్పుడూ ఎవరు పిలిచినా ఎక్కడికీ వెళ్ళదు. ఎవరైనా పెద్దలు పిలిస్తే మాత్రం అప్పుడప్పుడు వెడుతూ ఉంటుంది.

ఆ సాయంకాలం రోస్టోవ్‌లు వచ్చేసరికి ఆమె ఇంకా అక్కడే కూచుని ఎవరో పుస్తకం చదువుతూ ఉండగా వింటోంది. ముందు వాకిలి పెద్ద తలుపు బరువుగా చప్పుడు చేస్తూ తెరుచుకుంది. తలుపు తెరవగానే చలి, మంచు హాలు లోనికి దూసుకుని వచ్చాయి. డ్రాయింగ్ రూం వాకిట దగ్గర నిలుచుని ముక్కుమీద కళ్ళజోడు దించుకుని మేరియా డిమిత్రోవ్‌నా ఒకమాటు తన అతిథులను పరిశీలనగా చూచింది. అలా ఆమె చూడడం వారు వచ్చినందుకు ఆమె విసుక్కుంటూ ఉందా అన్నట్టుగా ఉంది. కాని ఆమె వెంటనే సేవకులతో ఆ వచ్చినవారి సామానులూ, అవీ లోపలికి చేర్చమని చెప్పింది.

"కౌంట్ సామాన్లు కదూ? ఇటు తీసుకుని వెళ్ళండి." అని బిగ్గరగా చెప్పింది.

ముందు ట్రంకు పెట్టెలను లోపలికి జాగ్రత్తగా చేర్పించే తొందరలో వారిని లోనికి రమ్మని ఆహ్వానించడం కూడా మరిచింది.

"పిల్లల పెట్టెలు ఎడమ వైపుకు తీసుకుని వెళ్ళండి. ఏమిటి అలా నిలుచున్నారు, నోళ్ళు తెరుచుకుని?" అని సేవకురాండ్రతో "త్వరగా టీకి పొయ్యి రాజవెయ్యండి." అని చెప్పింది. "అరె! ఎంత చక్కగా తయారయ్యారు? ఎంత ముచ్చటగా ఉన్నారు!" అంటూ నటాషాను దగ్గరికి లాక్కుంది.

తరువాత కౌంట్ వైపు తిరిగి "ఏమిటి ఇలా మంచు కొండల్లా ఉన్నారు? ముందు ఆ పై కోట్లు విప్పెయ్యండి" అన్నది.

ఆయన ఆమె చెయ్యి ముద్దాడాడు. "అరె! నీవు కూడా గడ్డకట్టుకుని పోయావే- టీతో పాటు కొంచెం 'రమ్' కూడా తీసుకుని రండి. త్వరగా రండి. సొనిష్కా! ఎలా ఉన్నావు?" అన్నది. ఆమె ఎప్పుడూ సోనియా పట్ల ఇలాటి అనురాగం చూపుతూ ఉంటుంది.

తరువాత నటాషాతో "నటాషా!ఇలా రా. కూచో" అన్నది.

అందరూ వారపైన ఉన్న ఉన్ని కోట్లు విప్పి టేబిల్ చుట్టూ పోగు కాగానే వారి యజమానురాలు అందరినీ ఒకమాటు ముద్దాడింది.

"నీ విక్కడున్నందుకు నా కెంతో సంతోషంగా ఉన్నదమ్మాయ్. నీవు ఎప్పుడో రావలసిన మాట." అంటూ ఆమె నటాషా వంక చూచి "ముసలాడు ఇక్కడే ఉన్నాడు. కొడుకు కూడా ఎప్పుడో వస్తాడు. మనం వారిని కలుసుకోవాలి.

తప్పకుండా కలుసుకుని తీరాలి. కాని ఆ విషయాలు తరువాత మాట్లాడదాంలే..." అని ఆగిపోయి ఒకమాటు సోనియా వంక ఆమె ముందు ఈ ప్రస్తావన తేవడం ఇష్టం లేనట్లుగా చూచింది.

"అయితే ఇంతకూ రేపు వెళ్ళి ఎవరిని కలుసుకుంటారు?" అని ఆమె మళ్ళీ వ్రేళ్ళు లెక్కిస్తూ "మొదట్లో షిన్‌షైన్‌ను కలుసుకుంటారను కుంటాను. తరువాత అన్నామెఖలోవ్‌నాను కలుసుకుంటా రనుకుంటాను. ఆమె కుర్రాడు కూడా ఇక్కడే ఉన్నాడు. పెళ్ళి కూడా చేసుకోబోతున్నాడు. ఇంకా మరెవర్ని కలుసుకుంటారు చెప్పండి? బెఝ్కోవ్, అతని భార్యా ఇక్కడే ఉన్నారు. పోయిన బుధవారం అతను మా ఇంటికి భోజనానికి కూడా వచ్చాడు. ఇహ ఈ పిల్లల విషయం..." అంటూ ఆ పిల్లలిద్దరినీ చూపుతూ "ఉదయాన్నే వీరిద్దరినీ ఇవరిస్కాయా మేరీమాత గుడి దగ్గరికి ప్రార్ధనల కోసం తీసుకుని వెడతాను. తరువాత దారిలో ఆగి కొంచెం దోపిడీలు కూడా చేస్తాం!- అంటే ఏమిటనుకుంటున్నారో! బట్టలు కొనుక్కుంటామన్నమాట. అయినా ఆ ఫ్యాషన్లంటూ నా కేమీ తెలీవు. రోజుకొక ఫ్యాషన్ వస్తోంది. ఇలాటి ఫ్యాషన్‌లు చూస్తుంటే నాలాటి ముసలిదాని మతి పోతోంది. మొన్నమటుకు మొన్న నేను ఒక యువతి పెద్ద పెద్ద పీపాల్లాంటి గౌను వేసుకుని ఉండడం చూచాను. ఆ. సరే, ఇంకా ఏమిటి చెప్పండి మన పనులు?" అన్నది.

"ఆ, ఏమీ లేదు. చాలా చిన్న పనే. పిల్లలకు బట్టలు కుట్టించడం, ఇక్కడ పరిసరాల్లో ఉన్న నా ఇల్లు, భూమి అమ్మి రావడం. అందుచేత రేపు నేను అక్కడికి వెళ్ళి వస్తాను. పిల్లలను నీతో వదిలిపెట్టి పోతాను. రేపు మీరిక్కడ గడపండి." అన్నాడు కౌంట్.

"సరే, అలాగే, నీ పిల్లల కేమీ భయంలేదు. వాళ్ళు ఉన్న పాళాన ఉన్నట్లే మళ్ళీ నీకు ఒప్పచెపుతాను. వారిని నేనేం కొరుక్కు తింటానా?" అన్నది మేరియా, నటాషా చెక్కిలి గిటుతూ. నటాషా ఆమెకు గారాబు పిల్ల.

ఆ మరుసటి రోజు వారు ఇలా అనుకున్న విధంగానే గడిపారు. ముందు మేరిమాత గుడిలో పూజ చేయడం కోసం వెళ్ళారు. తరువాత ఆ ఊళ్ళోకెల్లా పేరు పడ్డ టైలర్ మదాం అబర్ట్ ఛామ్‌ను చూడడానికి వెళ్ళారు! మేరియా డిమిట్రోవ్‌నా గొడవ తప్పితే చాలు కదా అని ఆమె తన దుకాణంలో ఉన్న చక్కని దుస్తును నష్టం వచ్చేలా తక్కువ ధరకు అమ్ముకోవలసి వచ్చింది. ఏమైనా ఈ సమయంలో నటాషా పెళ్ళి బట్టల్లో చాలా భాగం కుట్టించడానికి ఆర్డర్లు ఇచ్చారు. ఇంటికి వచ్చిన తరువాత ఆమె సొనియాను అవతలికి పంపి, నటాషాను ఒక ప్రక్కకు తీసుకుని వెళ్ళి "ఇక మనం మాట్లాడుకోవచ్చు నమ్మాయ్. నిజంగా నిన్ను నేను అభినందిస్తున్నాను. నీవు చక్కని వరుణ్ణి ఎన్నుకున్నావు. అందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. అతన్ని నేను చిన్నతనం నుంచీ ఎరుగుదును" అన్నది.

నటాషా సిగ్గు పడింది. "అతని వారన్నా నాకెంతో ఇష్టం. కాని ఒక మాట విను. వృద్ధ రాకుమారుణ్ణి వంచడం ఎవరికీ వశం కాదు, అతను ఈ వివాహానికి ఒప్పుకోడు. కాని ఆంద్రూ మాత్రం చిన్నపిల్లవాడా కాదు. తన పనులు తను చూచుకో గలడు. అయినా నాకొక విషయం మాత్రమే కొంచెం కష్టంగా ఉంది. ఇష్టం లేని ఇంటికి కోడలుగా వెళ్ళడం కొంచెం ఆలోచించదగిన విషయమే కాని అన్ని వ్యవహారాలూ నెమ్మది మీద సర్దుబాటు చేసుకోవచ్చు నీవు చాకచక్యంతోను, నెమ్మదితోను వ్యవహరించు కున్నావూ అంటే అందరినీ ఇట్టే గెలుచుకుని రావచ్చు" అన్నదామె మళ్ళీ.

నటాషా దీనికేమీ జవాబు చెప్పలేదు. భయంవల్ల మాత్రం కాదు. కాని మూడో మనిషి తన ప్రేమ విషయాలను గురించి మాట్లాడితే ఎంతో నొచ్చుకునే స్వభావం ఆమెది. ఆంద్రూ రాకుమారుని పట్ల ఆమె ప్రేమ అన్ని సంబంధాల వంటిది కాదు. వీటన్నిటికంటె అతీతమైనది కూడా. ఆ విషయంలో ఎవరైనా జోక్యం కలిగించుకుంటారంటే ఆ విషయం ఆమె నమ్మను కూడా నమ్మదు. ఆమె అతన్ని ప్రేమిస్తోంది. అతనే ఆమె ప్రపంచం. అతను ఆమెను ప్రేమిస్తున్నాడు, వస్తున్నాడు. ఇక ఇతర్ల మాట లెక్కేమిటి?

"అతని చెల్లెలు మేరియా మంచిది. ఆమె అందరి ఆడబిడ్డల వంటిదీ కాదు. చీమకు కూడా నొప్పి కలిగించదు. ఒకసారి నిన్ను చూడాలని ఆమె నాతో అన్నది. నీవు నీ తండ్రితో కలిసి రేపు అక్కడికి వెళ్లొచ్చు. ఆమెను సంతోష పెట్టడానికి ప్రయత్నించు. నీవు చిన్న పిల్లవు. అతను రాకముందే నీవు వారితో పరిచయం ఏర్పరచుకోవచ్చు. అతని తండ్రితో, చెల్లెలుతో అప్పటికే నీకు కొంత పరిచయం ఏర్పడి ఉండడం మంచిది కాదూ?" అన్నది మేరియా డిమిత్రోవ్నా.

"అవు నవును" అన్నది నటాషా.

# 46

ఏమైనప్పటికీ ఆ మరుసటి రోజు వారు వృద్ధ రాకుమారుణ్ణి చూడడానికి వెళ్ళారు. కౌంట్‌కు మాత్రం అక్కడికి వెళ్ళడమంటే లోలోపల భయంగానే వుంది. ఆయనతో మాట్లాడడం ఎలాగా అని లోలోపల కలవర పడ్డాడు. ఈ సమయంలో అతనికొక విషయం జ్ఞాపకం కూడా వచ్చింది. ఒకప్పుడు కౌంట్, వృద్ధ రాకుమారుణ్ణి విందుకు పిలిచాడు. అప్పుడాయన విందుకు రాకపోగా ఆయన చేతుల్లో కౌంట్ చీవాట్లు కూడా తినవలసి వచ్చింది. ఆనాడు సేనలను సేకరిస్తున్న సందర్భంలో కౌంట్ తనకు పంపించవలసినంత మంది మనుష్యులను పంపించలేదని రాకుమారుని చేతుల్లో ఇలా చీవాట్లు పడవలసి వచ్చింది. అదికాక ఈ చివాట్లు తను విందుకు

పిలిచినందుకు జవాబుగా పంపించబడ్డాయి. నటాషాకు మాత్రం అక్కడికి వెడుతున్నందుకు మనస్సెంతో హాయిగా ఉంది. తనకు నచ్చిన తీరులో ఎంతో చక్కగా ముస్తాబైంది కూడా.

"నన్ను చూచి వారు ముచ్చట పడకుండా ఉండడ మనేది అసాధ్యం. అలాటిది నా జీవితంలో ఎప్పుడూ జరగలేదు. అదీకాక వారు ఏది కోరినా నేను చేయడానికి సిద్ధంగానే ఉన్నాను. అతనికి తండ్రి కాబట్టి ఆ ముసలివాణ్ని నేను ప్రేమిస్తున్నాను. అతనికి చెల్లెలు కాబట్టి ఆ అమ్మాయినీ ప్రేమిస్తాను. కొద్దిలో చెప్పాలంటే వారందరినీ ప్రేమిస్తాను. ఇక వారిని ప్రేమించకుండా ఎలా ఉండగలుగుతాను" అనుకున్నదామె తనలో తాను.

విశాలంగాను, చీకటిగాను ఉన్న బోల్కోన్స్కీ భవనంలోకి వారు అడుగు పెట్టారో లేదో, కౌంట్ నిశ్వసిస్తూ ఇలా గొణుక్కున్నాడు. "భగవంతుడా! నీ దయ తప్పినట్లుందే?" అనుకున్నాడు.

అప్పుడు అతని ఆందోళన ఇంతా అంతా అని చెప్పడానికి వీల్లేదు. లోపలికి వెళ్ళి ఎంతో వినయంగా భయంతో మెల్లగా, రాకుమారుడు, రాకుమారీ ఉన్నారా అని అడిగారు. ఒక సేవకుడు వారి రాక తెలియచేయడానికి త్వరత్వరగా వెళ్ళాడు. కాని వెంటనే సేవకుల్లో ఒక విచిత్రమైన కలవరం చెలరేగింది. ఈ విషయం చెప్పడానికి వెడుతున్న సేవకుణ్ణి, పెద్దహాలు తలుపు దగ్గర మరో సేవకుడు ఆపు చేశాడు. ఇద్దరూ ఏదో గుసగుస లాడుకున్నారు. తరువాత ఒక పరిచారిక భయంతో అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చి వారికేదో చెప్పింది. చివరకు ఒక వృద్ధ సేవకుడు అక్కడికి వచ్చి రాకుమారుడు వారిని స్వీకరించలేడనీ, రాకుమారి మేరియా వారిని వెళ్ళి తన గదిలో కూచోమని కోరిందనీ చెప్పాడు. మదాంబోరిస్ మొదట బయటికి వచ్చి ఎంతో మర్యాదగా వారికి రాకుమారి గదులకు దోవ చూపించింది. మేరియా రాకుమారి సిగ్గుతో ఎర్రబారిన ముఖంతో తను మర్యాదగా హాయిగా కనిపించడానికి ప్రయత్నిస్తూ వారిని స్వీకరించడానికి ముందుకు వచ్చింది. తొలి చూపులో నటాషా పట్ల ఆమెకంత ఇష్టం కూడా కలగలేదు. ఆ పిల్ల చేసుకున్న ముస్తాబు చాలా అధునాతనంగాను, కేవలం శుష్కమైన ఆడంబర ప్రియత్వం ఉన్నదాని లాగాను కనిపించింది. ఆమె అందంపట్ల, యవ్వనంపట్ల తన అన్న ఆమెను ప్రేమిస్తున్నందు వల్ల ఒక విధమైన అసూయ కలిగి తొలిగా ఆమె పట్ల వైముఖ్యం ఏర్పడింది. వారిప్పటి రాకవల్ల ఆ వైముఖ్యం మరింత ఎక్కువైంది కూడా. వృద్ధ రాకుమారుడు రోస్టోవ్‌ను చూడననీ, అంత అవసరమైతే తన కుమార్తెను వారు చూడవచ్చుననీ చెప్పాడు. అందుచేత మేరియా ఎంతో భయంతోను ఆందోళనతోను, ఆ పరిస్థితిలో తన తండ్రి ఆ వచ్చిన వారికి ఎలాంటి మర్యాద చేస్తాడో అని వణికిపోయింది. చివరకు తనే వారిని చూడడానికి నిశ్చయించుకుంది.

"నా చిన్ని గాయకురాలిని నీకు అభినందనలు తెలియచేయడానికి తీసుకొని వచ్చాను రాకుమారీ!" అన్నాడు కౌంట్ నమ్రతగా, రాకుమారుడు హఠాత్తుగా లోపలికి వస్తాడేమో అని ఆయన నలువంకల కలయ చూచాడు. "మీ ఇరువురికీ ఇలా పరిచయం కలుగుతున్నందుకు నే నెంత సంతోషిస్తున్నానో చెప్పలేను. రాకుమారునికి ఇంకా జబ్బుగా ఉందా? అయ్యో పాపం! సరే. ఒక పదినిముషాల పాటు నా కుమార్తెను ఇక్కడ మీతో వదిలిపెట్టి వెళ్ళడానికి నన్ను అనుమతిస్తారా? నాకు ఈ ప్రక్కనే కొంచెం పని ఉంది. నేను వెంటనే తిరిగి వచ్చి ఆమెను తీసుకుని పోతాను" అన్నాడు.

కౌంట్, ఈ సాకు అప్పటికప్పుడు స్ఫురించి చెప్పాడు. కానున్న వదినె మరదళ్ళు ఒకరితో ఒకరు హాయిగా మాట్లాడుకోవడానికి అవకాశం కలిగించడం కోసం ఇలా చేశానని తరువాత తన కుమార్తెతో చెప్పాడు. అదీకాక ఆయన కుమార్తె కూడా ఈ విషయాన్ని ఊహించ గలిగింది. ఆమె మనస్సు కొంచెం నొచ్చుకొని, సిగ్గుతో ఆమె ముఖం ఎర్రబడింది. అలా సిగ్గుపడి నందుకు ఆమెకు తనపై తనకు మరింత కోపం వచ్చి రాకుమారి వంక సాహసంతో, తన కెవరిని చూచినా భయంలేదన్నట్లుగా చూచింది. మేరియా రాకుమారి కౌంట్ చెప్పిన మాటకు ఒప్పుకొని ఆయన మరికొంత ఆలస్యంగా వచ్చినా ఫరవాలేదన్నది. తను నటాషాతో మరి సేపు ఒంటిగా కాలం గడపవచ్చు కదా అనుకున్నది. తను అలా కోరుకున్నట్లు కనిపిస్తున్నప్పటికీ మదాం బోరిస్ ఆమె చూపులను అర్థం చేసుకోలేక ఆ గదిలోనే ఉండిపోయింది. అప్పుడు మాస్కోలో జరుగుతున్న వినోదాలను గురించి యెడతెరిపి లేకుండా ఆమె మాట్లాడుతోంది. ముందు హాలులో చాలా సేపు వేచి ఉండడంవల్లను తన తండ్రి చూపిన భయంవల్లను, నటాషా కలవరంతో నరనరంలోనూ వణికిపోతూ కూచుంది. మేరియా రాకుమారిపట్ల ఆమె ఒక విధమైన నిర్లక్ష్యతను, అయిష్టతను కనపరుస్తూ కూచుంది. ఆమెకు రాకుమారి గడ్డకట్టుకుని పోయిన దానిలా కనిపించింది.

ఒక అయిదునిముషాలపాటు ఎంతో కష్టం మీద సంభాషణ సాగింది. ఈ లోగా త్వరత్వరగా దాపుకు వస్తున్న స్లిప్పర్ల అడుగుల చప్పుడు వినిపించింది. రాకుమారి ముఖం భయంతో తెల్లనైపోయింది. తలుపు తెరుచుకొని వృద్ధ రాకుమారుడు, తెల్లని డ్రెస్సింగ్ గౌను ధరించి, రాత్రి టోపీ పెట్టుకొని అక్కడికి వచ్చాడు.

"నీవా అమ్మా, మదాం కౌంటెస్? నీవు కౌంటెస్ రోస్టోవ్‌వు కదూ? నేను పొరపడలేదను కుంటాను. నేను తెలుసుకోలేదులే. నీవు మమ్మల్ని చూడడానికి వచ్చే భాగ్యం మాకు కలిగించావు. నేను నా కుమార్తెతో మాట్లాడడానికి వచ్చాను.

ఇదిగో ఈ దుస్తులు చూస్తున్నావుగా? క్షమించు! నీ విక్కడ ఉంటావని నాకు తెలీదు." అన్నాడు రాకుమారుడు విరసంగా.

మేరియా రాకుమారి కళ్ళు దించుకుని లేచి నిలుచుంది. ఆయన వంక కాని నటాషా వంక కాని చూడలేక పోయింది. నటాషా కూడా లేచి నిలుచుంది. మదాం బోరిస్ మాత్రం చిరునవ్వు నవ్వుతూ ఉంది.

"నన్ను క్షమించు. నాకు నీ విక్కడున్నావని తెలీదు" అన్నాడు వృద్ధుడు మళ్ళీ. ఒకమాటు నటాషా వంక పైకి కిందకి చూచి వెళ్ళిపోయాడు. మేరియా నటాషా ఒకరివంక ఒకరు మాట్లాడకుండా మౌనంగా చూచుకున్నారు. వారుమాట్లాడ దలుచుకున్న మాటల్లో ఒక్కటి కూడా మాట్లాడుకోలేదు. ఇందువల్ల ఒకరిపై ఒకరికి మరింత అయిష్టత కలిగింది.

అప్పుడు కౌంట్ తిరిగి వచ్చాడు. నటాషా త్వరత్వరగా లేచి సెలవుతీసుకుని వెళ్ళిపోబోయింది. అప్పుడామెకు వృద్ధురాలివంటి ఈ రాకుమారి పట్ల చెప్పరానంత అసహ్యము, అయిష్టత కలిగాయి, తన్ను ఆమె ఇలాటి విపరీత పరిస్థితిలో ఉంచి నందుకు తనకెంతో కలవరపాటు కూడా కలిగింది. అదీకాక తను ఇంచుమించు అరగంటపైగా అక్కడ ఉన్నప్పటికీ ఆమె ఒక్కమాటుకూడా అంద్రూమాట తీసు కుని రాలేదు.

'నా మటుకు నేను అతన్ని గురించి మొట్టమొదట ఎలా మాట్లాడగలను? అదీకాక ఆ ఫ్రెంచి స్త్రీ ముందు!' అనుకున్నది నటాషా. ఆ చిక్కే మేరియా రాకుమారిని కూడా బాధిస్తోంది. నిజానికి రాకుమారి, పెళ్ళివిషయం మాట్లాడి తీరా లనే అనుకున్నది కాని మదాం బోరిస్ సమక్షంలో ఆ ప్రస్తావన తీసుకుని రావడం ఆమెకు కూడా సంకటంగా తోచింది. ఆ విషయం ఎలా ప్రారంభించాలో ఆమెకూ తెలీలేదు. చివరకు కౌంట్ లేచి గదిలోనుంచి వెడుతూ ఉండగా మేరియా రాకుమారి త్వరత్వరగా నటాషా దగ్గరికి వెళ్ళి ఆమె చేతిని తనచేతిలోకి తీసుకుని "ఒక్క నిముషం నటాషా నేను—నా అన్న ఇంత సౌఖ్యాన్ని కనుక్కోగలిగినందుకు ఎంత సంతోషిస్తున్నామో..." అని తను మాట్లాడుతున్న మాటలు నిజం కావని తెలుసు కుని ఆగిపోయింది. నటాషా ఆమె వంక తనకు తెలియకుండానే వ్యంగ్యపూరితంగా చూస్తూ ఉంది.

"రాకుమారీ! ఈ విషయం మాట్లాడడానికి ఇది తగిన క్షణం కాదను కుంటాను" అన్న నటాషా ఒకప్రక్కకు తిరిగి తన్నుతానునిబ్బరించుకుంటూ, ఆమె కళ్ళలో కన్నీళ్ళు మొలకెత్తుతున్నాయి. "నేనేం చేశాను? నేను ఏమన్నాను? " అను కున్నది తనలో.

ఆ రోజు భోజన సమయంలో వారు నటాషా కోసం చాలాసేపు వేచి ఉండ వలసి వచ్చింది. ఆమె తన గదిలో కూచుని చిన్నపిల్లలా వెక్కి వెక్కి ఏడుస్తూ కూచుంది. సోనియా ఆమె ప్రక్కనే నిలుచుని ఆమె తల ముద్దాడుతోంది.

"నటాషా! ఎందుకలా ఏడుస్తావు? జరిగిందేదో జరిగింది. ఇక మరిచిపో" అన్నది సోనియా.

"ఎంతటి అవమానం!" అన్నది నటాషా.

"మరిచిపో అమ్మా. ఇది నీ తప్పుకాదు. రా నన్ను ముద్దాడు"

నటాషా ముఖం పైకెత్తింది. వారి పెదవులు కలుసుకున్నాయి. కన్నీటితో తడిసిన తన చెక్కిలి తన స్నేహితురాలి చెక్కిలికి ఆనించింది.

"నేను చెప్పలేను—అది ఎవరి తప్పూకాదు. నా తప్పేనేమో! కాని...అత నింకా ఎందుకు రాలేదో?" అన్నది నటాషా.

చివరకు నటాషా భోజనానికి వెళ్ళింది. ఏడవడంవల్ల ఆమె కళ్లు ఎర్రగా ఉన్నాయి. నటాషాను, ఆమె తండ్రిని బోల్కోన్స్కీలు ఎలా స్వీకరించిందీ తెలుసు కున్న మేరియా డిమిత్రోవ్నా, నటాషా కలవరాన్ని గమనించనట్లు కనపడడానికి ప్రయత్నిస్తూ తన మామూలు ధోరణిలో వారితో నవ్వుతూ కులాసాగా మాట్లాడు తోంది.

# 47

ఆ సాయంకాలం రోస్టోవ్‌లు నృత్య నాటకం చూడడానికి వెళ్ళారు. వారి కోసం వారి యజమానురాలు డిమిత్రోవ్‌నా థియేటర్‌లో ఒక ప్రత్యేకమైన 'బాక్సు' ఏర్పాటు చేయించింది. వెళ్ళాలని లేకపోయినా తనకోసమే ప్రత్యేకంగా ఈ 'బాక్సు' ఏర్పాటు చేయడంవల్ల నటాషా వెళ్ళక తప్పింది కాదు. ఆమె ముస్తాబు ముగించు కుని డ్రాయింగ్‌రూంలోకి వెళ్ళి తండ్రి కోసం ఎదురు చూస్తూ నిలుచుంది. అక్క డున్న అద్దంలో తన పాప చూచుకుంటూ ఉంది. ఎంచాతనో కాని ఆ వేళ ఆమె పాప చెప్పరానంత ఎంతో ముచ్చటగా కనిపించింది. తన పాపను చూచి తనకే మోహం, ఒక తీయని విచారం ఆమెలో కలిగాయి.

"భగవంతుడా! ఆయనిక్కడ ఉంటే ఎంత బాగుండును! పూర్వం లాగా ఇప్పుడు నేను సిగ్గుపడను. అంత వెర్రిబాగులదాన్ని కాదు. పూర్వం ఆయన్ను ముద్దాడినప్పటిలాగా భయము, సిగ్గు, ఇప్పుడు కలుగవు . నా చేతులు రెండూ ఆయన చుట్టూ పెనవేసి దగ్గరికి లాక్కుంటాను. నా కళ్ళల్లోకి కళ్ళుంచి చూచేట్లుగా

చేసుకుంటాను. ఇప్పటికీ ఆ చూపులు నాకు జ్ఞాపకం. అతని చెల్లెలితోను, తండ్రితోను నాకు పనేమిటి? అతన్నే కదా నేను ప్రేమిస్తున్నది? అతన్నే నేను ప్రేమిస్తున్నాను. అతని ముఖం, అతని కళ్ళు, అతని చిరునవ్వు - ఆయన చిరునవ్వు ఎంత పరిపక్వంగా ఉన్నప్పటికీ ఒక పసిపిల్లవాడి చిరునవ్వు లాగా అమాయకంగా వుంటుంది— ఇప్పుడదంతా జ్ఞాపకం తెచ్చుకోవడం ఎందుకు?కాసేపు మరిచిపోతాను. లేకపోతే నేనెలా భరించగలను?... ఇలా అనుకుంటూ ఆమె పొంగివస్తున్న ఏడుపును ఆపుకుని ముఖం అద్దం నుంచి అవతలికి తిప్పుకుంది.

'సోనియా నికోలస్‌ను ఇంత నింపాదిగా ఎలా ప్రేమించ గలుగుతోందో నాకు ఆశ్చర్యం వేస్తోంది. ఇంత ఓరిమితో అతని కోసం ఎలా వేచి ఉండగలుగుతోందో? నే నావిడలాగా ఉండలేకుండా ఉన్నానే. ఇదేమి చిత్రం?...' ఇలా అనుకుని తన స్నేహితురాలి వంక చూచింది. ఆవిడ విసనకర్ర తీసుకుని అటువైపు నుంచే వస్తోంది.

ఇప్పుడు— ఈ పరిస్థితిలో ఆమె హృదయం ఎంత మెత్తబడిందీ అంటే, తన్ను అతను ప్రేమిస్తున్నాడనీ, అతన్ని తను ప్రేమిస్తున్నాననీ అనుకున్నంత మాత్రంతో ఆమెకు తృప్తి తీరదు. తన ప్రియుని మెడచుట్టూ చేతులు పెనవేసి, తన హృదయంలో పొంగులు పారుతున్న ప్రణయ రహస్యాలు అతనికి వినిపిస్తే కాని ఆమెకు తనివి తీరదు.తండ్రి ప్రక్కన కూచుని బండిలో వెడుతూ మంచుతో తడిసిన కిటికీ అద్దాల్లో ప్రతిఫలిస్తున్న వీధి లాంతర్లను సాలోచనగా చూస్తోంది. తన చుట్టూ ఉన్న ప్రపంచాన్నంతా మరిచిపోయింది. ఎక్కడికి వెడుతోందో, ఎందుకు వెడుతోందో ఆమెకు తెలీడం లేదు. ఏదో తీయని విషాదంలో ఆమె తేలిపోతోంది. వారి బండి థియేటర్ ముందు వరుసగా ఉన్న బండ్ల లోకి వెళ్ళి మంచులో చప్పుడు చేసుకుంటూ థియేటర్ ముందు ఆగింది. పైన వేసుకునే కోట్లు తీసుకుని నటాషా సోనియాలు బండి దిగారు. వారి వెనకాల కౌంట్ వచ్చాడు. ముగ్గురూ కలిసి జన సమ్మర్ధంలో నుంచి చోటు చేసుకుంటూ చుట్టూ వినిపించే అరుపులు, కేకలు, ప్రోగ్రాంలు అమ్మేవారి కేకలు వినిపించు కోకుండా చోటు చేసుకుని వెళ్ళారు. మూసిన తలుపుల్లో గుండా అప్పటికే అస్పష్టంగా ఆర్కెస్ట్రా సంగీతం వినిపిస్తూ వుంది.

"నటాషా! జుట్టు సవరించుకో" అన్నది సోనియా. సేవకుడు వారి కోసం 'బాక్సు' తలుపు తెరిచాడు. తలుపు దగ్గరికి వెళ్ళగానే సంగీతం వారి చెవుల్లో మరింత స్పష్టంగా వినిపించ సాగింది. బాక్సుల్లో చక్కగా ముస్తాబైన స్త్రీలు, స్టాల్సులో చక్కని యూనిఫారములు వేసుకున్న పురుషులు కళ్ళకు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నారు.పక్క 'బాక్సు'లో కూచున్న ఒక స్త్రీ ఒకమాటు నటాషా వంక తిరిగి చూచి స్త్రీ సహజమైన అసూయతో ఆమెపై ఒక చూపు విసిరేసింది. తెర ఇంకా తీయ

లేదు. ఇంకా ఆర్కెస్ట్రా సంగీతం మోగుతూనే ఉంది. నటాషా మెల్లగా ముస్తాబు సవరించుకుని సోనియాతో కలిసివెళ్ళి ముందు కూచుంది. ఎదురుగా ఉన్న బాక్సుల వైపు చూడసాగింది. అన్ని కళ్ళూ ఆమెవంకే చూస్తున్నాయి. నగ్నంగా ఉన్న ఆమె భుజాలవంక, చేతులవంక చూస్తున్నాయి. అప్పుడామెకు చాలాసేపటి నుంచీ కలిగని ఒక కొత్త అనుభవం కలిగింది. ఒకవిధమైన ఆనందం, బిడియం కూడా కలిగాయి. ఆ అనుభవంతోపాటు ఎన్నో జ్ఞాపకాలు, కోరికలు, ఆశలు ఆమె మనస్సులో పొడచూపాయి.

ఎంతో చూడముచ్చటగా ఉన్న ఆ పిల్లలిద్దరూ,ఎన్నాళ్ళనుంచో మాస్కోలో కనిపించని కౌంట్ రోస్టోవ్ అందరి దృష్టినీ ఆకర్షించారు. అదీకాక ఆ అమ్మాయి ఆండ్రూరాకుమారుని వివాహం చేసుకోనున్నదనే విషయం అందరికీ చూచాయిగా తెలుసు. అప్పటినుండీవారు తమ గ్రామంలోనే ఉంటున్నారన్న విషయం కూడా అందరికీ తెలుసు. అందుచేత ఆశ్చర్యంతో ఆమె వంక చూడసాగారు.

నటాషా ఇటీవల ఏపుగా ఎదిగింది. చూడముచ్చటగా కనిపిస్తూ ఉంది. ఆ సాయంకాలం మరీ చూడముచ్చటగా కనిపిస్తూంది.కారణం ఆమె అప్పుడున్న ఉద్వేగ పరిస్థితి. జీవితంతోను, యౌవనంతోను, పొంగు వారి పోతూ ఉన్న ఆమె తన చుట్టూ ఉన్న విషయాలనేవీ పట్టించుకోకపోవడం చాలా విచిత్రంగా కనిపిస్తూంది. నల్లని ఆమె కళ్ళు అక్కడున్న సమూహమునంతటినీ చూస్తున్నాయి. కాని ప్రత్యేకంగా ఎవరి వంకా చూడటం లేదు. నగ్నంగా, సుకుమారంగా ఉన్న ఆమె చెయ్యి సోఫా పరుపు మీద ఆమెకు తెలీకుండానే సంగీతానికి అనుకూలంగా తాళం వేస్తోంది.

"చూడు! ఆవిడ మిసెస్ ఎలెనైన్ అనుకుంటాను. ఆవిడ తన కుమార్తెతో కలిసి వచ్చింది" అన్నది సోనియా. "మైఖేల్ కిరొలొవిచ్ కూడా వచ్చాడే! ఎంత లావెక్కిపోయాడు" అన్నాడు కౌంట్.

"అన్నామైఖలోవ్నా వంక చూడు! ఏమిటీ తలమీద అలా ముస్తాబు చేసుకుంది?"

"బోరిస్‌తో కలిసి వచ్చింది. కారగైన్‌లు కూడా కలిసి వచ్చారు. వారివురూ వివాహం చేసుకుంటారట. బోరిస్ వివాహానికి ఒప్పుకున్నాడా?"

"డ్రౌబెట్‌స్కాయ్ ఒప్పుకున్నాడు. మీకు తెలియదా?" అన్నాడు షిన్‌షైన్ బాక్సు దగ్గరికి వస్తూ.

నటాషా తన తండ్రిని చూచినవైపే చూచింది. ఆమెకు జూలియా కనిపించింది. తల్లి ప్రక్కనే కూచుంది. ఎంతో హాయిగా కనిపిస్తోంది. పొడరు అద్దిన ఆమె మెడకు ఒక ముత్యాలదండ వ్రేలాడుతోంది. ఆమె వెనకాలే బోరిస్—చక్కని తల, మెరుస్తున్న జుట్టు కనిపిస్తున్నాయి. అతను జూలియాపైకి వంగి ఆమె చెవిలో ఏదో చెపుతున్నాడు. తప్పకుండా రోస్టోవ్‌లను గురించే చెపుతూ ఉంటాడు.

"వారు మమ్మల్ని గురించే మాట్లాడుకుంటున్నా రనుకుంటాను. ముఖ్యంగా నన్ను గురించే" అనుకున్నది నటాషా తనలో తాను. "నన్ను గురించి అసూయ పడవద్దని చెపుతున్నాడనుకుంటాను. ఎందుకలా చెప్పడం? అనవసరం. నేను వారి నేమీ లెక్క చెయ్యను. ఎందుకు లెక్క చేస్తాను? ఆ సంగతి వారికి తెలిస్తే?..." అనుకున్నది.

వారి వెనకాల ఒక ఆకుపచ్చని సిల్కుసోఫా ఉంది. ఆ సోఫాలో మిసెస్ డ్రౌబెట్‌స్కాయ్ కూచుని ఉంది. నటాషాకు అనుభవాన్ని బట్టి కానున్న దంపతుల ప్రేమ, ఆనందము ఎలాంటివో తెలుసు. అప్పుడామెకు హఠాత్తుగా ఉదయం జరిగిన విషయమంతా జ్ఞాపకం వచ్చింది. ఏదో కాటువేసినట్టుగా ఆమె తల ఒక ప్రక్కకు తిప్పుకుంది.

"ఆ ముసలివాడు నన్నలా స్వీకరించకుండా నిరాకరించడానికి అతనికి హక్కు ఏముంది? అయినా ఆయన వచ్చేవరకూ ఈ పాడు విషయాలన్నీ మరిచి పోవడం మంచిది" ఇలా అనుకుని ఆమె స్టాల్సులో ఉన్న పరిచితుల అపరిచితుల ముఖాల వంక చూడసాగింది.

ముందువరుసలో మధ్యగా అందరివంక చూస్తూ డొలొహోవ్ నిలుచుని ఉన్నాడు. పర్షియన్ ముస్తాబులో ఉన్నాడు. జుట్టు పైకి దువ్వుకున్నాడు. అతని పర్షియన్ ముస్తాబు విచిత్రంగా కనిపిస్తోంది. ఆ థియేటర్‌లో అందరికీ కనిపించే ప్రదేశంలో నిల్చుని అందరి దృష్టినీ ఆకర్షిస్తున్నాడు. అతని చుట్టూ మాస్కోలోని యువకులంతా పోగై ఉన్నారు. అతను వారికొక నాయకుడిలాగా నటిస్తున్నాడు. తన గదిలో అప్పుడెంత కులాసాగా ఉంటాడో, ఇక్కడ కూడా అంత కులాసాగా కనిపిస్తున్నాడు. కౌంట్ రోస్టోవ్ సోనియా భుజాన్ని తాకి అతన్ని చూపించాడు.

"అతన్ని నీవు గుర్తించావా? ఇప్పుడెక్కడ నుంచి ఊడిపడ్డాడో? ఇటీవల కనిపించడమే లేదు" అన్నాడు కౌంట్, షిన్‌షైన్‌తో.

"అవును, పూర్తిగా మాయమైపోయాడుగా. కాకసస్ వెళ్ళాడు. ఆ తరువాత అతన్ని గురించి ఏమీ తెలీలేదు. ఆ తరువాత పెర్షియాలో ఎవరో యువరాజుకు ప్రధాన మంత్రిగా ఉన్నాట్ట. ఇప్పుడిక్కడ స్త్రీలంతా అతనివైపే చూస్తున్నారు.... ఈ చక్కని పెర్షియన్ వంక! అంతా డొలొహోవ్‌తోనే ఉన్నట్టుగానే ఉంది. ఆనెటోవ్‌లూ, డొలొహోవ్లూ, స్త్రీలందరినీ వెర్రివాళ్ళ క్రింద కట్టేసి ఆటలాడిస్తున్నారు" అని చెప్పాడు షిన్‌షైన్.

పొడుగ్గా అందంగా ఉన్న ఒక స్త్రీ ప్రక్కనున్న బాక్సులోకి వచ్చింది. ఆమె జుట్టు దట్టంగా, ఒత్తుగా ఉంది. మెడ చుట్టూ రెండు వరుసల ముత్యాలదండ వ్రేలా

డుతూ ఉంది. భుజాలు తెల్లగాను తీర్చినట్లుగాను కనిపిస్తున్నాయి. ఆమె బాక్సులోకి వచ్చి చాలాసేపు తన సిల్కుగౌను సర్దుబాటు చేసుకుంటూ కూచుంది. నటాషా ఆమె మెడను, భుజాలను ముత్యాలను—ఆ సౌందర్యాన్ని మెచ్చుకుంటూ తనకు తెలియకుండానే పరిశీలిస్తూ ఉంది. మరోసారి నటాషా ఆవిడవంక చూడగానే ఆ స్త్రీ వెనక్కు తిరిగి చూచింది. ఆవిడ కళ్ళు కౌంట్ రోస్టోవ్ కళ్ళను కలుసుకున్నాయి. ఆమె స్నేహంగా చిరునవ్వు నవ్వింది. ఆవిడ పీటర్ భార్య కౌంటెస్ బెఝోవ్. అందరితోనూ పరిచయమున్న కౌంట్ ఆవిడతో మాట్లాడటం కోసం ముందుకు వంగాడు.

"మీ రిక్కడికి వచ్చి చాలాసేపయినట్లుందే. నేనక్కడికి వస్తున్నాను. మీ చెయ్యి ముద్దాడడం కోసం వస్తున్నాను. నేనిక్కడికి పనిమీద నా పిల్లలతో సహా వచ్చాను. ఈ నాటకంలో సిమనోవ్నా చక్కగా నటిస్తుందట కదా, విన్నాను? కౌంట్ కూడా వచ్చాడా?" అన్నాడు కౌంట్ రోస్టోవ్.

అవును. ఆయన కూడా వద్దామనే అనుకున్నాడు" అన్నది హెలెన్,నటాషా వంక తదేకంగా చూస్తూ.

కౌంట్ రోస్టోవ్ మళ్ళీ తన స్థానంలో తను కూచున్నాడు. "ఆవిడ అందంగా లేదా?" అని అడిగాడు తన కుమార్తెను.

"అద్భుతంగా ఉంది! ఆవిడను ఎందుకు ప్రేమిస్తారో ఇప్పుడు నాకుతెలుస్తూ ఉంది" అన్నది నటాషా.

అప్పుడు ఆర్కెస్ట్రా ఆగిపోయింది. అంతా వారి వారి స్థానాల్లో కూచున్నారు. తెర లేచింది. పెద్దలు, పిన్నలు, పౌరులు, సైనికులు, నగ్నమైన భుజాలతోను రవ్వల హారాలతోను మెరుస్తున్న స్త్రీలు; అందరూ రంగస్థలంమీదికి దృష్టి సారిస్తూ కూచున్నారు. నటాషా కూడా అటువైపే చూస్తూ కూచుంది.

## 48

అప్పుడే గ్రామసీమలో నివసించి రావడం వల్లను, ఆ సాయంకాలం పరధ్యానంగా ఉండడం వల్లను నటాషాకు ఈ ప్రదర్శనం ఎంతో విడ్డూరంగాను అర్థరహితంగాను కనిపించింది. ఆ కథ కాని ఆ సంగీతంలోని మెలుకువలు కాని ఆమెకు బోధపడలేదు. ఆమెకు కనిపించిందల్లా రంగు రంగుల తెరలు, మెరుస్తున్న దుస్తులు వేసుకుని పాడుతూ, ఆడుతూ దీపాల వెలుతురులో తిరుగుతున్న స్త్రీలు, పురుషులు మాత్రమే. దాని అర్థమేమిటో ఆమెకు తెలుసు కాని దానిలోని అసహజత్వం ఆమెకెంతో విడ్డూరంగా కనిపించింది. నటకులను చూచినప్పుడు ఆమెకు సిగ్గు కలిగింది, గమ్మత్తుగా ఉన్నట్లూ అనిపించింది. తన ప్రక్కనున్నవారుకూడా

తనలాగే భావిస్తున్నారేమో అని ఒకమాటు వారివంక చూచింది. కాని ప్రతివారూ కళ్ళు రంగస్థలం మీదనే పెట్టుకుని నాటకం ఎంతో శ్రద్ధతో చూస్తూ ఉండడంఆమె గమనించింది. వారు అలా నాటకం చూస్తుంటే ఎంతో అసహజంగాను, కృత్రిమం గాను ఉన్నట్టు ఆమెకు కనిపించింది. "ఇది ఇంతే కాబోలు" అనుకున్న దామె తనలో. ఇలా అనుకుంటూ తన క్రింద కూచున్న మనుషుల తలలవంక, నగ్నంగా శరీరాలు కనిపించేలాగా దుస్తులు వేసుకుని కూచున్న బాక్సుల్లో స్త్రీలవంక, తన ప్రక్కన కూచున్న అందకత్తె హెలెన్ వంక చూడసాగింది. హెలెన్ పై దుస్తు లన్నీ తీసివేసి జరుగుతున్న దృశ్యం వంక తదేకంగా చూస్తూ నిశ్చలంగా చిరు నవ్వు నవ్వుతూ కూచుని ఉంది. ఆ థియేటర్ అంతా వ్యాపించిన నిండైన కాంతి లోను, వెచ్చని వాతావరణంలోను ఆమె హాయిగా జలకమాడుతున్నట్లుగా ఉంది. నటాషా ఒక విధమైన మెల్లని మత్తు తన మనస్సుపైకి రావడం గమనించింది. ఆమె కిలాంటి అనుభవం కలిగి చాలాకాలం కావస్తోంది. ఆమె ఎక్కడున్నదో, ఏం చేస్తు న్నదో కూడా మరిచిపోయింది. తన కళ్ళముందు నాటకం సాగుతూ ఉంది. ఆమె చూడకుండానే ఆ నాటకం చూస్తోంది. ఎన్నో చిత్రవిచిత్రమైన భావాలు ఆమె మన స్సులో తళుకొత్తసాగాయి. ఒక క్షణంలో రంగస్థలంమీదికి దుమికి ఫుట్‌లైట్ల దగ్గర నిలుచుని ఆ నటి పాడి ఆపివేసిన పాట అందుకుని తను పాడాలనిపించింది. మరో సారి దగ్గరగా కూచున్న ఒక ముసలివాణ్ణి తన విసనకర్రతో తట్టాలనిపించింది.మరో సారి హెలెన్ పైకి వంగి ఆమెకు చక్కలిగింతలు పెట్టాలనిపించింది.

ఇలా ఉండగా ఒక పాట ఆగిపోయి మరో పాట ప్రారంభించడానికి ఉండే విశ్రాంతి సమయంలో రోస్టోవ్‌ల బాక్సుకు ప్రక్కనే ఉన్న స్టాల్సు తలుపు మెల్లగా తెరుచుకుని ఒక వ్యక్తి వస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది. ఆ వచ్చింది అనె టోల్ కారగైన్.

కౌంటెస్ బెషోకొవ్ ప్రక్కకు తిరిగి అతని వంక చూచింది. ఆమె అలా చూచి చిరునవ్వు నవ్వడం నటాషా గమనించింది. సహాయ సేనాధిపతి దుస్తుల్లో ఉండి చక్కగా కనిపిస్తున్న ఒక ఆఫీసర్ వారి బాక్సుదగ్గరికి ఎంతో మర్యాదగా నడిచిరావడం ఆమె గమనించింది. అతన్ని పీటర్స్‌బర్గ్ బాల్‌లో చూచినట్లు ఆమెకు జ్ఞాపకం. అతను నడుస్తున్న తీరు ఆమెకు కొంచెం విచిత్రంగా కనిపిస్తోంది. అతను అంత అందగాడు కాకపోయినట్లయితే ఆ నడక హాస్యాస్పదంగా కనిపించి ఉండేది. చక్కని అతని ముఖంలో ఎంతో సంతృప్తి, ఉల్లాసం కనిపిస్తున్నాయి.

నాటకం సాగుతూ ఉన్నప్పటికీ అతను తివాసీపరిచిన దోవలో మెల్లగా— తాపీగా నడిచి వస్తున్నాడు. సెంటు రాచుకున్న అతని తల చక్కగా పైకి ఎత్తబడి వుంది. అతిమెల్లగా అతని కత్తి చప్పుడవుతూ వుంది. తన చెల్లెలి దగ్గరికి వెడుతూ

ఒకమాటు నటాషావంక చూచాడు. గ్లోవ్ తొడుక్కొని ఉన్న తన చేతిని ఆమె బాక్సు మీద ఉంచుతూ ముందుకు వంగి ఆమెను ఏదో ప్రశ్నించాడు. తప్పకుండా అది తన ప్రక్కన ఉన్న చక్కని నటాషాను గురించే అయిఉంటుంది.

"ఎంత చక్కగా ఉంది?" అన్నాడతను నటాషాను ఉద్దేశిస్తూ.

ఆమె కా మాటలు వినిపించలేదు. అయినప్పటికీ పెదవుల కదలికను బట్టి ఆ మాటలు గ్రహించగలిగింది. తరువాత అతను ముందువరుసలోకి వెళ్ళి డొలొహోవ్ ప్రక్కన కూచున్నాడు. సస్నేహంగా అతన్ని ఒక ప్రక్కకు నెట్టాడు. ఒక మాటు చిరునవ్వు నవ్వి ఫుట్‌లైట్లకు దగ్గరగా కూచున్నాడు.

"అన్నా చెల్లెళ్ళకు ఎంత చక్కటి పోలికలున్నాయి! ఇద్దరూ ఎంత చక్కగా ఉంటారు!" అన్నాడు వృద్ధకౌంట్.

నాటకంలో మొదటి రంగం ముగిసింది. ప్రేక్షకులు నాటకశాలలో నుంచి లోపలికి వెడుతూ బయటికి వస్తూ ఉన్నారు. స్థలాలు మార్చుకుంటూ ఉన్నారు.

బోరిస్, రోస్టోవ్‌ల బాక్సుదగ్గరికి వచ్చాడు. వారి అభినందనాలను ఎంతో అమాయకంగా అందుకున్నాడు. తన వివాహానికి రమ్మని వారిని కోరాడు. నటాషా అతనితో ఎంతో కులాసాగా కబుర్లు చెపుతూ కూచుంది. అయినా ఇతనేనా తను ఒకప్పుడు ప్రేమించాననుకున్న బోరిస్? కాని ఆ పరిస్థితిలో ఆమె కేదీ అసహజంగా కనిపించడం లేదు. అందకత్తె అయిన హెలెన్ అందరివంక చూచి చిరునవ్వు నవ్వుతోంది. నటాషా కూడా బోరిస్‌తో మాట్లాడుతూ ఆమెలాగానే చిరునవ్వు నవ్వింది.

హెలెన్ బాక్సుచుట్టూ కొద్దిసేపట్లో ఎంతోమంది పోగయ్యారు. వారంతా ఎంతో పెద్ద అంతస్తుకు చెందినవారు. మేధావులు. ఆమెతో తమకు పరిచయం ఉన్నదని అందరికీ చూపించడానికి ఒకరితో ఒకరు పోటీలు పడుతున్నారు.

ఫుట్‌లైట్ల దగ్గర నిలుచున్న కారగైన్ ఆ విశ్రాంతి సమయంలో ఒక్క నిముషం కూడా రోస్టోవ్‌ల బాక్సుమీదినుంచి కళ్ళు తీయలేదు. తన్ను గురించే వారు మాట్లాడుకుంటున్నారని అనుకున్నది నటాషా. అలా అనుకుని పొంగిపోయింది. ఆ కోణంలో ఆమె ముఖం ఎంతో ముచ్చటగా ఉంటుందని ఆమె ఉద్దేశం. నాటకం రెండోరంగం ప్రారంభించే ముందు పీటర్ వచ్చాడు. రోస్టోవ్‌లు ఇంతవరకూ అతన్ని చూడలేదు. అతను పూర్వంకంటె కొంచెం మారినట్టుగా కనిపిస్తున్నాడు. ఎవరినీ గమనించకుండా దోవచేసుకుని పోతున్నాడు. అనెటోవ్ అతనికి దగ్గరికి వచ్చి రోస్టోవ్‌ల బాక్సును చూపిస్తూ ఏదో మాట్లాడాడు. పీటర్, నటాషాను చూచి ఆమెతో మాట్లాడడానికి త్వరత్వరగా వారి దగ్గరికి వచ్చాడు. బాక్సు మీదికి వంగి చిరునవ్వు నవ్వుతూ చాలా సేపు నటాషాతో మాట్లాడాడు. నటాషా అతనితో మాట్లాడుతూ ఉండగా ప్రక్కనున్న కౌంటెస్ బెషోవ్ బాక్సులోనుంచి ఆమె కొక పురుష

కంఠస్వరం వినిపించింది. అది కారగైన్ కంఠస్వరం అయి ఉంటుందని అనుకున్నదామె. ఆమె తిరిగి చూడగానే ఆమె కళ్ళు కలుసుకున్నాయి. అతను తదేకంగా ఆమె వంక చూచాడు. అంతదగ్గరిలో అతన్ని అలా చూడడం ఆమె కెంతో బిడియంగా తోచింది. అతనితో పరిచయం లేకపోవడం కూడా ఆమెకెంతో బిడియంగా తోచింది.

రెండవరంగం మొదలుపెట్టారు. దృశ్యం సాగుతూ ఉండగా నటాషా స్టాల్సు వంక చూస్తూ కూచుంది. ఆమెకు ఆనెటోవ్ కారగైన్ కనిపిస్తున్నాడు. కుర్చీమీద చెయ్యి వెనక్కు వేసుకుని వెనక్కు తిరిగి ఆమెవంక తదేకంగా చూస్తున్నాడు. అతన్ని అంతగా ఆకర్షించగలిగినందుకు నటాషాకు ఆనందం కలిగింది. అందులో ఆమెకు అనుచితమైనం దేమీ కనిపించలేదు కూడా.

ఆ తరువాత కౌంటెస్ హెలెన్ లేచి కౌంట్ వంకకు తన చక్కని భుజాలు తిప్పి తన చిన్ని వ్రేలికొసతో అతన్ని పిలిచింది. తరువాత తన బాక్సుచుట్టూ పోగవుతున్నవారిని గమనించకుండానే అతనితో ప్రత్యేకంగా మాట్లాడసాగింది.

"ముచ్చటైన మీ పిల్లలకు నన్ను పరిచయం చెయ్యరూ?" అని అడిగింది. "మాస్కో అంతా వారిమాటే చెప్పుకుంటోంది. వారితో పరిచయం లేనిదాన్ని నేను ఒక్కతినే అయినాను."అన్నది.

నటాషా లేచి నిలుచుని అద్భుతంగా కనిపిస్తున్న ఆ కౌంటెస్‌కు తన గౌరవాన్ని తెలిపింది. ఆవిడ తనను ఇలా అభినందించడం, ఆమెకు సిగ్గు, ఆనందం కలిగించాయి.

"నేనే మాస్కో నివాసురాలిని అవుదామనుకుంటున్నాను" అన్నది హెలెన్. "ఇలాంటి ముత్యాలను అక్కడ—ఎక్కడో నగరానికి దూరంగా దాచి ఉంచడం ఎంత సిగ్గుచేటు?" అన్నది.

ఇలా మాట్లాడడంచేతనే కౌంటెస్ హెలెన్ అందరినీ ఆకర్షించే స్త్రీలా పేరు పొందింది. తన మనస్సులో ఏది అనుకోదో, ఆ విషయన్ని ఎంతో సహజంగా చక్కగా చెపుతుంది. ముఖ్యంగా ఒకరిని పొగిడే విషయంలో ఈ నేర్పును ఎంతో ఎక్కువగా చూపుతుంది. "కౌంట్! నీ కుమార్తెలతో కలిసి నేను కొంత కాలక్షేపం చేద్దామనుకుంటున్నాను. నేను కూడా ఎక్కువకాలం ఇక్కడ వుండను. మీరూ ఉండరు. అందుచేత ఉన్నంతకాలం అందరం కలిసి కులాసాగా కాలక్షేపం చేద్దాం. నేను మిమ్మల్ని గురించి చాలా చాలా విన్నాను—ఎన్నెన్నో విన్నాను." హెలెన్ ఇలా అని నటాషా వంక చూచి తను ఎప్పుడూ సహజంగా నవ్వే చిరునవ్వు నవ్వి "నిన్ను గురించి పీటర్స్‌బర్గ్‌లో డ్రౌబెట్‌స్కాయ్ ద్వారాను, నా భర్తకు ముఖ్య స్నేహితుడయిన అంద్రూ రాకుమారుని ద్వారాను ఎంతో విన్నాను"అన్నది. ఈ విషయాన్ని

ప్రత్యేకంగా ఆమె ఎందుకు చెప్పింది అంటే, నటాషాకు, ఆంద్రూకు గల వివాహ సంబంధం తనకు తెలుసునని చెప్పడంకోసమే. తరువాత వారి పరిచయం మరింత ఎక్కువ కావడంకోసం వారిలో ఒకరిని తన బాక్సులోకి వచ్చి కూచోమని కోరింది. నటాషా వెళ్ళి ఆమె బాక్సులో కూచుంది.

మూడో రంగం మొదలు పెట్టింది. చక్కగా దీపాలు వెలిగించిన రాజభవనం, భవనంలో గోడలనిండా పూర్వీకుల చిత్రాలు. భవనం మధ్యలో ఇద్దరు వ్యక్తులు న్నారు, రాజు, రాణి. రాజుగారు కొంత నటించిన తరువాత ఒక పాట పాడడం మొదలెట్టాడు. తరువాత కొంత సేపటికి పాట అపుచేసి ఊదారంగు సింహాసనం మీదికి వెళ్ళి కూచున్నాడు. మొదట్లో తెల్ల రంగు దుస్తుల్లోను, తరువాత నీలపు రంగు దుస్తుల్లోను కనిపించిన యువతి ఇప్పుడు వదులుగా ఉన్న గౌను ధరించి జుట్టు విర బోసుకుని రాణికి ఒక పాట ద్వారా తన బాధను వెళ్ళబోసుకుంటూ ఉంది.కాని రాజు ఆమె బాధను తను వినిపించుకోనట్టుగా చెయ్యి ఎత్తాడు. 'అనేక మూలల నుంచి పురుషులు, స్త్రీలు వచ్చి నృత్యం చేయడం మొదలు పెట్టారు. ఫిడేళ్లు త్వర త్వరగా ఒక రాగం ఆలాపిస్తున్నాయి. ఒక స్త్రీ ముందుకు వచ్చి ఒక క్షణంపాటు తన బాడీ సర్దుకుని మధ్యలో నిలుచుని నృత్యం చేయసాగింది. అప్పుడు ప్రేక్షకులు ఎంతో ఆనందించారు. నగ్నమైన కాళ్ళతో ఉన్న ఒక వ్యక్తి ఒక మూల నుంచి వచ్చి, ఫిడేలు రాగాలకు అనుకూలంగా నాట్యం చేయసాగాడు. అతనే డుఫర్ట్! సంవత్సరా నికి అరవై వేల ఫ్రాంకులు సంపాదిస్తున్నాడు. అతను రంగస్థలం మీదికి రాగానే ప్రేక్షకులు పొందిన ఆనందం అంతా, ఇంతా అని చెప్పడానికి వీల్లేదు. హాలంతా పిక్కటిల్లి పోయింది. అతను ఒక క్షణంపాటు ఆగి ప్రేక్షకుల ముందు వంగి తన కృతజ్ఞత తెలియపరిచాడు. తరువాత మళ్ళీ స్వరమేళ మొదలు పెట్టింది. హఠాత్తుగా ఆర్కెస్ట్రా సంగీతం హెచ్చయింది. ఆ సంగీతానికి అనుకూలంగా త్వర త్వరగా అందరూ ఆ అమ్మాయిని మోసుకుని లోపలికి తీసుకుని వెడుతుండగా తెర పడింది. తరువాత ప్రేక్షకులంతా డుఫర్ట్‌ను పిలుస్తూ పెద్ద గోల చేశారు. ఈపాటికి నటాషా ఈ చూచినదంతా విడ్డూరంగా ఉన్నదని అనుకోవడమే కాకుండా, ఇదేమిటని చిరు నవ్వు నవ్వుకుంటున్నది కూడా.

"డుఫర్ట్ నాట్యం బాగాలేదూ?" అని అడిగింది హెలెన్.

"అవును" అంటూ నటాషా చిరునవ్వు నవ్వింది.

# 49

ఆ తరువాత విశ్రాంతి సమయంలో కౌంటెస్ హెలెన్ బాక్సుతలుపు తెరుచుకుని ఒక చల్లని పిల్లగాలి పీచింది. ఆనెటోల్ తలవంచుకుని మెల్లగా లోనికి వచ్చాడు.

"నా తమ్ముణ్ణి నీకు పరిచయం చెయ్యనా?" అన్నది హెలెన్. ఇలా అంటూ ఆనెటోల్ వంక, నటాషా వంక కలవరంతో చూచింది. నటాషా ఆ చక్కని యువకుని వంక తిరిగి చూచి చిరునవ్వు నవ్వింది. దూరం నుంచి అతను ఎంత చక్కగా కనిపించాడో, దగ్గరున్నప్పుడు కూడా అంతే చక్కగా కనిపించాడు. అతను ఆమె ప్రక్కనే కూచున్నాడు. ఎన్నాళ్ళనుంచో ఆమె పరిచయ భాగ్యం కోసం ఎదురు చూస్తున్నానని చెప్పాడు. నారిష్కైన్ నృత్యంలో ఆమెను కలుసుకున్నప్పటి నుంచీ ఆమె పరిచయం కోసం తను ఎదురు చూస్తున్నానని చెప్పాడు. కారగైన్ స్త్రీలతో మాట్లాడే తీరులోను, పురుషులతో మాట్లాడే తీరులోను భేదం వుంది. స్త్రీలతో ఎక్కువ సహజంగాను, చనువుగాను మాట్లాడతాడు. అతనిప్పుడు నటాషాతో కూడా ఎంతో చనువుగా మాట్లాడాడు. అతనిలా నిరాడంబరంగాను, అమాయకంగాను మాట్లాడడం ఆమెకెంతో ఆశ్చర్యం కలిగించింది. అతన్ని గురించి ఆమె ఎన్నో కథలు విని వున్నది. కాని ఇప్పుడు మాత్రం. అతను చూచినప్పుడు ఆమె కలాటి విడ్డూరమేమీ కనిపించలేదు. అతని ముఖం మీద చిందుతున్న చిరునవ్వు చూచినప్పుడు ఆమెకేమీ బిడియ మనిపించలేదు కూడా.

నాటకం ఎలా ఉన్నదని ఆనెటోవ్ ఆమెను అడిగాడు. పోయినసారి ఒక మాటు నాటకం జరుగుతూ ఉండగా సిమనోవ్నా పడిపోయిందని కూడా చెప్పాడు. "మరో విషయం కౌంటెస్!" అంటూ తన కామె పాత స్నేహితురాలైనట్లుగా ఇలా ప్రారంభించాడు. "మే మొక ఫ్యాన్సీదుస్తుల ప్రదర్శనం ఏర్పాటు చేస్తున్నాం. నీవు కూడా అందులో పాల్గొనాలి సుమా! అదెంతో గమ్మత్తుగా ఉంటుంది. మేమంతా కారగైన్ల ఇంట్లో సమావేశమవుతున్నాం. నీవు కూడా రావాలి. తప్పకుండా వస్తావు కదూ!" అన్నాడు. ఇలా అంటోంటే అతని కళ్ళలో చిరునవ్వు కనిపించింది, నటాషా కళ్ళలో కూడా చిరునవ్వు కనిపిస్తోంది. అతను అలాగే చిరునవ్వు నవ్వుతోన్న కళ్ళతో ఆమె భుజాలవంక చూస్తున్నాడు. తనను చూచి అతను ముగ్ధుడై పోయాడనడంలో ఏ మాత్రం సందేహం లేదని ఆమె అనుకున్నది. అతను ఎటు వైపు చూస్తున్నప్పటికీ ఆ చూపులు తననే తాకుతున్నట్టుగా ఉన్నాయి. అందువల్ల ఆమెకు ఆనందమూ కలిగింది; ఒక విధమైన సిగ్గూ కలిగింది. అయినప్పటికీ ఆమె అతని చూపులు కలుసుకోకుండా ఉండడం కోసం త్వరగా తన చూపులు మరల్చు

కుంది. తనకూ, ఇతరులకూ, మధ్య ఎప్పుడూ ఉంటూ వచ్చిన ఒక విధమైన అంతరం ఇప్పు డింత త్వరలో ఎలా మాసిపోయిందా అని ఆమె కలవరపడ సాగింది. ఇంత కొద్ది కాలంలో ఈ వ్యక్తికి తను ఎలా దగ్గరిగా రాగలిగానా అని ఆమె ఆశ్చర్యపడ సాగింది. వారు మాట్లాడింది కూడా అయిదే నిముషాలు. ఆ అయిదునిముషాలు కూడా వారు మాట్లాడిన విషయాలు చాలా అల్పమైనవి అయినప్పటికీ అతను తనకింత దాపుగా రావడం ఆమె కొక విధమైన భయాన్ని కూడా కలిగించింది. తను ముఖం తిప్పుకుని ఉన్నప్పుడు అతను తన వెనకగుండా వచ్చి తనమెడను ముద్దాడుతాడేమో అనిపించింది. ఆమెతో ఇంత చనువు ఇదివర కెవరూ తీసుకోలేదు. హెలెన్‌వంక, తన తండ్రి వంక "దీని కర్థమేమిటి?" అన్నట్లుగా చూచింది. కాని అప్పుడు హెలెన్ ఒక జనరల్‌తో మాట్లాడుతూ ఆమె చూపును గమనించలేదు. తండ్రి మాత్రం కులా సాగా చిరునవ్వు నవ్వుతూ ఆమె వంక చూస్తున్నాడు. "నీవు ఆనందిస్తున్నట్టుగా వున్నావు! మరీ మంచిదే! నాకు ఎంతో సంతోషం" అన్నట్టుగా ఉంది ఆయన చూపు. కొంతసేపైన తరువాత ఆనెటోల్ తన వంక తదేకంగా అలాగే చూడడం గమనించి నటాషా ఆ మౌనాన్ని భంగం చేయడంకోసం "మాస్కో ఎలా ఉన్నది?" అని అతన్ని అడిగింది. కాని తను ఇలా అడిగిందో లేదో, తన ముఖం సిగ్గుతో ఎర్ర బారింది. తను అలా అడగవచ్చో అడగకూడదో అనుకున్నది. ఆనెటోల్ చిరునవ్వు నవ్వాడు.

"మొదట్లో నేను ఇక్కడికి వచ్చినప్పుడు నా కిక్కడ అంత బాగా అనిపించ లేదు. ముచ్చటైన స్త్రీలుంటే కదా ఒక ఊరు బాగుండడమనేది? కాదా? అప్పుడెవరూ లేరు." అంటూ ఆనెటోల్ ఆమెవంక చూచి "నీవు ప్రదర్శనానికి వస్తావు కదూ? అక్కడ నీవే అందాలరాణివి అవుతావు. వస్తానని మాట ఇవ్వవూ? అందుకు గుర్తుగా నీ చేతిలో వున్న పువ్వును ఇలా ఇవ్వు" అన్నాడు.

నటాషాకు అతను మాట్లాడుతున్న వేవీ అర్థం కాలేదు. అతనికీ అర్థంకాలేదు. ఆమె మాత్రం ఆ మాటల వెనకాల ఏదో ఉద్దేశం ఉన్నదని అనుకున్నది. ఆ మాటల కేమి జవాబు చెప్పాలో తోచక ఆమాటలు విననట్లుగా ముఖం ప్రక్కకు తిప్పకుంది. కాని అతను తన దగ్గరే ఉన్నట్టుగా, తనదాపునే ఉన్నట్టుగా, తన ప్రక్కనే ఉన్న ట్టుగా, ఆమెకు తోచింది.

"అతనేం చేస్తున్నాడూ? సిగ్గుపడుతున్నాడా? విషయాలన్నీ నేనే సర్దుబాటు చేసుకోవాలా?" అని తనలో తాను ఆశ్చర్య పడసాగింది. మళ్ళీ ఒకమాటు వెనక్కు తిరిగి చూడకుండా ఉండలేకపోయింది. నిర్మలమైన అతని చిరునవ్వు, ఎంతో చను వుగా ఉన్న అతని తీరు, ఆమెను ఓడించివేశాయి. ఆమె కూడా చిరునవ్వు నవ్వింది. తనకూ, అతనికీ మధ్యగల అంతరం ఇలా మాసిపోయిందనే విషయం ఆమెకు మళ్ళీ

జ్ఞాపకం వచ్చి, అతని ఆకర్షణకు ఆమె కలవరపడ సాగింది. అయినప్పటికీ ఆమె చిరునవ్వు నవ్వకుండా ఉండలేక పోయింది.

మళ్ళీ తెర లేచింది. అనెటోవ్ సంతృప్తితో చిరునవ్వు నవ్వుతూ మళ్ళీ తన స్టాల్ దగ్గరికి వెళ్ళాడు. నటాషా తిరిగి తండ్రి బాక్సులోకి వెళ్ళి కూచుంది. ఆమెకు మరో లోకంలో అడుగుపెట్టినట్టుగా వుంది. ఇప్పుడన్నీ ఆమెకు ఎంతో సహజంగా కనిపిస్తున్నాయి. ఆమె ప్రియుడు, మేరియా రాకుమారితో తను ఆ ఉదయం మాట్లాడడం, గ్రామాల్లో తను గడిపిన జీవితం; ఈ జ్ఞాపకాలన్నీ ఆమె స్మృతిపథం నుంచి చెరిగిపోయాయి. ఏనాడో జరిగిన విషయాల్లాగా కనిపిస్తున్నాయి.

నాలుగో రంగం మొదలు పెట్టింది. పొడుగ్గా ఉన్న ఒక దయ్యం పాట పాడుతూ వచ్చి కొద్దిసేపు నటించి చివరకు ఒక వలలో మాయమైపోయింది. ఇంతే నటాషా చూచింది. ఆమె మనస్సు కలవరంతో తల్లక్రిందులైంది. తనకు తెలీకుండానే తను చూడకుండా ఉండలేని కారగైన్ మాత్రమే ఈ కలవరానికంతా కారణమని అనుకున్నది.

వారు ఇంటికి వెడుతుండగా అనెటోవ్ మళ్ళీ వారి బండి దగ్గరికి వచ్చాడు. బండిని పిలిపించి వారిని బండి ఎక్కించాడు. నటాషాను బండి ఎక్కిస్తూ తన చేతితో ఆమె చేతిని నొక్కాడు. ఆశ్చర్యంతోను, సిగ్గుతోను ఆమె ఒకమాటు అతని వంక చూచింది. అతని కళ్ళలో ఆర్ద్రత, అతని ముఖంలో చిరునవ్వు కనిపించాయి.

వా రింటికి చేరగానే టీ సిద్ధంగా ఉంది:అప్పుడు కాని నటాషా జరిగిందేమిటో స్పష్టంగా అర్థం చేసుకోలేకపోయింది. హఠాత్తుగా ఆండ్రూ రాకుమారుడు జ్ఞాపకం వచ్చాడు. ఆమె ముఖం సిగ్గుతో ఎర్రబారింది. ఆమె వెంటనే ఆ గదిలో నుంచి పరుగెత్తుకుని వెళ్ళిపోయింది. "అయ్యో, భగవంతుడా! ఎంత పని చేశాను! అతని కంత చనువు ఎలా ఇవ్వగలిగాను? ఇదేమి విపరీతం ? ఇంత దిగజారిపోయా నేమిటి?" అనుకున్నది. కాలుతున్న చెక్కిలి చేతిలో దాచుకుని అలాగే ఆలోచిస్తూ చాలాసేపు కూచున్నది. తన మనస్సును కుదుట పరచుకోలేక పోయింది. తన మనస్సులో ఏం జరుగుతున్నదో ఆమె అర్థం చేసుకోలేకుండా ఉంది. తన కలవరం తనకే అర్థం కాకుండా ఉంది. తన చుట్టూ అంతా చీకటిగాను,నీడలు నీడలుగాను కనిపిస్తూ ఉంది. అంతా భయావహంగా ఉంది. దీపాల వెలుతురులో వెలిగిపోతున్న ఆ పెద్ద నాటకశాలలో డుఫర్ట్ చిన్న జాకెట్టు వేసుకుని తడిసివున్న చెక్కలపై నృత్యం చేయడం, యువతులు, వృద్ధులు అర్ధనగ్నంగా కనిపిస్తూ చిరునవ్వు నవ్వుతున్న హెలెన్; ఇవన్నీ ఆమెకు స్పష్టంగా జ్ఞాపకం ఉన్నాయి. అప్పుడవి సహజంగాను,స్పష్టంగాను కనిపించాయి. కాని ఇప్పుడుమాత్రం అవన్నీ అస్పష్టంగాను, కలగా పులగంగాను, మాసిపోయినట్లుగాను కనిపిస్తున్నాయి.

"ఏమిటిదంతా? నా మనస్సును కలతపెడుతున్న దేమిటి? అతన్ని చూచి నేనెందు కలా భయపడ్డాను? ఇప్పుడెందుకు నేనిలా కలవరపడుతున్నాను?" అనుకో సాగింది. ఆమె ఎప్పుడూ తన మనస్సులో విషయాలు తన తల్లికి తప్ప మరెవరికీ చెప్పదు. కాని ఇప్పుడా తల్లి దాపులోలేదు. సోనియాకు చెప్పి లాభంలేదు. ఆమె దృష్టి ఆమెదే. ఆమెకు చెప్పినా అర్థం చేసుకోలేకపోవచ్చు. లేక బెదిరిపోవచ్చు. అందుచేత నటాషా తన హృదయాన్ని బాధిస్తోన్న ప్రశ్నలకు తనే సమాధానాలు చెప్పుకోడానికి ప్రయత్నించ సాగింది.

"ఆంద్రూ రాకుమారుని ప్రేమకు నేను అర్హత లేకుండా చేసుకున్నానా?" అని తన్ను తాను ప్రశ్నించుకున్నది. ఈ ప్రశ్న ఆమెకే ఆశ్చర్యం కలిగించింది. తరువాత తన వెర్రికి తానే నవ్వుకుని "ఎంత వెర్రిదాన్ని! అయినా ఏమిటీ పిచ్చి ప్రశ్న? అయినా ఏం జరిగింది? నా తప్పేముంది? నేనేమీ చేయలేదు ఇక ఎవరికీ ఈ విషయం తెలీదు. ఇక మళ్ళీ మే మిరువురము కలుసుకోము" అని తన్ను తాను తాను సమాధాన పెట్టుకుని "ఏం జరిగింది? అయినా నన్ను నేను ఎందుకు నిందించుకోవాలి? ఆంద్రూ ఎప్పటిలాగానే ఇప్పటికి నన్ను ప్రేమిస్తాడు. ఇప్పటికి ఏమిటి? ఏమిటీ వెర్రి? ఇప్పుడు నేను ఏం చేశాను?అయ్యో భగవంతుడా! అతనింకా రాలేదేం" అని నటాషా తన్ను తాను ఓదార్చుకో సాగింది. కాని ఆమెలో తెలీకుండానే ఏదో ఆమె అనుకున్నదంతా అసత్యమని తన ప్రియునిపట్ల ఆమెకు గల తొలినాటి స్వచ్ఛమైన ప్రేమ తొలగిపోయిందని ఆమెకు తెలియ చెప్పింది. తరువాత ఆమెకు మళ్ళీ కారగైన్‌తో మాట్లాడిన మాటలన్నీ జ్ఞాపకం వచ్చాయి. అతని కదలికలు,ఆమె చేతిని అతను స్పృశించడం; అన్నీ ఆమె మనస్సులో తలెత్తాయి.

# 50

ఆనెటోవ్ కారగైన్ సంవత్సరానికి ఇరవై వేలరూబుళ్ళు ఖర్చు చేస్తున్నందు వల్ల అతని తండ్రి అతన్ని పీటర్స్‌బర్గు నుంచి పంపించివేశాడు. ఇంత ఖర్చు చేయడమేకాక పైగా బోలెడు అప్పులు కూడా చేశాడు. అతని అప్పుల వాళ్ళు అతని తండ్రిని రోజూ పీడిస్తూ ఉన్నారు. అందుచేత అతని తండ్రి బేసిల్ రాకుమారుడు అతని అప్పుల్లో సగం తీరుస్తాననీ, ఇలా తీర్చడం ఇదే ఆఖరుసారనీ చెప్పాడు. ఇక ఆనెటోవ్ అక్కడ ఉండడానికి వీల్లేదనీ మాస్కో వెళ్ళితీరాలని కూడా చెప్పాడు. అక్కడ అతని కోసం ఒక సహాయ సేనాధిపతి పదవి కూడాసంపాయించిపెట్టాడు. అక్కడొక మంచి సంబంధం చూచుకొని పెళ్ళి చేసుకోవాలని కూడా చెప్పాడు. మేరియాను కావచ్చు లేక జూలియాను కావచ్చు. ఆనెటోవ్ తండ్రి చెప్పిన ఈ మాటలకు ఒప్పుకుని మాస్కో వెళ్ళి మొదట తన బావగారైన పీటర్ ఇంట్లో బసచేశాడు.

మొదట్లో అతని రాక పీటర్‌కు అంత ఇష్టంగా కనిపించలేదు. కాని క్రమక్రమంగా అతను అక్కడ ఉండడానికి అలవాటు పడిపోయాడు. పీటర్, అతనితో ఒక్కోసారి కులాసాగా గడిపేవాడు. ఒక్కోసారి అతనికి డబ్బు కూడా ఇచ్చేవాడు.

అనెటోవ్ అక్కడి స్త్రీ లందరి మనస్సులు ఆకట్టుకున్నాడని షిన్‌షైన్ చెప్పినమాట నిజమే. స్త్రీలపట్ల అతను ఎంతో నిర్లక్ష్యంగా ఉండడం వల్లను, లంబాడీ పిల్లలపట్ల, నటీమణుల పట్ల ప్రత్యేక అభిమానం చూపడంవల్లను ఇలా చేయగలిగాడు. ముఖ్యంగా మదాం జార్జిపట్ల ఎక్కువ అభిమానం చూపేవాడు. ఆమెకూ అతనికీ ఎంతో ప్రత్యేకమైన పరిచయ ముందని అందరూ అనుకునేవారు. అతను వెళ్ళని విందంటూ లేదు. డేనిలోవ్ ఇంట్లో కాని మరెవరింట్లో కాని మాస్కోలో ఏ విందు జరిగినా అతను వెళ్ళి తీరాల్సిందే. తప్ప తాగి రాత్రిళ్ళంతా గడిపి ఇతరులను మించిపోయేవాడు. ఒక్క సమావేశానికి కాని, ఒక్క పార్టీకి కాని, ఒక్క బాల్ నృత్యానికి కాని వెళ్ళకుండా ఉండేవాడు కాదు. అక్కడికి వచ్చే నాగరికులు,వివాహితులు అయిన స్త్రీలతో కొద్దిగానో గొప్పగానో ప్రణయకలాపం కూడా సాగించేవాడు. కాని అవివాహితలైన స్త్రీల ముందు సిగ్గుపడుతూ వారిలో ఎవరినీ కూడా తనకు భార్యగా చేసుకోవాలనే విషయం ఎన్నడూ ఆలోచించేవాడు కాదు దీనికి ఒక కారణం ఉంది. ఆ కారణం కొద్దిమంది స్నేహితులకు మాత్రమే తెలుసు. అతనికి పూర్వమే వివాహమైంది-రెండు సంవత్సరాల క్రితం అతను పోలెండులో ఉన్నప్పుడు ఒక పోలిష్ భూస్వామి అతన్ని బలవంతం చేసి తన కుమార్తె నిచ్చి వివాహం చేశాడు.

కాని అతను కొద్ది కాలంలోనే ఆ భార్యను వదిలిపెట్టాడు. తన మామగారికి కొద్ది డబ్బు పంపిస్తాననీ, అందుకు ప్రతిఫలంగా తను అవివాహితుడుగానే చెలామణీ అయ్యేటట్లు చేయమనీ, ఆయన్ను కోరుకున్నాడు.అందుకు అతని మామగారు ఒప్పుకున్నాడు కూడా. అతనికి అసంతృప్తి అనేది లేదు. అతన్ని పూర్తిగా సంతృప్తుడు అనవచ్చు. తనతోను, ఇతర్లతోను, ప్రపంచంతోను అతను పూర్తిగా సంతృప్తి చెందినవాడు. అతను జీవిస్తున్న ఈ పద్ధతిలో ఎలాంటి లోపమూ లేదని అతని గట్టి నమ్మకం. తను జీవితంలో ఎప్పుడూ ఏ తప్పు చేయనివాణ్ణని అతని ఉద్దేశం. ఇతర్లు తన పనులను గురించి ఏమైనా అనుకుంటారని కాని, వాటివల్ల ఫలానా విధమైన ఫలితాలు వస్తాయని కాని అత నెన్నడూ ఊహించడు కూడా. బాతును నీళ్ళల్లో నివసించడానికి సృష్టించినట్లే సంవత్సరానికి ముప్ఫయివేల రూబుళ్ళు ఖర్చుచేయడానికి, ఎప్పుడూ అందరినీ మించి ఉండడానికి తన్ను భగవంతుడు సృష్టించాడని అతని నమ్మకం. ఈ ఉద్దేశం అతని మనస్సులో గట్టిగా నాటుకునిపోయింది. అతనితో పరిచయం కలిగిన వారికి కూడా అలాటి ఉద్దేశమే కలు

గుతూ ఉండేది. అందరూ అతనికి అందుకు అవకాశం ఇచ్చేవారు. డబ్బు అప్పిచ్చే వారు. అది ఎంతో సహజమైన పని అయినట్లుగా ముందు వెనుక ఆలోచన లేకుండా అతను ఆ డబ్బు తీసుకునేవాడు. కాని ఎన్నడూ తిరిగి ఇచ్చే విషయమే ఆలోచించే వాడు కాదు.

అతను జూదగాడని చెప్పడానికికూడా వీల్లేదు. పేకాటలో డబ్బు సంపాదించాలని తాపత్రయ పడేవాడు కాదు. అతనికి ఆత్మాతిశయం ఉందా అంటే అదీలేదు. ఇతర్లు తనను గురించి ఏమనుకున్నా లెక్కచేసేవాడుకాదు. పోనీ ఉద్యోగ రీత్యా పైకి పోదామని పెద్ద ఉద్దేశాలు కూడా లేవు. తన వైరితనంవల్ల అనేకసార్లు తన అవకాశాలు పోగొట్టుకున్నాడు కూడా. పెద్దరికాలను, గౌరవాలను ఎప్పుడూ వెక్కిరిస్తూ ఉండేవాడు. అదీకాక అతనికి డబ్బుమీద కూడా అత్యాశలేదు ఎవరు ఎప్పుడు డబ్బు అడిగినా ఇచ్చేసేవాడు. ఎప్పుడు ఏ స్నేహితుడు ఎలాటి సహాయం అడిగినా కాదనకుండా చేసేవాడు. అతనికి కావలసిందల్లా స్త్రీలు, సుఖము; అంతే. ఈ అభిరుచుల్లో తప్పేమిటో అతనికి తోచలేదు. ఈ అభిరుచులవల్ల వచ్చే చెడు ఏమిటో కూడా అతనికి తోచలేదు. కొద్దిలో చెప్పాలంటే తనంత మంచివాడు లేడనే అతని ఉద్దేశం. నీచులపట్ల అతనికి చెప్పరానంత అసహ్యం ఉండేది. అందుచేత ఏ మాత్రం సంకోచం లేకుండా లెక్కలేనట్లు హాయిగా తలెత్తుకుని తిరుగుతూ ఉండేవాడు.

ఆ సంవత్సరంలో డొలొహోవ్ మళ్ళీ మాస్కోకు తిరిగి వచ్చాడు. ఎంతో విలాస జీవితం గడుపుతున్నాడు. అన్ని విధాల కులాసాగా కాలక్షేపం చేస్తున్నాడు. మళ్ళీ అతనికీ, కారగైన్‌కూ స్నేహం కుదిరింది. తన లాభాలకోసం ఆనెటోవ్‌ను ఉపయోగించుకుంటున్నాడు. అతని ధైర్యం మీద తెలివితేటలమీద ఆనెటోవ్‌కు ఎంతో నమ్మకం. అందుచేత అతను డొలొహోవ్‌తో స్నేహం చేస్తున్నాడు. కాని డొలొహోవ్ మాత్రం అలాకాదు. పెద్ద శ్రీమంతులైనవారితో తనకు పరిచయం కలగడం కోసం ఆనెటోవ్‌ను ఒక పాచికగా వినియోగించుకుంటున్నాడు. కాని ఆ విషయం అతనికి తెలియనివ్వడంలేదు. ఇది ఇలా ఉండగా ఒక మనిషిని తన అధీనంలో ఉంచుకోవడమే అతనికొక విధమైన ఆనందము, అలవాటు అవసరము కూడా.

నటాషా, ఆనెటోవ్ మనస్సులో చెరిగిపోని ముద్ర విడిచిపెట్టింది. నాటకం అయిపోగానే భోజనం దగ్గర కూచుని ఒక పెద్ద సౌందర్య పిపాసిలాగా, ఆవిడ చేతులను గురించి, భుజాలను గురించి, కాళ్ళను గురించి, జుట్టును గురించి డొలొహోవ్‌కు ఒక్కొక్క అంశమే వివరించి చెప్పసాగాడు. ఇకముందు ఆమెతో తను ప్రణయ కలాపాలు సాగించాలని అనుకుంటున్నానని కూడా చెప్పాడు. దానివల్ల కలిగే ఫలితమేమిటో అతను ఆలోచించనే లేదు. అసలు అలాంటి విషయాలు అతనెప్పుడూ ఆలోచించడు.

"ఆమె అందకత్తే నబ్బాయ్. కాని మనకు దక్కదు" అన్నాడు డొలొహోవ్.

"మా అక్కయ్యకు ఆమె నొకమాటు విందుకు ఆహ్వానించమని చెపుతాను. ఏమంటావ్?" అన్నాడు అనెటోవ్.

"ఆమెకు పెళ్ళయ్యే వరకూ ఆగు."

"చిన్నపిల్లలంటే నాకెంతో ఇష్టం! వారి మనస్సును ఇట్టే తిప్పేసేయ్యొచ్చు."

"జాగ్రత్తగా ఉండు! ఇదివరకొక చిన్నపిల్ల చేతిలో చిక్కిపోయావు."

"అందుకనే ఈమాటు చిక్కను" అన్నాడు అనెటోవ్ నవ్వుతూ.

# 51

రోస్టోవ్‌లు ఆ మరుసటిరోజు ఇంట్లోనే ఉన్నారు. వారెవరినీ చూడడానికి వెళ్ళలేదు. మేరియా డిమిట్రోవ్నా, కౌంట్ చాలాసేపు మాట్లాడుకుంటూ కూచున్నారు. వృద్ధ రాకుమారునికి ఏ విధంగా జవాబు చెప్పాలా అని ఆలోచించుకుంటున్నారు. నటాషా వారు ఆలోచించుకుంటున్న విషయాన్ని ఊహించగలిగింది. ఆ విషయం ఆమె మనస్సుకు ఎంతో నొప్పి కలుగచేస్తూ ఉంది. ఆమె ప్రతిక్షణం ఆంద్రూ రాకుమారుని రాక కోసం ఎదురుచూస్తూ ఉంది. ఆ రోజు రెండుసార్లు కబురుపంపింది కూడా. కాని లాభం? అతను వస్తాడో రాడో తెలీదు. వస్తే ఎప్పుడు వస్తాడో తెలీదు. అంచాత ఆమె నిరాశ మరింత ఎక్కువవుతూ ఉంది. మేరియా రాకుమారి మాట్లాడిన తీరు, వృద్ధ రాకుమారుని వైఖరి ఆమె కలవరాన్ని మరింత ఎక్కువ చేశాయి. అందుచేత ఆమె అసహనం కూడా నానాటికీ హెచ్చుతోంది. ఆంద్రూ ఎప్పుడు వస్తాడో తెలీదు. ఒక్కోసారి రాడేమో అనుకుంటోంది. ఏదైనా ప్రమాదం జరిగిందేమో అని కూడా అనుకుంటోంది: ఇలా వస్తాడో రాడో అని ఆమె పూర్వం లాగా పగటికలలు కూడా కనడం లేదు. ఆమె ఒకవేళ పగటికలలు కందామనుకున్నా గత కొద్ది రోజుల్లో జరిగిన విషయాలు ఆమె మనస్సులో దోబూచులాడుతున్నాయి. తను చేసింది తప్పవునా కాదా అని ఆమె తన్నుతాను ప్రశ్నించుకోవడం ఇది రెండవసారి. తను ఎంత కాదనుకుంటున్నా ఆ సాయంకాలం నాటకశాలలో జరిగిన విషయాలు జ్ఞాపకం వస్తున్నాయి. తను కలుసుకున్న ఆ వ్యక్తి ఆమె మనస్సులో చెరిగిపోని ముద్రవిడిచి పెట్టి వెళ్ళాడు. అందుచేత ఆమె లోలోపల పడుతోన్న కలవరం ఇంతా అంతా అని చెప్పడానికి వీల్లేకుండా ఉంది. పైకి హాయిగా కనుపిస్తున్నప్పటికీ ఆమె హృదయంలో ఆనందం కాని శాంతికాని లవలేశం కూడా లేదు.

ఆదివారంనాడు ఉదయం మేరియా డిమిట్రోవ్‌నా, పిల్లలంతా కలసి చిన్న చర్చికి వెళ్ళాలని చెప్పింది. "నాకు ఫ్యాషన్ కోసం చర్చికి వెళ్ళడమంటే ఇష్టంలేదు. ఎక్కడైనా ఉన్న భగవంతుడు ఒక్కడే. మా మతగురువు చాలా మంచివాడు. అక్కడ ప్రార్థన కూడా చాలా బాగా సాగుతుంది. చర్చిలోని స్వరమేళలు ఆలయం లోని నిర్మలత్వానికి భంగం కలిగిస్తాయని నా ఉద్దేశం" అన్నది డిమిట్రోవ్‌నా.

మేరియా డిమిట్రోవ్‌నా ఆదివారాన్ని ఒకపెద్ద పండగ క్రింద చూస్తుంది. శనివారంనాడే ఇల్లంతా కడిగి, అలికి శుభ్రంచేస్తారు. ఆమెకాని ఆమె సేవకులుగాని ఆ రోజు ఏపనీ ముట్టుకోరు. అందరూ కలసి చక్కగా ముస్తాబై ప్రార్థనలు సలుపుతారు. భోజన సందర్భంలో ఒక కొత్త ఆధరువు కూడా తయారుచేస్తారు. సేవకులకు బ్రాందీ కూడా ఇప్పిస్తారు. బాతునుకాని లేక ఈనిన పందినికాని వండుతారు. కాని ఆనాటి ప్రభావమంతా ఆ ఇంటి యజమానురాలి ముఖంలో కనిపించినట్టుగా మరెవరి ముఖంలోను కనిపించదు.

చర్చినుంచి తిరిగి వచ్చిన తరువాత వారంతా డ్రాయింగ్ రూంలో కూర్చుని కాఫీలు తాగుతున్నారు. కుర్చీలకు పై తొడుగులు తీసేసి ఉన్నాయి. వెంటనే ఒక బండి వచ్చి తలుపు దగ్గర ఆగింది. తనకున్న శాలువా లన్నిటిలోకీ ఎంతో చక్కగా ఉన్న ఒక శాలువాను కప్పుకుని మేరియా డిమిట్రోవ్‌నా చక్కగా ముస్తాబై, నటాషా పట్ల ఆ విధంగా ప్రవర్తించినందుకు బోల్‌కోన్‌స్కీ రాకుమారుణ్ణి వెళ్ళి అడుగబోతున్నానని చెప్పింది.

కొద్ది నిముషాల తరువాత మదాం ఆవర్ట్‌భామ్, నటాషాకు తను తయారుచేసిన దుస్తులు సరిచూడటానికి తీసుకుని వచ్చింది. ఈ విధంగా నైనా మనస్సుకు కొంత హాయి చిక్కుతుంంది కదా అని నటాషా ఆమెతో కలిసి తన గదిలోకి వెళ్ళింది. కొత్త దుస్తులు సరిచూచుకోసాగింది. నిలువుటద్దం ముందు నిలుచుని గౌను వెనకాల భాగం ఎలాఉందో చూచుకోవటం కోసం వెనక్కుతిరిగి చూసిందో లేదో, ఆమెకు తన తండ్రి కంఠస్వరం మరో స్త్రీ కంఠస్వరం వినిపించాయి. ఆ కంఠస్వరం హెలెన్‌దని ఆమె వెంటనే గుర్తించింది. ఆమె ముఖం సిగ్గుతో ఎర్రబారింది. ఆమె మళ్ళీ తన దుస్తులు వేసుకుంటూ ఉండగానే తలుపు తెరుచుకొని కౌంటెస్ బెఝోవ్ చిరునవ్వు నవ్వుతూ లోపలికి వచ్చింది. ఆమె ఒక చక్కని సిల్కుగౌను వేసుకుని ఉంది.

"ఏం సుందరీ! ఏం చేస్తున్నావు?" అని ఆమె నటాషాను అడిగింది. "నేనెందుకొచ్చానో తెలుసా? నీవు ఇల్లుదాటి ఎక్కడికీ వెళ్ళకుండా ఇక్కడే క్రమ్మగ్గిపోవడం మంచిది కాదని మీ నాన్నగారితో చెప్పడానికి వచ్చాను. ఈ ఊళ్ళో

ఉంటూ ఇక్కడ ఎలా ఉండగలుగు తున్నారో మరి? ఈ సాయంత్రం మీరు తప్పక మా ఇంటికి రావాలి. మా ఇంట్లో ఒక చిన్న టీపార్టీ ఉంది. మదాంజార్జి కచేరీ చేస్తోంది కూడా" అంటూ హెలెన్ అప్పుడే అక్కడికి వచ్చిన కౌంట్‌తో "మీరు మీ పిల్లను ఇవాళ మా యింటికి తీసుకొని రాకపోతే నే నూరుకోను. మీతో పోట్లాడవలసి వస్తుంది. తప్పక వస్తారు కదూ? రాత్రి తొమ్మిది గంటలకు. నా భర్త వూళ్ళో లేరు. లేకపోతే ఆయన్నే పంపించి ఉండేదాన్ని. తప్పక వస్తారు కదూ?" అన్నది. తరువాత తన కింతకుముందే పరిచయ మున్న ఆ టైలర్‌ను చూచి గుర్తించినట్లుగా తల ఊపింది. అద్దం దగ్గర ఉన్న పడక కుర్చీలో కూచుని తన గౌను ముచ్చటగా సర్దుబాటు చేసుకుంటూ, నటాషా అందాన్ని గురించి, ఆమె కొత్తగా కుటించుకున్న దుస్తులను గురించి ఎన్నెన్నో కబుర్లు ఎంతో కులాసాగా చెప్పసాగింది. తను ఇటీవలే కొన్ని రకాల కొత్త దుస్తులు కుట్టించుకున్నాననీ, నటాషా కూడా అలాంటి దుస్తులు కుట్టించుకుంటే ఎంతో బాగుంటుందనీ అన్నది. "ఆ దుస్తులు వేసుకుంటే దీపాల వెలుతురు కప్పుకున్నట్టుగా ఉంటుందమ్మాయ్. నీవు కూడా అలాంటి గౌను ఒకటి కుట్టించుకో. అయితే మటుకు ఏం? నీవు ఏ దుస్తుల్లో అయినా బాగానే ఉంటావు" అన్నది హెలెన్.

ఈ మాటలు విని నటాషా ఆనందంతో పొంగిపోయింది. ఆమె ముఖంమీద ఒక్క నిముషం కూడా చిరునవ్వు తొలగిపోలేదు. తనతో చనువుగా మాట్లాడుతున్న ఈ కౌంటెస్ పొగడ్తలు ఆమె ఆనందాన్ని ఇంకా వికసింపచేశాయి. తనకు పూర్వం ఎంతో దూరంగా కనిపిస్తూ వచ్చిన కౌంటెస్ ఇప్పుడు తనతో ఇంత చనువుగా ఉండడం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది. నటాషా పూర్తిగా ఆమెకు వశురాలై పోయింది. ఆమెపట్ల ఎంతో ఆకర్షణ కూడా కలిగింది. కాని హెలెన్ మాత్రం నిజంగానే నటాషా అందాన్ని పొగుడుతూ ఉంది. ఆమెలో మరెలాటి ఉద్దేశ్యమూ లేదు. అయినప్పటికీ అనెటోవ్ తనకు ఆ అమ్మాయితో పరిచయం కలిగించమని అక్కసు కోరాడు. అంచాత హెలెన్ ఆ అమ్మాయిని తీసుకెళ్ళే ఉద్దేశంతోనే ఇక్కడికి వచ్చింది. ఒకప్పుడు నటాషాను బోరిస్‌పట్ల గల ఆకర్షణను చూచి ఆమె అసూయపడింది. కాని ఇప్పుడు మాత్రం అదంతా మరిచిపోయింది. తన కొత్త స్నేహితురాలిని నిజంగా తన ఇంటికి తీసుకుని వెడదామనే ఇప్పుడు వచ్చింది.

ఆమె వెళ్ళిపోతూ నటాషాను ఒక ప్రక్కకు పిలిచి "నిన్న మా తమ్ముడు మా ఇంటికి భోజనానికి వచ్చాడు. అతన్ని చూచి నవ్వలేక మా కడుపులు చెక్కలై పోయినాయి. అతనొక ముద్దకూడా ముట్టలేదు. ఊరిక నిశ్వసిస్తూ కూచున్నాడు. అతను నీవంటే పడి చచ్చిపోతున్నాడు" అని చెప్పింది.

నటాషా సిగ్గుతో ఎఱ్ఱబారి పోయింది.

"ఎంత సిగ్గు! ఎంత సిగ్గు! ఏమిటమ్మా ఈ సిగ్గు? తప్పకుండా వస్తావు కదూ? ఎవరినైనా ప్రేమిస్తుంటే మాత్రం ఇలా తలుపులు మూసుకుని కూచుంటారా? నీ కిదివరకే ఒకరితో వివాహం నిశ్చయమై ఉన్నప్పటికీ నీవు అలా వెళ్ళి గాలికి తిరిగివస్తే నీ భర్త ఏమీ అనుకోడు" అన్నది హెలెన్ మళ్ళీ.

"అయితే నాకు వివాహం నిశ్చయమైన సంగతి ఈమెకు తెలుసునన్న మాట! అయితే ఈ విషయం వారిలో వారు చెప్పకుని నవ్వుకుని ఉంటారు. కనుక ఇక వచ్చిన ప్రమాదమేమీ లేదు" అనుకున్నది నటాషా తనలో.

హెలెన్ ప్రభావంలో పడిన నటాషాకు పూర్వం భయావహంగా కనిపించిన దంతా ఇప్పుడెంతో సహజంగా కనిపించసాగింది."ఆమె నిజంగా ఎంతో గొప్ప స్త్రీ, దయామయురాలు. నే నంటే ఎంతో ఇష్టం. నే నామెతో వెళ్ళి కాసేపు ఎందు కానందించకూడదూ?" అనుకుని ఆమె వంక విప్పారిన కళ్ళతో ఆశ్చర్యంగా చూచింది.

మేరియా డిమిట్రోవ్నా భోజనానికి తిరిగి వచ్చింది. ఆమె ఏమీ మాట్లాడ లేదు. పరధ్యానంగా ఉంది. బోల్కోన్స్కీ రాకుమారుడు ఆమెను ఓడించాడని స్పష్టమవుతోంది. అప్పుడా సంగతులేమీ మాట్లాడలేక అన్ని విషయాలూ రేపు చెపుతానని కౌంట్‌తో చెప్పింది. తరువాత కౌంటెస్ హెలెన్, నటాషాను ఆహ్వా నించిందన్న విషయం తెలిసి, ఆమె తన ఇంటికి రావడం తన కేమాత్రం ఇష్టం లేదని, ఆమెతో పరిచయం ఏ మాత్రం మంచిది కాదని అన్నది. అయినప్పటికీ కాసేపు కాలక్షేపానికి వెళ్ళి రండని నటాషాతో చెప్పింది.

# 52

ఆ సాయంత్రం కౌంట్ ఇల్యా ఆండ్రొవిచ్ రోస్టోవ్ తన ఇద్దరు పిల్లలనూ తీసుకుని బెషొవ్ల ఇంటికి వెళ్ళాడు. అక్కడ సమావేశమై ఉన్న పార్టీ పెద్దది. వారిలో ఎవరూ రోస్టోవ్‌లకు తెలీదు. వారిలో ఎవరినీ నటాషా ఇంతవరకు చూచి ఉండలేదు. వారిని చూడగానే కౌంట్ రోస్టోవ్‌కు ఒకవిధమైన అసంతృప్తి కలిగింది. అక్కడ చేరినవారందరూ— పురుషులు, స్త్రీలు అంతా కులాసాగాను, హాయిగాను అట్టే పట్టింపులు లేని వారల్లే ఉన్నారు. యువకుల్లో చాలామంది ఫ్రెంచివారు కూడా ఉన్నారు. మెటవీయర్ కూడా అక్కడే ఉన్నాడు. అతను మాస్కో వచ్చినప్పటి నుంచీ వీరింటికి తరుచుగా వస్తున్నాడు. అందరూ మదాం జార్జిచుట్టూ పోగయి ఉన్నారు. అందుచేత కౌంట్ పేకాటకు కూడా కూచోదలుచుకోలేదు. తన పిల్లలను

కూడా వదిలిపెట్ట దలుచుకోలేదు. ప్రెంచినటి పాటలు పాడడం ముగించగానే వారిని ఇంటికి తీసుకెడదామను కున్నాడు.

ఆనెటోవ్ వారికోసం కాచుకుని వాకిటిదగ్గరే నిలుని ఉన్నాడు. వారు రాగానే ముందుకువెళ్ళి కలుసుకుని, నటాషా దగ్గరికివెళ్ళి ఆమెను లోనికి తీసుకుని వచ్చాడు. అతన్ని చూడగానే ఆమెకు థియేటర్‌లో కలిగినట్లుగానే ఆనందము, తనతో అతను చనువు తీసుకుంటున్నాడనే కలవరము కూడా కలిగాయి.

హెలెన్, నటాషాను ఎంతో చనువుగాను ఆప్యాయంగాను, ఆహ్వానించింది. ఆవిడ అందాన్ని గురించి, చక్కని ముస్తాబును గురించి అందరూ వినేటట్టుగా చెప్ప సాగింది. వారు రాగానే మదాం జార్జి ముస్తాబు మార్చుకోవడానికి లోపలికి వెళ్ళింది. అందరికీ వరుసగా కుర్చీలు వేశారు. ఎవరి కుర్చీలో వారు కూచున్నారు. ఆనెటోవ్ నటాషా కోసం ఒక కుర్చీ ముందుకు లాగి తను ఆమె ప్రక్కనే కూచోబోయాడు. కాని కుమార్తెను కనిపెడుతోన్న కౌంట్, ఆ కుర్చీలో తనే కూచున్నాడు. అందు చేత ఆనెటోవ్ ఆమె వెనకాల కుర్చీలో కూచోవలసి వచ్చింది.

మదాం జార్జి త్వరలోనే ముస్తాబు మార్చుకుని వచ్చింది. ఒక భుజం మీద మాత్రమే శాలువా కప్పుకుని నగ్నంగా ఉన్న చక్కని భుజాలు చూపిస్తూ వచ్చి నిలుచుంది. అందరూ చూచేటట్లుగా ఆమెకోసం వదిలి పెట్టిన స్థలంలో ఒక విచిత్ర మైన భంగిమలో నిలుచున్నది. ఆమె అలా నిలుచోగానే అందరూ ఉత్సాహంతో గుసగుస లాడసాగారు. ఒక మాటు అందరివంక నాటకంలోలా చూచినట్లుగా చూచి, తన సవతి కుమారుని పట్ల తన ప్రేమని వెలిబుచ్చే ఒక స్వగతాన్ని అభినయించ సాగింది. ఒక్కోమాటు కంఠస్వరాన్ని హెచ్చిస్తూ మరోమాటు తగ్గిస్తూ తలఎత్తుతూ కళ్ళు తిప్పుతూ ఒక్కోమాటు మధ్యలో ఆగిపోతూ అభినయించ సాగింది.

"అద్భుతం! అద్భుతం!" అంటూ అందరూ ప్రశంస లంద చేశారు.

నటాషా ఆవిడ వంక తదేకంగా చూస్తున్నదే కాని ఆమెకేమీ అర్థం కావడం లేదు. తన కళ్ళముందు ఏం జరుగుతున్నదో కూడా ఆమెకు తెలీడంలేదు. ఆమె మనస్సులో ఇప్పుడొక్కటే ఆలోచన ఉన్నది. హఠాత్తుగా మళ్ళీ తన కర్థంకాని ఈ వెర్రిలోకంలో అడుగు పెట్టానని అనుకుంటోంది. తనకు పూర్వం తెలిసిన ప్రపం చానికి, ఈ ప్రపంచానికి ఏమీ సంబంధంలేదు. ఇదేదో ఒక ఊహాలోకంలాగా ఉంది. ఈ ప్రపంచంలో ఇది మంచి అనీ ఇది చెడ్డ అనీ, ఇది సహకారణమైందనీ ఇది అకారణ మైందనీ తేడా చెప్పడానికి వీల్లేదు. అన్నీ చెదిరి కలగా పులగంగా కలిసి పోయినాయి. ఆమె ఉలికిపడుతూ ఉద్వేగంతో కూచుని ఉంది. ఆమె నరాలు దేని కోసమో ఎదురు చూస్తున్నట్లుగా కంపించిపోతున్నాయి. స్వగతం పూర్తికాగానే అందరూ లేచి నటీమణి దగ్గరికి వెళ్ళారు.

"ఎంత చక్కగా ఉంది!" అన్నది నటాషా తన తండ్రితో.

అందరూ తోవ చేసుకుని ఆమె దగ్గరికి వెడుతూ ఉన్నారు. "నేను నిన్ను చూచినప్పుడు అలా అనుకోను" అన్నాడు ఆనెటోవ్, నటాషా చెవిలో—ఆమె ఒక్కతే వినేటట్లుగా. "నీ వంటి అందకత్తె మరెవరూ లేరు. నిన్ను మొట్ట మొదటి సారి చూచినప్పటి నుంచీ...." అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

అంతలో కౌంట్ తిరిగి చూచి "రా నటాషా" అన్నాడు. ఆమె తన తండ్రి వెనకాలే విప్పారిన కళ్ళతో వెళ్ళింది.

మదాం జార్జి ఒకమాటు అందరి వంక చూచి మరెన్నో పద్యాలు చదవ సాగింది. తరువాత కౌంటెస్ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళింది. తరువాత అందరూ కలిసి పెద్ద బాల్ రూంలోకి వెళ్ళారు. కౌంట్ కూడా ఇంటికి వెడదామనుకున్నాడు. కాని హెలెన్ అతన్ని వెళ్ళనిచ్చింది కాదు. ఆ ఇద్దరు పిల్లలను ఇంటికి తీసుకెడితే నృత్యానికి లోటు వస్తుందని అన్నది. కౌంట్ ఒప్పుకోక తప్పింది కాదు. ఆనెటోవ్ నటాషాను తనతో నృత్యం చేయమని కోరాడు. నృత్యం చేస్తున్నంతసేపూ ఆమె నడుమును, చేతిని గట్టిగా పట్టుకుని ఆవిడ ఎంత అందకత్తెయో, తనామెను ఎంతగా ప్రేమిస్తున్నాడో చెప్పసాగాడు. ఆమె కారగైన్‌తో మరోసారి నృత్యం చేస్తున్నంత సేపూ అతను ఆమెతో మాట్లాడలేదు. మౌనంగా ఆమె వంక అలాగే చూస్తున్నాడు. వాల్ట్జ్ నృత్యం జరుగుతున్నంతసేపూ అతను తన్ను ప్రేమిస్తున్నాడని ఆమె ఊహించసాగింది. మొదటి చుట్టు పూర్తి కాగానే అతని చెయ్యి తన చేతిని గట్టిగా అదమడం ఆమె గ్రహించింది. కాని అతని కళ్ళలోని విశ్వాసాన్ని ఆర్ద్రతను చూచి చెప్పదలుచుకున్న మాట చెప్పలేక పోయింది. తరువాత మెల్లగా "నాతో అలాంటి మాటలు మాట్లాడకు. నాకు మరొకరితో వివాహం నిశ్చయమైంది. నేను మరొకరిని ప్రేమిస్తున్నాను" అన్నది. ఇలా అని అతని వంక చూచింది.

"నాతో అలా మాట్లాడకు. నాకు తెలిసిందల్లా నేను నిన్ను ప్రేమిస్తున్న విషయం మాత్రమే. నిన్ను చూచిన తరువాత నా మతి మతిలో లేదు. నేను వెర్రెత్తి పోయానంటే నమ్ము. నీవు అందంగాను, ఆకర్షణీయంగాను ఉన్నావంటే అది నా తప్పా? ఇక మనం మొదలు పెట్టాలి" అన్నాడు ఆనెటోవ్.

నటాషా ఒకమాటు కలవరంతోను భయంతోను విప్పారిన కళ్ళతో తనచుట్టూ కలయచూచింది. ఆవిడలో మొదటిలోకంటె ఇప్పుడు కొంత మార్పు కనిపిస్తోంది. కెలడోనియన్‌ల నృత్యం తరువాత 'గ్రోస్ వాటర్' అనే నృత్యం చేశారు. ఆ తరువాత తన తండ్రి ఇంటికి వెడదామన్నాడు. కాని మరి కొంతసేపు ఉందామని ఆమె తన తండ్రిని కోరింది. ఆవిడ ఎటు చూచినా ఆనెటోవ్ చూపులు ఆవిడను తాకుతూనే ఉన్నాయి. ఆవిడ ముస్తాబు సద్దుబాటు చేసుకొనడం కోసం, స్త్రీలు తమ

దుస్తులు వదిలే గదిలోకి వెళ్ళింది. హెలెన్ కూడా నవ్వుతూ ఆమె వెంటనే లోపలికి వచ్చి తన తమ్ముడి ప్రేమను గురించి మాట్లాడసాగింది. తరువాత ఇద్దరూ కలిసి ఆ ప్రక్క గదిలోకి వెళ్ళారు. అక్కడ ఆనెటోవ్ ఉన్నాడు. హెలెన్ అక్కడ నుంచి వెళ్ళిపోయింది. నటాషా అతనితో ఒంటరిగా మిగిలింది.

"నీకు తెలీదూ, నేను మీ ఇంటికి రావడం సాధ్యపడదని? అంచాత నన్ను ఎప్పుడూ ఇలా శిక్షించవలసిందేనా? నే నెప్పుడూ నిన్ను చూడడానికి వీలుండదా? నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలియదా?" అంటూ ఆనెటోవ్, వెళ్ళిపో బోతున్న నటాషాకు అడ్డుగా వచ్చి తన ముఖాన్ని ఆమె ముఖానికి దగ్గరగా ఉంచి నిలుచున్నాడు. జ్వాలల్లాగా ఉన్న అతని కళ్ళు ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తు న్నాయి. అప్పుడా కళ్ళు తప్ప ఆమెకు మరేమీ కనిపించడం లేదు.

"నటాషా!" అంటూ ఆవిడ చేతులను తన చేతుల్లోకి తీసుకున్నాడు. "నటాషా! నటాషా!" అన్నాడు.

'నా కేమీ అర్థం కావడం లేదు. నే నేమీ చెప్పలేను' అన్నట్లుగా ఉన్నాయి కలవరంతో కూడిన ఆమె చూపులు.

కాలిపోతున్న అతని పెదవులు ఆమె పెదవులకు గట్టిగా హత్తుకున్నాయి. కాని హఠాత్తుగా ఆమెను వదిలాడు. నటాషాకు విడుదల చిక్కినట్లయింది. తలుపు దగ్గర ఎవరో వస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది. హెలెన్ రావడం నటాషా చూచింది. ఎర్రబారిన ముఖంతో కంపించిపోతూ ఇదేమి టన్నట్లు అతని వంక చూచింది. తరువాత తలుపు దగ్గరికి వెళ్ళింది.

"ఒక్క మాట! ఒక్కమాట!" అంటున్నాడు ఆనెటోవ్.

ఆవిడ తలుపు దగ్గర ఆగిపోయింది. జరిగినదాన్ని వివరిస్తూ అతను చెప్ప దలచిన మాట చెపుతాడనీ అందుకు తను జవాబు చెప్పవచ్చుననీ ఎదురు చూస్తూ నిలుచుంది. అయినా అతను "నటాషా ఒక్కమాట!" అని అంటూనే ఉన్నాడు కాని ఏమాట చెప్పాలో అతనికి తెలీలేదు.

తరువాత ముగ్గురూ కలిసి బాల్ రూంలోకి వెళ్ళారు. రోస్టోవ్‌లు ఆ రాత్రి భోజనానికి ఉండకుండానే సెలవు తీసుకుని ఇంటికి వెళ్ళిపోయారు.

నటాషాకు ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. ఎంతకూ తీరని సమస్యను ఆలో చిస్తూ పడుకుంది. ఆ ఇద్దరిలోనూ తను ఎవరిని ప్రేమిస్తున్నట్టు? ఆంద్రూనే ప్రేమిస్తున్నది. అతని పట్ల తనకు గల గొప్ప ప్రేమను ఆవిడ ఇంకా మరిచిపో లేదు....కాని ఆనెటోవ్‌ను కూడా ప్రేమిస్తున్నది!

"లేకపోతే ఇదంతా ఎందుకు జరుగుతుంది? అతని చిరునవ్వుకు జవాబుగా

నేను చిరునవ్వు నవ్వగలుగుతానా? అతన్ని తొలిచూపులోనే ప్రేమించాను కాబట్టి అలా నవ్వ గలిగాను...అతనెంతో మంచివాడు· అందగాడు. అతన్ని నేను ప్రేమించకుండా ఉండలేను! ఇక నేనేం చేయాలి? నేను అతన్ని ప్రేమిస్తున్నాను; ఇతన్నీ ప్రేమిస్తున్నాను..."

ఎంత ఆలోచించుకున్నా ఆమె కేమీ జవాబు చిక్కలేదు.

# 53

తెల్లవారింది. మళ్ళీ మామూలు వ్యవహారాలన్నీ సాగిపోతున్నాయి. అందరూ నిద్రలేచి దుస్తులు వేసుకుని మాట్లాడుతూ తిరుగుతూ, ఉన్నారు. మళ్ళీ దుస్తులు తయారు చేసుకుని బైలర్లు వచ్చారు. సేవకులు వారి వారి పనుల్లో నిమగ్నులై ఉన్నారు. మేరియా డిమిట్రోవ్నా తన గదిలో నుంచి బయటికి వచ్చింది. అందరూ టీ త్రాగడానికి కూచున్నారు. నటాషా రాత్రంతా నిద్ర లేకపోవడం వల్ల విప్ఫారిన కళ్ళతో అందరి వంక కలవరంతో చూస్తోంది. అందరి చూపుల్లోని భావమేమిటా అని చూస్తోంది. తను మామూలుగా కనిపించడానికి ఎంతో ప్రయత్నం చేస్తోంది.

భోజనమైన తరువాత మేరియా డిమిట్రోవ్నా తన పడక కుర్చీలో కూచుంది. నటాషాను, కౌంట్‌ను మాట్లాడడానికి పిలిచింది.

"సరే, స్నేహితులారా! అన్ని విషయాలూ నేను బాగా ఆలోచించుకున్న తరువాత నేను చెప్పదలుచుకున్న మాట ఇది. నిన్న మీ అందరికీ తెలిసినట్టుగానే నేను వృద్ధ రాకుమారుణ్ణి చూడడానికి వెళ్ళాను. అతనితో మాట్లాడాను. అతను తన కంఠస్వరం బిగ్గరగా హెచ్చించి నా మీద వాన కురిపించడం మొదలు పెట్టాడు. కాని వీటికి జడిసేది నేనా? నే నతన్ని పూర్తిగా ముందు వెనక ఆలోచించకుండా కడిగి పెట్టాను" అని చెప్పింది మేరియా.

"ఇంతకూ అతనేమన్నాడు?" అని అడిగాడు కౌంట్.

"ఆ ముసలాడికి మతి లేదు. ఏ మాటా వినిపించుకోడు. ఇప్పటికే ఈ అమ్మాయికి మనం ఎంతో కష్టం కలిగించాం. మీరు త్వరగా మీ పనులు ముగించుకుని తిరిగి అట్రెడ్‌నోకు వెళ్ళి అక్కడే ఉండడం మంచిది" అన్నది మేరియా.

"వీల్లేదు, వీల్లేదు. నేను వెళ్ళను" అన్నది నటాషా.

"కాదు కాదు. వెళ్ళి తీరాలి" అన్నది వృద్ధురాలు. "నీవు వెళ్ళి అక్కడే ఉండాలి. నీ విక్కడ ఉండగా ఆంద్రూ రాకుమారుడు వస్తే తగాదా తప్పదు. అతను ఒక్కడూ ఉంటే ముసలివాడితో అన్ని విషయాలు మాట్లాడి నిన్ను తీసుకు వెళ్ళడానికి వస్తాడు" అన్నది.

కౌంట్ ఈ మార్గం ఎంతో సుగమంగా ఉన్నదని గమనించి అందుకు ఒప్పుకున్నాడు. ముసలివాడు కనుక ఒప్పుకున్న పక్షంలో రోస్టోవ్‌లు మళ్ళీ మాస్కోకు రావచ్చు. లేదా లిస్సీ-గోరీకే వెళ్ళవచ్చు. లేని పక్షంలో అట్రెడ్‌నోలోనే వివాహం జరుగుతుంది.

"నీవు చెప్పిన మాట నిజమే. నేను విచారపడుతున్నదల్లా నటాషాను తిరిగి ఇంటికి తీసుకెళ్ళవలసి వచ్చిందనే" అన్నాడు కౌంట్.

"అందుకు విచారించవలసిందేమీ లేదు. అతనిపట్ల ఆ మాత్రం మర్యాద చూపక ఎలాగూ తప్పదు. అతను ఒప్పుకోలేదూ అంటే అది అతని తప్పే. పెండ్లి బట్టలుకూడా తయారైనాయి. ఇక అనవసరంగా వేచి ఉండడం దేనికి? కాలయాపన తప్ప. తయారుకాని వాటిని తయారు చేయించి నేను మీకు తరువాత పంపుతాను. మీరు వెడుతున్నందుకు నాకు విచారంగా ఉన్నా మీరు వెళ్ళక తప్పదు. మీరు వెళ్ళడం మంచిదే కాబట్టి వెళ్ళండి" అంటూ డిమిట్రోవ్‌నా, తన సంచిలోంచి మేరియా రాకుమారి నటాషాకు వ్రాసి యిచ్చిన ఒక ఉత్తరాన్ని తీసి నటాషాకు అందించింది. "ఇది నీకివ్వమని చెప్పి ఇచ్చిన ఉత్తరం. పాపం ఆ పిల్ల యెంత నొచ్చుకుంటున్నదనుకున్నావు? తనకు నీవంటే ఇష్టం లేదని నీ వనుకుంటున్నావని'' అన్నది.

"నిజమే ఆ విషయం" అన్నది నటాషా. "ఆవిడకు నేనంటే ఇష్టం లేదు" అన్నది.

"అదేం మాట? అలా మాట్లాడకు."

"నాకెవరి అభిప్రాయంతోనూ అవసరంలేదు. ఆమెకు నేనంటే ఇష్టం లేదని నాకు తెలుసు" అన్నది నటాషా, చిరాకుతో ఆ ఉత్తరం తీసుకుంటూ.

"నీవలా మాట్లాడకమ్మా. నేను చెపుతున్నది నిజం. ఆ ఉత్తరానికి జవాబు రాయి."

నటాషా మారుమాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి ఉత్తరాన్ని చదువుకోసాగింది.

తా మిరువురూ ఒకరినొకరు అపార్థం చేసుకోవడం తటస్థించినందుకు తానెంతో విచారిస్తున్నానని మేరియా రాకుమారి వ్రాసింది. తనకు గల అనురాగంలో నమ్మకం ఉంచమనీ, తన అన్న ఎన్నుకున్న భార్యను తను ప్రేమిస్తుందనీ, అతని కోసం తను ఎలాంటి త్యాగమైనా చేస్తుందనీ వ్రాసింది. తనను మాత్రం అపార్థం చేసుకోవద్దని వ్రాస్తూ "నా తండ్రి ముసలివాడు. ఆయన్ను నీవు క్షమించాలి. కాని ఆయన హృదయం మాత్రం మంచిది. ఎప్పటికైనా తన కొడుకును సుఖపెట్టే కోడలిని ఆయన ప్రేమించకుండా ఉండడు" అని తండ్రిని గురించి చెప్పి ఉత్తరం ముగిస్తూ తను మళ్ళీ నటాషాను ఎప్పుడు కలుసుకోవచ్చునని అడిగింది.

తరువాత నటాషా ఆ ఉత్తరానికి జవాబు వ్రాయడానికి కూచుంది. "ప్రియమైన రాకుమారీ ..." అని మొదలు పెట్టి, కలాన్ని అవతల పెట్టింది. తరువాత ఏం వ్రాయాలో ఆమెకు తోచలేదు. అవును ఇంత జరిగిన తరువాత ఆమేకేం వ్రాస్తుంది?

"అవును, అంతా ముగిసిపోయినట్టే! ఇప్పుడంతా మారిపోయింది. నేను అతన్ని నిరాకరించాలి. కాని నేను అలా నిరాకరించగలనా?" అనుకొని కాసేపు ఆలోచించుకుంటూ ఆ ఉత్తరం ముందు పెట్టుకొని కూచుంది. తరువాత తన మనస్సులోకి వస్తున్న ఈ వెర్రి ఆలోచనలు పారదోలుకోడానికి అక్కణ్ణుంచి లేచి సోనియా దగ్గరికి వెళ్ళింది. సోనియా కుట్టుపని చేసుకుంటూ కూచుని ఉంది.

భోజనమైన తరువాత ఒకమాటు తన గదిలోకి వెళ్ళి మళ్ళీ తన ఉత్తరం చూచుకుని "అయితే అంతా ముగిసిపోయినట్టేనా? గత మంతా గడిచిపోయినట్టేనా? నా హృదయంలో నుంచి అదంతా చెరిగిపోయినట్టేనా?" అని అనుకోసాగింది. ఆంద్రూ రాకుమారునిపట్ల తన ప్రేమనంతా ఒకమాటు జ్ఞాపకం చేసుకున్నది. కాని తను కారగైన్‌ను ప్రేమిస్తోంది. ఒకేమాటు తన ఆంద్రూకు భార్యగా ఉండి పొందే సుఖాన్ని, పోయిన సాయంకాలం జరిగిన విషయాలను తన ఊహాపథంలో చిత్రించుకోసాగింది. అన్ని విషయాలూ వివరంగా, స్పష్టంగా ఆమె కళ్ళముందు కనిపించసాగాయి. ఆమె ఉద్వేగంతో ఊగిపోతోంది.

"నేను ఒకే పర్యాయం ఇద్దరినీ ఎందుకు ప్రేమించకూడదూ? అనుకున్నది కలవరంతో. "అదే నాకున్న ఒక్క ఆనందం! ఇద్దరిలో ఎవరో ఒకరిని ఎన్నుకోవడం అసాధ్యం. కాని ఈ విషయం ఆంద్రూతో ఎలా చెప్పగలను? చెప్పకుండా మాత్రం ఎలా దాచిపెట్ట గలను? ఇంతకాలం నుంచీ నా జీవితానికి ఆధారమైన ఆ ప్రేమను మాత్రం నే నెలా వదిలి పెట్టుకో గలను?" అనుకున్నది.

"అమ్మా!" అంటూ ఒక పరిచారిక లోపలికి వచ్చింది. "ఒకరు మీకీ ఉత్తరం ఇవ్వమన్నారు" అంటూ ఒక ఉత్తరం ఆమెకు అందించింది. "దయచేసి ..." అని వెళ్ళి పోయింది.

నటాషా మరేమీ ఆలోచించుకోకుండా ఉత్తరాన్ని తెరిచి చదవసాగింది. ఆమెకొక విషయం మాత్రం అర్థమైంది. ఆ ఉత్తరం అతని దగ్గరనుంచే వచ్చిందనీ—తను ప్రేమించిన వ్యక్తి దగ్గర నుంచే వచ్చిందనీ మాత్రం ఆమెకు తెలుసు.

"అవును. నే నతన్ని ప్రేమిస్తున్నాను. ప్రేమించకపోతే ఇంత జరిగేదా? ఈ ఉత్తరాన్ని నేనిలా వణుకుతున్న చేతులతో పట్టుకొని ఉండగలిగేదాన్నా" అనుకున్నది.

వణుకుతున్న చేతులతో ఉత్తరాన్ని పట్టుకొని, ఆవేదనతో కంపించిపోతూ ఉత్తరాన్నంతా చదువుకున్నది. ఆ ఉత్తరంలోని ప్రతిమాటలోను తన హృదయం లోని భావాలే ప్రతిధ్వనిస్తూ ఉన్నాయి. అనెటోవ్ కోసం ఆ ఉత్తరాన్ని డొలొహోవ్ చెప్పి వ్రాయించాడు. ఆ ఉత్తరంలో ఇలా ఉంది:

"నిన్న సాయంత్రమే నా బ్రతుకు నిశ్చయమయిపోయింది! నీవు నన్ను ప్రేమించడమో, లేక నేను చనిపోవడమో! అంతకంటె మరి గత్యంతరం లేదు..."

"ఆతరువాత తన తల్లిదండ్రులు కాని బంధువులు కాని అనేక కారణాలవల్ల ఇందుకు అంగీకరించరని అనెటోవ్ వ్రాశాడు. ఆ కారణాలు తరువాత ప్రత్యేకంగా ఆమెతో చెపుతానని వ్రాశాడు. ఆమె తనను ప్రేమించినట్టయితే—ఆ ఒక్కమాట తనకు తెలియజేస్తే చాలు అన్నాడు. ఆ తరువాత తమ ఆనందానికి అవరోధమేమీ ఉండదన్నాడు. ఆ ఒక్కమాట ఆవిడ చెప్పినట్లయితే, ఆవిడ కోసం తనెలాంటి పనైనా చేస్తానని వ్రాశాడు.

"అవును, అవును! నేనతన్ని ప్రేమిస్తున్నాను!" అనుకున్నది నటాషా తనలో. ఆ ఉత్తరాన్ని ఇరవైసార్లు చదువుకొన్నది. ఆ ఉత్తరంలోని మాటలతో తన హృదయాన్ని వెచ్చచేసుకుంటూ మళ్ళీ మళ్ళీ ఆ మాటలు అనుకున్నది.

ఆ సాయంకాలం మేరియా డిమిట్రోవ్నా; ఆర్హరోవ్‌ల ఇంటికి వెడుతోంది. పిల్లలను కూడా తనతోపాటు తీసుకొని వెడతానన్నది. కాని తనకు తలనొప్పిగా ఉన్నదని చెప్పి నటాషా తన గదిలోనే ఉండిపోయింది.

# 54

సోనియా ఇంటికి వచ్చేసరికి ఆలస్యమైంది. రాగానే నటాషా గదిలోకి వెళ్ళింది. ఆమె అలాగే ముస్తాబుతోనే సోఫాలో పడుకొని నిద్రపోతూ ఉండడం చూచి ఆశ్చర్యపోయింది. ఆమె ప్రక్కనే టేబిల్‌మీద తెరిచిపెట్టిన ఉత్తరం ఉన్నది. అది సోనియా కంటపడి, ఆ ఉత్తరం తీసుకొని చదవసాగింది. చదువుతూ మధ్య మధ్యలో నిద్రపోతోన్న నటాషావంక చూస్తూ ఆమె ముఖం ఏ విధంగా ఉందో పరిశీలిస్తోంది. ఆమె ముఖం ప్రశాంతంగాను, హాయిగాను ఉంది. సోనియా భయంతో కంపించిపోతూ హృదయాన్ని చేతులతో గట్టిగా అదుముకుని కుర్చీలో కూలబడి పోయి వెక్కి వెక్కి ఏడవసాగింది.

"ఇంతవరకూ నేనీ విషయాన్ని ఎందుకు గమనించలేకపోయాను?" అని ఆశ్చర్యపోయింది. "ఈ విషయం ఇంతదూరం వచ్చిందా? ఆమె ఆంద్రూ రాకు మారుని ప్రేమించడం మానేసిందా? కపట బుద్ధికల ఈ కారగైన్‌ను ప్రేమిస్తూ

ఉందా? అతను ఈమెను మోసం చేస్తున్నాడు. ఏ మాత్రం సందేహం లేదు. నికోలస్‌కు ఈ విషయం తెలిస్తే ఏమంటాడు! అతనెంత మంచివాడు! అతను ఇలాంటి విషయాలు ఒప్పుకుంటాడా? ఇందుకనే కాబోలు ఆమె నిన్న, మొన్న అలా ఉంది...కాని ఆమె అతన్ని ప్రేమించదు. అది అసాధ్యం! ఎవరిదగ్గర నుంచి వచ్చిందో తెలీకుండానే ఆమె ఆ ఉత్తరం చదివిన తరువాత ఆమెకెంతో కోపం కూడా వచ్చి ఉంటుంది. తప్పకుండా...." ఇలా అనుకుని ఆమె కన్నీళ్ళు తుడుచు కొని నటాషా దగ్గరికి వెళ్ళింది. ఆమె ముఖాన్ని దగ్గరగా చూచింది. తరువాత ఆమెను మెల్లగా పిలిచింది. నటాషా ఉలికిపడి లేచి సోనియాను చూచింది.

"వచ్చావా!"అంటూ నటాషా,ఆమె మెడచుట్టూచేతులు పెనవేసింది. తరువాత కలవరంగా ఉన్న ఆమె ముఖాన్ని చూచి తాను కూడా కలవరపడింది. "సోనియా! నీవు ఉత్తరాన్ని చదివావా?" అని అడిగింది.

"ఊ" అన్నది సోనియా మెల్లగా.

"సోనియా"! అని చిరునవ్వు నవ్వుతూ నటాషా ఇలా చెప్పసాగింది: "సోనియా!" ఈ విషయం ఇకనుంచి దాచిపెట్టలేను. సోనియా, సోనియా! అతను ఉత్తరం వ్రాశాడు చూచావా? సోనియా, సోనియా!...."

సోనియా తన చెవులను తానే నమ్మలేకపోయింది.

"మరి బోల్‌కోన్‌స్కీ విషయం?" అని అడిగింది.

"సోనియా! నే నెంత హాయిగా ఉన్నానో తెలిస్తే నీవు నన్నిలా అడుగు తావా? నీకు ప్రేమంటే ఏమిటో తెలీదు" అన్నది నటాషా.

"నటాషా! అయితే అదంతా అయిపోయినట్టేనా? నీ వతన్ని మరిచిపోయి నట్లేనా?" అన్నది సోనియా.

నటాషా ఆ మాటలు అర్థంకానట్లుగా విప్పారిన కళ్ళతో ఆమెవంక చూచింది.

"అయితే నీవు ఆంద్రూను మరిచిపోయినట్లేనా?" అని మళ్ళీ అడిగింది సోనియా.

"నాకు తెలుసు నీవు నన్ను అర్థం చేసుకోవని. నామాట విను!" అన్నది నటాషా కలవరంతో.

"నేను నమ్మలేను" అని సోనియా మళ్ళీ చెప్పసాగింది. "నేనర్థంచేసుకోలేను. నేను నమ్మలేను. ఏమిటిది? ఒక సంవత్సరమంతా ఒక వ్యక్తిని ప్రేమించావు. హఠా త్తుగా ఈ విపరీతం మేమిటి? మూడుసార్లు మాత్రమే నీవతన్ని కలుసుకున్నావు.... ఇంతలోనే ఇలా జరుగుతుందా? ఇది సాధ్యమా? నాతో పరాచక మాడుతున్నావా? మూడురోజుల్లోనేనా? అంత మరిచిపోయావా?" అని మళ్ళీ మళ్ళీ అడగసాగింది సోనియా.

"మూడురోజులా? ఆ మూడురోజులూ మూడు యుగాలుగా అతన్ని ప్రేమించాను! నీకర్థంకాదు సోనియా, ఇలా వచ్చి కూచో" అంటూ ఆమెను దగ్గరికి తీసుకుని గట్టిగా ముద్దాడింది. "నేనూ విన్నాను, నీవూ వినేవుంటావు. ప్రేమ అంటూ ఒక వస్తువు ఉన్నదని, కాని నేను దాన్ని అనుభవిస్తున్నది ఇప్పుడు మాత్రమే, దాన్ని ఇప్పుడు మాత్రమే తెలుసుకోగలిగాను. నా పూర్వపు ప్రేమకు దీనికి ఏమాత్రం సంబంధం లేదు. అతన్ని చూడగానే అతనే నాకు ఏలిక అనుకున్నాను. అతనికి నేను బానిస ననుకున్నాను. అతన్ని ప్రేమించకుండా ఉండలేక పోయాను. నేనతని బానిసను! అవును అతను ఏదిచెప్పినా చేస్తాను. నీ కర్థం కాదు సోనియా! కాని ఇది నా తప్పు కాదు" అన్నది నటాషా.

"కాని ఒక్క విషయం ఆలోచించు. ఇలాజరగడం నే నొప్పుకోను. ఈ రహస్యపు ఉత్తరాలేమిటి? నీవు వీటి నిలా తెరిచి చదవడమేమిటి?"అన్నది సోనియా, తన కలవరాన్ని, అసహ్యాన్ని దాచుకోలేక.

"ఇప్పుడు నా మనస్సులో మనస్సు లేదు సోనియా. నే నతన్ని ప్రేమిస్తున్నాను అంతే" అన్నది నటాషా మరింత ఉద్రిక్తురాలై.

"అలా అయితే నే నూరుకోను. నేనందరితోనూ జరిగిన కథంతా చెప్పి తీరుతాను" అన్నది సోనియా, కన్నీళ్ళు ఆపుకోలేకుండా:

"ఆ పనిమాత్రం చేయ్యొద్దు. అలాచేస్తే ఇక ఎన్నడూ నేను నీతో మాట్లాడను, నా బ్రతుకును పాడుచేయడమేనా నీ ఉద్దేశం? మనిద్దరం విడిపోవాలని నీకున్నదా?"

ఆమె ఇలా భయపడుతోంటే సోనియాకు ఆమెపట్ల సిగ్గు, జాలి కలిగాయి.

"అయినా నీకూ, నాకూ ఉన్న సంబంధ మేమిటి? ఈ రహస్యా లేమిటి? అతను నీతో ఏమని చెప్పాడు? ఇక్కడి కెందుకురాడు?" అన్నది సోనియా.

"సోనియా! అనవసరంగా నన్ను కలవర పెట్టకు. ఇందులో ఒకరి జోక్యం అనవసరం. నేను నిన్ను నమ్ముతున్నాను. అంతే" అన్నది నటాషా.

"కాని ఈ రహస్యమంతా ఏమిటి? అతను సూటిగా వచ్చి నిన్ను వివాహం చేసుకుంటానని ఎందుకు చెప్పకూడదూ? ఆంద్రూ రాకుమారుడు నీకు కావలసినంత స్వాతంత్ర్యం ఇచ్చాడు కదా? ఈ 'రహస్య కారణాల' వెనకాల అర్థమేమిటో నీవు కొంచెమైనా ఆలోచించావా?" అని అడిగింది సోనియా.

నటాషాకు ఏం జవాబుచెప్పాలో తోచక సోనియా ముఖం వంక నివ్వెరపోయి చూడసాగింది. ఆవిడకు ఈ ప్రశ్న పొడచూపడం ఇదే మొదటిసారి. దీనికెలా సమాధానం చెప్పాలో ఆమెకు తోచలేదు.

"రహస్య కారణాలా? అవేమిటో నాకు తెలీదు. కాని కారణాలంటూ ఉంటాయి" అన్నది చివరకు.

సోనియా నిశ్వసించి తల పంకించింది. "కాని ఆ కారణాలు మంచివే అయితే..." అంటూ ఏదో చెప్పబోయింది సోనియా. కాని ఆమె ఏమి చెప్పబోతున్నదో ఊహించుకుని నటాషా ఆమెకు మధ్యలోనే అడ్డుతగిలి—

"సోనియా! అతన్ని నేను అనుమానించకూడదు, నీవూ అనుమానించకూడదు సోనియా!" అన్నది.

"అతను నిన్ను ప్రేమిస్తున్నాడా?"

"అతను నిన్ను ప్రేమిస్తున్నాడా?" అని తిరిగి అడిగింది నటాషా, తన స్నేహితురాలి మందబుద్ధికి చిరునవ్వు నవ్వుతూ. "నీవీ ఉత్తరం చదివావు కదా? నీవే చెప్పు" అని అడిగింది.

"కాని అతడు మోసగాడైతే?"

"అతనా? మోసగాడా! నీకు తెలిసివుంటే ఇలా అనవు. అతని విషయం నీకు తెలీదు."

"అతను మర్యాదస్థుడైతే తన ఉద్దేశాన్ని నీకు సూటిగా చెప్పి ఉండేవాడు. లేక నిన్నసలు కలుసుకోవడమే మానేసి ఉండేవాడు. నీవు ఇలా అతనికి తెలియపర్చకపోతే, నే నీ విషయాలన్నీ అతనికి వ్రాస్తాను. నాన్నగారితో కూడా అన్నీ చెపుతాను."

"కాని అతను లేకుండా నేను బ్రతకలేను."

"నీ మాటలు, నీ చేతలు—నా కర్థంకావడంలేదు నటాషా! ఒక్కమాటు మీ నాన్నగారిని గురించి, నికోలస్‌ను గురించి, ఆలోచించు."

"నాకెవరూ అక్కర్లేదు. నే నతన్ని తప్ప మరెవర్నీ ప్రేమించడం లేదు. అతన్ని అమర్యాదస్థుడని నీవెలా అనగలిగావు? నేనతన్ని ప్రేమిస్తున్నానని నీకు తెలీదా?" ఇలా అని నటాషా మళ్ళీ తీవ్రంగా "వెళ్ళు, ఇక్కణ్ణుంచి వెళ్ళు. నేను నీతో పోట్లాడదలుచుకోలేదు. నీవువచ్చి నన్నెలాటి పరిస్థితిలో పెట్టావో చూడు...." అన్నది.

సోనియా త్వరత్వరగా గదిలోనుంచి వెళ్ళిపోయింది.

నటాషా టేబిల్ దగ్గర కూచుని మరేమీ ఆలోచించకుండా మేరియా రాకుమారికి జవాబు వ్రాయసాగింది. ఆ ఉదయం నుంచీ పూర్తిచేయలేని ఉత్తరాన్ని పూర్తిచేయసాగింది. ముక్తసరిగా, కొద్దిమాటల్లో ఇలా జవాబు వ్రాసింది. ఇకవారు ఒకరినొకరు అపార్థాలు చేసుకోవలసిన అవసరం లేదనీ, ఆండ్రూ తనకు కావలసినంత స్వేచ్ఛ ఇచ్చాడనీ, అతని ఔదార్యాన్ని తానిప్పుడు వినియోగించుకుంటున్నా

నని వ్రాసింది. గతమంతా మరిచిపొమ్మనీ తనదేదైనా తప్పుంటే క్షమించవలసిందనీ, ఇక తను ఆవిడ అన్నకుభార్య కావడమనేదీ అసాధ్యమని వ్రాసింది. ఈ సమయంలో నటాషాకు ఇవన్నీ ఎంతో సులభంగా సుగమంగా కనిపించాయి.

ఆ వచ్చే శుక్రవారం నాడు రోస్టోవ్‌లు మళ్ళీ తమ గ్రామానికి వెళ్ళవలసి ఉంది. బుధవారం నాడు కౌంట్ రోస్టోవ్ మాస్కో ప్రక్కనే ఉన్న తన ఎస్టేట్‌ను చూచి రావడం కోసం వెళ్ళాడు.

అనాడే నటాషాను, సోనియాను, జూలియా కారగైన్ ఇంట్లో ఒక పెద్ద విందుకు ఆహ్వానించారు. మేరియా డిమిట్రోవ్‌నా వారిని తీసుకుని వెళ్ళింది. అక్కడ అనెటోవ్ కూడా ఉన్నాడు. నటాషా అతనితో ఏదో రహస్యంగా మాట్లాడడం, ఆ విందు జరుగుతున్నంతసేపూ ఆమె ఏదో కలవరపడుతూ ఉండడం సోనియా గమనించింది. ఇంటికి తిరిగి రాగానే సోనియా ఏమీ అడక్కుండానే నటాషా తనంతట తానే పసిపిల్లలాగా విషయాలన్నీ చెప్పడం ప్రారంభించింది.

"సోనియా! నీవు నాతో అతన్ని గురించి అవీ ఇవీ కాని మాటలు చెప్పావు కాని, ఇవాళ మేమిద్దరమూ ఒక ఒప్పందానికి వచ్చాం తెలుసా?" అన్నది నటాషా, తమను ఇతరులు పొగడాలని అనుకుంటున్నప్పుడు పసిపిల్లలు మాట్లాడే ధోరణిలో "ఏం జరిగిందేమిటి? నా మీద నీకు కోపం లేనందుకు నాకెంతో సంతోషంగా ఉంది. కాని అసలేం జరిగిందో చెప్పు? అతనేమన్నాడు?" అన్నది సోనియా.

నటాషా ఒక్క క్షణం ఆగి ఆలోచించింది. "సోనియా! నేనతన్ని అర్థం చేసుకున్నట్లు నీవూ అతన్ని అర్థం చేసుకుని ఉంటే నిజంగా ఎంత బాగుండేది! నేను ఆండ్రూకు మాట ఇచ్చానా అని అడిగాడతను. కాని అతన్ని నిరాకరించడం నా చేతుల్లోనే ఉన్నదని తెలుసుకుని ఎంతో సంతోషించాను" అన్నది నటాషా.

సోనియా ఒక్క మాటు నిశ్వసించి "అయితే ఇంతకూ నీవతన్ని నిరాకరించలేదుగా?" అన్నది.

"నిరాకరించాననే అనుకో. అతనితో నాకున్న సంబంధమంతా తెగిపోయింది అనుకో. నన్ను గురించి, అతన్ని గురించి చెడుగా మాత్రం అనుకోకు."

"చెడుగా అనుకోవడం కాదు. నాకేమీ అర్థం కావడం లేదు...."

"కొంచెం కాలం ఆగు! అతనెలాటివాడో నీకే తెలుస్తుంది. నీవే చూద్దువు గానిగా! నన్ను గురించీ, అతన్ని గురించీ మరో విధంగా అనుకోకు."

"నేను ఎవరిని గురించీ ఏమీ అనుకోను. నాకు అందరూ ఒకటే. కాని నేనేం చేయను?" అన్నది సోనియా. నటాషా ఇలా చనువుగా మాట్లాడినా సోనియా తన పట్టు వదలలేదు. పైగా ఆవిడ మెత్తపడే కొద్దీ సోనియా మరింత ఎక్కువగా పట్టు పట్ట సాగింది.

"నటాషా! ఈ విషయం ఇక నీ ముందెన్నడూ మాట్లాడ వద్దని అన్నావు. అందుచేత నేను మాట్లాడలేదు. కాని నీవే మళ్ళీ ఈ ప్రస్తావన ముందు తీసుకుని వచ్చావు. అందుచేత ఇక నేను మాట్లాడక తప్పదు. ఈ విషయంలో మాత్రం నాకు ఏమీ నమ్మకం కలగడం లేదు. అయినా ఈ రహస్యాలంతా ఎందుకు?"

"ఎప్పుడూ నీ వింతే. నీ అనుమానం నీదే!" అన్నది నటాషా.

"నీ విషయంలో నేను భయపడుతున్నాను."

"ఎందుకు భయం?"

"నీ నాశనానికి నీవు దారి తీసుకుంటున్నావేమో నని" అన్నది సోనియా, తను అన్న మాటలకు తనే భయపడుతూ.

నటాషా ముఖంలో మళ్ళీ మార్పు వచ్చింది "సరే అయితే త్వరలోనే నా నాశనం నేను తెచ్చుకుంటాను! ఎంత త్వరలో నాశనమైతే అంత మంచిది! ఇందులో నీ జోక్యమేమీ అవసరం లేదు. అనుభవించే దాన్ని నేను, నీవు కాదు. ఇక నన్ను వదిలి వెళ్ళు. నీవంటే నా కసహ్యం" అంటూ నటాషా గదిలో నుంచి పరుగెత్తి వెళ్ళింది.

ఆ మరుసటి రోజంతా ఆమె సోనియాతో మాట్లాడలేదు. గదుల్లో అటూఇటూ తిరుగుతోంది. ఆమె మనస్సు దేనిమీదా నిలవడం లేదు. ఏ పనీ చేయలేక పోతోంది. ఆమె ముఖంలో ఆశ్చర్యం, కలవరం స్పష్టంగా కనిపిస్తున్నాయి. తన్ను కాదని పోయినా సోనియా మాత్రం ఆమెను చాటు చాటుగా ఉండి గమనిస్తూనే ఉంది. నటాషా ఆ ఉదయమంతా చాలాసేపు డ్రాయింగ్ రూం కిటికీ దగ్గర కూచుని ఎవరి కోసమో ఎదురు చూస్తున్నట్లుగా ఉంది. అటునుంచి వెళ్ళిన ఒక ఆఫీసర్‌కు సైగ చేసింది కూడా. అతను ఆనెటోల్ అనుకున్నది సోనియా.

అప్పటి నుంచి సోనియా, నటాషాను మరింత ఎక్కువగా కనిపెట్టి ఉండ సాగింది. ఆ సాయంత్రం భోజన సమయంలో నటాషా మరింత పరధ్యానంగా ఉంది. ఎవరు ఏ ప్రశ్నలడిగినా వినిపించుకోనట్లుగా సమాధానాలు చెప్పింది. మాట్లాడబోయి మధ్య మధ్యలో ఆపుచేస్తూ ఉంది. తనకు తెలీకుండానే ఎందుచేతనో నవ్వుతూ ఉంది.

టీ తీసుకున్న తరువాత ఒక పరిచారిక భయం భయంగా నటాషా గదిలోకి వెళ్ళడం సోనియా చూచింది. వెంటనే మెల్లగా తలుపు దగ్గరికి వెళ్ళి తలుపుకు చెవి ఆనించి విన్నది. మరో ఉత్తరం వచ్చి ఉంటుందని ఊహించుకున్నది. కొద్ది సేపట్లో ఆ సాయంత్రం నటాషా ఏదో ఒక పెద్ద ఎత్తు వేస్తూ ఉందని ఆమెకు వెంటనే స్పష్టమైంది. తరువాత తలుపు తట్టింది. జవాబు లేదు.

'అతనితో పారిపోదా మనుకుంటోంది! అంత పనీ చేయగలదు!' అనుకు

న్నది సోనియా. 'ఆవిడ ముఖంలో ఇవాళ ఏదో విచారము, నిశ్చయము కనిపిస్తు న్నాయి. మొన్న నాన్నగారు ఊరికి వెడుతున్నప్పుడు ఏడ్చింది కూడా.... ఆ, ఆ, అవును అవును! అతనితో పారిపోదా మనుకుంటోంది! కాని నే నిప్పుడేం చేయను? ఇప్పు డిక్కడ కౌంట్ కూడా లేడు' అనుకున్నది సోనియా. అన్ని విషయాలూ జ్ఞాపకం తెచ్చుకుంటూ 'కారగైన్‌కు ఉత్తరం వ్రాసి ఇదేమిటని అడగనా? అయినా నాకు సమాధానం చెప్పాల్సిన అవసరం అతని కేమిటి? పోనీ పీటర్‌కు వ్రాయనా? ఏదైనా ప్రమాదం జరిగితే పీటర్‌కు తెల్పమని ఆండ్రూ చెప్పి వెళ్ళాడు కదా?... అయినా ఆమె నిజంగా ఆండ్రూను నిరాకరించిందేమో! నిన్న సాయంత్రమే కదా అమె మేరియా రాకుమారికి ఉత్తరం పంపింది? అయ్యో భగవంతుడా! ఇప్పుడు నేనేం చెయ్యాలి? మేరియా డిమిట్రోవ్‌నాతో చెప్పనా? ఆవిడకు నటాషాలో నమ్మకం ఉందే? అయినా అలా చెప్పడం తప్పు కాదా? ఇప్పుడు నేనేం చెయ్యాలి?' ఇలా ఒక చీకటి మూలలో నిలుచుని సోనియా ఆలోచించ సాగింది. 'అయినా నేను ఇప్పుడు ఏదో ఒకటి చేసి తీరాలి. వారి కుటుంబం వల్ల నేనింత సహాయం పొంది నందుకు, నేను నికోలస్‌ను ప్రేమించినందుకు నా కృతజ్ఞత చూపడానికి ఇంతకంటె నాకు తగిన సమయం లేదు. మూడు రాత్రులైనా సరే, నిద్ర లేకుండా ఈ గడప దగ్గరే కూచుంటాను. ఆమెను ఈ గడప దాటి వెళ్ళనివ్వను! బలవంతానైనా సరే వెళ్ళనివ్వను! ఈ కుటుంబం అపఖ్యాతిపాలు కావడానికి నేను ఒప్పుకోను!" అను కున్నది.

## 55

ఆనెటోల్ కారగైన్ ఇటీవల కొంత కాలం నుంచీ డొలొహోవ్‌తో కలిసి అతని ఇంట్లో నివసిస్తున్నాడు. నటాషాను లేవతీసుకుని పోయే ఎత్తుగడను కొన్ని రోజుల క్రితమే డొలొహోవ్ ఆలోచించి ఉంచాడు. నటాషా కూచున్న గది తలుపు దగ్గర చెవి పెట్టి విని, ఆవిడను ఇంట్లో నుంచి వెళ్ళనివ్వకుండా కాపాడడం కోసం సోనియా నిశ్చయించుకున్న రోజుననే, ఈ ఎత్తుగడను అమలులో పెట్టడానికి ఆనెటోల్, డొలొహోవ్ నిశ్చయించుకున్నారు.

రాత్రి పదిగంటలయ్యే సరికి తాను పెరటి వాకిటి దగ్గరికి వచ్చి నిలుచుంటా నని నటాషా, ఆనెటోల్‌కు చెప్పి పంపించింది. అక్కడ ఆమెకోసం ఆనెటోల్ వేచి ఉంటాడు. ఆమె వచ్చి కలుసుకోగానే అతను ఆమెను తీసుకుని మాస్కోకు అరవై వెర్‌స్టల (సుమారు 40 మైళ్ళు) దూరంలోవున్న కమెంకా అనే గ్రామానికి వెళ్ళిపో తాడు. అప్పటికే అక్కడ ఒక వెలివేయబడిన మత గురువును తమకు వివాహం చేయడం కోసం ఏర్పాటు చేసుకుని ఉంచాడు. ఆ తరువాత వారు అక్కడ నుంచి

కొత్త గుర్రాలు తీసుకుని వార్సా రోడ్డువరకూ వెళ్ళి, అక్కడ నుంచి మరో గుర్రపు బగ్గీలో సరిహద్దు దాటిపోతారు.

ఆనెటోవ్ ఇందుకు తగిన ఏర్పాట్లన్నీ చేసి ఉంచాడు. డొలొహోవ్ దగ్గర నుంచి, తన అక్క దగ్గర నుంచి ఇరవై వేల రూబుళ్ళు అప్పు కూడా తీసుకున్నాడు. గుర్రపు బగ్గీలో సరిహద్దు దాటి వెళ్ళడానికి 'ప్యాస్‌పోర్టు' కూడా సిద్ధంగా ఉంచుకున్నాడు.

ఈ వివాహానికి ఇద్దరు సాక్షులు. ఒకడు గాస్టికోవ్. పూర్వం ఇతను కోర్టు గుమాస్తాగా ఉండేవాడు. మరొకడు మాకరైన్. ఇతను సేనలో పనిచేసి వచ్చాడు. ఇరువురూ కూడా కారగైన్లకు పరిచయమున్నవారు, వారి కుటుంబానికి చెందిన వారూను.

అంతా కలిసి డొలొహోవ్ ఇంట్లో ముందు హాలులో కూచుని టీ తాగుతున్నారు. డొలొహోవ్ ప్రక్కగదిలో కూచుని ఉన్నాడు. ప్రయాణపు కోటు వేసుకుని ఎత్తైన బూట్లు కూడా తొడుక్కుని ఉన్నాడు. గది చాలా పెద్దది. గదిలో పర్షియన్ తివాసీలు పరిచి ఉన్నాయి. అతను టేబిల్ దగ్గర కూచుని లెక్కలు వ్రాసుకుంటున్నాడు. టేబిల్ మీద గుట్టలు గుట్టలుగా నోట్లు పెట్టబడి ఉన్నాయి.

"గాస్టికోవ్‌కు నీవు రెండువేల రూబుళ్ళు ఇవ్వవలసి ఉంటుంది" అన్నాడు డొలొహోవ్.

"సరే, తీసుకోమను" అంటూ ఆనెటోవ్ ప్రక్కగదిలో నుంచి వచ్చాడు. ఆ గదిలోని అతని ఫ్రెంచి సేవకుడు మరికొందరు సేవకులతో కలిసి అతని పెట్టెలు, సామాను సర్దుతున్నాడు.

"ఇక మకార్కాకు (మాకరైన్ ముద్దు పేరు) నీవేమీ ఇవ్వనక్కర్లేదు. అతనేమీ కోరడు. నీ కోసం ఏమైనా చేస్తాడు. మన లెక్కలన్నీ తయారైనాయి. రా, చూద్దువు గాని" అంటూ డొలొహోవ్, లెక్కలు వ్రాసిన కాగితాన్ని ఆనెటోవ్‌కు అందించాడు.

"ఓ! బాగానే ఉంది" అన్నాడు ఆనెటోవ్ అతని మాటలు వినిపించుకోకుండా. చిరునవ్వు నవ్వుతున్న అతని కళ్ళు ఎక్కడో చూస్తున్నట్లుగా ఉన్నాయి.

డొలొహోవ్ డెస్క్ మూసేసి "ఇటు చూడు!" అంటూ అతని వంక వెక్కిరింపుగా చూచి "ఇంకా టైముంది-ఇప్పటికైనా మానెయ్యొచ్చు" అన్నాడు.

"వెర్రివాగుడు వాగకోయి వెధవాయి! నీకు ఆ విషయం తెలిస్తే-కాని ఎవరికి మాత్రం ఎలా తెలుస్తుంది?" అన్నాడు ఆనెటోవ్.

"నేను నిజంగానే చెపుతున్నాను. గమ్మత్తుకు కాదు. నీ విప్పుడు చేస్తున్న పని గమ్మత్తు కాదు!" అన్నాడు డొలొహోవ్.

"ఏమిటి మళ్ళీ ఈ గొడవ? మాట్లాడకుండా ఊరుకో" అన్నాడు అనెటోవ్.

డొలొహోవ్ అతని వంక కోపంగా చూస్తూ "నేనేం గమ్మత్తుకు చెప్పడం లేదు.... నా మాట విను" అన్నాడు.

అనెటోవ్ అతని దగ్గరికి వచ్చి ఏమిటన్నట్లు నిలుచున్నాడు.

చివరిసారిగా చెపుతున్నాను విను. నే నెందుకు పరిహాసమాడాలి? నేను నీకేం అడ్డుతగల్లేదు కదా? పైగా నేనే అన్ని ఏర్పాట్లూ చేసి నిశ్చయం చేశాను. పెళ్ళికి పురోహితుణ్ణి, ప్యాస్‌పోర్టును ఏర్పాటుచేశాను. నీకు డబ్బు కూడా అప్పు ఇచ్చాను" అన్నాడు మళ్ళీ డొలొహోవ్.

"సరే, అయితే అందుకు నాకు కృతజ్ఞత లేదంటావా?" అంటూ అనెటోవ్ డొలొహోవ్‌ను కౌగిలించుకున్నాడు.

"నేను చేయగలిగిందంతా చేశాను. అయినా నిజం చెప్పడం నా ధర్మం. ఇప్పుడు నీవు ఆడుతున్న ఆట చాలా ప్రమాదకరమైన ఆట! ఒక్కమాటు ఆలోచించి చూడు, ఎంత వెర్రిపనిగా కనిపిస్తుందో! ఆమెను నీవు లేవనెత్తుకుని పోతావు బాగానే ఉంది. ఆ తరువాతనో? రహస్యం బయటపడక తప్పదు. నీకు ఇదివరకే వివాహం జరిగిందన్న విషయం బయటపడుతుంది. అందుకు నీవు నేరస్థుడివిగా పరిగణింపబడి నిన్ను శిక్షిస్తారు కూడా" అన్నాడు మళ్ళీ డొలొహోవ్.

"ఏమిటి నీకి వెర్రి? అయినా నీకి విషయం ఇదివరకే స్పష్టం చేశాను" అన్నాడు అనెటోవ్. అతని కొద్దిపాటి బుద్ధిలో అతనికెంతో నమ్మకముంది. ఇదివరకు ఒక వంద పర్యాయాలైనా చెప్పిన కారణాలనే మళ్ళీ ఇప్పుడు చెప్పడం మొదలెట్టాడు! మొట్టమొదటి విషయం- వివాహం న్యాయసమ్మతమైనది కాకపోయినట్లయితే అందుకు నేను జవాబు చెప్పవలసిన అవసరం లేదు. న్యాయసమ్మతమైనది అయినట్లయితే దానివల్ల వచ్చే ప్రమాదమేమీ లేదు. ఆ విషయం ఎవరికీ తెలీదు కూడా. ఇప్పుడర్థమైందా? ఇక మాట్లాడకు" అన్నాడు.

"నా మాట విను. ఇప్పటికైనా వదిలిపెట్టు. నీవు చాలా చిక్కుల్లో చిక్కుకుంటావు.... నా మాట విను.... ఆ తరువాత...."

"గంగలో కలువు!" అంటూ అనెటోవ్ తల పట్టుకున్నాడు. "ఆ కళ్ళు.... ఎంత చక్కని కళ్ళు! ఆ అమ్మాయి నిజంగా దేవతే!" అన్నాడు.

డొలొహోవ్ అతనివంక నిరసనగా చూస్తున్నాడు.

"డబ్బు అయిపోతే, ఆ తరువాత?" అని అడిగాడు డొలొహోవ్.

"ఆ తరువాత?" తిరిగి ప్రశ్నించాడు అనెటోవ్ కొంచెం వెనక్కు తగ్గి, "ఆ తరువాత ఏదైతే అదవుతుంది. ఆ విషయం చాలాసార్లు మాట్లాడుకున్నదే" అన్నాడు.

తరువాత గడియారం చూచుకుని "టైమైంది" అంటూ గదిలోకి వెళ్ళి సేవకులతో "ఇంకా సామాన్లు సర్దడం పూర్తి కాలేదా?" అని అడిగాడు.

డొలొహోవ్ డబ్బు లెక్కించడం ముగించి దాచిపెట్టేశాడు. తరువాత ఒక సేవకుణ్ణి పిలిచి భోజనం సిద్ధం చేయమని చెప్పి అక్కడ నుంచి భోజన శాలలోకి వెళ్ళిపోయాడు.

ఆనెటోవ్ చెయ్యి తల క్రింద పెట్టుకుని, తివాసీమీద పడుకుని అస్పష్టంగా చిరునవ్వు నవ్వుతూ తనలో తాను ఏదో మాట్లాడుకుంటున్నాడు.

"రా, కొంచెం భోజనం చేద్దువుగాని.ఇదిగో పానీయం అంటూ ప్రక్క గదిలో నుంచి డొలొహోవ్ పిలిచాడు.

"అక్కర్లేదు" అన్నాడు ఆనెటోవ్.

"రా- బలాగా ఇక్కడే ఉన్నాడు."

ఆనెటోవ్ లేచి భోజనశాలలోకి వెళ్ళాడు. బలాగా ఒక బండివాడు. గుర్రపు బగ్గీ చాలా బాగా తోలుతాడు. వారికి గుర్రాలు సప్లయి చేస్తుంటాడు. ఆరు సంవత్సరాల నుంచీ ఆనెటోవ్‌ను, డొలొహోవ్‌ను అతను బాగా ఎరుగును. ఎన్నోసార్లు టెర్ నుంచి సాయంకాలం బయలుదేరి తెల్లవారే సరికి మాస్కోకు వారిని చేర్చేవాడు. మళ్ళీ మాస్కో నుంచి టెర్ చేర్చేవాడు. మరెన్నోసార్లు చక్కని పిల్లలను వారు వెంట తీసుకొనివస్తే వారికి బండి తోలేవాడు.ఎన్నోసార్లు డొలొహోవ్‌ను మనుష్యులు వెంటాడుతూ ఉంటే వారి నుంచి తప్పించేవాడు.మరెన్నోసార్లు లంబాడీ పిల్లలతోను, విలాసవతులతోను వారిని ఊరి వెలుపలికి తోలుకుని పోయేవాడు. ఎన్నో మంచి గుర్రాలు, అతను బండి త్వరగా తోలడంలో పడిపోయినాయి కూడా. ఆ వేగంలో ఎన్నోసార్లు ఎదురువచ్చే బండ్లను ఢీకొన్నాడు కూడా. తను, యజమానులు అని పిలుస్తూ వచ్చే వారిద్దరూ అతన్ని పోలీసులు పట్టుకోకుండా తప్పించేవారు. మధ్య మధ్యలో అతన్ని వారు కొడుతుండేవారు కూడా. అతన్ని వాకిట దగ్గర నిలబెట్టి లోపల వారు కులాసాగా కాలక్షేపం చేస్తూ అతన్ని మరిచిపోయేవారు. తిరిగి వచ్చిన తరువాత అతనికి కావలసినంత షాంపోనూ, మదీరా పానీయమూ ఇప్పించేవారు. ఆ పానీయమంటే బలాగాకు ఎంతో యిష్టం.వారి రహస్యాలన్నిటిలోనూ అతనికి పాలు ఉన్నది. వారు ఏ పనులు చేసినా అతనికి తెలియకుండా చేసే వారు కాదు. ఆ పనులు వారు చేయబట్టి సరిపోయింది కాని, వారుకాక మరెవరు చేసినా సైబీరియాకు తరలిపోవలసిందే! వారు ఉల్లాస కాలక్షేపాలు చేస్తున్నప్పుడు అతనిచేత తాగించి లంబాడీ పిల్లలతో నృత్యం చేయించేవారు. వారి డబ్బు వేల వేల రూబుళ్ళు అతని చేతుల్లో తిరిగేవి. సంవత్సరంలో ఎన్నోసార్లు ఇంచుమించు ఇరవైసార్లైనా అతను తన ప్రాణాలను ఒడ్డి ఉంటాడు. ఎన్నో గుర్రాలను పోగొట్టుకుని కూడా ఉంటాడు.

ఆనెటోల్, డొలొహోవ్‌లకు కూడా అతనంటే ఎంతో ఇష్టముండేది. బలాగా అందరితోనూ పెద్ద బేరం పెట్టేవాడు. రెండుగంటల ప్రయాణానికి ఇరవై అయిదు రూబుళ్ళు తీసుకునేవాడు. కాని తను మాత్రం ఎన్నడూ బండి తోలడానికి వెళ్ళే వాడు కాదు తన మనుష్యుల్లో ఎవరినో బండి తోలడానికి పంపించేవాడు. కాని తన యజమానులకు మాత్రం తనే స్వయంగా బండి తోలడానికి వెళ్ళేవాడు. ముందుగా బేరం మాట్లాడేవాడు కాదు. ఇంటి సేవకుల దగ్గరనుంచి ఇంట్లో బాగా డబ్బు మిగులు తున్నదని తెలుసుకొని తనే అనేక పర్యాయాలు వెళ్ళి వారికి కనిపిస్తూ వచ్చే వాడు. తనేదో పెద్ద అవసరంలో ఉన్నానని చెప్పి నేలకు అంటేటట్లు మొక్కుతూ వారిని డబ్బివ్వమని ప్రార్థించేవాడు. ఎప్పుడూ అతని యజమానులు అతన్ని నిలు చోనిచ్చేవారు కాదు, కూచోబెట్టేవారు. "ఫెడర్ ఇవనొలిచ్! అయ్యా! దొరగారూ! నాకో చిన్న సహాయం చెయ్యండి. నా గుర్రాలన్నీ పాతవై పోయినాయి. తమరే దైనా కొంచెం డబ్బిప్పించండి" అంటూ అతను డబ్బు తీసుకునేవాడు. ఆనెటోవ్, డొలొహోవ్‌లు; తమ చేతుల్లో బాగా డబ్బు ఆడుతున్నప్పుడు అతనికి ఒక్కొక్కరు రెండువేల రూబుళ్ళు చొప్పున అతనికి ఇచ్చేవారు.

బలాగాకు ఇరవై ఏండ్లు, పొట్టిగా ఉంటాడు. ఎర్రటి జుట్టు, చట్టి ముక్కు, చిన్నగడ్డం. నీలపురంగుకోటు వేసుకొని ఆపైన ఉన్నికోటు వేసుకొని వచ్చాడు. అతను వస్తూనే క్రాస్ చేసుకొని భగవంతుణ్ణి ప్రార్థించి, ముడతలు తేరిన చెయ్యిచాచి "ఫెడార్ ఇవనొలిచ్‌కి నమస్కారాలు!" అన్నాడు.

"వచ్చావా అబ్బాయ్, రా" అన్నాడు డొలొహోవ్, అతన్ని ఆహ్వానిస్తూ.

"అయ్యగారికి నా నమస్కారాలు" అన్నాడతను ఆనెటోవ్ వంక చూచి చెయ్యిచాస్తూ.

"బలాగా! నా మాట విను. నేనంటే నీకు ప్రేమే కదూ? ఆ విషయం ఇవాళ నీవు రుజువుచెయ్యాలి" అంటూ ఆనెటోవ్ అతని భుజంమీద చెయ్యివేసి "ఎలాంటి గుర్రాలు తెచ్చావేమిటి?" అని అడిగాడు.

"తమరు ఉత్తర్వు చేసినట్లే—అవే గుర్రాలు తీసుకొచ్చాను. మీకిష్టమయిన గుర్రాలే" అన్నాడు బలాగా.

"సరే,బలాగా ఇవాళ ఏం చేయాలో తెలుసా? ఆ గుర్రాలు ప్రాణాలు పోయినా సరే, ఇవాళ మూడు గంటల్లో నన్నక్కడికి చేర్చాలి" అన్నాడు ఆనెటోవ్.

"చనిపోతే అక్కడికెలా చేరగలుగుతాం?" అన్నాడు బలాగా, తన పరాచ కానికి తానే నవ్వుతూ.

"చేర్చకపోతే నిన్ను చంపేస్తాను! గమత్తు కాదు" అన్నాడు ఆనెటోవ్.

"గమ్మత్తుకేం? నేనెప్పుడైనా నా యజమానుల పని కాదన్నానా?...వాటిని మెరుపుతీగెల్లా పరుగెత్తిస్తాను. అంతే! చూడండి" అన్నాడు బలాగా.

"మంచిది. అయితే కూచో" అన్నాడు ఆనెటోవ్.

"కూచో" అన్నాడు డొలొహోవ్ కూడా.

"నిల్చుంటా లెండి."

"కూచోవోయ్!" అంటూ ఆనెటోవ్ ఒక పెద్ద గ్లాసులో మదీరా పానీయం పోశాడు. తనకిష్టమైన పానీయాన్ని చూడగానే బలాగా కళ్ళు మిల మిల మెరిశాయి. మొదట్లో మర్యాదకోసం వద్దన్నా తరువాత ఒక గ్రుక్కలో ఆ పానీయమంతా చుక్క మిగలకుండా తాగేశాడు. ఉన్ని టోపీలో అతనెప్పుడూ పెట్టుకుంటూ వచ్చే సిల్కు రుమాలుతో మూతి తుడుచుకున్నాడు.

"సరే, ఎప్పుడు బయలుదేరదా మంటారు దొరగారూ?" అని అడిగాడు బలాగా.

ఆనెటోవ్ తన గడియారం చూచుకొని "సరే త్వరలోనే బయలు దేరదాం. ఏమైనా మాత్రం, అలస్యం చెయ్యొద్దు బలాగా" అన్నాడు.

"మనం బయలుదేరితే ఇక ఆలస్యమెందుకవుతుంది?....మనం త్వరలోనే వెళ్ళిపోవచ్చు....ఒకమాటు మిమ్మల్ని టెర్‌నుంచి ఇక్కడికి ఏడుగంటల్లో తీసుకొని రాలేదా దొరగారూ? అప్పుడే మరిచిపోయారా?"

ఆనెటోవ్ ఆ విషయం జ్ఞాపకం తెచ్చుకొని చిరునవ్వు నవ్వుతూ మాకరైన్ వంక తిరిగి "చూడు! ఒకమాటు ఇతను క్రిస్‌మస్ పండగ రోజున మమ్మల్ని టెర్ నుంచి ఇక్కడికి ఎలా తీసుకొచ్చాడనుకున్నావ్? మా ప్రాణాలు ప్రాణాల్లో లేవు! గుర్రాలు పరుగెత్తుతున్నాయో లేక గాలిలో తేలిపోతున్నాయో మాకు తెలీలేదు!" అన్నాడు.

"ఆ గుర్రాలెలాంటి వనుకున్నారు? ఆ మూడు గుర్రాలూ ముత్యాల్లాంటివి దొరగారూ!" అంటూ బలాగా చెప్పసాగాడు. "వెర్రెత్తినట్లు నలభై మైళ్ళు గాలిలో ఎగిరిపోయినాయి. నేనుకూడా వాటిని పట్టలేక పోయాను. కళ్ళేలు వదిలేశాను.... 'ఇక మీరే చూచుకోవాలి అయ్యగారూ' అంటూ నేనుకూడా బండిలోనే కూచున్నాను! వాటినప్పుడు అలా వదిలిపెట్టడం తప్ప మనం చేయగలిగిందేమీ లేదు. ఇలా మూడు గంటలు ప్రాణాలు బిగపట్టుకొని ప్రయాణం చేశాం. చివరకు గుర్రాలకు ప్రాణాలు పోయేటంత పనైంది!" అన్నాడు.

## 56

ఆనెటోవ్ దుస్తులు వేసుకోవడానికి ప్రక్కగదిలోకి వెళ్ళాడు. మళ్ళీ కొద్ది నిముషాల్లో తిరిగి వచ్చాడు. ఉన్నికోటు, తోలుబెల్టు, నల్లనిటోపీ పెట్టుకొని వచ్చాడు.

ఆ టోపీ తలమీద ఒక ఓరగా పెట్టుకొన్నాడు. అలా పెట్టుకోవడం అతని ముఖాని కెంతో అందాన్నిస్తోంది. వచ్చి ఒకమాటు తన ముఖం అద్దంలో చూచుకొని టేబిల్ దగ్గరికి వచ్చి గ్లాసులో ద్రాక్షరసం పోసుకొని తాగాడు.

"అబ్బాయ్ డొలొహోవ్! ఇక సెలవు తీసుకోనా మరి? మీరు నాకు యింత సహాయం చేసినందుకు ఎంతో కృతజ్ఞుణ్ణి, వస్తాను మరి" అన్నాడు.

వారంతా కూడా తనతో వస్తున్నారని ఆనెటోవ్‌కు తెలుసు. అయినా ఒక దృశ్యాన్ని చూపుదామనుకున్నాడు. అంచాత మెల్లగా ఇలా మాట్లాడడం మొదలు పెట్టాడు, "మీరు మీ మీ గ్లాసులు పుచ్చుకొని తాగండి, నీవు కూడా నీ గ్లాసు పుచ్చుకో బలాగా. నా చిన్ననాటి స్నేహితులారా! మనమంతా కలిసి ఆనందించాం. కలిసి ఎన్నో తప్పులు చేశాం. మళ్ళీ మనం ఎప్పుడు కలుసుకుంటామో, ఏమో! నేను దూరదేశాలు వెడుతున్నాను. వస్తాను అబ్బాయిల్లారా!" అంటూ ఆనెటోవ్ ఒక్క గుక్కలో పానీయమంతా తాగేసి గ్లాసును నేలకేసి విసిరికొట్టాడు.

"మీ ఆరోగ్యం కోసం" అంటూ బలాగా కూడా తన గ్లాసు ఖాళీచేసి చేతి రుమాలుతో గడ్డం తుడుచుకున్నాడు. మాకరైన్ కన్నీళ్ళతో ఆనెటోవ్‌ను కౌగలించుకుని "రాకుమారా! మళ్ళీ మనం ఎప్పటికి కలుసుకుంటామో?" అన్నాడు.

"సరే ఇక వెడదాం" అని ఆనెటోవ్ "ఒక్క నిముషం" అంటూ బలాగాతో" * ఆ తలుపు మూసి కూచో" అన్నాడు.

బలాగా అలాగే చేశాడు, "సరే, ఇక వెడదాం" అంటూ ఆనెటోవ్ లేచాడు.

అతని సేవకుడు జోసెఫ్ అతనికి డబ్బు సంచిని, కత్తిని అందించాడు. వారు హాలులోకి వచ్చారు.

"పైన వేసుకునే ఉన్నికోటు ఏదీ?" అని అడిగాడు డొలొహోవ్.

"ఇదిగో ఇగ్నట్కా,నీవు వెళ్ళి మాత్రేనా నడిగి నల్లని ఉన్నికోటు తీసుకురా. నే నీ లేవనెత్తుకపోవడాన్ని గురించి చాలా విని ఉన్నాను" అని మళ్ళీ "ఆవిడ ఈ విషయం విన్నదంటే పై ముసుగు కూడా వేసుకోకుండా పరుగెత్తుకుంటూ వస్తుంది: ఆలస్యం చేశారూ అంటే కన్నీళ్ళు తప్పవు. అమ్మ, నాన్న కూడా చూస్తారు.ఆవిడను ముసుగులోకప్పి బండిలో ఉంచేసెయ్యి" అన్నాడు మళ్ళీ డొలొహోవ్.

సేవకుడు ఆ ఉన్నికోటు తీసుకుని వచ్చాడు.

"ఇదేమిటి, ఇది తీసుకొని వచ్చావు? నేను తెమ్మన్నది నల్లటిది" అంటూ డొలొహోవ్ "మెత్రోష్కా!" అని పిలిచాడు.

---

* ప్రయాణంలో శుభం కలగడం కోసం ఇది రష్యాలో అనుసరించే ఒక ఆచారం.

ఆ పిలుపుకు ఒక చక్కని లంబాడీపిల్ల పరుగెత్తుకుంటూ వచ్చింది. శాలువా కప్పుకుని ఆ ఉన్నికోటు తీసుకుని వచ్చింది. సన్నగా పాలిపోయి ఉంది ఆ పిల్ల.

"ఇదిగో తీసుకోండి నా కెందుకు?" అన్నది. డొలొహోవ్, తన సేవకుడి కిచ్చిన ఉన్నికోటును ఆమెమీద కప్పాడు.

"అయితే" అంటూ ఆ ఉన్నికోటును ఆ పిల్లకు నిండుగా కప్పి, "ఇక చివ రకు ఏం చేయాలో తెలుసా?" అంటూ ఆమెను అనెటోవ్ ముందుకు తోశాడు. అనెటోవ్ ఆవిడ పెదవులను ముద్దాడాడు.

"వస్తాను మెట్రూషా్కా! ఇవాల్టితో ఇక్కడి నా తప్పులు ఆఖరైనట్లే, ఇక నా శుభం కోరుకో" అన్నాడు అనెటోవ్.

"మీకు శుభం కలుగుతుంది గాక!" అన్నదా పిల్ల.

వారు మెట్లు దిగి వచ్చేసరికి ఒక మూడుగుర్రాల బగ్గీ నిలుచుని వుంది. బలాగా బండిలో ఎక్కి కూచుని కళ్ళేలు సరి చేయడం మొదలెట్టాడు. అనెటోవ్, డొలొ హోవ్‌లు బండిలో ఎక్కారు.

"తయారుగా ఉన్నారా?" అని అడిగాడు బలాగా. "సరే, వెడదాం" అంటూ కళ్ళేలు వదిలాడు.

గుర్రపుబగ్గీ పెద్ద వేగంతో నికిట్‌స్కీ బోలివార్డు వీధిలోగుండా సాగి పోయింది.

"చూడండి, చూడండి!" అంటూ బండి తోలేవాళ్ళు అరుస్తూ ఉన్నారు.

అర్‌బట్‌స్కియా కూడలి దగ్గరికి వచ్చేసరికి మరోబండి వచ్చి బండిని ఎదుర్కొన్నది. బండ్లు ఢీకొని కేకలు వినిపించాయి. కాని అదే వేగంతో తరువాత బండి పరుగెత్తుకుని పోయింది. ఇలా పరుగెత్తిన బండి పాతస్టేబుల్స్ స్ట్రీట్ మూలలో నిలుపు చేశారు.

అనెటోవ్, డొలొహోవ్‌లు బండిదిగి పెరటివాకిలి దగ్గరికి వెళ్ళారు. డొలొ హోవ్ ఈల వేశాడు. కాని ఈలకు జవాబు లేదు. ఒక పిల్ల మాత్రం పరుగెత్తు కుంటూ వచ్చింది.

"ఇలా రండి—ఇక్కడికి! లేకపోతే మిమ్మల్ని ఎవరైనా చూస్తారు. ఆ పిల్ల వస్తోంది" అన్నది పరిచారిక.

డొలొహోవ్ వాకిట దగ్గిర నిలుచున్నాడు. అనెటోవ్ ఆ పిల్ల వెనకాలే వెళ్ళి ఇంటిమూలకు వెళ్ళాడు. మెట్ల దగ్గరికి వెడుతూ ఉండగా పొడుగ్గా ఉన్న ఒక సేవకుడు అతనికి అడ్డు వచ్చాడు.

"మా అమ్మగారు మీకోసం చూస్తున్నారు" అన్నాడు సేవకుడు.

"ఎవరు ? ఏ అమ్మగారు ? నీ వెవరూ ?" అని అడిగాడు అనెటోవ్ ఆశ్చర్యంతో.

"రండి. ఆవిడ మిమ్మల్ని లోనికి తీసుకురమ్మని నాకు ఉత్తర్వు చేసింది."

"కారగైన్ ! పరుగెత్తు ! వెనక్కురా ! మోసం !" అని అరిచాడు డొలొహోవ్.

డొలొహోవ్ వెనకాల గేటుదగ్గర గేటు మూయడానికి ప్రయత్నిస్తున్న కాపలా వానితో గొడవ పడుతున్నాడు. అనెటోవ్ పరుగెత్తుతూ వెనక్కు వస్తున్నాడు.

ఎలా గైతేనేం, చివరకు డొలొహోవ్ కాపలావాణ్ణి అవతలికి తోసి అనెటోవ్‌ను భుజం పట్టుకుని లాగి వీధిలోకి లాక్కుని వచ్చాడు. ఇద్దరూ కలిసి పరుగుతీస్తూ బండి దగ్గరికి చేరుకున్నారు.

## 57

మేరియా డిమిట్రోవ్‌నా వచ్చేసరికి సోనియా వసారాలో పడుకుని ఏడుస్తోంది. సోనియా నడిగి ఆమె విషయమంతా తెలుసుకుంది. నటాషాకు అనెటోవ్ వ్రాసిన ఉత్తరం తీసుకుని సరాసరి నటాషా దగ్గరికి వెళ్ళింది,

"పాడుపిల్లా ! ఏమిటీ సిగ్గుచేటు పని ?" అని చీవాట్లువేసి "ఇక నాతో ఒక్క మాటకూడా మాట్లాడకు. నేనేమీ విననుు" అంటూ నటాషాను ఒక ప్రక్కకు నెట్టింది. ఎండి ఆరిపోయిన కళ్ళతో నటాషా ఆమె వంక ఆశ్చర్యంతో చూస్తూ నిలుచుంది. తరువాత డిమిట్రోవ్‌నా తాళపు చెవి తీసుకుని నటాషాను ఒక గదిలో పెట్టి తాళం వేసింది. తరువాత గేటు కాపలాదారు దగ్గరికి వెళ్ళి, ఆ రాత్రి ఎవరైనా వస్తే వారిని లోనికి రానిచ్చి ఆ తరువాత తలుపులు మూసివెయ్యమని చెప్పింది. తరువాత కాపలాదారు వారు తప్పించుకుని వెళ్ళారని చెప్పగా ఆమె కోపంతో మండిపోతూ గదిలో అటూ ఇటూ తిరగసాగింది. ఇక తానేం చెయ్యాలా అని ఆలోచించసాగింది. సగం రాత్రి గడుస్తూ ఉండగా మళ్ళీ తాళపుచెవి తీసుకుని నటాషాను చూడడానికి వెళ్ళింది. సోనియా ఇంకా తలుపుదగ్గర పడుకుని ఏడుస్తూనే ఉంది.

"మేరియా డిమిట్రోవ్‌నా ? నన్ను లోనికి వెళ్ళనివ్వు" అని సోనియా అడిగింది. డిమిట్రోవ్‌నా మారుమాట్లాడకుండా తను గదితలుపు తెరుచుకుని లోపలికి వెళ్ళింది.

"ఏమిటీ సిగ్గుచేటు పని ? ఈ ఇంట్లో ? అయినా మీ నాన్నగారిపట్ల సానుభూతి ఉన్నదాన్ని కనుక ఆయనతో ఈ విషయం చెప్పనులే" అన్నది డిమిట్రోవ్‌నా నటాషా దగ్గరికి వెడుతూ. అప్పుడు నటాషా సోఫాలో పడుకుని ఉంది. ఆమె వెనక్కు తిరిగి చూడలేదు. వెక్కివెక్కి ఏడుస్తోంది.

మేరియా డిమిట్రోవ్నా వెనక్కి తిరిగి సోనియావంక చూచి, నటాషాను ఉన్న సోఫా చివర కూచుని "చాలా మంచిపని చేశావు! నా ఇంట్లో ఇలాంటి గొడవలు తీసుకొచ్చి పెట్టావు. అందరి పిల్లల్లాగానే నీవు కూడా ప్రవర్తించావు. నేను చెయదలుచుకుంటే నిన్నేం చేసేదాన్నో! అయినా దయతలచి వదిలిపెడుతున్నాను. మీ నాన్నతో ఈ విషయం చెప్పబోవడం లేదు. వారి అదృష్టం బాగుండి నా చేతుల్లోనుంచి తప్పించుక పోయారు. తెలుస్తున్నదా నే చెప్పింది?" అంటూ నటాషా గడ్డంక్రింద చెయ్యి ఉంచి ఆమె ముఖాన్ని తనవైపుకు తిప్పుకుంది. ఆమె సోనియా, ఇద్దరూ డిమిట్రోవ్నాను చూడగానే ఉలిక్కిపడ్డారు. నటాషా కళ్ళు ఆరిపోయినట్లుగా మిలమిల మెరుస్తున్నాయి. పెదవులు గట్టిగా బిగపట్టుకుని ఉంది. బుగ్గలు లోపలికి పీక్కొని పోయాయి.

"నేనేం చెయ్యను ?...చనిపోతాను !" అంటూ ఆవిడ పట్టు తప్పించుకుని ముఖాన్ని అవతలికి తిప్పి దాచేసుకుంది.

"నటాషా! నా మాట విను. నేను నీ చెడుకోరి చెప్పడం లేదు. నీ విలాగే ఉండదలుచుకుంటే ఇలాగే ఉండు. నిన్నేమీ అనను. కాని ఒక్కమాట విను....నీవు చేసిన పని ఎలాంటిదో నేను చెప్పదలుచుకోలేదు. ఆ విషయం నీవే తెలుసుకోవాలి... రేపు మీ నాన్న ఊరినుంచి తిరిగొస్తున్నాడు. ఆయనకు నేనేం చెప్పాలి?" అన్నది డిమిట్రోవ్నా.

నటాషా దీనికి సమాధానం చెప్పలేదు. నిశ్వసించి ఊరుకుంది.

"నీ తండ్రికి, నీ అన్నకు, కానున్న నీ భర్తకు ఈ విషయాలు తెలియకపోవు" అన్నది మళ్ళీ డిమిట్రోవ్నా.

"నాకు కానున్న భర్త ఎవరూ లేరు! నేను ఆయన్ను నిరాకరించాను" అన్నది నటాషా.

"అయితేమటుకు ఏం? మీ నాన్నకు తెలిస్తే ఏమవుతుంది? అతనితో తగాదా పడొచ్చు."

"నన్నొదిలిపెడుదూ! నీవన్నీ పాడు చేశావు! ఎందుకు చేసినట్లు? అసలు నిన్నెవరు జోక్యం కలిగించుకోమన్నారు?" అన్నది నటాషా, సోఫాలోనుంచి లేచి కూచుని మేరియా డిమిట్రోవ్నా వంక చూస్తూ.

"ఏమిటీ నీ ఉద్దేశం?" అన్నది డిమిట్రోవ్నా. ఇక తన ఓరిమిని కోల్పోయి "నిన్నేం కాళ్ళూ, చేతులూ కట్టేసి దాచిపెట్టామనుకుంటున్నావా? అతన్ని ఇంట్లోకి ఎవరు రావద్దన్నారు? నీ వతనితో చాటుమాటుగా లేచిపోవలసిన అవసరం ఏమొచ్చింది? నీవు వెళ్ళిపోయినా నిన్ను మళ్ళీ తీసుకురాలేమనుకుంటున్నావా?" అని అడిగింది.

"మీ అందరికంటె అతను మంచివాడే!" అన్నది నటాషా. "మీరు జోక్యం కలిగించుకోకపోతే ఇలా అయి ఉండేది కాదు. అయ్యో! భగవంతుడా!ఇలా ఎందుకు చేశావు? సోనియా! నీవిలా ఎందుకు చేశావు?" అంటూ నటాషా నిరాశ చెందినట్లు మళ్ళీ మళ్ళీ వెక్కి వెక్కి ఏడవసాగింది. మేరియా డిమ్రిట్రోవ్‌నా ఆమెను ఓదార్చ డానికి యత్నించింది. కాని నటాషా ఆమె మాట వినిపించుకోకుండా "వెళ్ళు! మీ అందరికీ నేనంటే అసహ్యం" అన్నది.

అయినప్పటికీ వృద్ధురాలు అక్కడనుంచి కదల్లేదు. తన ఉపన్యాసం సాగి స్తూనే ఉంది. ఆ పిల్ల తండ్రికి ఈ విషయాన్ని తెలియచేయకూడదనీ, నటాషా కూడా ఈ విషయమంతా మరిచిపోయి ఎక్కడా పొక్కనీయకూడదనీ బోధ చేస్తోంది. నటాషా ఏమీ జవాబు చెప్పలేదు ... కాని వెంటనే ఏడవడం మాత్రం మానేసి వణికిపోతూ మూర్ఛలో పడిపోయింది. మేరియా డిమ్రిట్రోవ్‌నా, ఆమె తల క్రింద దిండ్లుపెట్టి వెచ్చగా దుప్పట్లు కప్పి కొంచెం నిమ్మపువ్వురసం తెచ్చి ఆమె ప్రక్కన పెట్టి, ఇక ఆమె నిద్రపోతుంది లెమ్మని అనుకుని తన గదిలోనుంచి వెళ్ళిపోయింది. కాని నటాషా మ్మాత్రం నిద్రపోలేదు. ఆవిడ కళ్ళు తెరుచుకునే ఉన్నాయి. ముఖం తెల్లగా పాలిపోయి ఉంది. కన్నీళ్ళు మ్మాత్రం కార్చడం లేదు. ఆ రాత్రి అనేకసార్లు ఆడవిను చూడడానికి సోనియా ఆవిడ దగ్గరకు వచ్చింది. కాని ఆవిడను చూచి ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది.

ఆ మరుసటిరోజు కౌంట్ వచ్చాడు. ఆయనెంతో ఉత్సాహంగా ఉన్నాడు. తన ఎస్టేటు అమ్మకం విషయంలో ఒక ఏర్పాటు చేసుకుని వచ్చాడు. అంచాత ఇక అతను మాస్కోలో ఉండవలసిన అవసరమేమీ లేదు. వెంటనే వెళ్ళి కౌంటెస్‌ను చూడాలని ఆతృతపడుతూ ఉన్నాడు. మేరియా డిమ్రిట్రోవ్‌నా ఆ క్రితంరోజు నటాషాకు శరీరం అస్వస్థగా ఉన్నదనీ, తను డాక్టరు కోసం కబురు పంపాననీ కాని ఇప్పుడు కాస్త తేరుకున్నదనీ కౌంట్‌తో చెప్పింది.

ఆ ఉదయమంతా నటాషా బయటికి రాకుండా తన గదిలోనే కూచుంది. కిటికీ దగ్గర కూచుని ఆరిపోయిన కళ్ళతో వీధిలో తోవన వచ్చిపోయే వారిని చూస్తోంది. గది తలుపులు చప్పుడైనప్పుడల్లా ఎవరు వస్తున్నారా అని వెనక్కు తిరిగి తలుపువంక చూస్తోంది. ఆనెటోవ్ వస్తాడనీ, లేకపోతే ఉత్తరమైనా పంపు తాడనీ అనుకుంటోంది.

తండ్రి అడుగులచప్పుడు వినపడగానే ఉలిక్కిపడి లేచింది. ఒక్క క్షణం ఆమె ముఖం విప్పారి మళ్ళీ కుంచించుకొని పోయింది. ఆమె కూచున్న చోటు నుంచి లేవలేదు కూడా.

"ఏమిటమ్మాయ్ ఇలా ఉన్నావ్? జబ్బుగా ఉందా? అని అడిగాడు తండ్రి.

"అవును" అన్నది నటాషా. ఒక క్షణం మౌనంగా ఊరుకుని.

ఆయన ఆతురతతో అనేకప్రశ్నలు వేశాడు. తనకూ, ఆండ్రూకు మధ్య ఏదైనా గొడవజరగడంవల్ల ఇలా ఉన్నదా అని అడిగాడు. అలాంటిదేమీ జరగ లేదని, ఆందోళన పడవలసిన పనిలేదనీ ఆమె జవాబు చెప్పింది. ఆ పిల్ల చెప్పింది నిజమేనని మేరియా డిమిత్రోవ్‌నా కూడా రుజువు పలికింది. అయినప్పటికీ కౌంట్‌కు మాత్రం తన అనుమానాలు పోలేదు. తను లేనప్పుడు ఏదో జరిగి వుంటుందని తన కుమార్తె అస్వస్థతను బట్టిన్నీ, సోనియా డిమిత్రోవ్‌నాల ముఖాల మార్పునుబట్టిన్నీ తెలుసుకున్నాడు. తను లేనప్పుడు తప్పక ఏదో జరిగి ఉంటుందని స్పష్టంగా అను కున్నాడు. కాని తన గారాబు కుమార్తెకు ఏదైనా జరగరాని విషయం జరిగిందని తెలుసుకోవడానికి భయపడి, దానివల్ల తన హాయి చెడిపోవచ్చునని బయపడి దానిని గురించి ఏమీ ప్రశ్నించలేదు. అది అంత పెద్ద విషయం అయి ఉండదని తన్ను తాను సమాధానపెట్టుకుని తను మామూలుగా ఉత్సాహంగానే ఉన్నాడు. కాని నటాషా అనారోగ్యంగా ఉన్నకారణంవల్ల ఆయన తన గ్రామానికి వెళ్ళిపోకుండా మరికొన్ని రోజులు అక్కడే ఉండిపోవలసి వచ్చింది.

# 58

తన భార్య మాస్కోకు వచ్చినప్పటినుంచీ పీటర్ మాస్కో వదిలి వెడదా మనే అనుకుంటున్నాడు. ఆమెతో నివసించడం తప్పిపోతుంది. కదా అని అలా అనుకుంటూ వచ్చాడు. అదీకాక రోస్టోవ్‌లు మాస్కోకు వచ్చిన తరువాత నటాషా పట్ల అతనికి ఇటీవల కలిగిన భావం అతన్ని త్వరలోనే వెళ్ళిపోయేటట్లుగా చేసింది. అతను ట్వెర్ వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చాడు.

అతను తిరిగి వచ్చిన తరువాత మేరియా డిమెత్రోవ్‌నా అతన్ని చూడాలని కోరుతూ వ్రాసిన ఉత్తరం ఆతనికి అందచేయబడింది. ఆండ్రూకు, నటాషాకు సంబంధించిన ఒక ముఖ్యమైన విషయాన్ని అతనితో మాట్లాడాలని ఆమె ఆ ఉత్త రంలో వ్రాసింది. కొంతకాలం నుంచి పీటర్ నటాషాకు దూరంగా తొలిగి ఉంటు న్నాడు. వివాహితుడైన ఒక వ్యక్తికి, తన స్నేహితుడికి భార్యకాగల స్త్రీపై కలగ కూడని భావం ఇటీవల అతనికి కలుగుతూ ఉంది. అతని నిశ్చయాలెలా ఉన్నప్ప టికీ అతనెప్పుడూ ఆవిడను కలుసుకుంటూనే ఉన్నాడు.

"ఏం జరిగిందేమిటి? ఇప్పుడు నేనేం చెయ్యాలి? అనుకున్నాడు పీటర్ తనలో తాను. డిమిత్రోవ్‌నా ఇంటికి వెళ్ళడానికి ముస్తాబు చేసుకుంటూ, "ఆండ్రూ త్వరలో వచ్చి ఆవిడను వివాహం చేసుకుంటే ఎంత బాగుంటుంది?" అనుకున్నాడు.

అతను బోలివార్డు దాడివెడుతూ ఉండగా అతన్ని ఎవరో పిలిచారు. "పీటర్! ఎంతకాలమైందోయ్ వచ్చి?" అని అడిగాడు.

పీటర్ వెనక్కు తిరిగి చూచాడు. ఒక చక్కని బండిలో కూచుని అనెటోవ్ అతని స్నేహితుడు డొలొహోవ్, మెరుపుతీగెలా బండిని పరుగెత్తిస్తున్నారు. బండి వెడుతూ ఉంటే బండి ముందు మంచుపొగ మబ్బులా రేగుతూ ఉంది. అనెటోవ్ ఒక బఫూన్‌లాగా ఒక పోజు పెట్టి కూచున్నాడు. అతని ముఖం కోటు కాలర్‌లో కొంత దాగి ఉంది. ముఖం ఎర్రగా గులాబీవన్నె తేలి వుంది. హేటుకు తెల్లని ఈకె పెట్టుకుని ఉన్నాడు. చక్కని మంచు జల్లు అతని జుట్టుపై రాలి ఉంది.

"నిజంగా వీడు వేదాంతే! ప్రస్తుత సుఖం తప్ప మరేమీ ఆలోచించడు. ఎప్పుడూ ఏ గొడవలూ లేవు. ఎప్పుడూ కులాసాగా సుఖంగా ఉంటాడు. వీడిలాగా నేనుండ గలిగితే ఎంత బాగుండును!" అనుకున్నాడు పీటర్.

పీటర్, మేరియా డిమిట్రోవ్‌నా ఇంటికి చేరుకున్నాడు. ఆమె సేవకుడు వచ్చి అతన్ని లోపలి గదిలోకి తీసుకుని వెళ్ళాడు అతను హాలులో నుంచి వెడుతూ ఉండగా నటాషా కిటికీదగ్గర కూచుని ఉండడం కనిపించింది. ఆవిడ ముఖం వివర్ణమై శుష్కించిపోయి ఉంది. అతను రాగానే ఆవిడ లేచి నిలుచుని ఆ గదిలోనుంచి వెళ్ళిపోయింది.

"ఏం జరిగింది?" అని అడిగాడు పీటర్ యజమానురాలి గదిలోకి వెడుతూ,

"ఏం జరగడమేమిటి ? చాలా గ్రంథం జరిగింది ! నాకు యాభైఆరేండ్లు వచ్చాయి. కాని నేను ఇలాంటి విడ్డూరం ఎన్నడూ చూడలేదు" అంటూ మేరియా డిమిట్రోవ్‌నా తరువాత తను విన్న విషయం ఎవరితోనూ చెప్పనని పీటర్‌వద్దనుంచి వాగ్దానం తీసుకుని నటాషా తన తల్లిదండ్రులతో కూడా ఆలోచించకుండా ఆండ్రూ రాకుమారునితో వివాహం నిరాకరించిందనీ, దీనికి కారణం ఆనెటోవేననీ, పీటర్ భార్య వారిద్దరికీ సంధాన కర్తగా వ్యవహరించిందనీ చెప్పింది. నటాషా తన తండ్రి లేని సమయంలో రహస్యంగా అనెటోవ్‌తో లేచిపోయి వివాహం చేసుకోవడానికి ప్రయత్నించిందని కూడా చెప్పింది.

పీటర్ ఇదంతా నోరు తెరుచుకుని విన్నాడు. తన చెవులను తానే నమ్మలేక పోయాడు. ఆండ్రూ ఇంతగా ప్రేమించిన నటాషా, అనెటోవ్ లాంటి వట్టి వెధవను ఎలా ప్రేమించగలిగిందనీ, ఆండ్రూతో ఎలా సంబంధం విచ్ఛిత్తి చేసుకోకలిగిందని, అనెటోవ్‌తో ఎలా లేచిపోవడానికి సిద్ధపడిందనీ ఆశ్చర్యపోయాడు. ఇదంతా అతనికి అయోమయంగా కనిపించింది. ఇది నమ్మలేకపోయాడు కూడా.

నటాషా చక్కని ముఖాన్ని ఊహించుకున్నప్పుడు ఆవిడ ఇలాంటి నీచపు పని చేస్తుందని అతను అనుకోలేదు.

"వీరందరూ ఇంతే!" అనుకున్నాడు తన భార్య విషయం జ్ఞాపకం తెచ్చుకుంటూ, "ఇలా భ్రష్టురాలయిన స్త్రీ పాల్పడినవాణ్ణి నే నొకణ్ణే కాదు!" అనుకుంటూ తన స్నేహితుని కోసం చింతించసాగాడు. ఇలా జరిగినందుకు అతని అభిమానం ఎంతగా దెబ్బతింటుందో అనుకున్నాడు. అతన్ని గురించి చింతించిన కొద్దీ పీటర్‌కు నటాషాపట్ల అసహ్యము మరింత ఎక్కువ కాసాగింది. కొద్ది క్షణాలక్రితమే ఆమె తన కళ్ళముందు గడ్డకట్టుకుని పోయిన వ్యక్తిలాగా నడిచిపోయింది. పైకి కనిపిస్తున్న ఆ అభిమానపు ముసుగు వెనకాల ఆ పిల్ల హృదయం ఎంతో పతనావస్థలో, ఎంత అవమానంలో కొట్టుకలాడుతున్నదో పీటర్ ఊహించాడు.

"అనెటోవ్‌ను పెళ్ళిచేసుకోవడమా? అది అసాధ్యం. అతనికిదివరకే పెళ్ళయింది!" అన్నాడు పీటర్.

"పెళ్ళయిందా?" అన్నది మేరియా ఆశ్చర్యంతో. "ఆ, మరీ మంచిది. వాడింతటివాడన్నమాట! వాడేదో తనను ఉద్ధరిస్తాడనుకుంటుది ఈ పిల్ల!... సరే ఇదంతా ఆవిడకు చెపుతాలే...దాంతో అతనిపై ఆవిడకుగల ఆశలన్నీ తీరిపోతాయి" అన్నది.

పీటర్‌నుంచి ఆనెటోవ్ వివాహ విషయాలన్నీ తెలుసుకున్న తరువాత మేరియా డిమిట్రోవ్‌నా అతన్ని నోరార తిట్టి చివరకు పీటర్‌ను ఎందుకుపిలిపించిందీ చెప్పింది. కౌంట్‌కాని, ఆండ్రూకాని త్వరలోనే రావచ్చుననీ, ఒకవేళ దాచిపెట్టినప్పటికీ ఈ విషయం వారికి తెలిసి ఆనెటోవ్‌పై ద్వంద్వ యుద్ధానికి దిగవచ్చుననీ అన్నది. అందుచేత తక్షణమే ఆనెటోవ్‌ను మాస్కో నుంచి పంపించెయ్యమని పీటర్‌ను కోరింది. పీటర్ ఇదంతా ఆలోచించుకునే తీరిక లేక ఆమె చెప్పినట్లు చేస్తానని మాట ఇచ్చాడు.

"కౌంట్‌తో ఒక్కమాట కూడా చెప్పకు. నీకేమీ తెలియనట్లుగా ఉండు. అతను కలిసినా సరే అతని ముందు ఈ మాటలేవీ తీసుకురాకు. నే వెళ్ళి ఆవిడతో అన్ని విషయాలు చెపుతాలే" అని చెప్పి మేరియా డిమిట్రోవ్‌నా వెడుతూ పీటర్‌ను భోజనానికి ఉండమని కూడా అడిగింది.

ఆ తరువాత కౌంట్ అక్కడికి వచ్చాడు. ఎంతో ఆందోళనతో ఉన్నాడు. ఆండ్రూకు, తనకు జరిగిన విచ్ఛిత్తిని గురించి అప్పుడే నటాషా ఆయనకు తెలియచేసింది.

కౌంట్ రావడంతోటే "నే నిప్పుడు చాలా కష్టంలో ఉన్నానబ్బాయ్! నీకు తెలిసిందో లేదో? ఈ పిల్లలతో మరీ చిక్కుగా ఉంది. అదీకాక తల్లి దూరంలో ఉంది. ఇప్పుడు నేనీ ఊరు ఎందుకు వచ్చానా అని విచారిస్తున్నాను. ఈ అమ్మాయిని ఇక్కడికి తీసుకొచ్చినందుకు ఎంతో చింతిస్తున్నాను. ఏం చేసిందో తెలుసా?

నీకు ఉన్నమాట చెపుతున్నాను. ఆంద్రూతో వివాహం కాదన్నది! నా సలహా కూడా తీసుకోలేదు. నాకూ ఈ పెండ్లంటే అంత ఇష్టం లేదనుకో. ఆ రాకుమారుడు చాలా మంచివాడే అయినా నటాషాకు అక్కడ సుఖం ఉంటుందని అనుకోను. నటాషా కెప్పుడూ వరుల కొరత ఏమీ ఉండదు. నాకు ఆందోళన కలిగిస్తున విషయ మల్లా ఒక్కటే. ఇంతకాలం ఈ సంబంధం ఇలా సాగి హఠాత్తుగా నా సలహా కాని తల్లి సలహా కాని లేకుండా చెడిపోయిందన్న విషయమే. పిల్లలు తల్లికి దూరంగా ఉండడం ఏ మాత్రం మంచిది కాదు" అని చెప్పాడు పీటర్‌తో.

కౌంట్ చాలా కలవరపడుతున్నాడని గమనించి పీటర్ ఆ విషయాన్ని మారు ద్దామని ప్రయత్నించాడు. కాని కౌంట్ మాత్రం మళ్ళీ మళ్ళీ అదే విషయం చెప్ప సాగాడు.

"నటాషాకు అంత స్వస్థతగా లేదు" అంటూ అంతలో సోనియా లోపలికి వచ్చింది. "మిమ్మల్ని చూడాలని కోరుతోంది. మేరియా డిమిట్రోవ్నా కూడా అక్కడే ఉంది. మిమ్మల్ని రమ్మంటుంది" అని చెప్పింది పీటర్‌తో.

"చూచావా ? నీకూ ఆంద్రూకు స్నేహమన్న విషయం ఆ అమ్మాయికి తెలుసు. నీ చేత అతనికేదో కబురు పంపుదామనుకుంటుంది" అన్నాడు కౌంట్. ఇలా అని మళ్ళీ "అంతా పూర్వం ఎంత బాగుంటూ ఉండేది!" అనుకుంటూ ఆ గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

అనెటోవ్‌కు ఇంతకుముందే పెళ్ళయిందన్న విషయం మేరియా డిమిట్రోవ్నా, నటాషాతో చెప్పింది. నటాషా మొదట్లో నమ్మలేదు. పీటర్ స్వయంగా చెపితే కాని నమ్మనన్నది. సోనియా పీటర్‌ను వరండాలో గుండా తీసుకునిపోతూ అతనితో ఈ విషయం చెప్పింది. పీటర్ వెళ్ళి చూచేసరికి నటాషా ముఖం వివర్ణంగా ఉంది. గడ్డ కట్టుకునిపోయిన దానిలా కూచుని ఉంది.

"ఈ విషయం నిజమేనా?" అన్నట్లు పీటర్ ముఖంలోకి తదేకంగా చూడ సాగింది. అతను అనెటోవ్ స్నేహితుడా లేక శత్రువా అన్న విషయం మాత్రమే ఆవిడ గమనిస్తున్నట్లుగా ఉన్నది. కాని మరేదీ పట్టించుకున్నట్లు లేదు.

"నేను చెప్పింది నిజమో కాదో — అన్ని విషయాలు అతనే చెప్పుతాడు" అన్నది మేరియా డిమిట్రోవ్నా!

నటాషా వేటగాళ్ళమధ్య, కుక్కలమధ్య చిక్కుకున్న ఒక జంతువు లాగా వారి వంక చూచింది.

"నటాషా ఇల్‌నిష్‌నా!" అని పీటర్ ఆ పిల్లను పిలిచాడు. అప్పుడు ఆవిడ పట్ల అతనికి జాలి కలిగింది. "ఏమైనప్పటికీ ఇందులో మించిపోయిందేమీ లేదు..." అని చెప్పబోయాడు.

"అయితే అతనికి పెళ్ళయింది అబద్ధం కదూ?" అని అడిగింది నటాషా.

"కాదు, నిజం!" అని చెప్పాడు పీటర్.

"ఎంత కాలమైంది పెళ్ళయి? చాలా కాలమైందా?"

"నిజంగానా?"

"నిజం."

"అతనిప్పుడిక్కడే ఉన్నాడా?"

"అతనిప్పుడే నాకు వీధిలో కనిపించాడు."

ఇక ఆవిడ మాట్లాడలేకపోయింది. చే సైగతో వారిని వెళ్ళమని కోరింది — తనను ఒంటిగా వదలి వెళ్ళమని కోరింది.

# 59

పీటర్ అక్కడ భోజనానికి ఉండలేదు. నటాషా గదిలో నుంచి బయటికి రాగానే ఆనెటోవ్ ఎక్కడున్నాడా అని వెదుకుతూ వెళ్ళాడు. అతని పేరు చెపితేనే వళ్ళు మండిపోతుంది. ఊపిరి కూడా సలపడం లేదు. మంచు కొండల్లోనూ, లంబాడీ వాడల్లో; ప్రతిచోటా అతన్ని వెదుకుతూ వెళ్ళాడు. చివరకెక్కడా కనిపించక క్లబ్‌కు వెళ్ళాడు. అతనక్కడికి వెళ్ళేసరికి అంతా మామూలుగానే సాగుతోంది. విందు భోజనం కోసం వచ్చిన అతిథులు తమ మామూలుస్థానాల్లో కూచుని ఆనాటి వార్తలు చర్చించుకుంటున్నారు. అతని అలవాట్లు తెలిసిన ఒక సేవకుడు అతని దగ్గరికి వచ్చి చిన్న భోజనశాలలో ఒక టేబిల్ అతని కోసం సిద్ధంగా ఉన్నదనీ, మైఖేల్ రాకుమారుడు రీడింగ్‌రూంలో కూచుని ఉన్నాడనీ, పాల్ ఇంకా రాలేదని చెప్పాడు. తరువాత అక్కడ కూచుని కబుర్లాడుతున్న ఒక వ్యక్తి మధ్యలో ఆగి నటాషా రోస్టోవ్, ఆనెటోవ్, కారగైన్‌తో లేచిపోయే విషయం ఏమిటనీ, ఊళ్ళో అంతా ఆ విషయమే చెప్పుకుంటున్నారనీ పీటర్‌ను అడిగాడు. పీటర్ నవ్వి అదంతా అబద్ధమని చెప్పాడు. తాను అప్పుడే రోస్టోవ్‌ల ఇంటినుంచి వస్తున్నానని కూడా చెప్పాడు. తరువాత ఆనెటోవ్ వచ్చాడా అని అడిగారు. ఇంకా రాలేదని, వస్తాడని అనుకుంటున్నారని ఆ వ్యక్తి చెప్పాడు.

తనతో ఇలాంటి తుఫాను చెలరేగుతూ ఉన్నా అది ఏ మాత్రం ఊహించలేకుండా, పట్టించుకోనట్టుగా హాయిగా ఉన్న అక్కడి సమాజాన్ని చూచి పీటర్ ఆశ్చర్యపోయాడు. భోజనం వడ్డించే వరకూ గదుల్లో అటూ ఇటూ తిరుగుతూ గడిపి, తరువాత ఎంతకూ ఆనెటోవ్ రాకపోవడంతో చూచి ఇంటికి వెళ్ళాడు.

ఆ రోజు ఆనెటోవ్, డొలొహోవ్‌ల ఇంటికి భోజనానికి వెళ్ళాడు. విఫలమైపోయిన ప్రయత్నాలన్నీ మళ్ళీ ఎలా కొనసాగించాలా, నటాషాను మళ్ళీ ఎలా

కలుసుకోవాలా అని అతనితో ఆలోచిస్తున్నాడు. భోజనం కాగానే తన అక్కగా రింటికి వెళ్ళి మరోమాటు తనకూ, ఆమెకూ సంబంధం ఏర్పరచమని ఆమెను కోరాడు. పీటర్ అన్నిచోట్ల వెదకి చివరకు ఇంటికి వచ్చేసరికి సేవకుడు, ఆనెటోవ్ రాకుమారుడు కౌంటెస్ దగ్గర ఉన్నాడనీ, ఆవిడ కోసం చాలామంది వచ్చిపోయారనీ చెప్పాడు. పీటర్ డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాడు. కాని వెంటనే తన భార్య దగ్గరికి వెళ్ళలేదు. తను తిరిగివచ్చినప్పటి నుంచి ఇంతవరకు ఆవిడను కలుకోలేదు కూడా. ఆవిడంటే ఒక విధమైన విముఖత్వం కూడా కలిగింది. అందుచేత సరాసరి వెళ్ళడం వెళ్ళడం ఆనెటోవ్ దగ్గరికి వెళ్ళాడు.

"పీటర్! వచ్చావా!" అంటూ హెలెన్ "పాపం మన ఆనెటోవ్‌కు ఏం జరిగిందో తెలుసా?..." అని ఏదో చెప్పబోయి ఆగిపోయింది.

ఆవిడ భర్త ముఖంలో చెప్పరాని కోపం కనిపిస్తుంది. డొలొహోవ్‌తో ద్వంద్వ యుద్ధం జరిగినప్పుడు అతని ముఖం ఎలా ఉన్నదో ఇప్పుడు మళ్ళీ అతని ముఖం అలా ఉంది.

"పాపము, పతనము ఎప్పుడూ నీ ప్రక్కనే కనిపెట్టుకుని ఉంటాయి" అని పీటర్ భార్యతో ఇక మాట్లాడకుండా ఆనెటోవ్ దగ్గరికి వెడుతూ "ఆనెటోవ్! ఇలారా నీతో మాట్లాడాలి" అన్నాడు. అక్కా తమ్ముడూ ఒకరివంక ఒకరు చూచుకున్నారు. ఆనెటోవ్ ఏమీ మాట్లాడకుండా అతని వెంటనే వెళ్ళాడు.

"ఈమాటు నా డ్రాయింగ్ రూంలోకి వచ్చారూ అంటే " అంటూ హెలెన్ ఏదో చెప్పబోయింది. కాని పీటర్ ఆమె మాటలు పట్టించుకోకుండా అక్కడ నుంచి వెళ్ళాడు.

ఆనెటోవ్ తనకెప్పుడూ సహజమైన నింపాదితో వెళ్ళాడు. అయినప్పటికీ అతనికి కొద్ది కలవరం కలిగింది. కాని సహజమైన కులాసా ఇంకా అతనిలో కనిపిస్తూనే ఉంది.

పీటర్ గదితలుపు మూసివేసి ఆనెటోవ్ వంక తిరిగి "నీవు కౌంటెస్ నటాషా రోస్టోవ్‌ను పెళ్ళి చేసుకుంటానన్నావు కదూ? ఆమెతో లేచిపోవడానికి ప్రయత్నించావు కదూ?" అని అడిగాడు.

"అబ్బాయ్! నీవిలా అడిగితే నేనేమీ సమాధానం చెప్పలేను" అన్నాడు ఆనెటోవ్ ఫ్రెంచిభాషలో.

అప్పటికే వివర్ణమైపోయి ఉన్న పీటర్ ముఖం మరింత కోపంతో వణికిపోతోంది. అతను ఆనెటోవ్ కోటు కాలర్ పట్టుకుని ఊపాడు. ఆనెటోవ్ ముఖంలో మరింత భయం కనిపించసాగింది.

"నీతో మాట్లాడాలన్నాను. ఇదే చెప్పు?" అన్నాడు పీటర్.

"ఊరుకో ఇదేమిటి ఈ పని?" అన్నాడు ఆనెటోవ్ అతని పట్టు వదిలించు కుంటూ ,తరువాత కోటు కాలర్ సవరించుకున్నాడు. వారిద్దరూ అలా పెనుగులాడ డంలో ఒక గుండీ ఊడిపోయింది కూడా.

"నీవు వట్టి నీచుడివి! పుండాకోరువి! నీ తల పగలకొడతాను" అంటూ పీటర్ కాగితాలు కదలకుండా పెట్టివుంచే ఒక బరువైన వస్తువు తీసుకొని అతని తలమీద విసరబోయి, మళ్ళీ ఆగి దానిని టేబిల్ మీద పెట్టేశాడు. "నీ వామెను పెళ్ళి చేసు కుంటానన్నావా లేదా చెప్పు?" అని అడిగాడు.

"నేను ... నేను అలా అనుకోలేదే! అయినా... అయినా...." అని ఆనెటోవ్ ఏదో చెప్పబోయి తడబడ్డాడు.

పీటర్ మధ్యలో అతన్ని ఆపి "నీ కావిడ దగ్గరనుంచి ఉత్తరాలు రాలేదా? ఒక్క ఉత్తరం కూడా?" అంటూ అతన్ని సమీపించాడు. ఆనెటోవ్ అతని వంక చూచి జేబులో చెయ్యిపెట్టి ఒక నోటుపుస్తకం బయటికి తీశాడు. పీటర్ ఆ నోటు పుస్తకంలో ఉన్న ఉత్తరాన్ని తీసుకుని ఆనెటోవ్‌ను అవతలికి తోసేసి సోఫాలో కూచున్నాడు.

"నిన్నేమీ చెయ్యనులే ఏమీ గాభరాపడకు" అన్నాడు పీటర్.

ఆనెటోవ్ భయంతో ఒక భంగిమ చూపాడు. "మొదటి విషయం ఉత్త రాలు" అని పీటర్ ఒక నిముషం ఆగి "రెండో విషయం, రేపు నీవు మాస్కో వదలి వెళ్ళాలి" అని చెప్పాడు.

"కాని ఎలా వెళ్ళగలను?" అని అడిగాడు ఆనెటోవ్.

"ఇక మూడో విషయం నీవు ఎన్నడూ ఎక్కడా కూడా ఈ విషయం ఒక్కమాట కూడా పొక్కకూడదు. నీ నోరు నేను మూయలేననుకో! అయినా నీకు ఏమాత్రమైనా మర్యాద అనేది మిగిలి ఉంటే...." అన్నాడు పీటర్.

ఇలా అని అతను గదిలో అటూ ఇటూ తిరగసాగాడు. ఆనెటోవ్ టేబిల్ దగ్గర కూచుని పెదవులు కొరుక్కుంటున్నాడు.

"నీ స్వసుఖమే కాక ఇతరుల సుఖాన్ని, శాంతిని కూడా నీవు గమనించ వలసి ఉంటుంది. నీ వినోదం కోసం ఒకరి జీవితాన్ని నాశనం చేయడం మంచిది కాదు. కావల్సివుంటే నా భార్యలాంటి స్త్రీలతో నీ ఇష్టం వచ్చినట్లు వినోదించవచ్చు. దానికి నాకేమీ అభ్యంతరం ఉండదు. నీలాంటివారికి ఏం కావాలో వారికికూడా తెలుసు. నిన్ను నీవు ఎలా రక్షించుకోగలవో, వారు కూడా అలాగే—ఆ పద్ధతిలోనే వారిని వారు రక్షించుకోగలరు. కాని ఏమీ ఎరగని ఒక పిల్లని పెళ్ళాడతానని చెప్పి,

మోసం చేసి అపహరించడానికి పూనుకోవడం ఏమాత్రం మంచిది కాదు" అంటూ పీటర్ దీనికేమి జవాబు చెపుతావన్నట్లు ఆనెటోవ్ వంక చూచాడు.

"నాకిదంతా ఏమీ తెలీదు" అన్నాడు ఆనెటోల్. పీటర్ కొంచెం శాంతించిన తరువాత తన్ను తాను చిక్కబట్టుకుని "నాకిదంతా ఏమీ తెలీదు. తెలుసుకోవాలని కూడా లేదు. కాని నీవు నాతో అన్నమాటలు మాత్రం ఏమాత్రం మంచివి కావు. వాటిని నే నొప్పుకోను" అన్నాడు.

పీటర్ అతని వంక ఆశ్చర్యంగా చూచాడు. అతని ఉద్దేశం ఏమిటా అన్నట్లుగా.

"నీవు నన్ను చాటుగా చీవాట్లు పెట్టినప్పటికి నేను మాత్రం ఊరుకోలేను" అన్నాడు ఆనెటోవ్.

"అయితే నీకు కావలసింది నీ సంతృప్తేనా?" అని అడిగాడు పీటర్ వెక్కిరింపుగా.

"ఏమైనా నీ సలహాప్రకారం నేను నడుచుకోవాలంటే నీ వన్న మాటలు నువ్వు తిరిగి ఉపసంహరించుకోవాలి. అదీ నా ఉద్దేశం" అన్నాడు ఆనెటోవ్.

"సరే, అలాగే అవసరమైతే నిన్ను క్షమాపణైనా కోరుకుంటాను" అని పీటర్ తెగిపోయిన అతని గుండీ బెజ్జం వంక చూచి "నువ్వు వెళ్ళడానికి అవసరమైతే డబ్బుకూడా ఇస్తాను" అన్నాడు.

ఆనెటోవ్ చిరునవ్వు నవ్వాడు. నీచమైన ఆ మామూలు చిరునవ్వు పీటర్‌కు రోత కలిగించింది. అలాంటి చిరునవ్వే అతను ఎన్నోసార్లు హెలెన్ ముఖంలో కూడా చూచాడు.

ఆ తరువాత వారు గదిలోనుంచి బయటికి వెళ్ళారు.

ఆ మరుసటిరోజు ఆనెటోవ్ మాస్కోనుంచి పీటర్స్‌బర్గ్‌కు వెళ్ళిపోయాడు.

# 60

శ్రీ పీటర్ వెంటనే మేరియా డిమిట్రోవ్‌నా దగ్గరికి వెళ్ళి ఆవిడ కోరిన ప్రకారం ఆనెటోవ్‌ను మాస్కోనుంచి పంపించివేశానని చెప్పాడు. అతను వచ్చేసరికి మేరియా డిమిట్రోవ్‌నా ఇంట్లో అంతా కలవరంగా ఉంది. నటాషాకు తీవ్రంగా జబ్బుచేసింది. మేరియా డిమిట్రోవ్‌నా ఈ విషయాన్ని రహస్యంగా ఉంచమంటూ పీటర్‌తో చెప్పింది. ఆనెటోవ్‌కు అదివరకే వివాహం అయిందని నిన్న రాత్రి నటాషా ఆర్సెనిక్ ద్రావకం (పాషాణ సంబంధమైన విషం) సంపాదించి తాగింది. కొంచెం తాగిన తరువాత భయంవేసి సోనియాను నిద్రలేపి తనుచేసినపని చెప్పింది.

వెంటనే విరుగుడుకోసం మందులిచ్చారు. అంచాత ఇప్పుడు కొంచెం నయంగా ఉంది. అయినా ఆమె ఇంకా పూర్తిగా తేరుకోలేదు. బలహీనంగా ఉంది. అంచాత ఆమెను ఇక్కడే ఉంచారు. ఆమె తల్లికోసం కబురు పంపారు.

పీటర్ వచ్చేసరికి కౌంట్ చాలా గొడవలో ఉన్నాడు. సోనియా ఏడుస్తూ కూచుని ఉంది.

ఆరోజు అతను క్లబ్‌లోనే భోజనం చేశాడు. అందరూ నటాషా లేచిపోవడాన్ని గురించి పుకార్లుగా చెప్పుకుంటూ గుసగుస లాడుకుంటూ ఉన్నారు. కాని అదంతా అబద్ధమని అతడు చెప్పాడు. దీనికంతకూ కారణం తన బావమరదేననీ, అతను వివాహం చేసుకుంటానని కోరగా ఆమె నిరాకరించడంవల్ల ఇలా పుకార్లు లేవదీశారని కూడా చెప్పాడు.

ఆండ్రూ వస్తాడన్న విషయం అతని భయాన్ని మరింత ఎక్కువ చేయ సాగింది. రోజూ వెళ్ళి అతని రాక విషయం కనుక్కుంటూ ఉన్నాడు.

ఊళ్ళో పుట్టిన పుకార్లన్నీ వృద్ధరాకుమారుడు బోల్‌కోన్‌స్కీ, మదాంబోరిన్ ద్వారా విన్నాడు. నటాషా తన కుమార్తెకు వ్రాసిన ఉత్తరాన్ని కూడా చూచాడు. అందుచేత ఆయనిప్పుడెంతో హాయిగా ఉన్నాడు. కొడుకు ఎప్పుడొస్తాడా అని ఆనందంతో ఎదురు చూస్తున్నాడు.

అనెటోవ్ వెళ్ళిన కొద్దిరోజులకు ఆండ్రూ వద్దనుంచి పీటర్‌కు ఉత్తరం వచ్చింది. తను వచ్చాననీ, వచ్చి కలుసుకోవలసిందనీ వ్రాశాడు.

ఆండ్రూ వచ్చిన వెంటనే అతని తండ్రి నటాషా వ్రాసిన ఉత్తరాన్ని అతని కిచ్చాడు. మదాం బోరిన్ ఆ ఉత్తరాన్ని తెచ్చి రహస్యంగా అతనికి అందించింది. ఆవిడ లేచిపోవడాన్ని గురించిన పుకార్లు— తను ఇంకా కొంత కల్పన చేసి, అన్ని విషయాలూ వృద్ధ రాకుమారుడు తన కుమారునికి చెప్పాడు.

ఆండ్రూ ఆ క్రిందటి రోజు సాయంత్రమే వచ్చాడు. ఆ మరుసటి రోజు ఉదయాన్నే పీటర్ అతన్ని చూడడానికి వచ్చాడు. అతను వచ్చేసరికి ఆండ్రూ కూడా నటాషాలాగా క్రుంగిపోయి కూచుని ఉంటాడని అనుకున్నాడు. కాని ఆండ్రూ అలా లేడు. ప్రక్కగదిలో కూచుని స్పెరాన్‌స్కీని గురించి బిగ్గరగా ఏదో మాట్లాడు తున్నాడు. మేరియా రాకుమారి పీటర్‌ను ఆహ్వానించడానికి బయటికి వచ్చింది. నిశ్వసిస్తూ తన అన్న గదివంక వేలు చూపింది. ఆవిడ కొంత సానుభూతి చూపడానికి ప్రయత్నించింది కాని, ఆవిడ ముఖంలో పీటర్‌కు ఒక రహస్యమైన సంతృప్తి కనిపించింది. ఆవిడ ముఖం అలా ఉండడానికి కారణం నటాషా అలా ప్రవర్తించడమే.

"ఇలా జరుగుతుందనే మా అన్నయ్య అనుకున్నాట్ట ! కాని తను లోపల అనుకుంటున్నదంతా అతను బయటికి చెప్పడం లేదు. అయినా ఇదంతా లోలోపలే నింపాదిగా భరిస్తున్నాడు. అతనింత నింపాదిగా భరిస్తాడని నేననుకోలేదు" అని చెప్పింది మేరియా రాకుమారి.

"అయితే ఇక పూర్తిగా తెగతెంపులు చేసుకున్నట్లేనా ?" అని అడిగాడు పీటర్.

మేరియా రాకుమారి అతని వంక ఆశ్చర్యంతో చూచింది.

పీటర్ ప్రక్కగదిలోకి వెళ్ళాడు. ఆంద్రూ యూనిఫారంలో లేడు. సాధారణ మైన దుస్తులు ధరించి ఉన్నాడు. తెరిచిన పెట్టెలు, పక్కచుట్ట, మడత మంచము ఉన్నాయి. ఆంద్రూ రాకుమారుడు తన తండ్రి ముందు, మెష్ర్టెస్కీ రాకుమారుని ముందు నిలుచుని ఏదో మాట్లాడుతూ ఉన్నాడు. అతని ఆరోగ్యం బాగుపడింది. కాని నుదుట మాత్రం ఒక కొత్తరేఖ కనిపిస్తోంది. అతను స్పెరాన్స్కీని గురించి, అతని గొడవను గురించి మాట్లాడుతున్నాడు.

"ఒక నెలక్రితమే అతన్ని ఆకాశంలోకి ఎత్తినవారు ఇప్పుడు అతన్ని క్రిందికి తోసేశారు. అతని పథకాలు అర్థం కాకపోయినప్పటికీ అతన్ని నిందిస్తున్నారు. చూడగా ఇతర్లు చేసిన తప్పులకు మరొకరిని నిందించడం ఎంత సులభంగా కనిపిస్తుంది ! నా మటుకు నేను ఈ పరిపాలనలో ఏదైనా మంచి జరిగిందీ అంటే అది అతని వల్లే జరిగిందని అనుకుంటున్నాను" ఇలా మాట్లాడుతున్న ఆంద్రూ ఒక్క క్షణం ఆగి పీటర్‌వంక చూచాడు. అప్పుడతని ముఖంలో ఏదో మార్పు కనిపించింది. మళ్ళీ తన సంభాషణ సాగిస్తూ "కాని తరువాతనైనా అతని మంచి తెలుసుకోక పోరు" అన్నాడు. తరువాత పీటర్‌వంక తిరిగి "వచ్చావా ! ఏమిటి ? బాగున్నావా? కొంచెం లావెక్కినట్లున్నావే ?" అని అడిగాడు. తరువాత మళ్ళీ స్పెరాన్స్కీ విషయం మాట్లాడడం మొదలుపెట్టాడు.

"ఆ బాగానే ఉన్నాను" అని చెప్పాడు పీటర్.

ఆ విషయం అంత పట్టించుకోనట్లుగా తరువాత కొద్దిసేపు అతను రష్యన్ సరిహద్దులో ఉన్న రోడ్లు సరిగా లేకపోవడాన్ని గురించి, తన కుమారుని కోసం ఏర్పాటు చేసిన స్విట్జర్లాండు ట్యూటర్ మాన్‌షియర్ డెసాకాను గురించి మాట్లాడాడు. తరువాత వారు ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు.

"ద్రోహమనేది ఏదైనా ఉన్నట్లయితే, నెపోలియన్‌తో రహస్యంగా ఒప్పందానికి వచ్చినట్లు ఏదైనా రుజువులు ఉండి తీరాలి. ఆ రుజువులను అందరికీ తెలియ చెయ్యాలి. నామటుకు నాకు స్పెరాన్స్కీపట్ల అంత ఇష్టం లేదు కాని,మరి న్యాయం మాట్లాడాలి కదా!" అన్నాడు ఆంద్రూ. తన స్నేహితుడు కూడా తనలాగానే ఏదో

ఒక అనవసరమైన విషయాన్ని గురించి మాట్లాడుతూ తన మనస్సును క్రుంగదీస్తోన్న విషయాలను మరచి పోవడానికి ప్రయత్నిస్తున్నాడని పీటర్ గమనించాడు.

ఆ తరువాత మెష్చెర్స్కీ వెళ్ళిపోయాడు.

ఆంద్రూ రాకుమారుడు పీటర్‌ను చెయ్యి పుచ్చుకుని తన గదిలోనికి తీసుకుని వెళ్ళాడు. ఒక మడత మంచం విప్పి పెట్టి ఉంది. తెరిచి ఉన్న పెట్టెలు, ట్రంకులు గదినిండా పరచబడి ఉన్నాయి. ఆంద్రూ ఒక పెట్టె దగ్గరికి వెళ్ళి ఒక ఉత్తరాల కట్ట తీశాడు. అతనీ పని చేస్తున్నప్పుడు ఏమీ మాట్లాడలేదు. ట్రంకులోనుంచి ఉత్తరాలు తీసి లేచి నిలుచుని గొంతు సవరించుకున్నాడు.

"నీ కనవసరంగా కష్టం కలిగించవలసి వచ్చినందుకు నన్ను క్షమించు" అన్నాడు ఆంద్రూ. పీటర్ అతను నటాషాను గురించి మాట్లాడబోతున్నాడని ముందుగానే ఊహించాడు. అతని స్నేహితుని పట్ల అతని ముఖంలో జాలి కనిపించింది. అందువల్ల ఆంద్రూకు మరీ చిరాకైపోయింది. అతను నిశ్చింతగా నిక్కచ్చిగా మాట్లాడదలుచుకున్నాడు. కాని గొంతులోనుంచి మాటలు పెకలించుకున్నట్లుగా "కౌంటెస్ నటాషా రోస్టోవ్ నన్ను నిరాకరించినట్లు నే నిప్పుడే తెలుసుకున్నాను. నీ బావమరిది ఆవిడను వివాహం చేసుకోగోరినట్లు కూడా నేను కొంత విన్నాను. నిజమేనా ?" అని అడిగాడు.

"కొంతవరకు నిజం. కొంతవరకు కాదు" అని చెప్పాడు పీటర్.

"ఇవిగో ! ఆవిడ ఉత్తరాలు, ఆవిడ బొమ్మ. నీవు మళ్ళీ ఆవిడను కలుసుకున్నప్పుడు ఇవి ఆవిడకిచ్చెయ్యి" అన్నాడు ఆంద్రూ.

"ఆవిడ కిప్పుడు జబ్బుగా ఉంది."

"ఆవిడ ఇప్పుడు ఇక్కడే ఉందా ? అయితే మరి అనెటోల్ ?" అని అడిగాడు ఆదుర్దాగా.

"అతను వెళ్ళి కొన్ని రోజులు కావస్తోంది. ఆవిడ ఇప్పుడు చాలా ప్రమాద స్థితిలో ఉంది" అని చెప్పాడు పీటర్.

"ఆవిడ జబ్బు విషయం విని నేనెంతో చింతిస్తున్నాను..." అన్నాడు ఆంద్రూ. తన తండ్రి చిరునవ్వులాగా అతని పెదవులమీద ఒక విషపూరితమైన చిరునవ్వు కనిపించింది. "అయితే కారగైన్ రాకుమారుడు ఆమెను పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకోలేదా ఏమిటి ?" అని అడిగాడు మళ్ళీ.

"అతను పెళ్ళి చేసుకోవడానికి వీల్లేదు ! అతనికిది వరకే పెళ్ళయింది!" అని చెప్పాడు పీటర్.

ఆంద్రూ రాకుమారుడు మళ్ళీ నవ్వాడు. ఆ నవ్వు అతని తండ్రి నవ్వు లాగానే ఉంది.

"ఇప్పుడు మీ బావమరిది ఎక్కడున్నాడో నాకు చెప్పగలవా ?"

"అతను పీటర్స్..." అని పీటర్ ఏదో చెప్పబోయి "అయినా ఎక్కడికి వెళ్ళాడో నాకు తెలీదు" అన్నాడు.

"సరే ఆ విషయాలు నా కనవసరం ! కౌంటెస్ నటాషా రోస్టోవ్‌తో ఆవిడకు కావలసినంత స్వేచ్ఛ ఉన్నదనీ, ఎప్పటిలాగానే నే నావిడ క్షేమం కోరతాననీ, ఆవిడకు తెలియచెయ్యి. నీవు నాకు నిజమైన స్నేహితుడవైతే ఇక ఈ విషయం ఆమెతో కాని, తిరిగి నాతోకాని లేక మరెవరితో కాని ప్రస్తావించకు. ఈ ఉత్తరాలు ఆవిడకు అందచెయ్యి. అందచేస్తావు కదూ ?" అన్నాడు ఆండ్రూ.

పీటర్ ఇక మాట్లాడక తిరిగి మేరియా రాకుమారి కోసం వెళ్ళాడు. ఆమె తన తండ్రిదగ్గర కూచుని ఉంది. వృద్ధుడు మామూలుకంటె కూడా ఇంకా ఉద్రేకంగా కనిపిస్తున్నాడు. ఆ తండ్రీ కూతుళ్ళిద్దరినీ చూచీ చూడడంతోనే, వారికి రోస్టోవ్‌ల పట్ల ఎంత తృణీకార భావము, ఎంత వ్యతిరేకత ఉన్నాయో పీటర్‌కు అర్థమైంది. అంచాత ఇక తాను ఆ అమ్మాయి ప్రస్తావన వారి దగ్గర తీసుకు రాలేకపోయాడు.

భోజన సమయంలో వారు ప్రధానంగా యుద్ధాన్ని గురించీ, సంభవించనున్న విషయాలను గురించీ మాట్లాడుకున్నారు. ఆ సంభాషణ జరుగు తున్నంతసేపూ ఆండ్రూ ఎడతెరిపి లేకుండా ఉద్రేకంగా మాట్లాడసాగాడు. మొదట తన తండ్రి అభిప్రాయాలను, తరువాత డిసెల్లెస్ అభిప్రాయాలను తీవ్రంగా వ్యతిరేకిస్తూ మాట్లాడాడు. అతనలా ఉండడానికి కారణం ఒక్కడికి మాత్రమే బాగా తెలుసును.

# 61

ఆనాటి సాయంకాలం పీటర్, ఆండ్రూ రాకుమారుడు తనపై వేసిన బాధ్యతను నెరవేర్చడానికి రోస్టోవ్‌ల ఇంటికి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి నటాషా పడుకుని ఉంది. ఆవిడ తండ్రి క్లబ్‌కు వెళ్ళాడు. ఉత్తరాలు సోనియాకు అందచేసి తను మేరియా డిమిట్రోవ్‌నాను చూడడానికి వెళ్ళాడు. ఆండ్రూ, నటాషా తనను వివాహం చేసుకోనని, అందించిన వార్తను ఏ విధంగా స్వీకరించాడో తెలుసుకోవాలని మేరియా డిమిట్రోవ్‌నా ఆతురత పడుతోంది. సోనియా కూడా కొద్దిసేపట్లో అక్కడికి వచ్చింది.

"నటాషా కౌంట్ బెషోక్టవ్‌ను చూడాలని కోరుతున్నది" అని చెప్పింది సోనియా.

"ఆ గదంతా గందరగోళంగా ఉంది. ఇప్పుడాయన అక్కడికి ఎలా వెళ్ళగలడు?" అన్నది డిమిట్రోవ్‌నా. "ఆవిడ వచ్చి డ్రాయింగ్‌రూంలో కూచుంది" అన్నది సోనియా.

మేరియా డిమిట్రోవ్నా ఇదేమిటన్నట్లు భుజాలు కదిలించి మరేమీ మాట్లాడకుండా ఊరుకున్నది.

"ఏం గొడవ వచ్చిపడింది! ఆవిడ తల్లి కౌంటెస్ ఎప్పుడు వస్తుందో కాని ఇప్పుడు మాత్రం నా దుంప తెగిపోతుంది. ఆవిడతో అన్ని విషయాలు చెప్పకు. పాపం ఇప్పుడాపిల్ల పరిస్థితి చూస్తే నాకు జాలి వేస్తోంది" అన్నది చివరకు మేరియా డిమిట్రోవ్నా.

నటాషా సన్నగా పాలిపోయి ఉంది. డ్రాయింగ్‌రూం మధ్యలో నిలుచుంది. పీటర్ అనుకున్నట్లు కుప్పకూలిపోయి లేదు....అతను డ్రాయింగ్ రూంలోకి వచ్చే సరికి ఆమె ముందుకు వెళ్ళి అతన్ని కలుసుకోవాలో, లేక అక్కడే నిలుచోవాలో తెలీక తటపటాయించింది.

అతనే ముందుకు వెళ్ళాడు. ఆవిడ కరస్పర్శ చేయడం కోసం తనకు చెయ్యి అందిస్తుందనుకున్నాడు. కాని ఆవిడ అలా చేయబోయి ఆగిపోయి, పొంగి వస్తున్నంత ఏడుపును అణుచుకుని చేతులు నిర్జీవంగా క్రిందికి దించుకుంది. పాట పాడడం కోసం డ్రాయింగ్‌రూం మధ్యలో నిల్చుంటూ వచ్చినప్పుడు ఆమె ఇలాగే నిలుచునేది. కాని ఇప్పుడామె ముఖం తీరులో ఎంతమార్పు కనిపిస్తోంది.

"పీటర్ కిరొలొవిచ్!" అని అతన్ని పిలిచి త్వరత్వరగా ఇలా చెప్పసాగింది:

"ఆండ్రూ రాకుమారుడు నీకు స్నేహితుడు కదూ — ఇప్పుడు కూడా నీకు స్నేహితుడేగా?" అని తాన్ను తాను సర్దుకున్నది. ఇప్పుడు ఏ విషయం కూడా పూర్వంలాగా ఉండడం లేదని ఆవిడకు అనిపిస్తోంది. "ఆయన నన్ను మీ సలహా తీసుకోమని చెప్పాడు" అన్నది.

పీటర్ మాట్లాడకుండా ఆవిడ వంక చూస్తూ నిలుచున్నాడు. ఇంత వరకూ ఆవిడపట్ల అతనికెంతో అసహ్యము, కోపము ఉండేవి. కాని ఇప్పుడు మాత్రం ఆవిడపట్ల జాలి కలిగింది. ఆవిడను నిందించలేకపోయాడు కూడా.

"ఆయనిప్పు డిక్కడే ఉన్నాడు కదూ?" అని "ఆయనతో నన్ను క్షమించమని చెప్పు" అన్నగి మళ్ళీ నటాషా. ఇలా అని చెప్పలేక ఆగిపోయింది. కాని కంటతడి మాత్రం పెట్టలేదు.

"సరే, అలాగే చెపుతాను" అన్నాడు పీటర్, మరేం జవాబు చెప్పాలో తోచక.

నటాషా తన మాటలు అతను ఏ విధంగా అర్థం చేసుకుంటాడో అనే భయంతో మళ్ళీ ఇలా చెప్పసాగింది:

"అవును! అంతా ముగిసినట్టే! ఆ విషయం నాకు తెలుసు. దీన్ని సర్దుబాటు చేసుకోవడానికి కూడా వీల్లేదు. కాని ఆయనకు నొప్పి కలిగించినందుకు నేను చాలా

చింతిస్తున్నాను. నన్ను క్షమించమని కోరానని చెప్పు! నన్ను క్షమించమని చెప్పు! క్షమించమని చెప్పు!"

ఆవిడ దేహమంతా వణికిపోతున్నది ఇక ఆవిడ నిలుచోలేక కుర్చీలో కూలి పోయింది.

"సరే, ఆయనకంతా చెపుతాను" అన్నాడు పీటర్. "కాని ఒక విషయం తెలుసుకో దలుచుకున్నాను" అన్నాడు.

"ఏమిటది?" అడిగింది నటాషా.

"నీవు, ఆ...." అనెటోవ్‌ను ఏ విధంగా పిలవాలో తెలీక ఆగిపోయి "నీవు ఆ వెధవను ప్రేమించావా?" అని అడిగాడు పీటర్.

"అతన్నలా పిలవకు—నాకు తెలీదు... నా కిప్పుడేమీ తెలీదు" అన్నది నటాషా.

జాలి, కరుణ, ప్రేమ పీటర్‌ను ముంచెత్తాయి. అతన్ని కళ్ళవెంట కన్నీరు కారసాగింది. ఆవిడకు కనిపించకుండా ఉండడం కోసం ఆ కన్నీటిని కళ్ళద్దాల చాటున దాచుకున్నాడు.

"ఇక ఆ విషయం మాట్లాడకమ్మా" అన్నాడు పీటర్. అతని గొంతులో అలాంటి మృదుత్వం కనిపించడం నాటాషాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. "ఇక ఆ విషయం మాట్లాకు—నే నతనితో అంతా చెపుతాను. నాతో మాత్రం ఒక విషయం చెప్పు. నన్ను నీ స్నేహితుడిగా ఎంచుకో. నీ కేదయినా సలహా కావలసి ఉన్నా, నీ హృదయంలో మాట ఎవరితోనైనా చెప్పదలచుకున్నా నన్ను జ్ఞాపకం తెచ్చుకో. ఇప్పుడు కాదనుకో, నీ మనస్సు హాయిగా నిర్మలంగా ఉన్నప్పుడు నన్ను పిలవ నంపు"అని ఆమె చెయ్యి తీసుకొని ముద్దాడాడు. "నాకు సాధ్యమయేటట్లయితే...." అని మళ్ళీ ఏదో చెప్పబోయాడు.

"నాతో అలా మాట్లాడకు. నేనందుకు తగినదాన్ని కాదు!"అన్నది నటాషా. అక్కడ నుంచి లేచి వెళ్ళిపోతూ. కాని పీటర్ ఆమెను ఆపుచేశాడు. ఆవిడకు మరేదో చెప్పబోయాడు. కాని అంతా చెప్పిన తరువాత తనా విధంగా ఎలా చెప్ప గలిగానా-అనిపించిం దతనికి.

"అలా అనకు. ఇక నీ జీవితమంతా నీ ముందే ఉంది"అన్నాడతను మళ్ళీ.

"లేదు, లేదు అంతా అయిపోయింది!" అన్నది నటాషా.

"లేదు. అంతా అయిపోలేదు" అని పీటర్ మళ్ళీ చెప్పసాగాడు: "నేను నేను కాక మరెవరినైనా అయి ఉనట్లయితే, అందరిలోకీ తెలివి కలవాణ్ణి అందగాణ్ణి నేనే అయిఉన్నట్లయితే, నాకు స్వేచ్ఛ ఉండి ఉన్నట్లయితే నే నిప్పుడు నీ ముందు నా మోకాళ్ళని నీ ప్రేమను, నీ చేతిని నా కందివ్వమని కోరి ఉండేవాణ్ణి" అన్నాడు.

ఇంతవరకూ ఒక కన్నీటి బొట్టుకూడా రాల్చని నటాషా ఇప్పుడు వెక్కి వెక్కి ఏడవసాగింది. పీటర్‌వంక ఒకమాటు చూచి ఆ గదిలో నుంచి పరుగెత్తుకుని వెళ్ళి పోయింది.

పీటర్ కూడా తన కన్నీళ్ళు ఆపుకోలేక అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. ఎలాగో ఒక లాగు ఉన్నికోటు కప్పుకుని బండిలో కూచున్నాడు.

"ఎక్కడికి పోనివ్వమంటారు?" అని అడిగాడు బండివాడు.

"ఎక్కడికి? అని తన్నుతానే ప్రశ్నించుకున్నాడు పీటర్. "ఇప్పుడెక్కడికి వెళ్ళను? క్లబ్‌కు వెళ్ళి ఆ అర్థంలేని అక్కడి కబుర్లన్నీ వినానా?"

ఇప్పుడు తన హృదయం నిండిన మార్దవంతోను, కడసారి ఆవిడ కన్నీటి తెరలలోనుంచి చూచిన చూపుతోను పోల్చిచూస్తే అతనికి తక్కిన లోకమంతా నీచంగా కనిపించింది.

"ఇంటికి!" అన్నాడు బండివానితో. తన ఉన్నికోటు విప్పి వెనకాల విసి రేశాడు. మంచు పది డిగ్రీలు ఉన్నప్పటికి కోటు విప్పి హాయిగా గాలి పీల్చు కున్నాడు.

# తొమ్మిదవ కాండం

## 62

**1811 వ** సంవత్సరం చివరలో పశ్చిమ యిరోపా రాజ్యాలన్నీ మళ్ళీ సేనలు సమకూర్చు కున్నాయి. తమ బలాలనన్నింటినీ కేంద్రీకరించు కున్నాయి. 1812లో కొన్ని వేలమందితో కూడిన ఈ సమిష్టి సేనలన్నీ రష్యా సరిహద్దుల పైకి తరలి వచ్చాయి. రష్యన్‌లు కూడా వారికి ఎదురు వెళ్ళారు. జూన్ 12 వ తారీఖున పశ్చిమ యూరప్ సేనలు సరిహద్దు టాదాయి. యుద్ధం ప్రారంభమైంది.

మన సూత్రాలన్నిటికీ విరుద్ధమైన ఒక సంఘటన తటస్థించిందన్న మాట !

కోట్లకొద్దీ ఈ మానవులు చేసిన దురాగతాలు ఇన్నీ అన్నీ కావు. హత్యలు ఫోర్జరీలు, దోపిడీలు, దొంగతనాలు, మోసం, ద్రోహం, కుట్ర, కపటం; అవీ ఇవీ అనకుండా అన్నీ చేశారు. కొన్ని శతాబ్దాల నుంచీ నడుస్తున్న ప్రపంచ చరిత్రలో ఇంత ఘోరం ఎన్నడూ జరిగింది కాదు. కాని విచిత్రమైన విషయమేమిటంటే ఈ దురాగతాలు చేసిన వ్యక్తులెవరూ వీటిని దురాగతాలుగా భావించలేదు.

ఇంత భీకర పరిస్థితి ఏర్పడడానికి కారణమేమిటో ఆలోచిద్దాం. చరిత్రకారులు ఎంతో నమ్మకంగా చెప్పే మాటలనుబట్టి ఆల్డెన్‌బర్గ డ్యూక్ అవమానం పొందడం, అంతర్జాతీయ ప్రతిష్టంభనను అతిక్రమించడం, నెపోలియన్ అత్యాశ, జార్ చక్రవర్తి ప్రతిఘటన, రాజనీతిలో తప్పటడుగు వేయడం;...ఇలా ఎన్నెన్నో కారణాలు, చరిత్రకారులు చెపుతారు. ఇవన్నీ మనం నమ్మేటట్లయితే కోర్టు డ్రాయింగ్ రూంలో కూచుని మెటర్‌విచ్ కాని, రొమిన్స్‌జోవ్ కాని, టాలీరాండ్ కాని నేర్పుతో కల్పితం చేసిన ఒకచిన్న లేఖకాని .. లేక నెపోలియన్ అలెగ్జాండర్‌కు "నేను ఆల్డెన్‌బర్గ డ్యూక్‌కు నష్టపరిహారం చెల్లించడానికి సిద్ధంగా ఉన్నాను" అని వ్రాసిన ఒక్కమాట కాని యుద్ధాన్ని ఆపుచేసి ఉండేదే.

ఏమైనప్పటికి ఆనాడు విషయాలు పరిశీలిస్తున్న వారికి తోచిన కారణాలు ఇవే. ఆ తరువాత సెయింట్ హెలేనాలో నెపోలియన్ కూడా ఈ ఘర్షణకంతా కారణం ఇంగ్లండు చేసిన కుట్రలే అన్నాడు. ఇంగ్లీషువారు అతని అత్యాశనే ఈ కారణాన్ని అంటగట్టారు. ఆల్డెన్‌బర్గ డ్యూక్ తనకు జరిగిన అవనతే దీనికి కారణమన్నాడు. ఐరోపా వ్యాపారపు పతనానికి కారణమైన ప్రతిష్టంభనే ఇందుకు కారణమని వర్తకులు అభిప్రాయ పడ్డారు. వృద్ధులైన సోల్జెర్లు, కమాండర్లు ఏదో ఒక ఉద్యోగం వారికి దొరుకుతుందని అనుకున్నారు. న్యాయశాస్త్రజ్ఞులు రాజ్యాంగ సూత్రాలు ఉద్ధరింపబడతాయని భావించారు. 1809 నాటి ఆస్ట్రియా-రష్యా ఒడంబడికలో పాల్గొన్న రాయబార వర్గంవారు, వారు తయారుచేసిన నియమావళిలోని 176 సూత్రమే ఇందుకు కారణమని అన్నారు. ఇలా అందరూ తలకొక కారణంగా చెప్పారు. అన్ని కారణాలూ వారి వారి దృష్టినుంచి చెప్పిన కారణాలే. ఆనాటికి అవి సమంజసంగా కూడా కనిపించి ఉండవచ్చు. కాని ఇంతకాలం జరిగిన తరువాత ఈనాడు మనం ఆ విషయాన్ని పరిపూర్ణంగా ఆలోచిస్తూ ఉంటే, ఈ పై కారణాలన్నీ కూడా అసమగ్రంగా కనిపించకపోవు. నెపోలియన్ అత్యాశపరుడు కావడం వల్లను, అలెగ్జాండర్ తన పట్టు విడవక పోవడంవల్లను, ఇంగ్లండు కుట్రలు పన్నడం వల్లను, ఆల్డెన్‌బర్గ డ్యూక్ అవనతి పాలుకావడం వల్లను, ఇన్ని కోట్లమంది క్రైస్తవులు ఇలా ఒకరినొకరు చంపుకోవడానికి సిద్ధమైనారూ అంటే, అది మనకు నమ్మదగిన విషయంగా కనిపించదు. ఈ సత్యాలకూ, జరిగిన యుద్ధానికీ పొందిక ఎలా కుదర్చాలో మనకు తోచదు. స్మోలెన్స్కు, మాస్కో నివాసులు ఈ సంఘటనల ఫలితంగా ఎందుచేత వధింపపడ్డారూ అని మనం ప్రశ్నించుకుంటే, ఆ ప్రశ్నకు మనమేమీ సమాధానం చెప్పుకోలేము.

నెపోలియన్ తనను ఇతరులు కోరిన కొన్ని విషయాలకు ఒప్పుకుని ఉన్నట్టయితే, ఇంగ్లండు డ్యూక్‌తో కలిసి కుట్ర పన్నకుండా ఉండి ఉన్నట్టయితే, జార్

చక్రవర్తి ప్రతిఘటించకుండా ఉండి ఉన్నట్టయితే, ఫ్రెంచి విప్లవానికి సామ్రాజ్యానికి దారితీసే అనేక కారణాలు లేకుండా ఉండి ఉన్నట్టయితే, యుద్ధం కూడా లేకుండా ఉండేదన్న మాట వాస్తవమే. కాని ఈ పరిస్థితుల గొలుసులో ఏ ఒక్క లంకె తప్పి ఉన్నప్పటికీ ఆ తరువాత జరిగిన విషయాలు ఇలా జరిగి ఉండేవి కావు.

ఈ విధంగా చూస్తే ఈ మొత్తం కారణాలను బట్టి ఈ ఫలితాలు ఏర్పడ్డాయి కాని ఏ ఒక్క సంఘటననూ బట్టి ఏర్పడలేదని తెలుస్తుంది. యుద్ధం రావలసి ఉంది కాబట్టి వచ్చింది. అందుకనే కొన్ని కోట్లమంది ఇంగిత జ్ఞానాన్ని, మానవత్వాన్ని మరిచిపోయి పశ్చిమమునుంచి ప్రాచ్యముఖంగా వారి తోటివారిని వధించడం కోసం తరలి వచ్చారు. ఇలాగే కొన్ని శతాబ్దాల క్రితం పశ్చిమ ఐరోపా మీదికి త్రోవ పొడుగునా చంపుకుంటూ లెక్కలేనంత మంది తరలి వెళ్ళారు.

ఇందులో వారికి వ్యక్తిగత ఉద్దేశాలకు సంబంధించినంత వరకూ నెపోలియన్ అలెగ్జాండర్లు కూడా వారి వారి సేనలలోని ఒక సామాన్య సైనికుడి కంటె ఎక్కువ చేసిందేమీ లేదు. నిజం చెప్పాలంటే వారంత కంటె ఎక్కువేమీ చేయలేరు కూడా. లోకపు తీరును నిర్ణయించే వారి ఉద్దేశాలను నెరవేర్చుకొనడం కోసం అనేక విషయాలు ఏక ముఖంగా పరిణమించవలసి వచ్చింది. వారి ఉద్దేశాలను నెరవేర్చడానికి సాధనాలైన వేలమంది వ్యక్తులు వారు ఆజ్ఞాపించగానే తుపాకులు పేల్చడానికి సిద్ధపడిన సైనికులు, రెండు బలహీనమైన మానవ వ్యక్తిత్వాల ఆజ్ఞలకు లోబడవలసి వచ్చింది. వారి విధేయత అనేకమైన సంక్లిష్ట ఉద్దేశాల తాలూకు ఫలితమే.

ఒక తీరూతెన్నూ లేని చరిత్రను మనం అర్థం చేసుకోవాలంటే నియతివాదం తప్ప మరి మార్గంలేదు. ఒక వేళ మనం కారణాన్ని ఊహించదలచు కున్నప్పటికీ ఆ కారణంకూడా ఇంతకంటె అకారణంగాను, అవ్యక్తంగాను కనిపిస్తుంది.

ప్రతి మనిషీ తన కోసమే జీవిస్తాడు. అతనికి తోచిన అవధిని చేరడానికి తగినంత స్వేచ్ఛ మాత్రమే అతనికి ఉంటుంది. ఈ పని చేయడం కాని చేయక పోవడంకాని తన చేతులో ఉందని అతననుకుంటాడు. కాని అతనాపని చేసిన వెంటనే అది చరిత్రలో ఒక భాగమై పోతుంది. ఇక దానిని అక్కడనుంచి కదిలించడానికి వీలుండదు.

మనిషి జీవితం ద్విముఖమైంది...ఒక ముఖం తన వ్యక్తిగత అనుభవం. దాన్ని ఉదారము, అతీతము అయిన ఆశయాలతో పోల్చి చూచినప్పుడు దానికి ఒక స్వయం వ్యక్తిత్వ ము, ఒక ప్రత్యేకమైన స్థితి, స్వేచ్ఛ ఉన్నవి. మరొక ముఖం ఏమిటంటే అతని సాంఘిక జీవితం. అది మానవ సమూహంలో అతన్ని ఒక అణువుగా చేసి ఆ సూత్రాలకూ శక్తులకూ తనను బద్ధుణిగా చేస్తుంది. మనిషికి ఒక చైతన్యయుతమైన అస్థిత్వం ఉన్నప్పటికీ అతను తను సంకల్పించింది చేయగలిగి

నప్పటికి కూడా తనకు తెలీకుండానే మనిషి, చరిత్ర చేతుల్లోను మానవజాతి చేతుల్లోను కీలుబొమ్మ అవుతాడు. సంఘం అనే నిచ్చెనలో అతను పైమెట్టులో ఉండేకొద్దీ తన ప్రభావానికి అనువైన వ్యక్తులు ఎక్కువయ్యేకొద్దీ అతను చేసే ప్రతి పనికూడా ముందుగా నియమితం కావడం మనకు స్పష్టంగా కానవస్తుంది.

"రాజు ప్రాణం దేవుడిచేతుల్లో ఉంది!" అనే ఒక సామెత ఉంది. రాజులు చరిత్రకు బానిసలు.

చరిత్ర—అనగా మానవులయొక్క సమిష్టి జీవితం. చక్రవర్తి జీవితం చుట్టూ తిరిగి, రాజులను తన ఉద్దేశాలకు లొంగదీసుకుంటూ ఉంటుంది.

1812వ సంవత్సరంలో నెపోలియన్ జాతులయొక్క రక్తం ప్రవహింపచెయ్యాలా, ప్రవహింపచెయ్యకూడదా అన్న విషయం తన ఆజ్ఞమీద ఆధారపడి ఉందని అనుకున్నప్పటికీ, నిజానికి అతను ఆ సమయంలో చరిత్ర చెప్పుచేతలకు ఎప్పుడూ లొంగనంతగా లొంగి ఉన్నాడు. అతనింకా తన స్వయంశక్తి, స్వయం సంకల్పం అనే భ్రాంతిలో ఉన్నప్పటికి చరిత్ర అతనికి తెలీకుండానే అతన్ని ముందుకు లాక్కొని పోతోంది. అందుచేత పశ్చిమాన్నుంచి ప్రాచ్యముఖంగా తరలి వెళ్ళిన ఈ కోట్లాది మానవులు తమకు తెలీకుండానే అనేక శక్తుల సమాహార సూత్రానికి లొంగిపోయారు. కాని సామాన్యులకు మాత్రం ఈ దండయాత్రకు అనేక అల్ప కారణాలు కనిపించాయి. మనం ఇంతకుపూర్వం చెప్పినట్టుగా అంతర్జాతీయ ప్రతిష్టంభన, ఆల్డెన్‌బర్గ డ్యూక్‌తో పొత్తు కలవడం, ప్రష్యాలో సేనలు ప్రవేశించడం, అది నెపోలియన్ తాటస్థ్యమే అని అనుకోవడం, అతని యుద్ధోన్మాదం—యుద్ధం పట్ల అతనికొక ప్రీతి—అది అతనికొక అలవాటుగా పరిణమించడం, దానివల్ల సహజంగానే ఉత్సాహం కల ఫ్రెంచివారి ఉత్సాహ ఉద్రేకాలు మరింత పెచ్చుపెరగడం, వారి సేనలకు ఎక్కువగా అవుతున్న ఖర్చును తగ్గించవలసి రావడం, డ్రెస్‌డెన్‌లో అతనిపై కురిపించిన గౌరవాలు, రాజకీయ రాయబార మంతనాలు, చివరకు సంధి కోసం ప్రారంభించినా సమరానికే దారితీసిన రాజకీయ మంతనాలు; ఇలా ఎన్నెన్నో కారణాలు కలిసి రావలసి ఉన్న యుద్ధానికి దారితీశాయి.

పండిన ఆపిల్‌పండు ఎందుకు రాలుతుంది? దాని బరువునే అది మోయలేకపోవడం వల్లనా? లేక తొడిమ ఊడిపోవడం వల్లనా? ఎండకు ఎండి గాలికి రాలడం వల్లనా? ఎవరయినా కుర్రవాడికి కన్ను కుట్టి దాన్ని తినడం కోసం కోయడం వల్లనా? వీటిలో ఏదీ సరైన కారణమని చెప్పలేం. ఆపిల్‌పండు రాలడానికి సచేతన ప్రకృతిలోని అనేక సూక్ష్మ పరిణామాలన్నీ కారణాలయినాయి. అందుచేతనే తొడిమ రాలడంవల్లనే ఇలా జరిగిందని చెప్పే వృక్షశాస్త్రజ్ఞుడి మాట ఎంత సత్యమో, తన

కోర్కె తీర్చుకోవడం కోసం తాను పండు కోయడంవల్ల అది రాలిందని చెప్పే కుర్ర వాడి మాట కూడా అంతే సత్యం.

ఈ విధంగానే నెపోలియన్ తనలా నిశ్చయించుకోవడం వల్లనే మాస్కో వెళ్లాడని చెప్పేవారి మాట, అలెగ్జాండర్ పతనం అతని నిశ్చయంవల్లనే జరిగిందని చెప్పేవారి మాటలు లేక క్రింది భాగమంతా తొలచివేయబడి కూలిపోవడానికి సిద్ధంగా ఉన్న కొన్నికోట్ల హంన్డ్రెడ్ వెయిట్లు తూగే ఒక పెద్దకొండ కడసారి పనివాడి చివరి గడ్డ పలుగుపేటుకే కూలిపోయిందని అనేవారి మాట ఎంత నిజమో, అంత అబద్ధమూ కూడా. ఎవరు చరిత్రలో గొప్పవ్యక్తిగా ప్రసిద్ధి వహించారో వారంతా కేవలం నామమాత్రులే. సంఘటనలకు ఊరకే వారి పేర్లు తగిలిస్తారు కాని, వాస్తవానికి వారికీ ఆ సంఘటనలకూ— ఒక పేరుకు; ఆ పేరు పెట్టిన వస్తువుకు ఉన్న సంబంధం కూడా ఉండదు. వారు తమంతట తామే చేశామనుకునే పనులలో ఏ పనీ కూడా నిజంగా వారలా చేసింది కాదు. దానికీ, చరిత్రగతికీ, మానవ జీవిత గతికీ ఒక సంబంధం ఉన్నది. కాలం మొదలుపెట్టి నప్పటినుంచీ దాని స్థానం ముందే నిర్ణీతమై ఉన్నది.

# 63

జూన్ 4వ తారీఖున నెపోలియన్ డ్రెస్‌డెన్‌కు బయలుదేరాడు. అక్కడ మూడు వారాలపాటు తన దర్బారులో బస చేశాడు. రాకుమారులు, డ్యూక్‌లు, రాజులు. ఆ దర్బారులో ఉన్నారు. ఒక చక్రవర్తికూడా ఆ దర్బారులో ఉన్నాడు. తన మన్నన సంపాదించిన రాకుమారులకు, రాజులకు తన అనుగ్రహం చూపిస్తూ, తన ఇచ్ఛకు వ్యతిరేకంగా ఉన్నారనుకున్నవారికి ఒక పాఠం కూడా నేర్పాడు. ఆస్ట్రియా చక్రవర్తికి తను ఇతర రాజులవద్ద నుంచి దోచుకున్న ముత్యాలు, వజ్రాలు బహూకరించాడు. మేరియా లూసా పట్ల తన మార్దవాన్ని చూపాడు! (జోసెఫైన్ పారిస్‌లో ఉన్నప్పటికీ ఈవిడే అతని భార్య అనుకుంటోంది.) రాజనీతిజ్ఞులు, ఇంకా శాంతి స్థిరంగా ఉంటుందని నమ్ముతూ ఉన్నప్పటికీ అందుకోసం ప్రయత్నిస్తూ ఉన్నప్పటికీ నెపోలియన్ జార్ చక్రవర్తికి తను యుద్ధం కోరడం లేదని తెలుపుతూ ఆయన పట్ల ఎంతో గౌరవాన్ని చూపుతూ ఆయన్ను చనువుగా సంబోధిస్తూ ప్రత్యేకంగా ఒక లేఖ వ్రాసినప్పటికీ కూడా అతను తన సేనను కలుసుకోవడానికే ప్రయాణం చేసి వెడుతున్నాడు. ప్రతి అడుగునా తన సేనలకు పశ్చిమాన్నుంచి ప్రాచ్యానికి పురోగమనం త్వరితం కావించవలసిందని పదేపదే ఆజ్ఞలను అందజేస్తున్నాడు. ఆరు గుర్రాలతో కూడిన ఒక చక్కని బండిలో తన సేవకులతోను, సహాయ సేనాధిపతులతోను, సురక్షితమైన రక్షక దళంతోను ప్రయాణం చేస్తున్నాడు. అతను

వెళ్ళే రోడ్డు పోసెన్, థారన్, డాన్‌జిల్, కానిజ్‌బర్గ్ పట్టణాలలోగుండా వెడుతుంది. ప్రతి పట్టణంలోనూ వేలమంది పట్నవాసులు అతని బండి రాగానే ఉత్సాహంతో వచ్చి ఆయనకు స్వాగతం చెపుతున్నారు. వారి ఉత్సాహంలో కొంత భయం కూడా లేక పోలేదు.

తనసేన ప్రయాణం చేస్తున్న దిక్కునే తనుకూడా ప్రయాణం చేస్తూ విల్‌కొలిస్కీ అనే పట్టణంలో ఒక పోలిష్‌కౌంట్ ఇంట్లో జూన్ 10వ తారీఖున నిద్రించాడు. తనరాక ముందుగానే తెలియజేశాడు. తరువాత అక్కడ నుంచి బయలుదేరి తన సేనను కలుసుకుని ఆ మరుసటిరోజు నిమెన్ నదీ తీరానికి వచ్చాడు. అక్కడికి చేరగానే పోలిష్ యూనిఫారం వేసుకుని సేనలు నదిని దాటే ప్రదేశాన్ని పరిశీలించడానికి వెళ్ళాడు.

ఆవలి తీరంలో కోసక్కు లుండడం చూచాడు! వారి కవతల కను చూపు మేర మాస్కోవరకూ మైదానాలు వ్యాపించి ఉన్నాయి. వాటిని చూచినప్పుడు ఆ మరుసటిరోజే సేన ప్రయాణం కావాలని ఉత్తర్వులు జారీ చేశాడు. తన మంత్రుల ఆలోచనలకు పన్నాగాలకు పూర్తి విరుద్ధమైనది ఈ ఉత్తరువు. ఆ రోజునే ఆ సేనలు నిమెన్ నదిని దాటి వెళ్ళాయి.

24వ తారీఖు ఉదయం తెల్లవారీ వారకముందే నదికి ఎడమప్రక్క తీరంలో ఉన్న తన గుడారంలో నుంచి బయటికి వచ్చి ఫీల్డుగ్లాసులో గుండా సజీవ నదిలాగా ముందుకు సాగిస్తున్న తన సేనానివహాన్ని చూస్తూ నిలుచున్నాడు. అడవుల్లోనుంచి దాటివచ్చి మూడు తేలుడు వంతెనలపైగా ఆ సేనలు ఒక సజీవ ప్రవాహంలాగా నిమెన్ నదిని దాటి వస్తున్నాయి. తమ చక్రవర్తి అక్కడ ఉన్నాడని ఆ సేనకు తెలుసు. ఆయన్ను చూడాలని అనుకున్నాయి. మైదానానికి ఆవల మిట్టమీద తన ఎత్తైన ఈకెటోపీ పెట్టుకుని తను మామూలుగా ధరించే దుస్తులు ధరించ కుండా నిల్చుని ఉన్న ఆయన్ను చూడగానే సైనికులు టోపీలు ఆకాశంలోకి ఎగరవేసి "చక్రవర్తికి విజయమగుగాక!" అని కేకలు పెట్టారు. ఈ విధంగా అడవిలో నుంచి ఇంకా సేనలు ప్రవాహంలా వచ్చి చీమల బారుల్లా వంతెనలు దాటుతున్నాయి.

"ఈ మాటు మనం ఏదో ఒకటి చేసితీరాలి. ఆయన తన చేతుల్లోకి అన్ని విషయాలు తీసుకున్నాడూ అంటే ఊరికే తీసుకోడు—! అడుగో, అక్కడే ఉన్నాడాయన—చక్రవర్తికి విజయమగు గాక!—అవిగో! ఆసియా మైదానాలు ఎంత చక్కగా ఉన్నాయి!—అయినా ఈ దేశం అంత మంచిదికాదు. ఈ దేశం పాడు దేశం—బుషెట్! మళ్ళీ కలుసుకుందాం—నీ కోసం మాస్కోలో ఒక వెచ్చని ప్రదేశం వెదికి ఉంచుతాలే. మళ్ళీ కలుసుకుందాం. క్షేమంగా వెళ్ళిరా. అడుగో చక్రవర్తి! నీవు చూచావా? నన్ను గవర్నర్‌ను చేస్తారేమో! గెరార్డ్! నిన్ను మంత్రిని

చేస్తాలే—అడుగో చక్రవర్తి! వాళ్ళుచూడు ఎలా ఉన్నారో—ఆ కోసక్కులు! వాళ్ళెలా పరుగెత్తిపోతున్నారో చూడు—చక్రవర్తికి విజయమగు గాక—ఆయన నీకు కనిపిస్తున్నాడా? నే నిదివరకు ఆయన్ని రెండుసార్లు చూచాను. పతకాన్ని ఇస్తూ ఉండగా చూచాను."

ఇలా ఆ సైనికుల్లో పెద్దలు పిన్నలూ ఎన్నో విధాలుగా మాట్లాడుకుంటు న్నారు. ప్రతిముఖం సంతోషంతోను సంతృప్తితోను వెలిగిపోతోంది. ఈ దండయాత్ర ఎప్పుడు ప్రారంభిస్తుందా అని ఇంతకాలం నుంచీ పెద్ద బూదిరంగుకోటు వేసుకుని ఆ మిట్టమీద నిల్చున్న వ్యక్తి పట్ల ఆశ పెట్టుకుని ఎదురు చూస్తున్నారు.

జూన్ 25 వ తారీఖున నెపోలియన్ ఆరేబియా గుర్రాన్నెక్కి ఆ మూడు వంతెనలలోను ఒక వంతెన దగ్గరికి వెళ్ళాడు. ఆయన రాగానే అన్ని వైపులా జయ జయధ్వానాలు చెవులు తూట్లు పడేటట్లుగా దిక్కులు పిక్కటిల్లి పోయాయి. నిజానికి ఇంత రొదతోకూడిన ఈ అనురాగ ప్రదర్శనాన్ని ఎందుకు భరించాడూ అంటే దాన్ని కాదనలేకనే భరించాడు. కాని ఒక విషయం మాత్రం నిజం. వాళ్ళు ఆయనకు అలసట కలిగేటట్లు చేసి ఆ క్షణంలో ఆయన ఆలోచిస్తున్న మిలిటరీ సమస్యపట్ల ఆయన ఏకాగ్రత మరలిపోయేటట్లు చేశారు. తన గుర్రపు గిట్టలకింద బల్లకట్లు ఊగి పోతూ ఉండగా ఆయన నదిదాటి కానోవైపు మరలాడు. ఆయనకు ముందుగా రక్షక దళం వెళ్ళింది. సేనలు ఆయనకు దోవ చేశాయి. విశాలమైన విష్టులా నదీతీరాన్ని చేరగానే పోలెండ్ ఉహ్లన్ల దళం ముందు ఆగాడు.

వారంతా ఫ్రెంచి సైనికుల్లాగానే "చక్రవర్తికి విజయమగుగాక!" అని కేకలు వేస్తూ ఆయన్ని సరిగ్గా చూడడం కోసం తోవ చేసుకున్నారు.

ఆయన మళ్ళీ నది దాటివచ్చి గుర్రందిగి ఒక కలపదుంగమీద కూచున్నాడు. ఆయన చెయ్యి ఊపేసరికి ఒక సేవకుడు సగర్వంగా ఆయన దగ్గిరికి పరుగెత్తు కుంటూ వచ్చి ఆయనకు దూరదర్శిని యంత్రాన్ని అందించాడు. దాన్ని ఆ కుర్రాడి భుజంమీద ఉంచి ఆయన నింపాదిగా తేలిగ్గా ఆవలి ఒడ్డును చూడసాగాడు. తరువాత తన ముందు పరచబడిన మ్యాప్‌ను చూచిన తరువాత కళ్ళెత్తి చూడకుండానే ఏవో కొన్ని మాటలన్నాడు. వెంటనే ఇద్దరు సహాయ సేనాధిపతులు పరుగెత్తుకుంటూ ఉహ్లన్ల వైపు వెళ్ళారు.

"ఏమిటది? ఏమన్నాడాయన?" అని అందరూ వారిలో వారు ప్రశ్నించు కున్నారు.

కర్నల్‌కు ఒకరేవు చూచుకుని అక్కడి నుంచి నది దాట వలసిందని ఉత్తర్వు లందాయి. ఈకర్నల్ వృద్ధుడు అయినప్పటికీ కులాసాగా కనిపిస్తున్నాడు. రేవు కోసం వెదకకుండానే తన దళమంతటితో కలిసి నది ఈదడానికి తనను అను

మతించవలసిందని సహాయ సేనాధిపతి ని కోరాడు. ఇలా కోరుతూ కొంచెం సిగ్గు చెందాడు కూడా. అతని కోరిక కాదన్నట్లయితే అతనెంతో నిరాశపడి ఉండేవాడు. కాని సహాయసేనాధి పతి అతనిలాంటి ఉత్సాహమే కనుక చూపగలిగితే చక్రవర్తి ఎంతో సంతోషిస్తాడని అన్నాడు. అతనలా అనడమే తరువాయిగా వృద్ధుడైన ఆ కర్నల్ ఉత్సాహంతో పొంగిపోతూ కత్తి ఆకాశంలోకి ఎత్తి "చక్రవర్తికి విజయమగుగాక!" అని కేకపెట్టి తన దళాన్నంతా తనను అనుసరించమని చెప్పి గుర్రాన్ని అదిలించి ముందుకు దోవతీశాడు. ముందు గుర్రం కదల్లేదు. తరువాత గట్టిగా అదిలించగా ఒక్క దూకు దూకి అతనితోసహా నదిలో దిగి ప్రవాహం వాలుగా నదిలో కొట్టుకపోసాగింది. తరువాత సైనికులందరూ అనుసరించారు. కొందరు క్రిందికి జారిన వాళ్ళు ఒకరినొకరు పట్టుకుని వ్రేలాడారు. ఎన్నో గుర్రాలు మునిగి పోయాయి. కొద్దిమంది మనుష్యులు కూడా మునిగిపోయారు. ఇతరులు గుర్రాల జూలు పట్టుకుని ఈదుతూ వెళ్ళారు. వారికి సాధ్యమైనంతవరకూ ఒక వరుసలో వెళ్ళడానికి ప్రయత్నించారు. ఒక అరమైలు దాటిన తరువాత ఒక చిన్న రేవు కనిపించింది. కాని అక్కడ వారు ఆగదలుచుకోలేదు. అవతలి ఒడ్డున కలప దుంగమీద కూచుని తమవంక చూస్తున్న వ్యక్తికోసం—అతని కళ్ళముందు చనిపోవడానికి కూడా సిద్ధపడ్డారు. కాని ఆయన మాత్రం వారివంక చూడనైనా చూడడం లేదు.

సహాయసేనాధిపతి తిరిగి వచ్చి చక్రవర్తి దృష్టిని పోలిష్ సైనికుల విశ్వాసంవైపు మరల్చడానికి ప్రయత్నించగానే, బూదిరంగుకోటు వేసుకున్న ఆ వ్యక్తి లేచి నిలుచుని బెర్తియర్‌ను పిలిచి అతనితో కలిసి ఒడ్డున నడుస్తూ వెళ్ళాడు. అలా నడుస్తూ అతనికేవో ఉత్తర్వు లిస్తున్నాడు. మధ్య మధ్యలో తన దృష్టిని మరలుస్తూ తన కళ్ళముందు నీళ్ళలో మునిగి చనిపోతున్న వారివంక కోపంగా చూస్తున్నాడు కూడా. ఇది ఆయన అనుభవంలో కొత్తవిషయమేమీ కాదు. ఆయన ప్రయాణం చేసినంతమేర- ఆయన ఉన్నచోటల్లా- ఆయన సాన్నిధ్యమే ఎందరి మనస్సులో మరల్చి ఆయన కోసం వారిని తమ ప్రాణాలు ఒడ్డేట్టుగా చేసింది. ఆయన మళ్ళీ గుర్రం ఎక్కి తన గుడారానికి వెళ్ళాడు.

నలభై మంది ఊహలన్ను నది అట్టడుగున చేరారు. వారిని రక్షించడానికి పడవలు పంపించినా లాభం లేకపోయింది. దళంలో ఎక్కువ భాగం తాము వదిలి వచ్చిన ఒడ్డుననే నిలిచిపోయినవి. ఒక్క కర్నలూ, మరి కొద్దిమంది సైనికులు మాత్రమే వళ్ళంతా నీరు వడుస్తూ సురక్షితంగా అవతలి ఒడ్డుకు చేరగలిగారు. వారక్కడికి చేరగానే మళ్ళీ వెనక్కు తిరిగి జయ జయ ధ్వానాలు చేసి వారు నెపోలియన్ను వదిలివచ్చిన ప్రదేశాన్ని చూచారు. ఆయన అక్కడ కనిపించకపోయిన ఆ క్షణంలో వారెంతో సంతోషించారు.

ఆ సాయంత్రం నెపోలియన్ రెండు ఉత్తర్వులు అందచేశాడు. రష్యాలో దొంగబ్యాంకునోట్లు పంచడానికి ఒక వ్యక్తిని త్వరగా వెళ్ళమన్నాడు. ఫ్రెంచి సేనల పరిస్థితులు ఇతరులకు తెలిపే కాగితాలు తన దగ్గర ఉంచుకున్నందుకు ఒక సాగ్జన్ను కాల్చివేయమన్నాడు. మరొక వ్యక్తికి "లీజియన్ ఆఫ్ ఆనర్" పతకాన్ని అందిస్తూ అది అనవసరంగానే నదిలో ప్రవేశించిన ఆ ఉహ్లన్ల కర్నల్‌కు ఇవ్వమని పంపించాడు.

# 64

జార్—అలెగ్జాండర్ చక్రవర్తి ఒకనెలకు పైగా విల్నాలో ఉంటున్నాడు. సేనల తనిఖీలతోను, సన్నాహాలు చేసుకోవడంలోను తన కాలం గడుపుతున్నాడు. యుద్ధం తప్పకుండా రానున్నదని తెలిసినప్పటికీ సన్నాహాలింకా పూర్తికాలేదు. అందుచేతనే జార్ పీటర్స్‌బర్గు నుంచి ఇక్కడికి వచ్చాడు. ఒక పథకమేమీ ఇంకా వేసుకో లేదు. ఒక నెలనుంచీ చక్రవర్తి ప్రధాన కార్యాలయంలో ఉన్నప్పటికి ముందుగా ఏ సేనను ఎన్నుకోవాలీ అన్న విషయం ఇంకా నిశ్చయింపబడలేదు. మూడు సేనా శాఖలకు కమాండర్లు ఏర్పడ్డారు కాని ఇంకా చీఫ్ కమాండర్‌ను నియమించలేదు. జార్ కూడా తనా పని చేయడానికి పూనుకోలేదు. ఆయన విల్నాలో ఉండే కొద్దీ సన్నాహాలింకా మెల్లగానే సాగుతున్నాయి. ఆయన చుట్టూ ఉండేవారి ఉద్దేశం ఆయన రానున్న ప్రమాదాన్ని కూడా మరిచిపోయి హాయిగా అక్కడ కాలక్షేపం ఆయనచేత చేయించడమే నన్నట్టుగా ఉన్నది. ఎన్నో విందులు, విలాసాలు సాగాయి. పోలెండ్‌లోని పెద్ద పెద్దవారు, ఆఫీసులోని పెద్ద ఆఫీసర్లు, స్వయంగా జార్‌కు ఈ విందులు చేశారు. తరువాత ఒక పోలిష్ సహాయ సేనాధిపతి చక్రవర్తి గౌరవార్థం ఆఫీసర్లంతా కలిసి ఒక పెద్ద విందు ఏర్పాటు చేయాలని ఒక సూచన ఇచ్చాడు. దీన్ని అందరూ హర్షించారు. చక్రవర్తి కూడా అంగీకరించాడు. కావలసినన్ని చందాలు పోగయినవి. జార్ మన్ననలో ఉన్న ఒక స్త్రీ వారందరి తరఫున జార్‌కు గౌరవాలు అందచేయడానికి కూడా ఒప్పుకున్నది. జూన్ 25వ తారీఖున విందు నిశ్చయించారు. ఆ తరువాత బాల్ నృత్యం జరుగుతుంది. సంగీత కచేరీ కూడా జరుగుతుంది. తరువాత మందులు, మతాబులు కాల్చే పండుగ కూడా జరుగుతుంది. ఇదంతా కౌంట్ బెనిక్‌సన్‌కు చెందిన ఆ ప్రక్క ప్రదేశంలో జరుగుతుంది. ఈ కమిటీ వారికి కౌంట్ తన భవనాన్ని అప్పచెప్పాడు.

ఈ విధంగా నెపోలియన్ తన సేనను నిమెన్ నదిని దాటించిన రోజున, అలెగ్జాండర్ చక్రవర్తి తన స్టాఫ్ ఆఫీసర్లు ఏర్పాటుచేసిన బాల్‌లో నృత్యం చేస్తున్నాడు.

అర్ధరాత్రి అయ్యేసరికి వారింకా నృత్యం చేస్తూనే ఉన్నారు. హెలెన్‌కు తన అభిరుచికి తగిన జోడు దొరక్క బోరిస్‌ను తనతోపాటు కలిసి నృత్యం చేయమని కోరింది. నృత్యం చేస్తున్న జంటలో వీరిది మూడవ జంట. బోరిస్ మిలమిలలాడుతున్న హెలెన్ భుజాల వంక చూడనట్టుగా చూచాడు. సన్నని వలిపంలాంటి నల్లని గౌనులో గుండా తొంగి చూస్తున్నాయి ఆ చక్కని భుజాలు. తన పూర్వ పరిచయాన్ని గురించి ఒకమాటు మాట్లాడుకున్నారు. బోరిస్ తలుపు దగ్గర నిలుచున్న జార్ వంక చూస్తూనే ఉన్నాడు. ఆయన ఒక్కొక్కరితో మన్ననగా మాట్లాడుతున్నాడు. అలా మాట్లాడడం ఆయన నేర్పు. అప్పుడే బోరిస్‌కు బలాషోవ్,జార్ ప్రక్కనే ఉండడం కనిపించింది. బలాషోవ్‌కూ, జార్‌కూ దగ్గరి పరిచయముంది. జార్ ఒక పోలిష్ స్త్రీతో మాట్లాడుతున్నాడు. అలెగ్జాండర్ చక్రవర్తి ఇదేమిటన్నట్లు వెనక్కు తిరిగి చూచాడు. ఏదో పెద్దకారణం ఉంటే కాని అతనలా చనువు తీసుకోడని తెలుసుకుని తను మాట్లాడుతున్న స్త్రీని అక్కడనుంచి సాగనంపాడు. అతని మాటలు వింటూ ఉంటే జార్ ముఖంలో ఎంతో ఆశ్చర్యం కనిపించింది. తన స్నేహితుని చెయ్యి పుచ్చుకుని తోటలోకి తీసుకుని వెళ్ళాడు. ప్రక్కనున్న వారు ఆశ్చర్యంతో చూస్తున్నప్పటికీ వారిని గమనించకుండా అతన్ని తోటలోకి తీసుకుని వెళ్ళాడు. బోరిస్, అరక్షేవ్ వంక తిరిగి చూచాడు. బలాషోవ్ అలా వెళ్ళడం అతన్ని చాలా కలవరపరిచినట్లుగా గమనించాడు. తనను కూడా జార్ పిలుస్తాడేమో అని ఒక అడుగు ముందుకు వేశాడు. అతనలా చేయడంవల్ల బోరిస్‌కు ఒక విషయం అర్ధమైంది. యుద్ధ మంత్రియైన అరక్షేవ్, బలాషోవ్ పట్ల అసూయగా ఉన్నాడని తెలిసింది. ఏదో ముఖ్యమైన విషయం బలాషోవ్‌కు చెప్పడం కోసమే జార్ అతన్ని తోటలోకి తీసుకుని వెళ్ళాడు. తన విషయం వారు పట్టించుకో కుండా వెళ్ళిపోగా వారికి వెనకాలే ఇరవై అడుగుల దూరంలో నడుస్తూ అరక్షేవ్ దీపాలతో వెలుగుతున్న తోటలోకి వెళ్ళాడు.

బోరిస్‌కు కూడా ఈ వార్త ఏమిటో తెలుసుకుందామని ఆతురత కలిగింది. తను వెళ్ళి కౌంటెస్ పొటోకాను అడుగుతానని హెలెన్‌తో చెప్పాడు. కౌంటెస్ బాల్కనీలో నిలుచుని ఉంది. బోరిస్ అక్కడికి వెళ్ళగానే, మళ్ళీ బలాషోవ్‌తో కలిసివస్తున్న చక్రవర్తికి తను దారి చెయ్యవలసి వచ్చింది. తను వెనక్కు తగ్గి నిలుచోడానికి వ్యవధి లేనట్లుగా బోరిస్ తలుపుకు రాచుకుని నిలుచుని ముందుకు

వంగాడు. అతనిలా చేయగానే అలెగ్జాండర్ వ్యక్తిగతంగా అవమానం పొందిన వాడిలాగా ఇలా అనడం వినిపించింది:

"సరిహద్దు దాటి వచ్చాడా? యుద్ధం ప్రకటించకుండానే? నే నెన్నటికీ ఇక సంధిపత్రంపై సంతకం చెయ్యను." జార్ ఇలా అనడంలో ఒకవిధమైన సంతృప్తి పొందాడని బోరిస్ ఊహించుకున్నాడు. కాని మరొకరు తన మాటలు వినడం ఆయనకు కొంచెం విసుకు కలిగించినట్లుగా ఉంది. "ఈ మాటలు మరెవరితోనూ అనకు" అన్నాడు.

బోరిస్ ఇది తనకోసం చెప్పినమాటే అనుకుని తల వంచాడు. జార్ మళ్ళీ బాల్ రూంలోకి వెళ్ళాడు. అక్కడొక అరగంట సేపున్నాడు.

బోరిస్ ఇలా యాదృచ్ఛికంగా విస్టులా ఫ్రెంచివారి చేతుల్లో చిక్కడం విని, ఈ విషయం అనేక మంది పెద్దలతో చెప్పి వారికంటె తను ఎక్కువ తెలిసిన వాడిలాగా వారు నమ్మేటట్లు చేశాడు. అతని పట్ల వారికి గౌరవం కూడా హెచ్చింది.

ఈ వార్త ఒక పిడుగులా పడింది.అదీ కాక ఒక నెలనుంచి కాచుకుని ఉన్న తరువాత నృత్యం చేస్తున్న సందర్భంలో ఇలాటి వార్త చెవినపడగానే ఇది అందరికీ ఎంతో నమ్మరాని విషయంగా తోచింది. జార్ తన తొలి ఉద్రేకంలో బోరిస్ వినేట ట్లుగా వెలిబుచ్చిన మాటలు తరువాత అందరి నోళ్ళలోకి ఎక్కాయి.

రాత్రి రెండు గంటలకు జార్ తన కార్యదర్శి సిష్కొవ్‌ను పిలవనంపి తన ఉత్తర్వులను అందచేసి మార్షల్ సోల్టికోవ్ రాకుమారునికి కూడా తన ఉత్తర్వు లందచేయ మన్నాడు. అందులో తనమాట మళ్ళీ చెప్పాడు. రష్యన్ భూ స్థలంలో ఒక్క శత్రువు ఉన్నంతవరకు కూడా సంధి అన్నమాట అసంభవమని చెప్పాడు.

తరువాత నెపోలియన్ చక్రవర్తికి ఇలా ఉత్తరం వ్రాశాడు :

**మిత్రుడా !**

నీ పట్ల ఎప్పుడూ నా మాట నిలుపుకుంటూ వచ్చినప్పటికీ నీ సేనలు రష్యన్ సరిహద్దులు దాటాయని నిన్న సాయంత్రమే నాకు తెలియ వచ్చింది. ఇప్పుడే నాకు పీటర్స్ బర్గ్ నుంచి ఒక ఉత్తరం వచ్చింది. కోరకైన్ రాకుమారుడు ప్యాస్‌పోర్టు అడిగిన క్షణం నుంచి మన మధ్య యుద్ధం ప్రారంభించినట్లు తాను అనుకుంటున్న ట్లుగా కౌంట్ లారిస్టన్ వ్రాశాడు. బసానో డ్యూక్ ప్యాస్‌పోర్టు ఇవ్వకపోవడం ఇందుకు కారణం అవుతుందని నేను ఊహించ లేకుండా ఉన్నాను. నిజం చెప్పా లంటే అలాటి పనిచేసే హక్కు నా రాయబారికి లేదు. ఆ విషయం అతను కూడా చెప్పాడు. పైగా నే నా విషయం విన్న తరువాత నేను ఆ పనిని ఎంత నిరసిస్తున్నానో అతనికి తెలియచేశాను. తన స్థానంలోనే ఉండమని అతనికి ఉత్తర్వు కూడా జారీ చేశాను. ఒక చిన్న అపార్థం కారణంగా రక్తపాతం సంభవించడానికి ఒప్పకోక మీ

సేనను ఉపసంహరించడానికి మీరు అంగీకరిస్తే నేను గతాన్నంతా మరిచిపోవడానికి సిద్ధంగా ఉన్నాను. మనమొక రాజీకి రావచ్చు. కాని పక్షంలో నేను కారణం లేని ఒక దాడికి జవాబు చెప్పవలసిన అవసరం నాకు ఉంటుంది. ఇప్పటికీ కూడా ఒక కొత్త యుద్ధప్రమాదాన్ని అరికట్టే బాధ్యత మీ పైనే ఉంది. ఇక సెలవు.

ఇట్లు,
అలెగ్జాండర్''

# 65

**13 వ** తారీఖున రెండు గంటలకు జార్,బలాషోవ్‌ను పిలవనంపి అతనికి ఉత్తరం చదివి వినిపించి స్వయంగా వెళ్ళి ఆ ఉత్తరం ఫ్రెంచి చక్రవర్తికి ఇవ్వమని కోరాడు. బాల్‌లో తను చెప్పిన మాటలు మళ్ళీ చెప్పాడు. ఈ మాటలే నెపోలియన్‌కు కూడా చెప్పమన్నాడు. ఆ మాటలు తన లేఖలో వ్రాయలేదు. శాంతి కోసం ప్రయత్నిస్తున్న ఈ సందర్భంలో ఆ మాటలు వ్రాయడం ఆయనకు అనుచితంగా తోచింది.

బలాషోవ్ వెంటనే బయలుదేరి వెళ్ళాడు. తెల్లవారే సరికి రికోంటే చేరుకున్నాడు. నిమెన్ నదీ తీరంలో ఉన్నది ఆ గ్రామం. ఫ్రెంచి ఆశ్విక రక్షక దళాలు ఆ గ్రామాన్ని ఆక్రమించి అక్కడ ఉన్నాయి. ఊదా యూనిఫారం వేసుకుని ఉన్ని టోపీ పెట్టుకున్న ఒక ఆఫీసరు అతన్ని చూడగానే కేకవేసి పిలిచాడు. బలాషోవ్ కొంచెం మెల్లగా వెడుతున్నాడు. ఆ ఆఫీసరు ఏదో బూతుమాట అంటూ కత్తిదూసి "నీకు చెముడా?" అని అడిగాడు. బలాషోవ్ తన పేరు చెప్పాడు. ఫ్రెంచివాడు వెంటనే ఒక సైనికుని ఔట్‌పోస్ట్‌కు అధికారిగా ఉన్న ఒక ఆఫీసరును పిలవమని పంపించి మళ్ళీ బలాషోవ్ విషయం పట్టించుకోకుండా తన తోటివారితో కబుర్లు చెప్పుకుంటూ కూచున్నాడు. బలాషోవ్‌కు ఇలాటి అనుభవం ఇదివరకెన్నడూ జరిగి ఉండలేదు. మూడు గంటల క్రితం అతను జార్‌తో మాట్లాడుతున్నాడు.

అప్పుడే సూర్యుడు మబ్బుల్లో నుంచి తొంగి చూస్తున్నాడు. గాలి చల్లగా ఉంది. కొంచెం మంచు తుప్పర పడుతోంది. గ్రామాల నుంచి పశువుల మందలను తోలుకునిపోతూ ఉన్నారు పక్షులు ఒకదాని వెంట ఒకటి నీటి బుడగల్లాగా ఆకాశంలోకి ఎగిరి పాటలు పాడుతున్నాయి. బలాషోవ్ వాటి గమనాన్ని చూస్తూ నిలుచున్నాడు. ఫ్రెంచి ఆఫీసర్ కోసం ఎదురు చూస్తున్నాడు.

ఫ్రెంచి కర్నల్ అప్పుడే నిద్రలేచి వచ్చాడు. అతనివెంట ఇద్దరు ఆశ్విక సైనికులున్నారు. అతనొక చక్కని బూదిరంగు గుర్రాన్నెక్కి వచ్చాడు.

ఇంతవరకు ఇంకా యుద్ధం తొలిదశలోనే ఉంది,అందుచేత దుస్తులు చక్కగా

కనిపిస్తున్నాయి. శాంతి సమయంలో లాగానే ఉన్నాయి. యుద్ధం మొదలు పెట్టే టప్పుడు ఎలాటి ఒక తొలిఉత్సాహం కనిపిస్తుందో అలాంటి ఉత్సాహం కనిపిస్తోంది.

కర్నల్ ఇంకా అవులిస్తూనే ఉన్నాడు. బలాషోవ్‌ను మర్యాదగా ఆహ్వానిం చాడు. అతన్ని తీసుకుని ఔట్‌పోస్టులు దాటివెళ్లాడు. త్వరలోనే చక్రవర్తిని దర్శనం చేసుకోవచ్చునని అన్నాడు. గ్రామంలో గుండా వారు వెళ్లారు. సైనికులు, అశ్విక సైనికులు, ఆఫీసర్లు తమ కర్నల్‌కు సెల్యూట్ చేస్తున్నారు. కొన్ని ఫర్లాంగుల దూరంలో దళం జనరల్ యొక్క గుడారాలు కనిపిస్తున్నాయి.

ఆయనే చక్రవర్తి దగ్గరికి తీసుకుని పోతాడు.

ఇప్పుడు బాగా ప్రొద్దెక్కింది. పొలాల్లోనూ మైదానాల్లోనూ, బాగా ఎండ పడు తోంది. వారొక చిన్న మిట్టమీద ఉన్న వసారాపాక దాటి వెళ్లారో లేదో కొందరు ఆఫీసర్లు వారివైపుకు రావడం వారికి కనిపించింది. ఒక పొడుగైన ఒక వ్యక్తి ఒక నల్లని గుర్రాన్ని ఎక్కి వస్తున్నాడు. బలాషోవ్ అతనికి కొద్దిగజాల దూరంలో ఉన్నాడో లేదో ఫ్రెంచి కర్నల్ జనరల్, అతని చెవిలో "ఇతనే నేపిల్సు రాజు" అని చెప్పాడు.

నిజానికి అతను మురత్. అతన్నిప్పుడు నేపిల్సు రాజని ఎందుకంటున్నారో ఎవరికీ తెలీదు. అతను కూడా నేపిల్సు నుంచి తన భార్యతో కలిసి వస్తూ ఉండగా కొందరు ఇటాయలియన్లు "నేపిల్సు రాజుకు-జయమగు గాక!" అని అరిచారు.తను వెళ్ళిపోతున్నందువల్ల వారలా అంటున్నారేమో అని అతననుకున్నాడు.

తను నేపిల్సు రాజని అతను అనుకుంటూ ఉన్నప్పటికీ, తను వెళ్ళిపోతు న్నందుకు తన ప్రజలు చింతిస్తున్నప్పటికీ తన బావమరిది మాట మాత్రం చెప్ప గానే అతను మళ్ళీ తన మామూలు పనులలోకి దిగాడు. "నీవు నా ఉద్దేశం ప్రకారం పరిపాలించడం కోసం నిన్ను రాజును చేశాను. కాని నీ ఉద్దేశం ప్రకారం పరిపాలించడానికి కాదు" అని నెపోలియన్ అతనితో డాన్జిగ్‌లో చెప్పాడు. ఆయన అలా చెప్పిన వెంటనే అతను దూసుకుని పరుగెత్తే గుర్రం లాగా పోలిష్ రహ దారుల వెంట పరుగెత్త సాగాడు.

రష్యన్ జనరల్‌ను చూడగానే మురత్ ఒక రాజ ఠీవితో తల ఊపి ఏమిటి విషయం అన్నట్లుగా ఫ్రెంచి కర్నల్ వైపు చూచాడు. ఫ్రెంచి కర్నల్ ఆయనకు బలాషోవ్ ఏం పనిమీద వచ్చాడో తెలియ చేశాడు. కాని బలాషోవ్ పేరును మాత్రం సరిగా ఉచ్చరించలేక పోయాడు.

"డీబెల్ మెషేవా?" అన్నాడు రాజు? అతను బలాషోవ్ పేరు ఉచ్చరించ లేక పోవడం చూచి "మీ పరిచయం కలిగినందుకు ఎంతో సంతోషిస్తున్నాను

జనరల్" అన్నాడు. కాని అతను కంఠస్వరం హెచ్చించగానే తను ఊహించిన ఠీవిని కోల్పోవడం గమనించి మళ్ళీ తన మామూలు స్థాయిలో మాట్లాడ సాగాడు. బలాషోవ్ జీను మీద చెయ్యి వేసి "యుద్ధం పనిమీదే వచ్చారనుకుంటాను." అన్నాడు.

"మా యజమాని జార్ యుద్ధం కోరడం లేదు, మీ చక్రవర్తిగా రనుకుంటున్నట్లు ..." అంటూ ఏదో చెప్పబోయాడు బలాషోవ్. మాటి మాటికీ చక్రవర్తి పేరు తీసుకు రాసాగాడు. రష్యా చక్రవర్తి రాయబారి అయిన బలాషోవ్ తనేదో రాజ్య వ్యవహారాలు చర్చించా లనుకున్నాడు మురత్. అలా అనుకుని గుర్రం దిగాడు. తరువాత బలాషోవ్ చెయ్యి పుచ్చుకుని అతనితో మాట్లాడుతూ అటూ ఇటూ నడవ సాగాడు. రష్యా నుంచి తన సేనలు ఉపసంహరించుకోమని అన్నందుకు నెపోలియన్‌కు చాలా కోపం వచ్చిందని చెప్పాడు. కాని అందులో కోపం రావలసిన పని ఏమీ లేదన్నాడు బలాషోవ్.

కాని మురత్ మాత్రం ఒప్పుకో లేదు. "అయితే మీ ఉద్దేశంలో యుద్ధాన్ని రెచ్చగొట్టింది అలెగ్జాండర్ చక్రవర్తి కాదన్న మాట!" అన్నాడు మురత్, వెర్రి వానిలా చిరునవ్వు నవ్వుతూ.

నెపోలియనే యుద్ధాన్ని ప్రారంభించాడని తాము ఎందుకోసం అనుకుంటున్నారో కారణాలు వివరంగా చెప్పాడు బలాషోవ్.

"సరే జనరల్! ఇరువురు చక్రవర్తులూ కలిసి విషయాలు పరిష్కరించుకుని యుద్ధాన్ని ఆపు చేస్తారని నేను కూడా ఆశిస్తున్నాను. యుద్ధం ఆగిపోవాలనే నా కోరిక కూడా" అన్నాడు మురత్. తను మాత్రం మంచిగా ఉండదలుచుకున్న వాడిలాగా.

తరువాత గ్రాండ్ డ్యూక్ ఆరోగ్యం ఎలా ఉందని అడిగాడు. వారిరువురు కలిసి నేపిల్సులో ఎంతో కులాసాగా కాలక్షేపం చేశామని చెప్పాడు. తరువాత హఠాత్తుగా తన చక్రవర్తి విషయం జ్ఞాపకం వచ్చి ఇలా అన్నాడు.

"ఇక మిమ్మల్ని ఎక్కువ కాలం అట్టిపెట్టను. మీరు వచ్చిన పని సానుకూల పడుతుంది గాక!"

ఇలా అని మురత్ మళ్ళీ తన పరివారంతో కలిసి వెళ్ళిపోయాడు. కొద్ది క్షణంలో అతని జరీ దుస్తులు, తలపై పెట్టుకున్న ఈకె, సూర్య కిరణాలు ప్రతి ఫలిస్తున్న ముత్యాలు: అన్నీ దూరంలో అదృశ్యమై పోయినాయి.

బలాషోవ్, నెపోలియన్‌ను కొద్ది దూరంలోనే కలుసుకో వచ్చునని వెళ్ళాడు. కాని ఆ ప్రక్క గ్రామం చేరేసరికి డవొస్టు పదాతి దళాల రక్షక సైనికులు అతన్ని ఆపు చేశారు. ఆ జనరల్ సహాయ సేనాధిపతి అతన్ని మార్షల్ దగ్గరికి తీసుకుని వెళ్ళాడు.

# 66

అరక్షేవ్ జార్ చక్రవర్తికి ఎలాంటివాడో, దవొస్టు నెపోలియన్ చక్రవర్తికి అలాంటివాడు. అయితే అరక్షేవ్ లాగా దవొస్టు పిరికిపంద మాత్రం కాదు. ఉద్యోగ రీత్యా అతనికి ఉన్న పట్టుదలలు ఇతనికి కూడా ఉన్నాయి. అంత నిక్కచ్చిగా ఇతను కూడా ఉంటాడు. యజమానులను సంతృప్తిపరిచే పద్ధతిలో ఇద్దరూ ఒకే రకంగా ఉంటారు. తాము క్రూరంగాను నిక్కచ్చిగాను, ఉంటే యజమానులు సంతృప్తి చెందుతారని అనుకుంటారు. ప్రకృతిలో తోడేళ్ళు ఉండడం ఎలా అవసరమో పరిపాలనా యంత్రంలో ఇలాంటివారు ఉండడం కూడా అలాగే అవసరం. వాళ్ళు ఎప్పుడూ ఉంటారు కూడా. చక్రవర్తితో దగ్గరి సంబంధం ఉండడమే వారి ఉనికికి ప్రధాన కారణం. అంతకుమించి కారణం కూడా ఏమీ కనిపించదు. కాని పక్షంలో అరక్షేవ్ లాంటి ఒక క్రూరుడు- ఒక కర్కశుడు- ఒక అనాగరికుడు, మృదుహృదయుడు ఉదారుడు అయిన అలెగ్జాండర్ చక్రవర్తి లాంటి వాడి సింహాసనం ప్రక్కన నిలుచుని మంతనాలు చేయడం ఎలా జరుగుతుంది?

బలాషోవ్, మార్షల్ దవొస్టును కలుసుకున్నాడు. అతను వెళ్ళేసరికి దవొస్టు తన సహాయ సేనాధిపతితో కలిసి తన పాకలో ఒక పీపా మీద కూచుని లెక్కలు సరిచూచు కుంటున్నాడు. అతను కావాలని అనుకుంటే అంతకంటే మంచి ఇల్లు దొరికి ఉండేది. కాని అతను జీవితాన్ని క్లిష్టం చేసుకోవడానికి అలవాటు పడిన మనిషి. ఎప్పుడూ ఏదో గొడవల్లో ఉన్నట్టుగా ఉంటాడు. అతను ఏ సేవకునితో చెప్పినా అతని కింతకంటే మంచి నివాసం దొరికి ఉండేది.

"ఒక పాకలో ఇలా ఒక పీపామీద కూచుని నాలాగా ఏవేవో గొడవలు పడుతూ ఉంటే ఇక సుఖమనేది ఎక్కడుంది?" అన్నట్లుగా ఉంది అతని ముఖం. ఇలాంటివారు జీవితంలో ఎరిగిన ఆనందం ఒకటే. దాన్నే గొప్ప ఆనందమని అనుకుంటారు. తమకు ఉన్న పదవిలాంటి పదవిలేని మరెవరినైనా వారు కలుసుకోవడం తటస్థిస్తే అంతూ పంతూలేని పనిలో వారు మునిగి ఉన్నట్లుగా ప్రదర్శిస్తూ ఉంటారు. బలాషోవ్‌ను చూడగానే దవొస్టు కూడా ఇలాగే చేశాడు. అప్పుడే హాయిగా చల్లని ఉదయాన గుర్రపుస్వారి చేసి వచ్చిన బలాషోవ్‌కు దవొస్టు ఇలా కనిపించాడు. ఒకమాటు అతనివంక కళ్ళజోడులో నుంచి చూచి అతన్ని గమనించనట్లుగా చిరునవ్వు నవ్వాడు. మర్యాద కూడా తెలీకుండా మళ్ళీ తన లెక్కల్లో మునిగిపోయాడు. తను ఇలా విచిత్రంగా ప్రవర్తించడం తనకు తెలీకపోలేదు. అందుచేతనే వెంటనే కళ్ళెత్తి చూచి ఎందుకోసం వచ్చావని బలాషోవ్‌ను అడిగాడు.

దవొస్టు తననిలా అమర్యాదగా స్వీకరించడానికి కారణం తను రాజపరి

వారంలో సహాయ సేనాధిపతినని, జార్ కు ప్రతినిధినని అతనికి తెలియక పోవడమే అని బలాషోవ్ అనుకుని, తను వచ్చిన పని త్వరగా చెప్పసాగాడు. కాని తనలా చెపుతోంటే డవొస్టు మరింత నిక్కచ్చిగా ఉండడం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

"ఏవీ, నీవు తీసుకొచ్చిన కాగితాలు ఇలా ఇవ్వు. నేను వాటిని చక్రవర్తికి పంపుతాను" అన్నాడు డవొస్టు.

బలాషోవ్, తను వాటిని స్వయంగా చక్రవర్తికి అందచేయాలని చెప్పాడు.

"నీ చక్రవర్తి ఆజ్ఞలు మీ సైన్యంలో కాని ఇక్కడ నీవు మా నియమాలకు లోబడి ఉండాలి" అంటూ డవొస్టు తమ దయాదాక్షిణ్యాలపైన వారు ఆధారపడి ఉన్నారని అతనికి తెలియచెయ్యడం కోసం ఒక ఆఫీసరును కూడా పిలిపించాడు.

బలాషోవ్ జార్ ఉత్తరం ఉన్న ప్యాకెట్టును టేబిల్ మీద ఉంచాడు. అది నిజానికి టేబిల్ కాదు. ఒక తలుపుచెక్క. పీపామీద దాన్ని పెట్టారు. డవొస్టు ప్యాకెట్టు మీది చిరునామా చదివాడు.

"మీరు నన్ను మర్యాదగా చూడవచ్చు, చూడకపోవచ్చు. అది మీ ఇష్టం కాని నేను మీకొక విషయం తెల్పదలుచుకున్నాను. నేను చక్రవర్తి సహాయ సేనాధిపతుల్లో ఒకణ్ని కాబట్టి...." అని బలాషోవ్ ఇంకా ఏదో చెప్పబోయాడు. డవొస్టు అతనివంక నివ్వెరపోయి చూచాడు. కాని మరేమీ మాట్లాడలేదు.

"నీకు తగిన మర్యాద నీకు చేస్తాం" అన్నాడు డవొస్టు కొంతసేపు ఆగి, తరువాత ఆ కాగితాలు జేబులో పెట్టుకుని అక్కణ్నుంచి వెళ్లాడు. ఒక నిముషం తరువాత డవొస్టు సహాయ సేనాధిపతియైన మాన్‌షియర్ డీ కాస్ట్రిస్ బలాషోవ్ కోసం వచ్చి అతన్ని తీసుకునివెళ్ళి బస చూపించాడు. బలాషోవ్ ఆ రోజు డవొస్టుతో కలిసి ఆ పాకలో భోజనం చేశాడు. ఆ మరుసటిరోజు తను వెడుతున్నాననీ బలాషోవ్ అక్కడే ఉండి ఆ తరువాత సామాన్ల బండ్లతో రావలసిందనీ మార్షల్ చెప్పాడు. అతను అక్కడ ఉన్నన్నాళ్ళు ఒక్క మాన్‌షియర్ డీ కాస్ట్రిస్‌తో తప్ప మరెవ్వరితోనూ సంబంధం పెట్టుకోకూడదు.

నాలుగు రోజులు ఒంటిగాను, చిరాకుగాను గడిపిన తరువాత బలాషోవ్‌కు తను ఎంత అసహాయ స్థితిలో ఉన్నదీ తెలిసింది. మార్షల్, డవొస్టు సామాన్లు వేసిన బండిలో కూచుని ఫ్రెంచి సేనలతో సహా కొన్ని మజిలీలు ప్రయాణం చేసిన తరువాత బలాషోవ్‌ను విల్నాకు చేర్చారు. ఇప్పుడు విల్నా ఫ్రెంచివారి చేతుల్లో ఉంది. నాలుగు రోజుల క్రితం తను వచ్చిన ద్వారం గుండానే మళ్ళీ నగరంలోకి వెళ్ళాడు.

ఆ మరుసటి ఉదయం నెపోలియన్ సలహాదారుల్లో ఒకడైన మాన్‌షియర్ డీటురీన్ అతని దగ్గరికి వచ్చి చక్రవర్తి దర్శన మిస్తాడని చెప్పాడు.

ఒకటి రెండు రోజులు ముందుగా ప్రియ బ్రిజెన్‌స్కీ దళపు రక్షక సైని కులు బలాషోవ్ ఉన్న ఇంటిముందు కాపలాకాశారు. కాని ఇప్పుడు ఇద్దరు ఫ్రెంచి సైనికులు నల్లని దుస్తులు ధరించి అక్కడ కాపలా కాస్తున్నారు. ఒక స్టాఫ్ ఆఫీసరు పరివారం కూడా అక్కడ ఉంది. నెపోలియన్ కోసం ఎదురు చూస్తోంది. వారు బాల్కనీ మెట్ల దగ్గర నిలుచుని ఉన్నారు. వారికి దాపులోనే నెపోలియన్ గుర్రం కూడా ఉన్నది. సేవకుడు రౌస్టన్ దాన్ని పట్టుకుని ఉన్నాడు.

అలెగ్జాండర్ ఏ ఇంట్లో నెపోలియన్‌కు అందజేయ వలసిన సందేశం తనకు ఇచ్చాడో, ఇప్పుడా ఇంట్లోనే నెపోలియన్ అతన్ని స్వీకరిస్తూ ఉన్నాడు.

# 67

బలాషోవ్‌కు రాజసభ వైభవం కొత్తది కాదు. అయినప్పటికీ ఫ్రెంచి చక్ర వర్తి దర్బారులో ప్రతి చిన్న విషయంలోనూ కనిపించే వైభవం అతనికి ఆశ్చర్యం కలిగించింది. కౌంట్ డీటురీన్ అతన్ని ఒక పెద్ద గదిలోకి తీసుకునివెళ్లాడు. ఆ గదినిండా జనరళ్ళు, దర్బారీయులు, రాజ సలహాదార్లు, పోలెండులోని గొప్ప గొప్ప వారు సమావేశమై ఉన్నారు. వీరిలో చాలామంది పూర్వం అక్కడ చక్రవర్తి దర్బారులో ఉంటూ వచ్చినవారే. తరువాత డురక్ ముందుకువచ్చి చక్రవర్తి స్వారీకి వెళ్ళడానికి ముందు అతనికి దర్శన మిస్తాడని చెప్పాడు.

కొద్ది నిముషాల్లో చక్రవర్తిని కనిపెట్టి ఉండే ఒక ఆఫీసరు అక్కడికి వచ్చి అతన్ని ఒక చిన్న డ్రాయింగ్ రూంలోకి తీసుకుని వెళ్ళాడు. ఆ డ్రాయింగ్ రూం ప్రక్కగదిలోనే తను అలెగ్జాండర్ ఆజ్ఞలను అందుకున్నాడు. అక్కడతను కొంత సేపు వేచి ఉండవలసి వచ్చింది. ఇంతలో వాకిలి అవతల అడుగుల చప్పుడు విని పించింది. తలుపు తెరుచుకుంది. నెపోలియన్ వచ్చి అతని కెదురుగా నిలుచున్నాడు. ఆయన స్వారీ దుస్తుల్లో ఉన్నాడు. నీలపు యూనిఫారము, పొడుగైన తెల్లటివెయిస్టు కోటు వేసుకున్నాడు. ఎత్తైన బూట్లు అతని కాళ్ళకు కరుచుకున్నట్లుగా వున్నాయి. జుట్టు వత్తుగా కత్తిరించుకున్నాడు. విశాలమైన నుదుటిమీద ఒక పొడుగైన ఉంగరం లాగా పడుతోంది జుట్టు. తెల్లనిమెడ,నీలపు యూనిఫారంలో నుంచి కనిపిస్తోంది. యుడికొలోన్ సెంటు రాచుకుని ఉన్నాడు. అతని ముఖం ఇంకా లేతగాను,యువకుని ముఖంలాగాను ఉంది, ఒక విధమైన ఠీవి, మర్యాద కనిపిస్తున్నాయి. తల ఎత్తి త్వరగా నడుస్తున్నాడు. ప్రతి అడుగుకూ ఊగుతున్నాడు. మొత్తంమీద అతని రూపు చూస్తే ఒక పరిపక్వత చెందిన వ్యక్తిలాగా కనిపిస్తాడు. నలభై ఏండ్లు హాయిగా

జీవితం గడిపిన వాళ్ళు ఆ విధంగా కనిపిస్తారు. ఎంతో కులాసాగా ఉన్నట్లుగా ఉన్నాడు.

బలాషోవ్ ఆయన్ను చూడగానే గౌరవంతో తలవంచాడు. చక్రవర్తి వెంటనే మారుగా తల ఊపి కాలం యొక్క విలువ తెలిసినవాడిలాగా త్వరత్వరగాను, ముక్త సరిగాను మాట్లాడ సాగాడు. తను మాట్లాడిన ప్రతిమాట తూచినట్లుందని అనుకున్న వాడిలాగా మాట్లాడ సాగాడు.

"మంచిది జనరల్, అలెగ్జాండర్ చక్రవర్తి మీచేత పంపిన ఉత్తరం నాకు అందింది. మీరు వచ్చినందుకు సంతోషం" అన్నాడు నెపోలియన్. ఒక్క క్షణం పాటు తన చూపును బలాషోవ్ ముఖం మీది నుంచి అవతలికి మరల్చాడు. అతని పట్ల ఏమీ ఆసక్తి చూపలేదు. ఎప్పటిలాగానే ఆయన దృష్టి తన మనస్సులో పని చేసే భావాలపైనే ఉన్నవి. ఇతర ప్రపంచమంతా తన ఆలోచనల ముందు ఆయనకు చాలా అల్పంగా కనిపిస్తోంది.

"నే నెప్పుడూ యుద్ధాన్ని కోరలేదు—ఇప్పుడూ కోరను. కాని ఇది నా నెత్తి మీద రుద్దారు. అయినా ఇప్పటికీ కూడా (ఈ మాటలు ప్రత్యేకంగా చెప్పాడు.) మీరిచ్చే ఎలాటి సంజాయిషీనైనా ఒప్పుకోవడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు నెపోలియన్ మళ్ళీ. రష్యన్ ప్రభుత్వం పట్ల ఆయన తన అసంతృప్తిని వెల్లడించాడు.

స్నేహపూర్వకమైన అతని ధోరణి బలాషోవ్‌కు భ్రాంతి కలిగించి ఇక రాయబారమంతనాలు సాగిద్దామనుకున్నాడు.

"అయ్యా! మా యజమాని జార్ చక్రవర్తి " అని ప్రారంభించబోయాడు. కాని నెపోలియన్ తన వంక తదేకంగా చూడడం గమనించి కొంచెం తటపటాయించాడు. ఆయన చూపులు "నీవు కొంచెం సంకోచిస్తున్నట్లున్నావు. మరేం ఫరవా లేదు" అన్నట్లుగా ఉన్నాయి. ఆయన పెదవులపై కనిపించనంతగా ఒక చిన్న చిరునవ్వు కనిపిస్తోంది. ఏమైనప్పటికీ బలాషోవ్ తన మాటలు చెప్ప సాగాడు. అలెగ్జాండర్ కోరకైన్ ప్యాస్‌పోర్టు కోరడాన్ని ఒక తప్పుగా భావించలేదనీ, రాయబారి ఉత్తర్వులు లేకుండా ప్రవర్తించాడనీ, జార్ యుద్ధం రాకుండా చేయాలని కోరుతున్నాడనీ, ఇంగ్లండుతో ఆయన కెలాటి ఒప్పందమూ లేదనీ, ఇంకా ఏదో చెప్పబోయాడు.

"అయితే ఇంకా..." అన్నాడు మధ్యలో నెపోలియన్. కాని తను బయట పడిపోతానన్న భయంతో రష్యన్ రాయబారినే తను చెప్పదలుచుకున్నది చెప్పమన్నట్లు తల ఊపాడు.

బలాషోవ్ తను చెప్పదలుచుకున్న దంతా చెప్పి- తరువాత కొన్ని షరతులకు ఒప్పుకున్న పక్షంలోనే జార్ మంతనాలు ప్రారంభించ గలడని చెప్పాడు.

కాని వెంటనే ఆగిపోయాడు. సోల్టికోవేతో జార్ అన్న మాటలు అతని కిప్పుడు జ్ఞాపకం వచ్చాయి. ఆ మాటలే ఫ్రెంచి చక్రవర్తితో చెప్పవలసిందని జార్ తనను కోరాడు. అవి అతనికి స్పష్టంగా జ్ఞాపకం ఉన్నాయి. కాని ఎందుచేతనో అవి తన నోటి దగ్గరికి వచ్చేసరికి ఆ మాటలు అనడానికి సంకోచించాడు. కొంచెం సంకోచిస్తూ ఇలా అన్నాడు: "తమరు నిమెన్ దాటించిన సైన్యాలను ఉపసంహరించే షరతు మీద" ఇలా అని ఆగిపోయాడు.

నెపోలియన్ అతని ఆందోళనను గమనించాడు. ఆయన ముఖంలోని కండరాలు ముళ్ళు తిరిగాయి. ఆయన ఎడమకాలి పిక్క కంపించ సాగింది. అక్కడ నుంచి కదలకుండా మరింత బిగ్గరగా మాట్లాడుతున్నాడు. బలాషోవ్ ఆయన పిక్క అలా మారడం చూచాడు. ఆయన గొంతు హెచ్చవుతున్న కొద్దీ ఆ పిక్క వణకడం కూడా హెచ్చు కావడం అతను గమనించాడు.

"అలెగ్జాండర్ చక్రవర్తి శాంతిని ఎంతగా కోరుతున్నాడో నేనూ అంతగా కోరుతున్నాను. ఈ పద్దెనిమిది నెలల నుంచీ శాంతిని భద్రంగా కాపాడడం కోసం నేను నా శాయశక్తులా ప్రయత్నించ లేదంటారా? నేను ఈ పద్దెనిమిది నెలల నుంచీ కూడా మీ సంజాయిషీల కోసం ఎదురు చూస్తూనే ఉన్నాను. సరే మీ మంతనాలు ప్రారంభించే లోగా నన్ను ఏం చేయమంటారు చెప్పండి?" తన చిన్న తెల్లని చేతిని ఊపుతూ ఈ ప్రశ్న అడిగాడు నెపోలియన్.

"మీ సేనను నిమెన్ నది ఈవలి దరినుంచి ఉపసంహరించాలి" అన్నాడు బలాషోవ్.

"నిమెన్ నది ఈవలి దరినుంచా? అంతేనా?" అన్నాడు నెపోలియన్ అతని ముఖంలోకి సూటిగా చూస్తూ.

బలాషోవ్ అవునన్నట్లు తల వంచాడు. నాలుగు నెలల క్రితం ఫ్రెంచివారు పోమెరేనియా వదిలి వెళ్ళాలని కోరారు. కాని ఇప్పుడు నిమెన్ నదిని వదిలి వెడితే చాలునని అంటున్నారు.

తరువాత చక్రవర్తి గదిలో అటూ ఇటూ నడుస్తూ "అయితే మీ రనేది మంతనాలు ప్రారంభించే లోగా నేను మళ్ళీ మరొక మారు నిమెన్ నదిని దాటాలి అంటారు, అంతేకదా? కాని మీకొక విషయం తెలుసా? రెండు నెలల క్రితమే నన్ను ఇలాగే ఓడర్, విస్టులా నదులు తిరిగి దాటమని కోరారు. అయినప్పటికీ మీరింకా మంతనాలుకు తయారుగా ఉన్నారు" అన్నాడు. తరువాత కొద్దిసేపాగి ఇంకా గదిలో అటూ ఇటూ నడుస్తూనే బలాషోవ్ ముందు ఆగాడు. ఆయన ముఖం రాతిలా గడ్డ కట్టుకుని పోయింది. ఆయన ఎడమకాలు ఇంకా వణుకుతూనే ఉంది. తరువాత ఒకమాటు ఆయన ఇలా అన్నాడు:

"నా ఎడమకాలు వణకడం శుభసూచకం."

"ఓడర్‌ను కాని విస్టులాను కాని వదిలిపెట్టవలసిన సూచనలు ఇవ్వవలసింది. బేడెన్ రాకుమారుడికి కాని నాకు కాదు" అన్నాడు మళ్ళీ నెపోలియన్ హఠాత్తుగా. "పీటర్స్‌బర్గును, మాస్కోను మీరు నాకు అప్పగించినప్పటికీ నేను మీ షరతులు ఒప్పుకోను; నేను యుద్ధం ప్రారంభించానని మీరు నన్ను నిందిస్తున్నారు. కాని అతని సేనలో మనలో మొట్టమొదటిగా చేరిందెవరు? అలెగ్జాండర్ చక్రవర్తి! ఇప్పుడు మీరు నా దగ్గిరికి వచ్చి మంతనాలను గురించి మాట్లాడుతున్నారు. నేను కోట్లు ఖర్చుచేసిన తరువాత, మీరు ఇంగ్లండుతో చేతులు కలిపిన తరువాత, నానాటికీ మీ పరిస్థితి విషమంగా పరిణమించిన తరువాత ఇప్పుడు మీరు నా దగ్గరికి వచ్చి మంతనాలు సాగిస్తున్నారు. ఇంగ్లండుతో మీరు పొత్తు కలవడంలో మీ ఉద్దేశం ఏమిటి? దానివల్ల మీకు జరిగిన మేలేమిటి?" ఇలా తను చేసిన పనులను సక్రమమైనవని రుజువు చేసుకుంటూ, జార్ వేసిన తప్పటడుగులను చూపుతూ చెప్పుకపోసాగాడు నెపోలియన్. శాంతి ఏర్పడే అవకాశాల విషయం మాత్రం చర్చించ లేదు. ఇలా మాట్లాడుతూ ఒకసూచన కూడా ఇచ్చాడు. తనది పైచెయ్యి అయినప్పటికీ ఇంకా తాను రష్యాతో సంబంధ బాంధవ్యాలు నెలకొల్పడానికి సిద్ధంగా ఉన్నానని సూచించాడు. కాని హెచ్చరించే సందర్భంలో మాత్రం కొంచెం పట్టుతప్పి మాట్లాడినట్లుగా కనిపించాడు. పోను పోను ఒక విషయం స్పష్టమైంది. ఇలా మాట్లాడడంలో అతని ఉద్దేశం తనను తాను గొప్పగా చూపుకుంటూనే జార్‌పట్ల తను చేయనున్న ఉపకార బుద్ధిని ప్రదర్శించడమే. మొదట్లో మాత్రం ఇది తన ఉద్దేశమైనట్టు ఆయన కనిపించలేదు.

"మీరు టర్కీతో సంధిచేసుకున్నారని విన్నాను?" అని అడిగాడు.

బలాషోవ్ అవునన్నట్లు తల ఊపాడు. "అవును ఆ సంధి..." అని చెప్పబోయాడు.

కాని నెపోలియన్ అతనికి అడ్డుతగిలాడు, తను తప్ప ఇతర్లెవరూ మాట్లాడడానికి వీలులేదన్నట్లు.

"అవును. నాకా విషయం తెలుసు" అన్నారాయన. అప్పుడాయన ధోరణి తీవ్రంగా ఉంది. చెడిపోయిన శ్రీమంతుల బిడ్డలకు సహజంగా ఇలాటి ధోరణి ఉంటుంది. "మీరు మోల్డోవియా, వలాషియాలు తీసుకోకుండానే టర్కీతో ఒడంబడిక చేసుకున్నారు, నేను ఫిన్‌లెండును ఇచ్చినట్లుగా ఈ రాష్ట్రాలను కూడా మీ చక్రవర్తికి ఇచ్చేసి ఉండేవాణ్ణి-అవును. వాటిని ఆయనకు బహూకరించి ఉండేవాణ్ణి. ఆ విధంగా వాగ్దానం చేశాను కూడా. కాని ఇప్పుడిక ఆయనకెలా వస్తాయి? తన సామ్రాజ్యంలో వాటిని కలుపుకుని రష్యాను బోత్‌నియా అగాధం దగ్గర నుంచి డాన్యూబ్ నదీ ముఖం వరకూ వ్యాపింపచేసి ఉంటే ఆయనెంతో సంతోషించి

ఉండేవాడు. మహారాజ్ఞి కాథెరైన్ కూడా ఇలాంటి పనిచేసి ఉండేది కాదు" అన్నాడు. ఆయన ఉద్వేగం రానురాను మరింత హెచ్చింది. టిల్‌సిట్ సమావేశంలో తను చెప్పినమాటలే కొద్ది మార్పులతో మళ్ళీ చెప్పాడు. "నాతో స్నేహంవల్ల ఆయన కెంత అద్భుతమైన రాజ్యం వచ్చి ఉండేది!" చిన్న బంగారు నశ్యండబ్బా జేబులో నుంచి తీసి "ఎంత గొప్ప సామ్రాజ్యాన్ని అలెగ్జాండర్ చక్రవర్తి పరిపాలించి ఉండే వాడు!" అన్నాడు.

తరువాత బలాషోవ్ వంక అర్థింగా చూచి,జనరల్ తనేదో మాట్లాడబోగానే మళ్ళీ తనిలా మాట్లాడడం మొదలెట్టాడు. "ఆయనకు నా స్నేహం కంటె నిజంగా కావలసింది మాత్రమేముంది? ఏమీ లేదు. కాని నాకంటె నా శత్రువులే ఆయనకు ప్రియమైనారు. స్టీన్, ఆరమ్‌ఫెల్టు బెనిక్‌సన్, విన్‌జిన్ గొరోడ్; ఇలాటి వాళ్ళంతా ఆయన చుట్టూ పోగయ్యారు, తన దేశం నుంచి ద్రోహిగా తరిమివెయ్యబడిన స్టీన్, నీతి నియమాలు లేని కుట్రదారైన ఆరమ్ ఫెల్టు, ఫ్రెంచి ప్రవాసి విన్‌జిన్ గొరోడ్ అసమర్థుడైన బెనిక్‌సన్; వీరంతా అతనిచుట్టూ పోగయ్యారు. 1807లో బెనిక్‌సన్ ఎందుకూ పనికిరాకుండా పోయాడు. అతనక్కడ ఉండడమే ఆయన మనస్సును కలవరపెట్టి ఉండవలసింది. పోనీ వీరెందుకైనా పనికివచ్చేవారైనా! అయి ఉన్న ట్టయితే వారిని దగ్గరికి తీయడంలో అర్థమూ,ప్రయోజనమూ ఉండేది" అని మళ్ళీ తనమాటల్లోపడి కొట్టుకుని పోతూ "కాని వీరెందుకూ పనికిరారు—యుద్ధ సమయం లోనూ పనికిరారు, శాంతి సమయంలోనూ పనికిరారు. వీరందరిలోకీ బార్‌క్లే సమర్థ డంటారు. కాని అతని తొలి దండయాత్రలను బట్టి చూస్తే అదేమీ కనిపించడంలేదు ...వీరంతా ఏంచేసేటట్టు? ఫుల్ ఏదో ఒక సూచన చేస్తూ కూచుంటాడు. ఆరమ్ ఫెల్టు ఎప్పుడూ ఏదో వాదిస్తూ ఉంటాడు. బెనిక్‌సన్ విమర్శిస్తూంటాడు. బార్‌క్లే పని సమయం వచ్చేసరికి ఏం చేయాలో అతనికి తెలీదు. బ్రెగేషియన్ ఒక్కడే వీరందరిలోకీ సరైన సైనికుడు. అతను అవివేకి. కాని అతనికి అనుభవం ఉంది. ఏ విషయాన్నైనా ఇట్టే తెలుసుకుంటాడు. వెంటనే నిశ్చయించుకోగలడు కూడా ...వీళ్ళంతా ఇలా ఉంటే ఈ అసమర్థులందరి మధ్యలో కుర్రవాడైన మీ చక్రవర్తి ఏం చేయగలడు? ప్రతి విషయంలోనూ ఆయన రాజీపడుతూ ఉంటాడు. అన్ని విషయాలు ఆయన నెత్తిమీది కొచ్చిపడుతూ ఉంటాయి. ఒకరాజు ఎప్పుడూ తను సైనికుడు కానప్పుడు సేనతో కలిసి ఉండకూడదు" అన్నాడు. ఈ మాటలు జార్‌కు సవాలుగా అన్నాడు. మిలిటరీలో సైనికుడు కావడం అలెగ్జాండర్ ప్రధానాశయాల్లో ఒకటి అని నెపోలియన్‌కు తెలుసు. "ఒకవారం క్రితం దండయాత్ర ప్రారంభిం చగా మీరు విల్నానైనా ఎందుకు నిలుపుకోలేక పోయారంటారు? మీరు రెండుగా చీల్చబడ్డారు. పోలిష్ రాష్ట్రాల నుంచి తరిమి వేయబడ్డారు. మీసేన అప్పుడే గొణుగుడు కూడా మొదలెట్టింది."

"క్షమించండి" అంటూ బలాషోవ్ ఆయన ప్రవాహానికి అడ్డుతగిలి తనేదో చెప్పబోయాడు.

"అవును, నాకు తెలుసులే." అంటూ నెపోలియన్ మళ్ళీ అతనికి అడ్డుతగిలి "నాకంతా తెలుసు— మీ సేనల శక్తి నాకు తెలుసు. నా సేనలశక్తి నాకు తెలుసు. అన్నిరకాల శాఖలకూ చెందిన సైనికులు మీకు ఇరవై లక్షలమంది కంటె ఎక్కువ ఉండరు. నాకు అంతకు మూడురెట్లు ఎక్కువగా వున్నారు. నేను చెపుతున్నది నిజం" అన్నాడు తన మాటలు అవతలివారు విశ్వసించేటట్లుగా. "నాకు విస్టులాకు ఇటువైపుగా యాభై మూడు లక్షలమంది సైనికులున్నారు. మీరు టర్కులవల్ల ఉపయోగం ఉందని అనుకుంటూ ఉన్నారు. కాని వారెందుకూ పనికిరారు. ఆ విషయం వారు మీతో సంధి చేసుకోవడంతోనే తేలిపోయింది. ఇక స్వీడిష్‌వారి విషయం ఎప్పుడూ వారు వెర్రివాళ్ళ పరిపాలనలోనే ఉంటారని వారి నొసట వ్రాసిపెట్టి ఉంది. వారు రాజుకు మతి తప్పిపోగానే మరొక వెర్రివాణ్ని చేపట్టారు. అతనే బెర్నాడెటే. స్వీడన్‌కు ఇంతకంటె వెర్రి మరేం ఉంటుంది?" అన్నాడు.

బలాషోవ్ అన్నిటికీ సమాధానాలు చెప్పగలడు. కాని ఆ వాక్ప్రవాహాన్ని ఆపలేక అసహనంతో తనకు తెలీకుండానే చేతులు అటూ ఇటూ తిప్పుతున్నాడు. స్వీడన్‌ల వెర్రి విషయం ప్రస్తావిస్తూ నెపోలియన్ మరో విషయం కూడా చెప్పి ఉండేవాడు. రష్యాతో సంధి చేసుకోవడంవల్ల స్వీడన్ ఒక దీవిగా అయిపోయిందన్న విషయం చెప్పేవాడే. కాని నెపోలియన్ చిరాకులో ఉండడంవల్ల తను చెప్పే విషయం నిజమని తనే రుజువుచేసుకునే వాడిలాగా బిగ్గరగా మాట్లాడుతున్నాడు. రష్యన్ జనరల్‌కు పరిస్థితి సంకటంగా తోచింది. నెపోలియన్ మాటలకు మారు చెప్పకపోవడం వల్ల తన గౌరవాన్ని తగ్గించు కుంటున్నానేమోనని భయం కలిగింది. కాని ఒక వ్యక్తిగా అకారణమైన ఈయన ధాటిముందు ఆగలేకపోయాడు. ఇదంతా వట్టి వాగుడు మాత్రమేనని అతనికి బాగా తెలుసు. తరువాత కొంచెం మతి స్థిమితం చిక్కినప్పుడు నెపోలియన్ కూడా మాట్లాడినందుకు సిగ్గుపడతాడని కూడా తెలుసు. అందుచేత సూటిగా అతనివంక చూడకుండా, మారు జవాబు చెప్పకుండా నిలుచున్నాడు.

"అయితే మటుకు మీ మిత్రులంటే నాకేమిటి లెక్క? నాకూ మిత్రులున్నారు. పోలెండ్‌వారు— ఎనభై వేలమంది— సింహాల్లాగా పోరాడతారు. కొద్ది కాలంలోనే ఇరవై లక్షలమంది తయారవుతారు" అన్నాడు మళ్ళీ నెపోలియన్. ఇలా తన అబద్ధాలతో తననే చిరాకు పరుచుకుంటూ, బలాషోవ్ మారు జవాబు చెప్పకుండా నిలుచున్నందుకు మరింత కోపం హెచ్చి సరాసరి అతని దగ్గరికి వెళ్ళి అతని ముందు నిలుచుని చేతు లటూ ఇటూ తిప్పుతూ కర్కశంగా ఉన్న కంఠస్వరంతో "నేను మీకొక విషయం చెపుతున్నాను. మీరు ప్రష్యాను నాకు వ్యతిరేకంగా మీ పక్షం కలుపు కోవ

డానికి పురికొల్పినట్లయితే నేను దాన్ని యూరవ్ పటంలో లేకుండా తుడిపివేస్తాను. మిమ్మల్ని డ్వినావరకు తోలేస్తాను. మీకూ, యూరవ్‌కూ మధ్య ఉన్న అగడ్తను మళ్ళీ నిర్మిస్తాను. నాతో స్నేహం చెడగొట్టుకోవడంవల్ల మీరు పొందే లాభం ఇదే" అన్నాడు.

తరువాత మళ్ళీ గదిలో అటూ ఇటూ తిరగసాగాడు. జేబులో నుంచి నశ్యం డబ్బీ తీసి అనేకసార్లు ముక్కు దగ్గర ఉంచుకుని మళ్ళీ రష్యన్ జనరల్ దాపులో ఆగి వ్యంగ్య పూరితంగా "మీ యజమాని ఎంత చక్కని రాజ్యం పరిపాలించి ఉండే వాడు!" అన్నాడు.

బలాషొవ్ పరిస్థితులు ఇంత విషమంగా ఉంటాయని రష్యన్‌లు ఊహించడం లేదని, విజయం తథ్యమని నమ్ముతున్నారని అన్నాడు. నెపోలియన్ "అలా అనుకుంటున్నారా? అలా చెప్పడం నీ విధి.కాని నీవు చెపుతున్న మాటల్లో నీకు నమ్మకం లేదని నాకు తెలుసు. పైగా నిన్ను నా వాదన సరేననేటట్లుగా చేశాను. అన్నట్లుగా తల ఊపాడు.

ఈ మాటు బలాషొవ్ ఒక్క వాక్యం మాట్లాడడానికి అవకాశం ఇచ్చి నెపోలియన్ ఒక చిటికెడు నశ్యం పీల్చుకుని నేలను కాలితోతన్నాడు. అది ఒక సైగ. వెంటనే తలుపు తెరుచుకుని ఒక సేవకుడు వచ్చి మెల్లగా వంగి చక్రవర్తికి ఆయన హేటు, గ్లోవ్‌లు ఇచ్చాడు. మరొకడు ఆయన చేరుమాలు అందించాడు. వాటిని ఆయన చూస్తున్నట్లుగా లేడు.

"మీ చక్రవర్తికి నా మాటగా చెప్పు. నేనెప్పుడూ ఆయన్ను ఎలా గౌరవంగా భావించానో ఇప్పుడూ అలాగే భావిస్తున్నాను. ఆయన గుణగణాలు నాకు తెలుసు. ఆయనంటే నాకెంతో గౌరవం. ఇక ఎంతోకాలం నిన్ను నేను అట్టిపెట్టను జనరల్. జార్‌కు నేను వ్రాసినలేఖను నీకు అందిస్తారు." ఇలా అని నెపోలియన్ తన హేటు తీసుకుని త్వరగా నడిచి వెళ్ళాడు. పరివారమంతా మెట్లక్రింద ఆయన్ను ఆహ్వానించడం కోసం ముందుకు వచ్చింది.

## 68

నెపోలియన్ ఇలా విరుచుకపడి తన చివరి మాటలు చెప్పి పంపిన తరువాత ఇక మళ్ళీ అతను తనను పిలవ నంపడని బలాషొవ్ అనుకున్నాడు. కాని డురక్ వచ్చి ఆరోజే చక్రవర్తితో పాటు తనను విందుకు పిలవడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. బెస్సియ్రే,కాలియన్ కోర్టు, బెరియర్లుకూడా విందులో ఉన్నారు. నెపోలియన్ బలాషొవ్‌ను మర్యాదగా అహ్వానించాడు. ఎంతో చనువుగాను, కులాసాగాను వున్నాడు. పైగా తన అతిథిని ఎంతో వినోదింప చేయడానికి ప్రయత్నించాడు.

తను చేసిన ప్రతి పని మంచి చెడ్డలకు నియమితం కాదని తను చేస్తున్నాడు కాబట్టి అది మంచి కాకుండా ఉండదని అతని గట్టి నమ్మకం.

అతను విల్నా నగరంలో స్వారీ చేసి వచ్చిన తరువాత ఎంతో కులాసాగా హాయిగా కనిపిస్తున్నాడు. ఆ ఊరి ప్రజలంతా జయ జయ ధ్వానాలతో అతన్ని ఆహ్వానించడానికి ఎదురు వచ్చారు. ప్రతి కిటికీలోనూ పతాకాలు తగిలించారు. ముత్యాల తెరలు వ్రేలాడతీశారు. పోలిష్ స్త్రీలు చేతిరుమాళ్ళు విసురుతూ అతన్ని ఆహ్వానించారు. అతను బలాషోవ్‌తో అతను కూడా తన పరివారంలో ఒకడైనట్లుగా తన పథకాలు ఒప్పుకుని తన విజయంలో పాలు పంచుకున్న వ్యక్తి అయినట్లుగా మాట్లాడ సాగాడు. కొంతసేపు మాస్కోను గురించి మాట్లాడుకున్నారు. ఆ రాజధాన్ని గురించి అనేక ప్రశ్న లడిగాడు నెపోలియన్. తను వెళ్ళబోయే కొత్త ప్రదేశాన్ని గురించి ఒక ప్రయాణీకుడు అడిగినట్లుగా అడిగాడు తనలా అడిగితే తన అతిథి పొంగిపోతాడని అనుకున్నాడు.

"మాస్కోలో ఎంతమంది నివాసులుంటారు? ఎన్ని ఇళ్ళు ఉంటాయి? ఎన్ని చర్చిలు ఉంటాయి? పవిత్రమైన మాస్కో అని పిలుస్తారు నిజమేనా?" అని అడిగాడు.

బలాషోవ్ రెండువందల చర్చిలకంటె ఎక్కువ ఉంటాయని చెప్పగా విని నెపోలియన్ "అన్ని చర్చిలవల్ల లాభం ఏమిటి?"అని అడిగాడు.

"రష్యన్‌లు చాలా దైవభక్తి కలవారు"అని చెప్పాడు బలాషోవ్.

"మరో విషయం. అన్ని ఎక్కువ చర్చిలు ఉండడం ఆ దేశం నాగరికంగా అంత వెనకబడి ఉన్నదనడానికి నిదర్శనమేనా?" అని అడిగాడు నెపోలియన్, కాలియన్ కోర్టువంక తిరిగి.

బలాషోవ్ మర్యాదగా ఆ అభిప్రాయంతో తను ఏకీభవించనని చెప్పాడు.

"ప్రతి జాతికీ దానికి తగిన ఆచారాలు దానికి వుంటాయి" అన్నాడు బలాషోవ్.

"కావచ్చు. కాని ఈ రోజుల్లో యూరప్‌లోను, మరే దేశంలోను ఇలాంటి విషయం కనిపించదు" అన్నాడు నెపోలియన్.

"క్షమించాలి చక్రవర్తీ! రష్యాకాక స్పెయిన్ దేశం ఒకటుంది. అక్కడ లెక్కించలేనన్ని చర్చిలు, కాన్వెంటులు ఉన్నాయి."

ఇటీవల ఆ ద్వీపకల్పంలో ఫ్రెంచివారికి కలిగిన పరాజయాన్ని మర్మగర్భితంగా సూచించాడు బలషోవ్. ఆ తరువాత పీటర్స్‌బర్గు దర్బారులో బలాషోవ్ ఈ మాట చెప్పగా అందరిలోనూ ఎంతో సంచలనం కలిగించింది. కాని నెపోలియన్ విందుటేబిల్ ముందు కూచున్నవారిలో మాత్రం ఈ మాట ఎలాంటి చలనమూ కలి

గించలేదు. అందరూ తామేమీ గమనించనట్లుగా కూచున్నారు. "ఈ మాటలో వ్యంగ్యం వుంటే మాకు తెలియకుండా ఉండేదా? కాబట్టి లేదన్న మాట" అన్నట్లుగా వున్నారు. నెపోలియన్ కూడా తనకేమీ అర్థం కానట్లుగా బలాషోవ్‌ను విల్నా నుంచి మాస్కో చేరాలంటే దగ్గరిదోవ ఏ ఊళ్ళ నుంచి వెడుతుందని అడిగాడు.

ఏదీ ఉద్దేశపూర్వకంగా మాట్లాడని ఆ రాయబారి అన్నిరోడ్లూ రోముకు తోవ తీసినట్లుగానే మార్గాలన్నీ మాస్కోకు చేరుస్తాయని అన్నాడు. అనేక తోవలున్నాయనీ, పల్టావాగుండా ఒకతోవ వున్నదనీ, పన్నెండవ ఛార్లెస్ ఆ తోవనే ఎన్నుకుని దానిగుండానే వెళ్ళాడనీ చెప్పాడు. నెపోలియన్ ఈ మాటకు మారుమాట చెప్పేలోగానే కాలియన్ కోర్టు సంభాషణ మార్చి ప్రయాణంలోని చిక్కులను గురించి మాట్లాడసాగాడు.

చక్రవర్తి ప్రత్యేక గదిలో కాఫీ ఏర్పాటు చేశారు. నెపోలియన్ తను ముందుగా వెళ్ళి కూచుని కప్పు తీసుకుని పెదవుల దగ్గర వుంచుకుంటూ బలాషోవ్‌ను కూచోమని చోటు చూపించాడు. విందు ఆరగించిన తరువాత ప్రతి వ్యక్తికీ సాధారణంగా ఒక ప్రత్యేకమైన మానసిక పరిస్థితి ఉంటుంది. హాయిగా వున్న ఆ పరిస్థితిలో అతను తనపట్ల తాను సంతృప్తి చెంది తక్కిన అందరినీ తన మిత్రులుగా భావిస్తాడు. మనుష్యులందరిలాగానే నెపోలియన్‌కూడా ఇదే పరిస్థితిలో వున్నాడు. తన చుట్టూ వున్న వారంతా ఒకేరకంవారనీ బలాషోవ్ కూడా వారిలో ఒకడనీ అనుకుంటున్నాడు.

"ఇప్పుడు మనం కూచున్న ఈ గదినే అలెగ్జాండర్ చక్రవర్తి కూడా ఉపయోగించాడు. ఇలా తటస్థించడం విచిత్రంగా లేదూ?" అన్నాడు నెపోలియన్, రష్యన్ జనరల్ వంకచూచి వ్యంగ్యపూరితంగా చిరునవ్వు నవ్వుతూ. ఇలా అనడంవల్ల జార్‌కంటె తన ఆధిక్యత వెలిబుచ్చడం తన అతిథికి తప్పక సంతోషం కలిగించి తీరుతుందని అతని ఉద్దేశం.

బలాషోవ్ ఈ మాటకేమీ సమాధానం చెప్పలేదు. "అవును ఇదే గదిలో నాలుగురోజుల క్రితం స్టీన్, విన్‌జిన్ గొరోడ్ సమాలోచనలు సాగించారు" అని చెప్పసాగాడు మళ్ళీ నెపోలియన్. అతని పెదవులపై వ్యంగ్యపూరితమైన ఆచిరునవ్వు ఇంకా అలాగే ఉంది.

"వ్యక్తిగతంగా నా శత్రువులైన వారిని జార్ ఎందుకు చేరతీశాడో ఇప్పటికీ నా కర్థంకాలేదు... అతని సహాయం లేకపోతే నాకేం జరగదనుకున్నాడా?" ఇలా అని మళ్ళీ ఉదయం మాట్లాడినట్లుగానే "నేనేం ఊరుకోను. ఈ విషయం అతనికి కూడా తెలుపు" అన్నాడు కప్పు ఒక ప్రక్కకు తోసి లేచి నిలబడుతూ.

"అతనికి అయిన వాళ్ళందరినీ జర్మనీ నుంచి, వ్యట్టెమ్ బర్గనుంచి, బాడిన్ నుంచి, విమర్ నుంచి తరిమివేస్తానని చెప్పు! అవును అందరినీ తరిమివేస్తాను. వారి కోసం రష్యాలో శరణ్యం ఏర్పాటుచేసి ఉంచమని చెప్పు" అన్నాడు మళ్ళీ ఉద్వేగంతో.

బలాషోవ్ ఈ మాటలు వినలేక, తనుజవాబు చెప్పలేక,ఏం చేయాలో తోచక ఒకమాటు కదిలాడు. కాని నెపోలియన్ ఆ విషయం గమనించలేదు. తన శత్రువు రాయబారిగా అతన్ని చూడక తనకు విధేయుడైన వ్యక్తిగానే భావిస్తూ అతనిపట్ల ప్రవర్తించసాగాడు.

"అలెగ్జాండర్ చక్రవర్తి సేనాధిపత్యాన్ని తానెందుకు తీసుకోవాలి? నిజం చెప్పు? యుద్ధం నా పని. అతని పని పరిపాలన. ఈ బాధ్యత అతని కెందుకు? అని అడిగాడు మళ్ళీ. ఇలా అని తన నశ్యండబ్బి తెరిచి ఒక మాటు గదిలో అటూఇటూ తిరిగి తరువాత హఠాత్తుగా బలాషోవ్ దగ్గరికి వెళ్ళి సూక్ష్మంగా చిరునవ్వు నవ్వాడు. ఆ నలభై ఏండ్ల రష్యన్ జనరల్ ముఖాన్ని తనచేత్తో పైకెత్తి అతని చెవిపట్టుకుని చిరునవ్వు నవ్వుతూ మెలిపెట్టాడు. "చక్రవర్తి చేత చెవి మెలిపెట్టించుకోవడం ఫ్రెంచి దర్బారులో ఒక గొప్ప గౌరవంగా పరిగణించబడుతుంది. సరే జార్ చక్రవర్తి దర్బారీయుడా, మాట్లాడవేం?" అన్నాడు వ్యంగ్యపూరితమైన ధోరణిలో, తన ముందు తనను తప్ప మరెవరినీ మెచ్చుకోవడం అసాధ్యమనే వుద్దేశంతో. "జనరల్ కోసం గుర్రాలు సిద్ధంగా ఉన్నాయా?" అన్నాడు తల ఊపుతూ... "నా గుర్రాలు తీసుకుని వెళ్ళమను. అతను చాలా దూరం వెళ్లాల్సివుంది" అన్నాడు.

బలాషోవ్ నెపోలియన్ వ్రాసి ఇచ్చిన ఆ ఉత్తరం తీసుకుని జార్ దగ్గరికి వెళ్ళాడు. జరిగిన విషయమంతా చెప్పాడు. తరువాత మళ్ళీ యుద్ధం మొదలైంది.

## 69

మాస్కోలో పీటర్‌తో మాట్లాడిన తరువాత ఆంద్రూ రాకుమారుడు పీటర్స్‌బర్గ్ వెళ్లాడు. అక్కడికి ఏదో పనిమీద వెడుతున్నానని చెప్పాడు. కాని నిజానికి ఆనెటోవ్ కారగైన్ కోసమే అతనక్కడికి వెడుతున్నాడు. అతన్ని కలుసుకోవడం అవసరమనుకున్నాడు. కాని అక్కడికి వెళ్ళిన తరువాత ఆనెటోవ్ కనిపించలేదు. ఆంద్రూ వస్తున్నాడని తన బావ పీటర్ ద్వారా తెలుసుకుని ఆనెటోవ్ త్వరగా అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. యుద్ధ మంత్రి ద్వారా ఉద్యోగం సంపాదించి మోల్డేవియాలో సేవలో వెళ్ళి చేరాడు. ఈ సందర్భంలోనే పీటర్స్‌బర్గులో ఆంద్రూ రాకుమారుడు తమ పాత జనరల్ అయిన కొటొజోవ్‌ను కలుసుకున్నాడు.

ఆండ్రూ రాకుమారుని కలుసుకోవడం కొటొజోవ్‌కు ఎంతో సంతోషం కలిగించింది. అతనికీ ఆండ్రూకూ ఎప్పుడూ మంచి స్నేహం ఉంటూ వచ్చింది. అందుచేత తన పరివారంలో అతనికి మళ్ళీ ఉద్యోగం ఇచ్చాడు. మోల్దేవియా సేనలకు తన కమాండర్‌గా వెడుతున్నందువల్ల కొటొజోవ్, ఆండ్రూను కూడా తనతో రమ్మన్నాడు. ఇద్దరూ కలిసి బయలు దేరారు.

ఆండ్రూ ఉద్దేశం ఆనెటోవ్‌ను ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించడమే. కాని ఇందుకోసం ఏదో ఒక కొత్తసాకు కనిపెట్టాలి. కాకపోతే కౌంటెస్ నటాషాతో రాజీ పడినట్లవుతుంది, ఎక్కడో ఒకచోట అతన్ని కలుసుకుని అతనితో తగాదా తెచ్చుకోవాలనుకున్నాడు. కాని ఆండ్రూ అక్కడికి చేరేసరికి ఆనెటోవ్ అక్కడ లేడు. అతను టర్కీ వస్తున్నాడని విని ముందుగానే ఆనెటోవ్ మళ్ళీ రష్యా వచ్చేశాడు.

ఏమైనా ఆ కొత్త దేశంలో- ఆ కొత్త వాతావరణంలో ఆండ్రూకు జీవితం కొంచెం హాయిగా కనిపించింది. నటాషా తన పట్ల ద్రోహకరంగా ప్రవర్తించడం ఒక పెద్ద గాయం. ఇతరులకు వెలిబుచ్చకుండా దానిని దాచుకోవడం అతనికి మరింత బాధాకరంగా కనిపించింది.

అతనికి ఉన్న అనేక పనులలోనూ మిలిటరీ పని అతనికెంతో అలవాటు పడింది, ప్రియమైంది కూడా. కొటొజోవ్ పరివారంలో జనరల్‌గా అతను పని చేస్తున్నాడు. పనిలో అతను చూపే శ్రద్ధ, పట్టుదల, ఉత్సాహం కొటొజోవ్‌కు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.

ఆనెటోవ్‌ను టర్కీలో కలుసుకోకపోవడం వల్ల, అతనికోసం మళ్ళీ తను రష్యా వెళ్ళడం అనవసర మనుకున్నాడు ఆండ్రూ. అతనికి ఆనెటోవ్ పట్ల ఎంత అసహ్యం ఉన్నప్పటికీ అతనితో తగాదాకు దిగడం తనవంటి వాడికి తగిన పని కాదని తన్ను తాను ఎన్ని విధాల సరిపెట్టుకున్నప్పటికీ, ఎంత కాలం గడిచి పోయినా అతను గనుక కనిపించి నట్లయితే ఆకలిగొన్న వ్యక్తి ఆహారాన్ని చూచి ఊరుకోవడం ఎలా అసాధ్యమో తను తగాదాకు దిగకుండా ఉండడం కూడా అలాగే అసాధ్యంగా తోచింది ఆండ్రూకు. తను అనేక కార్యకలాపాల్లో మునిగి పైకి కృత్రిమమైన శాంతితో కనిపిస్తున్నప్పటికీ, తను ప్రతీకారం తీర్చుకోలేదనే వాంఛ, కోపము అతని అంతరంగంలో దాగివుండి అతని శాంతిని కలుషితం కావిస్తున్నాయి.

1812 లో నెపోలియన్‌తో యుద్ధ వార్త బుకారెస్టు చేరగానే ఆండ్రూ రాకుమారుడు పశ్చిమ సేనకు తనను బదిలీ చేయమని కోరాడు. ఆండ్రూ తన

పనిలో చూపుతున్న అత్యుత్సాహం కొటొజోవ్‌కు ఎప్పుడూ కంటగింపుగానే ఉంది అతని ఉత్సాహం తన మాంద్యానికి ఒక నిరసనగా కనిపిస్తోంది. అందుచేత తనే స్వయంగా ఆండ్రూను ఒక పనిమీద బార్క్లేడి టాలీకి పంపించాడు.

మే మాసంలో తన సేనను కలవడానికి వెడుతూ అతను దారిలో లిస్సీ-గోరీలో ఆగాడు. గత మూడు సంవత్సరాలలోనూ అతను ఎంతో ఆలోచించాడు. ఎన్నో అనుభవాలు పొందాడు. తన ప్రయాణంలో ఎన్నో విషయాలు చూచాడు. అందుచేత లిస్సీ-గోరీలో మాత్రం తను విడిచిపెట్టి వెళ్ళినపుడు ప్రతి చిన్న విషయంలోను జీవితం ఎలా ఉందో ఇప్పుడూ అలాగే ఉండడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. అతను పెద్ద ద్వారం దాటి లోపల అడుగు పెట్టగానే అతని కొక మంత్ర లోకంలో ప్రవేశిస్తున్నట్లనిపించింది.

ఆ లోకంలో ఎప్పుడూ నిద్ర తప్ప మరేమీ ఉండదు. ఇంట్లో ఎప్పుడూ కనిపించే ప్రశాంతి అలాగే కనిపిస్తోంది. అదే నైర్మల్యం ఇప్పుడు కూడా చెక్కు చెదరకుండా అలాగే కనిపిస్తోంది. అదే ఫర్నిచర్, అవే గోడలు, అవే పరిమళాలు, అవే ముఖాలు– కొంచెం ముసలివైనాయి. అంతే మార్పు. మేరియా రాకుమారి ఎప్పటిలాగా భయంగా కనిపిస్తూ ఆవిడ వయస్సంతా గతంలో మాసిపోతోంది. ప్రేమగాని, ఆనందం కాని ఒక్క కిరణమైనా ఆవిడలో తొంగిచూడ్డం లేదు. ఆవిడ భయాలు, ఆందోళనలు అలాగే ఉన్నాయి. మదాం బొరీన్ మాత్రం ప్రతి క్షణం ఆనందిస్తోంది. పూర్వం లాగానే ఊహాసౌధాలు కట్టుకుంటోంది. ఆమె ఎప్పటి లాగానే మనిషి ముక్తసరిగా కనిపిస్తోంది. ఆండ్రూ రాకుమారుడు స్విట్జర్లాండునుంచి తీసుకొని వచ్చిన ట్యూటర్ మాన్షియర్ డిసాలీ ఒక పొడుగైన కోటు వేసుకుని ఉన్నాడు.

ఆయన స్వభావంలో మాత్రం ఏమాత్రం మార్పు లేదు. ఆయన చిరాకు, అనుమానం ఆయన వయస్సు హెచ్చే కొద్దీ ఎక్కువ అవుతూనే ఉన్నాయి. ఒక్క నికోలష్కా మాత్రం కొంచెం పెరిగాడు. గులాబీ రంగు చెక్కిళ్ళు నవ్వుతున్నప్పుడు ఆ కుర్రవాడి చక్కటి పై పెదవి, తల్లి పెదవి లాగానే పైకి పోయేది. ఆ కుర్రవాడి కొక్కడికే ఈ మంత్ర లోకంలో స్వాతంత్ర్యం ఉంది.

అయినా ఉపరితలంలో ఏ మాత్రం మార్పు కనిపించక పోయినప్పటికీ లిస్సీ-గోరీలో వ్యక్తుల పరస్పర సంబంధాలలో కొద్ది మార్పు కనిపిస్తోంది. రెండు పార్టీలు, రెండు కూటములు ఏర్పడ్డాయి. ఆండ్రూ రాకుమారుడు అక్కడ ఉన్నందు వల్ల ఆ రెండు పార్టీలు తాత్కాలికంగా సంధి కుదుర్చుకున్నాయి. ఒకటి–వృద్ధుడు, మదాం బొరీన్, శిల్పి; మరొకటి– మేరియా రాకుమారి, చిన్న నికోలస్, అతని ట్యూటరు, వృద్ధ నర్సు, ఇంకా గృహంలోని ఇతర స్త్రీలు.

ఆంద్రూ అక్కడ ఉన్నంత కాలం అంతా కలిసే భోజనం చేసేవాపు. కాని అందరూ తనముందు అదో విధంగా సంకోచంగా ఉండడం అతను త్వరలోనే గమనించాడు. అతన్ని ఎవరో అపరిచితుణ్ణి చూచినట్టుగా చూస్తూ అతని ముందు వారు జాగ్రత్తగా మసలుకుంటూ ఉన్నారు. అది అతనికి కూడా సంకటంగానే తోచింది. అతను మాట్లాడకుండా ఊరుకున్నాడు. ఈ వాతావరణంలో అతని తండ్రి కూడా అలాగే ఉన్నాడు. భోజనం పూర్తి అయిన వెంటనే తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆంద్రూ ఆ సాయంకాలం ఆయన్ను కదిలించాలని ఆయన దగ్గరికి వెళ్ళి యువకుడైన కౌంటెకౌమెన్‌స్కీ నడుపుతున్న దండయాత్రను గురించి మాట్లాడ సాగాడు. అతని తండ్రి అతని మాటలు వినిపించుకోవడానికి మారుగా మేరియా రాకుమారి ప్రవర్తనను గురించి, ఆవిడ మత సంబంధమైన వెర్రిని గురించి తిట్ల వర్షం కురిపించ సాగాడు. మదాం బొరీన్ ఒక్కతే తన విషయం పట్టించుకున్న దని ఆ వృద్ధుడు చెప్పాడు. కూతురు వల్ల తన మనస్సు వికలమైందనీ ఆవిడే అతి గారాబం వల్ల పిల్లవాణ్ణి కూడా పాడుచేస్తుందనీ చెప్పాడు.

కాని ఆయన హృదయంలో మాత్రం ఆవిడ అలాటి జీవితం అనుభవించ డానికి ఏమాత్రం అర్హురాలు కాదనీ, ఆవిడ పడే హింస లన్నిటికీ తనే కారణమనీ ఆయనకు తెలుసు, కాని ఆయన మాత్రం ఆమెను హింస పెట్టకుండా మానడు.

'అన్ని విషయాలూ తెలిసిన ఆంద్రూ నాతో తన చెల్లెలి విషయం ఎందుకు మాట్లాడడం లేదూ?' అనుకున్నాడా వృద్ధుడు తనలో తాను. 'నేనేం రాక్షసుణ్ణి అనుకుంటున్నాడా? అవివేకి ననుకుంటున్నాడా? ఫ్రెంచి స్త్రీ ముచ్చట కోసమే నేను నా కుమార్తెతో పోట్లాడానని అనుకుంటున్నాడా ఏం? ఇతనికేమీ తెలిసినట్టు లేదే! నేను చెప్పి చూడాలి. అప్పుడు కాని అతనికి అర్థం కాదు,' అనుకున్నాడు.

"మీరు ఈ ప్రస్తావన తీసుకుని రాకపోతే నేను కూడా ఈ విషయం మాట్లాడి ఉండేవాణ్ణి కాదు" అన్నాడు ఆంద్రూ. తన తండ్రి ముఖంలోకి సూటిగా చూడలేకపోయాడు. ఇదే తన జీవితంలో తొలిసారిగా తన తండ్రిని ఎదిరించడం అనుకున్నాడు. "కాని మీరు అడుగుతున్నారు కాబట్టి ఉన్నమాట చెపుతున్నాను. మేరియాకు మీకు మధ్య ఏవైనా భేదాభిప్రాయాలు వచ్చి ఉంటే ఆ తప్పు ఆవిడ దని నేను అనను. ఆవిడకు మీ పట్ల ఎంత ప్రేమ గౌరవం ఉన్నాయో నాకు తెలుసు. అలాంటి భేధాభిప్రాయాలు కలిగివుంటే దానికి కారణం నా చెల్లెలికి స్నేహి తురాలుగా ఉండడానికి ఎంతమాత్రమూ తగని ఆ ఫ్రెంచి స్త్రీయే అని చెప్పవలసి వస్తుంది" అన్నాడు ఆంద్రూ.

వృద్ధరాకుమారుడు తన కుమారుని ముఖంవంక తదేకంగా చూస్తూ కూచు న్నాడు. చిరునవ్వు తెచ్చి పెట్టుకున్నాడు. ఒక్క పంటితొర్రి కనిపిస్తోంది. ఆంద్రూ ఇంకా అది చూడడానికి అలవాటు పడలేదు.

"ఏ స్నేహితురాలోయ్? అయితే అప్పుడే నీకంతా తెలిసిందన్న మాట?" అన్నాడు వృద్ధుడు.

"నాన్నగారూ! మీ పనులను గురించి నేను ఏమీ నిర్ణయం చెప్పదలుచుకో లేదు" అన్నాడు ఆంద్రూ మెల్లగా. "మీరే నన్నింతవరకు తీసుకుని వచ్చారు, మేరియాది తప్పులేదని నే నెప్పుడూ చెపుతూ వచ్చాను. ఇప్పుడూ చెపుతున్నాను. కొద్దిలో చెప్పాలంటే తప్పంతా ఆ ఫ్రెంచి స్త్రీదే" అన్నాడు.

"ఏమిటి? నీవు నన్ను విమర్శించేవాడివా? నన్ను నిర్ణయించేవాడివా?" అన్నాడు వృద్ధుడు మెల్లని కంఠస్వరంతో. ఆ కంఠస్వరంలో సంకోచం కూడా కనిపించింది. హఠాత్తుగా లేచి నిలుచుని బిగ్గరగా "ముందు నా కళ్ళ ఎదుటనుంచి వెళ్ళు వెళ్ళు! మళ్ళీ నీ ముఖం చూపించకు" అన్నాడు.

ఆంద్రూరాకుమారుడు ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా వెంటనే ఇంట్లోనుంచి వెళ్ళిపోదామనుకున్నాడు. కాని అతని చెల్లెలు తనకోసం మరొక్క రోజు ఆగిపొమ్మని బ్రతిమాలుకున్నది. వృద్ధరాకుమారుడు ఆ రోజంతా ఎవరికీ కని పించలేదు. మదాంబోరీన్‌ను, టిహోన్‌ను తప్ప ఆయన తన గదిలోకి మరెవ్వరినీ రానీయలేదు. తన కొడుకు వెళ్ళాడా లేదా అని పదేపదే అడిగాడు.

వెళ్ళడానికి ముందు ఆంద్రూరాకుమారుడు తన కొడుకును చూడడానికి వెళ్ళాడు. నికోలస్ అతని మోకాళ్ళమీదికి ఎక్కి కూచుని నీలిగడ్డపు కథ చెప్పమని అడిగాడు. తండ్రి కథ చెపుతూ ఉంటే ఆ కుర్రవాడు అదేపనిగా వింటూ కూచు న్నాడు. కాని హఠాత్తుగా అతని తండ్రి కథ చెప్పకుండా మధ్యలో ఆగిపోయాడు. నికోలష్కాను మరిచిపోయి మధ్యలో ఏదో ఆలోచిస్తున్నాడు. తండ్రితో జరిగిన తగాదాను గురించి ఆలోచిస్తున్నాడు. వారు తగాదాపడి విడిపోవడం ఇదే మొదటి సారి. ఆంద్రూను మరింతగా బాధపెట్టిన విషయం ఏమిటంటే తను తన కొడుకు పట్ల సహజంగా పొందుతూ వచ్చిన మృదువైన అనురాగం కూడా ఇప్పుడు పొంద లేకపోయాడు.

"ఆ తరువాత ఏం జరిగింది?" అని అడిగాడు కుర్రవాడు, తక్కిన కథ చెప్పమంటూ. కాని తండ్రి జవాబు చెప్పకుండా పిల్లవాణ్ణి తన ఒడిలోనుంచి దింపి గది వదిలి వెళ్ళాడు. నిజానికి తను ఒకప్పుడు సుఖంగా ఉంటూ వచ్చిన ఈ దృశ్యాలు చూచినప్పుడు అక్కడనుంచి ఎంత త్వరలో వెళ్ళిపోతే అంత బాగుంటుం దని అనిపించింది.

"అయితే నీవు నిజంగా వెడుతున్నావా ఆంద్రూ?" అని అడిగింది అతని చెల్లెలు.

"అవును. నాకు వెళ్ళడానికయినా స్వేచ్ఛ ఉన్నందుకు సంతోషిస్తున్నాను. నీకు ఆ స్వేచ్ఛకూడా లేదు!" అన్నాడు ఆంద్రూ.

"యుద్ధానికి వెడుతూ ఇలా ఎందుకు మాట్లాడతావు? పాడుయుద్ధం!" అన్నది మేరియా. "అదీకాక నాన్న ముసలివాడు....నీ కోసం అడిగాడని మదాంబోరిన్ చెప్పింది" అన్నది, చింతగింజలంత కన్నీటి బిందువులు చెక్కిళ్ళపై రాలుతూ ఉండగా.

ఆంద్రూ ముఖం మరో ప్రక్కకు తిప్పుకున్నాడు.

"అయ్యో భగవంతుడా! ఇదేం చిత్రం ? ఇతరులను అనవసరంగా ఇలా బాధలపాలు చేయడమేమిటి?" అంటూ గదిలో అటూ ఇటూ తిరగసాగాడు. అతని చెల్లెలు కలవరపడింది. అతను ఆ మాటన్నది మాదాంబోరిన్ గురించే కాక తన ఆనందాన్ని భంగంచేసిన వ్యక్తిని ఉద్దేశించి కూడా అన్నాడని ఆమె అర్థం చేసుకున్నది.

"ఆంద్రూ! నిన్ను బ్రతిమాలు కుంటున్నాను" అన్నది మెల్లగా అతని భుజం మీద చెయ్యివేస్తూ. అతనివంక చూచి "దుఃఖమదేది మనిషి కల్పించుకునేది కాదు. భగవంతుని చేతిలో మనిషి ఒక సాధనం మాత్రమే" అన్నది. ఇలా అంటూ వుంటే ఆవిడ చూపు మరెక్కడో వుంది, అక్కడ ఏదో తనకు పరిచితమైన వస్తువును చూస్తున్నట్లుగా వుంది. "దుఃఖం భగవంతుడు పంపించింది. దానికి బాధ్యులు మనుష్యులు కారు. నీ పట్ల ఎవరైనా తప్పిదం చేసి ఉన్నట్లయితే వారిని క్షమించి మరిచిపో. శిక్షించే హక్కు మనకులేదు. కాని ఒకనాటికి నీకు కూడా క్షమించడంలోని ఆనందం అర్థమవుతుంది" అన్నది.

"అవును మేరియా! నేనొక స్త్రీని అయినట్లయితే అలా అనుకుని వుండేవాణ్ణి. క్షమాగుణం స్త్రీలకు శోభ. పురుషుల విషయం వేరు. పురుషులు క్షమించలేరు. పురుషుడు మరచిపోనూ కూడదు, క్షమించనూకూడదు" అన్నాడు ఆంద్రూ. అంత వరకూ అతను ఆనెటోవ్‌ను గురించి ఆలోచించకపోయినా, ఇంతవరకూ అతని హృదయంలో అసంతృప్తిగా ఉన్న ద్వేషం ఒక్కమాటు పెల్లుబికింది. "నా చెల్లెలు నాతో ఇలా అనగలిగిందంటే నేనెప్పుడో నా పగ తీర్చుకుని వుండాల్సిందని రుజువవుతోంది" అనుకున్నాడతను తనలోతాను. ఇక ఆవిడ బోధన లేమీ అతను వినలేదు. ఎప్పుడు వెళ్ళి ఆనెటోవ్‌ను కలుసుకుంటానా అని ఒక విధమైన సంతృప్తితో ఊహించుకుంటున్నాడు,

మరి ఇరవైనాలుగు గంటలు మాత్రమే వుండమని మేరియా రాకుమారి తన

అన్నను ఒత్తిడి చేసింది. సమాధాన పడకుండా వెళ్ళిపోతే తండ్రి తప్పక నొచ్చుకుంటాడని ఆవిడకు తెలుసు. కాని ఆండ్రూ ఉద్దేశం మాత్రం అదికాదు. ఆలస్యం వల్ల వారిమధ్య విద్వేషం మరింత పెరుగుతుందేకాని తగ్గదని చెప్పాడు. కొద్దిరోజులలోనే వస్తాననీ, వుత్తరం వ్రాస్తాననీ చెప్పాడు.

"అయితే వెళ్ళిరా అన్నయ్యా" అన్నది మేరియా రాకుమారి. ఇవి ఆమె కడపటి మాటలు.

ఆండ్రూ రాకుమారుడు వాకిలి దగ్గరికి వచ్చాడు. "ఒక అమాయకురాలు ఒక మతి తప్పిన వృద్ధుని చేతుల్లో బందీగా నలిగిపోవడం ఆవిడ నొసట వ్రాసిన వ్రాత కాబోలు! అతని క్రౌర్యం అతనికి తెలుసు. కాని ఇప్పుడతని స్వభావం అతను మార్చుకోలేడు. నా కొడుకు పెరిగి పెద్దవాడవుతున్నాడు. జీవితాన్ని చూచి ఇంకా చిరునవ్వు నవ్వుతున్నాడు. ఇతర్లలాగా మోసపోతాడో? లేక మోసగిస్తాడో? నేను యుద్ధంలో చేరుతున్నాను. ఎందుకు? నాకేమీ తెలీదు. నేను ద్వేషించే వ్యక్తికి నన్ను చంపి తరువాత నన్ను చూచి నవ్వే అవకాశం ఇవ్వడానికేనేమో! అనుకున్నాడు.

జీవితం అతనికిప్పుడు కూడా పూర్వం లాగానే వున్నప్పటికి చెదురు చెదురుగాను, ఒకదాని కొకటి సంబంధం లేనట్లుగాను కనిపిస్తోంది.

# 70

ఆండ్రూ రాకుమారుడు ప్రధాన కార్యాలయం చేరేసరికి జూన్ నెల ఆఖరు కావస్తోంది. మొదటి సేనాదళం డ్రిస్సా దగ్గర విడిది చేసి వుంది. ఆ దళంలో జార్ కూడా వున్నాడు. రెండవ సేనాదళం విచ్ఛిన్నమైపోయి తిరోగమించి మళ్ళీ సేనలో చేరడానికి మళ్ళీ కొత్తగా ఏర్పడి తరలివస్తోంది. రెండు శాఖల్లోనూ మిలిటరీ వ్యవహారాల విషయంలో ఎంతో అసంతృప్తి కనిపిస్తోంది. కాని ఎవరూ రష్యను రాష్ట్రాల్లోకి పరదేశపు దండయాత్ర వస్తుందని ఊహించనైనా ఊహించలేకపోయారు. పశ్చిమ పోలిష్ సరిహద్దులు దాటి యుద్ధం వ్యాపిస్తుందని కూడా అనుకోలేదు. ఆండ్రూ రాకుమారుడు బార్క్లేడీటాలీ డ్రిస్సా తీరంలో చక్రవర్తి బసచేసిన చోటుకు రెండుమైళ్ళ దూరంలో స్థావరమై వుండడం గమనించాడు. క్యాంప్‌కు దగ్గరగా ఒక పట్నంగాని, గ్రామంకాని ఏమీలేదు. దర్బారీయులు, జనరళ్ళు; అందరూ నదికి ఇరుప్రక్కల ఉన్న మంచి మంచి ఇళ్ళన్నీ ఆక్రమించుకున్నారు.

బార్‌క్లేడీటాలీ ఆంద్రూను అదేవిధంగా స్వీకరించాడు. ఉద్యోగ విషయం చక్రవర్తికి తెల్పాలని అన్నాడు. కాని ఈలోగా తన పరివారంలో ఉండమని కోరాడు. ఆనెటోవ్ కారగైన్ సేన విడిచి వెళ్ళాడు. పీటర్స్‌బర్గులో ఉంటున్నాడు. ఈ విషయం విన్న ఆంద్రూ నిజంగా ఎంతో సంతోషించాడు. అతని పేరు వింటేనే కల్లోలపడే తన మనస్సుకు కొంత ప్రశాంతిగా ఉంటుంది కదా అనుకున్నాడు. ఇక తను అప్పుడే ప్రారంభిస్తున్న యుద్ధంలో పూర్తిగా నిమగ్నుడు కావచ్చు కదా అనుకున్నాడు. తను వెంటనే నిర్వర్తించవలసిన పనులేమీ లేకపోవడం వల్ల మొదటి నాలుగురోజులూ స్వారీ చేస్తూ క్యాంప్‌ను చుట్టి రావడంతోను, అక్కడి పరిస్థితిని తన తెలివితేటలవల్ల తెలుసుకుని రావడంలోను గడిపాడు. అక్కడ విడిది చేయడంవల్ల వచ్చే ఉపయోగాలేమిటో ఉతనికి బోధపడలేదు. అతని అనుభవం వల్ల అతను తెలుసుకున్నది అసలు సమరంలో నేర్పుకు, చాతుర్యానికి అట్టే విలువ ఉండదని. ఈ విషయాన్ని ఆస్టర్‌లిడ్జ్ సమరంలో అతను గ్రహించాడు. ఆనాటి నుంచీ శత్రువుల ఆనూహ్య గమనాలను కనిపెట్టి వాటినుంచి తప్పుకోవడం మీదనే విజయం ఆధారపడి ఉంటుందన్న విషయం అతనికి మరింత గ్రాహ్యమైంది. సేనలు నడిపే వారిమీద కూడా ఆధారపడి ఉంటుందన్న విషయం అతనికి బోధపడింది. ఈ విషయాన్ని మరింత స్పష్టంగా అవగతం చేసుకోవడం కోసం అతను ఆ పరిపాలన లోని వివరాలను, దానికి సంబంధించిన వ్యక్తుల స్వభావాలను పరిశీలించ సాగాడు.

చక్రవర్తి విల్నాలో వుండగా సేన మూడుశాఖలుగా విభజింపబడింది. మొదటి శాఖకు నాయకుడు బార్‌క్లేడీటాలీ. రెండవ శాఖకు బ్రెగేషియన్ నాయకుడు. మూడవ శాఖకు టార్మసోవ్ నాయకుడు. చక్రవర్తి మొదటి శాఖలో చేరాడు. ఛీఫ్ కమాండర్ బాధ్యతలు మాత్రం తను స్వీకరించలేదు. ఆరోజు చక్రవర్తి వస్తున్నాడని మాత్రమే తెలియచేశారు. అంతకుమించి మరేమీ తెలియచెయ్యలేదు. అదీ కాక అతనికొక ప్రత్యేక పరివారం కూడా లేదు. తన ప్రధాన కార్యాలయంలోని మామూలు పరివారంతోనే వచ్చాడు. ప్రధానమైన ఆఫీసరు క్వార్టర్ మాస్టర్ జనరల్ వాల్‌కోన్‌స్కీ రాకుమారుడు, మరి కొంతమంది జనరళ్ళు, సహాయ సేనాధిపతులు, సివిలు ఉద్యోగులు, మరికొందరు విదేశీయులు అతనితో కలిసివచ్చారు. కాని సైనిక పరివారం లేదు. చక్రవర్తి వ్యక్తిగత పరివారంలో ఈ క్రింది వారున్నారు : మాజీ యుద్ధమంత్రి అయిన అరక్షేవ్, సీనియర్ జనరల్ అయిన బెనిక్‌సన్, జార్‌విచ్ గ్రాండ్ డ్యూక్ కాన్‌స్టెంటైన్, ఛాన్సెలర్ అయిన కౌంట్ రుమిన్‌ట్జోవ్ పూర్వపు ప్రష్యన్ మంత్రి అయిన స్టీన్, స్వీడిష్ జనరల్ అయిన అరమ్ ఫెల్డు, ఈ దండయాత్ర

పథకానికి ముఖ్య కారకుల్లో ఒకడయిన ఫుల్, సార్డీనియన్ శరణార్థి సహాయసేనాధి పతి అయిన ఫలూషీ, వాల్ట్‌జోగెన్; ఇంకా ఇతరులు ఉన్నారు. వీరంతా ప్రత్యేకమైన ఏ మిలిటరీ బాధ్యతలూ లేకుండా చక్రవర్తికి సంబంధించి ఉన్నప్పటికీ వీరికి ఆయనమీద ఎంతో ప్రభావం ఉంది. సేనాశాఖ జనరల్‌కు కూడా బెనిక్‌సన్ కాని, గ్రాండ్ డ్యూక్‌కాని, మరెవరయినా కాని ఏదైన సూచన లేక సలహా కాని ఇచ్చినట్లయితే ఆ సూచన ఏ కారణంచేత ఇచ్చారో తెలిసేది కాదు. వారు స్వయంగా విషయం చెబుతున్నారో లేక జార్ అభిమతాన్ని వెలిబుచ్చుతున్నారో తెలిసేది కాదు. ఆ మాటలప్రకారం వారు నడుచుకోవాలో లేదో తెలీదు.రంగస్థలంలో హంగులాంటి వారు వాళ్ళు. వారి దృష్టినుంచి వారు జార్‌ప్రక్క ఉండడంలో విచిత్రమేమీ లేదు. చక్రవర్తి దగ్గరున్న ప్రతివ్యక్తీ దర్బారీయుడే. అలెగ్జాండర్ చక్రవర్తి ఛీఫ్ కమాండర్ పదవి వహించకపోయినప్పటికీ మూడు సేనాశాఖలు అతని చేతిలో వున్నట్లే. అందుచేత అతని పరివారమే అతని సలహా సంఘమన్నమాట.

ఆయన అంగరక్షకుడైన అరక్షేవ్ ఆయన తరఫున తను ఉత్తర్వులు కూడా అందజేస్తుండేవాడు. విల్నా ప్రభుత్వంలో పెద్ద ఎస్టేట్లు కల బెనిక్‌సన్, చక్రవర్తికి మర్యాదలు చేయడమే తన పనిగా పెట్టుకున్నాడు. అతనికి సైనికుడుగా పెద్ద ప్రసిద్ధి కూడా వుంది. అవసరమైతే బార్క్లేడీటాలీ స్థానంలో అతన్ని నియమించే ఉద్దేశం కూడా వుంది. ఇక గ్రాండ్‌డ్యూక్ తన సుఖం కోసమే తను అక్కడుంటున్నాడు. స్టీన్ కౌన్సిలర్‌గా వుంటున్నాడు,నెపోలియన్ శత్రువైన ఆరమ్‌ఫెల్డు చెప్పే మాటలు అలెగ్జాండర్ ఎక్కువగా వింటూంటాడు. వినేటట్లుగా అతను చెపుతాడు కూడా. ఫలూషీ కూడా సలహాదారుగానే వుంటున్నాడు. ఇక వీరినే సహాయసేనాధి పతులని కూడా అనవచ్చు. ఎందుకంటే చక్రవర్తి ఎక్కడికి వెడితే అక్కడికి వీరూ వెడుతుంటారు. ఫుల్ ఒక సేనాపథకాన్ని వ్రాసి ఉంచాడు. దాన్ని జార్ చేత పూర్తిగా ఒప్పించాడు కూడా. నిజం చెప్పాలంటే అతనే యుద్ధాన్ని నడుపుతున్నది. ఫుల్ ప్రక్కనే వాల్ట్‌జోగెన్ కూడా ఎప్పుడూ వుంటాడు. ఫుల్ యుద్ధం ఎలా నడిపించవలసిందీ చెపితే జార్ అలా వినక తప్పదు.

ఈ పెద్దలేకాక ఇంకా ఎందరో చిన్నచిన్న ఆఫీసర్లు రష్యన్‌లు. విదేశీయులు వారి వారి అధికారులను కనిపెట్టుకుని ఉన్నారు. విదేశీయులు వారు సూచించే మిలిటరీ పథకాల వైవిధ్యంవల్ల వారి ప్రత్యేకతను నిలుపుకుంటూ ఉన్నారు. తమది కాని దేశంలో పని చేసేటప్పుడు ఇలాగే చేస్తారు.

ఈ కూటమిలో ఎన్నో వ్యతిరేక అభిప్రాయాలుండడం ఆంద్రూ గమనించాడు. ఒకరు ఒకవైపుకు లాగితే మరొకరు మరొకవైపుకు లాగుతున్నారు.

మొదటి కూటమి ఫుల్, అతని అనుచరులు. వీరు యుద్ధశాస్త్రాన్ని సిద్ధాంత

పరంగా అభ్యసించినవారు. సూత్రాల్లో మార్పు వీరు ఒప్పుకోరు. హఠాత్తుగా దాడులు చేయడం కాని. పార్శ్వగమనాలు కాని వీరు అంగీకరించరు. ఈ విధంగా ఊహించడంచేత సేనను దేశంయొక్క అంతర్భాగంనుంచి ఉపసంహరించాలని వారి ఉద్దేశం. వారు ఊహించుకున్న ఈ సూత్రాలకు ఎవరయినా వ్యతిరేకంగా నడిస్తే దానికి కారణం వారి అజ్ఞానమే అనేవారు. వీరిలో జర్మన్ రాకుమారులు కూడా ఉన్నారు.

ఇక రెండవ కూటమి వీరికి పూర్తిగా విరుద్ధమైనది. పోలెండులోకి సరాసరి వెళ్ళి సేనలను పంపించాలని వీరు అనేవారు. వీరికి ముందుగా వేసుకున్న పథక మేమీ ఉండేది కాదు. వీరిలో చాలామంది రష్యన్‌లు. బ్రెగేషియన్, ఎర్మలోవ్ మొదలైన వారుండేవారు. ఆ రోజుల్లో హాస్యంగా ఒక విషయం చెప్పుకునేవారు. ఎర్మలోవ్ ఒక రోజున చక్రవర్తిని తనను జర్మన్‌ల పదవికి పైకి పంపించమని కోరేవాడట.

వీరెప్పుడూ ఒక విషయం చెపుతుండేవారు. ఊరిక టేబిళ్ళమీద మ్యాప్‌లు పరుచుకుని చూడడంవల్ల లాభం లేదనీ, చేయిదలుచుకున్నప్పుడు వెంటనే యుద్ధం చేసేయాలనీ అనేవారు. ఎక్కువ వ్యవధి ఇచ్చినట్లయితే సేన చెదిరిపోవడానికి అవకాశం ఉందని కూడా అనేవారు.

ఇక మూడవ పార్టీ; ఈ పార్టీలో అరక్షేవ్ కూడా ఉన్నాడు. ఈ పార్టీలో జార్‌కు కూడా ఎక్కువ నమ్మకం. దీనిలో ఎక్కువమంది దర్బారీయులే. తతిమ్మా ఇరు పార్టీలకూ మధ్యవర్తులుగా వ్యవహరించేవారు. వీరిలో ఎక్కువమంది మిలిటరీ వారు కారు. ఎక్కువమంది ఏ మాట చెపితే వీరు కూడా అదేమాట చెప్పేవారు. వీరికి ప్రత్యేకమైన అభిప్రాయాలంటూ ఏవీ ఉండేవి కావు. అందుచేత బోనపార్టీ వంటి ప్రతిభాశాలితో యుద్ధం చేస్తున్నప్పుడు, యుద్ధ విషయంలో చాకచక్యము, నైపుణ్యము ఎంతో అవసరమని వీరంటూ ఉండేవారు. బోనపార్టీ వీరికి కూడా బోనపార్టీయే. యుద్ధ చాకచక్యంలో ఫుల్ చాలా తెలివికలవాడైన మాట వాస్తవమే. కాని కేవలం సిద్ధాంతం చెప్పేవారి దగ్గర ఉండే లోపం అతని దగ్గర కూడా ఉంది. అతనిచ్చే నిర్ణయాలకు కూడా కొన్ని పరిమితులున్నాయి. అందుచేత అతనిలో పూర్తిగా విశ్వాసం ఉంచడం అంత మంచిది కాదు. కనుక అనుభవజ్ఞులైన వీరివ్యతిరేకుల అభిప్రాయాలు ఆలోచించడం కూడా మంచిది. ఈ ఇరుపక్షాలకు వంతెన వేస్తూ ఒక మధ్యమార్గాన్ని అనుసరించడం మంచిది ఫుల్ చెప్పినట్లుగా డ్రిస్సాలో క్యాంప్ పెట్టి ఇతర రెండు సేనాశాఖల పరస్పర స్థావరాలను మార్పిడి చేయాలని అన్నారు. కాని ఈ మార్గం తొక్కడంవల్ల ఇరు విధాల నష్టమేకాని ఎలాటి ప్రయోజనమూ లేదు. అయినప్పటికీ వీరిది చాలా మంచిమార్గమని అనుకుంటూ ఉన్నారు.

ఇక నాలుగో అభిప్రాయానికి నాయకుడు గ్రాండ్ డ్యూక్. ఆస్టర్‌లిడ్జ్‌లో జరిగిన ఆశాభంగాన్ని ఆయన ఇంతవరకూ మరిచిపోలేదు. సేనల చేత యూనిఫార ములు ధరింపచేసి రక్షకదళపు మొదట్లో ఉన్న ఫ్రెంచి వారిపై ఆయన దాడిచేసే సరికి, ఆయన హఠాత్తుగా తనకు తెలీకుండానే శత్రువులు కాల్పులు సాగించే ప్రదే శం దాపులోకి రావడం తటస్థించింది. అందులో నుంచి ఆయన తప్పించుకునేసరికి తాతలు దిగొచ్చాను. ఈ రాకుమారుని చిత్తశుద్ధిలో మంచీ చెడూ రెండూ ఉన్నాయి. నెపోలియన్, అతని బలాన్నీ చూచి వీరు భయపడుతుండేవారు. తమలో అశక్త తను, బలహీనతను మాత్రమే వారు చూచేవారు. "ఇక మనకు అపజయం తప్పదు. మనం ముందు విల్నాను వదలి వెళ్ళాం. తరువాత లిటవ్స్ వదలి వెళ్ళాం. ఇప్పుడు డ్రిస్సా వదిలి వెడతాం. ఇక ఇప్పుడు మనం అనుసరించవలసిన పద్ధతి ఒకటే ఉంది. పీటర్స్‌బర్గు వదిలి వెళ్ళేలోగా మనం సంధి చేసుకోవడమే." అనేవారు.

ఈ అభిప్రాయాన్ని సేనలోని పై వర్గాల వారంతాఅందరూ అంగీకరించారు. రాజధానిలో కౌంట్ రుమెన్‌ట్సోవ్, ఛాన్సెలర్లతో సహా అందరూ అంగీకరించారు. సంధి చేసుకోవడానికే ఓటిచ్చారు.

అయిదో వర్గం బార్‌క్లే డీటాలీని సమర్థించేది. దానికి కారణం అతను యుద్ధ మంత్రి చీఫ్ జనరల్ కావడమే.

"ఎవరు ఏం చెప్పినప్పటికీ ఆయన నిజాయితీ ఉన్నవాడు, సమర్థుడు. ఇంత కంటె మంచివాడు మనకు దొరకడు ... వైవిధ్యం ఉన్న అధికారంలో యుద్ధం జరగడం అసంభవం కాబట్టి ఆయనకు అధికారమిస్తే ఆయన ఏం చేయగలడో ! ఆయన తన ప్రజ్ఞను పూర్వం ఫిన్‌లెండ్‌లో చూపినట్లుగానే చూపగలడు. మనకింకా చక్కటి సైన్యం ఉన్నదంటే ....డ్రిస్సానుంచి నష్టం కాకుండా తిరిగి వచ్చిందంటే అందుకు కారణం ఆయనే. ఆయన స్థానంలో బెనిక్‌సన్ కనుక ఉండి ఉన్నట్లయితే మనకు నష్టమయ్యేది. 1807లో ఇలాగే జరిగింది" అని వారనుకునే వారు.

ఆరవ కూటమి బెనిక్‌సన్ అంతటివాడు లేడనేవారు. అతనంత తెలిసినవాడు అతనంత నిక్కచ్చిగా ఉండేవాడు లేడనేవారు. అతనికి పదవి ఇవ్వక పోవడమే తప్పనేవారు.

"మనం డ్రిస్సానుంచి తిరోగమించడం వల్లనే మనం ఎన్ని తప్పులు చేశామో తెలుస్తోంది. మనకు కావలసింది బెనిక్‌సన్ కాని, బార్‌క్లే కాదు" అనుకునే వారు వీరు.

ఏడవ పార్టీ కుర్రవాడైన రాజు చుట్టూ ఉండే వ్యక్తుల్లాంటి వారు. ఆయన్ను కనిపెట్టుకుని ఉండే సహాయ సేనాధిపతులు, జనరళ్ళు; ఇలాంటి వారు 1805 లో రోస్టోవ్ పూజించినట్లుగానే వీరు ఆయన్ను పూజించేవారు. ఆయనలో గుణాలుతప్ప

మరేమీ చూడనివారు. ఛీఫ్ కమాండర్ పదవిని ఆయన నిరాకరించినందుకు ఆయన వినయాన్ని పొగుడుతూ ఆయన్ను ఆకాశానికెత్తేవారు. ఆయనకింత వినయం ఉండడం పనికి రాదంటూ ఆయనే సేనను నడపాలనీ, తాత్కాలికంగా ఒక పరివారాన్ని ఏర్పరచుకుని యుద్ధనిపుణుల సలహాతో సేనను నడపాలనీ అనేవారు. ఆయన ఉంటేనే చాలదా, సైనికులు పొంగిపోరా అనేవారు.

ఇక ఎనిమిదవ పార్టీవారు, వీరిలో నానారకాల వారు ఉండేవారు. వీరికి యుద్ధం జరిగినా ఒకటే; లేక సంధి ఏర్పడినా ఒకటే, రష్యన్‌లు పురోగమించినా ఒకటే లేక డ్రిస్సాలో నిలిచిపోయినా ఒకటే; జార్ స్వయంగా సేనను నడిపినా ఒకటే లేక బార్‌క్లే, ఫుల్, బెనిక్‌సన్ మొదలైన వారెవరైనా నడిపినా ఒకటే. వీరి ముఖ్యోద్దేశమల్లా అవకాశ మున్నంత వరకూ సుఖించడం మటుకే. రాజసభల్లో అనేక విషయాల్లో తమ గొప్పతనాన్ని నిలుపుకునేవారు. ఒకడు ఫుల్‌ను సమర్థించే వాడు; మరొకడు అతన్ని వ్యతిరేకించే వాడు. మరొకడు చక్రవర్తిని సంతృప్తి పరచడం కోసం తనకే విధమైన అభిప్రాయాలూ లేవనేవాడు. ఇంకొకడు తను ఏదో విధంగా కాలూనడం కోసం చక్రవర్తి అన్న ఒకమాట పట్టుకుని ఆ మరుసటి సమావేశంలో దాన్ని వివరిస్తూ పెద్ద ఉపన్యాసం ఇచ్చేవాడు. దానికి కారణం చక్రవర్తి దృష్టిని ఆకర్షించడమే. వేరొకడు సమయం చూచుకుని తను చేసిన సేవకు డబ్బివ్వమని కోరేవాడు. ఆ సమయంలో డబ్బడిగితే నిరాకరించరని అతనికి తెలుసు. మరొకడు ఎప్పుడూ ఏదో ఒక పనిపెట్టుకుని జార్ దగ్గరికి వెడుతూ ఉండేవాడు.

ఆంద్రూ రాకుమారుడు యుద్ధంలో చేరినప్పుడు తొమ్మిదవ పార్టీ మరొకటి అప్పుడే మొలకెత్తుతోంది. ఈ పార్టీలో అనుభవమున్న పెద్దలు, రాజనీతిజ్ఞులు: అంతా ఉండేవారు. ఈ పైన చెప్పబడిన వారి అభిప్రాయాలేవీ వీరు ఒప్పుకునేవారు కాదు. చక్రవర్తి ప్రధాన కార్యాలయంలో సమావేశమై తమ కళ్ళముందు జరుగుతున్న దాన్నంతా నిష్పాక్షికంగా విచారించేవారు. ఈ అవ్యవస్థలో నుంచి, గందరగోళంలోనుంచి ఏదో ఒక మార్గం కని పెట్టడానికి పాటుపడేవారు. అసలు జరుగుతున్న గొడవంతా జార్ దర్బారులోని మిలిటరీ పరివారంలోనే జరుగుతూ ఉన్నదనీ అందుచేతనే ఇన్ని రకాలైన భేదాలు ఏర్పడ్డాయనీ, దర్బారులో ఇలా జరిగితే నష్టం లేదు కాని మిలటరీ పరివారంలో ఇలా జరగడం చాలా నష్టదాయకమనీ అలా జరగకూడదనీ వీరు అభిప్రాయ పడేవారు. చక్రవర్తి దేశాన్ని పరిపాలించాలి కాని సేనలు నడపడం ఆయన పని కాదన్నారు. దీన్నుంచి బయటపడే మార్గం ఆయన సేనను వదిలి రావడమేనన్నారు. ఆయన అక్కడ ఉండడమే ఆయన రక్షణకు కారణమైన యాభైవేల మందికి అడ్డుగా ఉందని అన్నారు. స్వేచ్ఛ ఉన్న పక్షంలో ఒక చిన్న జనరల్ చక్రవర్తి అదుపాజ్ఞలలో ఉండి స్వేచ్ఛలేని ఒక పెద్ద చీఫ్ కమాండర్ కంటే నయమని అన్నారు.

ఈ కూటమికి నాయకుడైన రాజ్యాంగ కార్యదర్శి సిష్కోవ్, బలాషోవ్, అరక్షేవ్‌లతో కలిసి ఒక లేఖ తయారుచేసి జార్‌కు పంపించాడు. మొత్తంమీద యుద్ధ విషయాలన్నీ తాము చర్చించు కున్నామని వ్రాస్తూ ఆయన్ను రాజధానికి తిరిగి రమ్మని గౌరవ పూర్వకంగా కోరారు. తిరిగి వచ్చి ప్రజల్లో ఉత్సాహాన్ని ఆయన మేలు కొలపాలని అన్నారు. ఆయన మాస్కోలో ఉంటే తప్పకుండా ప్రజల్లో ఉత్సాహం కలుగుతుందనీ విజయానికి ఇదే ముఖ్య కారణ మవుతుందనీ వ్రాశారు. ఈ సలహా ననుసరించి అలెగ్జాండర్ సేన వదిలిపెట్టి తిరిగి మాస్కో వెళ్ళడానికి నిశ్చయించు కున్నాడు.

# 71

ఈ ఉత్తర్వులు జార్‌కు చేరడానికి ముందు బార్‌క్లే, భోజనాల సమయంలో ఆంద్రూకు ఆ సాయంత్రం ఆరుగంటలకు వెళ్ళి బెనిక్‌సన్‌ను కలుసుకోమని చెప్పాడు. చక్రవర్తి తను స్వయంగా కొన్ని వ్యవహారాలు బెనిక్‌సన్‌తో మాట్లాడాలని కోరినందువల్ల బార్‌క్లే, ఆంద్రూకు ఇలా చెప్పడం జరిగింది. ఆ ఉదయాన ఒక రిపోర్టు ప్రధాన కార్యాలయానికి చేరింది. ఆ తరువాత ఆ రిపోర్టు తప్పు రిపోర్టని రుజువైంది కూడా. ఆ రిపోర్టులో నెపోలియన్ మళ్ళీ సేనను కదిలించాడని ఉంది. ఆ రోజునే కర్నల్ మిఛాడ్ జార్‌తో కలిసి డ్రిస్సా తీరంలోని సేనలను తనిఖీచేసి పుల్ పథకాన్ని అనుసరించి అక్కడ సేనలను స్థావరం చేయడం నిరుపయోగకరమే కాక ప్రమాదకరమని కూడా చెప్పాడు.

ఆంద్రూ రాకుమారుడు నిర్ణీత సమయంలో బెలిక్‌సన్ ఇంటికి వెళ్ళాడు. ఇల్లు డ్రిస్సా తీరంలో ఒక చిన్న ఎస్టేటులో ఉన్నది. అక్కడికి వెళ్ళేసరికి జర్నిషేవ్ మాత్రమే కనిపించాడు. అతను రాజపరివారంలోని సహాయ సేనాధిపతుల్లో ఒకడు. జార్ మరో పర్యాయం జనరల్ బెనిక్‌సన్‌తోను, మార్కిస్ ఫలూషీతోను కలిసి కొన్ని అనుమానాలు కలగడంవల్ల సేనలు తనిఖీ చేయడం కోసం వెళ్ళాడని జర్నిషేవ్ ఆంద్రూకు చెప్పాడు.

జర్నిషేవ్ తనగదిలో ఒక కిటికీలో కూచుని ఒక నవల చదువు కుంటూ ఉన్నాడు. ఆ గది పూర్వం బాల్‌రూంగా ఉంటూ వచ్చేది. ఆ గదిలో ఒక పియానో, దానిమీద తివాసీలు ఉన్నవి. ఒకమూల బెనిక్‌సన్ సహాయ సేనాధిపతి అప్పుడే భోజనం చేసి, బడలికతో నిద్రపోతున్నాడు. గదికి రెండు తలుపులున్నాయి. ఒక ద్వారం ఒక చిన్న స్టడీరూమ్‌కు, మరొకటి డ్రాయింగ్ రూమ్‌కు తోవ తీస్తున్నాయి. ఆ గదుల్లోనుంచే అనేక కంఠస్వరాలు వినిపిస్తున్నాయి. మధ్య మధ్యలో ఫ్రెంచి భాష మాట్లాడు తున్నారు. అక్కడ చక్రవర్తి ఆజ్ఞానుసారం ఒక మీటింగ్

జరుగుతోంది. అది యుద్ధ కౌన్సిల్ కాదు. అలెగ్జాండర్‌కు ఇలాంటి పేర్లు పెట్టడ మంటే ఇష్టంలేదు. అప్పుడేం చేయాలా అని ఆలోచించడానికి మాత్రమే వారక్కడ చేరారు. ఆరమ్‌ఫెల్టు, స్వీడ్, ఫ్రెంచి పరదేశి విట్‌జన్ గొరోడ్, మిఖాడ్, టోల్, బేరన్‌స్టీన్, ఫుల్; వీరంతా ఉన్నారు. వీరందరికీ మూలం ఫుల్. తను వచ్చిన తరువాతనే ఫుల్ అక్కడికి రావడంవల్ల ఆంద్రూ అతని విషయం కొంత గమ నించాడు. కొద్ది నిముషాలపాటు జర్కొషేవ్‌తో మాట్లాడుతూ నిలుచున్నాడు.

అతనిదివర కెన్నడూ ఫుల్‌ను చూడకపోయినా అతన్ని చూడగానే తనకు పూర్వం తెలిసిన వాడిలాగానే కనిపించాడు. అతను రష్యన్ యూనిఫారం వేసుకుని మాక్, స్మింటె; మొదలయిన జనరళ్ళందరూ ఎలా ఉన్నారో ఇతను కూడా అలాగే కనిపిస్తున్నాడు. 1805 లో ఈ కబుర్లు చెప్పే వారందరినీ ఆంద్రూ చూచే ఉన్నాడు. ఆ వర్గం తాలూకు లక్షణాలన్నీ ఫుల్‌లో కనిపిస్తూనే ఉన్నాయి. ఒక జర్మన్ సిద్ధాంతికి మచ్చుగా అతను ఆంద్రూ దృష్టికి కనిపించాడు. చక్రవర్తి సేనను తనిఖీ చేయడానికి వెళ్ళాడని విని వ్యంగ్య పూరితంగా చిరునవ్వు నవ్వాడు.

"వెధవలు! అంతా కోల్పోతారు. అప్పుడు తెలుస్తుంది" అన్నాడు.

జర్కొషేవ్ ఆంద్రూ రాకుమారుణ్ణి అతనికి పరిచయం చేస్తూ అప్పుడే వస్తు న్నాడని చెప్పాడు. ఫుల్ ఆంద్రూవంక సరిగా చూడలేదు కూడా. "మీరు మంచి చాకచక్యం ఉపయోగించారయ్యా" అంటూ ఆ ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాడు.

ఫుల్ ఎందుచేతనో కాని అన్ని సమయాల్లోనూ కోపంగా ఉంటాడు. ఆ రోజు మరీ చిరాకుగా ఉన్నాడు. తన మాటలన్నీ విమర్శల పాలుకావడంవల్ల అలా ఉన్నాడు. ఆస్టర్‌లిడ్జ్‌లో తన జ్ఞాపకాలతోపాటు ఈ కొద్దిపాటి సంభాషణతో ఆంద్రూ రాకుమారుడు అతన్ని గురించి ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకో కలిగాడు. తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అనే రకంలో వాడు ఫుల్. జర్మన్‌లో ఇలాంటి వారు కొందరుంటారు. అవ్యక్తమైన భావంలో వారికి పూర్తి విశ్వాస ముంటుంది.

ఉదాహరణకు శాస్త్రంలో వారికి పూర్తి విశ్వాసమున్నది. ఫ్రెంచి వాడి ఆత్మ విశ్వాసానికి కారణం తను స్త్రీలను, పురుషులను తప్పకుండా ఆకర్షించగలనని అను కోవడమే. ఇంగ్లీషువాడికి తనలో తనకు నమ్మకం ఉండటానికి కారణం ప్రపంచంలో కల్లా చక్కని రాజ్యాంగంలో తను పౌరుడనని అనుకోవడంవల్లనే. అందుచేత తను ఏపని చేసినా అందులో తప్పేమీ లేదని అనుకుంటూ ఉంటాడు. ఇటాలియన్ ఆత్మ విశ్వాసానికి కారణం అతను ఉద్విగ్నుడయ్యే సమయంలో పూర్తిగా తననూ, ఇతరు లనూ మరిచిపోవడమే. రష్యన్ ఆత్మ విశ్వాసానికి కారణం అతనికి ఏమీ తెలీక పోవడం, తెలుసుకోవాలనే కోరిక లేకపోవడం, నమ్మకమూ లేకపోవడం. జర్మన్

ఆత్మవిశ్వాసానికి కారణం అతని సత్యం తెలియడమే. అంటే శాస్త్రం తెలియడమన్న మాట. అది అతను కనిపెట్టిందే. అంతకుమించిన సత్యం లేదని అతని ఉద్దేశం కూడా.

1806 లో దండయాత్రను ముఖ్యంగా నిర్వహించింది అతనే. ఆ దండ యాత్ర జేనా, ఆర్ స్టేట్ ఓటమిలలో పర్యవసించింది. ఆ ఓటమి జరిగిన తరువాత కూడా అతను తన పద్ధతుల్లో లోపాలున్నాయని తెలుసు కోలేదు. పైగా దానికి ముఖ్యకారణం కొన్ని నియామాలపట్ల అశ్రద్ధ చూపడమే అనేవాడు. ఇదంతా జరుగుతుందని తనకు ముందుగానే తెలుసుననేవాడు. కడకు ఏమవుతుందో అని ఆలోచించేవాడు కాదు. ఆచరణ విషయంలో అతనికేమాత్రం దృష్టి ఉండేది కాదు.

అతను జర్కి షేవ్‌తోను, ఆండ్రూతోను మాట్లాడిన కొద్ది మాటల్లో ఈ యుద్ధ వైఫల్యాన్ని ముందుగానే గమనించిన వాడిలాగాను, అందుకోసమే చింతించని వాడి లాగాను కనిపించాడు. అతను జుట్టు దువ్విన తీరుకూడా అతని ధోరణికి అను కూలంగానే ఉంది. అతను ప్రక్కగదిలోకి వెళ్ళాడు. అక్కడ నుంచి ఎవరినో కేకలు వేయడం వినిపిస్తోంది.

# 72

ఆండ్రూ రాకుమారుడు మరొక ప్రక్కకు తిరిగాడో,లేదో కౌంట్ బెనిక్‌సన్ త్వరగా హాలులోకి వచ్చి తన గదిలోకి వెడుతూ అతన్ని చూచి తల ఊపి, సహాయ సేనాధిపతికి ఏవో ఉత్తర్వు లందించాడు. జార్ విషయంలో ఆయన్ను ఆహ్వానించే ఏర్పాట్లు చేయడానికి ముందుగా అతనక్కడికి వచ్చాడు. జర్కి షేవ్, ఆండ్రూ రాకుమారుడు బయటికి మెట్లదగ్గరికి వెళ్ళారు. చక్రవర్తి అప్పుడే గుర్రం దిగుతూ ఉన్నాడు. అలిసినట్టుగా కనిపిస్తున్నాడు. ఎడతెరిపి లేకుండా అస్తమానం ఫలూషీ చెప్పిన మాటలు ఆయనకు విసుకెత్తించినట్లున్నాయి. తలవంచుకుని నడుస్తున్నాడు. ఇక అతని మాటలు ఆపుచేయడం కోసమా అన్నట్లు రెండడుగులు ముందుకు వేశాడు. కాని ఫలూషీ మాత్రం మర్యాద కూడా లేకుండా జార్ వెనకాల నడుస్తూ మాట్లాడుతూ ఉన్నాడు.

"డ్రిస్సా తీరంలో సేనలు విడిది చేయించవలసిందని ఎవరు చెప్పారో కాని..." అని ఫలూషీ చెప్పుకుని పోతూనే ఉన్నాడు.

అప్పుడు జార్ మెట్లెక్కుతున్నాడు. ఆండ్రూ రాకుమారుని చూచాడు. కాని గుర్తించలేక పోయాడు. ఆ సమయంలో ఫలూషీ "అతనికి తగిన స్థానం పిచ్చాసుపత్రి." అన్నాడు.

అలెగ్జాండర్ ఈ మాటలు ఏ మాత్రం పట్టించుకోకుండా ఆంద్రూను చూచి లలితంగా తలవంచి గౌరవించాడు. తరువాత అంద్రూను గుర్తించాడు.

"నిన్ను చూచినందుకు చాలా సంతోషంగా ఉంది. లోపల వారంతా సమావేశమై ఉన్నారు. నీవు అక్కడికి వెళ్ళు, తరువాత నేను వస్తాను." అన్నాడు జార్.

బేరిన్‌స్టిన్, పీటర్, మైఖోలో, విచ్‌వాల్ కోన్‌స్కీ రాకుమారుడు, జార్‌ను చిన్న గదిలోకి అనుసరిస్తూ వెళ్ళారు. వారు వెళ్ళిన తరువాత గది తలుపు మూయబడింది. ఆంద్రూ రాకుమారుడు చక్రవర్తి ఆజ్ఞానుసారంగా కౌన్సిల్ సమావేశం అయి ఉన్న పెద్ద గదిలోకి వెళ్ళాడు తరువాత. అప్పుడు చక్రవర్తి పరివారంలో కల్లా పెద్ద అయిన పీటర్ వాల్ కోన్‌స్కీ రాకుమారుడు కొన్ని మ్యాప్‌లు, ప్లానులు తీసుకుని వచ్చి టేబిల్ మీద ఉంచాడు. చక్రవర్తి కౌన్సిల్ దగ్గరనుంచి సలహా తీసుకోదలుచుకున్న వివిధ విషయాలను గురించి ప్రస్తావించసాగాడు...డ్రిస్సా దగ్గర ఉన్న క్యాంపును చుట్టుముట్టడానికి ఫ్రెంచివారు సన్నాహ మవుతున్నారని అప్పుడే వార్త వచ్చింది. కాని ఆ వార్త నిజం కాదని తరువాత రుజువైంది.

అందరిలోకి ముందుగా మాట్లాడినవాడు కౌంట్ ఆరమ్ ఫెల్ట్, ఏదో ఒక ప్రదేశంలో సేననంతా కేంద్రీకరించి ప్రమాదాన్ని తప్పించుకోవాలని అతను సూచించాడు. మాస్కోకు పీటర్స్‌బర్గుకు మధ్యలో ఉన్న త్రోవలో సేనను ఆపు చేసి అక్కడ నుంచి శత్రువును ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉండాలని అన్నాడు. ఏ విధంగా చూచినా సమంజసం కాని ఈ సూచన కౌన్సిల్ ముందు ఉంచబడింది. అలా ఉంచబడడంలో ముఖ్యమైన ఉద్దేశం, తను కూడా ముందుగానే ఒక పథకాన్ని ఆలోచించి ఉంచానని కౌన్సిల్‌కు తెలియ పరచడమే, దాన్ని వివరించే అవకాశాన్ని తాను ముందుగా తీసుకున్నాడు. కొందరు ఈ పథకాన్ని సమర్థించారు, మరి కొందరు వ్యతిరేకించారు. జరుగుతున్న యుద్ధ సంఘటనల తాలూకు ప్రభావంతో ఏమాత్రం సంబంధంలేని అస్పష్టమైన పథకాలలో ఇది ఒకటి. యువకుడైన కర్నల్‌టాల్ దీన్ని తీవ్రంగా విమర్శించాడు. జేబులోనుంచి ఒక కాగితం లాగి దాన్ని చదువుతానన్నాడు. అది చాలా నిశితంతోనూ వివరంగాను వ్రాసిన ఒక పథకం. ప్రతి విషయంలోనూ ఆరమ్ ఫెల్టు, ఫుల్‌ల పథకానికి అది వ్యతిరేకమైంది. దీన్ని పలూషి వ్యతిరేకించాడు. వ్యతిరేకంగా సేనలను ఫ్రెంచి వారిపై నడపడమే తగినదని అతని వాదన. దీనివల్ల అనిశ్చితంగా ఉన్న ఈ స్థితి తొలిగిపోతుంది. ఏమైనా సేన ఈ వ్యూహం నుంచి బయటపడుతుంది. అందుకనే తను డ్రిస్సాలో క్యాంప్ చేశానని

అన్నాడు. ఫుల్, అతని వ్యాఖ్యానకర్త అయిన వాల్ట్‌జోగెన్ తుఫానులా ఉన్న ఈ వాదన జరుగుతున్నంతసేపూ మాట్లాడకుండా ఊరుకున్నారు. మధ్య మధ్య ఏదో జోక్యం కల్గించుకుంటూ ఉండేవాడు ఫుల్. కాని ఏదీ సొంతంగా చెప్పేవాడు కాదు. ఈ వెర్రిగొడవ పట్టించుకోవడం తన కిష్టంలేనట్లుగా .... తనకెందు కన్నట్లుగా ఉన్నాడు. కౌన్సిల్ అధ్యక్షుడైన వాల్‌కోన్‌స్కీ రాకుమారుడు అతన్ని కూడా అతని అభిప్రాయం చెప్పమని కోరాడు. కాని తన అభిప్రాయంవల్ల ఏమీ ఉపయోగం లేదనీ, తన కంటె ఇతరులకే ఎక్కువ తెలుసుననీ ఫుల్ అన్నాడు.

"మీ ఇష్టం వచ్చినట్లు చేయవచ్చు. శత్రువు వెనుకవైపు ఉండేటట్లుగా సూచన చేశాడు జనరల్ ఆరమ్‌ఫెల్టు. ఇది ఒకటి శత్రువుమీద దాడి చెయ్యాలన్నాడు ఆ ఇటాలియన్ పెద్దమనిషి. ఇది రెండు. ఈ రెండింటిలో మీరు ఏ త్రోవనైనా ఎన్నుకోవచ్చు. లేకపోతే హాయిగా తిరిగి పోవచ్చు" అన్నాడు ఫుల్.

వాల్‌కోన్‌స్కీ అతనిలా అనగానే కోపం తెచ్చుకుని తను....వాల్‌కోన్‌స్కీ చక్రవర్తికి ప్రాతినిధ్యం వహిస్తున్నానన్న విషయం అతనికి జ్ఞాపకం చేశాడు. అంతటితో ఫుల్ లేచి ఇలా చెప్పసాగాడు.

"అన్ని విషయాలూ అధ్వాన్నమై పోయినాయి. మీరు నా పథకాని కేదో మెరుగులు దిద్దుతారనుకున్నాను. కాని ఇంతా చేసి చివరకు నన్నే అడుగుతున్నారు. నన్నడిగితే చెప్పదలుచుకున్నదేమీ లేదు. నేను నా పథకంలో వ్రాసిన ప్రతిముక్క— అక్షరాలా అనుసరించి తీరాల్సిందే" అని వ్రేళ్ళు టేబిల్ మీద ఉంచి మళ్ళీ ఇలా చెప్పసాగాడు: "ఇందులో వచ్చిన కష్టమేముంది ? ఏమీలేదు. వట్టివెర్రి. పిల్లలఆట ఎలాంటిదో ఇది కూడా అలాంటిదే" ఇలా అని మ్యాప్‌దగ్గరికి వెళ్ళి అనేక అంశాలు త్వర త్వరగా చెప్పసాగాడు. తన పథకం ఎప్పటికీ విఫలం కాదనీ, క్యాంప్‌వల్ల వచ్చే ఉపయోగాలకు ఏమాత్రం అడ్డురాదనీ అన్నాడు. తను ముందుగా అన్నీ దృష్టిలో ఉంచుకుని, అన్ని విషయాలకూ ఇందులో తావిస్తూ దీనిని తయారు చేశానన్నాడు. శత్రువులు చుట్టుముట్టితే వారి గొయ్యి వారే తవ్వుకున్న వారవుతారన్నాడు.

పలూషీకి జర్మన్ భాష రాదు. అందుచేత ఫ్రెంచిభాషలో కొన్ని ప్రశ్నలడిగాడు. ఫుల్ ఫ్రెంచిభాష సరిగా మాట్లాడలేకపోవడంవల్ల మరొకరు తర్జుమా చేసి చెప్పవలసి వచ్చింది. తన పథకం సరిగా ఆచరణలో పెట్టక పోవడం వల్లనే ఈ చిక్కులన్నీ ఏర్పడ్డాయని అతను చెప్పిన దానిలో ఉద్దేశం. చివరకు తనిది వరకే పరిష్కరించి ఉన్న సమస్యను, తనకు స్పష్టంగా తెలిసి ఉన్న సమస్యను పరిష్కరించడానికి కాలం వృథా చెయ్యని గణిత శాస్త్రజ్ఞుడులాగా అతను మాట్లాడడం మానేశాడు. ఆ తరువాత అతని అభిప్రాయాలన్నీ ఫ్రెంచిభాషలో వాల్ట్

జోగెన్ చెప్పసాగాడు. మధ్య మధ్య అవునా కాదా అన్నట్లు అతని వంక చూచే వాడు. ఫుల్ కలవరంతో "అవును, అందులో సందేహమేముంది ?" అనేవాడు.

పలూషి, మిఛాడ్ ఈలోగా వారిని ఫ్రెంచిభాషలో వ్యతిరేకిస్తూ మాట్లాడు తున్నారు. ఆరమ్ ఫెల్టు, ఫుల్‌తో జర్మన్ భాషలో మాట్లాడుతున్నాడు. టోల్ ఇదంతా వాల్‌కోన్‌స్కీ రాకుమారునికి రష్యన్ భాషలో చెపుతున్నాడు.

ఆంద్రూ రాకుమారుడు ఇదంతా చూస్తూ ఏమీ మాట్లాడలేదు. అక్కడున్న వారందరిలోకీ అతని సానుభూతిని ఆకర్షించింది ఫుల్ ఒక్కడే.

చర్చ చాలా సేపు జరిగింది. రాను రాను తీవ్రమైంది. చివరకు వ్యక్తి గత దూషణలలోకి కూడా దిగింది. ఏ సమస్యా తేలింది కాదు. ఆంద్రూ రాకుమారునికి ఈ భాషలు, ఈ పథకాలు, ఈ సూచనలు; ఇవన్నీ గందరగోళంగా కనిపించాయి. ఇవన్నీ వింటూంటే అతనికి ఆశ్చర్యం కలిగింది. అతను సేనలో ఉన్నప్పుడు ఎన్నోసార్లు యుద్ధశాస్త్రం అంటే ఏమిటా అని ఆలోచించాడు. అతని ఉద్దేశంలో అలాంటిదేమీ సంభవంగా కనిపించలేదు.'మిలిటరీ ప్రతిభ' అని అందరూ వాడే మాట ఒక మామూలు మాటగా కనిపించింది. ఇంతవరకూ అస్పష్టంగానే తన మనస్సులో ఏర్పడి ఉన్న ఈ భావాలు ఈ నాటి చర్చలవల్ల అతని మనస్సులో స్పష్టంగా స్థిరపడిపోయాయి.

ఆంద్రూ ఇలా ఆలోచనల్లో మునిగిపోయి ఉండగా నటాషా గొంతుక అతన్ని మళ్ళీ స్మృతిలోకి తీసుకుని వచ్చింది. అప్పటికి సమావేశం అయిపో వస్తోంది.

ఆ మరుసటి రోజు తనిఖీ జరుగుతూ ఉండగా జార్, ఆంద్రూను 'నీవు ఏ పదవిని కోరుతున్నా'వని అడిగాడు. ఆంద్రూ రాకుమారుడు చక్రవర్తి పరివారంలో నియమించమని కోరడానికి మారుగా సేనలోకి పంపించమని కోరడం వల్ల దర్బారీ యుల్లో అతనిపట్ల గల గౌరవం కొంచెం తగ్గింది.

# 73

ఈ ఘర్షణలు ప్రారంభించడానికి కొద్ది కాలం క్రితం నికోలస్ రోస్టోవ్‌కు తల్లి దండ్రుల దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. నటాషా జబ్బును గురించి, ఆవిడ ఆంద్రూ రాకుమారునితో తెగతెంపులు చేసుకోవడాన్ని గురించీ వ్రాశారు.

"తనే స్వయంగా తెగ తెంపులు చేసుకున్నది. మా సలహా కూడా తీసుకో లేదు."అని వ్రాశారు.ఉద్యోగం చాలించుకుని ఇంటికి తిరిగి రమ్మని కూడా వ్రాశారు. అతను జవాబు వ్రాస్తూ తన చెల్లెలు జబ్బుగా ఉన్నందుకు, ఆమె ఆంద్రూను నిరాక రించినందుకు తను ఎంతో చింతిస్తున్నాననీ వారి కోరిక ప్రకారం తనకు ఇంటికి రావాలని ఉన్నప్పటికీ తను సెలవు తీసుకోననీ వ్రాశాడు.

"ప్రాణ ప్రియా!" అని సంబోధిస్తూ సోనియాకు ప్రత్యేకంగా ఒక ఉత్తరం వ్రాశాడు. "నేను తిరిగి వచ్చి మిమ్మల్నందరినీ కలుసుకోలేక పోవడానికి కారణం నా గౌరవాన్ని నేను నిలబెట్టుకోవాలని అనుకోవడమే. యుద్ధం దాపుకు వచ్చిన సమయంలో నేను సుఖం కోసమని నా బాధ్యతను విస్మరిస్తే నా స్నేహితుల దృష్టిలోనే కాక నా దృష్టిలో కూడా నేనెంతో చిన్నచూపు చూడబడతాను. కాని ఇదే మన కడసారి వియోగమని నేననుకుంటూ ఉన్నాను. దండయాత్ర పూర్తి కాగానే అప్పటికి నేను బ్రతికి ఉండి, నీవు నన్నింకా ప్రేమిస్తున్న పక్షంలో నేను రెక్కలు కట్టుకుని వచ్చి నీ ముందు వాలి నిన్ను నా - హృదయానికి హత్తుకుంటాను," అని వ్రాశాడు.

ఈ విషయం నిజమే. అతని వివాహానికి అడ్డు తగిలింది యుద్ధమే. అట్రెడ్‌నో వేటల్లో గడిపిన శిశిర ఋతువు, పండుగ వినోదాలతో గడిపిన శీతాకాలం, సోనియాపట్ల ప్రేమ అతని కళ్ళముందు అతనింతవరకూ ఎరుగని ప్రశాంతమైన ఆనందమయ దృశ్యాలను పొడగట్టచేశాయి. ఇప్పుడా దృశ్యాలు మరింత ఎక్కువగా అతని ముందు కనిపించసాగాయి. చక్కని భార్య, పండ్లలాంటి పిల్లలు, మంచి వేట కుక్కలు—ఒక డజను వేటకుక్కలు, ఎస్టేటు ప్రక్క గ్రామాల నుంచి విందుల కోసం వచ్చిపోయే అతిథులు; ఇవన్నీ అతని కళ్ళముందు పొడగట్టసాగాయి. కాని ఇప్పుడు అవి ఆలోచించి ఏమీ లాభం లేదు. అతను అతని దళంతోబాటు ఇక్కడే ఉండిపోవాలి. అందుచేత ఉన్న జీవితాన్ని ఆనందమయం చేసుకుంటూ అతను కాలం గడుపుతున్నాడు.

అతను సెలవు నుంచి తిరిగి రాగానే అతని తోటి ఆఫీసర్లు అతన్నెంతో ఆనందంతో ఆహ్వానించారు.తరువాత గుర్రాలు కొనుక్కురావడానికి అతన్ని పంపించారు. అతను వెళ్ళి మంచి గుర్రాలు తీసుకుని వచ్చాడు. అంతా ఎంతో సంతోషించారు. అతను అక్కడలేని కొద్ది కాలంలో అతనికి కెప్టెన్ పదవి కూడా ఇచ్చారు. దళాన్ని మళ్ళీ పిలవగానే తన పాత దళానికి తనే కమాండర్ అయినాడు.

యుద్ధం ప్రారంభించింది.జీతాలు హెచ్చించారు. దళాన్ని పోలెండుకు పంపించారు. అక్కడ కొత్త ఆఫీసర్లు వచ్చి వారితో కలిశారు. కొత్త సైనికులు, కొత్త గుర్రాలు-యుద్ధం మొదలు కావడంవల్ల అంతా ఉత్సాహంగా ఉంది. నికోలస్ తన పరిస్థితి, తన పదవి యొక్క అవకాశాలు వినియోగించుకుంటూ హాయిగా సుఖంగా కాలం గడుపుతూ వున్నాడు. కాని ఒకప్పటికి సేన వదిలిపెట్టి వెళ్ళవలసి వస్తుందని అతనికి బాగా తెలుసు.

ఇతర విషయాలు అలా ఉంచి రాజ్యాంగ విధానానికి సంబంధించిన అనేక కారణాలవల్ల సేనను విల్నా నుంచి తరలించారు. వారలా వెనక్కు మళ్ళడం వల్ల స్టాఫ్‌లో అనేక కొత్త చిక్కులు వచ్చిపడ్డాయి. అనేక చీలికలు,కుట్రలు ఏర్పడ్డాయి.

పావ్‌లొగ్రాడ్ ఆశ్విక సైనికులకు సంబంధించి నంతవరకు తిరోగమనం చక్కగానే సాగింది. వాతావరణం చక్కగా వుంది. కావలసినన్ని సప్లయిలు, సుఖము, హాయి, కులాసా ప్రయాణంలాగా సాగింది. ఇక నిస్పృహ ఎక్కడ ఉన్నదీ అంటే అది వారికి సంబంధించిన విషయం కాదు. అదెక్కడో ప్రధాన కార్యాలయంలో వున్నది. చక్కని వాతావరణంలో హాయిగా వారి ప్రయాణం సాగింది. ఎక్కడికి వెడుతున్నారో ఎందుకు వెడుతున్నారో వారు ఆలోచించలేదు.వారికున్న చింతల్లా ఒక్కటే. వారు జీవితం ఎంతో సుఖంగా సాగించిన తమ బసలు వదిలి వెళ్ళి రావడం, చక్కని పోలిష్ పిల్లలని వదిలి వెళ్ళవలసి రావడం. భవిష్యత్తు ఎప్పుడూ నిరాశ సూచకంగా ఏ ఆఫీసరుకూ కనిపించలేదు. ఒకవేళ కనిపించినప్పటికీ దాన్ని మనస్సు నుంచి పారద్రోలి కులాసాగా కనిపిస్తూ తమ పనుల్లో మునిగిపోయే వారు. క్యాంప్, ముందు విల్నాకు కొద్ది దూరంలో ఉంచారు. తరువాత అక్కడ పోలిష్ కౌంట్లతో పరిచయం ఏర్పరచుకుని ఆఫీసర్లు కావలసినంత వినోదాలు, విలాసాలు చేశారు.

జార్ కాని, మరే పై ఉద్యోగి కాని వచ్చి చూచే తనిఖీకి వారు సిద్ధంగా ఉన్నారు. తరువాత స్వెంట్ జియనీకి తిరిగి వెళ్ళి తీసుకపోవడానికి వీల్లేని భోజన సామగ్రులను అవసర వస్తువులను ధ్వంసం చేయమని ఉత్తర్వు వచ్చింది. ఆశ్విక సైనికులకు స్వెంట్ జియనీ బాగా జ్ఞాపకముంది. పూర్వం వారక్కడ ఉంటూ వచ్చినప్పుడు వారు దానిని త్రాగుబోతుల క్యాంప్ అని పిలుస్తూ వచ్చేవారు. సేనలు వెడుతూ దారిలో భోజన సామగ్రులను, అవసర వస్తువులను, గుర్రాలను, బండ్లను, తివాసీలను; చేతికి వచ్చిన దానినల్లా తమ స్వాధీనం చేసుకున్నారు. దీనివల్ల చాలా గొడవలు ఏర్పడ్డాయి. నికోలస్‌కు కూడా ఈ స్థలం బాగా జ్ఞాపకముంది.తను రాగానే క్వార్టర్ మాస్టర్‌ను పని నుంచి తొలగించవలసి వచ్చింది. ఇక తన మనుష్యులతో ఏం చేయాలో అతనికి తోచలేదు. వారు బాగా తప్పత్రాగారు. అతనికి తెలీకుండా అయిదు టన్నులు పాత బీర్ కూడా తీసుకుని వచ్చారు.

స్వెంట్ జియనీ నుంచి తిరోగమనం డ్రిస్సావరకూ సాగింది. డ్రిస్సాను కూడా దాటిపోయారు.

జూలై 13వ తారీఖున పావ్‌లొగ్రాట్ సేనా దళానికి శత్రువుతో ఒక చిన్న ఘర్షణ జరిగింది. అంతకు ముందు సాయంత్రం తీవ్రంగా గాలి విసరడంవల్ల వర్షం పడడం వల్ల సేన కొంచెం దెబ్బతిని వున్నది ఇలాంటి చిన్న చిన్న తుఫానులు 1812వ సంవత్సరమంతా తరుచుగా వస్తూ ఉండేవి. రెండు దళాలు రై ధాన్యపు పొలంలో బస చేశాయి. గుర్రాలు, పశువులు ధాన్యాన్ని తొక్కి నాశనం చేశాయి. వర్షం ధారాపాతంగా కురుస్తూ ఉంది. నికోలస్, అతని రక్షణలో వున్న కుర్రవాడైన ఇలైన్ అనే ఒక ఆఫీసరు, త్వరత్వరగా ఒక గుడిసె వేసుకుని అందులో దాగారు. మరొక ఆఫీ

సరు- మీసాల్లో ముఖమంతా దాగిపోయిన వ్యక్తి వానజల్లుకు పరుగెత్తుకుంటూ లోనికి వచ్చాడు.

"నేను ప్రధాన కార్యాలయం నుంచి వస్తున్నాను. మీరు రవిస్కీ చేసిన పని విన్నారా?"....అన్నాడా వ్యక్తి. తరువాత అతను సాల్టనోవ్కా సమరాన్ని గురించిన వివరాలను చెప్పాడు. మీసాలు గల ఆ ఆఫీసరు పేరు జ్డ్రిడిన్స్కీ. అతను తన కథంతా వర్ణనలతో సహా చెప్పాడు. అతను చెప్పే మాటలు వింటోంటే సాల్ట్‌నోవ్కాలోని కందకం థెర్మోపైల్ కనుమ అంతటి ప్రాధాన్యం కలిగిందేమో నని పిస్తుంది. జనరల్ రవిస్కీ ఆ కందకాన్ని దాటడం పూర్వకాలపు వీరుల సాహస కృత్యాలను వర్ణించి నట్లుగా అతను వర్ణించి చెప్పాడు. నికోలస్ ఈ పురాణాన్నేమీ పట్టించుకో లేదు. పైపు కాలుస్తూ మధ్య మధ్యలో నవ్వుతూ కూచున్నాడు. తన వెన్ను మీద నుంచి వాననీరు కొద్దిగా జాలువారు తోంది. అతను మధ్య మధ్యలో ఇలైన్ వంక చూస్తున్నాడు. ఏడు సంవత్సరాల క్రితం తనకు డెనిషోవ్‌కూ మధ్య ఎలాంటి సంబంధం ఉన్నదో ఇప్పుడు ఆ పదహారు సంవత్సరాల కుర్రవాడికీ తనకూ మధ్య అలాంటి సంబంధమే ఉన్నది. ఇలైన్‌కు నికోలస్ పట్ల ఒక సహజమైన పూజాభావం ఉన్నది. జ్డ్రిడిన్స్కీ, నికోలస్‌కు పట్ల ఒకస్త్రీ సహజమైన పూజాభావం ఉన్నది. జ్డ్రిడిన్స్కీ, నికోలస్‌కు తను ఎన్నిమాటలు చెప్పినా ఉత్సాహాన్ని కలిగించలేక పోయాడు. అతను మాట్లాడకుండా కూచుని కదలకుండా వింటూ ఉన్నాడు. అతని ముఖకవళికలను బట్టి చూస్తే ఆ కథ వినడం అతని కేమాత్రం ఇష్టం లేనట్లుగా కనిపిస్తోంది. ఆస్టర్‌విట్జ్ అనుభవాన్ని బట్టి, 1807 నాటి యుద్ధాన్ని బట్టి మిలిటరీ విషయాలు చెపుతున్నప్పుడు సాధారణంగా అబద్ధాలే చెపుతా రని నికోలస్‌కు తెలుసు. తన దళాన్ని గురించి మాట్లాడుతూ తను కూడా అబద్ధాలే చెప్పాడు. యుద్ధంలో ఎప్పుడూ ఏదీ మన మనుకున్నట్లుగా జరుగదనీ, తరువాత మనం వర్ణించేటట్లుగాను జరగదనీ అతనికి తెలియదా? అందుచేతనే అతనికా కథ కలవరం కలిగించింది, అంతకంటెకూడా ఆ కథకుడు మరీకలవరం కలిగించాడు. అదీకాక తనపై వంగి దాపుగా ఉండి కథ చెపుతున్నాడు. తను కూచున్న ఆ చిన్న గుడిసెలో చాలా భాగం అతనే ఆక్రమించాడు. అతనివంక చూస్తూ నికోలస్ తనలో తాను ఇలా అనుకున్నాడు: "మొదటి విషయం. అప్పుడు కందకం దగ్గర కలవరం, గందరగోళం, ఒత్తిడి ఎక్కువగా ఉండి ఉంటాయి. రవిస్కీ తన సైనికులతో కలిసి దానిపైకి వెళ్ళినప్పటికీ అతను పది పన్నెండు మందికంటె ఎక్కువ మందిని ఎదుర్కొని ఉండడు. ఇతరులకు అతనెవరో కూడా తెలిసి ఉండదు. ఒకవేళ తెలిసినా వారు దాన్ని లెక్కచేసి ఉండరు. తమ ప్రాణాలు కాపాడుకోవడంలో వారు నిమగ్నులై ఉంటారు...అయినా అన్నీ ఆ ఒక్క కందకం వల్ల తేలిపోతాయా ఏం? అది మన వశమైనా ఒకటే; శత్రువు వశమైనా ఒకటే,

అదేం పెద్ద కనుమకాదు కదా? ఇక అనవసరంగా ఇలా బలిచేయటంలో అర్థమేమిటి? తన సైనికులను ముందుకు ఎందుకు పంపించాలి? నా తమ్ముడు పేట్యా నయితే నేనిలా చేస్తానా? ఇలైన్‌ను అయితే మాత్రం ఇలా చేస్తానా?అతను నా వాడు కాకపోయినా మంచికుర్రవాడు. పైగా వారిని ప్రమాదం పాలుకాకుండా కూడా చూస్తాను" నికోలస్ ఇలా ఆలోచించుకుంటూ కూచున్నాడు. కాని పైకి మాత్రం చెప్పలేదు. నిష్కపటంగా ఉండటంవల్ల నిరుపయోగమని అతను అనుభవం వల్ల తెలుసుకున్నాడు. ఈ చిన్ని పోరాటం రష్యన్ సేనకు కీర్తిని తెస్తుంది కాబట్టి దాన్ని తను నమ్మినట్టుగానే ప్రవర్తించాలి. అలాగే ప్రవర్తించాడు.

"ఇదీ ఘోరంగా ఉంది. నేను బాగా తడిసిపోయాను. మరెక్కడైనా నిలువ నీడ ఉందేమో చూస్తాను." అన్నాడు ఇలైన్. అతను, జ్డ్రిన్స్కీ కలిసి బయటికి వెళ్ళారు.

అయిదు నిమిషాలు గడించిందో లేదో ఇలైన్ మళ్ళీ తిరిగి వచ్చాడు. బురద త్రొక్కుకుంటూ వచ్చాడు. "రోస్టోవ్! రా. ఒకస్థలం దొరికింది. రెండు వందల గజాల దూరంలో ఒక సారాపాక ఉంది. అప్పుడే మనవాళ్ళు కొందరక్కడికి చేరారు. మనం అక్కడికి వెళ్ళి వళ్ళు ఆర్చుకో వచ్చు. మేర్యా కూడా అక్కడే ఉంది." అని చెప్పాడు ఇలైన్.

మేరియా హెన్రికోవ్‌నా ఒక చక్కని జర్మన్ పిల్ల. దళం తాలూకు సర్జన్ ఆపిల్లను పోలెండులో పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు తను ఎక్కడికి వెళ్ళినా తనతోపాటు ఆవిడను కూడా తీసుకెడతాడు. దీనికి కారణం తను ఒకచోటు కాపురం పెట్టలేక పోవడమే కావచ్చు. లేక వారికి పెళ్ళయిన తొలిరోజుల్లో ఆవిడనుంచి విడిగా ఉండలేక పోవడమే కావచ్చు. ఏమైనప్పటికీ సర్జన్ మమత్వం అందరికీ ఒక హాస్యంగా పరిణమించింది. నికోలస్ ఒకకోటు వేసుకుని లావ్‌రుష్కాను పిలిచి బండి మీద తన సామాన్లు తీసుకుని రమ్మన్నాడు. తరువాత తాను, ఇలైన్ బయలు దేరారు.... బురదలో వేళ్ళు జారుతున్నాయి. వాన కొంచెం తగ్గింది. ఆకాశం నిర్మల మవుతూ ఉంది. మధ్య మధ్యలో ఉండి ఉండి మెరుపు తీగెలు చీకటిని చీలుస్తున్నాయి.

"రోస్టోవ్! ఇప్పుడు మనం ఎక్కడున్నాం?" అని అడిగాడు ఇలైన్.

"ఇక్కడికే చేరాం." అన్నాడు నికోలస్ రోస్టోవ్.

## 74

సర్జన్ గూడుబండి సారాపాకవాకిట్లో నిలుచుని వుంది. అప్పుడే అయిదు గురు ఆఫీసర్లు ఆ పాకలో తలదాచుకున్నారు. మేరియా హెన్రికోవ్‌నా ఒక బెంచీ మీద కూచుని ఉంది. చక్కటి అందమైన పిల్ల. కొంచెం బొద్దుగా ఉంటుంది.

డ్రెస్సింగ్ జాకెట్టు వేసుకుని నైట్‌క్యాప్ పెట్టుకుని ఉంది. ఆవిడ వెనకాల ఆవిడ భర్త హాయిగా పడుకుని నిద్రపోతూ ఉన్నాడు. అంతా నవ్వుతూ మాట్లాడుకుంటున్నారు.

"ఇక్కడంతా కులాసా చేస్తున్నట్లున్నారే?" అన్నాడు నికోలస్.

"ఏమిటి ఇలా వచ్చారు? ఇలా తడిసిపోయారేమిటి? కుళాయిల్లాగా ఉన్నారు! మా డ్రాయింగ్ రూమ్‌ను మాత్రం పాడుచేయకండి. మేరియా దుస్తులను పాడుచేయకండి" అన్నాడు అక్కడున్నవారిలో ఒకడు.

నికోలస్, ఇలైన్ ఆవిడ మర్యాదకు భంగం కలిగించకుండా తమ దుస్తులను మార్చుకోవడం కోసమని ఒకమూలగా ఉండే స్థలం కొరకు వెదికారు. అప్పుడు వారికి అరగా ఏర్పరచబడిన ఒక ప్రదేశం కనిపించింది. కాని అప్పటికే అక్కడ కూడా ముగ్గురు ఆఫీసర్లు కూచుని ఉన్నారు! వారక్కడ కూచుని ఒక సీసాకు కొవ్వొత్తి గుచ్చి పేకాట ఆడుకుంటున్నారు. వారు తాము అక్కడ నుంచి లేవమని చెప్పారు. అప్పుడు మేరియా మాత్రం వారిపై దయతలిచి వారికి ఒక చిన్నకోటు అందిస్తే వారు దాన్ని ఒక తెరగా కట్టారు. లావ్రుష్కా సహాయంతో వారిద్దరూ ఆ తెరవెనకాల ఉండి తమ తడి బట్టలు మార్చుకున్నారు.

కొద్ది కష్టంమీద ఒక పగులు బారిన పొయ్యిలో నిప్పు చేశారు. ఎక్కడో ఒకచోట ఒక బల్ల చెక్క దొరికింది. దాన్ని పొయ్యిమీద పెట్టారు. తరువాత టీ కాచుకోవడం కోసం దానిమీద టీ-కెటిల్ ఉంచారు. ఒక బుట్ట తెరిచి అందులో నుంచి ఒక అరసీసా రమ్ తీశారు. మేరియా హెన్రికోవ్‌నాను ఆ కులాసా సమావేశానికి అధ్యక్షత వహించమన్నారు. అంతా ఆవిడ చుట్టూ చేరారు. ఆవిడ తన చక్కటి చేతులు తుడుచుకోవడానికి ఒకడు ఒక తెల్లని రుమాలును ఆవిడకు అందించాడు. మరొకడు ఆవిడ కాళ్ళకు తడికాకుండా ఆవిడ కాళ్ళక్రింద ఒక ఉన్నికోటు పరిచాడు. మరొకడు చలిగాలి తగలకుండా కిటికీకి తనకోటు అడ్డంగా ఉంచాడు. మరొకడు ఆవిడభర్త లేస్తాడేమో అని అతని మీద వాలే ఈగలు తోలుతున్నాడు.

"పడుకోనివ్వండి" అన్నది మేరియా, మెల్లగా చిరునవ్వు నవ్వుతూ, "రాత్రి ప్రయాణం చేసిన తరువాత ఆయనకు బాగా నిద్రపోవడం అలవాటు. పడుకోన్వివండి" అన్నది.

"అదేమిటి? మనం డాక్టరుగారి విషయంలో జాగ్రత్త తీసుకోవాలి. ఎప్పుడేం జరుగుతుందో ఎవరికి తెలీదు. ఆమె చెయ్యి తీసేస్తాడో, కాలు తీసేస్తాడో?" అన్నాడు ఒక ఆఫీసరు.

అక్కడున్నవి మూడే గ్లాసులు. నీరు కూడా పసుపు పచ్చగా మురికిగా ఉన్నది. అంచుచేత టీ చిక్కగా ఉందో, పల్చగా వుందో చెప్పలేకుండా ఉన్నారు.

ఆరు గ్లాసులకు సరిపోయే టీ మాత్రమే ఆ టీ-కెటిల్‌లో పడుతుంది. కాని ఇది ఎవరికీ ఇబ్బందిగా కనిపించ లేదు. ఒకరి తరువాత ఒకరు త్రాగితే గమ్మత్తుగా ఉంటుందని అనుకున్నారు. ముందు పై ఆఫీసర్లు, తరువాత చిన్న ఆఫీసర్లు త్రాగవచ్చు నను కున్నారు. మేరియా హెగ్రినికోవ్‌నా తన బొద్దుగా ఉన్న చేతులతో అందిస్తే త్రాగా లనుకున్నారు. ఆవిడ చేతులు బొద్దుగా, చక్కగా ఉన్నప్పటికీ వ్రేలిగోళ్ళు మాత్రం ఉండవలసినంత శుభ్రంగా లేవు. అంతా ఆ సాయంత్రం నుంచీ ఆవిడను ప్రేమి స్తున్నట్లు కనిపిస్తున్నారు. నిజంగా కూడా అలాగే వున్నారు. పేకాట ఆడుకునేవారు కూడా తమ ఆట వదిలిపెట్టి వచ్చారు. ఆవిడతో చనువుగా వున్నారు. ఈ విధంగా చుట్టూ చక్కని యువకులతో కూచున్న మేరియా హెగ్రినికోవ్‌నా ఎంతో సంతృప్తిగా కనిపించసాగింది. మధ్య మధ్యలో మాత్రం నిద్రపోతున్న తన భర్త ఏ మాత్రం కదిలినా కలవర పడుతోంది.

ఒకటే చెంచా ఉంది. కాని ఆ కొరత తీర్చేటందుకు కావలసినంత పంచదార ఉంది. అది త్వరగా కరగనందువల్ల మేరియా ప్రతి టీ గ్లాసును అనేకసార్లు కలియ పెట్టవలసి వచ్చింది. నికోలస్‌కు అతని టీ గ్లాసు అందించిన తరువాత అతను అందులో కొంచెం రమ్ కలుపుకుని గ్లాసు పైకెత్తాడు.

"కాని నీవు అందులో పంచదార వేసుకోలేదేం?" అన్నదామె నవ్వుతూ. అప్పుడు వారి కులాసాను చూస్తే వారు మాట్లాడే ప్రతిమాట ఎంతో హాస్యంగా ఉన్నట్లు కనిపిస్తోంది.

"నాకు పంచదార అక్కర్లేదు. నీ చక్కని వ్రేళ్ళతో నీ చెంచాను నా టీ గ్లాసులో ముంచడమే నేను కోరతాను!" అన్నాడు నికోలస్.

మేరియా హెగ్రినికోవ్‌నా తీసిపోయిందేమీ కాదు. చెంచాకోసం వెదికింది. కాని ఎవరో దానిని తీసుకున్నారు.

"వచ్చినా ఫరవాలేదు కాని, నీ చిన్ని వ్రేలును గ్లాసులోముంచు చాలు. అంత కంటె ఇదే నాకిష్టం" అన్నాడు మళ్ళీ నికోలస్.

"కాని నా వ్రేలు కాలిపోదూ?" అన్నది మేరియా, ఆనందంతో సిగ్గు వారుతూ.

ఇలైన్ ఒక నీళ్ళగిన్నె తీసుకున్నాడు. ఒకటి రెండు చుక్కలు రమ్ అందులోవేసి ఆవిడ దగ్గరికి తీసుకుని వచ్చాడు.

"ఏదీ? నీ వ్రేలుతో కదిలించు. ఒక్క చుక్క కూడా మిగలకుండా త్రాగు తాను" అన్నాడు ఇలైన్.

కెటిల్‌లోని టీ అంతా చుక్కకూడా మిగలకుండా త్రాగిన తరువాత నికో

లన్ తన జేబులో నుంచి పేక తీశాడు. మేరియా వారిలో ఒకరితో కలిసి పేకాడాలని కోరాడు. పేకాటలో గెలిచినవాడు ఆ స్త్రీ చెయ్యి ముద్దాడతాడనీ, ఓడినవాడు మళ్ళీ సర్గన్ కోసం టీ కాచాలని అనుకున్నారు.

"కాని మేరియాయే రాజుముక్క తీసుకుంటే?" అని అడిగాడు ఇలైన్.

"అప్పుడు ఆవిడే మనకు రాణికాబట్టి, ఆవిడ ఆజ్ఞలను మనం శిరసా వహిస్తాం!"

వాళ్ళు ఆట మొదలు పెట్టారోలేదో, డాక్టరు తన చెదిరిపోయిన తల ఎత్తి తన భార్య భుజం మీదిగా తొంగి చూచాడు. ఆయన లేచి ఒకటి రెండు నిముషాలవుతుంది. జరుగుతున్న వినోద మంతా ఆయన వింటూనే ఉన్నాడు. కాని ఆయన ముఖకవళికలను బట్టి చూస్తే ఆనందిస్తున్నట్టుగా లేడు. ఆఫీసర్ల విషయం ఏమాత్రం పట్టించుకోకుండా బద్ధకంగా తల ముందుకు పెట్టి తను వెళ్ళడానికి త్రోవ ఇవ్వమని అడిగాడు. వారు అతను వెళ్ళడానికి త్రోవ ఇచ్చారు. అతను వెడుతుండగా బిగ్గరగా నవ్వారు. మేరియా హెన్రికోవ్నా కూడా కళ్ళలో నీళ్ళు తిరిగేవరకూ సిగ్గుపడింది. కాని అప్పుడు కూడా ఆవిడ అందంగానే కనిపిస్తోంది. డాక్టరు మళ్ళీ తిరిగి రాగానే నవ్వడం ఆపిన తన భార్య ప్రక్కనే ఆవిడ ఎప్పుడు ఓడిపోతుందా అని చూస్తూ కూచున్నాడు. వాన వెలిసిందనీ, వారిక వెళ్ళవచ్చుననీ, లేకపోతే తనమందు లెవరైనా దొంగిలిస్తారనీ వారితో చెప్పడం కోసం అతను కూచున్నాడు.

"ఏమిటి భయం? కావలసివస్తే నేనొక సైనికుణ్ణి కూడా పంపుతాను. అవసరమైతే ఇద్దరిని కూడా!" అన్నాడు నికోలస్.

"నేనే వస్తాను" అన్నాడు ఇలైన్.

"మంచిది. మీరు హాయిగా నిద్రపోయారేమో కాని నేను రెండు రాత్రుల నుంచీ విశ్రాంతిలేకుండా ఉన్నాను" అన్నాడు డాక్టర్. ఇలా అని ఆట ఎప్పుడవుతుందా అని బద్ధకంగా తన భార్య ప్రక్కన అలాగే కూచుని ఉన్నాడు. ఆవిడ ఏ మాత్రం కదిలినా కనిపెడుతూ ఉన్న డాక్టర్‌ను చూచి అందరూ నవ్వలేకుండా ఉండలేక పోతున్నారు. అలా నవ్వుతూ తమ నవ్వుకు ఏదో ఒక కారణం కనిపెట్టడానికి ఎంతో ప్రయత్నిస్తున్నారు.

చివరకు తను తన ముచ్చటైన ఇల్లాలును తీసుకుని వెళ్ళిపోగానే వారంతా తడిగా ఉన్న తమకోట్లు కప్పుకుని పడుకున్నారు, కాని వారికి నిద్రపట్టలేదు. చాలా సేపు కులాసాకబుర్లు చెప్పుకుంటూ గడుపుకున్నారు.

# 75

తెల్లవారగట్ల మూడు గంటలైంది. అయినా ఇంకా ఎవరూ నిద్రపోలేదు. అప్పుడు ఆ దగ్గరలోనే ఉన్న ఆస్ట్రోవ్‌నా అనే పట్టణానికి ఆ దళం తక్షణమేతరలి వెళ్ళాలని క్వార్టర్ మాస్టర్ ఉత్తర్వులు తీసుకుని వచ్చాడు.

ఆఫీసర్లంతా త్వరత్వరగా తయారైనారు. కాని ఇంకాముచ్చట్లు మాత్రం ఆపలేదు. మళ్ళీ ఆ పసుపు పచ్చని నీటితోనే టీ కాచుకుని త్రాగారు. కాని నికోలస్ మాత్రం టీ త్రాగడానికి ఉండకుండా తన దళాన్ని చూడడానికి బయలుదేరాడు. అప్పటికి వాన వెలిసింది. తెల్లవారుతోంది. మేఘాలు మెల్లగా విచ్చుకుని విడిపోతున్నాయి. వాతావరణం ఇంకా చల్లగా ఉంది. అతను వేసుకున్న యూనిఫారం ఇంకా తడి ఆరక పోవడం వల్ల ఇంకా చలివేస్తోంది. ఇలైన్, నికోలస్ వెడుతూ వెడుతూ వాకిట్లో ఉన్న గూడు బండిలోకి తొంగి చూచారు. ఒక మూలగా దిండుమీద తల ఉంచి సర్జన్ భార్య నిద్రపోతోంది. ఆమె తలకు పెట్టుకున్న టోపీ చెక్కుచెదరకుండా కనిపిస్తోంది. ఆమె నిద్రపోతూ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడవడం కూడా వారికి వినిపిస్తోంది. సర్జన్ కాళ్ళు బయటికి పెట్టుకుని పండుకోవడం కూడా వారికి కనిపించింది. "ఆవిడ నిజంగా ఎంతో మంచిది." అన్నాడు నికోలస్. "అవును, నిజమే." అన్నాడు ఇలైన్ పదహారేండ్ల కుర్రవాడు మాట్లాడినట్టుగానే.

ఒక అరగంటలో దళమంతా రోడ్డుమీదికి చేరుకుంది. గుర్రాలెక్కడానికి ఉత్తర్వు లిచ్చారు. అందరూ క్రాస్‌గుర్తులు చేసుకుని గుర్రా లెక్కారు. నికోలస్ అందరికంటె ముందున్నాడు.

"ముందుకు వెళ్ళండి!" అని కేకవేశాడు.

సైనికులు బయలు దేరారు. గుర్రాల గిట్టల చప్పుడు వినిపిస్తోంది. రహదారిపై ఆపిల్ తోటల్లో గుండా త్రోవ చేసుకుని పోతున్నారు.

ఊదారంగు, బూదిరంగు కలిసిన మబ్బులు ఇంకా తూర్పు దిశన కనిపిస్తూనే ఉన్నాయి. ఆకాశంలో పరుగులు తీస్తున్నాయి. ప్రొద్దుపొడుస్తోంది. ప్రక్కనున్న గుంటలలోని గరిక ఇప్పుడు కంటికి కనిపిస్తోంది. రాత్రి వాన కురవటం వల్ల బాగా తడిసి ఉంది. మిల మిల లాడుతున్న నీటిబిందువులు ఆపిల్ చెట్ల ఆకుల మీదనుంచి రాలుతున్నాయి. ఇప్పుడందరి ముఖాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. నికోలస్ ఇలైన్ ఇరు ప్రక్కలా చెట్లున్న త్రోవలోగుండా వెడుతున్నారు. పగటివేళ తన గుర్రాన్ని మార్చడమంటే నికోలస్ కెంతో ఇష్టం. అందుచేత తన గుర్రాన్ని మార్చి మరో గుర్రాన్ని ఎక్కాడు. అతనికీ గుర్రాల విషయంలో చాలా అభిరుచి ఉంది. ఇటీవలే తెల్లని జూలుగల ఒక కొత్త గుర్రాన్ని కొన్నాడు. డాన్ మైదానాలకు వెళ్ళి

ఆ గుర్రాన్ని కొనుక్కొని వచ్చాడు. ఆ గుర్రాన్ని మించిన గుర్రమే లేదు. ఎంతో కులాసాగా దాని మీద స్వారీ చేసేవాడు. ఇప్పుడు కూడా ఆ గుర్రాన్ని గురించే ఆలోచిస్తూ సర్జన్ భార్యను గురించి ఆలోచిస్తూ, ఉదయాన్ని గురించి ఆలోచిస్తూ స్వారీ చేసుకుంటూ వెడుతున్నాడు.

పూర్వం అతనికి యుద్ధానికి వెళ్ళాలంటే భయం ఉండేదేమో కాని ఇప్పుడు మాత్రం అలాటి భయాలేవీ లేవు. అలవాటు అతనిలో మార్పు తెచ్చిందని అనుకో వచ్చు కాని విషయమది కాదు. తన్ను తాను నిగ్రహించుకోవడం అతను నేర్చుకు న్నాడు. అప్పుడు ప్రస్తుతానికి ఏది అవసరమో తప్ప మరో విషయాన్ని ఆలోచించ కుండా ఉండడం కూడా నేర్చుకున్నాడు. ముందొచ్చే ప్రమాదాన్ని గురించి కూడా ఇప్పుడాలోచించడం లేదు.తన భయాన్ని తొలగించుకోవడానికి అతను ఎన్ని ప్రయ త్నాలు చేసినా తన్ను తాను ఎన్ని విధాల నిందించుకున్నా సేనలో చేరిన కొత్త రోజుల్లో అతనికి తెలికుండానే అతనికి భయం ముంచుకుని వచ్చేది. కాని కాలక్ర మేణా అతనిలో మార్పు వచ్చింది. అందుకనే ఇప్పుడేమీ పట్టించు కోకుండా చెట్ల క్రింది నుంచి హాయిగా వెడుతున్నాడు. త్రోవలో ఒక చెట్టుఆకు లాగాడు.గుర్రాన్ని వీపుమీద తట్టాడు. పైపు నింపమని వెనకాల ఉన్న సైనికుడికి అందించాడు.అతన్ని చూస్తే ఉదయం షికారు వెడుతున్న వాడిలా కనిపిస్తున్నాడు. ఇలైన్ ముఖం చూచిన ప్పుడు అతనికెంతో జాలి కలిగింది. ఆ కుర్రవాడి ముఖంలో ఎంత ఆందోళన కనిపి స్తోంది. తను కూడా ఒకప్పుడు అలాగే ఉండేవాడు. కాని ఇప్పుడు మాత్రం తను కులాసాగా ఉంటూ ఉన్నాడు.

సూర్యుడు మబ్బు తెరలు దాటివచ్చాడో లేదో గాలి ఆగిపోయింది. రాత్రంతా అంత గాలీ, వానా కొట్టి ఇప్పుడు మాత్రం ఆకు అల్లలాడ కుండా పోయింది. ఇంకా వర్షం కొద్దిగా పడుతూనే వుంది. కాని ఇప్పుడు సూటిగా కురుస్తోంది.ఒక క్షణంపాటు సూర్యుడు మబ్బుల్లో దాగిపోయాడు. మళ్ళీ ఇట్టే బయటికి వచ్చి వెలుగులు విరజి మ్మాడు. ప్రకృతంతా అందంలో మునిగిపోయింది. పచ్చికబయళ్లు తళ తళ మెరి శాయి. తరువాత కొద్దిసేపటికి ఒక వైపున ఇంత జీవితం, వెలుగు నిండి ఉండగా, దీన్ని వెక్కిరిస్తున్నట్టుగా మరో వైపు దూరం నుంచి ఫిరంగిమోత వినిపించింది.

ఎంత దూరం నుంచి వినిపిస్తోందో నికోలస్ గ్రహించలేకపోయాడు. ఈలోగా ఒక సహాయ సేనాధిపతి విటెబ్స్క్ నుంచి గుర్రంపై దౌడుతీస్తూ వచ్చి త్వరగా పురోగమించమని ఉత్తర్వు జారీచేశాడు.

అశ్విక దళం త్వరలో పదాతి దళాన్ని, ఫిరంగి దళాన్ని దాటి వెళ్ళింది. కొండ దిగి ఒక నిర్జన గ్రామంలో గుండా మైదానంలోకి సాగిపోయింది.

"ఆగండి" అని అరిచాడు కర్నల్. దళం ఒక పంక్తిగా నిలుచుంది.

"ఎడమ ప్రక్కకు ముందుకు వెళ్ళండి."

అశ్వికులు ఒక ప్రక్కకు వెళ్ళారు. ఉహ్‌లన్లు ముందుగా నిలుచున్నారు.కుడి ప్రక్క పదాతిదళం దట్టమైన వరుసలుగా నిలుచుంది. వారి తలలపైగా ఫిరంగి ఉదయకాలపు సూర్యకాంతిలో మిల మిల లాడుతోంది. క్రిందివైపున శత్రుసేనలు దూరంగా కనిపిస్తున్నాయి.

ఫిరంగి మ్రోతలు వినిపిస్తున్నాయి.ఎన్నాళ్ళ నుంచో ఫిరంగి మ్రోతలు వినని నికోలస్‌కు ఇప్పుడది ఒక సంగీతంలా వినిపించింది. అనుక్షణం ఎడతెరిపి లేకుండా తన చెవుల పడుతున్న ఆ మ్రోతలను ఎంతో ఆనందంతో విన్నాడు. పిల్లవాడికి దీపావళి టపాకాయల చప్పుడు వినిపిస్తున్నట్టుగా వినిపిస్తున్నది ఆ చప్పుడతనికి.

ఒక అరగంటసేపు అశ్విక సైనికులు అలాగే కాచుకుని వున్నారు. తరువాత కాల్పులు మరింత హెచ్చాయి. దళం కర్నల్‌తో కొద్దిమాటలు మాట్లాడిన తరువాత కౌంట్ అస్టర్మాన్ తన పరివారంతో కలిసి దళం దగ్గరికి వచ్చాడు. కొద్ది గజాల దూరంలో తన పరివారాన్ని నిలిపాడు. కొద్ది నిముషాల తరువాత ఉహ్‌లన్లకు దాడి చెయ్యమని ఉత్తర్వు జారీ చేయబడింది. ముందుగా ఉన్న పదాతి దళం వారికి త్రోవ కలిగిస్తూ తొలగిపోయింది. సైనికులు ఫ్రెంచి అశ్వికులపై దాడి వెడలారు. కొండకు ఎడమ ప్రక్కగా వెళ్ళారు.

వారు బయలుదేరి వెళ్ళగానే అశ్వికులు వచ్చి వారి స్థానంలో నిలుచున్నారు. కొన్ని గుండ్లు వారి తలలమీదిగా దూసుకుని పోయాయి. అవి దగ్గరికి వస్తోంటే నికోలస్ హృదయం గంతులు వేయసాగింది. అతను గుర్రం జీనుపై ఎక్కి కూచుని సమర భూమినంతా పరిశీలింపసాగాడు. తన సైనికులు వెళ్ళి ఫ్రెంచి అశ్వికులను ఢీ కొనగానే అక్కడ పెద్ద గందరగోళం చెలరేగింది. పొగమబ్బు లేచింది. వారు వెనక్కు మళ్ళారు. ఎడమవైపుగా వెళ్ళారు. వారి గుర్రాలు, ఫ్రెంచివారి గుర్రాలు కూడా కలగాపులగంగా కలిసిపోయాయి.

# 76

అక్కడేం జరుగుతుందో నికోలస్ వెంటనే కనిపెట్టగలిగాడు. ఉహ్‌లన్లు శత్రువులచేత చెదరగొట్టబడి వెనక్కు మరలి వస్తున్నారు. దూరం నుంచి చూస్తే వారు చీమల్లా కనిపిస్తున్నారు.

నికోలస్ ఈ దృశ్యాన్ని ఒక వేట దృశ్యాన్ని చూచినట్టుగా చూస్తున్నాడు. అశ్విక సైనికులు వెంటనే ఫిరంగి సైనికులపై దాడిచేస్తే ఫ్రెంచి వారు వెంటనే త్రోవ

ఇస్తారని గమనించ గలిగాడు. కాని ఒక్క క్షణం ఆలస్యమైనా తరుణం మించి పోతుంది. అతనొకమాటువెనక్కి తిరిగి చూచాడు. అతని ప్రక్కనే ఒక కెప్టెన్ నిలుచుని ఉన్నాడు. అతను కూడా సమరం సాగుతున్న వై పే చూస్తున్నాడు.

"ఆండ్రూ సవాస్టానొవిచ్! మనం వారిని ఎదుర్కోగలం కదా? నీ వేమంటావు?" అని అడిగాడు నికోలస్.

"సందేహం లేదు కాని..." అని కెప్టెన్ ఏదో చెప్పబోయాడు.

కాని అతను వాక్యం ముగించే వరకు నికోలస్ ఆగలేదు. తన గుర్రాన్ని అదిలించి బయలుదేరాడు. అతని వెంట అతని సైనికులు కూడా అతని ఉత్తర్వుల కోసం కూడా వేచి ఉండక వెంటనే బయలుదేరారు. నికోలస్ ఇలా చేయడానికి కారణమేమీ లేదు. తనలా చెయ్యాలని అనుకోలేదు కూడా. వేటలో ఏ విధంగా—ముందుగా ఆలోచించకుండా పనిచేస్తాడో అలా చేశాడు. దూరం నుంచి శత్రువులు స్వారీచేస్తూ రావడం అతనికి కనిపించింది. ఇక ఆగి లాభం లేదనుకున్నాడు. లేకపోతే అంతా చెయ్యి జారిపోతుందనుకున్నాడు. తుపాకీ గుండ్ల, ఫిరంగి గుండ్ల సంగీతం ఇంకా వినిపిస్తూనే ఉంది. నికోలస్ గుర్రం ఎంత పట్టుకున్నా ఆగకుండా పరుగెత్తుతోంది. అతని వెనకాలే అతని దళం కూడా దౌడుతీస్తూ వస్తోంది. వారు కొండవాలు దిగిన వెంటనే మరింత వేగంగా పరుగెత్త సాగారు. ఉహ్లాలన్లకు దాపులోకి వచ్చారు. ఫ్రెంచివారు ఉహ్లాలన్లను తరిమివేస్తున్నారు. ఈ ఆశ్విక సైనికులను చూడగానే ఫ్రెంచి ఆశ్వికులు తట పటాయించి ఆగిపోయారు. నికోలస్ తోడేళ్ళ గుంపులోనుంచి త్రోవచేసుకుని పోయినట్లు త్రోవచేసుకుంటూ పోయాడు. ఒక ఉహ్లాలన్ పరుగెత్తుతూ ఆగిపోయాడు. రౌతులేని ఒక గుర్రం ఆశ్విక సైనికుల గుంపులోకి దూసుకుని వచ్చింది. తరువాత ఫ్రెంచి ఆశ్వికులు చాలామంది వెనుతిరిగి పరుగు లంకించుకున్నారు.

నికోలస్ తన గుర్రాన్ని ఒక దూకు దూకించాడో లేదో అతనికొక పొద అడ్డు వచ్చింది. అతని గుర్రం ఒక్క దూకులో ఆ పొదను దాటింది. దాని ఊపుకు నికోలస్ అటూ ఇటూ కదిలినప్పటికి మళ్ళీ జీనుమీద తన్ను తాను కుందించుకుని కూచున్నాడు. ఒక ఫ్రెంచి ఆఫీసర్ అతనికి ముందుగా కొద్ది దూరంలో వెడుతున్నాడు. అతను గుర్రాన్ని కత్తితో అదిలించి పరుగెత్తిస్తున్నాడు. ఒక్కక్షణంలో నికోలస్ గుర్రం వేగం కొద్దీ వెళ్ళి ఆ ఫ్రెంచి ఆఫీసరు గుర్రంపై దూకింది. నికోలస్ తన కత్తి ఎత్తి శత్రువుపై విసిరాడు కాని, తొందరలో ఆ ఆఫీసరు తలదించుకోవడంవల్ల అతని మోచేతికి మాత్రమే కొద్దిగా దెబ్బ తగిలింది.

ఒకమాటు అతనివంక చూద్దామని నికోలస్ కొంచెం నిక్కి కూచున్నాడు. అతని గుర్రం కుంటుతూ నడుస్తోంది. మరోదెబ్బ తగులుతుందేమో అని అతను

కళ్ళార్పుతున్నాడు. పసిపిల్లవాడి ముఖంలాగా పాలిపోయి బురదకొట్టుకుని ఉన్న అతని ముఖాన్ని, నీలంగా ఉన్న అతని కళ్ళను, చక్కని జుట్టును చూచినప్పుడు అదొక సైనికుడి ముఖంలాగా కాని, ఒక శత్రువుయొక్క ముఖంలాగా కాని నికోలస్‌కు కనిపించలేదు. చక్కటి ఇంటిలో చల్లగా కాలక్షేపం చేయవలసిన ఒక అమాయకమైన పిల్లవాడి ముఖం లాగా కనిపించింది. తను అతన్ని చంపగలనా అనుకున్నాడు నికోలస్.

కాని ఈలోగా ఆ కుర్రవాడు "నేను లొంగిపోతున్నాను!" అన్నాడు.

అతనితోపాటు అతని సైనికులను కూడా చాలా మందిని బందీలుగా పట్టుకున్నారు. చాలా మంది గుర్రాలకు వ్రేలాడుతున్నారు. మరలిపోతూ కూడా ఫ్రెంచి పదాతిదళం ఇంకా కాల్పులు సాగిస్తూనే వుంది.

అశ్వికులు మళ్ళీ వారి వారి స్థానాలకు వచ్చారు. వారివెంట నడుస్తోంటే నికోలస్‌కు గుండె బరువెక్కినట్టుగా తోచింది. ఆ అనుభవం ఏమిటో అతని కతనే చెప్పుకోలేక పోయాడు. ఆ కుర్రవాణ్ణి బందీగా పట్టుకుని వెళ్ళడం దానికి కారణమేమో అనుకున్నాడు.

విజేతలను కలుసుకోవడానికి కౌంట్ ఆస్టర్మాన్ ఎదురు వచ్చాడు. నికోలస్ కోసం కబురు పంపి అతణ్ణి అభినందించారు. చక్రవర్తికి ఈ విషయం చెప్పి నికోలస్‌కు సెంటు జార్జి పతకం ఇచ్చేలా సిఫార్సు చేయాలని అనుకున్నాడు. ఉత్తర్వులు లేకుండా తను ఇలా సంచరించినప్పటికీ ఆయన ఇలా అనగానే నికోలస్‌కు ఆశ్చర్యం కలిగించింది. కాని అతని హృదయంలో అవ్యక్తమైన బాధ కలుగుతూ ఉన్నందువల్ల అతనికి పూర్తిగా సంతృప్తి, సంతోషం లేక పోయాయి.

"ఎందుకు నేనిలా బాధ పడుతున్నాను? ఇలైన్ విషయం కాదు గదా? అదేం మాట? అతను సురక్షితంగానే ఉంటాడు. నేనేదైనా తప్పు చేశానా? లేదు, అలాంటిదేమీ లేదు. కారణం ఆ ఫ్రెంచి కుర్రాడే అయి ఉంటాడు. నా కింకా జ్ఞాపక ముంది. అతన్ని కొట్టలేక పోయాను" అనుకున్నాడు నికోలస్ తనలో.

బందీలప్పుడే బయలుదేరి పోతున్నారు. ఒకమాటు నికోలస్ వారి దగ్గరికివెళ్ళి వారిలో వున్న ఆ కుర్రవాణ్ణి చూచాడు. ఆ కుర్రవాడు ఒక గుర్రం ఎక్కి ఉన్నాడు. అతని ముఖంలో ఎంతో భయం కనిపిస్తూ ఉంది. అతనికి తగిలిన గాయం చిన్నది. నికోలస్‌ను చూచి అతను సిగ్గుతో చిరునవ్వు నవ్వాడు.

ఆ రోజు, ఆ మరుసటి రోజు నికోలస్ పరధ్యానంగా ఉండి ఎవరితోనూ మాట్లాడకుండా ఉండడం అతని తోటి ఆఫీసర్లు గమనించారు. త్రాగినప్పుడు కూడా అతనేమీ ఆనందించ లేదు. ఒంటిగా ఉండాలని కోరాడు.

తనకు సెంట్ జార్జి పతకాన్ని సంపాదించి పెట్టిన తను చేసిన ఈ వీర కృత్యాన్ని గురించి ఆలోచిస్తూ కూచున్నాడు. ఆతనికిందులో ఏదో తెలియని విచిత్ర మున్నట్టు తోచింది.

"మనకంటే కూడా వారికి భయం ఎక్కువలాగా కనిపిస్తోంది. ఇదేనా వీరత్వమంటే? దేశాన్ని ప్రేమించడానికి దీనికి సంబంధమేమిటి? నేను పట్టుకున్న ఆ నీలాలకళ్ళ అబ్బాయికి ఈ బాధ్యతలో ఏ మాత్రం పాలున్నది? అతనెంత భయ పడిపోయాడు! నేను చంపుతాననుకున్నాడు. అతన్ని నే నెందుకు చంపాలి? చంపడానికి నా చెయ్యి వణికినా నాకు పతకం వస్తోంది. కాని దానివల్ల ఉపయోగం?" అనుకున్నాడు నికోలస్ తనలో.

సమాధానం దొరకని సందేహాలతో అతనిలా ఆలోచిస్తూ ఉండగా అదృష్ట దేవత అతనికి మరొకవరం ఇచ్చింది. ఆస్ట్రోవ్నా సమరం తరువాత అతను రెండు ఆశ్విక దళాలకు అధిపతిగా నియమింపబడ్డాడు. ఆఫీసర్లు కావలసిన ఆవశ్యకతను కలిగినప్పుడు అతనికి అగ్రస్థానం ఇస్తూ వచ్చారు.

# 77

నటాషాకు జబ్బుగా ఉన్నదన్న వార్త తెలిసిన వెంటనే ఆవిడ తల్లి కౌంటెస్ రోస్టోవ్, తనకింకా శరీరంలో స్వస్తత చేకూరనప్పటికీ చిన్న కొడుకు పేట్యాతోను, సేవకు లందరితోను కలిసి మాస్కో బయలుదేరింది. మాస్కోలో తమ పట్నవాసపు గృహంలో బస చేసింది. తక్కినవాళ్ళు కూడా అక్కడికే చేరారు.

నటాషాకు జబ్బు చాలా ఎక్కువై పోయింది. ఒక విధంగా ఆమెకూ, ఆమె తల్లిదండ్రులకూ అది అదృష్టమే అనవచ్చు. అంతటితో అందుకు దారితీసిన కారణాలన్నీ కూడా— ఆవిడ అపసవ్యంగా ప్రవర్తించడం, ఆంద్రూను నిరాక రించడం మొదలైనవన్నీ కూడా మారుమూలల్లో దాగి మాసిపోయినాయి. తన తప్పూ, ఒప్పూ కూడా విలువకట్ట లేనంత తీవ్ర పరిస్థితిలో ఉన్నదామె. మెతుకు ముట్టడం లేదు, నిద్రపోవడం లేదు. నానాటికి చిక్కి పోతోంది. ఎడతెరిపి లేకుండా దగ్గుతూ ఉంటుంది. ఆవిడ జీవన్మరణాల మధ్య ఉయ్యాల లూగుతోందని చెప్పారు డాక్టర్లు. తరువాత వారు చేసిందల్లా ఆవిడ బాధను మరింత ఎక్కువ చేయడానికి ఆలోచించడమే. వైద్య శాస్త్రం తెలిసిన పెద్ద లందరినీ ఆవిడను చూడడానికి పిలి చారు. కొందరు ఒక్కొక్కరే వచ్చి చూచి పోయారు, మరికొందరు సలహా లిచ్చారు.

అంతా తలలొక చోట చేర్చారు. ఒకరి నొకరు విమర్శించుకున్నారు. ఫ్రెంచి, జర్మన్, లాటిన్; అన్ని భాషలలో మాట్లాడు కున్నారు. ఒక రిచ్చిన మందు మరొకరు కాదన్నారు.

ఇంత జరిగినా వారికొక విషయం మాత్రం తెలీలేదు. నటాషా బాధ తమ శాస్త్రానికి అందని దన్న విషయం వారికి తెలీలేదు. అంతేకాదు. మానవజాతిని అణిచివేస్తోన్న ఏ జబ్బూకూడా ఆ శాస్త్రంలోకి రాదు. ప్రతి మనిషికీ ప్రత్యేకంగా తనకు సంబంధించిన ఒక విచిత్రమైన జబ్బు ఉంటుంది. అది వైద్య శాస్త్రానికి అందనిది, చాలా క్లిష్టమైనది. ఊపిరి తిత్తులు, ప్లీహ, కాలేయ, హృదయాలు వెదకడం వల్ల మనమీ జబ్బును తెలుసుకోలేము. ఏశాస్త్ర గ్రంధంలోనూ ఈ జబ్బు ఇలాటి దన్న విషయం వ్రాసిపెట్టలేదు కూడా. ఈ అవయవాల్లో ఏదో ఒక అవయంలో ఏర్పడిన అపసవ్యత మూలంగా ఇది ఉత్పన్నమై ఉండవచ్చు. రోగులకు మందు లిస్తూ జీవితాలు గడిపే శాస్త్రజ్ఞులు, ఇందుకోసం డబ్బులు పుచ్చుకునే వారు ఈ విషయం ఒప్పుకోరు. అయినా వాళ్ళెలా ఒప్పుకోగలరు? ఒక వేళ ఒప్పుకున్నా ఒక మంత్రగాడు తన మంత్రాలు చెప్పడం మానేస్తాడా, వాళ్ళతో పనిలేకుండా పోతుందని అనుకోరు. ఒకవేళ పనిలేకపోయినా ఉన్నదని అనుకుంటారు. వాళ్ళు అనుకున్న పద్ధతిలో అది ఉండక పోవచ్చు. ఉదాహరణకు రోస్టోవ్‌ల ఇంట్లో వారున్నారూ అంటే దానికి కారణం వారు తమ రోగిచేత రకరకాల మందులు త్రాగించడం కాదు. కొద్ది మోతాదుల్లో పోసిన ఆ మందులవల్ల ఉపయోగమూ లేదు. కాని వారెందు కుంటున్నారూ అంటే అనుక్షణం నటాషా ఏమైపోతుందో అని ఆతృత పడుతూ ఆమె చుట్టూ కనిపెట్టుకుని ఉండేవారి సంతృప్తి కోసం. వారి బలం ఇందులోనే ఉంది తను నాటు వైద్యుడైనా, హోమియోపతీ డాక్టరైనా, అల్లోపతీ డాక్టరైనా; వైద్యుని బలమంతా ఇదే. ఓదార్పుకోరే వాళ్ళంతా అతన్ని పిలవకుండా ఉండలేరు. ప్రతి శిశువులోనూ సానుభూతి కావాలని కోరిక ఒకటుంటుంది. అందు చేతనే వైద్యుడెంతో అవసరం. ఒకదెబ్బ తగిలినప్పుడు పసిపిల్ల ఏం చేస్తుందో చూడండి! తల్లి దగ్గరికి పరుగెడుతుంది. ముద్దెట్టించు కోవాలనీ, దెబ్బతగిలిన స్థలంలో తడిమించుకోవాలనీ కోరుతుంది. ఆ లాలింపుకు ఆ బిడ్డ బాధ తగ్గిపోతుంది. ఎంచాత నంటారు? ఆ బిడ్డను లాలించేవారు అంతకంటే పెద్దవారు, తెలివికలవారు కాబట్టి.

అంచాత డాక్టర్లవల్ల నటాషాకు కొంత ఉపయోగం కలిగింది. ఆ నాలుగు మాత్రలు, పౌడర్లు గొంతులో వేసుకుంటే జబ్బు నెమ్మదిస్తుందని చెప్పారు. ఒకచిన్న

పెట్టెలో పెట్టి, ఒక రూబులు డెబ్బయి కోపెక్కులకు దాన్ని కొనుక్కుని వచ్చారు. కాచిన నీళ్ళలో దాన్ని కలిపి రెండు గంటలకొకసారి పర్యాయం ఆమె కిస్తూ వచ్చారు.

సోనియా, కౌంట్, కౌంటెస్; చేతులు కట్టుకుని డాక్టర్లు చెప్పిన ఈ మాటలు అక్షరాలా అనుసరించి ఉండకపోతే ఏమైపోయి ఉండేవారో! ఇవ్వవలసిన సమయాల్లో మందు ఇచ్చి, కొంచెం జావ త్రాగించి, జబ్బుగావున్న వారిపట్ల చూపవలసిన ఓదార్పునంతా చూపకపోతే వారిపని ఏమై ఉండేదో! కొన్నివేల రూబుళ్ళు ఖర్చుచేసి అయినా ఆవిడను గాలిమార్పు కోసం పరదేశాలకు తీసుకుని వెళ్ళి అక్కడి డాక్టర్ల సలహాలు తీసుకోక పోయినట్లయితే, కౌంట్ ఈ ఆందోళనను భరించగలిగి ఉండేవాడా? మెటివియర్, ఫెల్లర్ ఎలా తప్పుచేశారో, ఫ్రైజ్ ఎలా తప్పటడుగు వేశాడో, మ్రొదోమాత్రం నటాషా జబ్బును ఎలా సరిగ్గా అర్థం చేసుకోగలిగాడో, ఇవన్నీ అయినవారికి, కాని వారికి చెప్పుకుని ఉండకపోతే ఆయనకు సుఖం ఉండేదేనా? డాక్టర్లు చెప్పిన ప్రకారం తూచినట్టుగా సరిగా మందు పుచ్చుకోనప్పుడు కౌంటెస్‌కు తన కుమార్తెను చీవాట్లు వెయ్యకపోతే తోచేదేనా?

"అమ్మాయి! నీవు చెప్పినమాట వినాలి. మందు పుచ్చుకో. లేకపోతే జబ్బు నయంకాదు" అని ఒక విధమైన అసహనంతో "ఈ జబ్బుతో ఆటలాడకూడదు. అశ్రద్ధచేస్తే ఇది నిమోనియాలోకి దించుతుంది" అనేది తల్లి. ఈ మాట అనడంలో ఆవిడకొక సుఖం కనిపించేది. కాని ఆ మాటకు అర్థమేమిటో ఆవిడకు తెలిసేది కాదు.

సోనియా కూడా ఇంతే. మూడురోజుల కొకమాటైనా బట్టలు మార్చుకోక, డాక్టర్లు చెప్పిన పనులు చెయడానికి సిద్ధంగా ఉండకుండాను, ఇప్పటికి కూడా ఒకే కంటితో నిద్రపోతూ మాత్రలు అందించడం కోసం మేలుకుని సిద్ధంగాను ఉండక పోయినట్లయితే ఆమెపని ఏమై ఉండేదో! నటాషా కూడా తనకు జబ్బు నయం కాదని అనుకున్నప్పటికీ, తనకు బ్రతకడం ఇష్టంలేక పోయినప్పటికి వీరంతాపడే శ్రమ చూచి సంతృప్తి పడుతూ మందు పుచ్చుకుంటూ ఉండేది.

డాక్టరు రోజూ వస్తాడు. ఆవిడ నాడి పరీక్ష చేస్తాడు. నాలిక తెరవమని నాలిక చూస్తాడు. కాసేపు నవ్వుతూ మాట్లాడతాడు. కాని ఆవిడ చూపులను మాత్రం చూడడు. అతను గదిలో నుంచి వెళ్ళగానే కౌంటెస్ అతని వెంట పరుగెత్తుకుంటూ వెడుతుంది. అతను ముఖం అదోలా ఉంచి, తలఊపి, "ఈ చివరి మందుతో నయమవుతుం దనుకున్నాను. కాని ఇంకా కొద్దికాలం ఆగి చూడాలి. ఇది మనస్సుకు సంబంధించిన జబ్బు" అని ఇంకా ఏవేవో చెపుతాడు. కానీ, కౌంటెస్ మాత్రం ఈ విషయం పట్టించు కోకుండా అతని చేతిలో ఫీజు ఉంచుతుంది. మళ్ళీ హాయిగా, తేలికపడిన దానిలాగా వెళ్ళి రోగిదగ్గర కూచుంటుంది.

ముఖ్యంగా కనిపిస్తున్న జబ్బు లక్షణాలు-ఆకలి,నిద్రలేకపోవడం,ఎప్పుడూ ఎడ తెరిపి లేకుండా దగ్గు, దేని మీద ఆసక్తి లేకపోవడం, డాక్టర్లు ఆవిడకు ఔషధాలివ్వ కుండా తాము రోజూవచ్చి చూడకుండా జబ్బు నయంకాదని చెప్పి ఆవిడను ఆ నగ రంలోనే ఉంచారు. అందుచేత రోస్టోవ్‌లు ఆ వేసవి కాలమంతా మాస్కోలోనే ఉండి పోవలసి వచ్చింది. ఇదంతా ఎలా ఉన్నా—ఈ సీసాలు, ఈ పెట్టెలు, బిల్లులు, మందు చుక్కలు, పౌడర్లు; ఇవన్నీ అలా ఉంచి, (మిసెస్ కాస్ ఇవన్నీ పోగుచేస్తూ ఉండేది) యౌవనం రాను రాను పై చెయ్యి తీసుకున్నది. నిత్య జీవితంలోని చిన్న చిన్న సంఘటనలు క్రమ క్రమంగా నటాషా దుఃఖాన్ని మాన్పజొచ్చాయి. ఆవిడ హృదయాన్ని పిండుతూ వచ్చిన తీవ్రమైన బాధ క్రమంగా గతంలో కలిసిపోయింది. ఆవిడ మళ్ళీ కోలుకున్నది.

# 78

నటాషాకు కొంచెం నిమ్మళించింది. కొంచెం హాయి చిక్కింది. కాని ఇంకా పూర్వపు ఉత్సాహాన్ని పొందలేదు. నిజానికి తనను ఆనంద పరిచే విషయాలన్నిటికీ దూరంగా వుంటున్నది. బాల్సు, పార్టీలు, థియేటర్లు; వీటన్నిటికీ దూరంగా వుంటు న్నది. ఆమె నవ్వినప్పుడు కూడా ఆ చిరునవ్వు వెనకాల కన్నీళ్ళు దాగి ఉన్నట్లు కనిపిస్తుంటాయి. ఆవిడ ఇప్పుడు పాడలేదు. పాడాలని పాట మొదలెట్టినా వెంటనే గొంతుక మూసుకుని పోతుంది. కన్నీరు అడ్డుతగులుతుంది. గతించిన సుఖసమ యాలన్నీ జ్ఞాపకం వచ్చి కన్నీరు రాలుస్తుంది. ఇక మళ్ళీ ఆ సమయాలు రావు. పాట, నవ్వు ఇప్పుడామెకు పాపాలుగా కనిపిస్తున్నాయి. ఇక ప్రణయం, అలాంటి విషయమే ఆమె మనస్సులోకి రావడం లేదు. ఆవిడకిప్పుడు ఏ మగవాడైనా ఒకటే. అంతా ముసలి బఫూనైన నాస్టాషియాలాగా కనిపిస్తున్నారు. ఒక రహస్యమయిన నియమం ఆవిడను జీవితంలోని ఆనందానికంతా దూరం చేసింది. అయినా ఆవిడ ఇంకా బ్రతికే ఉండాలి!

ఇప్పుడామె పూర్వంలాగా తను ఇతర్లకంటె ఎక్కువని అనుకోవడం లేదు. తన్ను ఇతర్లకంటె తక్కువగా భావించు కోవడంలోనే ఆమెకు ఆనందం కని పిస్తోంది. ఇంకా తన జీవితంలో ఏయే కష్టాలు రానున్నవో అని అనుకుంటోంది. ఆవిడ ఎవరికీ ఇప్పుడు కష్టం కలిగించ కుండా ఉండడానికి ప్రయత్నిస్తోంది. యిక తన వ్యక్తిగత సుఖం సంగతి ఆవిడ ఆలోచించడమే లేదు. ఇప్పుడెవరి జోక్యమూ పట్టించుకోవడం లేదు. తనవారికి కూడా దూరంగా ఉంటోంది. ఒక్క పేట్యాతో మాత్రమే ఆమె హాయిగా ఉంటోంది. ఆ అబ్బాయి ఒక్కడే అప్పుడప్పుడామెను నవ్వేటట్టు చేయ గలుగుతున్నాడు.

ఆవిడ ఎప్పుడో కాని బయటికి వెళ్ళదు. ఆవిడను చూడడానికి ఎవరు వచ్చినా ఎవరు పోయినా, ఆవిడ ఒక్క పీటర్‌ను మాత్రమే లెక్కజేస్తుంది. అతని కంటె ఆనందాన్ని, ప్రేమను, మార్దవాన్ని, చాతుర్యాన్ని చూపగలవారు మరెవరూ లేరు. ఆవిడ ఆలోచించ కుండానే దాన్ని అందుకో గలుగుతోంది. అందుచేతనే అతను దగ్గరున్నప్పుడు ఆవిడ హాయిగా ఉంటోంది కాని ఆ విషయం ఆమె పూర్తిగా అవగతం చేసుకోలేక పోయింది. పీటర్ సహజంగానే మంచివాడు కాబట్టి అప్రయత్నం గానే అతనలా ఉండగలుగు తున్నాడని అనుకున్నది.

తనను ఆనెటోవ్ పట్ల ఆకర్షించిన ఆకర్షణ పీటర్‌కు,తనకు మధ్య అడ్డుగోడ కట్టిందని ఆమె గమనించలేదు. అందుచేతనే స్త్రీ పురుషులకు మధ్య స్వచ్ఛమైన సంబంధం ఉండ వచ్చునని ఆమె ఊహించుకోలేక పోయింది.

వేసవికాలం మధ్యలో సెయింట్ పీటర్స్ రోజుకు ముందురోజున ఆత్రెడ్‌నో నుంచి అగ్రిపినా ఇవనోవ్‌నా బెలోవ్ పూజలు చేసుకోవడం కోసం మాస్కో వచ్చింది. నటాషాను కూడా తనతోపాటు పూజలకు రమ్మంది. డాక్టరుగారు బయటికి వెళ్ళవద్దని చెపుతున్నప్పటికీ నటాషా సంతోషంతో ఒప్పుకుంది. ముఖ్యంగా జరిగే మూడు పూజలకు మాత్రమేకాక, ఆవారమంతా జరిగే పూజలకు వెడతానంది. ఆ అమ్మాయి ఇలా అనగానే కౌంటెస్‌కు ఆనందమైంది. మందులకు కుదరని జబ్బు పూజలవల్లనైనా కుదురుతుందని ఆశించింది. డాక్టరుతోకూడా చెప్పకుండా కుమార్తె మాటకు సరేనన్నది. కుమార్తెను తెల్లవారుజామున మూడుగంటలకేపూజకు పంపింది.

త్వర త్వరగా మాసిపోయిన గౌను వేసుకుని, పాతదైన ఉన్ని కోటు వేసుకుని నటాషా ఆ చలిరాత్రిలో వణికిపోతూ బెలోవ్‌తో కలిసి అప్పుడప్పుడే తొంగి చూస్తున్న తొలి ఉషస్సులో నిర్జనంగా ఉన్న వీధుల్లో నడిచివెళ్ళింది. స్నేహితురాలి సలహాప్రకారం నటాషా కూడా తన వాడలోని గుడిలోకాక మరో గుడికి పూజకు వెళ్ళింది. అక్కడి మతగురువు ఎంతో పవిత్రుడని ప్రసిద్ధి. పూజచేసే వాళ్ళు కూడా కొద్దిమందే ఉన్నారు. నటాషా, అగ్రిపినా ఎంతో భక్తితో మేరీమాత ప్రతిమముందు మోకాళ్ళని పూజలు చేశారు. నల్లని ఆ ప్రతిమచుట్టూ కొవ్వొత్తి దీపాలు మిణుకు మిణుకు మంటున్నాయి.

ఆ వారమంతా ఈ పూజా పునస్కారాల తాలూకు నూతనానందం ఆవిడను వదిలి పెట్టలేదు. కాని ఆమెను ఒక్కటే భయం బాధిస్తోంది. ఆదివారం వచ్చేలోగా తను ఉంటానో,ఉండనో అనుకుంది.

ఆవిడ కనిపెట్టుకుని ఉన్నరోజు వచ్చింది. నటాషా తెల్లని మజ్లిన్ గౌనులో పూజనుంచి తిరిగి వచ్చింది. కొన్ని వారాల తరువాత మళ్ళీ ఇన్నాళ్ళకు ఆమెకు మనశ్శాంతి చేకూరింది. జీవితమంతా విచ్చుకున్నట్లుగా తోచింది.

డాక్టరు మామూలుగా వచ్చి పదిహేను రోజుల క్రితం తను ఇచ్చిన పౌడర్లే ఇంకా వాడమని చెప్పాడు.

"రోజూ ఆ పౌడర్లు తీసుకుంటూ ఉండు." అన్నాడు చిరునవ్వుతో, అవి బాగా పని చేస్తాయని అతని ఉద్దేశం "మీరేం బెంగపెట్టుకోకండి." అన్నాడు కౌంటెస్‌తో. "అవిడ ఇక బాగా ఆడుతుంది కూడా. నేనిచ్చిన ఈ మందు ఎంతో బాగా పనిచేసింది. ఇక ఏం ఫరవాలేదు. ఇప్పుడు బాగా కోలుకుంది." అన్నాడు.

కౌంటెస్ తన వ్రేలిగోళ్ళు చూచుకుంటూ క్రింద ఉమ్మేసింది.* తరువాత హాయిగా, కులాసాగా డ్రాయింగ్ రూంలోకి వెళ్ళింది.

# 79

జూలై నెల మొదట్లో యుద్ధాన్ని గురించిన వార్తలెన్నో మాస్కోకు చేరాయి. జార్ కూడా ఒక ప్రణాళిక అందచేశాడు. తాను మాస్కోకు వస్తూ మార్గ మధ్యంలో ఉన్నాడు. ప్రమాదంలో ఉండడంవల్ల ఆయన సేనను వదిలి వస్తున్నాడని చెప్పారు. స్మోలెన్‌స్క్ నగరం లొంగిపోయిందనీ, నెపోలియన్ కోటిమంది సేనతో తరలి వస్తున్నాడనీ, ఇక రష్యాను రక్షించడమనేది మనుష్య యత్నంలో లేదనీ అంతా చెప్పుకోసాగారు.

జూలై 23వ తారీఖున జార్ ఇచ్చిన ప్రణాళిక చేరింది. కాని ఇంకా అచ్చు కాలేదు. ఆ మరుసటిరోజున రోస్టోవ్‌ల ఇంటికి భోజనానికి వస్తూ, ఆ ప్రణాళికను కౌంట్ రోస్టోఫైన్ దగ్గర నుంచి తీసుకొస్తానని పీటర్ చెప్పాడు.

ఆ మరుసటి రోజు ఆదివారం. వేసవికాలం కాబట్టి ఉదయం పదిగంటలకే బాగా ఉక్కపోస్తోంది.

అది రోస్టోవ్‌ల కుటుంబం. రసోమిస్కీ హోటలు దగ్గర ఉన్న చర్చికి ప్రార్థన చేయడానికి వెళ్ళే సమయమది. అంతా ఊపిరి సలపక అవస్థపడుతున్నారు ఒక పెద్దనగరంలో ఒక వేసవి దినాన ఇలా అవస్థపడడం మామూలు. ఈ పరిస్థితి అనేక భావాలకు త్రోవచేసింది. ప్రజలు ధరించిన పల్చని రంగుల దుస్తులు, వీధిలో వస్తువులమ్మే వారి అరుపులు దుమ్ముకప్పుకుని ఉన్న చెట్లఆకులు, పేవ్‌మెంట్లపై అడుగుల చప్పుడు, రొదగా వినిపిస్తున్న సంగీతం, శరీరాన్ని తాళనివ్వని జూలై ఎండ. మాస్కోలోని నాగరికులందరూ ఒక ప్రత్యేకమైన చర్చిలో పోగైనారు. ఏ సంఘట

* ఇలా చేయడంవల్ల దృష్టి తగలదని ఒక నమ్మకముంది. అంచాత ఈ ఆచారం అక్కడి వారు పాటిస్తారు.

నలు జరుగనున్నవో అని కాచుకుని పెద్దకుటుంబాలకు చెందినవారు చాలామంది తమ ఎస్టేట్లకు వెళ్ళకుండా అక్కడే ఉన్నారు.

కౌంటెస్ రోస్టోవ్ బండి దిగింది. దుస్తులు వేసుకున్న సేవకుడొకడు ఆమెకు త్రోవచేయడానికి ముందుగా వెళ్ళాడు. నటాషా ఆవిడ వెనకాలే వస్తోంది, ఆమెకు తెలీని ఒక యువకుడు ప్రక్కనున్న వాడితో ఇలా అంటున్నాడు,

"అవును, ఈవిడే కౌంటెస్ నటాషా! చాలా సన్నబడింది కాని పూర్వం కంటె కూడా అందంగా ఉంది."

తరువాత ఆవిడ ఇలా ఊహించుకుంది. ఇలా తరుచుగా ఆవిడ ఊహించుకుంటూ ఉంటుంది...అండ్రూ పేరు, ఆనెటోల్ పేరు విన్నట్లుగా ఊహించుకుంది. తన్ను చూచినవారల్లా ఆ విషయం చర్చించుకుంటారని ఆవిడ అనుకుంటుంది. ఆవిడ వెంటనే కలవర పడింది· కాని ఆవిడ వెంటనే తన పూలదుస్తుల్లో నింపాదిగాను, గంభీరంగాను నడచి వెళ్ళిపోయింది· ఆవిడ లోలోపల అవమానంతో దహించుకుని పోవడమే దీనికి కారణం. తను అందకత్తెనని ఆవిడకు తెలుసు. కాని ఆమె అందం పూర్వం ఆవిడ కిచ్చిన సంతృప్తిని ఇప్పుడివ్వడం లేదు. ఎండ మిక్కుటంగా ఉండి ఉక్కపోస్తున్న ఈ రోజు ఆవిడకు మరింత విసుగు, రోత కలిగిస్తున్నాయి. "మరో వారం గడిచింది. ఇలాగే వారాలు డిచిగ పోతాయి. ఇదే జీవితం. ఏ మార్పులేదు. నేను అందగత్తెనే, ఆ విషయం నాకు తెలుసు... ఒకప్పుడు పెంకిపిల్లను. కాని ఇప్పుడు మాత్రం మంచి పిల్లని కాదూ? ఆ విషయం కూడా నాకు తెలుసు...నా జీవితం ఇలా వాడిపోవలసిందే. ఆ విషయమూ నాకు తెలుసు " ఇలా అనుకుంది నటాషా.

తన తల్లి ప్రక్కనే నడుస్తూ తనచుట్టూ ఉన్నవారి వంక, వారి దుస్తులవంక చూస్తోంది. వారు క్రాస్ చేసుకుంటున్న తరహాను చూచింది. ఇవన్నీ చూచి "ఇదేమిటి, వీరలా ఉన్నారు?" అనుకుంది. "వీరు కూడా నన్నుగురించి ఇలాగే అనుకుంటున్నారా?" అనుకుంది· మంత్ర పఠనం తొలిచరణం వినిపించగానే ఆవిడ భయంతో వణికిపోయింది. "ఇదేమిటి, మనస్సులోకి ఇలాటి భావాలొస్తున్నాయి?" అనుకుంది.

వృద్ధుడైన ఒక మతగురువు ప్రార్థనా కార్యక్రమాన్ని సాగించాడు· అందరికీ శాంతి కలిగేటట్లుగా మెల్లగా ప్రార్థన చేశాడు· మెల్లగా దించిన తెరవెనకాల నుంచి ఒక కంఠస్వరం కొద్దిమాటలు చెప్పింది. నటాషా కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి· ఆవిడ శరీరమంతా ఒక చివురాకు రెమ్మలా వణికిపోయింది.

"నేనేం చెయ్యాలో చెప్పు? నన్ను నేను ఎలా సరిదిద్దుకోవాలో చెప్పు? అని గొణుక్కో సాగింది.

మత గురువు తెరవెనకాల నుంచి బయటికి వచ్చి పవిత్ర ద్వారాల ముందు నిలుచుని, పొడుగ్గా ఉన్న జుట్టు మెడమీద వేసుకుని, క్రాస్ గుర్తు చేసుకుని ఇలా చెప్పసాగాడు.

"అంతా కలిసి ఈశ్వరుణ్ణి ప్రార్థిద్దాం!" నటాషా మానసికంగా ఈ మాటకు మారు పలికింది. "పెద్దా చిన్నా అనేది లేకుండా అందరం కలిసి ఈశ్వరుణ్ని ప్రార్థిద్దాం" అనుకున్నది తనలో తాను.

"మనకు ముక్తిని, స్వర్గవాసాన్ని ప్రసాదించడం కోసం అందరం ఈశ్వరుణ్ని ప్రార్థిద్దాం!" అన్నాడు మత గురువు. నటాషా ఈ మాటకు కూడా మారు పలికింది. "దేవతలను, ఆ లోకం అందుకునేందుకు మనమంతా కలిసి ఈశ్వరుణ్ణి ప్రార్థిద్దాం" అని మారు చెప్పింది.

సేన కోసమని ప్రార్థనలు సాగించినప్పుడు తన అన్నను,డెనిసోవ్‌ను కాపాడమని నటాషా ఈశ్వరుణ్ణి ప్రార్థించుకుంది. భూమిమీద, నీటిపైన ప్రయాణం చేసే వారి కోసం ప్రార్థన వచ్చినప్పుడు ఆవిడ ఆంద్రూ రాకుమారుని గురించి తలుచుకుంది. అతనిపట్ల తను చేసిన తప్పు ఆవిడకు జ్ఞాపకం వచ్చింది. ఆప్తులను గురించిన ప్రార్థన వచ్చినప్పుడు ఆవిడకు తన ఆప్తులంతా జ్ఞాపకం వచ్చారు. తను వారిని ఎంతగా నొప్పింప చేసింది కూడా ఆమెకు అవగతమైంది. శత్రువులను గురించిన ప్రార్థన వచ్చినప్పుడు తనకు శత్రువులెవరూ లేనట్లు ఆవిడకు అనిపించింది.

"మనమంతా ఒకరినొకరం మన జీవితాల్లోని ప్రతిక్షణం లోను క్షమించుకుంకుందాం" అని చెప్పసాగాడు మత గురువు, నటాషా కూడా భక్తి శ్రద్ధలతో ఆ మాటకు మారుపలికి ఈశ్వరుణ్ణి ప్రార్థించింది.

ప్రార్థన మధ్యలో మామూలు ఆచారానికి భిన్నంగా మరో మతగురువు చెక్క పీటను తెచ్చి ముందుంచాడు. ఆ పీటమీద ప్రార్థన పుస్తకం ఉంటుంది. మతగురువు మెట్లుదిగి వచ్చి దానిముందు మోకాళ్లని కూచున్నాడు. అందరూ ఆశ్చర్యపోయారు. ఆయన కూడా పవిత్ర సభ, రష్యాను విదేశ దండయాత్ర నుంచి కాపాడమని ప్రార్థిస్తూ పంచిపెట్టిన ప్రార్థనను చదవబోతున్నాడు :

"ఓ భగవంతుడా! ఓ ముక్తి దాతా!" అంటూ పెద్ద కంఠ స్వరంతో ఇలా చదవడం మొదలెట్టాడు."మేము నీ కరుణ కోసం నిన్ను ప్రార్థిస్తున్నాం.నీ ప్రేమలో మాకు విశ్వాసమున్నది. మా ప్రార్థనలు విని మమ్ములను రక్షించు. శత్రువు నీ బిడ్డలపై ప్రమాదం తీసుకుని వస్తున్నాడు. ప్రపంచమంతా ఒక సమాధి స్థలం కానున్నది.! నీవతన్ని ఎదిరించు! నీ భూమిని ధ్వంసం చేయడానికి, నీ జెరూసలేం నీ రష్యాను ధ్వంసం చేయడాకి నీ గుళ్ళు గోపురాలు పడగొట్టడానికి కుట్రపన్నబడింది. భగవంతుడా! ఈ పాపాత్ములు ఇంకా ఎంతకాలం ఇలా గెలుస్తుంటారు? ఎంతకాలం

నిన్ను అతిక్రమించి నిలుస్తుంటారు? భగవంతుడా! నిన్ను ప్రార్థించే వారి మాటలు ఆలకించు. పవిత్రుడైన మా చక్రవర్తి జార్ అలెగ్జాండర్ పవలోవిచ్‌ని నీ చెయ్యి కాపాడుతుంది గాక !

"భగవంతుడా! నీ దయా దాక్షిణ్యాలు అనశ్వరమైనవి. మా పాపాలు గుర్తు పెట్టుకుని మాకు పెడముఖం పెట్టకు. మాకు పవిత్రమైన హృదయాలు ప్రసాదించు. మా విశ్వాసాన్ని, ఆశను దృఢం చెయ్యి.మా పరస్పర ప్రేమను ప్రేరేపించు, మాకు విజయం ప్రసాదించు !

"భగవంతుడా ! నీలో మాకు విశ్వాసముంది. మా విశ్వాసాలు సడలింప చెయ్యకు. మా ఆశ నిరాశ చెయ్యకు. మా శత్రువులు నాశనమై పోయేటట్లు చూడు. నీ ఒక్కడవే ఈశ్వరుడవనీ, నీ బిడ్డలము మేమే అనీ అందరూ అర్థం చేసుకునే టట్లు చెయ్యి. మాకు ఆనందాన్ని కలిగించి, శత్రువులను నాశనం చెయ్యి.నీవేమాకు బలానివి. నీవే మాకు విజయానివి !

"భగవంతుడు, భగవంతుని కుమారుడు, పవిత్రదేవత వర్ధిల్లుతారు గాక!"

ఈ ప్రార్థన నటాషాను ఎంతగానో కదిలించింది. పూర్వీకుల విజయాలను గురించి, జెరూసలేమ్ నాశనాన్ని గురించీ ప్రార్థనలు జరుగుతున్నప్పుడు ఆమె కూడా ఎంతో భక్తితో ప్రార్థించింది. కాని భగవంతుణ్ణి తాను ఏమి కోరుతూ ఉందో తనకే తెలీదు. పవిత్రతను గురించిన ప్రార్థన వచ్చినప్పుడు తన హృదయమంతా విప్పి ప్రార్థించింది. కాని తన శత్రువులను తన కాళ్ళక్రింద నలిసివేసేటట్లు చేయ మని తను భగవంతుణ్ణి ఎలా కోరగలదు? కొద్ది నిముషాల క్రితమే అందరినీ తను ప్రేమించి అందరి కోసం తను ప్రార్థించింది కదా? కాని ఈ ప్రార్థన వింటోంటే ఆమె కెంతో విచిత్రంగా తోచింది. పాపాత్ములను గురించిన శిక్షలు వింటున్నప్పుడు భయం కూడా కలిగింది. తనను, తన తోటి వారిని, అందరినీ క్షమించమని కోరింది. భగవంతుడు తన కోరికలు విన్నట్లు, తనకు ఆనందాన్ని, శాంతిని, ఇచ్చినట్లు ఆమెకు తోచింది.

# 80

కృతజ్ఞతా పూర్వకమైన నటాషా కళ్ళను తన స్మృతి పథంలో నిలుపుకుని వెళ్ళిన ఆనాటి రాత్రి నుంచి, ఆకాశంలో తోకచుక్క చూచిన ఆనాటి రాత్రి నుంచి పీటర్ కళ్ళ ముందు ఒక కొత్త ప్రపంచం తెరుచుకుంది. ఇప్పుడతని మనస్సు పూర్వంలాగా మానవ జీవితంలోని శూన్యతను గురించి ఆలోచించడం లేదు తన మన స్సులో మొలకెత్తుతూ వచ్చిన అనేక సమస్యలు - ఆవిడ ప్రతిమను ఇప్పుడతను

ఊహించు కోగానే మటుమాయమై పోతున్నాయి. అతను మాట్లాడుతున్నప్పుడు కాని, మరేవో చిన్న చిన్న విషయాలను వింటున్నప్పుడు కాని,మరేదైనా అల్పమైన అర్థరహితమైన పనిని గురించి విన్నప్పుడు కాని పూర్వంలాగా అతనికి భయం కలగడంలేదు. జీవితం ఇంత కొద్దిదైనప్పుడు, ఎక్కడికి వెడతామో మనకు తెలీనప్పుడు మనుష్యులిలా పరిశ్రమిస్తూ తమ్ము తాము ఎందుకు హింసించుకుంటారని ఇప్పుడ తను ప్రశ్నించుకోవడంలేదు. తను ఆవిడను చూచినట్లుగా తన కళ్ళముందు ఆవిడను ఊహించుకున్నప్పుడు అతని అనుమానాలన్నీ మటుమాయ మవుతున్నాయి. పాపాత్ములు, పుణ్యాత్ములు కాక ప్రేమ, సౌందర్యాలు మాత్రమే ఉనికికి మూలకారణమైన ఉన్నతపథాన్ని అతని మనస్సు అందుకుంటోంది. అతను ఎలాంటి హేయమైన పనులు చూడడం తటస్థించినప్పటికీ తనకు తాను ఇలా చెప్పుకుంటున్నాడు :

"ఒకరు ప్రభుత్వాన్ని దోపిడీచేస్తే మటుకు నాకేమిటి? జార్ మీద గౌరవాలు వర్షిస్తే మటుకు నాకేమిటి? నిన్ననే కదూ ఆవిడ నన్ను చూచి చిరునవ్వు నవ్వింది? ఇవాళ మళ్ళీ రమ్మని పిలిచింది. నేనావిడను ప్రేమిస్తున్నట్లు ఎవరికీ తెలీదు."

పీటర్ ఇంకా తన కులాసా ప్రపంచంలోనే కాలక్షేపం చేస్తున్నాడు. ఎప్పటిలాగా త్రాగుతున్నాడు. ఏ పనీ పాటా లేకుండా జీవితం గడుపుతున్నాడు. సరిహద్దు నుంచి వచ్చేవార్తలు నానాటికీ ప్రమాదకరంగా పరిణమిస్తున్నాయి.నటాషా ఆరోగ్యం కోలుకుంటోంది. అతనిప్పుడు రోజూ వెళ్ళి ఆవిడను చూడాల్సిన అవసరంలేదు. ఇప్పుడతనిలో ఎంచాతనో అతనికి తెలీకుండానే ఒక అసహనం మేలుకున్నది. ఏదో తన జీవితంలో పెద్ద మార్పు వస్తున్నట్లు సూచనలు కనిపిస్తున్నాయి. ఆశ్చర్యంతో దాన్ని ఎదురు చూస్తున్నాడు.

తన మతానికి చెందిన ఒక సోదరుడు బైబిల్ కడపటి భాగంలో వ్రాసిన ఒక జ్యోతిష్యం నెపోలియన్ విషయంలో ఎలా ఫలిచిందో చెప్పాడు. పదమూడవ అధ్యాయంలో పద్ధెనిమిదవ పంక్తిలో ఇలా ఉంది :

"ఇది విజ్ఞానం. అర్థం చేసుకోగలవారు జంతువు యొక్క సంఖ్యను లెక్కించండి : అదే ఒక మనిషి యొక్క సంఖ్య. ఆ సంఖ్య ఆరువందల మూడు ఇరవైల ఆరు." అయిదో పద్యంలో ఇలా ఉంది: "అతను కొన్ని గొప్పవిషయాలు మాట్లాడతాడు. కాని అవి దైవ నిందకు సంబంధించినవి. నలభై రెండు నెలలవరకూ అతనికి ఈ శక్తి ఇవ్వబడింది."

అక్షర సమామ్నాయంతో ఈ సంఖ్యలను కలిపి మొదటి తొమ్మిది అక్షరాలను ఏక సంఖ్యగాను, తతిమ్మా అక్షరాలను పదులుగాను గణిస్తే ఇలా వస్తుంది:

| ఎ | బి | సి | డి | ఇ | యఫ్ | జి | హెచ్ | ఐ | కె | యల్ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **1** | **2** | **3** | **4** | **5** | **6** | **7** | **8** | **9** | **10** | **20** |

| యం | యన్ | ఒ | పి | క్యూ | ఆర్ | యస్ | టి | యు |
|---|---|---|---|---|---|---|---|---|
| **30** | **40** | **50** | **60** | **70** | **80** | **90** | **100** | **110** |

| వి | డబ్ల్యూ | యక్స్ | వై | జడ్ |
|---|---|---|---|---|
| **120** | **130** | **140** | **150** | **160** |

"లీ ఎంపరర్ నెపోలియన్ **(Le Empereur Napoleon)**" అనే మాటలు అక్షర సమామ్నాయం వల్ల ఏర్పడినవైతే అంకెలన్నీ కూడగా వచ్చిన మొత్తం 666=* అవుతుంది. అందుచేతనే గ్రంథంలో చెప్పబడిన జంతువు నెపోలియన్. అదీకాక దానికి చెందిన సంఖ్యలనే ఫ్రెంచి మాటలైన "క్వారెన్‌టీ డ్యూ **(Quarante-Duex)** = • తో కలిపితే అతను అధికారం చెలాయించే సంవత్సరాలు 42 అని తేలుతుంది. మళ్ళీ 666 అన్న సంఖ్య కూడా వస్తుంది. 1812 వ సంవత్సరాన్ని కూడా అవి సూచిస్తాయి. అదే వయస్సును బట్టి నెపోలియన్‌కు 42 వ సంవత్సరం. అదే అతని పరిపాలనకు ఆఖరు సంవత్సరం కూడా అవుతుంది.

ఈ లెక్కల పద్ధతి పీటర్‌ను ఆకర్షించింది. ఈ జంతువైన నెపోలియన్ అధికారం ఎలా ఎప్పుడు అంతమవుతుందా అని అతను ఊహింపసాగాడు. ఈ విధంగా తన ప్రశ్నకు సమాధానం లెక్క వేసుకోసాగాడు. అలెగ్జాండర్ పేరుకూ **(L' Empereur Alexandre)** రష్యా పేరుకూ **(La Nation Russe)** కూడా అన్వయించి లెక్కలు వేశాడు. కాని అలా లెక్కలు వేసినప్పుడు ప్రమాదకరమైన మొత్తం రాలేదు. చివరకు ఒక రోజున పీటర్ తన పేరుకే అన్వయించుకుని లెక్కలు వేసుకుంటూ ఉంటే అతనికి 666 మొత్తం వచ్చింది. (తన పేరు లెయసే బెషోవ్ **L' Russe Besuhof** అని లెక్క వేశాడు.)

గ్రంథంలో చెప్పిన ఈ విషయానికి ఇలా సంబంధం కుదరడం విచిత్రంగా లేదూ? అతని కిదేమిటో అర్థం కాలేదు. అయినప్పటికీ అతని కా విషయంలో ఏ మాత్రం సందేహం కలగలేదు. నటాషా పట్ల అతని ప్రేమ, క్రీస్తు విరోధి పుట్టడం, తోకచుక్క కనిపించడం, రష్యాపై దండయాత్ర, నెపోలియన్ పేరులోనూ, తన పేరులోనూ ఒకే సంఖ్య (666) రావడం; ఈ విషయాలన్నీ కూడా అతని

---

* = 20, 5, —5, 30, 60, 5 80, 5, 110, 80, —49, 1, 60, 50, 20, 5, 50, 40.

• = 40, 110, 1, 80, 1, 40, 100, 5,—4, 5, 110, 140.

హృదయంలో ఒక విచిత్రమైన అనుభవాన్ని కలిగించాయి ఆ అనుభవం అతనిలో మసిలి మసిలి, అతనికి గుదిబండలాగా ఉన్న వ్యర్థపు జీవితం నుంచి అతన్ని లాక్కొని వెళ్ళి, అతనితో ఏదో మహత్కార్యం చేయించి, అతనికేదో గొప్ప ఆనందాన్ని అందచేస్తుంది.

ఈ ప్రణాళికను రోస్టోవ్‌లకు చూపుతానని అతనిదివరకు వాగ్దానం చేశాడు. అందుచేత ఆదివారం నాటి ఉదయం పీటర్, కౌంట్ రోస్టోఫైన్‌ను కలుసుకుని అతని దగ్గర నుంచి ప్రణాళిక ప్రతి ఒకటి తీసుకొనడం కోసం వెళ్ళాడు. అప్పుడే అక్కడ ప్రధాన కార్యాలయం నుంచి వచ్చిన ఒక కొరియర్* కనిపించాడు. అతను పీటర్‌కు పూర్వ పరిచితుడు. మాస్కోలో గొప్ప నర్తకులలో ఒకడు కూడా.

"నాకో చిన్న సహాయం చేసి పెట్టాలి" అని అడిగాడు ఆ మిత్రుడు. "ఈ ఉత్తరాలు అందించడంలో నాకు కొంచెం సహాయం చెయ్యాలి" అన్నాడు.

పీటర్ సరేనన్నాడు. ఆ ఉత్తరాలలో ఒకటి నికోలస్ రోస్టోవ్ తన తండ్రికి వ్రాసిన ఉత్తరం. కౌంట్ రోస్టోఫైన్ చక్రవర్తి ప్రణాళిక ప్రతి ఒకటి పీటర్‌కు ఇచ్చాడు. దానితోపాటు ఒక కార్డును కూడా ఇచ్చాడు. ఆనాటి ఉత్తర్వులన్నీ చూసుకున్న తరువాత, చంపబడినవారి లిస్టు, గాయపడినవారి లిస్టు, పై పదవికి వెళ్ళిన వారి లిస్టు చూచుకున్న తరువాత పీటర్‌కు నికోలస్ రోస్టోవ్ పేరు కనిపించింది. "ఆస్ట్రోవ్‌నా సమర సందర్భంలో నికోలస్ రోస్టోవ్‌కు నాలుగవ తరగతికి చెందిన సెంట్ జార్జి పతకం బహూకరింపబడింది" అని ఉంది. దాని తరువాత కొన్ని పంక్తుల క్రింద అండ్రూ రాకుమారుడు అశ్విక దళానికి కర్నల్‌గా నియమింపబడినట్లు కూడా ఉంది. తమ కుమారుడు సాధించిన ఈ విజయం తాలూకు శుభవార్త స్నేహితులకు త్వరగా తెలపాలని పీటర్ వెంటనే ఆ ఉత్తరాన్ని, ఆనాటి వార్తా విశేషాలతో జతపర్చి రోస్టోవ్‌లకు పంపించివేశాడు. అండ్రూ రాకుమారుని పేరు ఆ పేజీలో ఉన్నప్పటికీ అతనలా పంపించివేశాడు. ప్రణాళికను తరువాత తనే స్వయంగా తీసుకెళ్ళవచ్చు అనుకున్నాడు.

రోస్టోఫైన్‌తో అతని సంభాషణ, అప్పుడతను చూపిన ఆందోళన, తన మిత్రుడైన ఆ కొరియర్ తీసుకొచ్చిన వార్తలు, మాస్కోలో గూఢచారులు తిరుగుతున్నారన్న పుకారు, ఆ శిశిరంలోగా నెపోలియన్, రష్యాలోని రెండు ప్రధాన నగరాలను ఆక్రమిస్తాడని ప్రచురించిన వార్తాపత్రికను అందరూ చదువుతూ ఉండడం, ఆ మరుసటి రోజే జార్ వస్తాడని అందరూ వేచి ఉండడం, ఇవన్నీ కూడా పీటర్ ఉద్వేగాన్ని మరింత హెచ్చు చేశాయి. యుద్ధ ప్రకటన జరిగిన నాటి రాత్రి తోక చుక్కను చూచినప్పటి నుంచీ ఈ ఉద్వేగం అతనిలో మరింత హెచ్చు అవుతూ

---

* వార్తాహరుడు

వచ్చింది. అతను శాంతిని ప్రచారం చేసే ఒక సంఘంలో సభ్యుడు కాకుండా ఉన్నట్లయితే అతను ఏ మాత్రం ఆలోచించకుండా సేనలోకి వెళ్ళి ఉండేవాడే. తనకంటే ముందుగా సేనలోకి వెళ్ళిన ఆ మాస్కో నివాసులను చూస్తే అతనికెంతో సిగ్గుగా ఉండేది. కాని అతనిలోని శాంతి భావం అతన్ని అరికట్టింది. ముందు ఏం జరుగుతుందో చూద్దామని అతను అందుకోసం వేచి ఉన్నాడు.

# 81

ఆదివారంనాడు రోస్టోవ్‌ల ఇంట్లో కొద్దిమంది మిత్రులు పోగు కావడం అలవాటు. అందుచేత పీటర్ వారిని ఒంటరిగా కలుసుకోవచ్చు కదా-అని కొంచెం పెందలకడనే అక్కడికి వెళ్ళాడు.

ఇటీవల కొద్దిమాసాల్లో పీటర్ బాగా లావెక్కాడు. అంత ఒడ్డూ, పొడుగూ ఉండడంవల్ల అతను చూడదగిన వ్యక్తిలాగా కనిపిస్తున్నాడు. కాని లేకపోతే అలా కనిపించేవాడు కాదు. రొప్పుతూ తనలో తాను ఏదో గొణుక్కుంటూ సేవకునితో కూడా చెప్పకుండా మెట్లెక్కి వెడుతున్నాడు. అర్ధరాత్రి దాటితేకాని అతనక్కడ నుంచి వెళ్ళడని ఆ సేవకుడికి తెలుసు. అతని పై కోటు, హేటు, చేతికర్ర అందు కొనడం కోసం సేవకులు పరుగెత్తుకుని వచ్చారు. క్లబ్‌లో అలవాటు ప్రకారం వాటిని బయట హాల్లో ఉంచడం అతనికి మామూలు.

మొట్టమొదట అతనికి కనిపించింది నటాషా. లేక మరోవిధంగా చెప్పాలంటే ఆమెను చూడడానికి ముందుగా అతను ఆవిడ గొంతుక విన్నాడు. ఆవిడ పెద్ద డ్రాయింగ్ రూంలో నిలుచుని పాట పాడుకుంటూ ఉంది. ఆవిడకు జబ్బు చేసిన తరువాత ఆవిడ అలా పాడడం అతనింత వరకూ వినలేదు. అందుచేత ఇప్పుడా పాట వినగానే అతనికి ఆనందంతో పాటు ఆశ్చర్యం కూడా కలిగింది. మెల్లగా తలుపు తెరచి చూచాడు. ఆవిడ పాడుతూ గదిలో అటూ ఇటూ తిరుగుతోంది. ఆవిడ ఇంకా పూలు కుట్టిన పట్టుదుస్తులు వేసుకునే ఉంది. ఆమె గది కొసవరకూ వెళ్ళి తిరిగి చూచింది. హఠాత్తుగా పీటర్ ముఖం కనిపించగానే కొంచెం సిగ్గుపడి అతన్ని కలుసుకోవడం కోసం దగ్గరికి వచ్చింది.

"నేను మళ్ళీ పాడాలని ప్రయత్నిస్తున్నాను చూచావా? ఏమీ తోచకపోతే ఇదొకటి." అన్నదామె.

"అది చాలా మంచిపని" అన్నాడు పీటర్.

"ఇవాళ నీవు కనిపించినందుకు నాకెంతో సంతోషంగా ఉంది." అని చెప్ప సాగింది నటాషా. "నికోలస్ సెంట్‌జార్జి పతకాన్ని పొందాడు. నాకెంతో సంతోషంగా ఉంది." అన్నది.

"నా కావిషయం తెలుసు. అది పంపింది నేనే. కాని, నేను నీ పాటకు అడ్డు వచ్చానేమో; నేను మరో గదిలోకి వెడతాను."

"కౌంట్!" అన్నది నటాషా అతన్ని ఆపుతూ, "నేను పాడడం తప్పా?" అని అడిగింది. అతని వంక చూస్తోంటే ఆవిడ ముఖం సిగ్గుతో ఎర్రబారింది.

"లేదు. తప్పెందుకు కావాలి? పైగా నన్నెందుకలా అడుగుతావు?" అన్నాడు పీటర్.

"నాకు తెలీదు." అన్నది నటాషా త్వరగా మాట్లాడుతూ, "కాని నీవు ఒప్పుకోని పని ఏది చెయ్యాలన్నా నాకు సిగ్గుగా ఉంటుంది. నీవంటే నాకంత నమ్మకం. నీ ఉద్దేశాన్ని నేనెంతగా గౌరవిస్తానో నీకు తెలీదు కాని నాకు తెలుసు. ఇవాళ అతని పేరు నేను కూడా చూచాను—ఆండ్రూ పేరు!" ఆమె ఈ మాట తగ్గుస్వరంలో అన్నది. "బోల్కోన్స్కీ మళ్ళీ రష్యా వచ్చాడు. సేనలో ఉన్నాడు. అతను మళ్ళీ నన్ను క్షమిస్తాడంటావా? లేక నన్ను గురించి ఎప్పుడూ తప్పుగా భావిస్తాడంటావా? చెప్పు? చెప్పవూ?" అని అడిగింది, బలహీనంగా.

"నేనా? అతను క్షమించవలసిన విషయమేమీ లేదనుకుంటాను. నేనైతే..." అని ఏదో చెప్పబోయాడు పీటర్.

అతనిదివరకు అన్నమాటలే మళ్ళీ అతని నోటిదాకా వచ్చాయి. కాని నటాషా అతన్ని చెప్పనీయకుండా ఆపుచేసింది.

"నీవా?" అన్నదామె. "నీ విషయంవేరు. నీకంటే మంచివాడు, ఉదారుడు మరెక్కడా ఉండడు. అసలు నీలాటి మనిషే ఉండడు. నీవప్పుడు నన్ను ఓదార్చి ఉండకపోతే నేనేమయ్యేదాన్నో?" ఇలా అంటోంటే ఆమె కళ్ళు మళ్ళీ నీళ్ళతో నిండాయి. వాటిని తన సంగీతం చాటున దాచుకుంటూ హఠాత్తుగా వెనక్కు తిరిగి మళ్ళీ తనపాట పాడుకుంటూ నడవసాగింది.

ఈ సమయంలో పేట్యా పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఇప్పుడాకుర్రాడికి పదిహేనేండ్లు. గులాబీ చెక్కిళ్ళు, ఎర్రటి పెదవులు—ఆ కుర్రాడు కూడా నటాషా లాగే ఉన్నాడు. యూనివర్సిటీలో చేరడానికి తయారవుతూ ఉన్నాడు. కాని ఇటీవల రహస్యంగా తన స్నేహితుడు అబ్లొన్స్కితో కలిసి అశ్విక సైనికుడుగా తను తయారు కావడానికి నిశ్చయించుకున్నాడు. తన చెయ్యి పీటర్ చేతిలో ఉంచి ఈ విషయమంతా చెప్పసాగాడు. కాని పీటర్ అతని మాటలు వినిపించుకోవడం లేదు. ఆ కుర్రాడు అతని చెయ్యి పట్టుకుని లాగుతూ అతని దృష్టిని తనవైపు మరల్చుకోవడానికి యత్నిస్తున్నాడు.

"మాట్లాడవేం పీటర్ కిరొలొవిచ్? నా పని ఎలా ఉందంటావు?" అని అడిగాడు పేట్యా.

"ఓ! బాగా లేకేం! నీవు అశ్విక సైనికుడివి కాదలుచుకున్నావు కదూ? ఆ

విషయం ఇవాళ నేను చెపుతాలే" అన్నాడు పీటర్.

"ఎలా ఉన్నా వబ్బాయ్?" అంటూ కౌంట్ అక్కడికి వచ్చాడు. "ప్రణాళిక తీసుకుని వచ్చావా? నా చిన్ని కౌంటెస్ ఇవాళ ఉదయాన ఒక ప్రార్థన విన్నదట. ఎంతో బాగున్నదని చెపుతోంది" అన్నాడు.

"ఇదిగోండి ప్రణాళిక. జార్ ఇక్కడికి వస్తున్నాడని ఇప్పుడే వార్త వచ్చింది. ఇదివరకెన్నడూ కలుసుకోని అభిజాత వర్గాలవారంతా కలుసుకున్నారు. కొత్త పన్నులను గురించి ఆలోచిస్తున్నారు. మిమ్మల్ని ఒక విషయానికి అభినందిస్తున్నాను" అన్నాడు పీటర్.

"అవును నిజమే. నాకు తెలిసింది. అంతా ఈశ్వరుడి దయ. ప్రధాన కార్యాలయం నుంచి వచ్చిన వార్త లేమిటి?"

"సేన ఇంకా వెనక్కు మరలి వస్తోంది. ఇప్పటికి స్మోలెన్స్క్ చేరుకుని ఉంటారు."

"అయ్యో, ఎంతపని జరిగింది! మరి ప్రణాళిక ఇస్తానన్నావుగా, ఏదీ?"

"మరిచాను..." అంటూ పీటర్ జేబులు వెదుక్కున్నాడు. కాని లాభం లేకపోయింది. ఈ లోగా కౌంటెస్ అక్కడికి వచ్చింది. పీటర్ ఆమె చేతిని ముద్దాడాడు. నటాషా వస్తుందేమోనని ఒక కంటితో తలుపు వంక చూస్తున్నాడు. "ఎక్కడో మరిచిపోయాను, వెళ్ళి తీసుకుని వస్తాను" అన్నాడు.

"కాని భోజనానికి ఆలస్యమవుతుందేమో?"

"అవును"

నటాషా ఇప్పుడక్కడికి వచ్చింది. ఆమె ముఖం విచార సూచకంగాను మృదువుగాను ఉంది. పీటర్ ఇంకా ఆ ప్రణాళిక కోసం వెదుకుతూనే ఉన్నాడు. ఆవిడను చూడగానే అతని ముఖం విప్పారింది. సోనియా ఈలోగా హాల్లోకి వెళ్ళి చూచి అక్కడ పీటర్ మరిచిపోయిన కాగితాలు తీసుకుని వచ్చింది. ఆ కాగితాలు జాగ్రత్తగా పీటర్ హేటులో భద్రపరచబడి ఉన్నాయి.

"అవి భోజనమైన తరువాత చదవవచ్చునులే" అన్నాడు కౌంట్ అదేదో పెద్ద విషయ మనుకుని.

సెంట్ జార్జి పతకం పొందిన కొత్తవీరుడి కోసం వారు కొంచెం షాంపేన్ పుచ్చుకున్నారు. షిన్షైన్ ఊరి పుకార్లన్నీ మోసుకుని అక్కడికి వచ్చాడు. వృద్ధ రాకుమారి జార్జియాకు జబ్బుగా ఉంది. మెటీవియర్ కనిపించడం లేదు. పాపం ఒక జర్మన్‌ను చూచి ఫ్రెంచివాడనుకుని పట్టుకున్నారు. రోస్టొప్షైన్ అతన్ని విడిపించాడు.

"అవునవును. అలాంటి వారందరినీ పట్టుకుంటున్నారు. అందుకనే కౌంటెస్‌తో ఫ్రెంచి మాట్లాడవద్దని చెపుతున్నాను" అన్నాడు కౌంట్.

"మరో విషయం తెలుసా? గెలిట్సిన్ రాకుమారుడు రష్యన్‌భాష నేర్చుకోవ డానికి ఒక రష్యన్‌ను దగ్గరుంచుకున్నాడు తెలుసా? అతన్ని బట్టి చూస్తే వీధుల్లో ఫ్రెంచిభాష మాట్లాడడం ప్రమాదకరంగా కనిపిస్తోంది" అన్నాడు షిన్‌షైన్.

"అయితే రక్షకసేన సంగతేమిటి కౌంట్, పీటర్, కిరాలొవిచ్? నీవు కూడా ఒక గుర్రం ఎక్కుతావనుకుంటాను" అన్నాడు కౌంట్, పీటర్‌తో. పీటర్ ఏమీ మాట్లాడకుండా ఆలోచించుకుంటూ కూచున్నాడు. అతనడిగిన ప్రశ్న ఏమిటో వెంటనే అతనికి తోచలేదు.

"అవును, యుద్ధం సంగతి కదూ మీరడుగుతున్నది? నేను మీ రనుకున్న ట్లుగా సైనికుణ్ణి కాను. విషయమంతా చూస్తే చాలా చిత్రంగా కనిపిస్తోంది. నాకేమీ ఒడ్డు కనిపించడం లేదు. నా అభిరుచులు వేరు. అయినప్పటికీ ఈ పరిస్థితుల్లో ఏం చేస్తామో ఎవరికీ తెలీదు" అన్నాడు పీటర్.

భోజనం ముగిసిన తరువాత కౌంట్ తన పడక కుర్చీలో హాయిగా కూచు న్నాడు. బాగా చదవడానికి పేరుపడ్డ సోనియాను ప్రణాళిక చదవమని అడిగాడు.

"మన ప్రధాన రాజధాని మాస్కోకు :

శత్రువు సరిహద్దులు దాటి దండుతో తరలి వస్తున్నాడు. మన దేశాన్ని నాశనం చేయబోతున్నాడు. ఇంకా..."

సోనియా తన స్పష్టమైన గొంతుకతో చదవసాగింది. వృద్ధ కౌంట్ కళ్ళు మూసుకుని వింటున్నాడు. కొన్ని సందర్భాలలో అవునన్నట్లు ఊ కొడుతున్నాడు. నటాషా ఒకమాటు తండ్రి వంక, పీటర్ వంక ఏమిటిది అన్నట్లుగా చూస్తోంది. పీటర్ ఆవిడ తన వంక చూడడం గమనించి తను అటువైపు చూడకుండా మరోవైపు చూస్తున్నాడు. కౌంటెస్, కొన్ని ముఖ్యమైన నేరాలు చదువుతున్నప్పుడు అవేవీ బాగాలేవని అన్నట్లుగా తల ఊపుతోంది. ఆవిడ ఉద్దేశంలో వాటికి అర్థం ఒకటే. ఆవిడ కుమారుడు ప్రమాదంలో ఉన్నాడని, ఈ ప్రమాదం చాలా కాలం వరకు ఇలాగే ఉంటుందనీ ఆమె అనుకుంది. షిన్‌షైన్ చిలిపిగా నవ్వుతూ ఏదో విసురుగా ఒక మాట విసరాలని ఆలోచించుకుంటున్నాడు. సోనియా ఎప్పుడు చదవడం ముగిస్తుందా అని ఎదురు చూస్తున్నాడు వృద్ధ కౌంట్. ఆలోచనలను గురించో, మరి ప్రణాళికను గురించో, కౌంటెస్‌ను గురించో, మరి దేన్ని గురించి విసురుతాడో ఆ విసురు.

రష్యాను భయపెడుతున్న ప్రమాదాన్ని గురించి, మాస్కో పట్ల చక్రవర్తి ఆశలను గురించి, మాస్కో చూపిన ఓరిమిని గురించీ చదివిన తరువాత సోనియా కంఠస్వరం కొంచెం కంపించసాగింది. ఆ తరువాత ఆవిడ చివరి వాక్యం ఇలా చదివింది :

"మనం మన చక్రవర్తిని, మన రాజధాని అయిన మాస్కో ప్రజల మధ్య ఉంచవలసి ఉంది. లేక మన సామ్రాజ్యంలో ఎక్కడ అవసరమో అక్కడ ఉంచవచ్చు. మనం మన సేనల ముందుండి 'అతను' ప్రవేశించగానే అతన్ని ఎదుర్కోవాలి. మనలను అతను ఏ కష్టాల ద్వారా అణిచి వేయదలచుకున్నాడో ఆ కష్టాలు అతనికి తగులుతాయి గాక! యూరప్ ఈ బంధం నుంచి విముక్తి పొందుగాక! రష్యా కీర్తి చిరస్థాయిగా నిలుచు గాక!"

"బాగుంది! బాగా చెప్పాడు! నీవు మాటంటే చాలు, నీ కోసం ప్రాణమైనా ఇస్తాం!" అన్నాడు కౌంట్ కళ్ళు తెరిచి. ఆయన కళ్ళలో కన్నీళ్ళు తిరిగాయి. ఆయన ముక్కు చీదుకున్నాడు.

నటాషా ఒక్క దూకు దూకి లేచి తన తండ్రి మెడచుట్టూ చేతులు పెనవేసింది; షిన్‌షైన్ కూడా నవ్వలేక పోయాడు.

"నాన్నా! నీవు అద్భుతమైన వ్యక్తివి;" అన్నది నటాషా తండ్రిని ముద్దాడుతూ, తరువాత పీటర్ వంక సగర్వంగా చూచింది.

"సెబాష్! ఇదే స్త్రీల దేశభక్తి అంటారు!" అన్నాడు షిన్‌షైన్.

"అదేం కాదు." అన్నది నటాషా కొంచెం కోపం తెచ్చుకుని, "నీవు ప్రతి దాన్ని గురించి నవ్వుతుంటావు. కాని ఈ విషయంలో అలా నవ్వకూడదు," అన్నదామె.

"ఆటలాడడమా!" అన్నాడు కౌంట్. "ఒక్క ముక్క అంటే చాలదూ? మేమంతా కలిసి ఎదుర్కోమూ?" అన్నాడు.

పీటర్ మరేదో మాట్లాడబోయాడు.

ఇంతవరకూ పేట్యా విషయం ఎవరూ పట్టించుకోలేదు. ఇప్పుడా కుర్రాడు తండ్రి దగ్గరికి వచ్చాడు.

"ఇదీ సమయం!" అనుకున్నాడు సిగ్గులేక. అంత బిగ్గరగాను, అంత కీచుగాను కాక మాట్లాడుతూ "అమ్మ, నాన్న: మీ మాట నేను వినాల్సిన మాట నిజమే కాని నేను సోల్జెర్ను కావడానికి మీరు ఒప్పుకుని తీరాలి. లేకపోతే... నేను ఒప్పుకోను ఒప్పుకోనంటే ఒప్పుకోను." అన్నాడు.

కౌంటెస్ కళ్ళెత్తి పైకి చూచి చేతులు కట్టుకున్నది. తరువాత భర్తవంక చూచి "అమ్మయ్యో! అసలు సంగతి బయట పెట్టాడు!" అన్నది.

కౌంట్ ఉద్వేగం హఠాత్తుగా చల్లారి పోయింది. "ఇంకా ఏమిటి సంగతులు? సోల్జెరువు అవుతావా? ముందు చదువుకోవోయ్. తరువాత సంగతి ఆలోచించుకోవచ్చు." అన్నాడు.

"నేను మాట్లాడేదేం వెర్రికాదు!" అంటూ మొండిపట్టు పట్టాడు పేట్యా.

"ఫెడియా ఆ బ్లాన్సుకీ నా కంటె చిన్నవాడు. అయినా సోల్జెను కాబోతున్నాడు. అయినా ఈ సమయాల్లో ఒక మూల కూచుని పాఠాలు నేర్చుకోమంటే ఎలాగా?" అంటూ పేట్యా కొంచెం సిగ్గుపడ్డాడు.

"సరే సరే. చాల్లే ఈ వెర్రి" అన్నాడు కౌంట్.

"నాన్నా! నీవే చెప్పావుగా ఎలాంటి పనైనా చేస్తానని?"

"పేట్యా! ఇక మాట్లాడక కూచో" అన్నాడు కౌంట్, తన భార్య వంక చూస్తూ. ఆవిడ పాలిపోయి వణికిపోతూ కూచుని వుంది.

తన కడగొట్టు కుమారుని వంక చూచింది.

"నాన్నా! నేను నీకు నిజం చెపుతాను. పీటర్ కిరొలొవిచ్ కూడా చెపుతాడు...." అని మళ్ళీ ఏదో చెప్పబోయాడు పేట్యా.

"ఏమిట్రా ఈ వెర్రి? ఇంకా నీ పెదవులపై చనుబాలు కూడా ఆరిపోలేదు. అప్పుడే సోల్జెరవు అవుదా మనుకుంటున్నావా? ఏమిటీ వెర్రి? ఇక ఊరుకో" ఇలా అని కౌంట్, మధ్యాహ్నం నిద్రపోవడం కోసం తన గదిలోకి వెళ్ళాడు. "పీటర్! ఇలా రా. కాసేపు చుట్ట కాల్చుకుంటూ కూచుందాం" అని పీటర్‌ను పిలిచాడు.

పీటర్ తనలో తాను అటూ ఇటూ ఊగిసలాడుతూ ఉన్నాడు. నటాషా కళ్ళు అతన్ని మంత్రముగ్ధుణ్ని చేశాయి. ఆ కళ్ళలో ఇప్పుడు కనిపించినంత కాంతి అత నిదివర కెన్నడూ చూడలేదు.

"మంచిది. కాని నేను ఇంటికి వెళ్ళాలి" అన్నాడు పీటర్.

"ఇప్పుడేం ఇంటికి? ఈ సాయంకాలం మాతో గడపవా? ఇప్పుడు మరీ మా ఇంటికి రావడం మానేశావేం? ఈ పిల్ల ... " అంటూ కౌంట్ నటాషాను చూపించి "నీవిక్కడ లేకపోతే ఈ పిల్ల హాయిగా ఉండదు" అన్నాడు.

"ఆ విషయం నిజమే కాని నేనొక విషయం చెప్పడం మరిచిపోయాను. నా కింట్లో పనుంది ..." అన్నాడు పీటర్.

"అలా అయితే సరే. వెళ్ళి రా" అన్నాడు కౌంట్. తన గదిలోకి వెళ్ళిపోతూ.

"ఎందుకలా కష్టంగా కనిపిస్తున్నావు?" అనడిగింది నటాషా, పీటర్ వంక సూటిగా చూస్తూ.

"నిన్ను ప్రేమించడమే!" అన్నాడు పీటర్. కాని మరేమీ మాట్లాడలేకపోయాడు. నేల వంక చూస్తూ నిలబడిపోయాడు. "ఇక నేనిక్కడికి తరుచుగా రావడం " అని ఏదో చెప్పబోయి మళ్ళీ "అహ, ఏం లేదు. ఇంట్లో పనుంది" అన్నాడు.

"కాదు. అదేమిటో నాకు చెప్పవూ ?" అని అడిగింది నటాషా. ఆవిడ కళ్ళలో ఆశ్చర్యం కనిపించింది.

పీటర్ చిరునవ్వు నవ్వాలని అనుకున్నాడు కాని నవ్వలేకపోయాడు. ఆవిడ చెయ్యి ముద్దాడి మరోమాట మాట్లాడకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఇక ఎన్నడూ ఆ ఇంట్లో అడుగుపెట్ట కూడదని నిశ్చయం చేసుకున్నాడు.

# 82

పెట్యా తన తల్లిదండ్రులిలా నిరాకరించిన తరువాత చాలాసేపు గదిలో కూచుని ఏడ్చాడు. అయినా అతను ఈ సమయానికి తిరిగి వచ్చేసరికి ఎర్రగా వున్న అతని కళ్లు ఎవరూ గుర్తించలేక పోయారు.

జార్ ఆ మరుసటిరోజు వచ్చాడు. కొందరు సేవకులు నగరంలోకి వెళ్ళి చూచి వస్తామని సెలవు తీసుకున్నారు. పెట్యా ఆ ఉదయాన చాలాసేపు ముస్తాబు చేసుకుంటూ కూచున్నాడు. కాలర్ సరిచేసు కోవడంలోను, పెద్దమనిషిలా జుట్టు దువ్వుకోవడంలోను చాలాసేపు గడిపాడు. అద్దంలో తన పాప చూచుకుంటూ కిలకిల నవ్వుకున్నాడు. చివరకు తన ముస్తాబుతో సంతృప్తి చెంది వెనకాల మెట్ల వరస గుండా ఇంట్లో ఎవరికీ చెప్పకుండా మెల్లగా బయటికి జారుకున్నాడు.

చివరి కతను నిశ్చయం చేసుకున్నాడు. ఎలాగైతేనేం జార్‌ను కలుసుకుంటాడు. చక్రవర్తి సన్నిహితులలో ఎవరో ఒకరిని కలుసు కోవడానికి ముందు ప్రయత్నిస్తాడు. అలాటి వారెప్పుడూ చక్రవర్తి దగ్గర ఉంటారని అతని ఉద్దేశం. తన పేరు కౌంట్ పీటర్ రోస్టోవ్ అనీ, తను యువకుడు కాబట్టి దేశసేవ చేయాలనే వాంఛతో ఇక్కడికి వచ్చాననీ వారితో చెపుతాడు. ఇలా మరెన్నో విషయాలు చెపుతాడు. దాంతో వారు అతనిపట్ల సుముఖులవుతారు. తన పసి ముఖం వారికి ఎంతో ఆశ్చర్యం కలిగిస్తుందనీ, అంచాత తను వెళ్ళిన పని తప్పకుండా అయి తీరుతుందనీ అతననుకున్నాడు. అయినప్పటికీ కాలరు, జుట్టూ జాగ్రత్తగా సర్దుకున్నాడు.

అతను వీధుల్లోగుండా నడుస్తూ వెడుతుండగా *క్రెమ్లిన్‌భవనం గోడలచుట్టూ చేరిన జనసమూహాన్ని చూచేసరికి అతనికి మరింత ఆశ్చర్యం కలిగింది. తను పెద్దమనిషిలా కనిపించలేకపోయాడు. జనంలో రాచుకుని పోతానేమోనని అతను మోచేతులతో జాగ్రత్తగా దోవ చేసుకోవలసి వచ్చింది. చివరికతను ట్రినిటీగేటు దగ్గరికి చేరుకోగానే జనసమూహం అతన్ని అతని ఉద్దేశాలు కూడా అర్థం చేసుకోకుండా అతన్ని గోడవైపుకు నెట్టింది. అతనక్కడే నిలిచిపోవలసి వచ్చింది. బండ్లు

* జార్ ఉండే భవనం

ఒకదాని వెంట ఒకటి ఆర్చీలోగుండా వెడుతున్నాయి. పేట్యాకు దగ్గరిగా అతని లాగానే జన సమూహంచేత అవతలికి నెట్టబడిన తక్కువ జాతికి చెందిన ఒక లావు పాటి స్త్రీ,ఒక వృద్ధసేవకుడు నిలుచుని వున్నారు. పేట్యాకు రాను రాను అసహనం మరింత ఎక్కువవుతోంది. తను ముందుగా త్రోవ చేసుకుని వెడదామనుకున్నాడు. బండ్ల వరస ఆగేవరకూ తను ఆగదలుచుకోలేదు.తన ప్రక్కనున్న లావుపాటి స్త్రీని మోచేత్తో పొడిచాడు.

"అబ్బాయ్! ఎవరూ కదలడం లేదు. నీకు కనిపించడం లేదా ఏమిటి? నీ వెక్కడికి వెళ్ళేది?" అన్నది ఆ స్త్రీతో పోట్లాడుతూ.

"నీవు దోవ చేసుకోదలుచుకుంటే నేనూ నీతో పాటు వస్తాను." అన్నాడు వృద్ధసేవకుడు, పేట్యాను ఒక మూలకు నెడుతూ.

పేట్యా అక్కడే ఉండిపోవలసి వచ్చింది. ముఖం తుడుచుకున్నాడు. కాలరు సర్దుకున్నాడు. కాని వేడివల్ల చెమటలవల్ల అతని కాలరు నలిగిపోయింది. ఇలాంటి పరిస్థితిలో తనను చూస్తే జార్ దగ్గరికి తనను తీసుకుని వెళ్ళరేమో అని అతనికి భయం కలిగింది. అతనా సందులోనుంచి బయటపడి మళ్ళీ తన్ను తాను చిక్కబట్టుకోలేకపోయాడు. ఇలా అతను నిలుచుని ఉండగా అతని ముందునుంచి ఒక జనరల్ కూచుని ఉన్న బండిపోయింది· ఆ జనరల్ తన తల్లి తండ్రులకు స్నేహితుడు· అతనితో తన విషయం చెపుదామనుకున్నాడు. కాని మళ్ళీ మర్యాదగా ఉండదని ఊరుకున్నాడు·

చివరకు జనసమూహం ముందుకు తోసుకుని పోయింది· పేట్యా కూడా ఆ సమూహంతోపాటు ముందుకు పోయాడు. ఒక పెద్ద కూడలిని చేరుకున్నారు. అక్కడ కూడా ఎందరో జనం ఉన్నారు. ప్రతిచోట—ఇళ్ళ కప్పులమీద కూడా-జనం కూచుని ఉన్నారు. అక్కడికి చేరగానే గంటల మ్రోతలు, అంతటా నిండి ఉన్న జన సమూహం యొక్క ఘోష, వినిపించాయి.

హఠాత్తుగా ప్రతి హేటూ ఆకాశంలోకి ఎగరడం కనిపించింది. జన సమూహం ఇంకా ముందుకు తోసుకుని పోయింది. పేట్యా ఆ సమూహంలో నలిగి పోయాడు. ఆ ఘోషలో అతనికేమీ వినిపించడం లేదు. అదేమిటో చూద్దామని మునివ్రేళ్ళపై నిలుచున్నాడు.

అతని చుట్టూ ఆందోళనతో విప్పారిన ముఖాలు కనిపిస్తున్నాయి· అతనికి దగ్గరిగా ఒక స్త్రీ నిలుచుని ఉంది. ఆవిడ చెక్కిళ్ళు కన్నీళ్ళతో నిండి ఉన్నాయి "నా చిన్ని నాన్నా! దేవతా!" అన్నదామె కన్నీళ్ళు తుడుచుకుంటూ·

ఒక్క నిముషం పాటు ఆగిపోయిన జన సమూహం మళ్ళీ కదిలింది.

పేట్యా కూడా ఉద్వేగంతో కొట్టుకుని పోయాడు. అతనెక్కడికి వెడుతున్నదీ కూడా అతనికి తెలియడం లేదు. త్రోవచేసుకుని పోతూ అందరితోకలిసి తను కూడా "హుర్రా!" అని బిగ్గరగా అరిచాడు. అతను తన ప్రక్కనున్న జనాన్ని మోచేతులతో పొడుస్తూ త్రోవ చేసుకుంటూ పోతున్నాడు. జనసమూహం కూడా అతన్ని పొడుస్తూ, అరుస్తూ కేకలు వేస్తోంది.

అయితే అతను తప్పకుండా జార్ అయి ఉండాలి." అనుకున్నాడు."నేను ఆయనతో మాట్లాడాలని ఎలా అనుకోగలిగాను? ఎంత సాహసం!" అనుకున్నాడు. అయినప్పటికీ త్రోవచేసుకుంటూ పోతున్నాడు. చివరకు కొద్దిదూరంలో ఒక పెద్ద బయలు కనిపించింది. పోలీసులు జనసమూహాన్ని ఆపుతున్నారు. మళ్ళీ ఇక్కడ జనసమూహం కనిపించింది. జార్ తన భవనంలోనుంచి చర్చికి వెళ్ళడం కోసం బయటికి వస్తున్నాడు. ఈ సమయంలో ఎవరో పేట్యాను ఒక దెబ్బకొట్టారు. పేట్యా స్మృతితప్పి వెనక్కు పడిపోయాడు. అతను మళ్ళీ స్మృతి వచ్చి లేచేసరికి ఒక మతగురువు తనను లేవతీసి పట్టుకుని ఉండడం అతను చూచాడు. ఆ మత గురువుది బట్టతల. అపరిచితుడైన ఈ స్నేహితుణ్ణి భుజం పట్టుకుని లేవదీసి అతను పడిపోకుండా పట్టుకున్నాడు.

"ఇదుగో! ఒక కుర్రవాడు నలిగిపోతున్నాడు?" అని ఆ మతగురువు అందరితోనూ చెప్పడం మొదలెట్టాడు.

చక్రవర్తి చర్చి దగ్గరికి వెళ్ళి అందరికీ కనిపించకుండా పోగానే జన సమ్మర్దం పల్చబడింది. మతగురువు పేట్యాను జార్ కానెన్ అనే ఒక ప్రదేశంలోకి తీసుకుని వచ్చాడు. అక్కడికి చేరేసరికి మళ్ళీ జనం ఒత్తిడి ఎక్కువైంది. వారిలో కొందరు అతన్నిలా చేసినందుకు జాలి తలిచి అతని కోటుగుండీలు ఊడ తీసి, మరికొందరు అతన్ని ఒక రాతిమీద నిలవబెట్టారు. అతన్నిలా క్రిందికి తోసిన వారిని తిట్టిపోయసాగారు. పేట్యా వెంటనే కొంచెం తేరుకున్నాడు. మళ్ళీ అతని ముఖంలోకి తెలివి వచ్చింది. కొంచెం హాయిగా ఉన్నట్లనిపించింది. ఇక్కడి నించీ జార్‌ను చూడవచ్చు కదా అనుకున్నాడు. అయినా జార్‌తో ఇప్పుడు మాట్లాడ దలుచుకోలేదు. ఊరిక చూడాలనుకున్నాడు, అంతే.

చక్రవర్తి తిరిగి వచ్చినందుకు, టర్కీతో సంధి చేసుకున్నందుకు చిహ్నంగా ప్రార్థనలు జరుగుతుండగా జనసమ్మర్దం మెల్ల మెల్లగా పల్చబడింది.* క్వాస్ అమ్మేవారు, జింజరు, రొట్టె అమ్మేవారు, జీడిపప్పు అమ్మేవారు అన్నిచోట్లా తిరుగుతున్నారు. పేటియాకు వీటన్నిట్లోకి జీడిపప్పంటే యిష్టం. ఆ బయలులో అక్కడక్కడా కొందరు జనం గుంపులుగా కూడి ఉన్నారు. ఒక స్త్రీ తన శాలువ చిరిగి

---

* రై ధాన్యం నుండి తయారు చేసిన ఒక పానీయం.

పోయిందని, ఆ శాలువ ఎంత ఖరీదైనదో అందరితోనూ చెపుతోంది. మరొకరు కొద్ది రోజుల్లోనే సిల్కుగుడ్డల ఖరీదు తగ్గిపోతుందని చెపుతున్నారు. పేట్యాను రక్షించిన మతగురువులు ఒక సివిలు ఉద్యోగితో ఏదో చర్చిస్తున్నాడు. ఇద్దరు యువకులు ఏవో పప్పులు నోట్లో పోసుకుని నములుతూ ఇద్దరు పిల్లలతో కలిసి నవ్వుతూ ఉన్నారు. మరొకప్పుడైతే ఈ సంభాషణలు పేట్యాకెంతో ఆనందం కలిగించి ఉండేవి. కాని ఇప్పుడు మాత్రం ఆ నలుగురు యువకుల సంభాషణలు అతనేమీ పట్టించుకోవడం లేదు. అతను రాతిమీద నిలుచుని ఉన్నాడు. అతని ఆలోచనలన్నీ జార్‌పట్ల లగ్నమై ఉన్నాయి. అందుచేత తన శరీరబాధను, భయాన్ని కూడా మరిచిపోయాడు.

హఠాత్తుగా ఫిరంగి చప్పుడు వినిపించింది. జనసముహం పరుగెత్తుకుంటూ వెళ్ళింది. పేట్యా కూడా వెళ్ళేవాడే, కాని మతగురువు అందుకు ఒప్పుకోకుండా అతన్ని చెయ్యి పట్టుకుని నిలిపివేశాడు. ఆఫీసర్లు, జనరళ్ళు; అందరూ చర్చి నుంచి బయటికి వచ్చారు. హేట్లు తీశారు. నలుగురు ఆఫీసర్లు చక్కని యూనిఫారములు వేసుకుని అక్కడికి వచ్చారు.

"హుర్రా! హుర్రా!" అని జనసమూహ మంతా కేకలు వేసింది.

"ఏడీ ఆయన? ఎవరాయన?" అని అడిగాడు పేట్యా. కాని ఎవరూసమాధానం చెప్పలేదు. ఎవరూ అతని మాట పట్టించుకోలేదు. నీటితో నిండిన కళ్ళతో అతను ఆ నలుగురివైపే చూడసాగాడు. ఆ నలుగురిలో ఎవరూ చక్రవర్తి కాకపోయినా తను కూడా "హుర్రా!" అని కేకవేసి తనుకూడా సోల్జెర్ను కావాలని కోరుకున్నాడు.

జనసమూహమంతా చక్రవర్తి వెనకాల పోగయింది. చక్రవర్తి రాజభవనంలోకి వెళ్ళగానే మెల్లగా పల్చబడిపోయింది. ఈ పాటికి చాలా సేపయింది. ప్రొద్దు బాగా ఎక్కిపోయింది. పేట్యా ఇంకా భోజనం చెయ్యలేదు. అతని ముఖం నిండా చెమట పట్టింది. అయినా అతనికి ఇంటికి వెళ్ళాలనిపించలేదు. రాజభవనం ముందు ఊరికే తారట్లాడుతున్న కొందరితో కలిసి అక్కడే ఉండిపోయాడు. ఏం జరిగినా సరే అక్కడే ఉండాలనుకున్నాడు. విందుకు బండ్లలో వస్తున్న పెద్ద పెద్ద ఉద్యోగుల వంక, కిటికీల వెనకాల అటూ ఇటూ తిరుగుతున్న ఆఫీసర్ల వంక చూడసాగాడు.

విందు జరుగుతున్న సందర్భంలో వేలోవ్ ఒకమాటు బయటికి చూచి చక్రవర్తితో నగర ప్రజలు బయట కాచుకుని ఉన్నారని, ఒకమాటు ఆయన వచ్చి కనిపించాలనీ చెప్పాడు. విందు పూర్తికాగానే యింకా ఒకబిస్కట్టు నములుతోన్న జార్, బయట బాల్కనీలోకి వచ్చి నిలుచున్నాడు. కొందరు ఆయన్ను తండ్రి అని,

కొందరు దేవాతా అని, కొందరు హుర్రా అనీ పెద్దగా పిలిచి కేకలు వేశారు. స్త్రీలు పురుషులు, పేట్యా కూడా కన్నీళ్ళు రాల్చారు. జార్ చేతిలో ఉన్న బిస్కట్టు ఒక ముక్క విరిగి క్రిందపడింది. అది ఒక గుర్రపు బగ్గీవాడి కాళ్ళ దగ్గర పడింది. అతను వెంటనే దాన్ని తీసుకున్నాడు. అతని చుట్టూ ఉన్న వాళ్ళుకూడా ఆ బిస్కట్టు ముక్కలో భాగం కోసం అతని చుట్టూ మూగారు. ఇది చూచి చక్రవర్తి ఒక పెద్ద పళ్ళెం నిండా బిస్కట్లు తెచ్చి ఒక్కొక్క బిస్కట్టే క్రిందపడేశాడు. పేట్యా కళ్ళు ఇంతలు చేసుకుని చూస్తున్నాడు. మళ్ళీ జనం తనను క్రింద పడేటట్టు తోస్తారని భయం ఉన్నప్పటికీ కూడా జార్ పడేసిన బిస్కట్లను అందుకోవడానికి ముందుకు వచ్చాడు. ఎందుకూ అనిఅడిగితే ఆ విషయం అతనికేతెలీదు. అతనికలా రావాలనిపించింది, అంతే. ఒక ముసలావిడను ముందుకు త్రోసి ఆవిడ అరుస్తున్నప్పటికీ ఆవిడ కంటే ముందుగా ఆ బిస్కట్టు ముక్కను తీసుకున్నాడు. తరువాత ఉత్సాహాన్నంతా ఉబికించి "హుర్రా!" అని బిగ్గరగా అరిచాడు. కాని పాపం! ఆ పసివాడి గొంతు రాచుకునిపోయి బొంగురుగా వినిపించింది.

జార్ మళ్ళీ లోనికి వెళ్ళాడు. జనం పల్చబడింది.

"కాచుకుని ఉన్నందుకు ఫలితం దక్కింది చూచారా?" అంటూ ఒక్కొక్కరే సంతృప్తితో వెళ్ళిపోయారు.

సంతోషంగా ఉన్నందువల్ల పేట్యాకు ఇంటికి వెళ్ళాలనిపించలేదు. ఇంటికి వెడితే ఆనాటి ఆనందం అయిపోతుం దనుకున్నాడు. అందుచేత తన ఈడువాడైన తన స్నేహితుడు ఆబ్లాన్స్కిని కలుసుకోవడం కోసం వెళ్ళాడు. ఆబ్లాన్స్కి సేనలో చేరబోతున్నాడు. చివర కెలాగైతేనేం పేట్యా ఇంటికి వెళ్ళాడు. ఇంటికి వెళ్ళగానే తన కోరిక తెలిపి అందుకు ఒప్పుకోని పక్షంలో ఇంటినుంచి పారిపోతానని తల్లి దండ్రులతో చెప్పాడు. వృద్ధకౌంట్ ఒప్పుకోక తప్పింది కాదు. కాని అంతకు ముందు ఒకమాటు అధికారుల దగ్గరికి వెళ్ళి సేనలో అట్టే ప్రమాదంలేని శాఖ ఏదో తెలుసుకోవాలనుకున్నాడు కౌంట్.

# 83

జూలై 15వ తారీఖు ఉదయం—చక్రవర్తి వచ్చిన మూడురోజులకు కొన్ని బండ్లు స్లొబట్స్కిహోటలు ముందు వచ్చి నిలుచున్నాయి. లోపల గదులన్నీ క్రిక్కిరిసి ఉన్నాయి. ఒక గదిలో పెద్దకుటుంబాలవారు, మరొక గదిలో వర్తకులు ఉన్నారు. పెద్ద కుటుంబాల వారంతా ఏదో ఉత్సాహంలో ఉద్వేగంలో ఉన్నారు. మాస్కో అభిజాత వర్గానికి చెందిన గొప్ప గొప్ప వారంతా ఒక టేబిల్ చుట్టూ

పెద్ద కుర్చీలలో ఆనుకుని కూచుని ఉన్నారు. నిలువుసైజు అలెగ్జాండరు చక్రవర్తి చిత్తరువు వాటిపైన వ్రేలాడ దీసి ఉంది. కొందరు ఏదో మాట్లాడుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నారు. వారు వేసుకున్న దుస్తులన్నీ ఒకే విధంగా ఉన్నట్లు కనిపిస్తున్నా, ఆ దుస్తుల్లో కొద్ది మార్పు కూడా కనిపిస్తోంది. కొన్ని దుస్తులు కాథెరైన్ రాణి 'పాల్' కాలంనాటివి, కొన్ని 'పీటర్ ద్విగేట్' కాలంనాటివి, కొన్ని ఇటీవల తయారుచేసినవి. దీనివల్ల ఆ పార్టీ అంతా రంగురంగులుగా కనిపిస్తోంది. వీరితో చాలామంది పీటర్‌కు తెలిసినవారే. క్లబ్‌లోనో లేక వారి వారి ఇండ్లలోనో అతను వారిని చూచినవాడే. ముఖ్యంగా వారిలో వృద్ధులు విచిత్రంగా కనిపిస్తున్నారు. కొందరు పళ్ళులేనివారు, కొందరు కళ్ళులేని వారు, కొందరు బట్టతలల వారు, కొందరు మరీలావుగా ఉన్నవారు, కొందరు మరీచిక్కిపోయినవారు; అంతా మాట్లాడకుండా ఒక మూల బొమ్మల్లాగా కూచున్నారు. ఒకవేళ లేస్తే ఎవరికో ఒకరికి తాకుతున్నారు. వారి ముఖాలు కూడా చాలా విచిత్రంగా కనిపిస్తున్నాయి. కొందరు ఏదో గొప్ప విషయం కోసం ఎదురు చూస్తున్నట్లుగా కనిపిస్తున్నారు. కొందరు వారుగెలిచిన బోస్టన్ ఆటనో, లేక మరే చిన్న విషయాన్నో తలచుకుని చిరునవ్వు నవ్వుకుంటున్నారు.

పీటర్ కోర్టు యూనిఫారం వేసుకున్నాడు. ఆ యూనిఫారం అతని వంటికి చాలా బిగుతుగా ఉంది. అతను గదిలో ఆందోళనతో అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఈ పై వర్గాల వారినీ, ఈ వర్తకులనూ; అందరినీ చూచినప్పుడు ఫ్రెంచి విప్లవాన్ని గురించిన అతని అభిప్రాయాలు మళ్ళీ అతని మనస్సులోకి వచ్చాయి. అతను వాటిని గురించి ఆలోచించడం మానివేసి చాలాకాలం కావస్తున్నప్పటికీ ఇంకా అవి అతని మనస్సులో దృఢంగా నాటుకునే ఉన్నాయి. అక్కడి ప్రజలకు విముక్తి కలిగించడం కోసం తాను వస్తున్నానని ప్రణాళికలో చెప్పిన జార్ మాటలు అతని భావాలను మరింత స్థిరం చేశాయి. అతను చాలా రోజులబట్టీ ఆశిస్తున్న సంస్కరణ దాపుకు వస్తోందని అనుకున్నాడు. కాని వారు మాట్లాడుకునే మాటల్లో అలాంటి సూచనలేమీ ఉన్నట్లు అతనికి కనిపించలేదు.

ప్రణాళిక చదివారు. అంతా ఉత్సాహంతో దాన్ని ప్రశంసించారు. తరువాత అక్కడ చేరిన వారు విషయాలు చర్చించడానికి వేరు వేరుగా విడిపోయారు. ఈ సంభాషణలో వారు మాట్లాడుకున్న మామూలు విషయాలే కాక పీటర్ మరో చర్చ కూడా విన్నాడు. చక్రవర్తి వచ్చే సందర్భంలో అభిజాత వర్గాలతాలూకు మార్షల్సుకు ఏ స్థానాలు ప్రత్యేకించాలా అని ఆ చర్చ. అతని గౌరవార్థం ఇవ్వవలసిన విందును గురించీ, బిళ్లాలను గురించీ కూడా చర్చించుకుంటున్నారు. కాని వారంతా అక్కడికి చేరింది యుద్ధాన్ని గురించి చర్చించడానికే. కాని ఆ విషయం వచ్చేసరికి

అంతా కలవరపడి మాట్లాడకుండా ఊరుకుంటున్నారు. ఒక రిటైర్ అయిన నౌకా దళ కెప్టెన్, యూనిఫారం వేసుకున్న మధ్యవయస్కుడైన ఒకవ్యక్తి కొందరితో బిగ్గరగా ఏదో మాట్లాడుతున్నాడు. వారిలో పీటర్ కూడా ఉన్నాడు. అతనేం చెపుతాడో వినాలని అక్కడేనిలుచున్నాడు. కాథెరైన్ రాణీకాలంనాటి దుస్తులు ధరించిన కౌంట్ ఇల్యా ఆంద్రొవిచ్ రోస్టోవ్ చిరునవ్వు నవ్వుతూ తన స్నేహితులను గుర్తిస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాడు. అతను కూడా ఆ వ్యక్తి ఏం చెపుతున్నాడో విందా మని అక్కడ ఆగి పోయాడు. ఆ వ్యక్తి చెపుతున్న మాటలు విని అవునన్నట్లు తల ఊపుతున్నాడు. అక్కడ చేరినవారి ముఖాలను బట్టి చూస్తే ఆ వ్యక్తి చాలా సాహసంతో మాట్లాడుతున్నాడని అందరూ అనుకుంటున్నట్లు అవగతమవుతుంది. కొందరు భయస్థులు, ఇదేమిటన్నట్లు భుజాలూపి అక్కడనుంచి జారుకున్నారు. పీటర్‌కు మాత్రం అతను మాట్లాడిన మాటల్లో ఒక విధమైన విశాలదృష్టి కనిపించింది తను ఆ మాటలన్నీ ఒప్పుకోకపోయినా అవిఅతనికి ఇంపుగానే ఉన్నాయి. నౌకాశాఖకు చెందిన ఆ వ్యక్తి చక్కని గొంతుకతో తన నావికులతో మాట్లాడినట్టుగానే మాట్లాడుతున్నాడు.

"స్మోలెన్స్క నివాసులు ఒక మిలిటరీ సైన్యాన్ని జార్‌కు ఇస్తామని అన్నంత మాత్రాన మనకు వచ్చిన లాభమేమిటి? వారి ఓటు మనకు ప్రమాణమవుతుందా? మాస్కో అభిజాత వర్గాలవారు అవసరమని అనుకున్నట్లయితే వారు తమ విశ్వాసాన్ని చూపడానికి మరెన్నో మార్గాలున్నాయి. 1807 లో రక్షక సైన్యాన్ని సమకూర్చడం మనం ఇంకా మరిచిపోలేదు. దాని వల్ల లాభించిన వాళ్ళంతా వట్టి దొంగలు మాత్రమే" అని చెపుతున్నాడు ఆ వ్యక్తి. ఆ మాటలువిని కౌంట్ రోస్టోవ్ అవునన్నట్లు చిరునవ్వు నవ్వుతూ నిలుచున్నాడు.

"రక్షకసేన దేశానికి సేవచేయడమనేది మనం ఎన్నడైనా చూచామా? అలాంటిది ఎన్నడూ జరగలేదు. వారు చేసిందల్లా మన పొలాలు పాడుచేయడం మాత్రమే. ఇంతకంటె రిక్రూటింగ్ (సైనికులను చేర్చుకోవడం) మంచిది. అభిజాత వర్గాల వారెన్నడూ ప్రాణాల కోసం లెక్కచెయ్యరు. అవసరమైతే మనమంతా కూడా సైన్యంలో చేరతాం. జార్ ఒక్కమాట అంటే చాలదూ? మనమంతా ఆయన కోసం చనిపోతాం!" అని మళ్ళీ చెప్పసాగాడు ఆ వ్యక్తి.

కౌంట్ రోస్టోవ్ ఉద్విగ్నుడై పీటర్‌ను తనచేత్తో తట్టాడు. పీటర్ కూడా మాట్లాడాలనుకుని ఒక అడుగు ముందుకు వేశాడు. కాని అతనికి ఏం మాట్లాడాలో తోచలేదు. అతను మాట్లాడేలోగా వృద్ధుడైన ఒక సెనేటు సభ్యుడు తను మాట్లాడడం మొదలు పెట్టాడు. అతను మనిషి చాలా తెలివిగా కనిపిస్తున్నాడు. మెల్లగాను, స్పష్టంగాను మాట్లాడు తున్నాడు.

"నా ఉద్దేశం చెప్పాలంటే, మనం ఎక్కువమంది సైనికులను చేర్చుకుని రక్షకసేనను అభివృద్ధి చేయడం మన రాజ్యానికి మంచిది అవునా కాదా అన్న

విషయం చర్చించడం కోసం కాదు మనమిక్కడ చేరింది... మన చక్రవర్తి మన కిచ్చిన ప్రకటనపై మన అభిప్రాయం వెలిబుచ్చి తరువాత సైనికులను చేర్చుకునే విషయం ఆయనకే వదిలివేద్దాం...."

ఆ సెనేటు సభ్యుడిలా చెపుతోంటే పీటర్ జోక్యం కలిగించుకున్నాడు. అభిజాత వర్గాలవారి బాధ్యతలను గురించి ఆ సభ్యుడు చూపిన సంకుచిత దృష్టిపట్ల తన కోపాన్ని వెలిబుచ్చుతూ ఉద్వేగంతో తీవ్రంగా మాట్లాడసాగాడు. మధ్య మధ్యలో ఫ్రెంచి మాటలు కూడా ఉపయోగిస్తున్నాడు.

"నన్ను క్షమించాలి ఎక్స్‌లెన్సీ!" అన్నాడు పీటర్. సెనేటు సభ్యుడితో తనకు పరిచయం ఉన్నప్పటికి "నేనీ పెద్దమనిషి అభిప్రాయాలతో ఏకీభవించక పోయినప్పటికీ..." అంటూ అతణ్ణి గౌరవనీయుడైన పెద్దమనిషి అని పిలవ దలుచుకుని ఆగిపోయాడు. కాని మళ్ళీ ప్రారంభిస్తూ "నాకు తెలీని ఈ వ్యక్తి అభిప్రాయాలతో నేను ఏకీభవించక పోయినప్పటికీ, ఇక్కడ అభిజాత వర్గాలవారంతా ఆహ్వానింపబడింది కేవలం వారి సానుభూతినీ దేశభక్తిని వెల్లడించడానికి మాత్రమే కాక, దేశానికి ఉపయోగకరమైన కొన్ని పథకాలను గురించి ఆలోచించడానికని కూడా అని నాఉద్దేశం. అంతేకాదు. చక్రవర్తి మన సలహాను, సహాయాన్నీ అర్థించినప్పుడు, మనం కేవలం ఎస్టేట్ల యజమానులు గాను, * శత్రు ఫిరంగి గుండ్లకు ఆహారమయ్యే రైతు జనాన్ని సప్లయి చేసే వాళ్ళంగాను ఉండిపోవడం పనికిరాదని కూడా నా నమ్మకం" అన్నాడు పీటర్.

అతనిలా అనేసరికి ఆ సాహసానికి అచ్చెరువుపడి అక్కడ నిలుచున్నవారు చాలామంది అక్కడ నుంచి తొలగిపోయారు. సెనేటు సభ్యుడు చిరునవ్వు నవ్వాడు. పీటర్ చెప్పిన మాటలు అంగీకరించినవాడు రోస్టోవ్ ఒక్కడే.ఎవరే మాటలు చెప్పినా అంగీకరించడం అతనికి అలవాటే కదా!

"ఇలాంటి ప్రశ్నలు చర్చించడానికి ముందు మనం జార్‌ను, మన సేనలు సరిగ్గా ఎన్ని ఉన్నాయో, వాటి సంఖ్య ఎంతో, వాటి పరిస్థితి ఏమిటో అడిగి తెలుసుకోవాలి." అని చెప్పాడు మళ్ళీ పీటర్.

కాని చుట్టూ ఉన్న వారు అతణ్ణి అంతకు మించి మాట్లాడనివ్వలేదు. అన్ని వైపుల నుంచీ అతణ్ణి ఎదుర్కొన్నారు. అతను మధ్యలోనే ఆగిపోవలసి వచ్చింది. అతని వ్యతిరేకుల్లో కల్లా ఎక్కువగా మాట్లాడింది స్టిఫెన్ స్టెపానొవిచ్ ఆడ్రాప్రెన్. అతనితో కలిసి అనేక పర్యాయాలు బోస్టన్ ఆట ఆడుతూ వచ్చాడు. పేకాట దగ్గర

---

* ఈ జనాన్ని ఫిరంగులకు ఆహారం అని నెపోలియన్ అంటూ ఉండేవాడు.

అతనికి స్నేహితుడు కూడా. కాని అతను రోజూ ఉన్నట్లుగా ఇవాళ లేడు. ఎంచా తనో కాని కోపంగా కనిపిస్తున్నాడు.

"కాని, నన్నొక విషయం చెప్పనీయి" అని ప్రారంభించాడు అడ్రొపైన్. "అలాంటి విషయాన్ని కోరే హక్కు మనకు లేదు. రష్యన్ అభిజాత వర్గానికి ఆ హక్కు ఉన్నప్పటికీ జార్ ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు.మన సేన యొక్క గమనాలు శత్రుసేనలపై ఆధారపడి ఉన్నాయి. కాబట్టి, సైనికుల సంఖ్య ఎత్తుగడలపై ఆధారపడి వుంది. కాబట్టి..."

"ఇది చర్చకు సమయం కాదు. మనం పని చెయ్యాలి!" అన్నాడు మరొకడు. ఆ వ్యక్తిని పీటర్ ఎరుగును. పూర్వం ఒకమాటు లంబాడీలతో అతను కలిసి వుండగా చూచాడు.అతని కీర్తి ప్రతిష్ఠలు కూడా ఎలాంటివో అతనికి తెలుసు.అతను వేసుకున్న యూనిఫారం అతనిలో పూర్తిగా మార్పు తెచ్చింది.

యుద్ధం నిజంగా జరుగుతున్నది రష్యాలోనే. మన దేశాన్నంతా ఊడ్చి పెట్ట డానికి శత్రువు తరుముకుని వస్తున్నాడు. మన తాత ముత్తాతల సమాధులన్నీ తల క్రిందులు చేస్తాడు. మన స్త్రీలను, పిల్లలను ఎత్తుకునిపోతాడు." అని చెపుతూ ఆ వ్యక్తి కొంచెం ఆగి, మళ్ళీ చెప్పనారంభించాడు: "మనమంతా కలిసి ఒక వ్యక్తిగా రూపొంది మన తండ్రియైన జార్‌ను రక్షిస్తాం. నెత్తురు ధారపోయడానికి భయపడే వాళ్ళం కాము మనం. మనం మన దేశానికి నిజమైన బిడ్డలమైతే ఇక ఈ ఊహలన్నీ చాలించడం మంచిది. యూరప్‌కు గుణపాఠం నేర్పగలుగుతాం. రష్యా అంటే ఏమిటో చూపగలుగుతాం."

ఈ ఉపన్యాసకుని ధోరణి అంతా ప్రశంసించారు. కౌంట్ ఇల్యా ఆండ్రొవిచ్ రోస్టోవ్ మళ్ళీ తన ఒప్పుదల చూపాడు. పీటర్ కూడా తను ఏ త్యాగమైనా చేయడా నికి సిద్ధంగా ఉన్నానని చెప్పడానికి తయారుగా ఉన్నాడు. 'కాని ముందుగా ఒక మార్గాంతరాన్ని కనిపెట్టేలోగా మనం పరిస్థితులన్నీ సమగ్రంగా తెలుసుకోవాలి' కాని అతని మాట ఎవరూ వినిపించుకోలేదు.అతను మాట్లాడుతోంటే మధ్య మధ్యలో జోక్యం కలిగించుకుంటూ కేకలు వేయసాగారు. కొందరు వెన్నుచూపించారు కూడా. కొందరు జట్లుగా పోగయి మళ్ళీ ఒకచోట చేరారు.అంతా కలిసి ఒకేమాటు మాట్లాడు తున్నారు. ఇక ఆ సందడి చెప్పతరం కాదు. పీటర్ మాటలవల్ల కలిగే సందడి కాదది. వారా మాటలు మరిచిపోయి కూడా చాలా సేపయింది. జన సమూహం ఎప్పుడూ కూడా తన ద్వేషాన్ని కాని, తన మెప్పుదలను కాని వెలిబుచ్చడం కోసం ఏదో ఒక వస్తువు కొరకు వెదుకులాడుతూ వుంటుంది. ఇది సమూహం యొక్క సహజ లక్షణం. అందుచేతనే ఆ సమూహానికి పీటర్ ఇప్పుడు ఆ వస్తువైనాడు. అందరికీ అతనిపట్ల విముఖత్వం కలిగింది. ఎన్నో ఉపన్యాసాలు ఇవ్వబడినవి.

ఆ నావికుడు ఉపన్యసించిన తరువాత ఎందరో చక్కగా ఎన్నో విషయాలు మాట్లాడారు. అందరూ హర్షించారు కూడా.

'లే మేనేజర్ రూసే' అనే వార్తా పత్రికా సంపాదకుడు గ్లింకా ఇలా చెప్పాడు : "నరకంతో పోట్లాడలంటే నరకమే పోట్లాడ గలదు. మనం మెరుపులు మెరుస్తున్నప్పుడు చూచే పిల్లల్లాగా సంతృప్తి పడి చూస్తూ ఊరుకోకూడదు."

"అదీ, అదీ! అలా చెప్పాలి. మనం పసిపిల్లల్లాగా చిరునవ్వులు నవ్వుతూ చూస్తూ కూచోకూడదు" అని అక్కడున్న వారంతా అదేమాట ప్రతిధ్వనించారు.

వృద్ధులైన పెద్దలందరూ టేబిల్ చుట్టూ కూచుని ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. వారి ముఖాల్లో ఎలాంటి భావమూ కనిపించడం లేదు. ఆ గదిలో వారికి ఉక్కపోస్తున్నట్లుగా మాత్రమే ఉన్నది. పీటర్ ఆందోళన పడుతున్నాడు. తను తప్పుదోవ తొక్కానని అనుకుంటున్నాడు. కాని తన ఉద్దేశాలను మాత్రం వదిలిపెట్టదలుచుకో లేదు. ఈ సమయంలో తన్ను తాను నిలుపుకొనడం కోసం కడసారిగా ఒక్కమాటు చెప్పి చూద్దామనుకున్నాడు. అందుచేత మళ్ళీ బిగ్గరగా ఇలా మొదలు పెట్టాడు: "ఏ అవసరాల కోసం త్యాగం చెయ్యాలో మనకు తెలిసినప్పుడు మనకు త్యాగాలు చెయ్యడం సులభమే" కాని అతని మాట ఎవరూ పట్టించుకోలేదు. ఆ సందడిలో అతని గొంతుక పూడిపోయింది. ఒక్క ముసలివాడు మాత్రం అతనేం చెపుతున్నాడో అని ముందుకు వంగి చూచి, మళ్ళీ అవతలవైపు మాటలు వినడానికి తల అటువైపు తిప్పుకున్నాడు.

"మాస్కోయే లొంగిపోవాలి! అదే త్యాగం" అంటున్నా రొకరు.

"అతను మనుష్యజాతి కంతకూ శత్రువు" అంటున్నారు మరొకరు.

"నా మాటలు వినిపించుకోవాలి" అంటున్నారు ఇంకొకరు.

"నన్ను, మీరు నలగదొక్కేస్తున్నారు...."

అన్నివైపుల నుంచీ ఇలా గొంతుకలు వినిపిస్తున్నాయి.

# 84

ఈ సమయంలో కౌంట్ రోస్టొఫైన్ గదిలోకి వచ్చాడు. జనరల్ వేసుకునే యూనిఫారం వేసుకుని ఉన్నాడు. భుజానికి రిబ్బన్ ఉంది. వెంటనే అందరూ అతనికి దోవ ఇచ్చారు. అతని కళ్ళలో ఎంతో చురుకు, తెలివితేటలు కనిపిస్తున్నాయి.

"ఇప్పుడు చక్రవర్తి రానున్నాడు. ఈ సమయంలో మనం చర్చలు చేస్తూ కూచుంటే లాభం లేదు. చక్రవర్తి మనలను, ఈ నగర వర్తకులను కలుసుకోవడానికి ఆహ్వానించాడు. వేల రూబుళ్ళు ఆయన కోసం అక్కడ కాచుకుని

ఉన్నాయి ..." అంటూ రోస్టొప్ఛైన్ వర్తకులువున్న గదివంక చూపించాడు. "మన మటుకు మనం రక్షక సేనను తయారు చెయ్యాలి. మనం ఈ కొద్దిపనైనా చేసి తీరాలి. అశ్రద్ధ వహించడానికి వీల్లేదు" అన్నాడు మళ్ళీ.

టేబిల్ చుట్టూ కూచుని ఉన్న వృద్ధులైన పెద్దలు "ఏం చెయ్యాలి, ఏం చెయ్యాలి?" అంటూ వారిలో వారు మాట్లాడుకున్నారు. మళ్ళీ జట్లుగా చేరి చర్చించుకుంటున్నారు చివరకు ప్రతివాడూ తన ఓటిచ్చాడు.

"నేను ఒప్పుకుంటున్నాను." అన్నాడొకడు.

"నా ఉద్దేశం కూడా అదే." అన్నాడు మరొకడు, మళ్ళీ ఆ మాటలు చెప్పకుండా. వృద్ధుల సన్నని గొంతుకలు ఆ నిశ్శబ్దంలో స్పష్టంగా వినిపిస్తూ విచిత్రంగా కనిపిస్తున్నాయి. తరువాత కార్యదర్శిని ఈ క్రింది తీర్మానాన్ని వ్రాయమని కోరారు :

"మాస్కో అభిజాత వర్గాలవారు స్మోలెన్స్క్ నగరం వారిని ఉదాహరణగా తీసుకుంటూ ప్రతి వెయ్యిమందికీ పదిమంది మనుష్యుల కోటా ఇవ్వడానికి నిశ్చయించు కున్నారు."

దీంతో ఒక పెద్దబరువు తీరినట్లుగా పెద్దలంతా లేచి కుర్చీలు వెనక్కు నెట్టేసి కాళ్ళు విదిలించుకున్నారు. ప్రతివాడూ తన పరిచితుని చెయ్యి పుచ్చుకుని మాట్లాడుతూ గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయాడు.

"జార్! జార్!" అన్నమాటలు వినిపించాయి. వెంటనే వారు వాకిలి దగ్గరికి పరుగెత్తుకుని వెళ్ళారు. ఆయన పెద్దగదిలో నుంచి నడుస్తూ వస్తున్నాడు. ఆయన కిరు ప్రక్కలా జనం బారులుతీరి నిలుచుని ఆయనకు వంగి నమస్కరిస్తున్నారు. వారిముఖాల్లో గౌరవం, ఆశ్చర్యం, భయం కనిపిస్తున్నాయి. రానున్న ప్రమాదాన్ని గురించి చక్రవర్తి చెప్పిన మాట పీటర్ ఇదివరకే విని ఉన్నాడు. తన దర్బారీయుల్లో ఆయనకు గల విశ్వాసాన్ని కూడా ఆయన ముఖంలో గమనించాడు. తరువాత వారు అప్పుడే తయారుచేసిన తీర్మానాన్ని చక్రవర్తికి అందించారు.

"మహాశయులారా!" అంటూ అలెగ్జాండర్ ఇలా చెప్పసాగాడు; "నేనెప్పుడూ రష్యన్ అభిజాతవర్గాల భక్తివిశ్వాసాలను అనుమానించలేదు. కాని ఈనాడు వారు చూపిన విశ్వాసం నా ఊహలకు కూడా అతీతంగా ఉంది. మనదేశం పేరిట మిమ్ములనందరినీ అభినందిస్తున్నాను. మహాశయులారా! మనమంతా కలిసి పని చెయ్యాలి. కాలం చాలా విలువైనది." ఇలా అని ఆయన ఆగిపోయాడు. ఆయన చుట్టూ వారంతా పోగయినారు.

"అవునవును. అదీ విషయం. చక్రవర్తి మాట కంటే విలువైనదేముంది?"

అన్నాడు కౌంట్ రోస్టోవ్. ఆయన ఏ మాటనైనా వినీ వినకముందే ఒప్పుదల చూపు తాడు. ఇప్పుడూ అలాగే చేశాడు.

జార్ తరువాత ప్రక్కగదిలోకి వెళ్ళాడు. అక్కడాయన కోసం వర్తకులు కాచుకుని ఉన్నారు. ఒక పది నిముషాల సేపు ఆయన వారిదగ్గర ఉన్నాడు. తరువాత ఆయన నీరు నిండిన కళ్ళతో అక్కడనుంచి తిరిగి రావడం పీటర్ చూచాడు. ఆయన నిజంగానే ఏడ్చాడని, మాట్లాడలేక ఆగిపోయాడనీ అ తరువాత పీటర్ విన్నాడు. ఇద్దరు వ్యక్తులు ఆయనతో కలిసి బయటికి వచ్చారు. వారిలో ఒకరు పీటర్‌కు తెలుసు. అతనొక పెద్ద కంట్రాక్టరు. మరొకరు మేయరు. సన్నగా పొడుగ్గా ఉన్నాడు. పసుపుపచ్చని ముఖం. ఆ ఇద్దరూ కన్నీరు పెట్టుకుంటున్నారు. కంట్రాక్టరు "మా ప్రాణ మాన ధనాలన్నిటినీ మీ ఆధీనం చేస్తున్నాం!" అన్నాడు జార్‌తో.

పీటర్‌కు కూడా అప్పుడు ఒకే ఉద్దేశం కలిగింది. తను కూడా ఎలాంటి త్యాగమైనా సంతోషంగా చేయడానికి సిద్ధంగా ఉండాలని కోరుకున్నాడు. తనలా మాట్లాడినందుకు తన్నుతాను నిందించుకున్నాడు. దాని తాలూకు ఛాయలు తుడిచి పెట్టా లనుకున్నాడు. కౌంట్ మమనోవ్ ఒక దళాన్ని పంపుతాడని విని తను కూడా కౌంట్ రోస్టోవ్‌ఫైన్‌తో వెయ్యిమందిని సప్లయి చేస్తానని చెప్పాడు.

కౌంట్ రోస్టోవ్ ఇంటికి వెళ్ళాడు. జరిగిన విషయాలన్నీ తన భార్యతో చెప్పాడు. చివరకు పేట్యా కోరిక ప్రకారం అతని మాటకు ఒప్పుకుని అతనిపేరు సోల్జర్ల లిస్టులో చేర్పించడానికి వెళ్ళాడు.

జార్ ఆ మరుసటి రోజు మాస్కో వదిలి వెళ్ళాడు. మాస్కో పెద్దలు తమ కోర్టు యూనిఫారములు అవతలపెట్టి మళ్ళీ తమ మామూలు జీవితంలో పడి పోయారు. మళ్ళీ ఇళ్ళకు మరలారు. క్లబ్‌లకు వెడుతున్నారు. వారివారి సేవకులు, రక్షకసేనకు మనుష్యులను సప్లయి చేసే విషయమై అవసరమైన పనులు చేయవల సిందని ఉత్తర్వులు చేస్తున్నారు. తమ వాగ్దానాలు చూచి తామే ఆశ్చర్య పోతున్నారు.

# పదవ కాండం

## 85

నెపోలియన్ రష్యామీద యుద్ధం ఎందుకు ప్రకటించినట్లు? అతను డ్రెస్‌డెన్ వెళ్ళి తీరాలనీ, పొగడ్తలకు అతని తల తిరిగిపోవాలని, పోలిష్ యూనిఫారం అతను వేసుకోవాలనీ, చక్కని జూన్ ఉదయ కాలంనాటి మెల్లని కైపు అతను ఆనందంచాలనీ, అతను కరాకైన్, బలాషోవ్‌లను చీవాట్లు వెయ్యాలనీ అతని విధి లిఖితంలో ఉండడమే దీనికి కారణం.

తను వ్యక్తిగతంగా అవమానింపబడ్డాననుకుని అలెగ్జాండర్ మంతనాలు జరపడానికి నిరాకరించాడు. బార్‌క్లే టాలీ తను గొప్ప కమాండర్‌గా కీర్తి సంపాదించుకోవడం కోసం, తన శ్రద్ధనంతా సేనలు నడపడంలో వినియోగించాడు. నికోలస్ రోస్టోవ్—మనకింతకు పూర్వం తెలిసినట్లుగానే— ఒక వెర్రి ఉద్వేగంలో ఫ్రెంచి వారిపై దాడి చేశాడు— ఈ విధంగా ప్రతివారూ తమ అంతస్థులను బట్టి, అలవాట్లను బట్టి, ఆశయాలను బట్టి చరిత్రాత్మకమైన, మరుపురాని ఈ యుద్ధంలో తమ తమ పాత్రలను నిర్వహించారు. వారివారి ఆందోళనలు, వారి గర్వాతిశయాలు, సుఖాలు వారి ఇష్టంమీద ఆధారపడి ఉన్నవని అనుకున్నా, అవి చరిత్ర యొక్క అవ్యక్త సాధనాలే కాని మరి వేరు కావు. వారికా విషయం తెలీకపోయినా, ఇప్పుడు మనమంతా మెచ్చుకుంటున్న ఒక గొప్ప ఫలితానికి అవి దారితీశాయి. చరిత్రకు ప్రతినిధులయినవారు ఎప్పుడూ అలాగే ప్రవర్తిస్తూ ఉంటారు. వారి వారి సాంఘిక పదవిని బట్టి వారు ప్రవర్తించే తీరులో మార్పు కనిపిస్తూ ఉంటుంది. అంతే కాని మరో విధంగా మార్పేమీ కనిపించదు.

1812 నాటి వ్యక్తులిప్పుడు రంగంలో లేరు. వారి వ్యక్తిగత ఆసక్తుల తాలూకు ఛాయలు కూడా ఇప్పుడు కనిపించడం లేదు. ఆనాటి చరిత్రాత్మక ఫలితాలు మాత్రమే ఇప్పుడు కనిపిస్తున్నాయి. విధి ఎలా ప్రతి ఒక్క వ్యక్తినీ నడిపించిందో అలాగే అతని దృష్టినుంచి అతను పనిచేస్తూ ఈ భీకర సమాప్తికి ఎలా సహాయభూతుడయినాడో మనకు రుజువవుతుంది. దీనికి కారణం అలెగ్జాండరూ కాదు, నెపోలియనూ కాదు. ఇలా జరుగుతుందని వారిరువురూ ముందుగా ఊహించలేదు కూడా.

కాని ఈనాడు ఫ్రెంచివారు చేసిన ఈ వినాశనమునకు గల కారణాలను గురించి ఊహిస్తూ కూచోవడం కేవలం అనవసరం. ఒకవిధంగా చూస్తే కారణాలు కనిపించవు. ఒకటి, సంవత్సరం చివరలో వారు చాలా ఆలస్యంగా రష్యాపై దండ

యాత్ర ప్రారంభించడం, చలికాలపు దండయాత్రకు వారు ఏ విధంగాను తయారుగా ఉండకపోవడం. మరొక విషయమిది: రష్యన్‌లు అప్పటికీ శత్రువులపట్ల తీవ్రమైన ద్వేషాన్ని వహించి ఉన్నారు. వారి పట్టణాలను వారే నిప్పుపెట్టుకొని దహించుకున్నారు. ఎనిమిది లక్షలమంది — ప్రపంచం ఎన్నడూ కని విని ఎరుగనంతటి చక్కని సైన్యం ఒక గొప్ప నాయకుని నాయకత్వంలో, తనలో సగం కూడా బలం లేని అనుభవజ్ఞులు కానివారి చేత నడపబడుతున్న సేనపై నడిచి వెళ్ళింది. ఈ రెండు కారణాలవల్ల ఆ సేన లొంగక తప్పింది కాదు. కాని ఇప్పుడు మనకు స్పష్టంగా అవగతమవుతున్న ఈ విషయం వారికప్పుడు అర్థం కాలేదు. అందుచేత రష్యనులు ఫ్రెంచివారు చేసిన పోరాటాలన్నీ వారు తప్పుకునే దోవలన్నింటినీ మూసివేయడానికే ఉపయోగించాయి.

1812 నాటికి కొన్ని ఫ్రెంచి చరిత్రలు వ్రాసిన చరిత్రకారులు, ఈ దండయాత్ర ప్రారంభించడంలోను, తన సేనలను పంపించడంలోను తనకు రానున్న ప్రమాదాన్ని నెపోలియన్‌కు ముందుగానే తెలుసునని రుజువు చేయడానికి ఎంతో ప్రయత్నించారు. ఆయన తన సేనలను ఒకేచోట నిలువ చేసి యుద్ధం చేయాలనుకున్నాడనీ; స్మోలెన్స్క్ దాటి వెళ్ళవద్దనుకున్నాడనీ మొదలైన విషయాలు వ్రాశారు. రష్యన్ చరిత్రకారులు మాత్రం నెపోలియన్‌కు ఎరవేసి అతన్ని ఓడించడం కోసం మొదటినుంచే రష్యన్ మార్షల్ పథకాలు వేసి ఉంచారని వ్రాశారు. ఈ పథకాలు ఫుల్ వేశాడని కొందరు, మరెవరో ఫ్రెంచివాడు వేశాడని కొందరు, అలెగ్జాండరు వేశాడని కొందరు, టాల్ వేశాడని కొందరు వ్రాశారు. ఈ విషయాన్ని సమర్థించడం కోసం జరిగిన సంఘటనల నుంచి ఎన్నో తార్కాణాలు తీసుకొని వ్రాస్తారు. కాని ఈ సిద్ధాంతాలన్నీ నమ్మడానికి వీలులేని పుకార్ల వంటివి. అసలు జరిగినవి మరచిపోయి చరిత్రకారులు వీటిమీద ఆధారపడడానికి వీలులేదు. జరిగిన విషయాలు వీటికి విరుద్ధంగా ఉన్నాయి. యుద్ధం జరిగినంత కాలమూ ఫ్రెంచి వారిని దేశంలోకి రానిచ్చి బోనులో ఇరికించాలనే కోరిక లేకపోవడమే కాక, వారు సరిహద్దు దాటినప్పటి నుంచీ వారిని అక్కడే ఆపడానికి అన్నివిధాలా ప్రయత్నాలు జరిగాయి. ఇక నెపోలియన్ విషయం చూద్దామా అంటే అతను తన సేనలను శత్రు దేశంలోకి పంపించడానికి భయపడక పోవడమే కాక, తాము పురోగమిస్తున్న కొద్దీ దాన్ని ఒక విజయంగా భావించి ఆనందిస్తూ వచ్చాడు. పూర్వపు దండయాత్రలలో వలెకాక తనకేమీ పట్టనట్లుగా పోరాటం సాగించాడు.

మన దృష్టి ప్రకారం చూస్తే అసలు మొదట పరిస్థితులెలా ఉన్నాయి? రష్యన్ సేనలు ఒక సేన విషయం మరో సేనకు తెలిసే పరిస్థితులో లేవు. అన్నీ ఏకం కావాలని ప్రయత్నం చేస్తున్నాయి. అలా ఏకం కావడంవల్ల వాటికి వచ్చే ఉపయోగమూ లేదు. ముఖ్యంగా శత్రువును ఎరవేసి లోపలికి లాక్కోవడమే

ఉద్దేశమైతే అందువల్ల వచ్చే లాభమూ లేదు. ఫుల్ దృష్టి ననుసరించి డ్రిస్సా దగ్గర సేనా స్థావరాన్ని రక్షించే ఉద్దేశంతో కోట కట్టినట్టు కట్టారు. జార్ కూడా ఆ సేన తోనే ఉన్నాడు. జార్ అక్కడున్నది తిరోగమనానికి సేనలను పురికొల్పడం కోసం కాదు. కాని తను అక్కడున్నదల్లా సైనికులను ప్రోత్సహించడానికే. అలా ప్రోత్సహిస్తూ విదేశ ఆక్రమణలోకి పోకుండా ప్రతి అంగుళం రక్షించడానికే. పైగా సేనలను వెనక్కు మరలిస్తూ వచ్చిన జనరల్‌ను ఆయన ఆడిపోస్తూ వచ్చాడు కూడా. ఇక మాస్కో అగ్గిపాలు చేయబడుతున్నదనీ, శత్రువు స్మోలెన్స్క్ ప్రవేశించాడనీ ఆయన ఊహించుకున్నాడూ అంటే ఎలా నమ్మడం...? ఒకేచోట సేనలు నిలిపి పోరాటం సాగలేదని తెలిసి జార్‌కు పట్టరాని కోపం కలుగుతుంది. సేనలు ఎదుర్కోలు చేసినా, స్మోలెన్స్క్‌ను పట్టుకుని కాల్చివేసినా ఆయనకు కోపంకలుగుతుంది.ఎడతెగని ఈ తిరోగమనంవల్ల సైనికులూ, ప్రజలు కూడా రెచ్చిపోయారు. ఈ సమయంలో అంతటా సంఘటనలు జరిగే పద్ధతి ఒక తీరూ తెన్నూ లేకుండా ఉండదు: ఎవరికీ నమ్మకంలేని ఒక పథకం ప్రకారమూ ఉండదు. కాని కొన్ని వ్యక్తిగత ఆశయాలు, కొన్ని కుట్రలు, యత్నాలు. వీటికి సంబంధించి ఉంటుంది. తమ స్వార్థం కోసం మాత్రమే పనిచేసే కొందరు వ్యక్తుల చేతుల్లో ఆధారపడి ఉంటుంది. వారలా పని చేయడంలో ఏ ఉద్దేశమూ ఉండకపోవచ్చు కూడా. అసలు నిజానికి జరుగుతున్న విషయమేమిటి ? పోరాటానికి ముందు సేనలన్నీ ఏకం చేద్దామనే ఉద్దేశంతో రష్యన్‌లు స్మొలెన్స్క్ పై కేంద్రీకరించడానికి ప్రయత్నం చేస్తారు. ఫ్రెంచివారు వారి వెనకాలే వారికి దాపులో ఉంటారు. బార్క్లే జర్మన్ కాబట్టి అతనికి సేనలో పలుకుబడిలేదు కాబట్టి, రెండో దళానికి నాయకుడైన బ్రెగేషియన్ అతనిపై ద్వేషంతో తనకంటే ఉద్యోగరీత్యా అనుభవం తక్కువ కలవాడి క్రింద తను ఉండడానికి నిరాకరిస్తూ సేనల ఎదుర్కోలును సాధ్యమయినంత వరకూ ఆలస్యం చేస్తాడు కాబట్టి, ఈ పథకం విఫలమవుతుంది. ఇక తరువాత జార్ అక్కడున్నందువల్ల ఉత్సాహానికి మారుగా కలతలు చెలరేగడం ఎక్కువవుతుంది. చీఫ్‌కమాండర్ పదవికోసం తాపత్రయ పడుతున్న పలూషీ, ఆయన్ను తన ప్రభావంలో ఉంచుకుంటాడు. ఫుల్ పథకం నిరాకరింపబడుతుంది. బార్క్లేడీటాలీకి చీఫ్‌కమాండర్ పదవి ఇవ్వబడుతుంది. అయినప్పటికీ అతను ఎవరి విశ్వాసాన్నీ చూరగొనలేదు కాబట్టి అతని అధికారం పరిమితంగా ఉంటుంది. ప్రధాన కార్యాలయంలో ఈ కలతలు కలగడం వల్లను, చీఫ్‌కమాండర్‌కు పలుకుబడి లేకపోవడం వల్లను ఒక నిర్ణీతమైన పోరాటం జరపడం ఎంతో అసాధ్యమవుతుంది, దీనివల్ల ఎన్నో కలవరాలు ఏర్పడతాయి కూడా. జర్మనులందరిపైనా అసహ్యము, అయిష్టత, దేశభక్తి అనేది వెర్రి ఆవేశంగా పరిణమించడం సంభవిస్తాయి కూడా.

రెండు గొప్ప నగరాలలోను ఉత్సాహం పురికొల్పడం కోసం తను వెడుతు

న్నానని సాకు చెప్పి జార్ దేశానికి తిరిగి వెళ్ళేసరికి పరిస్థితులీ విధంగా ఉన్నాయి. ఆయనకు అంతకన్నా చెప్పడానికి మరొక సాకు దొరకలేదు. ఆయన మాస్కో వెళ్ళేసరికి రక్షణ సన్నాహాలు మరింత ఎక్కువగా సాగాయి. జార్ వెళ్ళిపోయినప్పటికీ, ఛీఫ్‌కమాండర్ పదవి విషయం నానాటికీ క్లిష్టమవుతున్నప్పటికీ, గ్రాండ్ డ్యూక్, బెనిక్‌సన్, ఇంకా అనేకమంది జనరళ్ళు ఛీఫ్‌కమాండర్ చేసేపనులు ప్రతిక్షణం కనిపెడుతూ కూచున్నారు. తగుస్థాయిలో అతన్ని అట్టిపెట్టడం కోసమే వారిలా చేస్తున్నారు. కాని బార్‌క్లేడీటాలీ మాత్రం తనను ప్రతిక్షణం జార్, అతని ప్రతినిధులు వారి కళ్ళు తనమీదనే ఉంచుతున్నారని అనుకుంటూ, అతను మరింత జాగ్రత్తపడి, వీలైనంతవరకు యుద్ధం రాకుండా నివారిస్తున్నాడు. జార్‌విచ్ ఈ అతిజాగ్రత్తను తీవ్రంగా ఆడిపోస్తూ వచ్చాడు. సేనలన్నింటినీ ఒకేచోట నిలిపి పోరాటం సాగించితీరాలని ఆయన ఒత్తిడి చేస్తూ వచ్చాడు. లుబోమిర్‌స్కీ, బ్రాంబెస్కీ, వ్లాడ్‌స్కీ ; ఇంకా ఇతరులు బార్‌క్లే విషయంలో చిలువలు పలువలు కల్పించి గంగరగోళం చేయసాగారు. బార్‌క్లే ఈ గొడవలు పడలేక జార్‌కు ఏవో కొన్ని ముఖ్యవార్తలు అందించే సాకుతో పోలిష్ జనరళ్ళు ఒక్కొక్కరిని పంపించివేశాడు. తరువాత తను ధైర్యంగా గ్రాండ్‌డ్యూక్‌ను, బెనిక్‌సన్‌ను కాదన్నాడు.

కడకు బెగ్రేషియన్ కాదంటున్నా సేనలన్నీ స్మోలెన్‌స్క్ దగ్గర ఏకమైనాయి. బెగ్రేషియన్ తన బండిమీద బార్‌క్లేడీటాలీ బసచేసి ఉన్న భవనానికి వచ్చాడు. సేనల పురోగమనాన్ని గురించి తన పై ఆఫీసరుకు రిపోర్టు తెలపడానికి వచ్చాడు. బెగ్రేషియన్ దేశభక్తితో వళ్ళు మరిచిపోయి బార్‌క్లేకు పూర్తిగా తన లొంగుబాటును తెలియచేశాడు. అయినప్పటికీ ఛీఫ్‌కమాండర్ అభిప్రాయాలకు విరుద్ధమయిన అభిప్రాయాలు తనకు లేకపోలేదు. తను జార్‌తో స్వయంగా ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపి ఆయన కోరికపై అరక్షేవ్‌కు ఈ క్రింది విధంగా వ్రాశాడు:

"నా చక్రవర్తి ఆజ్ఞాపించినప్పటికి కూడా ఇక నేను ఈ మంత్రితో ఉండదలుచుకోలేదు ..." బార్‌క్లేను ఇలా మంత్రి అని పిలవదలుచుకున్నాడు. "మీకు పుణ్యం వుంటుంది కాని నన్ను ఇక్కడనుంచి మరెక్కడికైనా పంపివెయ్యండి. నాకు ఒక్క దళాన్ని అప్పగించినా చాలు. కాని నన్ను మాత్రం ఇక్కడ ఉంచవద్దు. ప్రధాన కార్యాలయం నిండా జర్మనులే. వాళ్ళు రష్యన్‌లను బ్రతకనిచ్చేటట్టు లేదు. ఇక్కడంతా గందరగోళంగా ఉంది. నేనిప్పుడు సేవ చేస్తున్నది నా చక్రవర్తికి కాక బార్‌క్లేకులాగా ఉంది. ఉన్నమాట చెపుతున్నాను. నేను ఇక్కడమాత్రం పనిచెయ్యలేను" బ్రోనెట్‌స్కీ. విన్‌జెంగెరోడ్ మొదలయినవారు ఛీఫ్‌కమాండర్ల

మధ్య కలతలు పెడుతున్నారు. ఈ విధంగా అందరూ ఏకోన్ముఖంగా పనిచేయడానికి అవరోధం కలుగుతోంది. అయినా స్మోలెన్స్కకు రాకముందే ఫ్రెంచివారిని ఎదుర్కోవడానికి సన్నాహాలు కావించబడినాయి. పరిస్థితి చూచిరమ్మని ఒక జనరల్‌ను పంపించారు. కాని అతను బార్క్లేకు వ్యతిరేకి కావడంవల్ల ఒకదళపు కర్నల్‌తో ఆ రోజంతా గడిపి తిరిగివచ్చి తను చూడనుకూడా చూడని సమరభూమిని గురించి విమర్శించసాగాడు.

యుద్ధం ఏ ప్రదేశంలో సాగించాలా? అని ఈ చర్చలు ఒకవైపు సాగుతూ ఉండగా, ఒకవైపున రష్యన్‌లు ఎక్కడ ఉన్నారా అని ఫ్రెంచివారు గాలిస్తూ ఉండగా, మరొకవైపు శత్రువులు అప్పుడే నెవెరొవిస్కి దళంపై బడి స్మోలెన్స్క నగర కుడ్యాలవరకూ నడిచివచ్చారు. దీనివల్ల రష్యన్‌లకు మరి గత్యంతరం లేకపోయింది. వారి వార్తాసంబంధాలకు అంతరాయం కలగకుండా కాపాడుకోవడం కోసం పోరాడక తప్పింది కాదు. యుద్ధం జరిగింది. ఇరువైపులా వేలమంది సైనికులు చనిపోయారు. స్మోలెన్స్క నగరవాసులు నగరం ఖాళీ చేశారు. గవర్నర్‌చేత మోసగింపబడిన నగరవాసులు నగరాన్ని తగలబెట్టారు. ధ్వంసం అయిపోయి ఇక చేసేది లేక మాస్కోవరకూ నడిచివచ్చారు. అక్కడివారికి కూడా శత్రువు పట్ల ద్వేషం కలిగిద్దామని వచ్చారు. ఇంతసేపూ రష్యన్ సేన తిరోగమిస్తూనే ఉంది. నెపోలియన్ విజయంతో పురోగమిస్తున్నాడు. రానున్న ప్రమాదాన్ని అతను ఊహించుకోనైనా ఊహించుకోలేదు. ఈ విధంగా ఎవరూ ఊహించకుండానే అతను నాశనం కావడం జరిగింది. రష్యాకు విముక్తి లభించింది.

# 86

ఆంద్రూ వెళ్ళిపోయిన తరువాత బోల్కోన్‌స్కి రాకుమారుడు తన కుమార్తెను పిలవనంపాడు.

"ఇప్పుడు నీకు సంతృప్తిగా ఉందనుకుంటాను. నేనూ ఆంద్రూ పోట్లాడుకునేటట్టు చేశావు, నీవు కోరిందే అది! నా మటుకు నాకు ఎందుకు పోట్లాడానా అని విచారం కలుగుతోంది. నేను వృద్ధుణ్ణి, ఒంటరివాణ్ణి...కాని నీ కోరిక తీరింది...ఇక వెళ్ళు" అన్నాడు వృద్ధుడు.

ఇలా అని ఆమెను తన గదిలోనుంచి పంపివేశాడు. ఒక వారం వరకూ మళ్ళీ ఆమె అతన్ను చూడలేదు. ఆయన జబ్బుపడి తన గదిలోనే ఉంటున్నాడు. మదాంబోరీన్ పూర్వంలాగా ఆయన దగ్గరికి రాకపోకలు సాగించకపోవడం మేరియా రాకుమారికి ఆశ్చర్యం కలిగించింది. ఇప్పుడు వృద్ధ సేవకుడు తప్ప ఆయన దగ్గరికి మరెవ్వరూ వెళ్ళడం లేదు. మదాంబోరీన్ కూడా పూర్వంలాగా వెళ్ళడంలేదు.

ఆ వారాంతంలో ఆయనకు కొంచెం స్వస్థత చిక్కింది. మళ్ళీ మామూలు కార్యకలాపాల్లో మునిగిపోయాడు. తన భవంతిని, తోటలను చూచుకుంటున్నాడు. కాని మదాం బోరీస్‌తో ఆయన సన్నిహితత్వం పూర్తిగా తగ్గిపోయింది. ఆయన పూర్వంలాగానే తన కుమార్తెకు దూరంగా ఉంటున్నప్పటికీ తన ప్రవర్తన ద్వారా 'నీవు నన్ను ఆంద్రూను నిందించేటట్లుగా చేసి దూరం చేశావు. ఫ్రెంచి స్త్రీ విషయంలో అతనితో తగాదా పడేటట్లు చేశావు. ఇప్పుడు చూస్తున్నావుగా నాకు ఎవరితోనూ అవసరం లేదని? నీతోనూ అవసరం లేదు. ఆవిడతోనూ అవసరం లేదు.' అంటున్నట్లుగా తెలియచేస్తున్నాడు.

మేరియా రాకుమారి రోజూ కొంతకాలం తన చిన్న అల్లుడితో గడుపుతోంది. వాడు వప్పచెప్పే పాఠాలు వింటోంది. తను కూడా కొన్ని పాఠాలు చెపుతోంది. ట్యూటరైన డెసాలీతో మాట్లాడుతోంది. తతిమ్మా సమయాలు చదవడంలోను, వృద్ధనప్పతో మాట్లాడడంతోను గడుపుతోంది.

ఆవిడ యుద్ధాన్ని గురించి తలపోసినా, సాధారణంగా స్త్రీలు ఏ విధంగా తలపోస్తారో ఆ విధంగా తలపోస్తోంది. అంటే తన అన్నను గురించి ఆతురత పడుతూ ఈ యుద్ధం ఎందుకు వచ్చిందా అనుకుంటోంది. కాని పూర్వం జరిగిన అనేక యుద్ధాలకు ఎలాంటి ప్రాధాన్యం ఇచ్చిందో ఈ యుద్ధానికి కూడా అలాంటి ప్రాధాన్యమే ఇస్తోంది. డెసాలీ యుద్ధగమనాన్ని ఎంతో శ్రద్ధతో పరిశీలిస్తున్నాడు. అప్పుడప్పుడు దాన్ని గురించి తన అభిప్రాయాలు కూడా వెలిబుచ్చుతూ ఆవిడకు ఎప్పటివార్తలు అప్పుడు అందజేస్తున్నాడు. ఆవిడ ఇంటికి వచ్చే యాత్రికులు కూడా నెపోలియన్ క్రీస్తు వ్యతిరేకి అన్న విషయం ఆవిడకు చెపుతున్నారు. అందకత్తె అయిన జూలియా, అంటే ఇప్పుడు బోరీస్ భార్య, ఆవిడకు ఉత్తరాలు వ్రాస్తూ ఉంది. ఒక ఉత్తరం ఇలా వ్రాసింది.

"స్నేహితురాలా!"

నీ కిప్పుడు నేను రష్యన్ భాషలో ఉత్తరం వ్రాస్తున్నాను. ఎందుకంటే ఫ్రెంచివారన్నా, ఫ్రెంచి భాషన్నా నాకసహ్యం. ఫ్రెంచి భాష మాట్లాడుతున్నా కూడా నేను వినలేకుండా ఉన్నాను. ఇప్పుడు మేము మాస్కోలో ఉన్నాం. ప్రతివారు చక్రవర్తి పట్ల ఎంతో చెప్పరాని ఉత్సాహాన్ని చూపుతున్నారు. నా భర్త పాపం యూదుల సత్రాల్లో ఆకలికీ, ఒంటరితనానికి ఓర్చుకుంటూ కాలంగడుపుతున్నాడు. ఆయన దగ్గరనుంచి వచ్చేఉత్తరాలు నా ఉత్సాహాన్ని మరింత ఎక్కువ చేస్తున్నాయి:

నీవు రవిస్కీ చేసిన వీరోచిత కృత్యాలను గురించి వినేవున్నావనుకుంటాను. తన కుమారులిద్దరినీ కౌగిలించుకుని 'నేను ప్రాణాలైనా ఇస్తాను కాని లొంగను' అని చెప్పాడు. శత్రువు మనకంటే ఎంతో బలంకలవాడైనా మనం ఏ మాత్రం లొంగుబాటు చూపడం లేదు. ఇక్కడే హాయిగా నేను కాలం గడుపుతున్నాను. ఉన్నంత

వరకూ హాయిగా ఉంటున్నాను. ఎలైన్ రాకుమారి, సోఫీ రోజూ మనింటికి వస్తున్నారు. తాత్కాలిక విధవలమైన మేము ఎన్నెన్నో విషయాలు మాట్లాడుకుంటాం. ఇక ఇక్కడ కొరతపడింది నీవొక్కతెవే. పోతే మదాంబోరీన్‌ను అడిగానని చెప్పు."

జరుగుతున్న సంఘటనలను గురించి మేరియాకు సక్రమంగా అర్థం కావడం లేదూ అంటే ఆ తప్పు ఆవిడ తండ్రిది. ఆయన ఎన్నడూ వాటిని గురించి మాట్లాడ లేదు. తనకేమీ తెలియనట్లుగా ఊరుకున్నాడు. విందు సమయంలో వారు కలుసుకున్నడు డెసాలీ ఏమైనా వార్తలు చెప్పినా అవి విని ఆయన నవ్వి ఊరుకునేవాడు. ఆయన ఇలా నిర్లక్ష్యంగా ఉండడంవల్ల ఆయన చెప్పిన మాటల్లో ఆవిడకు గట్టి నమ్మకం ఏర్పడింది. తను ఏమాత్రం ఆలోచించకుండా ఆయన చెప్పిన మాటలన్నీ నమ్మేది.

ఇటీవల ఆ వృద్ధ రాకుమారునికి శక్తి, ఉత్సాహం ఎక్కువైనాయి. జులై నెలలో మరో కొత్త తోట వేయడానికి పూనుకున్నాడు. మరో కొత్త ఇంటికి కూడా పునాది వేయించాడు అయినా మేరియా రాకుమారిని కలవర పెడుతున్న విషయం ఒక్కటే. ఆయన సరిగా నిద్రపోవడం లేదు. ప్రతి రాత్రీ ఒక క్రొత్త గదిలో పక్క వేయించుకుంటున్నాడు. తన క్యాంప్‌కాట్‌ను ఒకసారి వసారాలోను, ఒకసారి వంటగదిలోను,ఒకసారి గ్యాలరీలోను వేయించుకుంటున్నాడు,మరోసారి డ్రాయింగ్ రూంలో పడక కుర్చీలోనే నిద్రపోతున్నాడు. మదాంబోరీస్ స్థానే ఇప్పుడు పెట్రూషా అనే యువక సేవకుడు ఆయన నిద్రించే సమయంలో పుస్తకం చదివి వినిపిస్తూ ఉన్నాడు.

ఆగస్టు ఒకటో తారీఖున ఆంద్రూ దగ్గర నుంచి ఆయనకొక ఉత్తరం వచ్చింది. ఇంతకు పూర్వమే ఆయన్ను క్షమాపణ కోరుతూ ఆంద్రూ ఉత్తరం వ్రాశాడు. అందుకు వృద్ధ రాకుమారుడు క్లుప్తంగా సమాధానం వ్రాసి పంపాడు కూడా. ఈ రెండో ఉత్తరంలో ఆంద్రూ రాకుమారుడు, విటబ్స్కని ఫ్రెంచివారు ఎలా ఆక్రమించిందీ వివరంగా ఆయనకు వ్రాశాడు. దండయాత్ర తాలూకు స్కెచ్‌ని కూడా గీసి, బహుశా దండయాత్ర ఎలా సాగవచ్చో వివరణ కూడా వ్రాసి పంపాడు. చివరకు లిస్సీ—గోరీ వరకు కూడా శత్రువులురావచ్చుననీ, వారు వెంటనే మాస్కోకు వెళ్ళడం మంచిదనీ వ్రాశాడు.

ఫ్రెంచివారు విటబ్స్క చేరారన్న వార్త విన్న డెసాలీ, ఆ విషయం వృద్ధ రాకుమారుడికి భోజన సమయంలో చెప్పాడు. ఆయన, కుమారుడు వ్రాసిన ఉత్తరం విషయం కూడా జ్ఞాపకం చేశాడు.

"ఇవాళ ఉదయం నాకు ఆంద్రూ రాకుమారుని వద్ద నుంచి ఒక ఉత్తరం వచ్చింది. నీవు చదివావా?" అన్నాడు వృద్ధుడు, తన కుమార్తెతో.

"లేదు నాన్నా" అన్నదామె భయంతో. ఆవిడకా ఉత్తరం వచ్చినట్లే తెలీదు. ఇక దాన్ని ఆమె చదవడం ఎలా సాధ్యమవుతుంది?

"అతను ఈ యుద్ధాన్ని గురించి వ్రాస్తున్నాడు" అని మళ్ళీ చెప్పసాగాడు వృద్ధుడు. ఈ విషయం ఎప్పుడు మాట్లాడుతూ వచ్చినా అతనొక విధమైన చిరునవ్వు నవ్వుతూ ఉంటాడు.

"అయితే చాలా విషయాలు వ్రాసి ఉంటాడన్నమాట. రాకుమారుడికి అన్ని విషయాలు తెలుసుంటాయి..." అన్నాడు డెసాలీ.

"తప్పకుండా" అన్నది మదాంబోరీస్.

"వెళ్ళి ఆ ఉత్తరం తీసుకురా—నా చిన్న టేబిల్ మీద పేపర్‌వెయిట్ క్రింద పెట్టి ఉంది" అన్నాడు వృద్ధ రాకుమారుడు.

మదాంబోరీస్ త్వర త్వరగా అక్కడనుంచి లేచి వెళ్ళింది.

"ఆగు, ఆగు! నీవు వద్దు!" అని వృద్ధుడు ఆమెను ఆపి, "నీవు వెదతావా మైఖేల్ ఇవనొవిచ్?"అని అడిగాడు. మైఖేల్ ఇవనొవిచ్ గది దాటి వెళ్ళాడో లేదో రాకుమారుడు తక్షణం లేచి, తన తువాలు తీసి టేబిల్ మీద విసిరేసి "ఇతన్ని ఏ వస్తువు కోసం పంపినా వెదికి తీసుకురాలేడు. నా కాగితాలన్నీ చిందరవందర చేసేస్తాడు" అంటూ అతని వెంట పరుగెత్తాడు.

మేరియా రాకుమారి, మదాంబోరీస్,చిన్న నికోలస్ ఒకరి వంక ఒకరు చూచు కున్నారు. కాని ఎవరూ ఏమీ మాట్లాడలేదు. వెంటనే వృద్ధుడు మైఖేల్ ఇవనొవిచ్‌తో కలిసి తిరిగివచ్చాడు. అతని చేతిలో ఉత్తరం, కొత్త ఇంటి కట్టుబడి తాలూకు వ్రాసుకున్న ప్లానులు ఉన్నాయి. వాటిని టేబిల్‌మీద ప్లేటుప్రక్కనే ఉంచి ఉత్తరం చదవకుండానే భోజనం ముగించాడు.

వారు డ్రాయింగ్ రూంలోకి వెళ్ళగానే ఆయన తన కుమార్తె చేతికిచ్చాడు. ఆవిడ ఆ ఉత్తరాన్ని బిగ్గరగా చదివి తండ్రి వంక చూచింది. కాని ఆయన తన కొత్త భవనం తాలూకు ప్లానులను చూస్తూ ఆలోచనలో మునిగిపోయి ఆ విషయం గమనించలేదు. ఆమె చదివింది వినిపించుకోలేదు కూడా.

"దీన్ని గురించి నీవేమనుకుంటున్నావు రాకుమారా?" అని అడిగాడు డెసాలీ.

"నేనా, నేనా?" అన్నాడు రాకుమారుడు ముక్తసరిగా, కళ్ళెత్తి చూడకుండా.

"యుద్ధం మనకు దాపుకు వచ్చేటట్లుగా ఉంది" అన్నాడు మళ్ళీ డెసాలీ.

"యుద్ధమా? మనకు దాపుకు వస్తుందా? నేనిదివరకే చెప్పాను. మళ్ళీ

ఇప్పుడు కూడా చెపుతున్నాను. యుద్ధం జరుగుతున్నది పోలెండులో. శత్రువులు నిమెన్ నదిని దాటి ఎన్నటికీ రాలేరు" అన్నాడు వృద్ధుడు.

డెసాలీ ఆయన వంక నివ్వెరపోయి చూచాడు. నిమెన్ దాటి రాలేకపోవడ మేమిటి? శత్రువులప్పుడే డిసీపెర్ వరకూ కూడా వచ్చారు. భూగోళం మరిచి పోయిన మేరియా రాకుమారి తప్ప ఆవిడ తండ్రి చెప్పిన మాట నిజమని మరెవ్వరూ అనుకోలేదు.

"మంచు కరగగానే పోలెండు మంచులో వారంతా పూడుకునిపోతారు. బెనిక్ సన్ రష్యాపై ఎప్పుడో దండయాత్ర సాగించవలసిన మాట. అప్పుడు పరిస్థితులు ఇలా ఉండేవి కావు" అన్నాడు వృద్ధుడు. అప్పుడాయన మనస్సు 1807 లోని దండయాత్రను గురించి మాత్రమే ఆలోచిస్తోంది.

"కాని ఒక్క విషయం." అంటూ డెసాలీ కొంచెం భయంతో "ఈ ఉత్త రాన్నిబట్టి ఫ్రెంచివారప్పుడే వి టెబ్స్కను పట్టుకున్నారని తెలుస్తోంది." అన్నాడు.

"ఉత్తరాన్ని బట్టా? అవునవును." అన్నాడు వృద్ధుడు. ఆయన ముఖాన మబ్బుతెర కమ్మినట్టయింది. "అవును. అలాగే వ్రాస్తున్నాడు. కాని ఫ్రెంచివారె క్కడో ఓడిపోయారు. ఆ విషయం నాకు జ్ఞాపకం లేదు...ఏదో నది ఒడ్డున అను కుంటాను." అన్నాడు డెసాలీ. ఒకమాటు కళ్ళుదించి ఉత్తరం వంక చూచాడు.

"ఆండ్రూ రాకుమారుడు ఆ విషయం వ్రాయలేదు." అన్నాడు డెసాలీ మెల్లగా.

"వ్రాయలేదు ? అయితే నేను కల్పించానంటావా ?"

ఆ తరువాత ఎవరూ మాట్లాడలేదు.

"సరే, సరే మైఖేల్ ఇవనొవిచ్." అంటూ హఠాత్తుగా వృద్ధుడు "ఈ ప్లానులో ఒక చిన్న తప్పుంది. దాన్ని నీ వెలా సరిచేయ దలుచుకున్నావో చెప్పు?" అని అడిగాడు తన ఇంటి ప్లాను చూపిస్తూ.

మైఖేల్ ఇవనొవిచ్ వెంటనే రాకుమారుని వద్దకు వెళ్ళి ఆయనతో కొద్దిసేపు మాట్లాడాడు. రాకుమారుడు డెసాలీ వంక, తన కుమార్తె వంక ఒకమాటు కోపంతో చూచి గదిలోనుంచి వెళ్ళిపోయాడు. మేరియా రాకుమారికి ట్యూటర్ ముఖంలో ఒక బాధాపూరితమైన ఆశ్చర్యం కనిపించింది. కాని ఆవిడ దానికి కారణం అడగదలుచు కోలేదు. అందరూ ఎంతగానో చర్చించిన ఉత్తరం డ్రాయింగ్ రూంలో టేబిల్పైనే పడేసి ఉంది. మైఖేల్ ఇవనొవిచ్ సాయంకాలం ఆ ఉత్తరం కోసం వచ్చాడు. మేరియా రాకుమారి ఆ ఉత్తరం అతని కిచ్చింది. తన తండ్రి ఏం చేస్తున్నాడని అడిగింది. తరువాత మళ్ళీ ఆ ప్రశ్న ఎందుకడిగానా అని అనుకుంది.

"చాలా పనిలో ఉన్నారు." అన్నాడు భవన నిర్మాతయైన మైఖేల్ ఇవనొవిచ్. అప్పుడతను ఒక విధమైన చిరునవ్వు నవ్వాడు. ఆవిడ నెత్తురు గడ్డకట్టుకుని పోయింది.

"ఇల్లు కట్టడం విషయం చూచుకుంటున్నాడు.... కాసేపు చదువుకున్నాడు. ఇప్పుడు టేబిల్ సొరుగులో దేనికోసమో వెదుకుతున్నాడు. బహుశా వీలునామా వ్రాస్తాడను కుంటాను." అన్నాడు మళ్ళీ మైఖేల్ ఇవనొవిచ్ కొద్ది సేపటినుంచీ తను తరువాత బయట పెట్టవలసిన కాగితాలను ఒకచోట ఏర్పరుస్తున్నాడు. "అల్పటిచ్‌ని స్మోలెన్స్కకు పంపుతూ ఉన్నాడా ?" అని అడిగిందామె.

"అవును. బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాడు. ఉత్తర్వులు రాగానేబయలు దేరతాడు." అని చెప్పాడు మైఖేల్ ఇవనొవిచ్.

## 87

మైఖేల్ మళ్ళీ గదిలోకి వెళ్ళేసరికి వృద్ధ రాకుమారుడు బీరువా దగ్గర కూచుని ఉన్నాడు. కళ్ళజోడు, ఎండసోకకుండా కళ్ళకు షేడూ పెట్టుకుని ఉన్నాడు. చేతిలో ఒక పెద్ద పుస్తకముంది. ఆ పుస్తకంలో తను వ్రాసిన "నోట్సు" చదువుతూ ఉన్నాడు. ఆ పుస్తకాన్ని ఆయన "నోట్సు"అని పిలుస్తాడు. తను చనిపోయిన తరువాత దాన్ని జార్‌కు అందచేయాలని ఆయన అభిలాష. అది వ్రాసిన రోజులు జ్ఞాపకంవచ్చి ఆయన కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తన కుమారుడు వ్రాసిన ఉత్తరం తీసుకొని జేబులో పెట్టుకున్నాడు. తరువాత అల్పటిచ్ కోసం కబురు పంపి, అతని కిలా ఉత్తర్వు లిచ్చాడు.

"మొదటి విషయం" అంటూ మొదలుపెట్టాడు, స్మోలెన్స్క నుంచి తనకు కావలసిన విషయాల పట్టిక చూస్తూ, "ఎనిమిది రీముల లెటరు పేపరు కొనుక్కు రావాలి. ఎనిమిది రీములు. తెలిసిందా ? ఇలా ఉండాలి చూడు. గిల్టు అంచువేసి ఇలా ఉండాలి. తరువాత సీలు చేయడానికి లక్క, వార్నిషు కావాలి. తరువాత నా ఉత్తరాన్ని నీవు స్వయంగా వెళ్ళి గవర్నర్ కివ్వాలి" ఇలా మాట్లాడుతూ ఆయన గదిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. తరువాత కొత్త భవనానికి తాళాలు కొనడం మరిచి పోవద్దని చెప్పాడు. తను కనిపెట్టిన రకం తాళాలే తీసుకురమ్మని చెప్పాడు. తన వీలునామా, నోట్సు ఉంచడానికి ఒకపెద్ద కాగితాలపెట్టె కూడా తీసుకురమ్మ న్నాడు. ఇలా రెండుగంటల సేపు మాట్లాడి హఠాత్తుగా కూచుని కళ్ళు మూసు కున్నాడు. ఒక క్షణంపాటు నిద్రపోయాడు. అల్పటిచ్ గదిలోనుంచి వెడుతూ ఆయన్ను మళ్ళీ మేలుకొలిపాడు. "సరే వెళ్ళు. మరేమైనా కావలసివస్తే నీ కోసం కబురు పంపుతాను." అన్నాడాయన.

తరువాత ఆయన డెస్కు దగ్గరకు వెళ్ళి కాగితాలన్నీ జాగ్రత్తగా సవరించి పెట్టాడు. గవర్నర్‌కు ఉత్తరం వ్రాయటానికి కూచున్నాడు. ఉత్తరం ముగించేసరికి చాలా ఆలస్యమవుతోంది. ఆయనకు అలసట, నిద్ర వస్తున్నాయి. కాని ఆయనకు విశ్రాంతి చిక్కేట్లు కనిపించడం లేదు. ఆయన పడుకోవడానికి వెళ్ళగానే ఎన్నో భావాలు ఆయన మనస్సులోకి వచ్చి నిద్రలేకుండా చేస్తాయి. టిహాన్‌ను పిలిచి ఆ రాత్రికి తన పడక ఎక్కడ వేయించు కోవాలా అని గదులన్నీ తిరిగి చూచాడు. ప్రతి మూలా చూచాడు. కాని ఆయనకు నచ్చిన చోటు ఎక్కడా కనిపించలేదు. ఆయన మామూలుగా పడుకునే చోటు తలుచుకుంటే చాలు, భయం వేస్తుంది. అక్కడాయన మనస్సులోకి అనేక భావాలొస్తుంటాయి. చివరకెంతో ఆలోచించిన మీదట గోడకు, పియానోకు మధ్య పడక వేయించుకోవాలనుకున్నాడు. ఇంత వరకూ ఆయన అక్కడ ఎప్పుడూ పడుకోలేదు. టిహాన్‌ను తన క్యాంప్ కాట్ అక్కడ వెయ్యమని కోరాడు. సేవకుల సహాయంతో ఆ మంచం అతనక్కడ వేశాడు.

"అలా కాదు, అలాకాదు." అంటూ ఆ మంచం తను కూడా సర్దసాగాడు వృద్ధుడు. "సరే, ఇక కాస్త విశ్రాంతి తీసుకుంటాను" అంటూ తన దుస్తులు మార్చమని కోరాడు.

కష్టంమీద కోటు, ట్రౌజర్లు విప్పి, రాకుమారుడు మంచంమీద వాలి, పసుపు పచ్చగా ఉన్న తన కాళ్ళవంక చూచుకుంటూ ఏదో ఆలోచనలో పడిపోయాడు. పక్కమీద కాళ్ళుచాచి పడుకోబోయే ముందు కాస్త ఆలోచించాడు. "భగవంతుడా! ఏమిటీ బరువు ? నన్ను త్వరగా తీసుకెళ్ళవా ? ఈ బరువు తప్పించవా ?" అంటూ గొణుక్కున్నాడు. చివర కెలాగైతేనేం కాళ్ళుచాచి పడుకున్నాడు. కాని ఆయన పడుకున్నాడో లేదో మంచం అటూ ఇటూ ఊగిసలాడసాగింది. అది ఒక ప్రాణం వున్న వస్తువులాగా కదులుతున్నట్లనిపించింది. ప్రతి రాత్రీ ఇలా జరగడం మామూలు. రాకుమారుడు మూసుకున్న కళ్ళు తెరిచి "శాంతి లేదు ! ఎవరు శాంతి లేకుండా చేస్తారు !" అన్నాడు, ఎవరినో శపిస్తున్నట్లుగా. "కాని నేను పడుకున్న తరువాత ఏదో ముఖ్యమైన విషయం ఆలోచించాలనుకున్నానే ! ఏమిటది ? తాళాల విషయమా ? లేదు. వాటికి నేను ఆర్డరిచ్చాను. అది కాదు, మేరియా రాకుమారి, ఆ వెధవ డెసాలీ అప్పుడా వెర్రివాగుడు వాగుతోంటే నే నేమిటి మరిచిపోయింది ? —ఏమిటో ? -ఏదో నా జేబులో పెట్టుకోవాలనుకున్నాను. పెట్టుకున్నా ననుకుంటాను ఆ తరువాత ? నాకు జ్ఞాపకం రావడం లేదే ! టిహాన్ ! ఇలారా మనం భోజన సమయంలో ఏమిటి మాట్లాడింది ?"

"మైఖేల్ ఆంద్రూ రాకుమారుని గురించి..." అని చెప్పాడు టిహాన్.

"సరేలే, ఇక మాట్లాడకు...నాకు నా కుమారుడి ఉత్తరంవిషయం తెలుసులే. అవును. మేరియా రాకుమారి కూడా చదివింది. డిసాలీ విటెబ్స్కను గురించి మాట్లాడుతున్నాడు...నేనిప్పుడా విషయం చదువుతాను" అన్నాడు వృద్ధుడు.

వెంటనే ఆయన ఆ ఉత్తరం తెప్పించుకున్నాడు. తన చిన్న టేబిల్ దగ్గర పెట్టించుకున్నాడు. దాని మీద లెమనేడ్, కొవ్వొత్తి ఉన్నాయి. తరువాత కళ్ళజోడు పెట్టుకుని కొడుకు వ్రాసిన ఉత్తరం జాగ్రత్తగా చదవసాగాడు.తరువాత నిశ్శబ్దంగా ఉన్న ఆ రాత్రివేళ మసకగా ఉన్న కొవ్వొత్తి దీపపు కాంతిలో ఆ ఉత్తరంలో వ్రాసిన వార్తల తాలూకు సత్యాన్ని ఆయన ఒక క్షణమైనా అర్థం చేసుకోగలిగాడు. "ఫ్రెంచివారు విటబ్స్క దగ్గరికి వచ్చారు.నాలుగు మజిలీలలో స్మోలెన్స్క చేరతారు ...ఈపాటికి అక్కడ ఉండి ఉంటారు. ఇదిగో టిషా...!"

టిహాన్ ఉలిక్కిపడి లేచాడు. "ఏమీ లేదు, ఏమీ లేదు" అన్నాడు మళ్ళీ వృద్ధుడు. ఉత్తరం కొవ్వొత్తి దీపం క్రిందపెట్టి కళ్ళు మూసుకున్నాడు. ఆయన కళ్ళముందు డాన్యూబ్‌నది, ఒడ్డున చెట్లు, చక్కగా ఉన్న పగటి వేళ, రష్యన్‌సేన గుడారాలు, తను యువకుడైన జనరల్—ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు. పొటెమ్ కిన్ గుడారంలోకి వెడుతున్నాడు. అతని హృదయంలో ఆ జ్ఞాపకం రాగానే అసూయ.... మళ్ళీ మొదటి ఇంటర్వ్యూలో ప్రతిమాటా వినిపించింది. తరువాత ఒక లావుగా బొద్దుగా ఉన్న స్త్రీ ఆ ప్రక్కనే కనిపించింది. ఆవిడ చక్రవర్తిని. తనను చూచి చిరునవ్వు నవ్వుతూ తనతో మాట్లాడుతోంది. తన ముఖంలో మార్పు కనిపిస్తోంది. తరువాత ఆవిడ తన మంచంమీద పడుకుంటుంది. ఆవిడ చెయ్యి ముద్దాడడం కోసం తన జుబోవ్‌తో తగాదా పడతాడు.

మళ్ళీ ఆ రోజులు వస్తే ఎంత బాగుంటుంది ! ఇదంతా అదృశ్యమైపోయి వారు నన్ను శాంతిగా వదిలితే ఎంత హాయిగా ఉంటుంది!" అని కలవరించాడు వృద్ధుడు.

# 88

రాకుమారుడు, ఆయన సేవకుడు మాట్లాడుకుంటూ ఉండగా డెసాలీ రాకుమార్తె దగ్గరికి వెళ్ళి ఆమె అన్న వ్రాసిన ఉత్తరాన్నిబట్టి లిస్సీ — గోరీలో ఉండడం క్షేమం కాదని చెప్పాడు. స్మోలెన్స్క అక్కడికి అరవై వెర్‌స్టల దూరంలో ఉన్నది. మాస్కో రహదారి అక్కడికి మూడు వెర్‌స్టల దూరంలో మాత్రమే ఉన్నది అందుచేత వారి క్షేమం కోసం రాకుమారుడి ఆరోగ్యం సరిగా లేక పోవడం వల్లను, పరిస్థితులెలా ఉన్నాయో తమకు తెలప వలసిందని కోరుతూ ఆ రాష్ట్రి

గవర్నర్‌కు ఒక ఉత్తరం వ్రాయమని డెసాలీ, రాకుమారుని కోరాడు. ఆ ఉత్తరం డెసాలీయే వ్రాశాడు. మేరియా రాకుమారి దానిపై సంతకం చేసింది. తరువాత డెసాలీ ఆ ఉత్తరాన్ని అల్పటిచ్ ద్వారా గవర్నర్‌కు పంపించాడు.

అల్పటిచ్ వెంటనే ఆ ఉత్తరాన్ని తీసుకుని ఒక పెద్ద బండి మీద బయలు దేరాడు. గుర్రాల గంటల చప్పుడు వినిపించకుండా ఉండడం కోసం వాటి చుట్టూ కాగితాలు చుట్టారు. ఆ చుట్టుపట్ల ఏ మాత్రం శబ్దం వినిపించినా రాకుమారుడు ఒప్పు కోవడం లేదు. కాని ఆ గంటల మోతంటే అల్పటిచ్ కెంతో ఇష్టం. అందుచేత బండి ఇంటి నుంచి దూరంగా వెళ్ళిన తరువాత గంటలకు చుట్టిన కాగితాలు ఊడతీద్దా మనుకున్నాడు.

అల్పటిచ్ ప్రయాణం కాగానే అతని బంధువులంతా అతని చుట్టూ పోగ య్యారు. ఒక గుమాస్తా, ఒక వంట మనిషి, ఇద్దరు ముసలిస్త్రీలు, ఒక కుర్రవాడు; వీరంతా పోగయ్యారు. అతని కుమార్తె, ముసలిస్త్రీలు వీరంతా అతనితోపాటు తామూ బండిలో ఎక్కడానికి ప్రయత్నించారు.

కాని అల్పటిచ్ "ఏమిటి ఆడవాళ్ళ గొడవ?"అంటూ తన యజమానిలాగానే తనూ వారిని కేకలు వేశాడు. తరువాత ఇంటి విషయంలో చేయవలసిన పనులను గురించి వాళ్ళతో చెప్పి, పిమ్మట తన హేటు తీసి మూడుసార్లు క్రాస్‌గుర్తు చేసు కున్నాడు. ఈ క్రాస్ చేసుకోవటంలో మాత్రం అతనికీ, అతని యజమానికీ పోలిక లేదు. ఏదైనా ప్రమాదం జరిగితే అక్కడ మాత్రం ఉండిపోకు. వెంటనే వచ్చెసెయ్ జకొవ్ అల్పటిచ్!" అన్నది అతని భార్య. యుద్ధాన్ని గురించిన పుకార్లు విని ఆవిడ భయపడ సాగింది. "మమ్మల్ని మాత్రం మరిచిపోక కనిపెట్టి ఉండు." అన్నది మళ్ళీ.

"అబ్బబ్బ! ఏమిటీ ఆడవాళ్ళ గొడవ?" అని అల్పటిచ్ మళ్ళీ వారిని కసురు కున్నాడు.

తరువాత బండి పొలాల్లోగుండా దోవచేసుకుని పోతోంది. అతనొక కంటితో ఆ పొలాలను చూస్తున్నాడు. రై ధాన్యం పండి పసుపువన్నెకు తిరుగుతోంది. ఓట్లు ఇంకా పచ్చగానే ఉన్నాయి. వేసవికాలంలో వేసిన గోధుమ ఈసారి ఇంకా ఏపుగా పెరిగింది.

గుర్రాలకు నీళ్ళు పెట్టడం కోసం దోవలో రెండుసార్లు ఆగాడు. ఆగష్టు 16 సాయంకాలానికి స్మోలెన్స్క నగరం చేరుకున్నాడు. త్రోవలో ఎన్నో సామాన్ల బండ్లు కనిపించాయి. సైనిక దళాలు కూడా కనిపించాయి. స్మోలెన్స్క దాపుకు రాగానే దూరం నుంచి ఫిరంగి మోతలు వింటున్నట్లు ఊహించుకున్నాడు. కాని దానివల్ల అతనేమీ భయపడలేదు. అతన్ని మరింత ఆశ్చర్యపరిచిన విషయం పంట

కోస్తున్న చక్కని ఓట్ల పొలంలో ఒక గుడారం కనిపించడమే. అక్కడ గుర్రాలు కట్టేసి ఉన్నాయి. కాని అతను తన ఆలోచనలలో మునిగిపోయి ఈ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. ముప్పయి సంవత్సరాలనుంచీ అతను తన జీవితంలో తన యజమాని కోర్కెలు నెరవేర్చడానికే అలవాటు పడ్డాడు. అందుచేత ఆ విషయానికి సంబంధించిన మరే విషయమూ కూడా అతని మనస్సులో నాటుకోవడమనేది ఉండదు. నిజానికి ఆ విషయం అతని దృష్టిలో లేనట్లే.

ఊరి పరిసరాలకు చేరగానే ఒక సత్రం ముందు బండి ఆపాడు. ఆ సత్రం ఫెరపోంటోవ్ అనే అతను నడుపుతున్నాడు. ఆల్పటిచ్ కెప్పుడూ ఆ సత్రంలో మకాం చెయ్యడం అలవాటు. ఈ ఫెరపోంటోవ్ పూర్వం ఒకప్పుడు ఆల్పటిచ్ ద్వారా బోల్కోన్స్కి రాకుమారుడి చిన్న అడవి ఒకటి కొన్నాడు. అది కొన్న తరువాత అతను మెల్ల మెల్లగా లాభం సంపాదించి ఒక ఇల్లు, ఒక సత్రము కట్టి పిండి వ్యాపారం చేస్తున్నాడు. అతను నలభై సంవత్సరాల రైతు. నల్లటిజుట్టు, చిన్న బొజ్జ, చట్టి ముక్కు, దట్టమైన పెదవులు చూపులకు హాయిగా కనిపిస్తుంటాడు. ముఖాన మాత్రం రెండు కణితులున్నాయి. అతను తలుపు కానుకొని నిలుచుని ఉన్నాడు. రంగు చొక్కా, వెయిస్ట్కోటు వేసుకున్నాడు.

"వచ్చావా, జాకోబ్ ఆల్పటిచ్? మంచిది, రా రా! అందరూ ఊళ్ళో నుంచి వెళ్ళిపోతుంటే నీవు వస్తున్నావేమిటి?" అన్నాడు ఫెరపోంటోవ్.

"ఏం? ఏం జరిగింది?" అని అడిగాడు ఆల్పటిచ్.

"ఫ్రెంచి వాళ్ళను చూచి భయపడుతున్నారు వెధవలు!"

"ఆ, ఏముంది? అంతా ముసలమ్మ కబుర్లు."

"నేనూ అదేమాట అంటున్నాను. ఫ్రెంచివాణ్ని లోపలికి రానివ్వకుండా ఉండడం కోసం ఉత్తర్వులు జారీ చేశారని చెపుతున్నారు. ఇక వాళ్ళెలా వస్తారు? కాని రైతులు మాత్రం ఇది అదనుగా తీసుకుని సామాన్లబండి ఒక్కొక్కటి మూడు రూబుళ్ళ చొప్పున వసూలు చేస్తున్నారు" అని చెప్పాడు ఫెరపోంటోవ్. జాకోబ్ ఆల్పటిచ్ ఇదంతా మాట్లాడకుండా విన్నాడు. మధ్యలో మాత్రం తన గుర్రాలకు మేత ఇవ్వమని అడిగాడు. తరువాత కొంచెం టీ తీసుకుని వెళ్ళి పడుకున్నాడు.

ఆ రాత్రంతా సైనికదళాలు ఆ సత్రం ప్రక్కనుంచి వెడుతూనే ఉన్నాయి. కాని ఆల్పటిచ్కి ఆ శబ్దమేమీ వినిపించలేదు. మరుసటిరోజు తన మామూలు ప్రకారం ఊళ్ళో తన పని చూచుకోవడాని వెళ్ళాడు. ఉదయం నగరానికి అవతల ఫిరంగి మోతలు, తుపాకి మోతలు వినిపించసాగాయి. వీధులనిండా సోల్జర్లు, గుర్రపు బగ్గీలు తోలేవాళ్ళు మామూలుగా తిరుగుతున్నారు. దుకాణదార్లు తెరిచి ఉన్న మకాణాల వాకిళ్ళలో నిలుచుని ఉన్నారు. చర్చిలలో ప్రార్థనలు జరుగుతున్నాయి.

అల్పటిచ్ తన మామూలు ప్రకారం తన పనులుచూచుకుంటున్నాడు. లా కోర్టులకు వెళ్ళాడు. పోస్టాఫీసుకు వెళ్ళాడు. గవర్నర్ దగ్గరికి వెళ్ళాడు. ఎక్కడికి వెళ్ళినా అంతా యుద్ధం సంగతే చెప్పుకుంటున్నారు. శత్రువు నగరం మీదికి తరుముకొని వస్తున్నాడని చెపుతున్నారు. ప్రతివాళ్ళూ తమ ప్రక్కవాళ్ళకు ధైర్యం చెపుతున్నారు.

గవర్నర్ భవనం వెలుపల జనం గుంపు కూడి ఉండడం అల్పటిచ్‌కి కనిపించింది. కోసక్కుల రక్షణసేన, గవర్నరు ప్రయాణపు బగ్గీ కనిపించాయి. మెట్ల మీద ఇద్దరు పెద్ద మనుష్యులు కనిపించారు. అందులో ఒకతను జిల్లాకు పెద్ద. అతన్ని అల్పటిచ్ ఎరుగును.

"ఇదేం గమ్మత్తు కాదు! బ్రహ్మచారి అయితే పరవాలేదు. అతను ఒక్కడే కాబట్టి ముందు వెనక ఎవరూ ఉండరు. కాని పదముగ్గురు పిల్లలు, ఆస్తిపాస్తులు ఉన్నవాళ్ళ సంగతేమిటి ? ఈ అధికార్లంతా ఎందుకున్నట్లు ? ఇక మనకు నాశనం తప్ప మరేంలేదా ఏమిటి? వీళ్ళను ఉరితీసినా పాపంలేదు !" అంటున్నాడతను. "ఊరుకో, ఊరుకో! కాస్త నింపాదిగా మాట్లాడు!" అంటున్నాడు రెండో అతను.

"వింటే నా కొచ్చిన భయమేమీలేదు! వింటే వింటారు?"

"సరే. అల్పటిచ్! నీ వేమిటి పనిమీద వచ్చావు?"

"నేను అయ్యగారి దగ్గర్నుంచి ఉత్తర్వులు తీసుకుని వచ్చాను. గవర్నర్‌ను చూడ్డానికి వచ్చాను." అన్నాడు అల్పటిచ్ సగర్వంగా, తనచేతిని వెయిస్టు కోటు జేబులో ఉంచుకుంటూ. "అసలు పరిస్థితులు ఎలా ఉన్నాయో తెలుసు కోవడానికి వచ్చాను" అన్నాడు.

సరే, వెళ్ళి తెలుసుకో. ఇక్కడొక బండికూడా లేదు. ఆ చప్పుడు వింటున్నావా? వీళ్ళు మనకు నాశనం తీసుకొచ్చిపెట్టారు!"

అల్పటిచ్ విచారంగా తల ఊపి లోపలికి వెళ్ళాడు, వెయిటింగ్‌రూం జనంతో కిటకిట లాడిపోతోంది. వర్తకులు, స్త్రీలు, గుమాస్తాలు కూచుని ఉన్నారు. లోపలి గది తలుపు తెరుచుకుంది. అంతాలేచి లోపలికి వెళ్ళబోయారు. కాని అంతలో ఒక ఆఫీసరు బయటికి వచ్చాడు. అతని ముఖంలో భయం కనిపిస్తోంది. అతను వర్తకులతో కొద్ది మాటలు చెప్పాడు. లావుగా వున్న ఒక గుమస్తాను పిలిచి అతన్ని వెంటతీసుకుని వారిని పట్టించుకోకుండా అక్కడనుంచి వెళ్ళిపోయాడు. అల్పటిచ్ ముందుకు వచ్చాడు. ఆ ఆఫీసరు మళ్ళీ తిరిగిరాగానే అల్పటిచ్ రెండు ఉత్తరాలు తీసి ఎడమచెయ్యి వెయిస్టు కోటులో పెట్టుకుని ఇలా అన్నాడు:

"జనరల్ బోల్‌కోన్‌స్కీ రాకుమారిని దగ్గరనుంచి వస్తున్నాను. గవర్నర్ గారైన బేరన్ ఆష్క్ కోసం వచ్చాను" ఇలా అంటూ ఆ ఉత్తరాలు అతని కందించాడు. కొద్ది నిముషాల తరువాత గవర్నర్, అల్పటిచ్ కోసం పిలవనంపాడు.

"రాకుమారుడితోను, రాకుమారితోను చెప్పు. నాకే విషయమూ తెలీదు. ఇవిగో నా ఉత్తర్వులు" అంటూ ఒక అచ్చు కాగితాన్ని ఆల్పటిచ్ కిచ్చాడు గవర్నర్. తరువాత మళ్ళీ "రాకుమారుడికి జబ్బుగా ఉందని తెలుస్తోంది. ఆయన మాస్కో వెళ్ళడం మంచిదని సలహా ఇస్తున్నాను. నేనుకూడా అక్కడికే వెడుతున్నాను. ఆయనతో..." అని అంటూ వాక్యం ముగించేలోగా ఒక ఆఫీసరు అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతని ముఖం నిండా చెమట కారుతోంది. అతను పరుగెత్తుకుంటూ వచ్చి ఫ్రెంచి భాషలో ఏవో కొద్దిమాటలు చెప్పాడు. అది వినగానే గవర్నర్ ముఖం భయంతో పాలిపోయింది.

"నీవు వెళ్ళు, ఇక నీవు వెళ్ళు" అంటూ గవర్నర్, ఆల్పటిచ్‌ని చూచి తల ఊపి వెంటనే గదిలోనుంచి వెళ్ళిపోయాడు. అక్కడున్న జనసమూహమంతా ఆయన ఏమి వార్త చెపుతాడో అని ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారు.

తరువాత ఆల్పటిచ్ మళ్ళీ తన బసకు వెళ్ళగానే కాల్పులు మరీ దగ్గరికి రావడం అతనికి వినిపించింది.

గవర్నర్ అతనికిచ్చిన అచ్చు కాగితంలో ఇలా ఉంది:

"ప్రస్తుతము స్మోలెన్స్క నగరానికి వచ్చిన ప్రమాదమేమీ లేదని మీకు గట్టిగా చెప్పగలను. త్వరలో ఎలాంటి ప్రమాదమూ రాదుకూడా. ఒకవైపు నుంచి నేను, మరొక వైపునుంచి బెగ్రేషియన్ రాకుమారుడు ఈ నెల 22 తారీఖున కలుసుకొనడం కోసం అక్కడికి వస్తున్నాం. మా ఇరుసేనలూ అక్కడ కలుసుకుని మీ రాష్ట్రంలో ఉన్న ప్రజలను రక్షింపగలవు. అందుచేత మీరు స్మోలెన్స్క ప్రజలకు ఎలాంటి ప్రమాదము లేదని మా తరఫున హామీ ఇచ్చి విశ్వాసం కలిగించగలరని నమ్ముతున్నాము. (బార్క్లే డీ టాలీ, స్మోలెన్స్క గవర్నరైన బేరన్ అష్కకు అందచేసిన ఉత్తరం—1812)"

ఏమైనా నగర వీధుల నిండా తిరుగుతున్న జనం ముఖాల్లో ఆందోళన కనిపిస్తోంది. ఎక్కడ చూచినా ఆందోళన, భయం, ప్రతి మూలలోను ఇండ్లలోంచి వారి వారి సామాన్లు వేసుకుని వస్తున్న బండ్లు కనిపిస్తున్నాయి. బండ్లన్నీ నగరం గేట్లు దాటి వెలుపలికి వెడుతున్నాయి. కొన్ని బండ్లు ఫెరపోంటోవ్ సత్రం ప్రక్కనున్న దుకాణం ముందు నిలుచున్నాయి. స్త్రీలు రొదగా ఏడుస్తూ ఏదేదో మాట్లాడుకుంటున్నారు. ఒక కుక్క మొరిగి గుర్రం తలమీద ఎగిరి కూచుంది.

ఆల్పటిచ్ సత్రం పెరట్లోకి వెళ్ళి పెరట్లో నుంచి తన బండి దగ్గరికి వెళ్ళాడు. బండివాడు నిద్రపోతున్నాడు. అతన్ని నిద్ర లేపాడు. గుర్రాలు కట్టమని అతనితో చెప్పాడు. తరువాత మళ్ళీ ఇంట్లోకి వెళ్ళాడు. ఇంటి యజమాని గదిలో ఏదో పిల్లల అల్లరి వినిపిస్తోంది. స్త్రీలు కేకలు వేస్తున్నారు. వంట మనిషి భయపడిన కోడిపెట్టలాగా హాల్లో అటూ ఇటూ తిరుగుతోంది.

"ఆవిడను కొడుతూ ఉన్నాడు! చచ్చేటట్టు కొడుతూ ఉన్నాడు!" అని అరుస్తోంది వంట మనిషి.

"ఎందుకు?" అని అడిగాడు అల్పటిచ్.

"తనను కూడా తీసుకు వెళ్ళమని కోరింది. 'నన్ను కూడా తీసుకువెళ్ళండి. నన్నూ, నా పిల్ల లనూ ఇక్కడ చనిపోనివ్వ వద్దు. ప్రతివారు వెడుతున్నారు. ఇక మనమెందు కుండాలి ఇక్కడ?' ఆ ఇల్లా లిలా అనగానే చచ్చేటట్టు కొట్టాడు." అని చెప్పింది వంట మనిషి.

అల్పటిచ్ మరేం మాట్లాడకుండా తల ఊపి తను కొన్న సామానులు పెట్టు కున్న గదిలోకి వెళ్ళాడు. "రాక్షసుడు!" అని కేకలు వేస్తోంది ఆ స్త్రీ. ఆవిడ ముఖం పాలిపోయి ఉంది. చిరుగు బట్టలు, చేతుల్లో పసిబిడ్డను ఎత్తుకుని ఉంది. బయటకు పరుగెత్తుకుంటూ వచ్చి మెట్లు దిగి వెళ్ళిపోయింది. ఫెరపోంటోవ్ ఆవిడ వెనకాలే పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. కాని అల్పటిచ్‌ని చూచి ఆగిపోయి, వెయిస్ట్‌కోటు సవరించుకుని, ఆవులించి చేతులు చాచి అతన్ని తీసుకుని మళ్ళీ తన గదిలోకి వెళ్ళి పోయాడు.

"ఏమిటి వెడుతున్నావా?" అని అడిగాడు ఫెరపోంటోవ్.

అల్పటిచ్ మాట్లాడకుండా తన సామానులన్నీ సరిచూచుకుని బిల్లు కోసం అడిగాడు.

"అప్పుడే వెడుతున్నావా? మరి కొంచెంసేపు ఉండకూడదూ? చెప్పు, గవర్నర్ ఏం చేస్తున్నాడో? అంతా కుదిరినట్టేనా?" అని మళ్ళీ అడిగాడు ఫెర పోంటోవ్.

గవర్నర్ ఏదో అంతా అస్పష్టంగా చెప్పాడని అల్పటిచ్ అతనికి తెలియ చేశాడు.

"ఇది మన వ్యాపారానికి మంచిదే! నీకు తెలుసా?" అన్నాడు ఫెరపోంటోవ్. "సెలివినోవ్ నిన్న బస్తా పిండి తొమ్మిది రూబుళ్ళకు అమ్మాడు తెలుసా! సరే కాని నీవు కొంచెం టీ తీసుకుంటావా?" అన్నాడు.

గుర్రాలు కడుతూ ఉండగా అల్పటిచ్-ఫెరపోంటోవ్‌తో కలిసి కొంచెం టీ తీసుకున్నాడు. ఇద్దరూ టీ త్రాగుతూ ధాన్యం ధరలను గురించి, పంటలను గురించి మాట్లాడుకున్నారు.

"ఇప్పుడక్కడ చప్పుడు ఎక్కువగా వినిపించడం లేదు. మనవాళ్ళు గెలిచా రనుకుంటాను: శత్రువును లోపలికి రానీయకుండా చేస్తామని చెప్పారు. నది దగ్గర అంతా చేరి ఉన్నారు" అన్నాడు ఫెరపోంటోవ్.

అల్పటిచ్ తన లెక్కలు సరిచూచుకున్నాడు. బండి తయారై రోడ్డు మీదికి వెళ్ళడం అతనికి వినిపించింది. అతను కిటికీ వంక చూచాడు. అప్పటికి మధ్యాహ్నం దాటింది. అయినా ఎండ బాగా కాస్తోంది. ఎక్కడా నీడ కూడా కనిపించడం లేదు. అల్పటిచ్ బయటి వాకిలి దగ్గరికి వెళ్ళబోయాడు. అంతలో హఠాత్తుగా దూరం నుంచి ఒక విచిత్రమైన ధ్వని దూసుకుని వచ్చింది. తరువాత దాని వెంటనే కిటికీ తలుపులు కొట్టుకునేటట్లుగా ఫిరంగి మ్రోతలు వినిపించాయి.

అల్పటిచ్ వీధిలోకి వెళ్ళి చూచాడు. ఇద్దరు మనుష్యులు వంతెనవైపు పరుగు తీస్తూ ఉండడం కనిపించింది. ఇప్పుడు అన్నివైపుల నుంచీ తుపాకి మ్రోతలు, ఫిరంగి మ్రోతలు వినిపిస్తున్నాయి. కాని నగరవాసులు వాటిని అంత లెక్కచెయ్యడం లేదు. నగరం వెలుపల వినిపిస్తున్న కాల్పుల చప్పుడు వారిని మరింత కలవర పరిచాయి. అయిదు గంటలకు నూటముప్పయి ఫిరంగులతో నగరాన్ని ముట్టడించ వలసిందని నెపోలియన్ ఉత్తర్వు చేశాడు. దాని ఫలితమే ఇది.

మూల కూచుని ఏడుస్తున్న ఫెరపోంటోవ్ భార్య హఠాత్తుగా చల్లబడి పోయింది. బయట ఏం జరుగుతున్నదో వచ్చిపోయే వారిని చూడాలని బయటికి వెళ్ళింది. ప్రక్క ఇంట్లో ఉన్న వంట మనిషి, గుమాస్తా కూడా బయటికి వచ్చారు. ముగ్గురూ కలిసి వారి తలల మీది గుండా దూసుకుని పోతున్న తుపాకి గుండ్లను ఆశ్చర్యంతో చూస్తూ నిలుచున్నారు. తరువాత మరికొందరు మనుష్యులు మాట్లాడు కుంటూ వీధి మూలకు వచ్చారు.

"ఎంత వేగం! ఇళ్ళ కప్పు, చూరుగుండా ఎగిరిపోయేలాగా ఉన్నాయి" అన్నాడొకడు.

"నాకు కాస్తలో తప్పిపోయింది. లేకపోతే ఏమైపోయేవాడనో!" అన్నాడు మరొకడు.

"భూమిలోగుండా ఎలా దూసుకుని పోయిందో చూడు!" అన్నాడు ఇంకొకడు.

జనసమూహం వారిని ఆపుచేసింది. కొందరు తుపాకిగుండ్ల దెబ్బలు తగిలి తమకు దాపులోనే ఎలా పడిపోయారో వాళ్ళు చెప్పారు. అంత సేపూ తుపాకి గుండ్ల మ్రోత మరింత ఎక్కువగా వినిపిస్తోంది. కాని గుండ్లన్నీ ఇళ్ళ చూరుల మీదగుండా దూసుకుని పోతున్నాయి. చివరకు అల్పటిచ్ తన బండిలో ఎక్కాడు. స్వతం యజమాని ఫెరపోంటోవ్ వాకిట్లో నిలుచుని తన ప్రయణానికి కడపటి ఏర్పాట్లు చేసుకుంటున్నాడు. వంటమనిషి బయటికి వచ్చి వీధిమూల ఏమనుకుంటున్నారో వినడం కోసం అక్కడికి వెళ్ళింది.

"ఏమిటీ నోళ్ళు తెరుచుకుని అక్కడ చూస్తున్నారు?" అని అడిగాడు అల్పటిచ్. ఆ పిలుపు విని వంటమనిషి వెనక్కు తిరిగి పరుగెత్తుకుంటూ వచ్చింది. అలా

వస్తూ ఆవిడ తన చేతిలో పట్టుకుని ఉన్న కోటుదోవలో జారవిడిచింది. ఈ సమయంలో ప్రమాదాన్ని సూచించే ఒక కూత, భూమికి దాపులో ఎగిరి వెడుతున్న ఒక పక్షి కూత లాగా వినిపించింది. ప్రతి వీధిలోనూ ఒక మెరుపు మెరిసింది. పెద్ద చప్పుడైంది. పొగమబ్బు అంతటా కమ్మింది. వంటమనిషి మూలుగుతూ క్రింద పడిపోయింది. ఆమె చుట్టూ జనం పోగయ్యారు. ఫెరపోంటోవ్ ముందుకు పరుగెత్తాడు. స్త్రీలంతా పెద్దగా అరుస్తూ, ఏడుస్తూ పరుగెత్తారు. పిల్లలు కేకలు వేశారు. కాని ఆ స్త్రీ మూలుగుడు వీటన్నిటికంటె మించి వినిపిస్తోంది. పాపం గుండుదెబ్బ తగిలి ఆ వంటమనిషి కాలు విరిగిపోయింది. ప్రక్క టెముకలు బాగా దెబ్బతిన్నాయి.

అయిదు నిముషాల్లో వీధియావత్తూ నిర్జనమైంది. ప్రక్కటెముకలు దెబ్బతిన్న ఆ వంటమనిషిని సత్రం వంటగదిలోకి మోసుకుని వెళ్ళారు. ఆల్పటిచ్, తన బండివాడు ఫెరపోంటోవ్ భార్యా పిల్లలు; అంతా కలిసి లోపల వరండాలో దాక్కున్నారు. తుపాకి మోతలు ఇంకా ఆగిపోలేదు. వంటమనిషి మూలుగుతో కలిసి వినిపిస్తున్నాయి. ఫెరపోంటోవ్ భార్య, తన బిడ్డను నిద్రపుచ్చడానికి ఎంతో ప్రయత్నించింది. కాని ఆ బిడ్డ నిద్రపోలేదు. అక్కడికి వచ్చిన వారందరినీ తన భర్తను గురించి ఆమె అడగ సాగింది. ఫెరపోంటోవ్ చర్చికి వెళ్ళాడని, అక్కడ అంతా పోగయి ఆ సాయంత్రం మేరీమాత విగ్రహం తీసుకుని ఉత్సవం జరుపుతారని చెప్పగా ఆమె విన్నది.

సాయంకాలం కాగానే తుపాకి మోతలు తగ్గిపోయినాయి. సాయంకాలపు ఆకాశం దట్టమైన మబ్బుతో కూడుకుని ఉంది. అక్కడక్కడా మాత్రం ఆ మబ్బు తెరలులోగుండా తదియనాటి నెలవంక కనిపిస్తోంది. ఎడతెగని ఆ చప్పుడు తరువాత ఒక నిశ్శబ్దం అంతటా వ్యాపించింది. కాని ప్రతికొద్ది నిముషాలకు జనసమూహం వెడుతున్న అడుగుల చప్పుడు, అరుపులు, మూలుగులు, మధ్య మధ్యలో కాల్పులు వినిపిస్తున్నాయి. వంటమనిషి మూలగడం ఆపివేసింది. సైనికులు వీధుల్లో గుండా చెల్లాచెదురుగా వెడుతున్నారు. ఒక కూలిపోయిన చీమల పుట్టలోంచి చీమలు బయట పడ్డట్టుగా బయటపడి వెడుతున్నారు కొందరు ఆ సత్రపు పెరట్లోకి వెళ్లారు. వారికి ఇవ్వడం కోసమని ఆల్పటిచ్ వరాండాలో నుంచి బయటికి వచ్చి వాకిట్లో నిలుచున్నాడు.

"నగరం లొంగిపోయింది! త్వరగా వెళ్ళిపోండి!" అని కేకవేశాడు ఒక ఆఫీసర్.

ఆల్పటిచ్ తన బండివాణ్ణి పిలిచి బండి ఎక్కమన్నాడు. ఫెరపోంటోవ్ కుటుంబమంతా—ఒక్కొక్కరే బయటికి వచ్చారు. కాని స్త్రీలు బయట మండుతోన్న ఆ మంటలను చూచి బిగ్గరగా ఏడవడం మొదలెట్టారు. వీధిలో వెడుతున్న వారి కేక

లతో ఆ ఏడుపు కలిసిపోయింది. అల్పాటిచ్ బండివాడు వణుకుతోన్న చేతులతో గుర్రాలకళ్ళాలు వదిలాడు. చివరకు బండి కదిలింది. బండి, తెరిచి ఉన్న ఫెరపోంటోవ్ దుకాణం ముందునుంచి వెడుతుండగా ఒక డజను మందికి పైగా సైనికులు పెద్ద పెద్ద సంచీలలో పిండి, ప్రొద్దు తిరుగుడు పూలగింజలు పోసుకోవడం కనిపించింది. ఫెరపోంటోవ్ పరుగెత్తుకుంటూ బయటికి వచ్చి ఆ సైనికుల మీద పడబోయాడు. కాని ఇంతలో ఆగిపోయి జుట్టు పీక్కుంటూ ఏడుపుతో కూడిన చిరునవ్వుతో తన కోపాన్ని వెలిబుచ్చాడు.

"తీసుకోండి, తీసుకోండి, బిడ్డల్లారా! మీరింత కంటే తీసుకునే దేముంది!" అంటూ ఫెరపోంటోవ్, తనే ఆ సంచులు తీసుకుని వీధిలోకి విసిరేశాడు.

కొందరు సైనికులు భయంతో పరుగుతీశారు. మరికొందరు ఇంకా సంచీల నింపుకుంటున్నారు. ఇంకా కొందరు సంచీలు మోసుకుని వెడుతున్నారు.

"రష్యా ఓడిపోయింది అల్పాటిచ్! రష్యాపని అయిపోయింది!" అన్నాడు ఫెరపోంటోవ్. "నేను కూడా వెళ్ళి ఈ మంటకు సహాయపడతాను" అంటూ తను కూడా పెరట్లోకి పరుగెత్తుకుని వెళ్ళాడు.

అల్పాటిచ్ బండి కదల్లేనంతగా రోడ్డునిండా జనం క్రిక్కిరిసి ఉన్నారు. ఫెరపోంటోవ్ భార్య, పిల్లలు వేరే ఒక బండిలో ఎక్కారు. కాని బండి కదలడానికి వీలులేకుండా ఉంది.

మెల్లగా బండ్లు దినీపెర్ నదికి దిగువగా నున్న మైదానం చేరేసరికి బాగా చీకటిపడింది. అక్కడ మళ్ళీ వారు ఆగిపోవాల్సి వచ్చింది. సోల్జర్లు, బండ్లు అడ్డు వచ్చాయి. వారు ఆగిన కూడలిదగ్గర ఒక ఇల్లు, కొన్ని దుకాణాలు ఇంకా కాలుతూనే ఉన్నాయి. మంట నల్లని పొగమబ్బుగా మారి మళ్ళీ గప్పున మండి ఆరిపోతోంది. మాట్లాడకుండా ప్రక్కన నిలుచున్న వారి ముఖాలు మసకగా ఉన్న ఆ కాంతిలో కనిపిస్తున్నాయి. మంటకు ముందుగా కొన్ని నీడలు అటూ ఇటూ కదులుతున్నాయి. కేకలు, ఏడుపులు, పెట పెట కాలుతున్న మంటలతో కలిసి వినిపిస్తున్నాయి. సైనికులు ఆ మసక కాంతిలో అటూ ఇటూ కదులుతున్నారు.

అల్పాటిచ్ తన బండి దిగి ఆ మంటలను చూస్తున్న వారి దగ్గరికి వెళ్ళి నిలుచున్నాడు. మంటలు నాలుకలతో గోడలను నాకుతున్నట్లుగా ఉన్నాయి. ఒకప్రక్క ఇల్లు కూలిపోయింది. చూరు కూడా పడిపోతోంది.

ఈ సమయంలో అల్పాటిచ్‌ని ఒక పరిచిత కంఠస్వరం పేరుపెట్టి పిలవడం వినిపించింది.

"అయ్యో భగవంతుడా! అయ్యగారేనా!" అనుకున్నాడు ఆ వృద్ధ సేవకుడు,

తన చిన్న యజమాని అయిన ఆండ్రూ రాకుమారుని గుర్తించి. ఆ జనసమూహం వెనకాల ఆండ్రూ రాకుమారుడు నల్లని గుర్రాన్ని ఎక్కి నిలుచుని ఉండడం అతనికి కనిపించింది.

"ఇక్కడెందుకున్నావు?" అని అడిగాడు ఆండ్రూ రాకుమారుడు.

"అయ్యగారూ! నేనా?...నేను...నేను" అని గొణుక్కుంటూ "అంతా అయిపోయినట్లేనా?" అన్నాడు ఆల్పటిచ్ ఏడుస్తూ.

"ఇక్కడేం చేస్తున్నావు?" అని మళ్ళీ అడిగాడు ఆండ్రూ రాకుమారుడు. ఆ క్షణంలో ఒక మంట గప్పున మండి, వాడిపోయి ఉన్న అతని ముఖాన్ని కనపడేలా చేసింది. ఆల్పటిచ్ ముక్తసరిగా తను వచ్చిన పని చెప్పాడు.

"అయితే ఇక మనకు ఏమీ గత్యంతరం లేదంటారా?" అని అడిగాడు ఆల్పటిచ్ మళ్ళీ.

ఆండ్రూ రాకుమారుడు జవాబు చెప్పలేదు. కాని తన నోటుపుస్తకం తీసి ఒక పేజీ చింపి, తన మోకాలుపై ఉంచుకుని ఆ కాగితం మీద పెన్సిలుతో తన చెల్లెలికి ఈ కొద్ది మాటలు వ్రాశాడు.

"స్మోలెన్స్క లొంగిపోయింది. శత్రువు ఒక వారంలోగా లిస్సీ—గోరి వస్తాడు. మీరు వెంటనే మాస్కో వెళ్ళవలసింది.... వెంటనే మీరు వెళ్ళినట్టు నాకు తెలియ చేయవలసింది." అత నిలా వ్రాసి ఆ ఉత్తరాన్ని ఆల్పటిచ్ కిచ్చి, మరి కొన్ని మాటలు చెపుతున్నాడో లేదో, అంతలో ఒక స్టాఫ్ ఆఫీసరు తన పరివారంతో కలిసి అక్కడికి వచ్చాడు.

"నీవు కర్నల్‌వు కదూ? నీ కళ్ళముందే శత్రువులు ఇల్లు తగుల బెడుతుంటే చూస్తూ ఊరుకుంటావేమిటి? ఏమిటి దీనికర్థం?" అన్నాడు ఆ స్టాఫ్ ఆఫీసరు. అతను బెర్గ్. అతను సహాయసేనాధిపతిగా ఉద్యోగం సంపాదించాడు. అది తన కెంతో హాయిగాను సౌలభ్యంగాను ఉందని అనుకుంటూ ఉన్నాడు.

ఆండ్రూ రాకుమారుడు అతని వంక చూచాడు. కాని జవాబు చెప్పలేదు. ఆల్పటిచ్‌తో మాట్లాడుతూనే ఉన్నాడు.

"పదో తారీఖు వరకూ నేను వారి జవాబు కోసం ఎదురు చూస్తూ ఉంటానని చెప్పు. అప్పటికీ వారు వెళ్ళకపోయినట్లయితే నేను అన్నీ వదిలి లిస్సీ – గోరీకి రావలసి ఉంటుంది." అన్నాడు ఆండ్రూ.

"ఒక వెయ్యి క్షమాపణలు!" అన్నాడు బెర్గ్, ఆండ్రూ రాకుమారుణ్ణి గుర్తించి. "కాని నాకు ఉత్తర్వులున్నాయి. లేకపోతే ఇలా మాట్లాడేవాణ్ణి కాదు— ఒక వెయ్యి క్షమాపణలు!" అన్నాడు మళ్ళీ.

అంతలో ఒక పెద్ద చప్పుడైంది. మంట హఠాత్తుగా ఆగిపోయింది. పొగ మబ్బులు చుట్టలు చుట్టుకుంటూ పైకి లేస్తున్నాయి. మళ్ళీ చప్పుడైంది. ఆ పెద్ద ఇల్లు కూలిపోయింది. మంట మళ్ళీ గప్పున లేచింది. ఆ మంటలో ఆ ఇల్లు కట్టిన వారి ముఖాలు కనిపిస్తున్నాయి.కోటు వేసుకున్న వ్యక్తి తన చెయ్యి ఊపుతూ "అయిపోయింది. అబ్బాయిల్లారా! ఇప్పుడు బాగా మండుతోంది!" అన్నాడు.

"అతనే ఆ ఇంటి యజమాని!" అన్నాడు ఒకడు.

"తెలిసిందా అల్పటిచ్?" అన్నాడు ఆండ్రూ రాకుమారుడు, బెర్గ్ విషయం పట్టించుకోకుండా. బెర్గ్ నివ్వెరపోయి నిలుచుండి పోయాడు. "నేను చెప్పినదంతా చెప్పు, వస్తాను మరి." అంటూ ఆండ్రూ తన గుర్రాన్ని దౌడు తీయించుకుంటూ వెళ్ళిపోయాడు.

# 89

స్మోలెన్స్కు నుంచి రష్యన్‌లు తిరోగమించడం మొదలెట్టారు. వారి వెన కాలే శత్రువు కూడా తరుముకుని వస్తున్నాడు. ఆండ్రూ రాకుమారుని ఆధిపత్యంలో ఉన్న దళం ఆగస్టు 10 వ (22 వ) తారీఖున రహదారి పైగా ప్రయాణం చేసింది. దారిలో లిస్సీ—గోరీకి వెళ్ళే మలుపు కూడా వున్నది. మూడు వారాల నుంచి వేడి మరీ ఎక్కువగా ఉంటోంది.

ఆండ్రూ రాకుమారుడు తన దళం వారి ఆరోగ్యం మొదలైన సదుపాయాలు చూస్తూ ఉన్నాడు. స్మోలెన్స్కు పట్టణాన్ని తగల బెట్టడము, ఖాళీ చెయ్యడము,శత్రువుల పట్ల అతని ద్వేషాన్ని మరింత హెచ్చించాయి. అది అతని జీవితంలో ఒక కొత్త మార్పుకు గుర్తు పెట్టింది. అతను తన స్వంత దుఃఖాలను కూడా మరిచి పోయాడు. అతని మంచితనము, చనువువల్ల తన క్రింది వారికి కూడా అతనెంతో ప్రియమైన వాడైనాడు. వారతన్ని గురించి ఎప్పుడు మాట్లాడుకున్నా అతన్ని 'మన రాకుమారుడు' అని అంటూ ఉండేవాళ్ళు.అతను తన క్రింది వారితో ఎంతో చనువు గాను, మర్యాదగాను ఉండేవాడు. పాతవారు కనిపించినప్పుడల్లా అతనిలోని గర్వాతిరేకమంతా పైకి ఉబికివచ్చేది. గతాన్ని ఏ విధంగా స్మరించాలన్నా అతనికేమాత్రం ఇష్టం ఉండేది కాదు. అలాంటి అవసరం వచ్చినప్పుడల్లా అతనెంతో జాగ్రత్తగా తన్ను తాను నిమ్మళించుకుంటూ ఉండేవాడు.

అతని కిప్పుడంతా అయోమయంగా కనిపిస్తోంది. ఒకవైపున తను చెయ్యి జారిపోతుందని అనుకోని స్మోలెన్స్కు నగరం ఆరో తారీఖున లొంగిపోయింది. మరోవైపున రోగగ్రస్తుడైన తన తండ్రి,తన అభిరుచులకు అనుకూలంగా తను కట్టుకున్న లిస్సీ–గోరీలో తన భవనాన్ని వదిలి వెళ్ళవలసి వచ్చింది. దుఃఖకరమైన ఈ

ఆలోచనల నుంచి తన దళం బాధ్యతలను జాగ్రత్తగా నిర్వర్తించడంలో తన మనస్సును మరల్చుకుంటున్నాడు ఆంద్రూ.

అతని దళం 22 వ తారీఖున లిస్సీ-గోరీ చేరింది. రెండు రోజుల క్రితమే తన తండ్రి, చెల్లెలు మాస్కో వెళ్ళారని అతనికి తెలియవచ్చింది. ఇక అప్పుడతన్ని అక్కడ ఆకర్షించే విషయం ఏమీలేదు. అయినా ఒకసూటు గత స్మృతులను జ్ఞాపకం చేసుకుందామని అక్కడికి వెళ్ళి చూచాడు.

తన దళాన్ని ముందు వెళ్ళమని చెప్పి తను పుట్టి పెరిగిన తన స్వగ్రామం వైపుకు మళ్ళాడు. చాకలి స్త్రీలు పాడుతూ కబుర్లు చెప్పుకుంటూ బట్టలు ఉతుక్కునే మడుగు దగ్గరికి వచ్చి చూచేసరికి అది నిరామయంగా ఉండడం వల్ల అతనికి ఆశ్చర్యం కలిగింది. ఒక చిన్న పడవ సగం నీటిలోను, సగం ఒడ్డునా పడివుంది. కాపలా కాపలాదారు గుడిసెలో ఎవరూ కనిపించడంలేదు. తోటలోను, దోవలోను ఎవరూ పట్టించుకునే వాళ్ళు లేక ఏవో పిచ్చిమొక్కలు మొలుస్తున్నాయి. ఎక్కడ చూచినా బీడు పడిపోయి వుంది. నారింజ తోట దగ్గరికి వెళ్ళి చూచేసరికల్లా తలుపులు, కిటికీ అద్దాలు అన్నీ పగిలిపోయి వున్నాయి. చెట్లు చాలా మటుకు ఎండిపోయినాయి. అతను తోటమాలి తారాస్‌ను పిలిచాడు. కాని ఎవరూ మారు పలకలేదు. తోట చివరకు వెళ్ళి చూడగానే తోటకు చుట్టూ కట్టిన గోడ పడిపోయి ఉండడం కనిపించింది. చెట్ల కొమ్మలకు ఒక్క కాయ కాని పండు కాని కనిపించడంలేదు. చాలా రోజులబట్టీ గేటు వెలుపల కూచుంటూ వచ్చిన వృద్ధుడైన ఒక రైతు, ఇప్పుడు వృద్ధ రాకుమారుడు కూచునే బెంచీమీద కూచుని ఎండకు వళ్ళు వెచ్చచేసు కుంటున్నాడు. గడ్డితో చెప్పులు కుట్టుకుంటూ ఉన్నాడు. అతని చేతిలో నార వుంది, అతను బాగా చెవిటివాడవడంవల్ల ఆంద్రూ రాకుమారుని రాక అతను గుర్తుపట్టలేకపోయాడు. ఆంద్రూ రాకుమారుడు తన భవనం దగ్గరికి వెళ్ళాడు. పూర్వం ఇంటిముందు ఉంటూ వచ్చిన నిమ్మచెట్లు చాలావరకు ఇప్పుడు కొట్టివేసి వున్నాయి. ఒక గుర్రము, గుర్రపుపిల్ల ఇంటి ముందు మెట్ల దగ్గరున్న పూలపాదుల దగ్గర, గులాబీమొక్కల దగ్గర తారట్లాడుతున్నాయి. భవనం క్రింది అంతస్తులో ఉన్న కిటికీలు తప్ప, తక్కిన కిటికీలు మూసి వున్నాయి. ఒక చిన్న కుర్రవాడు గుర్రపు రౌతు రావడం చూచి లోపలికి పరుగెత్తుకుని వెళ్ళాడు.

అల్పటిచ్ ఒక్కడే ఇప్పుడు లిస్సీ—గోరీలో ఉంటూ ఉన్నాడు. చిన్న అయ్యగారు వస్తున్నాడని చెప్పడం కోసం కుర్రవాడు లోపలికి పరుగెత్తుకుని వెళ్ళినప్పుడు అల్పటిచ్ "మహాత్ముల చరిత్రలు" అనే పుస్తకం చదువుతూ కూచుని ఉన్నాడు. వెంటనే లేచి కోటు సవరించుకుని బయటికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. ముక్కుమీద కళ్ళజోడు ఇంకా అలాగే ఉంది. ఒక్క మాటకూడా మాట్లాడకుండా

అంద్రూను కలుసుకొనడం కోసం క్రిందికి పరుగెత్తుకుని వచ్చాడు. అంద్రూను చూడగానే అతని కళ్ళవెంట నీరు కమ్మింది. సిగ్గుపడి కన్నీరు ఆపుకుని, గొంతు సవరించుకుని, ఉన్న విషయాలన్నీ ఆయనతో చెప్పాడు. ఇంట్లో ఉన్న విలువగల వస్తువులన్నిటినీ బొగొషారోవ్‌కు పంపించారు. గోధుమలు కూడా అక్కడికే పంపారు. కాని ఆ సంవత్సరం బాగా పండే వేసవికాలపు పంటలు పండకముందే సైనికులు కోసుకపోయారు. చాలా మంది ప్రజలు బొగొషారోవ్‌కు వెళ్ళిపోయారు. ఈ విషయాలన్నీ అల్పటిచ్ ఎంతో విచారంతో విన్నవించుకున్నాడు.

అతను చెపుతున్న మాటలు అంద్రూ రాకుమారుడు పరధ్యానంగా విని "మా నాన్నగారు, చెల్లెలు ఎప్పుడు వెళ్ళారు?" అని అడిగాడు.

"ఏడో తారీకున బయలుదేరి వెళ్ళారు." అని చెప్పాడు అల్పటిచ్.

అంద్రూ, వారు మాస్కో ఎప్పుడు వెళ్ళారో తెలుసుకుందామని అడిగాడు. కాని అల్పటిచ్ వారు అక్కడ నుంచి బొగొషారోవ్‌కు ఎప్పుడు వెళ్ళారని అడుగుతున్నాడనే తలంపుతో ఆ సమాధానం చెప్పాడు. ఇలా చెప్పి అల్పటిచ్ మళ్ళీ పంటలను గురించి, అక్కడి పరిస్థితులను గురించి యజమానికి తెలియచేస్తూ, తను చేయవలసిన పనులను గురించి, అక్కడి పరిస్థితులను గురించి యజమానికి తెలియచేస్తూ, తను చేయవలసిన పనులను గురించి ఉత్తర్వులిమ్మని అడగసాగాడు.

"ఇంకా ధాన్యం ఉంది, దాన్ని కూడా ఇచ్చేసి ఆఫీసర్ల దగ్గర నుంచి రశీదు తీసుకోమంటారా?" అని అడిగాడు అల్పటిచ్.

"నన్నేం చెప్పమంటావు!" అంటూ అంద్రూ రాకుమారుడు ఆలోచిస్తూ ఆ వృద్ధుని వంక చూచాడు. ఎండలో ఆ వృద్ధుని బట్టతల మిల మిల లాడుతోంది. అలా అడగడం నిరుపయోగమని అతని ముఖమే చెపుతున్నట్లుగా ఉంది. "సరే అలాగే ఇచ్చెయ్యి." అన్నాడు అంద్రూ.

"తోట చూచారా ఎలా వుందో! నేనేం చెయ్యను? మూడు దళాలవారు వచ్చి అక్కడ విడిది చేశారు. మరీ కొందరు సైనికులైతే ఎలా ప్రవర్తించారను కున్నారు? తోటంతా నాశనం చేశారు. ఫిర్యాదు చెయ్యడానికి నేనా దళపు అధికారిపేరు కూడా వ్రాసుకున్నాను ..." అని చెప్పాడు అల్పటిచ్.

"సరే, ఇప్పుడు నీవేం చేయదలుచుకున్నావు? ఇక్కడే వుండదలుచుకున్నావా?" అని అడిగాడు అంద్రూ.

అల్పటిచ్ అతని వంక చూచాడు. ఆకాశం వంక చేతులెత్తి "ఆయనే రక్షకుడు! ఆయన ఇచ్ఛ!...ఆయన ఇచ్ఛే నెరవేరుతుంది గాక ...!" అన్నాడు.

"సరే అయితే, నే వెళ్ళొస్తాను." అని అంద్రూ గుర్రం మీది నుంచి ముందుకు వంగి ఆ వృద్ధునితో "కాని నీవు కూడా వెళ్ళిపో. నీవు తీసుకువెళ్లే

సామానులన్నీ నీవు తీసుకుని వెళ్ళు. రైతులందరినీ మన రిజాన్ ఎస్టేటుకో లేక మాస్కో దగ్గర ఉన్న మన ఎస్టేటుకో వెళ్ళమని చెప్పు." అన్నాడు.

ఆల్పటిచ్ ఏడుస్తూ ఒక్క క్షణం తన యాజమానిని గట్టిగా కౌగలించుకున్నాడు. కాని ఆండ్రూ మెల్లగా అతన్ని విడిపించుకుని తోటలోగుండా త్రోవ చేసుకుని దౌడుతీయిస్తూ వెళ్ళిపోయాడు.

మళ్ళీ ముసలివాడు కనిపించాడు. అక్కడే కూచుని అదే పని చేస్తున్నాడు. అతన్ని చూచేసరికి మృతుని ముఖం మీద వాలే ఈగ జ్ఞాపకం వచ్చింది. ఇద్దరు చిన్ని పిల్లలు తోటలో నుంచి వస్తూ ఆండ్రూను చూచి ఆగిపోయారు. వారి ఒడిలో వారు పోగుచేసుకున్న పండ్లున్నాయి. వారు కలవర పడ్డారు. ఆ ఇద్దరు పిల్లలలో పెద్ద పిల్ల తన తోటిపిల్ల చెయ్యిపుచ్చుకుని అవతలికి లాక్కుని పోయింది. వారొక చెట్టు చాటున దాక్కున్నారు. వారు ఒడిలోంచి క్రింద పడిపోయిన పండ్లు కూడా ఏరుకోకుండా నిలుచుండిపోయారు. తన్ను చూచి వారు భయపడిపోతున్నారని ఆండ్రూ తను వారిని చూడనట్లుగా మరోవైపుకు చూచాడు. ముచ్చటైన అలాంటి పిల్లలు భయపడడం అతని కిష్టం లేదు.

ఈ ఇద్దరు పిల్లలను చూచేసరికి అతనిలో ఒక కొత్త అనుభవం కలిగింది— జీవితంలో తనదికాని ఇతర విషయాలకు సంబంధించిన ఒక మెల్లని ప్రశాంతి అతనికేర్పడింది, కాని అదీ సహజమైనదే.

ఆండ్రూ రాకుమారుడు హాయిగా తేరుకుని మళ్ళీ తనవారితో వచ్చి కలిశాడు. వారు ఒక గుంటదగ్గర నీరు త్రాగడానికి ఆగారు. మధ్యాహ్నం రెండుగంటలైంది. ఎండ తీవ్రంగా ఉంది. సైనికుల వెన్నులపై పడుతోంది. దుమ్ము ఒక పొగమబ్బులాగా వారిపై వ్రేలాడుతోంది. వారి కంఠస్వరాలు కూడా వినిపించడంలేదు. ఎక్కడా గాలి లేదు. ఆండ్రూ గుంట ప్రక్కనుంచి వెడుతూ వుండగా ఒక సన్నని తడిగా ఉన్న గాలిపొర వచ్చి అతని చెక్కిలికి తాకింది. అతనికి నీళ్ళలో మునిగి స్నానం చేద్దామనిపించింది. ఆ చిన్ని గుంటలో కలుపు, నాచు మొక్కలు చేరి ఉన్నాయి. ఆ గుంటలో నుంచి నవ్వులు వినిపిస్తున్నాయి. ఆ సమయంలో కొందరు సైనికులు ఆ గుంటలో దిగి స్నానాలు చేస్తున్నారు. నీరు కాలిబాట వరకూ చిమ్ముతోంది. ఒక నీటి తొట్టిలోని చేపల్లాగా సైనికులు— ఆ చిన్ని గుంటలో ఆడుకుంటూ ఉన్నారు.

వారు పొందుతున్న ఈ సంతోషాన్ని, వారి నవ్వులను చూచినప్పుడు ఆండ్రూకు ఒక విధమైన విచారం కలిగింది.

అందంగా ఉన్న కుర్రవాడొకడు ఒక అడుగు వెనక్కువేసి తల ముందుకు వంచి నీటిలో దుమికాడు. ఒక సార్జెంటు నీటిలో వళ్ళు కడుక్కుంటూ ఉన్నాడు.

ఎక్కడ చూచినా నీరు చిమ్ముతోన్న శబ్దము, సంతోషంతో కేకలు వినిపిస్తున్నాయి. గుంటలోను, ఒడ్డున కూడా మనుష్య శరీరాలే కనిపిస్తున్నాయి. తెల్లగా ఆరోగ్య కరంగా ఉన్నాయి. టిమొఖైన్ గడ్డిమీద కూచుని జాగ్రత్తగా వళ్లు తుడుచుకుంటు న్నాడు. అతని ముక్కు మరింత ఎర్రగా ఉంది. తన కర్నల్ తనను అలాంటి పరిస్థితిలో చూచినందుకు అతను కొంచెం సిగ్గుపడ్డాడు; కాని తన స్నానాన్ని గురించి చెపుదామనుకున్నాడు.

"స్నానం ఎంతో చక్కగా ఉంది యువర్ ఎక్సెలెన్సీ! మీరు కూడా ఒక మాటు స్నానం చెయ్యండి" అన్నాడు టిమొఖైన్.

"నీరు మురికిగా వుంది" అన్నాడు ఆంద్రూ, ముఖం అదోలా ఉంచి.

"మీ కోసం వారు దోవ చేస్తారు" అన్నాడు టిమొఖైన్. తరువాత గుంట దగ్గరికి పరుగెత్తి వారితో "అబ్బాయిల్లారా! రాకుమారుడు స్నానం చేయాలనుకుంటు న్నాడు" అని చెప్పాడు.

"ఏ రాకుమారుడు?" అని అడిగారు వారు.

"మన రాకుమారుడే; మరెవరుంటారు ?"

"మన రాకుమారుడా!" అంటూ అంతా తోవచేశారు. ఆంద్రూ రాకుమారు డికి గుంటలో దిగేసరికి చాలా కష్టమై పోయింది.

"ఏమిటి? ఏమిటంత మురికిగా ఉంది?" అన్నాడు ఆంద్రూ, తన దేహాన్ని తను చూచుకుంటూ. మురికిగా ఉన్న ఆ గుంటలో చిందులు వేస్తున్న వాళ్ళను చూచే సరికి అతనికి కంపరం కలిగింది. ఆ దృశ్యాన్ని తలుచుకోవడానికి కూడా అతను భయపడ్డాడు.

బ్రెగ్రీషియన్, అరక్షేవ్‌కు ఈ క్రింది ఉత్తరాన్ని వ్రాశాడు. ఆగష్టు 7 వ తారీఖున స్మోలెన్స్కు రోడ్డుమీద ఉన్న క్యాంప్ నుంచి వ్రాశాడు. ఈ ఉత్తరం జార్ కూడా చదువుతాడని అందులో ప్రతిమాటా తనకు తోచినంతవరకూ తూచి వ్రాశాడు.

"కౌంట్ అలెగ్జీ ఆంద్రొవిచ్‌కి—

మంత్రి ఇప్పటికే మీకు స్మోలెన్స్కు నగరం లొంగిపోవడం విషయమై తెలియపరిచి ఉంటా దను కుంటాను.

అందరూ చెప్పరానంతగా విచారపడుతూ ఉన్నారు. ఇంతటి ముఖ్యమైన స్థలాన్ని ఇలా ఖాళీ చేయవలసి వచ్చినందుకు సేన కూడా చాలా విచారిస్తోంది. నా మటుకు నేను మీకు వెంటనే తెలియ పరచ వలసిందని అతన్ని కోరాను. నేను మీకు ఒక విషయం చెపుతున్నాను. నెపోలియన్ ఒక గోతంలో దూరినట్లుగా ఇప్పుడు

దూరిపోయి ఉన్నాడు. స్మోలెన్స్క్ నగరాన్ని పట్టుకోవడానికి బదులు అతని సేన ఇంచు మించు సగం నష్టమయి ఉండేదే. మన సేనలు ఎప్పటిలాగానే పోరాటం సాగిస్తున్నాయి. 35 గంటల వరకూ 15,000 మంది సేనను నిలపగలిగాను. శత్రువును వెనక్కు మరలించ గలిగాను.కాని అతను 14 గంటలు కూడా తన సేనను నిలపలేక పోయాడు. ఇది మన సేనలకు ఎంతో తీరని అవమానం. ఇప్పుడతను బ్రతికి ఉన్నాడూ అంటే, అతను అందుకు కూడా తగడు! మనకు చాలా నష్టమైందని అతను మీకు తెలియ చేశాడూ అంటే అది నిజమైన మాటకాదు. నాలుగువేలమంది చనిపోయారు, గాయపడ్డారు, అంతే. పైగా శత్రువుకే ఎక్కువ నష్టం కలిగింది.

మరి రెండు రోజులు అతను నిలవలేకపోయాడా? ఫ్రెంచి వారు తప్పకుండా అతనికి దోవ ఇచ్చి ఉండేవారు. వారికి త్రాగడానికి ఒక్క నీటి చుక్క కూడా లేదు. తను వెనక్కు మరలనని చెప్పి ఆ రాత్రే హఠాత్తుగా మరలి పోతున్నానని వార్త పంపించాడు.

ఇది యుద్ధం కాదు! ఇలా అయితే మనం చేతులారా శత్రువును మాస్కో గేట్లకు చేరుస్తాం!

మీరు సంధిని గురించి ఆలోచిస్తున్నారని నాకు తెలుస్తోంది. అలాంటి పని మటుకు చేయకండి. ఇన్ని త్యాగాలు చేసిన తరువాత, వెర్రిగా ఇన్నిసార్లు తిరోగమించిన తరువాత ఇప్పుడు సంధి చేసుకోవడం ఏ మాత్రం సబబుగా ఉండదు. అప్పుడు రష్యా ప్రజలంతా మనపై తిరుగుబాటు చేస్తారు. పరిస్థితు లిలా పరిణమించాయి కాబట్టి మనం తుదివరకూ పోరాటం సాగించవలసి ఉంటుంది.

"అధిపత్యం వహించవలసింది ఒక వ్యక్తి కాని ఇద్దరు కాదు. మీ మంత్రి మంత్రిగా మంచివాడే కావచ్చు.కాని జనరల్‌గా చెప్పవలసివస్తే అతను పనికిమాలినవాడు మాత్రమే కాక, అతను చేస్తున్న పనులు ఘోరమని చెప్పవలసి వస్తుంది. అతను చేసేపనులు చూస్తోంటే నా బుర్ర వెర్రెక్కి పోతోంది. ఉన్నమాట చెపుతున్నందుకు క్షమించండి. ఇలాంటి క్షణంలో సంధిని గురించి ఆలోచించే వ్యక్తి మంత్రిగా ఉన్నాడూ అంటే, అతను జార్‌కు స్నేహితుడనీ, అతని శ్రేయస్సు కోరేవాడనీ చెప్పడానికి వీల్లేదు. పైగా అతని నాశనం కోరేవాడని చెప్పవలసి వస్తుంది! నేను మీకు ఉన్న మాట వ్రాస్తున్నాను. వెంటనే రక్షకసేనను పంపించండి.

సహాయ సేనాధిపతి మిష్టర్ వాల్ట్‌జోగెన్ సేనను విశ్వాస పూర్వకంగా నడిపించలేదు. పైగా అతను నెపోలియన్‌కు అనుకూలుడని కూడా అనుమానం ఉంది. అతను మంత్రికి ప్రధాన సలహాదారుల్లో ఒకడు. నాకు సంబంధించినంత వరకూ నేను మాత్రం అతనికంటె పదవిలో సీనియర్‌ను అయినప్పటికీ, ఒక సైనికుడిలాగా

అతను చెప్పిన మాట వింటాను. ఈ విషయం నాకు ఎప్పుడూ నొప్పి కలుగచేస్తూ ఉంటుంది. కాని నా చక్రవర్తికీ- నా అన్నదాతకూ నేను విధేయుణ్ణి కాబట్టి ఇలాటి వారి చేతుల్లో సైన్యం ఉంచినందుకు విచారిస్తున్నప్పటికీ ఆయనకు నేను లొంగి ఉన్నాను. ఈ తిరోగమనంలో చాలా అలిసిపోయామనీ, పదిహేను వేలమందికి పైగా అనేక ఆసుపత్రులలో ఉన్నారనీ చెపితే మీరు నమ్ముతారో నమ్మరో? మనం పురోగమించి ఉంటే ఇలా జరిగి ఉండేదికాదు. మనం మన దేశాన్ని ఇతర్ల చేతుల్లో పెట్టి రష్యా బిడ్డల హృదయాల్లో పగను రగిలిస్తున్నాం కాబట్టి, మనలను పిరికిపంద లుగా పరిగణించి నిందిస్తారని అందరికీ చెప్పండి. మనకు భయమెందుకో నా కర్ధం కావడంలేదు. మంత్రి పిరికివాడు, నిశ్చయంలేని వాడు, చపలచిత్తుడూ అయినాడూ అంటే, అది నా తప్పుకాదు. సైన్యం ఎంతో క్రుంగిపోయింది. అతనిమీద నిందలు కుప్పలుగా కురిపిస్తోంది."

# 90

మానవులు వారి జీవితాలను గడిపే అనేక విధాలను రెండు తరగతు లుగా విభజించవచ్చని మనం అనుకుంటాం. మొదటిది వాస్తవానికంటె బాహ్య రూపం ఎక్కువ ప్రధానంగా కలది. రెండవది బాహ్యరూపం కంటె వాస్తవం ఎక్కువ ప్రధానంగా కలది. ఉదాహరణకు : మనం గ్రామ జీవితాన్ని కాని, రాష్ట్రీ జీవితాన్ని కాని లేక మాస్కోవంటి నగర జీవితాన్ని పీటర్స్ బర్గ జీవితంతో పోల్చి చూడవచ్చు. ఇంకా చెప్పాలంటే నాగరికమైన డ్రాయింగ్ రూంలో ఎప్పుడూ ఎక్కడా మార్పు చెందని జీవితంతో పోల్చి చూడవచ్చు.

1805 నుంచి 1812 లోగా రష్యాలో ఎన్నో మార్పులు జరిగాయి. నెపోలి యన్‌తో మళ్ళీ సమాధానాలు జరిగాయి. రాజ్యాంగాల్లోనూ మార్పులు జరిగాయి. కాని ఇవి ఇలా వుండగా అన్నాపావ్‌లోవ్‌నా డ్రాయింగ్ రూంలో కాని, కౌంటెస్ హెలెన్ డ్రాయింగ్ రూంలో కాని ఎలాటి మార్పూ కనిపించలేదు. అక్కడి పరిస్థి తులు మామూలుగా— పూర్వం లాగానే ఉన్నాయి. అన్నాపావ్‌లోవ్‌నా గృహంలో చేరే ప్రతివారూ ఎప్పటిలాగానే నెపోలియన్ విజయాన్ని చూచి ఆశ్చర్యపోతున్నారు. యూరప్ రాజులందరూ అతనికి లొంగిపోవడం ఇప్పటికీ కూడా రష్యన్ దర్బారును కలవర పరచడానికి ఉద్దేశించబడిన ఒక కుట్రగా భావించబడుతోంది. అన్నాషెరర్ దీనికి ప్రతినిధి. హెలెన్ ఇంట్లో కూడా ఇలాగే వుంది. అక్కడికి రోజూ వచ్చిపోయే రుమెన్ట్‌జోవ్ ఆమెను తెలివిగల స్త్రీ అని పొగడడమూ, 1808 లో లాగానే 1812లో కూడా నెపోలియన్ గొప్ప వ్యక్తి అని అతనిపట్ల ఉత్సాహాన్ని ప్రదర్శించడము

ఒక నాగరిక లక్షణంగా కనిపిస్తోంది. ఫ్రాన్సుతో పోరాటం ఒక విచార పూర్వకమైన విషయంగా పరిగణించ బడుతోంది. అయినా త్వరలోనే సంధి జరుగుతుందని ఆశిస్తూ వున్నారు.

సేనను విడిచిపెట్టి జార్ పీటర్సుబర్గుకు వచ్చిన తరువాత ఈ రెండు కేంద్రాల్లోనూ ఒక కొత్త ఉద్వేగం కనిపించసాగింది. స్పర్ధలు కూడా హెచ్చాయి. కాని రెండు గృహాల్లో కూడా ఏ గృహానికి సంబంధించిన రంగు ఆ గృహానికి ఉండనే ఉంది. అన్నా పావ్‌లోవ్‌నా ఫ్రెంచివాళ్ళను ఎవరినీ రానీయడంలేదు. ఎవరో కొద్దిమందిని తప్ప, ఫ్రెంచి థియేటర్‌ను కూడా ఆమె ఇంచుమించుగా బహిష్కరించింది. దాని కయ్యే ఖర్చు చాలా ఎక్కువని కూడా ఎప్పుడూ మాట్లాడుతూ ఉంటుంది. ఇక హెలెన్ ఇంట్లో పద్ధతి మాత్రం ఇదికాదు. దీనికి పూర్తిగా విరుద్ధమైనది. అక్కడ పోగయ్యేవారంతా ఫ్రెంచివారే. నెపోలియన్‌ను గురించి ఏమాట మాట్లాడినా వారు జాగ్రత్తగా గమనిస్తూ ఉంటారు. శత్రువుచేసే అమానుష కృత్యాలను గురించి చెప్పే ప్రతిమాట కూడా అబద్ధాలని వారంటారు. కోర్టును, ప్రభుత్వాన్ని కజన్‌కు మార్చాలనే సలహాను, కేవలం పసితనపు ఊహగా భావిస్తున్నారు. వీరి ఉద్దేశంలో యుద్ధం కేవలం ఒక ప్రదర్శనంలాంటిదే. అందుచేత త్వరలోనే సంధి జరిగి తీరుతుందని వీరి అంచనా. బిలిబైన్ చెప్పిన ఒకమాటను ఎప్పుడూ వల్లించడం వీరికి అలవాటైపోయింది. అక్కడికి ఎప్పుడూ వస్తూవుండే బిలిబైన్ "విషమ సమస్యలు పరిష్కరించాలంటే తుపాకిమందు ద్వారా పరిష్కరించలేము. ఆ సమస్యలను కని పెట్టినవారే వాటిని పరిష్కరించాలి" అని అంటూ ఉండేవాడు. అతనలా అన్నప్పుడల్లా అందరూ నవ్వుతూ వుండేవారు. అయినప్పటికీ ఇలా నవ్వడంలో ఒక విధమైన హాస్యం కూడా గోచరిస్తూ ఉండేది.

ఇది ఇలా వుండగా అన్నా షెరర్ ఇంట్లో ఈ ఉత్సాహం మరో రూపంలో ఉండేది. ప్లూటర్ తన వీరులపట్ల ఎలాటి ఉత్సాహాన్ని ప్రదర్శించాడో అలాటి ఉత్సాహాన్ని వీరు ప్రదర్శించేవారు. బేసిల్ రాకుమారు డొక్కడే ఈ రెండు వర్గాలకూ వంతెనవంటివాడు. అత నిప్పటికే అనేక ప్రధాన పదవుల్లో వున్నాడు.

"నా స్నేహితురాలు అన్నా పావ్‌లోవ్‌నా!" అంటూ అన్నా పావ్‌లోవ్‌నా తోను, "నా కుమార్తె రాజకీయ కూటమి" అంటూ తన కుమార్తె హెలెన్‌తోను ఎంతో చనువుగా వుండేవాడు ఒక్కోసారి అతను అటూ ఇటూ ఊగిసలాడడం కూడా జరుగుతూ వుంటుంది. అప్పుడు మాట్లాడుతూ ఒక ఇంట్లో వెలిబుచ్చవలసిన అభిప్రాయాన్ని మరో ఇంట్లో వెలిబుచ్చేవాడు.

అన్నా షెరర్ ఇంట్లో ఒక రోజున—జార్ వచ్చిన కొద్ది రోజులకు బేసిల్ రాకుమారుడు, బార్క్లేడి టాలీని గురించి మాట్లాడుతూ మొదట్లో అతన్ని గురించి

నించించినప్పటికీ చిట్టచివరకు "ఛీఫ్ కమాండర్ పదవికి తగిన వ్యక్తిని పేర్కొనా లంటే చాలా కష్టమైన పని" అని చెప్పాడు. అక్కడికి తరుచుగా వస్తూ అందరిచేత ప్రతిభాశాలి అని పిలవబడే ఒక వ్యక్తి, ఆ రోజున తను ఆర్ధికమంత్రి ఆఫీసు దగ్గర పీటర్స్బర్గు రక్షక సేన కమాండర్-వాలంటీర్లను తనిఖీచేయడం చూచాననీ, అన్ని పార్టీలకూ సంతృప్తి కలిగించే వ్యక్తి అతనొక్కడేనని తనకు అనిపించిందనీ చెప్పాడు. అన్నా పావ్‌లోవ్‌నా విచార సూచకంగా చిరునవ్వు నవ్వి కొటొజోవ్ చేసిన పనల్లా జార్‌కు చిక్కులు మరింత ఎక్కువ చేయడమేనని అన్నది.

"నేనూ ఇదేమాట 'ప్రభువుల సభ'లో చెప్పాను" అన్నాడు బేసిల్ రాకుమారుడు. "అతన్ని జనరల్‌గా చేయడంవల్ల చక్రవర్తికి సంతృప్తికరంగా ఉండదని చెప్పాను. కాని వారు నామాట వినిపించుకోలేదు. వారికి తగాదాలంటే ఎంతో ఇష్టం. ఎందుచేతనంటారు? మాస్కోలో ఉత్సాహాన్ని వారు అనుకరించాలని అనుకోవడమే" అని, ఇలా తను మాట్లాడుతున్నది, తన కుమార్తె ఇంట్లో ఒప్పు కున్నప్పటికీ, అన్నా షెరర్ ఇంట్లో ఇది రుచించదన్న విషయం మరిచిపోయి ఇలా మాట్లాడ సాగాడు. వెంటనే ఆ విషయం తెలుసుకుని తన్ను తాను సరిదిద్దుకోవడానికి ప్రయత్నించాడు.

"రష్యన్ సేనలో కల్లా పెద్దవాడైన కౌంట్ కొటొజోవ్ అక్కడికి తను స్వయంగా వెళ్ళడం మంచిదేననా నీ వుద్దేశం? దానివల్ల వచ్చే లాభమేమీలేదు. పైగా ఉన్నమాట చెప్పాలంటే ప్రవర్తించుకోవడం కూడా ఎలాగో తెలీని వ్యక్తిని, గుర్రం మీద కూచోవడం కూడా తెలీని వ్యక్తిని, కౌన్సిల్ జరుగుతూ ఉంటే నిద్రపోయ్యే వ్యక్తిని కమాండర్‌గా చేయడం ఎలా సాధ్యం? బుఖారెస్టులో అతను కీర్తి సంపా దించాడని ఎవరైనా అనగలరా? అతని మిలిటరీ గుణగణాలను గురించి నేను మాట్లాడ డం లేదు. ఆ విషయాలు మాట్లాడాలంటే చాలా దూరం వరకూ పోతుంది. కంటి చూపు కూడా సరిగా కనిపించని అలాటి వృద్ధుడి చేతిలో ఇలాటి విషమ సమయంలో మన విశ్వాసాన్ని ఎలా వుంచగలం? అతను ఎలా ఛీఫ్‌కమాండర్ కాగలడు? అతను దాగుడుమూతల ఆటలో గ్రుడ్డి తల్లిగా వుండడానికి తప్ప మరిదేనికీ పనికిరాడు." అన్నాడు మళ్ళీ బేసిల్ రాకుమారుడు.

అతనిలా మాట్లాడేసరికి ఎవరూ జవాబు చెప్పలేదు. బేసిల్ రాకుమారుడు ఈ మాటలు మాట్లాడింది జులై 21వ తారీఖున. అప్పటికి అతని పరిస్థితి ఇంకా సుర క్షితంగానే వుంది. కాని కొద్దిరోజుల తరువాత 29 వ తారీఖున కొటొజోవ్‌కు రాకుమారిని బిరుదం ఇవ్వబడింది. అతన్నిలా బిరుదు ఇచ్చి గౌరవించడానికి కారణం పై వర్గాలవారు ఎలాగో ఒకలాగు అతన్నుంచి తప్పించుకోవాలని అనుకోవడమే అందుచేత బేసిల్ రాకుమారుణ్ణి ఈ విషయం కలవర పరచలేదు. కాని తను

మాత్రం అప్పటి నుంచీ కొంచెం జాగ్రత్తగా మాట్లాడడం మొదలు పెట్టాడు. ఆగస్టు 8వ తారీఖున సాల్టికోవ్, అరక్షేవ్, వియస్మిటినోవ్, లూప్కైన్, కోఘుబేలతో కూడిన ఒక కౌన్సిల్ సమావేశం జరిగింది. దండయాత్ర పురోగమనాన్ని గురించి చర్చించడానికి వారు సమావేశమైనారు. అధికార విభజన వల్లనే ఇంతవరకూ కూడా పరాజయం జరుగుతూ వచ్చిందనే నిశ్చయానికి వచ్చారు. కొంత ఆలోచించినా, తరువాత జార్‌కు, కొటొజోవ్ పట్ల కొద్దిగా మాత్రమే అభిమానం ఉన్నప్పటికీ, అతన్ని సేనకు జనరల్‌గాను దళాలు ఆక్రమించి ఉన్న జిల్లాకు కమాండర్ గాను నియమించడానికి నిశ్చయించుకున్నారు. ఆ సాయంత్రమే ఆ ఉద్యోగాన్ని స్థిరం చేశారు కూడా.

ఆ మరుసటి రోజుననే బేసిల్ రాకుమారుడు, అన్నాపావ్‌లోవ్‌నా ఇంట్లో ఆ ప్రతిభాశాలి అనబడే వ్యక్తితో కలిసి మాట్లాడుతూ ఉన్నాడు. ఆడపిల్లల తాలూకు ఒక సంస్థలో సూపర్నెంటుగా అతన్ని నియమించాలని బేసిల్ రాకుమారుడి కోరిక. బేసిల్ రాకుమారుడు విజయ గర్వంతో గదిలోకి నడుస్తూ వచ్చి తన ఆశలన్నీ ఫలించినట్లుగా అందరి వంక చూచాడు.

"విన్నారా ఈ వార్త? కొటొజోవ్ రాకుమారుణ్ణి మార్షల్‌గా నియమించారు! విభేదాలన్నీ సమసిపోయినాయి. నేనెంతో సంతోషిస్తున్నాను. చివరకు తగిన వ్యక్తి దొరికాడు." అంటూ అందరి వంకా చూచాడు.

ఆ ప్రతిభాశాలి కూడా మారు మాట్లాడలేదు. అన్నాపావ్‌లోవ్‌నా ఈ వార్తను తనుకూడా ఎంతో సంతృప్తితో స్వీకరించింది. కాని ఆ ప్రతిభాశాలి మాత్రం తన్ను తాను నిభాయించుకోలేక పోయాడు.

"కాని రాకుమారా! అతను గ్రుడ్డివాడని అంటారు కదా?" అని అడిగాడు ప్రతిభాశాలి.

"ఎవరన్నారు? అతనికి చూపు బాగానే కనిపిస్తుంది." అన్నాడు బేసిల్ రాకుమారుడు, గొంతు సవరించుకుంటూ, అతను సంకట స్థితిలో పడినప్పుడల్లా ఇలా గొంతు సవరించుకుంటూ ఉంటాడు. "అతనికి చూపు బాగానే కనిపిస్తుంది. నాకు తెలుసు. ఇంతవరకూ ఏ కమాండర్‌కూ సేనలపై ఇవ్వని అధికారాలను ఇప్పుడు జార్ అతనికి ఇచ్చాడు! జార్ తరువాత జార్ అంతటివాడు అతను" అన్నాడు.

"భగవంతుడు అతన్ని అలా రుజువుపరుచుకునేటట్లు చేస్తాడు గాక!" అన్నది అన్నాపావ్‌లోవ్‌నా.

దర్బారు పద్ధతులకు ఇంకా సరిగా అలవాటు పడని ప్రతిభాశాలి, ఆవిడ ఉద్దేశానికి తను కూడా వంతపాట పాడుతూ ఇలా అన్నాడు :

"చక్రవర్తి అయిష్టంగానే అతనికా ఉద్యోగం ఇస్తూ సంతకం పెట్టాడని అంటున్నారు. చక్రవర్తిగా తను- కొటొజోవ్‌కు ఆ పదవి ఇస్తున్నానని చెపుతున్నప్పుడు ఆయన ఆడపిల్ల లాగా సిగ్గుపడ్డాడట!"

"ఆయన అనుకున్నదానికీ, పరిస్థితులకూ ఏమీ సంబంధం లేదనుకుంటాను" అన్నది అన్నాపావ్‌లోవ్‌నా.

"అదేం కాదు, అదేం కాదు!" అన్నాడు బేసిల్ రాకుమారుడు. ఇప్పుడు అతను కొటొజోవ్‌కు వ్యతిరేకంగా ఒక్క మాట కూడా వినడంలేదు. "జార్ ఎప్పుడూ అద్భుతమైన అతని గుణగణాలను మెచ్చుకుంటూనే వచ్చాడు." అన్నాడు.

"అయితే కొటొజోవ్ అధికారాన్ని సక్రమంగా నిర్వర్తించి ఎవరూ అడ్డుపుల్లలు వేయకుండా భగవంతుడు ఆశీర్వదిస్తాడు గాక!" అన్నది అన్నాపావ్‌లోవ్‌నా.

బేసిల్ రాకుమారుడు ఆవిడ అంతరార్థాన్ని అర్థం చేసుకుని ఇలా అన్నాడు:

"నాకో విషయం గట్టిగా తెలుసు. కొటొజోవ్ మళ్ళీ జార్‌విచ్‌ని పిలిపించాలని చెప్పాడు. అతను అన్న మాటలివి: 'అతను తప్పు చేస్తే నేను శిక్షించలేను, అతను మంచి చేస్తే నేను బహూకరించలేను' అతను చాలా దూరదృష్టి కలవాడు. ఈ విషయం నాకు చాలాకాలం నుంచీ తెలుసు",

"చక్రవర్తి మళ్ళీ సేనలో చేరకుండా ఉండాలని ఆయన దగ్గర నుంచి వాగ్దానం కూడా తీసుకున్నాడటగా?" అని అడిగాడు ప్రతిభాశాలి.

అతను ఈ మాట అనేసరికి బేసిల్ రాకుమారుడు, అన్నాపావ్‌లోవ్‌నా ఒకరి వంక ఒకరు చూచుకున్నారు. ఇద్దరూ నిశ్వసించి ఊరుకున్నారు.

# 91

శ్రీ పిటర్స్‌బర్గ్‌లో ఇదంతా ఇలా జరుగుతూ ఉండగా ఫ్రెంచివారు స్మోలెన్స్క్ వదిలి మెల్లగా మాస్కో దాపుకు చేరుతున్నారు. థియర్స్ తను చరిత్ర వ్రాస్తూ నెపోలియన్ చరిత్ర వ్రాసిన చరిత్రకారు లందరిలాగానే తన నాయకుడి తప్పిదాలు తగ్గించి చూపడానికి యత్నించాడు. తనకు ఇష్టం లేకుండానే నెపోలియన్,మాస్కో పైకి వెళ్ళాడని వ్రాశాడు. ప్రపంచాన్నంతా మార్చే సంఘటనలకు ఒక వ్యక్తి ఉద్దేశమే కారణమని అనుకుంటే ఇది నిజం కావచ్చు. అది నిజమైతే చరిత్రకారులు వ్రాసిన మాట కూడా నిజమవుతుంది. తమ సేనాపతుల ప్రభావం వల్లనే వలలోకి వచ్చినట్లుగా నెపోలియన్ మాస్కో వైపుకు వచ్చాడని రష్యన్ చరిత్రకారులు, తనకు ఇష్టం లేకుండానే వచ్చాడని ఫ్రెంచి చరిత్రకారులు వ్రాశారు. గడిచిన సంఘటనల పరిణామాన్ని, వాటివల్ల ఏర్పడిన ఫలితాలను మనం పరిశీలిస్తే మనకు

వాటి రెంటికీ నడుమ ఒక సంబంధం కనిపిస్తుంది. అది వాటిని మరింత క్లిష్ట తరం చేయడం కూడా మనకు కనిపిస్తుంది. మంచి ఆటగాడైన ఒక చదరంగపు ఆటగాడు, ఆటలో తన తప్పు వల్లనే ఓడిపోయానని తెలిసినప్పుడు ఆట జరుగుతూ ఉండగా తను చేసిన తప్పులన్నీ అవతల ఉంచి మొదట్లో తను ఏం తప్పు చేశాడో ఊహించ డానికి మొదలు పెడతాడు. యుద్ధం అనే ఆట ఇంతకంటె కూడా చాలా పెద్దది. ఆ ఆట సాగే పరిస్థితులపై అది ఆధారపడి ఉంటుంది; ఒక్క వ్యక్తి ఉద్దేశం మీద ఆధారపడి ఉండదు. అనేక మంది ఉద్దేశాలు, ఉద్వేగాలు ఢీకొన్న సంఘర్షణలో అది ఉత్పన్నమవుతుంది.

నెపోలియన్ స్మోలెన్స్క్ వదిలిపెట్టిన తరువాత మొదట్లో వియజ్మా దగ్గర ఉన్న డొరొగొబో వద్దనూ తరువాత జారవోషంషే వద్దనూ నిలుపు యుద్ధం చేద్దా మని ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. అతను మాస్కోకు నూట పన్నెండు వెర్స్ట్‌ల దూరంలో ఉన్న బొరొడినోవ్ చేరే వరకూ అనేక పరిస్థితుల వల్ల రష్యన్‌లు అతన్ని ఎదుర్కోలేక పోయారు. వియజ్మాలో నెపోలియన్ పురాతన రాజధానిపై దాడి చెయ్యమని సేనలను ఆజ్ఞాపించాడు. అనేక చర్చీలతో కూడిన మాస్కో అతని ఊహకు ఎంతో ఉబలాటం ఇచ్చింది. తన చిన్న వెన్న రంగు గుర్రం మీద తన పరివారంతో కలిసి వియజ్మాకు బయలు దేరాడు. బెర్థి యర్ కొంచెం వెనకాల ఆగి వెలోర్గిన్ డీ ఇడవెల్లీ సహాయంతో ఒక రష్యన్ ఖైదీని ఏదో అడిగి వెంటనే వచ్చి తన యజమానిని కలుసుకుని సంతృప్తితో చూస్తూ ఆయన ముందు ఆగాడు.

"ఏమిటది?" అని అడిగాడు నెపోలియన్.

"ఇప్పుడే మనం ఖైదీగా పట్టుకున్న ఒక కోసక్కు, ప్లాటోవ్‌దళం అసలు సేనలో వెళ్ళి కలుస్తున్నదని, కొటొజోవ్ ఛీఫ్‌కమాండర్‌గా నియమింప బడ్డానని చెపుతున్నాడు. వీడికి చాలా తెలివితేట లున్నట్లుగా ఉన్నాయి." అన్నాడు బెర్థి యర్.

నెపోలియన్ చిరునవ్వు నవ్వి ఆ కోసక్కును గుర్రం ఎక్కించి తీసుకుని రమ్మన్నాడు. తనే స్వయంగా అతనితో మాట్లాడతా నన్నాడు. కొందరు సహాయ సేనాపతులు వెంటనే దౌడుతీస్తూ వెళ్ళి ఒక్క క్షణంలో మన పాతస్నేహితుడైన లావ్‌రుష్కాను పట్టుకుని వచ్చారు. అతను పూర్వం డెనిసోవ్‌కు సేవకుడు. తరు వాత నికోలస్ రోస్టోవ్‌కు సేవకుడు. అతను స్వారీచేస్తూ వచ్చి నెపోలియన్ ముందు ఆగాడు. తను నెమ్మదిగా ప్రశ్నలడగవచ్చు గదా అని తన వెంట స్వారీచేస్తూ రమ్మని నెపోలియన్ అతనితో చెప్పాడు.

"నీవు కోసక్కువు కదూ?" అని అడిగాడు నెపోలియన్.

"అవునయ్యా." అన్నాడు లావ్రుష్కా.

తను మాట్లాడుతున్నది నెపోలియన్‌తో అని లావ్రుష్కాకు తెలీలేదు. ప్రాచ్యుడైన తను ఆయన్ను చక్రవర్తిగా అర్థం చేసుకోలేక వెంటనే ఉన్న విషయాలన్నీ మాట్లాడేశాడు. లావ్రుష్కా కొద్దిగా త్రాగి ఉన్నాడు. అంతకు ముందు రోజు తన యజమానికి సరిగ్గా విందు సమకూర్చలేక పోవడంవల్ల అతన్ని బాగా చీవాట్లు వేసి ప్రక్కనున్న గ్రామానికి కోడిపెట్టలు అవి తీసుకరమ్మని పంపారు. అక్కడ అతను దోపిడీ సాగిస్తూ ఉండగా అతన్ని ఫ్రెంచివారు పట్టుకున్నారు. లావ్రుష్కా జీవితం అనేక తరహాలుగా నడిచింది. చల్లటి ఎలాంటి గమ్మత్తునైనా అతను చేయగలడు. ఒక గజం దూరంలో ఉండే, తన పై అధికారి మనస్తత్వాన్ని ఇట్టే కనిపెట్టి చెప్పేయగలడు. ఇప్పుడు నెపోలియన్ దగ్గరికి రాగానే వెంటనే గుర్తించి ఆయనమన్ననలు సంపాదించడానికి ప్రయత్నం మొదలుపెట్టాడు.

రష్యన్ సేనలో అనుకుంటూ ఉన్న విషయాలన్నీ తను చెప్పాసాగాడు. కాని నెపోలియన్,'వారు బోనపార్టీని ఓడించ గలుగుతామని అనుకుంటున్నారా' అని అడిగేసరికి, అతనొక్కక్షణం ఆలోచించి ఇలా అన్నాడు:

"యుద్ధం కనుక త్వరగా జరిగేటట్టయితే మీరు గెలవడానికి అవకాశాలున్నాయి. కాని ఇకమూడు రోజుల వరకూ యుద్ధం జరగకుండా ఉండేటట్టయితే చాలారోజులు పట్టవచ్చు."

విచిత్రమైన ఈ జవాబును వెలోర్గిన్ డీ ఇడవెల్లీ చక్రవర్తికి ఇలా తర్జుమా చేసి చెప్పాడు:

"మూడు రోజులలో కనుక సమరం జరిగేటట్లయితే ఫ్రెంచివారు గెలుస్తారు. లేక వాయిదా వేసేటట్లయితే తరువాత ఏమవుతుందో దేవుడికే తెలియాలి."

ఆ క్షణంలో ఎంతో కులాసాగా ఉన్న నెపోలియన్ ఈ మాటలు విని వాటిని మళ్ళీ చెప్పించుకున్నాడు. లావ్రుష్కా ఇంకా అతనంటే ఎవరో తనకు తెలియనట్టుగానే నటిస్తున్నాడు.

"అందరినీ జయించిన నెపోలియన్ ఫ్రెంచివారిపట్ల ఉన్నాడని మాకుతెలుసు. కాని మా విషయం వేరు. మమ్ములను ఆయనంత సులభంగా పట్టలేడు!" అన్నాడు లావ్రుష్కా సగర్వంగా, తర్జుమాచేసే వ్యక్తి ఈ వాక్యంలో రెండవ భాగాన్ని వదిలి మొదటి భాగాన్ని మాత్రమే తర్జుమా చేసి చక్రవర్తికి చెప్పాడు. యువకుడైన ఈ కోసక్కు మాటలు విని నెపోలియన్ చిరునవ్వు నవ్వాడు.

నెపోలియన్ తన గుర్రాన్ని కొద్ది అడుగులు ముందుకు పోనిచ్చి బెర్థియర్‌తో

మాట్లాడసాగాడు. ఇప్పుడతనితో మాట్లాడుతోన్న డాన్‌నదీ మైదానాల్లో జన్మించిన ఈ బిడ్డకు (లావ్‌రుష్కా) తను మాట్లాడుతున్నది చక్రవర్తితోనని, ఈజిప్టు పిర మిడ్లపై పేరు చెక్కబడిన చక్రవర్తితోనే నని చెపితే అతను ఏమనుకుంటాడో చూడా లని ఉన్నదని నెపోలియన్ అన్నాడు. ఈ మాట వినగానే తను భయపడతానని నెపోలియన్ ఊహిస్తున్నాడని అర్థం చేసుకుని లావ్‌రుష్కా, వెంటనే ఆశ్చర్యాన్ని ప్రకటింపచేశాడు. కళ్ళు పెద్దవి చేసి, ముఖంలో కలవరం చూపించి తప్పు చేసిన వ్యక్తి దెబ్బలు తినబోయే ముందు ఎలా భయపడతాడో అలా భయాన్ని చూపించ సాగాడు. తర్జుమాచేసే వ్యక్తి ఆ విషయం చెప్పాడో లేదో కోసక్కు మాట్లాడకుండా చక్రవర్తి వంకే చూస్తూ ఆయన వెంట స్వారీచేస్తూ వెళ్ళసాగాడు. అతని చనువంతా చల్లారిపోయి, నిశ్చేష్టుడై ఒక ప్రతిమలాగా నిలిచిపోయాడు. నెపోలియన్ అతని కొక బహుమానం ఇచ్చి, స్వేచ్ఛ ఇచ్చేసి పక్షిలాగా పొలాల్లో ఇంటికి ఎగిరి పొమ్మని చెప్పాడు.

చక్రవర్తి తనదోవన సాగిపోయాడు. ఆయన మనస్సంతా మాస్కోమీదనే ఉంది. ఆయన ఊహాపథంలో అప్పుడు మాస్కో తప్ప మరేమీ లేదు. పక్షి మళ్ళీ పొలాల్లో గూటికి చేరినట్లే, లారుష్కా మళ్ళీ స్వేచ్ఛగా తన రష్యన్ సరిహద్దులలోకి వెళ్ళిపోయాడు. తను తన సహచరులకు చెప్పబోయే తన చిత్రమైన గాథను గురించి ఆలోచిస్తూ సాగిపోయాడు. అతనెప్పుడూ ఉన్నమాటకు ఎంతో కల్పన చేసిగాని చెప్పడు. దారిలో కనిపించిన కోసక్కును తన దళం ఎక్కడున్నదని అడిగాడు. ఇప్పుడది వెళ్ళి ప్లాటోవ్ దళంతో కలిసిందని తెలుసుకుని మధ్యాహ్నం అయ్యేసరికి జన్‌కోవ్ చేరుకున్నాడు. అక్కడ తన దళం బసచేసి ఉంది. నికోలస్ రోస్టోవ్, ఇలైను అప్పుడే ప్రక్కగ్రామాలు చూచి వద్దామని తమ గుర్రాల మీద బయలుదేర బోతున్నారు. లావ్‌రుష్కాను చూచి అతన్ని కూడా తమతోపాటు రమ్మన్నారు.

## 92

తన అన్న ఆండ్రూ ఊహించినట్లుగా మేరియా రాకుమారి ఇప్పుడు మాస్కోలో ప్రమాదానికి దూరంగా లేదు.

సేవకుడైన ఆల్పటిచ్, స్మోలెన్స్క నుంచి తిరిగి వచ్చేసరికి వృద్ధ రాకుమా రుడు హఠాత్తుగా ఒక విచిత్రమైన నిద్రనుండి మేలుకొన్నాడు. గ్రామాల్లో నుంచి రక్షకసేన నంతా పోగుచేయ వలసిందని ఆయుధాలు ధరించ వలసిందని ఉత్తర్వులు జారీచేశాడు. తాను లిస్సీ—గోరీలోనే ఉండి చివరకూ పోరాడడానికి నిశ్చయించు కున్నానని ఛీఫ్‌కమాండర్‌కు ఒక ఉత్తరం కూడా వ్రాశాడు. అతనిష్టం వచ్చినట్లు అతను చెయ్యవచ్చునని, తను మాత్రం అక్కడే ఉంటాననీ, వృద్ధుడైన ఒక రష్యన్

జనరల్ సమరంలో చనిపోవడమో, లేక శత్రువు చేతుల్లో బందీ కావడమో జరుగుతుందనీ వ్రాశాడు. తరువాత లిస్సీ—గోరీ వదిలి వెళ్ళకుండా ఉండే తన నిశ్చయాన్ని ఇంట్లో వారందరికీ చెప్పాడు. తన కుమార్తెతో చిన్ని రాకుమారుణ్ణి బొగొషొరోవ్‌కు తీసుక వెళ్ళవలసిందని, డెసాలీతో కలిసి వారు వెళ్ళడానికి తను వెంటనే ఏర్పాట్లు చేస్తున్నానని చెప్పాడు. మేరియా రాకుమారి ఇన్నాళ్ళ మాంద్యం తరువాత ఆయనకు విచిత్రంగా కలిగిన ఈ విపరీతమైన ఉద్వేగాన్ని చూచి కలవరపడి, ఆయన్ను ఒంటరిగా వదిలి వెళ్ళలేక, తన జీవితంలో మొట్ట మొదటి సారిగా ఆయన మాటకు ఎదురు చెప్పింది. తను వెళ్ళనని అన్నది. అందుచేత తను ఒక పెద్ద తుఫానుకు గురి కావలసి వచ్చింది. ఆవిడ తండ్రి ఆ కోపంలో అనేక కల్పిత నిందలతో ఆవిడను తిట్టిపోయసాగాడు. కుమార్తెను అనరాని మాటలన్నీ అన్నాడు. తన బ్రతుకులో విషంపోసి తన బ్రతుకంతా పాడుచేసిందనీ, తనకూ,తన కొడుక్కూ కాకుండా చేసిందనీ, తన మీద ఎన్నో చెప్పరాని నిందలు మోపిందనీ అన్నాడు. చివర కామెను తన ముందు నుంచి వెళ్ళిపొమ్మన్నాడు. ఆవిడ ఇష్టప్రకారం ఆవిడ ఉండవచ్చు నన్నాడు. ఇక తను ఆవిడతో మాట్లాడవలసిన అవసరం లేదని, ఇక ఎన్నడూ తన జీవితంలో ఆవిడను చూడననీ అన్నాడు. మేరియా రాకుమారి తనను ఆయన బలాత్కారంగా బండి ఎక్కించనందుకు మాత్రం సంతోషించింది, అందువల్ల తను అక్కడే ఉన్నందుకు తన తండ్రి సంతోషిస్తున్నాడని కూడా అనుకున్నది.

తన మనుమడు వెళ్ళిపోయిన మరుసటిరోజు వృద్ధుడు పూర్తిగా దుస్తులు వేసుకుని చీఫ్‌కమాండర్ కోసం కాచుకుని ఉంటానని చెప్పాడు. అతని బండి వాకిటి దగ్గర ఉంది. అతని కుమార్తె చూస్తూనే ఉన్నది. ఆయన ఉత్తర్వులు చేస్తూ తోటలోకి తన సేవకులను, రైతులను తనిఖీ చేయడం కోసం వెడుతూ ఉన్నాడు. కిటికీ దగ్గర కూచుని ఆయన ఉత్తర్వులను ఆవిడ వింటోంది. హఠాత్తుగా కొందరు భయంతో ఇంటి తోటలోకి పరుగెత్తుకుని రావడం ఆవిడ చూచింది. వెంటనే ఆమె పరుగెత్తుకుని బయటికి వెళ్ళింది. ఆమె తోటలో మలుపు తిరుగుతూ ఉందో లేదో కొందరు రక్షక సైనికులు అటువంక రావడం ఆమె చూచింది. వారి మధ్యలో ఆవిడ తండ్రికూడా ఉన్నాడు. వారు ఆయన్ను మోసుకుని వస్తున్నారు. ఆయన కాళ్ళు వ్రేలాడుతున్నాయి. ఆవిడ ముందుకు వెళ్ళింది. నిమ్మచెట్లలో గుండా దోబూచులాడుతున్న వెలుగునీడలు ఆయన ముఖంలోని మార్పులు ఆవిడకు కనిపించకుండా చేస్తున్నాయి. ఆవిడ దగ్గరికి వెళ్ళగానే చకితురాలైపోయింది. ఆయన

ముఖంలో బలహీనత, వినయము కనిపిస్తున్నాయి. కుమార్తెను చూడగానే ఆయన పెదవులు అసహాయంగా కదిలాయి. అస్పష్టంగా ఏదో శబ్దం వెలువడింది.

వారు ఆయన్ను గదిలోకి మోసుకునిపోయారు. ఆయన్ను పరుపుమీదపడుకో బెట్టారు. పూర్వం ఆ పరుపును చూడాలంటే అయన కెంతో భయంగా ఉండేది.

గ్రామంలోకి వెళ్ళి ఒక డాక్టరును తీసుకుని వచ్చారు. ఆ రాత్రే రక్త పరీక్ష చేశారు. కుడివైపు భాగమంతా పక్షవాతంతో పడిపోయిందని డాక్టర్ చెప్పాడు. లిస్సీ-గోరీలో ఉండడం నానాటికి ప్రమాదకరంగా కనిపించబట్టి మేరియా రాకుమారి ఆ మరుసటిరోజే రోగగ్రస్తుడైన తనతండ్రిని తీసుకుని బొగొషారోవ్‌కు వెళ్ళింది. అక్కడ ఉన్న తన చిన్ని మేనల్లుణ్ని, ట్యూటరైన డెసాలీని వెంట ఇచ్చి మాస్కోకు పంపింది.

వృద్ధుడు మూడు వారాలపాటు బొగొషారోవ్‌లో తన కుమారుడు కట్టించిన కొత్త ఇంట్లోనే ఉన్నాడు. అదే పరిస్థితిలో ఉన్నాడు. ఆయనకు మనస్సు పూర్తిగా పోయింది ఎటూ కదలకుండా నిర్జీవంగా పడి ఉన్నాడు. ఏదో అస్పష్టంగా శబ్దాలు చేస్తున్నాడు. తనచుట్టూ ఏం జరుగుతున్నదీ ఆయన తెలుసుకుంటున్నాడో లేదో చెప్పడం అసాధ్యం. ఎవరూ ఊహించలేని ఏదో వాంఛను ఆయన వ్యక్తపరుస్తు న్నట్లుగా ఉన్నది. అది ఒక రోగగ్రస్తుని విలాసపూరితమైన కోరిక కావచ్చు. లేక ఒక బలహీనుడి- చెదిరిపోయిన మనస్సులో రేగిన ఒక ఊహాకల్పన కావచ్చు. ఆయన ఏం కోరుకుంటున్నాడో ఎవరు చెప్పగలరు?

దీనికి పెద్ద కారణమేమీ లేదనీ, కేవలం శారీరకంగా మాత్రమే ఆయన ఇలా ఉన్నాడనీ డాక్టర్ చెప్పాడు. కాని మేరియా రాకుమారి మాత్రం అది కాదని అను కుంది. ఆవిడ దగ్గరున్నప్పుడు ఎక్కువవుతూ వచ్చి ఆయన ఆందోళన ఆవిడ నమ్మకాన్ని స్థిరపరిచింది. ఆయనకు జబ్బు నయమవుతుందనే అవకాశాలేమీ కనిపిం చడం లేదు. ఆయన్ను అక్కడనుంచి కదిలించడానికి కూడా వీలులేకుండా ఉంది. ఆయనకు దారిలో ప్రాణం పోవచ్చు కూడా. ఈ పరిస్థితిలో బ్రతికి ఉండడం కంటె ప్రాణం పోవడమే మంచిదేమో అని అనుకున్నది మేరియా రాకుమారి. ఆవిడ ఆయన్ను ఒక్కక్షణం కూడా వదిలిపెట్టి వుండడం లేదు. రాత్రింబగళ్ళు ఆయన్నే కనిపెట్టుకుని ఉంటోంది. ఆయన ఏ మాత్రం కదిలినా కనిపెడుతోంది. ఆయన తేరు కుంటాడని మాత్రం కాదు. ఆయన ఆఖరుక్షణం ఎప్పుడు సమీపిస్తుందో అని చూస్తోంది. అంతకంటే కూడా ఘోరమైన విషయం మరొకటుంది. ఈ విషయం తననుంచి తానుకూడా దాచుకోలేకపోయింది. తండ్రికి జబ్బుచేసినప్పటి నుంచీ, ఎంతో కాలం నుంచీ తనలో దాగి ఉన్న కోరికలు, ఆశలు, మళ్ళీ ఆవిడలో రేకెత్తసాగాయి. స్వతంత్ర జీవితం గడుపుదామనే కలలు, కొత్త ఆనందాన్ని అనుభవిద్దామనే ఆశలు,

తన తండ్రినుంచి విముక్తి పొందాలనే కోరికలు, ప్రేమించాలనీ, ప్రేమించబడాలనీ, వివాహ జీవితం తాలూకు ఆనందాన్ని చవి చూడాలనీ; ఈ ఆశలన్నీ ఆవిడ మనస్సులో వేటాడసాగాయి. ఆవిడ ఎంత పారద్రోలుకుందామని యత్నించినప్పటికీ అవి మళ్ళీ ఆవిడ మనస్సులో ముసురుతూనే ఉన్నాయి. ఆయన పోగానే తను ఎలాటి జీవితం గడపగలనోనని ఆవిడ మనస్సులో ఊహించుకుంటోంది. ఈ ఆకర్షణ నుంచి విముక్తి పొందడం కోసం ప్రార్థన చేస్తోంది.

బొగొషొరోవ్‌లో ఉండడంలో కూడా కొంత ప్రమాదం వుంది. ఫ్రెంచివారు దాపుకువస్తూ వున్నారు. ప్రక్కనే వున్న ఒక ఎస్టేటు దోచుకున్నారు కూడా.

రోగగ్రస్తుణ్ని అక్కడ నుంచి కదిలించాలని డాక్టరు గట్టిగా చెప్పాడు. ఆ రాష్ట్ర గవర్నర్ ప్రత్యేకంగా మేరియా రాకుమారి దగ్గరికి ఒక రాయబారిని పంపి సాధ్యమైనంత త్వరలో ఆవిడను అక్కడ నుంచి వెళ్ళమని కబురు అందచేశాడు. స్థానికంగా ఉన్న ఒక పెద్ద వచ్చి, ఫ్రెంచి దళాలు అక్కడికి నలభై మైళ్ళ దూరం లోనే ఉన్నాయని ఆమెకు చెప్పాడు.

"శత్రువు చేసిన ప్రకటన అన్నిచోట్లకూ అందచేయబడింది. ఆవిడ వెంటనే అక్కడ నుంచీ కదలక పొయ్యేటట్లయితే రాబొయ్యే పరిస్థితులకు తాను బాధ్యుడు కాదు" అని గవర్నర్ ఆమెకు కబురుపంపాడు.

ఆమె చివరకు ఆగస్టు 15వ తారీఖున వెళ్ళాలని నిశ్చయించుకుంది, 14 వ తారీకంతా ఉత్తర్వులిస్తూ ప్రయాణసన్నాహాలు చేసుకుంటూ గడిపింది. మామూలు ప్రకారం బట్టలు కూడా మార్చుకోకుండా తన తండ్రి పడుకున్న గదిప్రక్క చిన్న గదిలోనే ఆ రాత్రంతా గడిపింది. ఆవిడ నిద్రపోలేదు. మాటి మాటికీ తండ్రిగది తలుపు దగ్గరికి వెళ్ళి వింటోంది. ఆయన మూలగడం వినిపిస్తోంది. డాక్టరు, టిహోన్ ఆయన్ను లేవనెత్తి మరోప్రక్కకు ఒత్తిగిల చేసి పడుకోబెట్టారు. ఆవిడ లోపలికి వెళ్ళేదెకాని భయం వల్ల వెళ్ళలేక పోయింది. ఎవరు లోనికి వచ్చినా ఆవిడ తండ్రి ఎంత కలవరపడతాడో ఆవిడకు తెలుసు. తను ఆందోళనతో ఆవిడ వంక చూచి నప్పుడల్లా ఆయన ముఖం ప్రక్కకు తిప్పుకునేవాడు. ఈ మధ్య రాత్రిలో తను వెడితే ఆయన ఎంతో కలవరపడి నొచ్చుకుంటాడని ఆవిడ అనుకుంది. కాని ఈ క్షణంలో ఆయనపట్ల ఆవిడకు కలిగినంత జాలి మరెప్పుడూ కలగలేదు. ఆవిడ భావాల్లో ఒక తీవ్రమైన మార్పు ఏర్పడసాగింది. ఆయన ఎక్కడ తన్ను విడిచి పోతాడో అని భయపడసాగింది. తామిద్దరూ గడిపిన దీర్ఘ వత్సరాలు జ్ఞాపకం చేసు కోగా ఆయన చేసిన ప్రతిపనీకూడా తనపట్లగల అనురాగానికి తార్కాణంగానే ఆవిడ ఊహకు తోచింది. భవిష్యత్తులోనీ స్వేచ్ఛతాలూకు గల విచార పూరితమైన ఈ ఆలోచనకు అడ్డువచ్చేసరికి తక్షణమే ఆవిడ ఆ ఆలోచన తాలూకు తలుపులు మూసి

వేసుకునేది, చివరకు అలసిపోయి ఆయన కదలడం, చప్పుడు, సద్దుమణగగానే తెల్లవార వస్తూ ఉండగా ఆవిడ నిద్రపోయింది. చాల ప్రొద్దెక్కేవరకూ నిద్ర లేవలేదు.

మనం లేవగానే సాధారణంగా మేలుకునే మన బుద్ధికి మన జీవితంలో కల్లా ప్రధానమైన ఒక భావం స్ఫురిస్తుంది. అలాగే ఆవిడ లేవగానే ఆవిడ చైతన్యానికి ఆ భావం స్ఫురించింది. ఆవిడ మెల్లగా వింటూ కూచుంది, ప్రక్కగదిలో మామూలుగా వినిపించే మూలుగు తప్ప మరేమీ వినిపించడంలేదు. తనకు తాను బరువుగా నిశ్వసించి ఇలా చెప్పుకుంది.

"ఎప్పుడూ ఇంతే, ఎప్పుడూ ఇంతే—అయితే ఇంతకూ నేను కోరుకుంటున్న దేమిటి? అంతకంటె మరేం ఉంటుంది? ఆయన చనిపోవాలని కోరుకుంటున్నాను!" అనుకున్నది తనమీద తనే అసహ్యపడుతూ. వెంటనే లేచి ముస్తాబు ముగించుకుని మెట్లమీదికి వెళ్ళింది. అప్పుడే బండ్లకు గుర్రాలు కడుతున్నారు. సామానులు అప్పుడే బండిలోకి ఎక్కించారు. అది చల్లని మెల్లని ఉదయం. డాక్టర్ ఆవిడ దగ్గరికి వచ్చాడు.

"ఇవాళ ఉదయం కాస్త నిమ్మళంగా ఉన్నట్టుగా ఉంది. నేను మీకోసం చూస్తున్నాను. కొంచెం తెలివిగా మాట్లాడుతున్నాడు. మీ కోసం అడుగుతున్నాడు. రండి, వెళ్ళి చూద్దాం" అన్నాడు డాక్టర్.

ఆవిడ ముఖం వివర్ణమైంది. ఆవిడ నిలుచోలేక గడపకు ఆనుకుంది. ఆవిడ హృదయం వేగంగా కొట్టుకోసాగింది. ఆయన్ను చూడాలన్నా, ఆయనతో మాట్లాడాలన్నా ఆవిడకు సుఖము, దుఃఖము, సిగ్గు కలిసిన ఒక విచిత్రమైన భయంలాగా కనిపించసాగింది.

"రండి!" అన్నాడు డాక్టర్ మళ్ళీ.

ఆవిడ ఆయన వెనకాలే వెళ్ళింది. తండ్రి పక్క దగ్గరికి చేరింది. ఆయన దిండ్లమీద తలపెట్టుకుని వెల్లకిల పడుకుని ఉన్నాడు. ఎండిన కొమ్మలవంటి ఆయన చేతులు తెల్లని పక్కమీద పరుచుకుని ఉన్నాయి. ఎడమకన్ను గాజుకన్నులా నిశ్చలంగా చూస్తోంది. పెదవులు మూసుకుని ఉన్నాయి. ముఖంనిండా ముడతలు కనిపిస్తున్నాయి. ఆయన చూపు ఎంతో జాలిగొలిపేటట్లుగా ఉంది. ఆయన కుమార్తె ఆయన చేతిని ముద్దాడింది. ఆయన ఎడమచేతిని తన చేతిలోకి తీసుకుంది. ఆయన ఆవిడ కావాలని కోరుకుంటూ ఉన్నాడు. ఒకటి రెండు పర్యాయాలు ఇలా చేశాడు. ఆయన నుదురు, పెదవులు అదిరాయి.

ఆవిడ ఆయనవంక కలవరంతో చూచింది... ఆయన కోరుతున్న దేమిటి?

ఎడమకంటితో ఆయన తన్ను చూచేటట్లుగా ఆవిడ చోటు మార్చి కూచుంది. ఆయన వెంటనే చల్లబడి పోయాడు. ఆయన ఏదో మాట్లాడాలని ప్రయత్నించాడు. తరువాత నాలుక కొంచెం కదిలింది. మొదట్లో ఏవో అస్పష్టంగా కొన్ని శబ్దాలు వినిపించాయి, కాని తరువాత ఆందోళనతోను, బాధతోను ఏవో కొద్దిమాటలు చెప్పాడు. తనకుమార్తె వంక భయంతో బ్రతిమాలుకుంటున్నట్లు చూచాడు. తనను ఆవిడ అర్థం చేసుకోలేదేమో అనుకున్నాడు. ఆయన మాట్లాడడానికి అలా విచిత్రంగా అవస్థపడడం చూచేసరికి మేరియా రాకుమారి తనలో పొంగి వస్తున్న ఏడుపును ఆపుకోవడం కోసం క్రిందికి చూచింది. ఆయన అవేమాటలు మళ్ళీ మళ్ళీ అనబోయాడు. వాటి అర్థాన్ని ఆవిడ పోగుచేసుకో లేకపోయింది. ఆవిడ భయపడుతున్నదా అని ఆయన అడుగుతున్నాడేమో అనుకున్నాడు డాక్టర్.

"ఆయన మనస్సు బాగాలేదని అంటున్నట్లుగా ఉన్నాడు" అన్నది మేరియా రాకుమారి.

అవునన్నట్లు తల ఊపాడు ఆవిడ తండ్రి. ఆవిడ చెయ్యి దగ్గరికి తీసుకుని అది ఉంచడానికి ఏది మంచిస్థలమా అన్నట్లుగా తన రొమ్ముల మీద అటూ ఇటూ ఒత్తుకున్నాడు.

"నే నెప్పుడూ నిన్ను గురించే ఆలోచిస్తున్నాను" అన్నాడు వృద్ధుడు స్పష్టంగా, తన్ను ఆవిడ అర్థం చేసుకున్నందుకు సంతోషిస్తూ, తరువాత ఆవిడ కన్నీళ్ళు దాచుకోవడానికి తలవంచింది. ఆయన ఆవిడజుట్టు నిమురుతూ ఇలా అన్నాడు:

"నిన్ను రాత్రంతా పిలిచాను"

"నాకు తెలిస్తే వచ్చేదాన్నే....లోపలికి రావడానికి భయపడ్డాను" అన్నది రాకుమారి. ఆయన ఆవిడ చెయ్యి ఒత్తుకున్నాడు.

"అయితే నీవు నిద్రపోవడం లేదన్నమాట?" అని అడిగాడు.

"లేదు" అన్నదావిడ తల ఊగిస్తూ. ఆవిడకు తెలీకుండానే ఆవిడ మీద తన ప్రభావం చూపింది. ఆవిడ కూడా ఆయన లాగానే కష్టం మీద మాట్లాడుతోంది.

"నా చిన్న అమ్మాయ్..." అంటూ వృద్ధుడు ఏదో గొణుక్కున్నాడు. మేరియా రాకుమారికి ఆ మాట ఏమిటో సరిగ్గా తెలీలేదు. కాని ఆయన చూపుమాత్రం అదేదో చాలామృదువైన మాటగా ఆవిడకు తెలియచేసింది. అలాటి మాట ఇంతవరకెన్నడూ తాను విననట్లుగా ఆవిడకు స్ఫురింప చేసింది.

"నీవెందుకు లోపలికి రాలేదు?" అని అడిగాడాయన.

"అప్పుడు నేనా? అప్పుడు నేనా ... అప్పుడు నేను ఆయన చనిపోవాలని కోరుకుంటున్నాను కదూ?" అని అనుకున్నది ఆ పిల్ల, తనలో.

"నీకు కృతజ్ఞత అమ్మాయ్! నీకు కృతజ్ఞత—నీవు చేసిన దానికంతా నీకు

కృతజ్ఞత!" అంటూ వృద్ధుడు రెండు కన్నీటి చుక్కలు రాల్చాడు. "ఆంద్రూషాను పిలువు...." అన్నాడు కలవరంతో చూస్తూ.

"అతని దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది" అన్నది మేరియా.

ఆయన ఆవిడవంక ఆశ్చర్యంతో చూచాడు.

"ఏం? ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"సేనతో స్మోలెన్స్కలో వున్నాడు" అని చెప్పిం దావిడ.

తరువాత చాలాసేపు నిశ్శబ్దం. ఆయన కళ్ళు మూసుకొని పడుకున్నాడు. కాని వెంటనే కళ్ళుతెరిచి అంతా జ్ఞాపకం వచ్చినట్లుగా తల ఊపాడు.

"అవును కదూ? రష్యా ఓడిపోయింది? అన్నాడు.

తరువాత నిమ్మళించి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. చెయ్యి కొంచెం కదిలించాడు. ఆయన కన్నీళ్ళు తుడిచిన టిహోన్ ఇది అర్థం చేసుకున్నాడు. ఆయన మళ్ళీ ఏవో కొన్నిమాటలు కలవరంగా మాట్లాటాడు. ఆయన మాట్లాడుతున్నది తన కుమారుణ్ని గురించో, తన మనుమణ్ని గురించో, తన కుమార్తెను గురించో లేక రష్యాను గురించో ఎవరూ చెప్పలేకపోయారు. ఎంచాతనో కాని "టిహోన్! నీవు వెళ్ళి నీ తెల్లని గౌను వేసుకునిరా...అదంటే నాకిష్టం..."అన్నాడు. తరువాత మేరియా రాకుమారివంక తిరిగి "అదే!" అన్నాడు.

ఆయన ఈ మాట అనేసరికి ఆవిడ వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆవిడను నిమ్మళింప చేయడంకోసం డాక్టరు ఆవిడను చెయ్యి పుచ్చుకొని గదిలోనుంచి అవతలికి తీసుకొని వెళ్ళాడు. ప్రయాణపు ఏర్పాట్లు పూర్తి చేయించాలనుకున్నాడు. వృద్ధరాకుమారుడు మాట్లాడుతూనే ఉన్నాడు. తన కుమారుణ్ని గురించి, యుద్ధాన్ని గురించి, జార్‌మీద కోపంతోను తన సన్నని గొంతుక ఎత్తి మాట్లాడుతూనే ఉన్నాడు. హఠాత్తుగా మరో పక్షవాతపు దెబ్బవచ్చి ఆయన మాట్లాడకుండా ఊరుకున్నాడు.

రోజు పలుచబడింది. ఎండబాగా కాస్తోంది. కాని మేరియారాకుమారి బాల్కనీ దగ్గర నిలుచుని ఆ విషయమే ఆలోచించడంలేదు. ఆవిడ మనస్సులో ఇప్పుడేమీ లేదు. తన తండ్రిపట్ల ఒక విధమైన మృదుత్వం ఆవిడలో హఠాత్తుగా ఏర్పడింది. తండ్రిపట్ల ఇప్పుడు కలిగినంత మమత్వం ఆమె కెప్పుడూ కలగలేదు. మెట్లుదిగి తన అన్న ఇటీవలే నాటిన నిమ్మచెట్ల త్రోవగుండా కొలను దగ్గరికి వెళ్ళింది.

"అవును, ఆయన చనిపోవాలనుకున్నారు!" అన్నది బిగ్గరగా తన కలవరంలో. "ఆ పని త్వరగా జరిగితే నాకు విశ్రాంతి చిక్కుతుందను కున్నాను. కాని ఆయన పోయిన తరువాత నాకు విశ్రాంతి ఎందుకు?" ఆవిడ తోట చుట్టూ తిరిగి మళ్ళీ ఇంట్లోకి వచ్చింది. వాకిలి దగ్గరికి వచ్చే సరికి ఎవరో ఒక కొత్తవ్యక్తి మదాం

బోరిస్‌తో కలిసి వాకిలి దగ్గరకు రావడం ఆవిడకు కనిపించింది. బోరిస్ కూడా బొగాషారోవ్‌లోనే ఉంటోంది. ఆ వస్తున్న కొత్త వ్యక్తి ఆ రాష్ట్రి గవర్నరు. తను స్వయంగా మేరియా రాకుమారితో చెప్పి ఆవిడను అక్కడ నుంచి పంపించాలని వస్తూ వున్నాడు. అతను చెప్పిన మాటలన్నీ ఆవిడ విన్నది. కాని పట్టించుకోలేదు. అతణ్ణి భోజనశాలలోకి తీసుకుని వెళ్ళి తన ప్రక్కనే భోజనానికి కూచోబెట్టుకుంది. ఒక్క క్షణం తరువాత మళ్ళీ లేచి తన తండ్రి గదిలోకి వెళ్ళింది. డాక్టరు వాకిట్లో నిలుచుని వున్నాడు.

"నీవు లోపలికి రావడానికి వీల్లేదు రాకుమారీ! వెళ్ళు!" అన్నాడు డాక్టరు, సాధికారికరంగా.

ఆవిడ మళ్ళీ తోటలోకి వెళ్ళి కొలను దగ్గరే కూచుంది. అక్కడ కూచుంటే ఆవిడ నెవరూ చూడరు. అలా ఎంతసేపు కూచుందో ఆవిడకే తెలీదు. హఠాత్తుగా త్వర త్వరగా వస్తున్న అడుగుల చప్పుడు ఆవిడను తన ధ్యానంలోంచి మేలుకొలిపింది.

ఆ వచ్చింది డొనీషా. ఆవిడ పరిచారిక ఆవిడను వెదకడం కోసం వచ్చింది. ఆవిడ అక్కడ ఉండడం చూచి ఉలికి పడింది.

"రా, రాకుమారీ, రా! ..." అంటూ పరిచారిక ఆగిపోయింది.

"వస్తున్నాను, వస్తున్నాను," అంటూ మేరియా రాకుమారి, పరిచారిక మాటలు వినకుండా ఇంటివైపు పరుగెత్త సాగింది.

"రాకుమారీ!" అంటూ ఆవిడ కోసం వాకిలి దగ్గర కనిపెట్టుకుని ఉన్న గవర్నరు "భగవంతుడి ఇచ్ఛ నెరవేరుతుంది గాక. నీవు దీన్ని భరించాలి!" అన్నాడు.

"అది నిజం కాదు... నన్ను వదలండి, అన్నది మేరియా.

డాక్టరు ఆవిడను వెనక్కు పట్టుకోబోయాడు. కాని ఆవిడ అతన్ని తోసివేసి ముందుకు వెళ్ళింది.

"వీళ్ళంతా నన్నెందుకు ఆపాలి?ఎందుకు వీళ్ళంతా ఇలా ఉన్నారు?వీళ్ళంతా ఇక్కడ ఏం చేస్తున్నారు?" అనుకున్నది.

తన తండ్రి గది తలుపు తెరిచి లోపల అడుగు పెట్టింది. ఇప్పుడు గదినిండా వెలుగు నిండి వుంది. అది చూడగానే ఆవిడకు ఒక విపరీతమైన భయం పైగొన్నది. వృద్ధ నర్సు, మరికొందరు స్త్రీలు ప్రక్కన చుట్టూ చేరి నిలుచుని ఉన్నారు. ఆవిడ లోపలికి రాగానే ప్రక్కకు తొలిగారు.వారు ప్రక్కకు తొలగగానే నిశ్చలంగా ఉన్న వృద్ధుని ముఖం ఆవిడకు కనిపించింది. ఆవిడ గడపలోనే ప్రతిమలా నిలుచుండిపోయింది.

"ఆయన చనిపోలేదు! అది అసాధ్యం." అనుకున్నది తనలో తాను.

తన భయాలు చిక్కబట్టుకుని ఎలాగో తండ్రి ప్రక్క దగ్గరికి వెళ్ళింది. తన పెదవులు తండ్రి చెక్కిలికి తాకించింది. కాని అలా చేయగానే ఆవిడ కంపించి,ఉలికి పడి పెదవులు వెనక్కు తీసుకుంది. ఆవిడ హృదయంలో పొంగి వచ్చిన మృదుత్వ మంతా ఒక్క మాటుగా అదృశ్యమై పోయింది.

"పోయాడు! పోయాడు! ఆయన స్థానంలో ఈకళేబరం వుంది. ఈ విచిత్ర మేమిటో ఇది నన్ను గడ్డ కట్టిస్తోంది!" అనుకున్నదా పిల్ల ... ముఖం చేతులతో కప్పుకుని నిశ్చేతనంగా డాక్టరు చేతుల్లో వాలిపోయింది.

డాక్టరు, టిఖోన్, ఆవిడకు సేదతీరుస్తూ ఉండగా వృద్ధ స్త్రీలు కళేబరాన్ని బయటికి తీసుకుని వెళ్ళారు. నోటికి, ముఖానికి కట్లుకట్టారు. అన్ని విధాలైన అలంకా రాలతోను, యూనిఫారంతోను వృద్ధ రాకుమారుణ్ణి అలంకరించి టేబిల్ మీద పరుండబెట్టారు. అలాంటి సందర్భాల్లో జరగవలసిన విషయాలన్నీ జరిగాయి. రాత్రి అయ్యేసరికి శవపేటిక సిద్ధం చేశారు. దానిమీద గుడ్డ కప్పారు. చుట్టూ కొవ్వొత్తులు వెలిగించారు. నేలమీద పూలుచల్లారు. పాటలు మొదలుపెట్టారు. పొరుగువారు,అపరిచి తులు కూడా గుంపులు కొద్దీ వచ్చి శవ పేటికచుట్టూ మూగారు.గవర్నరు,ఓవర్సీరు, స్త్రీలు పెద్దవైన కళ్ళతోను, భయంతో కూడిన ముఖాలతోను చల్లబడిపోయిన వారి యజమాని చెయ్యి ముద్దాడబోయే ముందు క్రాస్ చేసుకున్నారు.

# 93

వృద్ధ రాకుమారునికి బొగొషొరోవ్ అంటే అంత ఎక్కువ ఇష్టం ఉండేది కాదు. అక్కడి ప్రజలకూ, లిస్సీ-గోరీలో ప్రజలకూ, భాషలో గాని దుస్తుల్లో గాని పద్ధతుల్లో కాని ఎంతో మార్పు ఉండేది. వాళ్ళు అసలు అక్కడి వారేనని అనేవారు. వృద్ధ రాకుమారుడు వారి శ్రమను బాగా వినియోగించుకుంటూ ఉండేవాడు. పంట కోత కోసమో, చెరువు త్రవ్వడం కోసమో, లేక ఒకగుంట త్రవ్వడం కోసమో వారిని లిస్సీ-గోరీకి తీసుకుని వెడుతుండేవాడు. కాని వారంటే ఆయనకంత ఇష్టం ఉండేది కాదు. ఆంద్రూ రాకుమారుడు అక్కడే ఉండి సంస్కరణలు పెట్టి, బడులు పెట్టి, పన్నులు తగ్గించినప్పటికీ ఆప్రజలు నాగరికులు కావడానికి మారుగా వారిలో అనాగ రికత మరింత ఎక్కువైంది. అదే వారిలోని ప్రత్యేకత అని వృద్ధ రాకుమారుడు అంటూ ఉండేవాడు. వారిలో ఎన్నో కథలు కూడా వ్యాపించాయి. ఒకప్పుడు వారు కోసక్కులుగా సేనలో చేరతానని అనుకున్నారు. ఒక కొత్త మతాన్ని స్వీకరిస్తారని అనుకున్నారు. కాని 1797 లో ఒకటవ పాల్‌కు చేసిన వాగ్దానాన్ని అనుసరించి వారు తమ స్వాతంత్ర్యం కోలుపోతామని ఊరుకున్నారు. ఏడు సంవత్సరాల్లో మూడో పీటరు మళ్ళీ తిరిగి వచ్చి రాజ్యం చేస్తాడని అనుకున్నారు. అప్పుడందరికి

స్వాతంత్ర్యం ఉంటుందని చట్టాలేవీ ఉండవని వారు ఊహించుకున్నారు. ఈలోగా నెపోలియన్‌తో యుద్ధం రావడంతో తమకు పూర్తిగా స్వేచ్ఛ కలిగే రోజులు దాపుకు వచ్చాయని అనుకున్నారు.

బొగొషారోవ్‌కు చుట్టు ప్రక్కల కొన్ని పెద్ద గ్రామాలున్నాయి. కొన్ని స్వంతదార్లకు చెందినవి. మరికొన్ని చక్రవర్తికి చెందినవి. కాని ఆ ఎస్టేట్ల యజమానులు ఎప్పుడో కాని అక్కడ ఉండేవారు కాదు. అందువల్ల చదవడం వ్రాయడం వచ్చినవారు అక్కడ లేకపోవడం చేత వీరిలో దేశీయమైన ఊహా కల్పనలు ఎన్నో బయలుదేరుతూ ఉండేవి. వీటికి ముఖ్య కారణం ఒక విచిత్రమైన ఊహాకల్పన మాత్రమే. ఇది వారిలో ఎంతో ఎక్కువగా వ్యాపించి ఉండేది. ఉదాహరణకు ఇరవై ఏండ్ల క్రితం బొగొషారోవ్‌లోని ప్రజలు ఆ ప్రక్క గ్రామాల వారితో కలిసి ఒక పక్షుల గుంపులాగా దక్షిణదిశ వైపుకు వెళ్ళారు. అక్కడ కొన్ని జల ప్రవాహాలున్నాయనీ, అవి ఎప్పుడూ కూడా వెచ్చగా ఉంటాయనీ అనుకుని అక్కడికి వెళ్ళారు. వీరిలో కొందరు చెప్పి, కొందరు చెప్పకుండా వెళ్ళారు. తరువాత వీళ్ళకు చాలా శిక్షలు కూడా పడ్డాయి. కొందరు దారిలోనే చనిపోయారు. కొంతమంది తిరిగి వచ్చారు.

ఇదే విధంగా ఇప్పుడు ఈ ప్రజలలో అనేక విశ్వాసాలు వ్యాపించి ఉన్నాయి. 1812 లో వారికి తెలీని ఇన్ని కారణాలవల్ల వారికి స్వేచ్ఛ లభిస్తుందని అనుకున్నారు.

వృద్ధ రాకుమారుడు చనిపోవడానికి కొద్ది రోజులకు ముందు బొగొషారోవ్‌కు వచ్చిన ఆల్పటిచ్ వీరిలో ఏదో విచిత్రమైన మార్పు చూచాడు. లిస్సీ-గోరీకి ఇక్కడికి ఆరు ఫర్లాంగులు మాత్రమే దూరం ఉన్నప్పటికీ, అక్కడి ప్రజలకూ ఇక్కడి ప్రజలకూ ఎంతో తేడా ఉండడం గమనించాడు. లిస్సీ-గోరీలో రైతులు వారి ఇళ్ళూ వాకిళ్ళూ వదిలిపెట్టి వెళ్ళిపోయారు. కాని ఇక్కడ మాత్రం వీరు ఉన్న చోటనే ఉండి ఫ్రెంచి వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపుతున్నారు. నెపోలియన్ అందచేసిన ప్రకటనలు వీరి చేతుల్లో కనిపిస్తున్నాయి కూడా. కొందరు సేవకుల ద్వారా ఆల్పటిచ్‌కి ఒక విషయం తెలిసింది. అప్పుడే ఆ ఊరు వచ్చిన కార్ప్ అనే వ్యక్తి వదిలిపెట్ట బడిన గ్రామాలన్నీ కోసక్కులు ధ్వంసం చేస్తున్నారనీ, ఫ్రెంచి వారు మాత్రం వారిని గౌరవిస్తున్నారనీ తన స్నేహితుడితో చెపుతున్నాడు. గ్రామం వదిలిపెట్టి పోకుండా ఇళ్ళలో ఉన్నవారికి ఎలాంటి ప్రమాదమూ జరగదని ఫ్రెంచి జనరల్ హామీ ఇచ్చాడని కూడా చెపుతున్నాడు. తను చెప్పింది నిజమని రుజువు చెయ్యడానికి తను తీసుకొచ్చిన వంద రూబుళ్ళ దొంగనోటు ఒకటి అందరికీ

చూపిస్తున్నాడు. చివరకు అన్నిటికంటె ముఖ్యమైన విషయం ఆల్పటిచ్ ఆ ఊరి ఓవర్‌సీర్‌ను మేరియారాకుమారి సామాన్లను పంపించడం కోసం కొన్ని బండ్లు సప్లయి చేయమని అడిగినప్పుడు, రైతులంతా సమావేశమై తాము గ్రామం విడిచి వెళ్ళమని తమ నిశ్చయాన్ని తెలియచేశారు. కాని వెళ్ళడానికి ఎంతో వ్యవధి కూడా లేదు. పనికట్టుకుని బొగొషారోవ్‌కు వచ్చిన గవర్నరు రాకుమారి వెంటనే వెళ్ళాలనీ, ఆ మరుసటిరోజు— ఆగస్టు 16వ తారీఖున ఏమైనా జరుగవచ్చుననీ చెప్పాడు. తను రాకుమారుని అంత్యక్రియలకు అక్కడ ఉంటానని అన్నప్పటికీ అలా జరగడానికి వీలులేకుండా పోయింది. ఫ్రెంచివారు హఠాత్తుగా రావడంవలన కుటుంబాన్ని కొన్ని విలువగల వస్తువులు మాత్రమే తీసుకుని వెళ్ళగలిగాడు.

'ఆ ఊరి ఓవర్‌సీర్ డ్రోన్, ఇప్పటికి ముప్ఫయి సంవత్సరాలనుంచీ ఆ గ్రామానికి పెద్దగా ఉంటున్నాడు. చనిపోయిన రాకుమారుడు అతణ్ణి ఎంతో చనువుగా డొనూష్కా అని పిలుస్తూ వచ్చేవాడు. అతనెంతో గట్టి మనస్సు, దేహము కలవాడు. డెబ్బయి సంవత్సరాలు పైనబడ్డప్పటికీ అతని జుట్టు నెరియలేదు, ఒక పన్నుకూడా ఊడలేదు.

వెచ్చని జలప్రవాహాలకోసం ఆ ఊరి ప్రజలు యాత్ర మొదలుపెట్టిన తరువాతనే డ్రోన్ ఆ ఊరికి పెద్దగా చేయబడ్డాడు. ఇప్పటికి ఇరవైమూడు సంవత్సరాలనుంచీ ఆ పదవిని ఎంతో జాగ్రత్తగా కాపాడుకుని వస్తూ ఉన్నాడు. ప్రజలు తమ యజమాన్ని చూచి భయపడడం కంటె ఇతన్ని చూచి ఎక్కువగా భయపడతారు. అతను తాగినట్టు కాని, జ్వరంతో బాధపడ్డట్టు కాని ఎప్పుడూ కనిపించడు. రాత్రింబగళ్ళు నిద్రలేకుండా పని చేసినప్పటికీ అతనికి అలుపు అనేది వచ్చేది కాదు. అతనికి చదవడం వ్రాయడం రాకపోయినపప్పటికీ లెక్కల్లో ఒక్కతప్పుకూడా చేసేవాడు కాదు.ఇతనినే ఆల్పటిచ్,మేరియారాకుమారి సామానులు తీసుకుని వెళ్ళడంకోసం పద్దెనిమిది బండ్లు, పన్నెండు గుర్రాలు సప్లయి చేయమని అడిగాడు. రైతులు చెల్లించవలసిన శిస్తులన్నీ వసూలు చేయబడి ఉన్నప్పటికీ, ఆ గ్రామంలో రెండు వందల గడప ఉండడం వల్లను అందరూ అంతో ఇంతో కలిగినవారు కావడం వల్లను, ఈ కాస్త సహాయం చేయడంలో వారికెలాంటి కష్టమూ ఉండదనుకున్నాడు ఆల్పటిచ్. కాని డ్రోన్ ఈ ఉత్తర్వులు విని ఏమీ మాట్లాడకుండా క్రిందికి చూస్తూ కూచున్నాడు. అతనడిగిన గుర్రాలన్నీ ఊళ్ళో లేవనీ, బయటికి వెళ్ళాయనీ చెప్పాడు. ఆల్పటిచ్ మరికొన్ని గుర్రాల కోసం అడిగాడు.

"వాటినిప్పుడు గుర్రాలనడానికి వీల్లేదు. వాటిని ప్రభుత్వానికి అద్దెకిచ్చివేశారు" అని సమాధానం చెప్పాడు డ్రోన్. "ఇక మిగిలిన గుర్రాలున్నాయీ అంటే అవి ఎందుకూ పనికిరావు. కాబట్టి గుర్రాలు, బండ్లు దొరకడం అసాధ్యం" అని చెప్పాడు.

ఆల్పటిచ్ ఈ మాటలు విని ఆశ్చర్యపడి అతని వంక నిశ్చలంగా చూచాడు. డ్రోన్ ఎప్పుడూ ఇలా జవాబు చెప్పలేదు. అతను మటుకు అతను ఒకటో రకపు సేవకుడు. ఇవి రైతుల సమిష్టి సంఘం వారు చెప్పిన అభిప్రాయాలని ఆల్పటిచ్ వెంటనే అర్థం చేసుకున్నాడు. ఇప్పుడిప్పుడే రైతుల సమిష్టి సంఘాల్లో కొత్త కొత్త అభిప్రాయాలు మొలకెత్తుతున్నాయి. తమ కంటె డ్రోన్ కొంచెం కలిగినవాడు కావడంవల్ల రైతులకు అతనంటే పడదని అనుకున్నాడు ఆల్పటిచ్. అనిశ్చితంగా ఉన్న అతని చూపులను బట్టి అతనిప్పుడు ఇరుపక్షాల మధ్య వ్రేలాడుతున్నాడని తెలుస్తోంది. ఆల్పటిచ్ వెంటనే అతని దగ్గరికి వెళ్ళి ఇలా అన్నాడు:

"నా మాట విను. ఇక ఈ మాటలు చెప్పకు. ఆంద్రూరాకుమారుడు మిమ్మల్నిక్కడ నుంచి పంపివెయ్యమని చెప్పాడు. చక్రవర్తి కూడా అలాగే ఆజ్ఞాపించాడు."

"అవును అర్థమైంది" అన్నాడు డ్రోన్, పైకి కళ్ళెత్తి చూడకుండా.

ఆల్పటిచ్ మళ్ళీ ఇలా అన్నాడు:

"డ్రోన్! నా మాట విను. దీనివల్ల నీకు వచ్చే ప్రయోజనమేమీ లేదు. నా సలహా విను. మొండిపట్టు పట్టకు. నేను ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టగలను! ఆ సంగతి నీకు తెలుసు" ఇలా అని వెయిస్ట్‌కోటులో నుంచి చెయి తీసి చూరువేపుకు చూపించాడు. డ్రోన్ అతని వంక కలవరంతో చూచి మళ్ళీ కళ్ళు దించుకున్నాడు. "ఈ పిచ్చి వదిలిపెట్టు. అందరినీ వెంటనే బండ్లు కట్టుకుని మాస్కోకు బయలుదేరమని చెప్పు.... రేపు ఉదయం మేరియా రాకుమారి కోసం బండ్లు రావాలి. నీవు అక్కడికి వెళ్ళి తీసుకునిరా, తెలిసిందా?" అన్నాడు ఆల్పటిచ్.

డ్రోన్ మోకాళ్ళూనాడు. "జాకోబ్ ఆల్పటిచ్! భగవంతుడి కోసం నీవే ఈ తాళపుచెవులు తీసుకో" అన్నాడు డ్రోన్.

"నే చెపుతున్నాను. నీ దురుద్దేశాలు వదిలిపెట్టు" అన్నాడు ఆల్పటిచ్ మళ్ళీ.

డ్రోన్ లేచి మళ్ళీ ఏదో మాట్లాడబోయాడు. కాని ఆల్పటిచ్ అతన్ని ఆపు చేశాడు.

"సరే, నీ మనస్సులో ఉన్నదేమిటో చెప్పు? నీ ఉద్దేశం ఏమిటి?" అని అడిగాడు ఆల్పటిచ్.

"ఈ గ్రామస్థులు ఇలా ఉంటే నన్నేం చెయ్యమంటారు? వాళ్ళు నా మాట వినడం లేదు" అన్నాడు డ్రోన్.

"వాళ్ళు త్రాగుతున్నారా?"

"వారిని ఒకపట్టాన పట్టుకుని రాలేను జాకోబ్ ఆల్పటిచ్."

"సరే, నామాట విను. నే వెళ్ళి పోలీసు పెద్దను తీసుకుని వస్తాను. ఈలోగా నీవు వెళ్ళి ఈ పిచ్చి వదిలిపెట్టి బండ్లు తీసుకురా."

"మంచిది." అన్నాడు ద్రోన్.

జాకోబ్ ఆల్పటిచ్ మరి మాట్లాడలేదు. ద్రోన్ చెప్పిన మాటకు సంతృప్తి చెందినట్లు కనిపించాడు.

సాయంత్రం అయింది. కాని బండ్లు రాలేదు. జనసమూహం గ్రామం వెలుపల ఉన్న సారాపాకలో సమావేశమై బండ్లు సప్లయి చేయకూడదనీ, గుర్రాలను అడవిలో వదిలేసెయ్యాలనీ ఏకగ్రీవంగా నిశ్చయం చేసింది. ఆల్పటిచ్ వెంటనే లిస్సి-గోరీ నుంచి తన సామాన్లు తీసుకొచ్చిన బండ్లు వెంటనే సామాన్లను దింపి మేరియా రాకుమారి కోసం బయలుదేరాలని ఉత్తర్వు చేశాడు. అతనీ విషయాలన్నీ జిల్లా అధికారితో చెప్పడానికి వెళ్ళాడు.

# 94

తండ్రి పోయినప్పటినుంచి మేరియా రాకుమారి తన గది వదిలి బయటికి రావడం లేదు. తనను చూడడానికి కూడా ఎవరినీ రానీయడం లేదు. ఆవిడ పరిచారిక వచ్చి, ఆల్పటిచ్ ఆవిడ ప్రయాణసన్నాహాలను గురించిన ఉత్తర్వుల కోసం వేచి ఉన్నాడని, మూసివున్న గది తలుపు ఇవతలనుంచి చెప్పింది. ఇది ఆల్పటిచ్ ద్రోన్ దగ్గరికి వెళ్ళడానికి పూర్వం జరిగింది. రాకుమారి అప్పుడు సోఫామీద పడుకుని ఉన్నది. ఇవాళే కాదు ఎప్పుడూ కూడా తాను బొగొషొరోవ్ వదిలిపెట్టి వెళ్ళనని చెప్పింది రాకుమారి. తన్ను కలవరపెట్టకుండా వదిలి వెళ్ళమని కోరింది. ఆవిడ నిడివిగా పడుకుని, ముఖం గోడవైపుకు తిప్పి, వేళ్ళతో సోఫాపరుపుకు కుట్టిన గుండీలను ఏమీ తోచనిదానిలాగా లెక్కిస్తోంది. మళ్ళీ ఆవిడ భావాలు మామూలు ప్రకారం ఆవిడ మనస్సులోకి రావడం మొదలుపెట్టాయి. మృత్యువు భగవంతుడి ఆజ్ఞలు, ఆవిడ హృదయంలోని పాపాలు...

ఇలా ఆవిడ చాలాసేపు పడుకుంది.

'ఇప్పుడిక నీవు ఆకాశపు అందాన్ని హాయిగా అనుభవించవచ్చు' అని తనలో అనుకున్నది. కుర్చీలో కూలి కిటికీ అద్దానికి తల ఆనించింది.

వెంటనే ఆవిడనెవరో మృదువుగా పేరుపెట్టి పిలవడం వినిపించింది. కిటికీ అవతలగా తోటలోనుంచి ఆ పిలుపు వినిపించింది. తిరిగి చూచేసరికి మదాంబోరీన్ కనిపించింది. నల్లని దుస్తులు వేసుకుని ఉన్నది. ఆవిడ దగ్గరకు వచ్చి ఆవిడను ముద్దాడి కన్నీరు కార్చింది. మేరియా రాకుమారికి ఆ ఫ్రెంచి స్త్రీ పట్ల తనకు

పూర్వం ఉంటూవచ్చిన అసూయ, అయిష్టము జ్ఞాపకం వచ్చాయి. కడపటిరోజుల్లో ఆమెను ఆవిడ తండ్రి కూడా దగ్గరికి రానిచ్చేవాడు కాదు. 'నా అనుమానాలు అన్యాయమైనవని చెప్పడానికి ఇంతకంటె రుజువేం కావాలి?' అని మేరియా తనలో తాను అనుకున్నది. 'తండ్రి చావును కోరిన నేను ఇతర్లను ఎలా అనుమానించగలను?' అనుకున్నది. తన స్నేహితురాలి దీన పరిస్థితి ఆవిడ కళ్ళముందు కట్టినట్లయింది. తను ఆమెను దూరంగా చూడడం, ఆమె తనమీద ఆధారపడి ఉండడం, ఆమె ఎక్కడో విదేశంలో ఒక అపరిచితుని ఇంటిలో పడివుండడం; ఇవన్నీ మేరియా రాకుమారికి జ్ఞాపకం వచ్చాయి. ఆవిడకెంతో జాలి కలిగింది. భయంగా కళ్ళెత్తి చూచి తన చెయ్యి ఆమెకు అందించింది.

మదాంబోరిస్ ఆవిడ చేతిని అందుకుని ఏడుస్తూ ముద్దాడింది. తరువాత ఇరువురూ కలిసి అనుభవించిన దుఃఖాన్ని గురించి చెప్పసాగింది.

"రాకుమారీ!" అని మదాంబోరిస్ మళ్ళీ చెప్పసాగింది: "నీ విషయం నీవు ఆలోచించుకోవని నాకు తెలుసు. నేను నీకోసం ఆలోచించకుండా ఉండలేను. ఆల్పటిచ్ నీతో ప్రయాణం విషయం మాట్లాడాడా?" అని అడిగింది కాని మేరియా రాకుమారి జవాబు చెప్పలేదు. ఆవిడ మనస్సు ఎక్కడో ఉంది. అందుచేత వెళ్ళవలసింది ఎవరో కూడా ఆవిడకు తెలిడం లేదు.

"వెళ్ళాలా! ఎందుకూ? ఇప్పుడేమైతేనేం?" అన్నది మేరియా రాకుమారి.

"బహుశా నీకు తెలియదేమో మేరియా! మనమిప్పుడు సురక్షితంగా లేము. మనచుట్టూ ఫ్రెంచి వారున్నారు. మనం బయలుదేరినా దారిలో వారు అడ్డురావచ్చు.. తరువాత ఏమవుతుందో...." అన్నది బోరిస్.

మేరియా రాకుమారి ఆమెవంక శూన్యంగా చూచింది. "నేను దేనికోసమూ ఏమీ లెక్క చేయడంలేదని నీవు తెలుసుకుంటే చాలు. నేను ఎక్కడికీ వెళ్ళదలుచుకోలేదు. అవసరమైతే ఈ విషయం ఆల్పటిచ్‌తో మాట్లాడు" అన్నది మేరియా.

"నేను అతనితో మాట్లాడాను. మనల్ని రేపు తీసుకెడతానంటున్నాడు. కాని నా ఉద్దేశంలో మనం ఇక్కడ ఉండడమే మంచిది. దోవలో సైనికుల చేతుల్లో మనం చిక్కడం అంత మంచిదికాదు." అంటూ బోరిస్ తన జేబులోనుంచి ఫ్రెంచి జనరల్ రమో, గ్రామవాసులు ఇళ్ళూ వాకిళ్ళూ వదిలిపెట్టవద్దనీ, అందు విషయంలో వారికి తాము రక్షణ ఇస్తామనీ అందచేసిన ఫ్రెంచివారి ప్రకటనను బయటికి తీసింది. "మనం ప్రస్తుతం ఈ జనరల్‌కు విజ్ఞప్తి చేసుకోవడం కంటె తగిన మార్గం మరేదీ కనిపించడం లేదు. ఆయన నాకు తప్పకుండా మనపట్ల తగిన రీతిలో ప్రవర్తిస్తాడు" అన్నది.

మేరియా రాకుమారి ఆ ప్రకటనను చదివింది. ఆవిడ ముఖంలో విచిత్రమైన మార్పు కనిపించింది. "ఇది ఎక్కడ నుంచి వచ్చింది ?" అని అడిగింది.

"నేను ఫ్రెంచి స్త్రీనని వారు విని ఉన్నారేమో !" అన్నది మదాం బోరీన్ సిగ్గుపడుతూ.

మేరియా రాకుమారి మరోమాట మాట్లాడకుండా గది విడిచి తన అన్న గదిలోకి వెళ్ళి, పరిచారిక అయిన డొనీషాను పిలవనంపింది.

"అల్పటిచ్‌ని కాని డ్రోన్‌ని కాని వెంటనే వచ్చి నాతో మాట్లాడమని చెప్పు." అన్నది. "ఎవరైనా ఫరవాలేదు. అమలియా కార్లోవ్‌నా (మదాంబోరీస్)తో నేను ఒంటిగా ఉండాలని చెప్పు. నేను వెంటనే వెళ్ళిపోవాలి." అన్నది. ఫ్రెంచి వారితో సంబంధం పెట్టుకోవాలంటే ఆవిడకు భయం కలిగింది.

ఇలాటి విషయం జరిగితే అంద్రూ రాకుమారుడు ఏమంటాడు ? నికోలస్ బోల్‌కోన్‌స్కి రాకుమారుని కూతురైన తను ఫ్రెంచి జనరల్ రమోను శరణ్యం అడిగి అతని మన్ననలలో ఉండడం ఊహించుకునేసరికి ఆవిడ శరీరమంతా కంపించి ఆవిడ ముఖం వివర్ణమై పోయింది. తను అనుభవించబోయే ప్రతి అవమానాన్ని ఆవిడ ఊహించుకోసాగింది. 'ఫ్రెంచివారు ఇక్కడ ఈ ఇంట్లో బస చేస్తారు. ఇక్కడ అంద్రూ గదిలో ఉంటారు. తమ ఆనందాల కోసం ఉత్తరాలు, పేపర్లు; అన్నీ తిప్పి చూస్తారు. మదాంబోరీస్ ఇక్కడ వారికి గౌరవాలిస్తుంది. నన్ను దయతలిచి నాకు ఒకమూల చోటు ఇస్తారు !...నా తండ్రి సమాధి తవ్వి అందులోని క్రాస్‌లను, పతకాలను దొంగిలిస్తారు....నా రష్యాపై వారి విజయాలను గూర్చి గొప్పలు చెప్పు కుంటూ ఉంటారు. నా కష్టాలకు కృత్రిమమైన జాలి చూపుతారు!" ఇలా ఆమె తనకు తెలీకుండానే తన తండ్రి, అన్న ఎలాటి ఊహలు ఉహించుకుంటారో అలాటి ఊహలు ఊహించుకోసాగింది. తను మాత్రం వారికి ప్రతినిధి కాదా ? ఇలాటి పరిస్థితిలో వారెలా ప్రవర్తిస్తారో తను మాత్రం అలా ప్రవర్తించనక్కర్లేదా ? ఆమె కూచుని నెమ్మదిగా పరిస్థితి అంతా ఊహించుకోసాగిన తరువాత, తన తండ్రిమరణం తరువాత తనలో పూర్తిగా నశించి పోయిందనుకున్న జీవిత వాంఛ హఠాత్తుగా మళ్ళీ ఆవిడలో రేకెత్తసాగింది.

ఎంతో కలవరంతో ఆవిడ, వద్ధుడైన టిహోన్ను, భవన నిర్మాతనూ పిలిచి విషయాలేమిటని అడిగింది. కాని వారిలో ఎవరూ కూడా ఫ్రెంచివారు దాపులో ఉన్నారని మదాంబోరీస్ చెప్పిన మాటలు నిజమో, అబద్ధమో చెప్పలేక పోయారు. భవన నిర్మాత అర్ధనిద్రలో ఉన్నాడు. చిరునవ్వు నవ్వుతూ అస్పష్టంగా ఏదో సమాధానం చెప్పాడు. వృద్ధ రాకుమారునికి పదిహేను సంవత్సరాలు సేవ చేసిన తరువాత అతనికి అలవాటు ఏర్పడింది. టిహోన్ ముఖం కూడ విచార పూరితంగా ఉంది. అతను కూడా సరిగా సమాధానం చెప్పలేక పోయాడు. ఆవిడను చూడగానే అతని దుఃఖం మరింత ఎక్కువైంది. చివరకు డ్రోన్ గదిలోకి వచ్చాడు. వంగి నమస్కరించి వాకిట్లో నిలుచున్నాడు.

"డ్రోనూష్కా !" అని ఆవిడ అతన్ని పిలిచింది. ఒక వృద్ధుడు చిరపరిచితుడు అయిన స్నేహితుణ్ణి సంబోధిస్తున్నట్లుగా, ఈవిడ పసిపిల్లగా ఉన్నప్పుడు అతనెన్నడు వారింటికి వచ్చినా వియజ్మాలో సంత నుంచీ తేనె రొట్టెలు తీసుకొచ్చి చిరునవ్వు నవ్వుతూ ఆవిడకిస్తూ ఉండేవాడు.

"డ్రోనూష్కా ! చూచావా ఇవాళ ఇలా జరిగింది !" అన్నదావిడ కన్నీళ్ళతో.

"మనమంతా భగవంతుని దయాదాక్షిణ్యాల పైన ఆధారపడి ఉన్నాం !" అన్నాడు డ్రోన్ నిశ్వసించి.

"డ్రోనూష్కా !" అన్నదావిడ మళ్ళీ ప్రయత్నంచేసి. "అల్పటిచ్ ఇప్పుడిక్కడలేడు. నాకు సహాయపడేవారు మరెవ్వరూ లేరు. నిజం చెప్పు, మనం ఇక్కడ నుంచి వెళ్ళలేమా ?" అని అడిగింది, మేరియా రాకుమారి.

"ఎందుకు వెళ్ళలేం రాకుమారీ !" మీరెప్పుడైనా వెళ్ళవచ్చు." అన్నాడు డ్రోన్.

"అలాటి పని చేయడంవల్ల శత్రువులవల్ల ప్రమాదం వస్తుందని అంటున్నారు. నాకేమీ తెలీడం లేదు. నేను ఒంటరి దాన్ని ! కాని నాకు వెళ్ళి తీరాలనే ఉంది. ఇప్పుడో ... లేక రేపో, వెళ్ళితీరాలి."

డ్రోన్ వెంటనే సమాధానం చెప్పలేదు. కాని ఒకమాటు ఆవిడ వంక చూచి తరువాత ఇలా అన్నాడు.

"గుర్రాలు లేవు. ఇప్పుడే అల్పటిచ్‌తో ఆ మాట చెప్పాను.

"ఏం ? ఏమైంది ?" అని అడిగింది మేరియా.

"భగవంతుడు మనల్ని శిక్షించాలనుకున్నాడు. కొన్ని గుర్రాలను దళాలవారు తీసుకెళ్ళారు. కొన్ని చనిపోయాయి. ఇది చాలా చెడ్డ సంవత్సరం. మనం ఆకలితో చనిపోకుండా ఉంటే అంతే చాలు, గుర్రాల విషయం ఏమైనా ! మూడు రోజుల నుంచీ మాకు అన్నపానాలు లేవు." అన్నాడు డ్రోన్.

"రైతులంతా నాశనమై పోయినారా ? వారికి ధాన్యపు గింజలు లేవా ?" అని అడిగింది మేరియా రాకుమారి ఆశ్చర్యంతో.

"చనిపోవడం తప్ప ఇక చేసే పనేమీలేదు !" అన్నాడు డ్రోన్."ఇక బండ్ల విషయం చెప్పనక్కర్లేదు." అన్నాడు.

"ఈ మాట నాకు చెప్పలేదేం డ్రోనూష్కా ? మనమేమీ సహాయం చెయ్యలేమా ? నాకు చేతనైనంత వరకూ సహాయం చేస్తాను." అన్నది మేరియా రాకుమారి.

ఆవిడ హృదయం మృదుత్వంతో పొంగి పొరలుతున్న ఈ సమయంలో,

కలవారు, లేనివారు ప్రక్క ప్రక్కనే ఉంటూ కూడా కలవారు లేనివారికి సహాయ పడక పోవడం ఆవిడకు విచిత్రంగా కనిపించింది. ఎప్పుడూ ధాన్యం నిలువ ఉంటుందని ఆమె ఊహ. ఈ సమయంలో ఆ ధాన్యం పంచిపెట్ట వచ్చునని అను కుంది. తన తండ్రికాని, తన అన్నకాని ఇలాటి సందర్భాలలో ఈ పని చెయ్యడానికి వెనుతీయరని ఆవిడకు తెలుసు. అందుచేత తనే చేద్దామని అనుకున్నది.

"మా అన్నగారి ధాన్యం ఉందనుకుంటాను ?" అని అడిగింది.

"అయ్యగారి ధాన్యం ఇంతవరకూ ముట్టుకోలేదు. రాకుమారుడు దాన్ని అమ్మవద్దని చెప్పాడు." అన్నాడు ద్రోన్.

"అయితే, ఏం కావాలో రైతులకు ఇచ్చెయ్యండి. మా అన్న తరఫున నేను మీకీ అధికారం ఇస్తున్నాను." అన్నది. అదివిని ద్రోన్ నిశ్వసించాడు. ఆమె మళ్ళీ "అవసరమైతే అంతా ఇచ్చేయండి. మాదంతా కూడా వారిదేనని మా అన్న తరఫున చెప్పండి !" అన్నది.

ద్రోన్ ఆవిడ వంక మాట్లాడకుండా చూచాడు. "భగవంతుని కోసం చిన్నమ్మ గారూ ! నన్ను నా పదవి నుంచి తొలగించండి ! నా దగ్గర నుంచి తాళపు చెవులు ఇవ్వమని కోరండి ! ఇరవైమూడు సంవత్సరాల నుంచీ నా పని నేను చేశాను ....మీ తాళపు చెవులు మీరు తీసుకోండి." అన్నాడు.

అతనిలా ఎందుకంటున్నాడో అర్థం చేసుకోలేక మేరియా రాకుమారి ఆశ్చర్యపడింది. తను అతన్ని ఎన్నడూ అనుమానించలేదనీ, అతని కోసం తన శాయశక్తులా తన చేతిలో ఉన్నదంతా చేస్తాననీ చెప్పి అతన్ని పంపివేసింది.

# 95

ఒక గంట తరువాత డొనీషా తన యజమానురాలికి ద్రోన్ ఆవిడ ఉత్తర్వుల ననుసరించి రైతులందరినీ పోగుచేశాడనీ, వారు ఆవిడ కోసం కాచుకుని ఉన్నారనీ చెప్పడానికి వచ్చింది.

"కాని నేను వారిని పిలవనంపలేదే!" అన్నది మేరియా రాకుమారి ఆశ్చర్య పడుతూ. "ద్రోన్‌ను ధాన్యం పంచమని కోరాను, అంతే" అన్నది.

"అయితే రాకుమారీ! మీరు బయటికి వెళ్ళకుండా వెంటనే వారిని పంపించి వెయ్యండి"అన్నది డొనీషా. "వారు మిమ్మల్ని మోసం చేస్తున్నారు! అదీ విషయం! ఆల్పటిచ్ వచ్చిన తరువాత మనం మెల్లగా వెళ్ళిపోదాం. కాని మీరు మాత్రం బయ టికి వెళ్ళకండి అన్నది.

"వారునన్ను మోసం చేస్తున్నారంటావా?"

"అవునమ్మా, తప్పకుండా. వృద్ధ నర్సును కూడా అడిగిచూడండి. వారికి బొగాషారోవ్ వదిలి వెళ్ళడం ఇష్టం లేదు. అదీ వాళ్ళ ఉద్దేశం.

"కాదు కాదు. నీవు పొరపడుతున్నావు. నీవు వెళ్ళి డ్రోన్‌ను పిలుచుకురా" అన్నది మేరియా రాకుమారి.

తరువాత డ్రోన్ వచ్చి డొనీషా చెప్పిన మాటలే చెప్పాడు. ఆవిడ ఉత్తర్వుల ననుసరించి తన రైతులను పోగుచేశానని చెప్పాడు.

"కాని డ్రోన్! నే నెప్పుడూ నీ కలాంటి ఆజ్ఞ ఇవ్వలేదే! నిన్ను ధాన్యం పంచమని కోరాను, అంతే!" అన్నది మేరియా.

డ్రోన్ నిశ్వసించాడు. మీరు కోరినట్లయితే వారు మళ్ళీ వెళ్ళి పోతారు." అన్నాడు.

"లేదు లేదు. నే నే వెళ్ళి విషయాలు చెప్పివస్తాను."అంటూ మేరియా రాకుమారి, డొనీషా వృద్ధనర్సూ వద్దంటూన్నా వినకుండా మెట్లుదిగి క్రిందికి వెళ్ళింది. వారు కూడా ఆవిడ వెంట వెళ్ళారు.

'నేను వారిక్కడ ఉండడంకోసం వారికి ధాన్యం పంచమిస్తున్నానని వారను కుంటున్నట్లున్నారు. నేను వాళ్ళను ఇక్కడ ఫ్రెంచివాళ్ళకు వదిలి వెడతానను కుంటున్నట్లున్నారు. అనుకున్న దావిడ క్రిందికి వెడుతూ. కాని మాస్కో ఎస్టేటులో కూడా వారికి తగిన ఆహారము, వసతి లభిస్తాయని నేను వారికి చెపుతాను. వారి కోసం అక్కడ ఆంద్రూ రాకుమారుడు మంచి ఏర్పాట్లు చేసి ఉంటాడు.' అను కున్నది.

ఆవిడ బయటికివెళ్ళి కనిపించగానే అక్కడ పోగయి ఉన్న సమూహంలో ఒక చిన్న కలవరం బయలుదేరింది. వారు వెంటనే తమ హేట్లు తీసివేశారు. అప్పటికి బాగా ప్రొద్దుకూకింది. మేరియా రాకుమారి నేలవంక చూస్తూ నడిచి వెళ్ళింది. ఆవిడ వేసుకున్న నల్లటి దుస్తుల బరువైన ముడతలు ఆవిడకాళ్ళకు అడ్డు వచ్చాయి. నేల వంక చూస్తూ నడిచివెళ్ళి ఆవిడ, వృద్ధులు,యువకులు కలిసి వున్న ఆ జనసమూహం ముందు నిలుచుంది. అంత మందిని చూచి వారెవరో గుర్తించలేక పోయింది. తను ఏం చెప్పదలుచుకున్నదో అప్పుడావిడకు తెలీలేదు. చివరకు ఎలాగో ఒకలా తన కలవరాన్ని అణుచుకున్నది. మనస్సు చిక్కబట్టుకున్నది.

"మిమ్మల్నందరినీ ఇక్కడ చూస్తున్నందుకు ఎంతో సంతోషం!"అని మొద లెట్టింది కళ్ళెత్తి చూడకుండా. ఆవిడ హృదయం వేగంగా కొట్టుకోసాగింది. "యుద్ధం మిమ్మల్ని పాడుచేసిందని డ్రొనూష్కా చెపుతున్నాడు. మనమంతా ఒకే విధంగా ఉన్నాం. మీకు సహాయం చేయడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను.

శత్రువు దాపుకు వస్తున్నాడు కాబట్టి నేను వెళ్ళవలసి ఉంది...అదీగాక స్నేహితులారా! కొద్దిలో చెప్పాలంటే నేను మీకంతా ఇచ్చేస్తున్నాను. మా ధాన్యం తీసుకోండి. మీకు లేమి లేకుండా వుండడమే నేను కోరేది. మీరు ఇక్కడ ఉండడకోసం నేను మీ కిది లంచంగా ఇస్తున్నానని మీ కెవరైనా చెప్పి ఉన్నట్లయితే అది కేవలం అబద్ధం. పైగా మిమ్మల్ని తీసుకున్నంత తీసుకొని మాస్కో దగ్గరున్న మా ఎస్టేటుకు వెళ్ళమని కోరుతున్నాను. అక్కడ మీకు తగిన ఏర్పాట్లన్నీ చేయబడతాయి" ఇలా చెప్పి మేరియా రాకుమారి ఆగింది. వారిలో అక్కడక్కడ నిశ్వాసలు వినిపించాయి.

"నేను మా నాన్నగారి తరఫున మీకు చెపుతున్నాను. ఆయన మంచివాడన్న సంగతి మీకు తెలిసిందే. ఆయన కుమారుడైన నా అన్న తరఫున కూడా నేను మీకీ విషయం చెపుతున్నాను." ఇలా చెప్పి ఆవిడ మళ్ళీ ఆగింది. ఎవరూ మాట్లాడ లేదు.

"మనందరికీ ఇప్పుడు ఒకే విధమైన కష్టం ఎదుర్కొన్నది. అందరం కలిసి ఈ కష్టాన్ని పంచుకుందాం. నాదంతా కూడా ఇప్పుడు మీదే!" ఇలా అని ఆవిడ వారి ముఖాలవంక చూచింది. వారి కళ్ళన్నీ ఆవిడవంకే చూస్తున్నాయి. ప్రతి ముఖంలోనూ ఒకే విధమైన భావం కనిపిస్తోంది. అదేమిటో ఆవిడ తెలుసుకోలేక పోయింది. అది ఆశ్చర్యం కావచ్చు, భయం కావచ్చు, కృతజ్ఞత కావచ్చు; కాని ఏదో ఆవిడ తెలుసుకోలేక పోయింది.

"మీ దయకు మేమెంతో కృతజ్ఞులం" అని చివరకు ఒక గొంతుక వినిపించింది. "కాని మేము అయ్యగారి ధాన్యాన్ని మాత్రం తీసుకోము."

"ఏం? ఎందుచేత?"అని అడిగింది మేరియా రాకుమారి. కాని దానికి జవాబు లేదు. వారి కళ్ళు మళ్ళీ ఆవిడ వంక చూచాయి. ఆవిడ మళ్ళీ "ఏం? ఎందుకు తీసుకోరు?" అని అడిగింది నిశ్శబ్దంగా. ఆవిడ ఆందోళన పడింది. కర్ర మీద వంగి నిలుచుని ఉన్న ఒక ముసలి వానివంక తిరిగి అతన్ని సూటిగా ఇలా అడిగింది: "నీవు మాట్లాడవేం? నీ కోసం ఇంత కంటె నేను చేయగలిగింది ఏమైనా ఉందా?"

ఆ ముసలివాడు మరోవైపు చూచి ముందుకు వంగి గొణుక్కున్నాడు: "మే మెందుకు తీసుకోవాలి! మాకు ధాన్యం అక్కరలేదు. మమ్మల్ని అన్నీ వదిలి పెట్టి వెళ్ళమని నీవు కోరుతున్నావు! కాని మేమలా చెయ్యం."

"వెళ్ళు! నీ వొక్కదానివే వెళ్ళు!" అన్నాయి అనేక గొంతుకలు. అన్ని ముఖాల్లోనూ అదే భావం కనిపించింది. అది ఆశ్చర్యం కాదు. కృతజ్ఞతాకాదు. అది కోపం! ఇప్పుడు స్పష్టంగా కనిపించింది.

"మీరు నన్ను అర్థం చేసుకోలేదు." అన్నది మేరియా రాకుమారి, విచారపూరితంగా చిరునవ్వు నవ్వుతూ.

"మీకు ఆహారం, వసతి ఇస్తానంటే ఎందుకు వద్దంటున్నారు? ఇక్కడ మీ రుంటే శత్రువు మిమ్మల్ని ధ్వంసం చేస్తాడు" అన్నది.

కాని ఆ జనసమూహం యొక్క అరుపుల్లోను, కలవరంలోను ఆవిడ గొంతుక వినిపించకుండా అణిగిపోయింది.

"మే మిక్కడ నుంచి కదలం. ధ్వంసం చేస్తే చెయ్యనీ!" అనే మాటలు జనంలోనుంచి వినిపించాయి.

మేరియా రాకుమారి మళ్ళీ మాట్లాడాలని ప్రయత్నించింది కాని వాళ్ళు విని పించుకోలేదు. వాళ్ళ ఈ మొండి పట్టుదల చూచేసరికి ఆవిడకు ఆశ్చర్యం, భయం కలిగాయి. ఆవిడ తలవంచుకొని మెల్లగా అడుగులు వేస్తూ లోపలికి వెళ్ళింది.

"మనకు మసి పూద్దామని చూచింది! మన కామె ధాన్యం అక్కరలేదు. ఆమె ధాన్యం ఆమె దగ్గరే ఉంచుకోనివ్వండి. ఎంత మోసగత్తె! కాదూ?" అన్నాడు ఒకడు.

ద్రోన్ తన యజమానురాలి వెనకాలే వెళ్ళి ఆవిడ ఆజ్ఞలు తీసుకున్నాడు. ఆవిడ పూర్వంకంటే ఎక్కువగా ఇక తను అక్కడనుంచి వెళ్ళిపోవాలని నిశ్చయం చేసుకుంది. మళ్ళీ తనగదిలోకి వెళ్ళి కూచుని తన ఆలోచనల్లో మునిగిపోయింది.

# 96

ఆవిడ ఆ రాత్రి అలా చాలాసేపు కిటికీ దగ్గరే కూచుంది. తిరుగుబాటు చేసిన గ్రామంనుంచి దూరంగా కలవరం వినిపిస్తోంది. కాని ఆవిడ అది వినడంలేదు. రైతులను గురించి ఆలోచించడంలేదు. వారి విచిత్రమైన ప్రవర్తనకు అర్థం తెలుసుకోవాలని కూడా ప్రయత్నించడంలేదు. ఆవిడ ఇప్పుడు తన దుఃఖాన్ని గురించి తప్ప మరి దేన్ని గురించీ ఆలోచించడంలేదు. ఇప్పుడు ఆ దుఃఖం కూడా గతంలో కలిసిపోయింది. ఇప్పుడావిడ ఆ దుఃఖాన్ని జ్ఞాపకం చేసుకుంటోంది.

మేరియా రాకుమారి అక్కడ కలకంటూ కూచుని ఉన్నది. గడిచిపోయిన గతాన్ని గురించి, తండ్రి జబ్బును గురించి, ఆయన ఆఖరు క్షణాన్ని గురించీ స్మరిస్తూ ఉంది. కాని, ప్రశాంతమైన ఈ విచిత్ర క్షణంలో తను ఊహించుకోవ డానికి సాహసంలేని ఆ మృత్యువును గురించి మాత్రం తలుచుకోవడంలేదు. ఆవిడ, ఆయనకు మొట్టమొదటిసారిగా పక్షవాతపు దెబ్బ తగిలిన క్షణాలను ఊహించుకో సాగింది. ఆయనను లిస్సీ-గోరీ తోటలోనుంచి మోసుకొని వస్తున్నారు. ఆయన పెదవులు కదులుతున్నాయి. తనవంక భయంతో చూస్తున్నాడు. 'అప్పుడు కూడా ఆయన నాతో ఏదో చెప్పదలుచుకున్నాడు. ఎప్పుడూ ఆయననాతో ఏదో చెప్పదలుచు కున్నాడు.' అనుకున్నది. ఇలా అనుకుని ఆ అమ్మాయి తన తండ్రి చనిపోతూ తనతో చెప్పిన మాటలు జ్ఞాపకం తెచ్చుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది. తరువాత

ఆవిడ హృదయభారం కొంచెం తగ్గింది. ఆయన ముఖంలోని ప్రతి లక్షణం ఆవిడకు జ్ఞాపకం వచ్చింది. తన చిన్నతనం నుంచీ ఆయనంటే భయపడుతూ ఉండేది. కాని ఇప్పుడు మాత్రం ఆ ముఖం దూరంగా కనిపిస్తోంది. జాలిగొలిపే ఆ సన్నని ముఖం మాత్రమే ఇప్పుడావిడకు జ్ఞాపకం వచ్చింది. ఆయన ఏం చెపుతున్నాడో విందామని ఆవిడ ఆ ముఖంమీదికి వంగింది.

"నన్ను 'చిన్న అమ్మాయి' అని పిలిచారు. అప్పుడాయన ఏమనుకున్నాడో!" అని ఆవిడ ఆశ్చర్యపోయింది. ఆవిడ పెదవులు ఆయన చెక్కిలి తాకినప్పుడు ఆవిడ శరీరమంతా కంపించిపోయింది. చివరసారి ఆయన చూచినట్లుగా ఆవిడ ఊహించుకోసాగింది. ఆ చిత్రం జ్ఞాపకం వచ్చేసరికి ఆవిడ ఆపాదమస్తకం కంపించి పోసాగింది. నెమ్మదిగా ఆ చిత్రాన్ని మనస్సులోనుంచి పారద్రోలుకోవటానికి ప్రయత్నించి కళ్ళు పెద్దవి చేసుకుని, నీడలతో వెన్నెల వెలుగుతున్న ప్రకృతి దృశ్యంవైపు చూడసాగింది. అలాగైనా ఆ చిత్రాన్ని మరిచి పోతాననుకున్నది. కాని ఆ రాత్రిలోని గంభీరత, నిశ్శబ్దం చూచి ఆవిడ గడ్డ కట్టుకుని పోయింది.

"డొనిషా!" అని ఆవిడ మెల్లగా పిలిచింది.

"డొనీషా!"అని మళ్ళీ పిలిచింది. తరువాత అక్కడనుంచి లేచి గదిలోనుంచి పరుగెత్తుకొని వెళ్ళింది. ఆవిడ పిలుపు విని పరిచారికలు వచ్చారు.

# 97

ఆగస్టు 17 వ తారీఖున నికోలస్ రోస్టోవ్, ఇలైన్ లావ్రుష్కాతో కలిసి జంకోవోలో బసచేసిన చోటునుంచి బొగొషోరోవ్‌కు కొద్ది మైళ్ళ దూరంలోకి వచ్చారు. ఇలైన్ కొన్న కొన్ని గుర్రాలు ఎలా స్వారీ చేస్తాయో చూడడం కోసం, వాటికి మేత కొనడం కోసం వారు వచ్చారు. గత మూడురోజులనుంచీ ఇరుసైన్యాలూ బొగొషోరోవ్‌కు సమానమైన దూరంలోనే ఉన్నాయి. ఫ్రెంచి సేనకాని, రష్యన్ సేనకాని ఏ క్షణంలోనైనా అక్కడ ఢీ కొనవచ్చు. నికోలస్ తన సైనికుల కోరికలు బాగా గుర్తెరిగినవాడు కాబట్టి ముందుగా ఆహారపదార్థాల కోసం అక్కడకి బయలు దేరాడు. నికోలస్, ఇలైన్ ఇద్దరూ కూడా ఖులాసాగా రాకుమారుని భవనంలో ఉండే పరిచారికలతో సరససల్లాపాలు ఆడవచ్చు కదా అని అక్కడికి బయలు దేరారు.

వారు వెడుతూ దారిలో లావ్రుష్కాచేత నెపోలియన్ కథ అడిగి చెప్పించుకుని కడుపారా నవ్వుకున్నారు. ఖులాసాగా గుర్రాలను స్వారీచేయిస్తూ వెళ్ళారు. నికోలస్ తాను వెళ్ళబోతున్న గ్రామం నటాషాను ఇంచుమించుగా పెళ్ళాడబోయిన ఒక వ్యక్తి దేనని తెలుసు. అతను ఇలైన్ కంటే ముందుగా వెళ్ళాడు. తరువాత

ఇలైన్ తనను వెనకాల విడిచినందుకని వేగం హెచ్చించింది, అతని కంటే ముందు వెళ్ళాడు.

"మీరేమైనా అనుకుంటారేమోనని ఊరుకున్నాను కాని, లేకపోతే నేను మీ ఇద్దరికంటే ముందుగా స్వారీచేసేవాణ్ణి!" అన్నాడు లావ్‌రుష్కా, 'ఫ్రెంచి' అనే తన గుర్రాన్ని చూపిస్తూ. "ఇది చాలా మంచి గుర్రం!" అన్నాడు మళ్ళీ.

ఇప్పుడు ముగ్గురూ మెల్లగా స్వారీచేయసాగారు. అక్కడ కొందరు రైతులు గుంపుకూడి ఉన్నారు.

ఆఫీసర్లను చూడగానే వారిలో కొందరు హేట్లు తీశారు. మరి కొందరు ఎలాక పోయి చూచారు. పొడుగ్గా, వృద్ధులైన ఇద్దరు రైతులు ముడతలు తేలిన ముఖాలతో పాటలు పాడుతూ ఒక పాకలో నుంచి బయటికి వచ్చారు.

"వీరు భలే చిత్రంగా ఉన్నారు!" అన్నాడు నికోలస్. "మీ దగ్గర మేత దొరుకుతుందా?" అని వారినడిగాడు.

"చూడు! ఎలా చూస్తున్నారో!" అన్నాడు ఇలైన్.

"ఒక కులాసా కుర్రవాడు!" అని పాడుకుంటూ వచ్చాడు ఒక వృద్ధుడు.

"మీ రెవరూ?" అని అడిగాడు ఒక రైతు, నికోలస్‌ను చూచి.

"మేము ఫ్రెంచి వాళ్ళం!" అన్నాడు ఇలైన్ నవ్వుతూ.

"ఆ తరువాత, ఇతనే నెపోలియన్!" అంటూ లావ్‌రుష్కాను చూపించాడు.

"మీరు వెళ్ళండి! మాకు తెలుసులే, మీరు రష్యన్‌లే!" అన్నాడు మరొక రైతు.

"మీరు చాలా మంది ఉన్నారా? అని అడిగాడు మరొకడు.

"అవును. చాలా మందిమి వున్నాం" అని చెప్పాడు నికోలస్. "మీ రిక్కడ ఏం చేస్తున్నారు? ఇవాళ సెలవురోజా? కులాసాగా గడుపుతున్నారా?" అని అడిగాడు మళ్ళీ.

"పెద్దలంతా కలిసి మా రైతుసంఘ వ్యవహారాలు చర్చించడానికి సమావేశమైనారు" అన్నాడు ఒకరైతు.

ఈ సమయంలో ఇద్దరు స్త్రీలు, తెల్లని హేటు పెట్టుకున్న ఒక వ్యక్తి రహదారిపై నుంచి వారివైపుకు వచ్చారు.

"బూదిరంగు గౌను వేసుకున్న ఆ అమ్మాయి నాది! దాన్ని మాత్రం ముట్టకు!" అన్నాడు ఇలైన్, తనవైపు వస్తున్న అమ్మాయిలను చూచి.

ఆ పిల్ల డొనీషా. "నీ కేం కావాలి అమ్మాయి?" అని అడిగాడు ఇలైన్, చిరునవ్వు నవ్వుతూ.

"రాకుమారి మీ పేరు, మీ దళంపేరు తెలుసుకోవాని కోరుతోంది." అని ఆ పిల్ల అన్నది.

"ఇతను కౌంట్ నికోలస్ రోస్టోవ్. అశ్విక దళానికి కెప్టెన్. ఇంక నేనంటావా? నీకు సేవకుణ్ని!" అన్నాడు ఇలైన్.

"భలే కుఱ్ఱవాడు!" అన్నాడు కొంచెం తాగి వున్న ఒకరైతు, వారిద్ధరివంక ఆశ్చర్యంతో చూస్తూ.

డొనీషా వెనకాలే ఆల్పటిచ్ వచ్చాడు. చేతిలో హేటు పట్టుకొని నిలుచుని ఉన్నాడు.

"ఒక్క క్షణం మీకు ఇబ్బంది కలిగిస్తున్నందుకు మన్నించండి!" అన్నాడు ఆల్పటిచ్, తనవెయ్యి వెయిస్ట్‌కోటులో ఉంచుకొని, ఎంతో మర్యాదగా.

"నా యజమానురాలు, జనరల్ నికోలస్ బోల్‌కోన్‌స్కీ రాకుమారుని కుమార్తె. ఇప్పుడు చాలా విషమ పరిస్థితిలో ఉంది. దీనికి కారణం వీరే!" అంటూ ఆల్పటిచ్ తనచుట్టూ పోగయి ఉన్న జనసమూహాన్ని చూపించాడు. "మిమ్మల్ని ఒకమాటు వచ్చి మాట్లాడమని కోరుతూ ఉంది మా రాకుమారి. ఆవిడ ఉంటున్న చోటు ఇక్కడికి కొద్ది దూరంలోనే ఉంది. మీరు హాయిగా రావచ్చు." అని చెప్పాడు.

"జాకోబ్ ఆల్పటిచ్! నీవేనా!" అన్నారు ఇద్దరు తాగివున్న రైతులు చిరునవ్వు నవ్వుతూ. "మమ్మల్ని క్షమించు!" అన్నారు ఇద్దరూ.

నికోలస్ తాగివున్న ఆ రైతులవంక చూచి వారిలాగే తనుకూడా నవ్వాడు.

"వారు మీకు గమ్మత్తుగా కనిపిస్తున్నారనుకుంటాను!" అన్నాడు ఆల్పటిచ్.

"అందులో గమ్మత్తేమీ లేదు." అన్నాడు నికోలస్, గుఱ్ఱాన్ని వారి దగ్గరికి పోనిస్తూ. తరువాత "ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"నేను తమకొక విషయం తెలియచేస్తున్నాను. ఈ వెలవలు అమ్మాయిగారిని ఊరు విడిచి వెళ్ళనీయడంలేదు. గుఱ్ఱాలను తీసుకుని వెళతామని భయపెడుతున్నారు. ఉదయం నుంచీ సామానులన్నీ సర్దుకొని సిద్ధంగా ఉన్నాం. కాని వెళ్ళడానికి వీలు లేకపోయింది" అని చెప్పాడు ఆల్పటిచ్.

"నిజంగానా?" అన్నాడు నికోలస్.

"నిజంగానే అయ్యగారూ! ఉన్నమాట చెపుతున్నాను." అన్నాడు మళ్ళీ ఆల్పటిచ్.

నికోలస్ గుఱ్ఱం దిగాడు. గుఱ్ఱాన్ని తన సేవకుడికి అందించాడు. దోవన పోతూ ఆల్పటిచ్‌ని విషయాలడిగి తెలుసుకుంటూ ఇంటివైపు వెళ్ళాడు.

మేరియా రాకుమారి ఆ క్రితం సాయంత్రం రైతులకు ధాన్యం పంచుతానని

అనడం, డ్రోన్‌తో ఆవిడ చర్చ, పరిస్థితుల్ని మరీ విషమింపచేశాయి. డ్రోన్ పూర్తిగా రైతుల పక్షంచేరి తాళపుచెవులు అల్పటిచ్ కిచ్చివేసి, రాకుమారి ఆజ్ఞ వినకుండా వెళ్ళిపోయాడు. రాకుమారి గుర్రాలు కట్టవలసిందని ఉత్తర్వు ఇవ్వగానే రైతులంతా మళ్ళీ ఒక గుంపుగా వచ్చి, తాము మళ్ళీ గుర్రాలు తీసుకుని వెళదామనీ, ఎవరూ ఇల్లు విడిచి వెళ్ళకూడదనీ బెదిరించారు. అల్పటిచ్ వారికి తెలివిగా ఎంత చెపుదామనుకున్నా వారు వినిపించుకోలేదు. డ్రోన్ అక్కడ లేకుండా పోయాడు. మేరియా రాకుమారి వెళ్ళడం ఉత్తర్వులకు వ్యతిరేకం కాబట్టి తాము వెళ్ళడానికి నిరాకరిస్తున్నామని కార్ప్ చెప్పాడు. ఆవిడ అక్కడే ఉండేటట్టయితే ఆవిడ మాటలు వింటామని అన్నారు.

మేరియా రాకుమారి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకుంది. అల్పటిచ్, నర్సు, ఎంత చెప్పినా వినకుండా వెళ్ళిపోవడానికే నిశ్చయించుకుంది. బండికి గుర్రాలు కట్టారు. రహదారి మీది నుండి నికోలస్, ఇలైన్ రావడం చూడగానే అంతా అటు వైపు చూచారు. గుర్రపుశాలలో ఉన్నవారు వారిని చూచి ఫ్రెంచి వారనుకుని అక్కడ నుంచిపరుగు లంకించుకున్నారు. ఇంట్లో అంతా బిగ్గరగా ఏడవడం మొదలుపెట్టారు.

నికోలస్ రాగానే అతన్ని అంతా ముక్తిదాతగా చూచుకున్నారు.

అతను డ్రాయింగ్ రూంలోకి వెళ్ళినపుడు మేరియా రాకుమారి అసహాయురాలు లాగా కూచుని ఉంది. ఆవిడకు ఆలోచించే శక్తి కూడా పోయింది. మొదట అతనెవరో, ఎందుకొచ్చాడో కూడా అర్థం చేసుకోలేక పోయింది. కాని అతని రాక, పద్ధతి, మాటలు; వీటిని బట్టి అతను కూడా తన దేశస్థుడేననీ, తన అంతస్థులోని వాడేననీ ఆవిడకు స్పష్టమైంది. జాలి గొలిపే విశాలమైన తన కళ్ళతో అతని వంక చూచింది. వణుకుతున్న కంఠస్వరంతో అతనితో మాట్లాడసాగింది.

'ఏమిటీ విచిత్రమైన కలయిక ! అసహాయురాలైన ఈ అమ్మాయితో నాకీ విచిత్రమైన కలయిక ఏమిటి ?' అనుకున్నాడు నికోలస్ తనలో. అందులో ఏదో ఒక ప్రణయం అతనికి కనిపించసాగింది. ఆవిడ తన కథ చెపుతోంటే అతను ఆవిడవంక తదేకంగా చూడసాగాడు. 'ఎంత వినయం ! ఎంత గంభీరత ఆవిడ ముఖంలో !' అనుకున్నాడు.

"నిజంగా రాకుమారీ ! నే నిక్కడికి రావడం, నీ సేవచేసే భాగ్యం నాకు లభించడం; ఇవి జరిగినందుకు నిజంగా నేనెంత సంతోషిస్తున్నానో చెప్పలేను !" అన్నాడు నికోలస్. "మీరు వెంటనే బయలుదేరవచ్చు. మీకెవరూ అడ్డురారు. మీకు రక్షణగా నన్ను మాత్రం మీ వెంట రావడానికి అనుమతించవలసిందని కోర

తున్నాను" ఇలా అని; ఒక రాజకుమార్తెకు వంగి నమస్కరించి తన గౌరవాన్ని తెలిపినట్లుగా ఆవిడకు తన గౌరవాన్ని తెలిపాడు. తరువాత వాకిలివైపు తిరిగాడు.

ఆవిడతో తను ఇంత కంటె ఇంకా ఎక్కువ పరిచయం చేసుకోవడం తనకు సంతోషకరమైన విషయం అయినప్పటికీ కూడా, తను ఆవిడ పరిస్థితిని అందు కోసం వినియోగించుకుంటున్నాని ఆవిడ అనుకుంటుందేమోనని నికోలస్ ఈ విధంగా ఆవిడతో ఎంతో మర్యాదగా, హుందాగా ప్రవర్తించాడు. మేరియా రాకుమారి కూడా ఈ విషయం అర్థం చేసుకున్నది.

"మీపట్ల ఎంతో కృతజ్ఞురాలిని" అన్నదావిడ ఫ్రెంచి భాషలో. "నేనింకా అప్పుడు జరిగినదంతా ఒక అపార్థమనే అనుకుంటున్నాను. అందుకు ఎవరినీ నిందించాల్సిన పని లేదనుకుంటాను" అన్నది. ఇలా అని కన్నీళ్ళు పెట్టుకున్నది "ఆ...క్షమించండి !" అన్నది మళ్ళీ.

నికోలస్ కూడా తన ఉద్వేగాన్ని దాచుకుని మరొకసారి వంగి ఆవిడకు తన గౌరవాన్ని తెలియచేసి బయటికి వెళ్ళాడు.

# 98

"సరేకాని ఆ అమ్మాయి అందంగా ఉందా ? నా అమ్మాయి మాత్రం అందంగా ఉంది. దాని పేరు డొనీషా !" అన్నాడు ఇలైన్ నికోలస్ తిరిగి రాగానే. కాని తన కెప్టెన్ ముఖకవళికలను చూడగానే మాట్లాడలేక ఆగిపోయాడు. అప్పుడు తన నాయకుడు అతనితో పరాచకాలాడే స్థితిలో లేడు. నికోలస్ ఒకమాటు ఇలైన్ వంక ఓరగా చూచి అక్కడనుంచి పరుగుతీస్తూ వెళ్ళాడు.

"వెధవలు ! వాళ్ళకొక గుణపాఠం నేర్పుతాను చూడు ! నా సంగతేమిటో చెపుతాను" అంటూ వెళ్ళాడు నికోలస్. అల్పటిచ్ అతని వెంట పరుగెత్తి అతన్ని అందుకునే సరికి ఎంతో కష్టమైంది.

"మీరు వాళ్ళను ఏం చేద్దామని అనుకున్నారు అయ్యగారూ ?" అని అడిగాడు అల్పటిచ్, వినమ్రుడై.

"ఏం చేస్తానేమిటి ?" అన్నాడు నికోలస్ కోపంతో. "మీరేం చేశారో చెప్పండి ? రైతులు తిరుగుబాటు చేశారు. మీరు చూస్తూ ఊరుకున్నారు. మీరేమీ చేయలేకపోయారు. మీలాంటి వాళ్ళ సంగతి నాకు తెలుసు. మిమ్మల్ని ఏంచేస్తానో చూడు !" అన్నాడు. తరువాత శరవేగంతో పరుగుతీస్తూ వెళ్ళాడు. తన కోపం ఎక్కడ బయటపడిపోతుందో అన్నట్టుగా వెళ్ళాడు. అల్పటిచ్, తను కూడా ఆయన వెంటనే పరుగెత్తడం మొదలుపెట్టాడు. ఆయనకు తిరుగుబాటు చేసిన

రైతులను గురించి తన ఉద్దేశాలు చెప్పసాగాడు. వారు చాలా మొండిఘటాలనీ, సేన తీసుకుని రాకుండా వారిని ఒత్తిడి చేయడం నిరుపయోగమనీ, కాబట్టి సేనను తీసుకొచ్చి వాళ్ళను లొంగతీయాలనీ నికోలస్‌కు చెప్పసాగాడు.

"నేనంటే ఏమిటో వారికి చూపిస్తాను ! చూస్తావుగా !" అన్నాడు నికోలస్, తను అంటున్నదేమిటో తనకు తెలియకుండా. ఇలా అంటూ ఉద్రిక్తుడై పాకచుట్టూ చేరి వున్న జనసమూహం వైపు నడిచిపోసాగాడు.

నికోలస్‌కు ఒక నిశ్చితమైన ఉద్దేశం లేకపోయినా, అతని ఈ సాహసాన్ని బట్టి ఏదో జరిగి తీరుతుందని ఊహించాడు అల్పాటిచ్. అతని ముఖంలోని కోపం, అతని పద్ధతి చూచేసరికి తమ అంతిమ క్షణాలు దాపుకు వచ్చాయని అనుకున్నారు రైతులు. నికోలస్ మేరియా రాకుమారితో మాట్లాడడానికి వెళ్ళినప్పుడే రైతుల్లో కొంత కలవరం బయలుదేరింది. వారిలో చాలామంది వారు ఆఫీసర్లని, తమ చిన్న యజమానురాలి ప్రయాణానికి తాము ఆటంకం కలిగించి ఆలస్యం చేసినందుకు వారు ఊరుకోరని అభిప్రాయపడ్డారు. ఇలా అభిప్రాయపడ్డ వారిలో డ్రోను ఒకడు. అతను ఆ ఉద్దేశాన్ని బయటికి వెలిబుచ్చాడు కూడా. కాని కార్ప్ మాత్రం ఊరుకోలేదు. అతను డ్రోన్‌తో ఇలా అన్నాడు.

"నీవు ప్రక్క ఊళ్ళల్లో ఇళ్ళు కట్టడం మొదలుపెట్టి ఎంత కాలమవుతుంది? నీవు ఎక్కడో లంకెబిందె దాచి పెట్టుకుని ఉంటావు ? మాట్లాడడానికేం, ఏమైనా మాట్లాడవచ్చు. నీ వెప్పుడో ఆ లంకెబిందెను తీసుకొని ఉడాయిస్తావు. మా ఇల్లు దోపిడీ చేస్తే మాత్రం నీదేంపోయిందయ్యా ?"

"ఉత్తర్వు ఇచ్చిన విషయం మాత్రమే మాకు తెలుసు. మేము ఇక్కడ నుంచి వెళ్ళకూడదు, గ్రామాన్ని ఖాళీ చేయకూడదు." అని చెప్పాడు ఒక రైతు.

"కొడుకు సేనలోకి వెడతాడంటే నీవు ఒప్పుకోలేదు. కాని నా వాన్యాను పట్టుకు వెళ్ళారు." అన్నాడు ఒక వృద్ధుడు.

"ఇక మనం చేసేదేమీలేదు." అన్నాడు మరొకడు.

"ఇంకా నన్ను వారు నా బాధ్యతల నుంచి విడుదల చెయ్యలేదు." అన్నాడు డ్రోన్.

"అవును. నిన్ను ఇంకా వారు పంపివెయ్యలేదు. కాని వారు నీ జేబులు బాగా నింపి ఉంటారులే."

నికోలస్: ఇలైను; లావ్‌రుష్కా, అల్పాటిచ్ రావడం చూడగానే కార్ప్ చిరునవ్వు నవ్వుతూ వారికి ఎదురు వెళ్ళాడు. డ్రోన్ అందరికీ వెనకాలకు వెళ్ళి దాక్కున్నాడు.

"ఏయ్ అబ్బాయిల్లారా! మీలో అందరికీ పెద్ద ఎవరు?" అని అడిగాడు నికోలస్, సరాసరి వారి దగ్గరికి వెడుతూ.

"పెద్ద? ఎందుకూ పెద్ద?" అని అడిగాడు కార్ప్.

అతను అలా అడిగాడో లేదో అతని హేటు ఆకాశంలోకి ఎగిరిపోయింది.

"హేట్లు తీసేయండి" అని అరిచాడు నికోలస్.

"ఏడీ పెద్ద?" అని అడిగాడు మళ్ళీ.

"పెద్ద? పెద్ద ఎక్కడున్నాడు? ఏడీ? డ్రోన్ జకరవిచ్! నీ వెక్కడున్నావు? నీ కోసం అడుగుతున్నారు" అన్నారు. ఒక్కొక్కరే మెల్లగా అందరూ ఒకరి తరువాత ఒకరు టోపీలు తీసివేశారు.

"మేము తిరుగుబాటుదార్లం కాదు. మేము మా కిచ్చిన ఉత్తర్వులను అనుసరిస్తున్నాం" అన్నాడు కార్ప్.

"మేము కౌన్సిల్‌మాట వినాలి" అన్నారు ఒకరు.

"మీరు నాకు ఎదురుజవాబు చెపుతారా?" అంటూ నికోలస్, కార్ప్‌ను పట్టుకుని "ఇతన్ని పట్టుకో" అన్నాడు తన సేవకునితో.

లావ్రుష్కా ముందుకు వచ్చి కార్ప్ చేతులు పట్టుకున్నాడు. "మా వాళ్ళను కొండదగ్గరనుంచి పిలిపించమంటావా?" అన్నాడు లావ్రుష్కా.

అల్పటిచ్ ఇద్దరు రైతులనడిగి కార్ప్ చేతులు కట్టడానికి తువాళ్ళు తీసుకున్నాడు.

"ఏడీ మీ పెద్ద?" అన్నాడు నికోలస్ మళ్ళీ.

డ్రోన్ పాలిపోయిన ముఖంతో ముందుకు రావడానికి నిశ్చయించుకున్నాడు.

"నీవేనా? ఇలా రా" అని పిలుస్తూ నికోలస్ "లావ్రుష్కా! ఇతన్ని కూడా పట్టుకో" అని తన సేవకుడికి ఆజ్ఞాపించాడు.

కాని డ్రోన్ తనంతట తానే బెల్టు విప్పుకుని తన చేతులు కట్టుకోసాగాడు.

"ఇక మీ విషయం చెపుతున్నాను, నా మాట వినండి. మీరంతా వెంటనే మీ ఇళ్ళకు వెళ్ళిపొండి. మరోమాట మాట్లాడవద్దు" అన్నాడు నికోలస్ సాధికారంగా.

"మేమేమీ చేయలేదు. బుద్ధి తక్కువై ఇలా చేశాం. మమ్మల్ని మన్నించండి" అన్నారు రైతులు సవినయంగా.

"నేను చెప్పలేదూ? ఇది ఉత్తర్వులకు వ్యతిరేకం" అన్నాడు వారిలో ఒకడు.

"నేను ముందే మీకు చెప్పలేదూ!" అన్నాడు అల్పటిచ్. "ఇలా చేయడం చాలా తప్పు అబ్బాయిల్లారా" అన్నాడు.

"అవును జాకోబ్ ఆల్పటిచ్! చాలా తప్పు పని చేశాం" అంటూ జన సమూహమంతా మెల్లగా వెళ్ళిపోయింది.

అంతా ఇళ్ళకు వెళ్ళారు. బందీలుగా పట్టుకున్నవారిని ఇంటి పెరట్లోకి తీసుకుని వెళ్ళారు. ఇద్దరు త్రాగుబోతులు వారి వెనకాలే వచ్చారు.

"ఇదీ నీకు తగిన పద్ధతి! ఏదీ నన్నొకసారి చూడనీ. ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నాడు కార్ప తన ప్రక్కనున్న బందీతో.

"నీవు వట్టి బుద్ధిలేనివాడివి" అన్నాడు రెండవబందీ.

ఒక్క రెండుగంటల సేపట్లో గుర్రాలు తీసుకుని వచ్చారు. బండ్లుకట్టి వాటిని బొగొషారోవ్ భవనం ముందు నిలిపారు. రైతులు అనేకరకాలైన సామాన్లు బండ్లకెత్తిస్తున్నారు. యజమానురాలి కోరికపై విడుదల చేయబడిన ద్రోన్, అన్నీ సరి చూచుకుంటున్నాడు.

"అది జాగ్రత్త" అన్నాడు ఒక కుర్రాడు, మరొక కుర్రాడితో. ఒక పరిచారిక తీసుకునివచ్చిన 'డ్రెస్సింగ్ కేస్' చూపుతూ. "దాన్ని ఒకమూల పెట్టడం కాని, కట్టడం కాని చెయ్యకు. దెబ్బ తగులుతుంది ...ఆ, అది! అలా చెయ్యాలి. పైన ఒక చాప అయినా వెయ్యి, భద్రంగా ఉంటుంది ...ఆ, అదీ! అన్నీ జాగ్రత్తగా చెయ్యాలి" అన్నాడు.

"అబ్బ! ఏమిటి? ఎన్ని పుస్తకాలు!" అన్నాడు మరొకడు, గ్రంథాలయం నుంచి పుస్తకాల కేసులు మోసుకుని వస్తూ. "ఎన్ని పుస్తకాలు! ఎంత పెద్దవి! ఎంత చక్కని పుస్తకాలు" అన్నాడు.

"ఈ పుస్తకాలు వ్రాసింది ఎవరో కాని, అతనికి ఆడుకోవడానికి కూడా తీరిక చిక్కివుండదు" అన్నాడు మరో కుర్రాడు.

నికోలస్, మేరియా రాకుమారి పనికి మళ్ళీ అనవసరంగా భంగం కలిగించకుండా ఉండడం కోసం మళ్ళీ ఆవిడ దగ్గరికి వెళ్ళలేదు. ఆవిడ తనంతట తానే వస్తుంది కదా అని బయటే కాచుకుని ఉన్నాడు. బండ్లు బయలుదేరగానే అతను మళ్ళీ తన గుర్రాన్నెక్కి తన దళాలు బసచేసి ఉన్న ప్రదేశం వరకూ....పది మైళ్ళ దూరం ఆ బండ్లవెంట వెళ్లాడు. అక్కడ సత్రం దగ్గర ఆగి మేరియా రాకుమారి దగ్గర మర్యాదగా సెలవు తీసుకున్నాడు. తొలిసారిగా ఆవిడ చెయ్యి ముద్దాడాడు. ఆవిడ తనను అతడు కాపాడాడని కృతజ్ఞత చెప్పగా—

"అదేమిటి అలా అంటున్నారు?" అన్నాడు నికోలస్. "ఏ పోలీసు ఆఫీసరైనా ఈమాత్రం పనిచేసి ఉండేవాడు. మేము తగవు పడడానికి ఈ రైతులొక్కరే కాదు. మేము అనేకవిధాల కాలం వృథా పుచ్చకపోయినట్లయితే శత్రువు ఇంతవరకు వచ్చేవాడు కాదు" అని మళ్ళీ సంభాషణ మార్చి, "మీతో పరిచయం

కలిగినందుకు నాకెంత సంతోషంగా ఉందో చెప్పలేను. సెలవు రాకుమారీ! మీకు అన్నివిధాల సుఖం కలగాలనీ, మనం మళ్ళీ మంచి పరిస్థితుల్లో కలుసుకుంటామనీ ఆశిస్తున్నాను" అన్నాడు.

మేరియా రాకుమారి ముఖం విప్పారింది. ఆవిడ హృదయం కరిగిపోయింది. తను ఎన్ని పర్యాయాలు అభినందించినా అతని రుణం తీర్చుకోలేనని అనుకున్నది. తన్ను కాపాడింది అతను తప్ప మరెవరు? లేకపోతే తను ఏమై ఉండేదో! తిరుగుబాటుదార్ల చేతుల్లోనో, ఫ్రెంచివారి చేతుల్లోనో చిక్కి ఉండేది. తనను రక్షించడం కోసం అతను ఎన్ని ప్రమాదాలు ఎదుర్కొన్నాడు? తన పరిస్థితి పట్ల, తన పట్ల ఎంత సానుభూతి ప్రదర్శించాడు? తను అతనితో మాట్లాడినప్పుడు నీళ్ళతో నిండిన అతని కళ్ళు ఇప్పటికీ ఆవిడ మనసులో మెదులుతూనే ఉన్నాయి. అతని దగ్గర నుంచి తను సెలవు తీసుకుంటున్నప్పుడు తను అతన్ని ప్రేమించానేమోనని ఆవిడ అనుకున్నది హఠాత్తుగా. తనను ప్రేమించిన ఒక వ్యక్తి తనను ఇలా వశం చేసుకోవడం తనను తాను చెప్పుకున్నప్పుడు ఆవిడ కొంచెం సిగ్గుపడింది. కాని ఈ విషయం ఎవరికీ తెలీదనీ, ఆ ప్రేమను తన ప్రేమలో పెంపొందించుకోవడంలో పాపమేమీ లేదనీ, ఈ ప్రేమే తన జీవితానికంతటికీ తొలిప్రేమ మలిప్రేమ అవుతుందనీ తనను తాను ఓదార్చుకున్నది. 'అతను నాకు సహాయం చేయడం కోసం బొగొషొరోవ్ రావడము, అతని చెల్లెలు నా అన్నను నిరాకరించడము జరగవలసిఉండి జరిగింది కాబోలు!' అనుకున్నది. ఒక రహస్యమైన ఆశను తనలో తాను నెలకొల్పుకున్నది. ఒకప్పటికి ఆ ఆశ ఫలిస్తుందని ఆకాంక్షించింది.

నికోలస్ కూడా ఆవిడపట్ల ఆకర్షింపబడ్డాడు. అతని స్నేహితులంతా నవ్వుతూ అతన్ని పరిహాసం చేశారు గడ్డికోసం వెళ్ళి రష్యాలోకల్లా శ్రీమంతురాలయిన ఒక అమ్మాయిని కనుగొన్నాడని పరాచకాలాడారు. వారిలా పరాచకలాడుతూ ఉంటే అతనికి చాలా కోపం వచ్చింది. కాని తన హృదయంలో మాత్రం వినయవతి అయిన ఆ రాకుమారిని వివాహం చేసుకోవడంకంటే మరి భాగ్యం వేరే ఉండదని అనుకున్నాడు. అది తప్పకుండా జరిగి తీరుతుందనికూడా అనుకున్నాడు. అదీకాక తన తండ్రి చిక్కులన్నీ తీరడానికి, తన తల్లిని సంతృప్తి పరచడానికీ ఆవిడ ఆస్తి ఎంతో సహాయపడుతుందని అనుకున్నాడు...'మరి సోనియా విషయం? ఆవిడకు తనిచ్చిన వాగ్దానం మాటేమిటి?' ఈ విషయం మనస్సులోకి వచ్చి అతన్ని కలవరపరిచింది. తను బొగొషొరోవ్‌కు వెళ్ళినందుకు తన స్నేహితులు పరాచకాలాడినప్పుడు అందుకోసమే వారిని అతను కోపగించుకున్నాడు.

# 99

కొటొజోవ్ ఛీఫ్‌కమాండర్ పదవి ఒప్పుకున్న తరువాత ఆండ్రూ రాకుమారుడు జ్ఞాపకం వచ్చి అతని కోసం కబురు పంపాడు. అతను జారవేషంపీ దగ్గరికి కొటొజోవ్ తొలి తనిఖీ చేస్తూ ఉండగా వచ్చాడు. అతను గ్రామంలోకి రాగానే గుర్రం దిగి మతగురువు వాకిటముందర బెంచీమీద కూచున్నాడు. జనరల్ కోసం ఎదురు చూస్తున్నాడు. గ్రామం వెలుపల దూరంగా మిలిటరీ విజిల్ కూతలు కొత్త కమాండర్ రాకను ఎదురు చూస్తున్న వారి హర్షధ్వానాల్లో మునిగిపోతున్నాయి. ఆండ్రూ రాకుమారునికి పదిగజాల దూరంలో ఇద్దరు కొటొజోవ్ సేవకులు కూచుని ఉన్నారు. ఒకడు కొరియరు, మరొకడు ఇంటిసేవకుడు, తమ యజమాని లేని సమయంలో హాయిగా కాలక్షేపం చేస్తున్నారు.

ఈ సమయంలో ఒక కర్నల్ గుర్రపుస్వారీ చేస్తూ అక్కడికి వచ్చాడు. అతను పొట్టిగా నల్లగా ఉన్నాడు. పెద్ద మీసాలు. అతను ఆండ్రూను చూడగానే కమాండర్ ప్రధానకార్యాలయం ఇదేనా అనీ, తను వెళ్ళవచ్చా అనీ అడిగాడు.

ఆండ్రూ తను ఛీఫ్‌కమాండర్ పరివారంలోనివాడు కాదనీ, తను కూడా అప్పుడే వచ్చాననీ చెప్పాడు. ఆ కర్నల్ తరువాత సేవకులను అడిగాడు. వారు అలక్ష్యంగా అతనికి జవాబు చెప్పారు.

"ఎవరూ? అయ్యగారా! ఇప్పుడే వస్తారు. ఏమిటి పని?" అన్నాడు ఒక సేవకుడు. సేవకుల అలక్ష్యాన్ని చూచి కర్నల్ చిరునవ్వు నవ్వాడు. తరువాత తన గుర్రపు కళ్ళాని సేవకుడికి అందించి గుర్రం దిగి ఆండ్రూ దగ్గరికి వెళ్ళి సెల్యూట్ చేశాడు. ఆండ్రూ కూడా అతనికి సెల్యూటు చేసి, తన ప్రక్కన బెంచీమీద కూచోడానికి అతనికి చోటు చేశాడు.

"మీరుకూడా ఆయన కోసం వేచి ఉన్నారా?" అని అడిగాడు ఆ కర్నల్. "ఆయన చాలా మంచివాడంటారు కదూ? ఇప్పుడు ఆ జర్మన్‌ల గొడవ వదిలిపోయింది. మీరు కూడా యుద్ధానికి వెళ్ళారా?" అన్నాడు మళ్ళీ.

"వెళ్ళడమే కాదు. దానివల్ల చాలా నష్టపడ్డాను కూడా!" అన్నాడు ఆండ్రూ. "మా నాన్నగారు పోయారు. ఇక మా ఇంటి సంగతీ, ఆస్తి సంగతీ చెప్పవలసిన పనిలేదు మాది స్మోలెన్స్క్." అన్నాడు.

"మీరు బోల్‌కోన్‌స్కీ రాకుమారులనుకుంటాను. మీ పరిచయ భాగ్యం

కలిగినందుకు ఎంతో సంతోషం. నేను లెఫ్టినెంట్ జనరల్ డెనిషోవ్‌ను. నన్ను వాస్కా డెనిషోవ్ అంటారు." అన్నాడు ఆ కర్నల్, ఆండ్రూతో కరస్పర్శ గావిస్తూ. తరువాత కాసేపు ఆగి "అవును. అంతా విన్నాను— అయితే మీరు బోల్‌కోన్‌స్కీ రాకుమారులన్నమాట? మీ పరిచయం కలగటం వల్ల ఎంతో సంతోషంగా వుంది." అన్నాడు మళ్ళీ చిరునవ్వు నవ్వుతూ.

ఆండ్రూ రాకుమారునికి నటాషా ద్వారా డెనిషోవ్‌ను తెలుసు. ఈ జ్ఞాపకం ఇటీవల అతని మనస్సులో వాడిపోయిన భావాలను మళ్ళీ మేలుకొలిపింది. ఆ భావాల్లో బాధ ఉన్నా ఒక విధమైన సుఖం కూడా ఉంది. అప్పటి నుంచీ అతనికి ఎన్నో అనుభవాలు కలిగాయి. అతను స్మోలెన్‌స్క్ నగరం విడిచి వెళ్ళవలసి రావడం, లిస్సీ-గోరీకి వెళ్ళడం-తండ్రి మరణం-ఈ దుఃఖాలన్నీ కూడా అతని మనస్సులోకి ఇప్పుడెక్కువగా జ్ఞాపకం రావడం లేదు. డెనిషోవ్‌కు కూడా ఆండ్రూ పేరు వినగానే అనేక పాత జ్ఞాపకాలు కలిగాయి. ఆ సాయంత్రం భోజనం అయిన తరువాత నటాషా పాడటం, ఆ పదిహేనేళ్ళ పిల్లకు తను తన ప్రేమను వెలిబుచ్చడం- డెనిషోవ్‌కు జ్ఞాపకం వచ్చాయి. ఆ తొలిప్రేమ జ్ఞాపకం రాగానే అతను చిరునవ్వు నవ్వుకున్నాడు. కాని వెంటనే ఇప్పుడు తను ఆలోచిస్తున్న మరో విషయం మీదికి మనస్సు మరల్చుకున్నాడు. సేనలు వెనక్కు తిరిగి వస్తున్నప్పుడు తను ఔట్ పోస్ట్‌లో పనిచేస్తూ ఒక పథకాన్ని వేసుకున్నాడు. దాన్ని బార్‌క్లే డీ టాలీ ముందు ఉంచాడు. మళ్ళీ ఇప్పుడు దాన్ని కొటొజోవ్ ముందు ఉంచాలని అతని ఉద్దేశం. అతని పథకంలోని ఉద్దేశం— ఫ్రెంచి సేనలు చాలా విస్తారంగా ఆక్రమించి ఉంటే మొట్టమొదటి విషయం వారిని అపుచేయడానికి ముందునుంచి ఎదుర్కోవాలి. వారికి వార్తాసంబంధాలు లేకుండా చేయాలి. "వారు ఇంత విస్తృతంగా అప్పుడు పనిచేయలేరు. నాకు ఒక్క అయిదువందల మంది సేనను ఇస్తే నేను వారి మధ్యలో నుంచి వెళ్ళి ఈ పని చేస్తాను" అన్నాడు డెనిషోవ్.

డెనిషోవ్ ఈ విషయాన్ని తన సహజ ధోరణిలో ఆండ్రూకు చెపుతుండగా పెరేడ్ మైదానంలోనుంచి హర్షధ్వానాలు మరింత బిగ్గరగా వినిపించాయి. అదే సమయంలో వీధికొసన గుర్రపుగిట్టల చప్పుడు కూడా వినిపించింది. "అడుగో! వస్తున్నాడు!" అన్నాడు ఒక గేటు కాపలాదారు.

ఆండ్రూ రాకుమారుడు, డెనిషోవ్ లేచి ముందుకు వెళ్ళారు. వీధి కొసలో చీఫ్ కమాండర్ ఒక చిన్న గుర్రం మీద వస్తున్నాడు. ఆయన వెనకాలే ఆయన పరివారం తాలూకు ఆఫీసర్లు కూడా వస్తున్నారు. బార్‌క్లే డీ టాలీ కూడా ఆయన ప్రక్కనే ఉన్నాడు. కొందరు ఆఫీసర్లు ఆయనతో మాట్లాడుతున్నారు. ఒక సహాయ సేనాపతి ఆయనకంటె ముందుగా వచ్చి ఇంటి ముంగిట్లోకి ప్రవేశించాడు.

ఛీఫ్ కమాండర్ ఎక్కి వస్తున్న గుర్రం అలిసిపోయినట్టుగా కనిపిస్తుంది. ఆయన తన తెల్లని మిలిటరీ టోపీకి చెయ్యి తగిలేటట్లుగా సెల్యూట్ చేస్తున్నాడు.

ఆయన వచ్చి సైనిక వందనం చేస్తున్న సైనికుల ముందు ఆగాడు. వారు కొందరు గ్రెనేడియర్లు. ఒక్క క్షణంపాటు ఆయన వారివంక చూచి చిరునవ్వు నవ్వాడు. తరువాత తన ప్రక్కన వున్న ఆఫీసర్లతో ఇలా అన్నాడు:

"ఇలాంటి వారుండగా మనం శత్రువుకు బెదిరిపోయి తిరిగి రావడ మేమిటి ?"

"మంచిది జనరల్, వచ్చావా ?" అన్నాడు మళ్ళీ ఆయన, వాకిట్లో నుంచి ఆంద్రూ రాకుమారునికి దగ్గరిగా వెడుతూ.

తరువాత అంతా హర్షధ్వానాలు చేశారు.

ఆంద్రూ రాకుమారుడు పోయినసారి చూచినప్పటి కంటే కొటొజోవ్ బాగా లావెక్కాడు. కాని ఆయన ముఖం తీరు మాత్రం అలాగే ఉంది. ఆయన ముంగిట్లోకి ప్రవేశిస్తూ ఒకమాటు బరువుగా నిశ్వసించాడు. ఆయన బరువుగా గుర్రం దిగిన వెంటనే, అక్కడే కాచుకువి ఉన్న కోసక్కులు, సహాయ సేనాధిపతులు ఆయన్ను పట్టుకున్నారు.

ఆయన నేలమీద కాలూనగానే అరమూసిన కళ్ళతో ఆంద్రూ రాకుమారుని వంక చూచాడు. కాని వెంటనే గుర్తించలేకపోయాడు. తరువాత ముందుకు వెళ్ళాడు. మెట్లు దిగగానే మళ్ళీ ఒకమాటు ఆంద్రూ రాకుమారుని వంక చూచాడు. కొన్ని నిముషాలపాటు అతన్ని పోలిక పట్టలేకపోయాడు. తరువాత కొద్ది క్షణాలకు...

"మంచిది రాకుమారా, వచ్చావా ! ఎలా ఉన్నావు స్నేహితుడా ? ఇలారా, ఇలారా !" అంటూ మెట్లెక్కి వెళ్ళి బెంచీమీద కూచుని, "మరి మీ నాన్నగారు ?" అన్నాడు.

"నిన్ననే ఆయన మరణవార్తను..." అన్నాడు ఆంద్రూ రాకుమారుడు.

కొటొజోవ్ ఒకమాటు కలవరపడి టోపీ తీసి క్రాస్ గుర్తు చేసుకున్నాడు.

"ఆయన ఆత్మకు శాంతి కలుగుతుంది గాక ! అంతా ఈశ్వరేచ్ఛ !" అన్నాడు. మళ్ళీ కొద్దిసేపు ఆగి, "ఆయనంటే నాకెంతో గౌరవం ఉండేది." అన్నాడు. తరువాత ఆంద్రూ రాకుమారుని చుట్టూ చేతులు పెనవేసి గట్టిగా కౌగలించుకున్నాడు. అతని కళ్ళలో నీళ్ళు నిలిచి ఉండడం ఆంద్రూ చూచాడు.

"రా, రా ! నా గదిలోకి వెడదాం రా, మాట్లాడుకుందాం." అన్నాడు మళ్ళీ కొటొజోవ్ ఇలా అని లేవబోతూ ఉండగా సహాయ సేనాధిపతులు వద్దంటున్నా

వినకుండా డెనిషోవ్ మెట్లెక్కి వచ్చి ఆయన ముందు నిలుచున్నాడు. కొటూజోవ్ అలాగే కూచుని అతని వంక కలవరంతో చూచాడు. డెనిషోవ్ తన పేరు చెప్పి దేశ శ్రేయస్సుకోసం ఒక ముఖ్యమైన విషయం ఆయనతో మాట్లాడడానికి వచ్చానని చెప్పాడు. కొటూజోవ్ ఇదేమిటా అన్నట్లు పొట్టమీద చేతులు వేసుకుని,

"శ్రేయస్సా ? ఇదేమిటి ? సరే, అదేమిటో కానీయి !" అన్నాడు.

డెనిషోవ్ ఆడపిల్లలా సిగ్గుపడ్డాడు. ఆ సిగ్గు అతని ముఖంమీద విచిత్రంగా కనిపించింది. అలా సిగ్గుపడి మధ్యలో కళ్ళయినా ఆర్పకుండా తన పథకాన్నంత చెప్పడం మొదలుపెట్టాడు. వియజ్మాకూ, స్మోలెన్స్కకూ మధ్యలో ఉన్న శత్రు సేనల్లోగుండా దూసుకునిపోవాలని చెప్పాడు.

కొటూజోవ్ నేలవంక చూస్తూ ఇదంతా వింటూ కూచున్నాడు. మధ్య మధ్యలో అవతలి ప్రక్కన ఉన్న పూరి గుడిసెవైపు చూస్తున్నాడు. ఆ గుడిసెలో నుంచి ఎవరి రాకకోసమో ఎదురు చూస్తున్నట్లుగా ఉన్నాడు. అప్పుడే ఒక జనరల్ ఒక పెద్ద ఫైలు తీసుకుని అక్కడికి వచ్చాడు.

"ఏమిటది ?" అన్నాడు కొటూజోవ్ మధ్యలోనుంచి.

"అంతా వ్రాశావా ?" అని అడిగాడు.

"చిత్తం!" అన్నాడు జనరల్.

ఒక్కమనిషి అన్నిపనులూ చేయలేడన్నట్లుగా కొటూజోవ్ తల ఊపి మళ్ళీ డెనిషోవ్ చెప్పేమాటలు వినసాగాడు.

"నేను ఒక ఆఫీసరుగా నా మాట మీకిస్తున్నాను. నేను నెపోలియన్ సేనలను చీల్చుకుంటూ పోగలను." అని చెప్పాడు డెనిషోవ్.

కొటూజోవ్ అతన్ని మధ్యలో ఆపి "కిరైల్ ఆంద్రోవిచ్ నీకు బంధువు కదూ?" అని అడిగాడు.

"మా బాబాయే." అన్నాడు డెనిషోవ్.

"మే మిద్దరం చాలా మంచి స్నేహితులం!" అన్నాడు కొటూజోవ్ కులాసాగా. "సరే సరే అబ్బాయి! ఈ విషయాలన్నీ తరువాత మాట్లాడదాం లే, నీవు ఇక్కడే ఉండు" అని డెనిషోవ్‌తో చెప్పి తరువాత ఆఫీసరు వంక తిరిగి అతను తెచ్చిన కాగితాలిమ్మని అడిగాడు.

"గదిలోకి వెళ్ళి కూచుంటే బాగుంటుందనుకుంటాను. చూడవలసిన ప్లానులు, సంతకం చేయవలసిన కాగితాలు చాలా ఉన్నాయి." అన్నాడు ఆ ఆఫీసరు.

ఈ లోగా ఒక సహాయసేనాధిపతి అక్కడికి వచ్చి గదులు సిద్ధం చేయించానని చెప్పాడు.

"అక్కర్లేదు. ఇక్కడికే ఒక టేబిల్ తీసుకురమ్మను." అని ఆంద్రూతో "నీ విక్కడే ఉండు." అన్నాడు కొటొజోవ్.

ఆఫీసరు తన రిపోర్టు చెపుతూ ఉండగా సగం తెరిచి ఉన్న ద్వారంలోనుంచి ఒక సిల్కుదుస్తుల చప్పుడు వినిపించింది. ఆంద్రూ తిరిగి చూడగా ఒక చక్కని స్త్రీ కనిపించింది. ఆవిడ బూదిరంగు సిల్కుగౌను వేసుకుని ఉంది! తలకు చేరుమాలు కట్టుకుని ఉంది. ఆవిడ చేతిలో ఒక 'ట్రే' ఉంది. సహాయసేనాధిపతి ఆంద్రూ రాకుమారునితో ఆవిడ ఆ ఇంటి యజమానురాలని చెప్పాడు. ఆవిడభర్త అప్పుడే వారిని ఆహ్వానించాడనీ, ఆవిడ ఇప్పుడు వారి కోసం రొట్టె తీసుకుని వస్తోందనీ చెప్పాడు.

"ఆవిడ చాలా ముచ్చటగా ఉంది!" అన్నాడు ఆఫీసరు చిరునవ్వు నవ్వుతూ.

కొటొజోవ్ ఈ కడపటి మాటవిని తిరిగి చూచాడు. ఆ జనరల్ రిపోర్టు జార వేషంషీ దగ్గర రష్యన్ సేనచేసిన స్థావరాన్ని గురించి ఉన్నది. కొటొజోవ్ డెనిసోవ్ మాటలు విన్నట్లే పరధ్యానంగా దాన్ని చదవనిచ్చాడు. చెప్తున్నాయి కాబట్టి వినవలసివచ్చింది కాబట్టి విన్నాడు;అంతే! అతనికేదీ ఆశ్చర్యాన్ని కాని, ఆసక్తిని కాని కలిగించదు. అన్నీ పాతాలు విన్నట్లే వింటాడు. డెనిసోవ్ చెప్పిన పథకం బాగానే ఉంది. జనరల్ చెప్పిన రిపోర్టూ బాగానే వుంది. కాని కొటొజోవ్ బాగోగులు ఎప్పుడూ చూడడు. అతని ఉద్దేశంలో వాటివల్ల ఏ సమస్యా తేలదు, వీటికి విభిన్నమైనదేదో చిక్కు విడతీస్తుందని అతని అభిప్రాయం.

ఆంద్రూ రాకుమారుడు అతని ముఖాన్ని గమనిస్తూ కూచున్నాడు. అతని ముఖంలో మొట్టమొదటిగా కనిపించింది విసుకు. తరువాత సిల్కుదుస్తుల చప్పుడు విన్నప్పుడు ఆశ్చర్యము, అంతకుమించి మరేమీ కనిపించలేదు.

జనరల్ ఆయనకు అందించిన రిపోర్టు ఇది; సోల్జర్లు పంటలు కోసినందుకు, అడవులు తగులబెట్టినందుకు ఒక రైతు ఫిర్యాదు చేశాడు. దాని తాలూకు రిపోర్టు అది. దానిమీద సంతకం పెట్టమని జనరల్ కోరగా అప్పుడు కొటొజోవ్ ఇలా అన్నాడు:

"దీన్ని తీసుకెళ్ళి తగులబెట్టు! ఇక ఎప్పుడూ ఇలాంటివి నా దగ్గరికి తీసుకు రాకు. పంటలు కోయడానికి, అడవులు తగులబెట్టడానికీ కాక మరెందుకున్నట్లు? నేను వీటిని ఒప్పుకోను. అడవి కొడితే మిడతలు ఎగిరిపోతాయి!" ఇలా అని మళ్ళీ ఒకమాటు ఆ రిపోర్టువంక చూచాడు. "అబ్బే! ఏమిటీ జర్మన్ల నిక్కచ్చి!" అన్నాడు.

# 100

"ఇంతేనా?" అన్నాడు కొటొజోవ్, చివరి కాగితం మీద సంతకం చేస్తూ. తరువాత లేచి లోపలికి వెళ్ళాడు. మతగురువు భార్యసిగ్గుతో ఎర్రబారిన ముఖంతో రొట్టెతోను, ఉప్పుతోను ఉన్న 'ట్రే' తీసుకుని కొటొజోవ్ దగ్గరికి వెళ్ళింది.

అతను ఆవిడ గడ్డాన్ని పుణికాడు.

"చాలా మంచి అమ్మాయివి!" అన్నాడు.

కొన్ని బంగారు నాణాలుతీసి ఆ 'ట్రే'లో ఉంచాడు. "ఇక్కడ మీకు సుఖంగా ఉన్నదా?" అని అడిగాడు, తన కోసం సిద్ధంచేసిన గదిలోకి వెడుతూ. ఆవిడ కూడా ఆయన వెనకాలే చిరునవ్వు నవ్వుతూ లోనికి వెళ్ళింది.

సహాయసేనాధిపతి, ఆండ్రూ రాకుమారుణ్ణి తనతోపాటు భోజనం చేయమని కోరాడు. అరగంట తరువాత అతనికోసం కొటొజోవ్ కబురు పంపాడు. ఆండ్రూ వెళ్ళేసరికి ఆయన పడకకుర్చీలో పడుకుని ఉన్నాడు. మదాం జెన్‌లిస్ వ్రాసిన 'లే షెవ్రలీ డూకైన్' అనే ఫ్రెంచి నవలను చదువుతున్నాడు.

"ఇలా కూచో!" అన్నాడు కొటొజోవ్, పేపర్ నైఫ్‌తో పుస్తకాన్ని అవతల ఉంచి, కూచోవలసిన చోటు చూపిస్తూ, "ఎంత విచారకరం! ఎంత విచారకరం అబ్బాయి! అయినా నేను నీకు తండ్రి తరువాత తండ్రంత వాణ్ణిలే!" అన్నాడు.

ఆండ్రూ రాకుమారుడు తనతండ్రి కడపటి క్షణాలను గురించి తనకు తెలిసినంత వరకూ ఆయనతో చెప్పాడు. తను వెళ్ళేసరికి లిస్సీ-గోరీ ఎలాటి పరిస్థితిలో ఉన్నదీ చెప్పాడు.

"వాళ్ళు మనల్ని ఎంతవరకు తీసుకొచ్చారు!" అన్నాడు కొటొజోవ్, కొంచెం ఆందోళనతో. తరువాత "అయినా సమయం వస్తూ ఉందిలే!" అన్నాడు. తరువాత ఆ విషయం మాట్లాడడం అట్టే ఇష్టంలేక "నేను మీకు ఎంతో కృతజ్ఞుణ్ణి!" అన్నాడు. ఆండ్రూ. "కాని ఇప్పుడు నేను పరివారంలో ఉద్యోగానికి తగి లేను!" అన్నాడు.

అలా అంటూ ఆండ్రూ చిరునవ్వు నవ్వడం చూచి కొటొజోవ్ కలవరంతో అతని వంక చూచాడు. మళ్ళీ ఆండ్రూ "అదీగాక నా దళమంటే నా కెంతో ఇష్టం. అక్కడి ఆఫీసర్లకు నే నంటే ఎంతో అనురాగం ఉంది. వాళ్ళను వదిలిపెట్టి రాలేను. అందుచేత మీ కోరిక మన్నించలేను. నన్ను మీరు క్షమించాలి!" అన్నాడు,

మళ్ళీ చిరునవ్వు నవ్వుతూ. అతనిలా అంటోంటే వృద్ధుని ముఖంలోకి ఒక విధమైన కాంతి వచ్చింది. అతను ఆంద్రూను మధ్యలో ఆపి "నేను ఇందుకు చాలా చింతిస్తున్నాను. నీవు ఇక్కడే ఉంటే నా కెంతో ఉపయోగంగా ఉండేది. ఇక్కడ నాకు సలహాలు ఇస్తున్నవాళ్ళు, ఇవ్వబోయేవాళ్ళు, అంతా కూడా నీ లాగే దళాల్లోకి వెళ్ళి పనిచేస్తే ఎంతబాగుంటుంది! ఆస్టర్‌విడ్జ్ సమరంలో నీ ప్రవర్తన నా కింకా జ్ఞాపకముంది." అన్నాడు.

అప్పుడు ఆంద్రూ రాకుమారుని ముఖంలోకి ఒక ఆనందపూరితమైన కాంతి వచ్చింది. కొటొజోవ్ అతన్ని దగ్గరికి తీసుకుని కౌగలించుకున్నాడు. ఆంద్రూకు మళ్ళీ ఆయన కళ్ళలో నీళ్ళు కనుపించాయి. కాని అవి పైపై కన్నీళ్ళే అని ఆంద్రూకు తెలుసు. తన తండ్రి పోవడం వల్ల ఇప్పుడాయన కొంచెం అనురాగంగా ఉంటున్నాడు. అయిన తనను పొగడడం వల్ల అతనికి కొంచెం సంతృప్తి కలిగింది.

"సరే వెళ్లు. భగవంతుడు నిన్ను రక్షిస్తాడుగాక! గౌరవనీయులు వెళ్ళే దోవ ఇదే! నీవు బుఖారెస్టులో ఉంటే నాకెంతో సహాయంగా ఉంటుంది." అన్నాడు కొటొజోవ్ మళ్ళీ. "నాకు పంపించడానికి ఎవరూ లేకపోయారు....అవును. వారు నన్ను అక్కడ అంతా నిందించారు! మొదట్లో సమరం కోసమనీ, తరువాత శాంతి కోసమనీ. అయినప్పటికీ జరగాల్సిన సమయంలో అన్నీ జరిగాయి. సహనంతో వేచి ఉన్న వారికి అన్నీ దగ్గరికి వస్తాయి. అక్కడ సలహాదార్లంతా పోగయినారు. వారి మాటలు కనుక మనం విని ఉన్నట్లయితే ఇప్పటి వరకూ కూడా సమరం సాగుతూనే ఉండేది. కామెన్‌స్కీ పూర్తిగా నాశనమైపోయి ఉండేవాడు. ఒకకోట పట్టుకోవడమంటే అది చిన్నపని కాని, ఒక దండయాత్ర సాగించడమంటే సామాన్యమైన పనికాదు. వట్టిదాడులవల్ల మాత్రమే ఆ పనికాదు. దీనికి కొంతశాంతి, సహనం అవసరం. కామెన్‌స్కీ రోస్టోక్‌ను పట్టుకోవడానికి తన సైనికులందరినీ పంపాడు. కాని నేను మాత్రం నా సహనం వల్లనే అంతకంటె ఎక్కువ స్థావరాలను పట్టుకున్నాను....నా దెబ్బ చూడు! ఫ్రెంచివారికి కూడా నా రుచి చూపిస్తాను!" అన్నాడు.

"అయినప్పటికీ మనం వారితో యుద్ధం చెయ్యాల్సి ఉంటుంది కదా?" అన్నాడు ఆంద్రూ రాకుమారుడు.

"అవును. ప్రతివారూ అలా ఒత్తిడిచేస్తే తప్పకుండా చేయవలసి ఉంటుంది. కాని నామాట విను. అన్నిటికంటె ఎక్కువైనవి కాలము, సహనము. కాలక్రమేణా గెలుపు వాటిదే. మన సలహాదార్లకు మాత్రమే ఆ విషయం తెలీకుండా ఉంది; అదే

వచ్చిన చిక్కు. ఒకరు ఒకమాట చెపితే మరొకరు మరొకమాట చెపుతారు. అసలు ఏం చెయాలో ఎవరికీ తెలీదు ఏం చేయాలంటావ్?" అని కొటొజోవ్ అతని వంక తెలివిగా చూచి మళ్ళీ ఇలా చెప్పసాగాడు: "అబ్బాయి, నేను చెప్తాను విను-నేనేం చేస్తున్నానో చెపుతాను విను. అనుమానంగా ఉన్నప్పుడు ఏమీ చెయ్యకు." ఇలా అని. "సరే అబ్బాయ్! వెళ్ళిరా. నీవిక్కడ ఉంటే ఎంతో బాగుంటుంది. అయినా వెడుతున్నావు. నేను నీకు రాకుమారుణ్ణి కాదు, ఛీఫ్‌కమాండర్‌నూ కాదు. నీకు తండ్రిలాంటి వాణ్ణి. నీకెప్పుడు ఏది కావలసి వచ్చినా నా దగ్గరికి రా." అంటూ ఆండ్రూను కౌగలించుకున్నాడు.

ఆండ్రూ రాకుమారుడు గదిలోనుంచి వెళ్ళాడో,లేదో కొటొజోవ్ మళ్ళీ పడక కుర్చీలో వాలి "లే షెవల్రీ డూ క్రైస్" నవల మళ్ళీ చదవడం మొదలు పెట్టాడు.

ఈ సంభాషణ ఆండ్రూ రాకుమారునికి ఒక విధమైన ఓదార్పును కలుగ చేసింది. అతను మళ్ళీ తన దళం దగ్గరికి ఎంతో హాయిగా చేరుకున్నాడు.

"తన ఇచ్ఛ కంటె కూడా అతీతమైంది ఏదో ఉన్నదని అతనికి నమ్మకముంది. సంఘటనల నిరంతర గమనంలో అతనికి నమ్మకముంది. వాటిని పైనుంచి పరిశీలిస్తూ ఉంటాడు. వాటి నిజమైన విలువలు తెలుసుకుని తను వాటిలో పాలు పంచుకోకుండా పైనుంచి చూస్తూ ఉంటాడు. అతను ఫ్రెంచి నవల చదువుతూ ఉన్నా, ఫ్రెంచి సామెతలు చెపుతూ ఉన్నా అతని హృదయం మాత్రం రష్యన్ హృదయం! అందుకే ఫ్రెంచి వారిని గురించి అలా మాట్లాడగలిగాడు." ఇలా కొటొజోవ్ గురించి ఆలోచించుకున్నాడు ఆండ్రూ.

నిజానికి కూడా కొటొజోవ్‌కు ఛీఫ్‌కమాండర్ కావడానికి ఎంతో వ్యతిరేకత ఉన్నప్పటికీ అతణ్ణి ఈ పదవిలో నియోగించడానికి కారణం ఇదే. ఈ కారణం వల్లనే అతనిని ఈ పదవిలో నియమించినందుకు జాతి యావత్తు ఏకగ్రీవంగా తన హర్షామోదాలు ప్రకటించింది.

# 101

జార్ వెళ్ళిపోయిన తరువాత మాస్కోనగరం మళ్ళీ తన మామూలు ధోరణిలో పడిపోయింది. పాత అలవాటు, పాత జీవితం మళ్ళీ ప్రారంభమైనాయి. ఆ వేడి చల్లారిపోగానే నిజంగా ఎవరూ రష్యాకు వస్తున్న ప్రమాదం గుర్తించినట్లు కూడా కనిపించలేదు. ఒక్క మాస్కోలో ఇంగ్లీషు క్లబ్‌లోని వారు మాత్రమే తాము ఎలాంటి త్యాగమైనా చేస్తామని మొదట చెప్పినారు. ఏమైనా చక్రవర్తి రావడం

వల్ల జరిగిన విషయం ఒక్కటే. డబ్బు సేకరణ, మనుష్యుల సేకరణ అధికార పూర్వకంగా జరిగింది.

శత్రువు దాపుకు రావడం నగరవాసుల్లో ఎలాంటి మార్పునూ తీసుకురాలేదు. పైగా పరిస్థితి విషమించే కొలదీ వారి కులాసా కూడా ఎక్కువైంది. ఇలాటి సందర్భాలలో రెండు కంఠస్వరాలు వినిపిస్తాయి. ఒకటి దాపుకువస్తున్న ప్రమాదాన్ని గురించి చెప్పి దాన్ని ఎదుర్కోమని చెపుతుంది, మరొకటి అది బాధాకరమైంది కాబట్టి దానినుంచి తప్పించుకుని అది మరచిపోవడానికి కులాసాగా కాలక్షేపం చెయ్యమని చెపుతుంది. ఏకాంతంగా నివశించేవారంతా మొదటి కంఠస్వరాన్ని వింటారు. తక్కిన సామాన్యులంతా రెండోదాన్ని వింటారు. మాస్కో నగరవాసులు ఈ విషయానికి ఋజువుగా వున్నారు. ఈ సంవత్సరం ఉన్నంత కులాసాగా మాస్కో మరెప్పుడూ లేదు.

పుష్కిన్ పద్యాల్లాగానే రోస్టోఫైన్ ప్రహసన ప్రవచనాలు ప్రతిచోటా చదువుకుంటూ చర్చించుకుంటున్నారు. ఆ కాగితాల మీద ఒక సారాపాక బొమ్మ గీచిఉంది. దానికథ ఇది: ఆ నగరవాసి అయిన వృద్ధ సోల్జరు ఒకడు ఈ సారాపాక పెట్టాడు. నెపోలియన్ మాస్కోపై దాడి వస్తున్నాడని విని అతను తనదుకాణం వాకిట్లో నిలబడి కోపంతో ఫ్రెంచి వారిని తిడుతున్నాడు. ఇదీ ఆ బొమ్మలో ఉంది, దీన్ని ఇంగ్లీషు క్లబ్‌లో కొందరు ప్రశంసించారు, కొందరు విమర్శించారు.

నెపోలియన్ ఏజంట్లు ఉన్నారని కొందరు విదేశీయులను మాస్కో నుంచి రోస్టోఫైన్ తరిమివేశాడని క్లబ్‌లో చెప్పుకుంటున్నారు. వెళ్ళిపోయినవారితో గవర్నర్ చెప్పిన ఒక పరిహాసపు మాట కూడా అందరూ చెప్పుకుంటున్నారు.

"జాగ్రత్తగా ఆలోచించి పడవ ఎక్కండి! ప్రవాహానికి వాలుగా వెళ్ళండి, పడవకు మాత్రం బరువు కావద్దు." అన్నాడట గవర్నర్.

కోర్టు కూడా నగరంలోనుంచి మార్చివేశారు. దీన్ని గురించి కూడా షిన్‌షైన్ పరిహాసాలాడుతూ ఉండేవాడు.

మమనోవ్ సమకూరుస్తానని చెప్పినసేన ఎనభై లక్షల రూబుళ్ళ ఖరీదు అవుతుందనీ, పీటర్ బెఝోకొవ్ అంతకంటె ఎక్కువ ఖర్చు చేస్తాడనీ, తను కూడా స్వయంగా సేనలో చేరతాడనీ, అందరూ నివ్వెరపోయి చూడ వచ్చనీ కూడా చెప్పుకుంటున్నారు.

"నువ్వు ఎవ్వరినీ వదిలిపెట్టవేమిటి?" అన్నది జూలియా డ్రౌబెట్ స్కాయ్. ఆవిడ కొద్దిగా ఊలు తీసుకుని తన సన్నని వ్రేళ్ళమధ్య నలుపుతూ అడిగింది. ఆవిడ ఆ మరుసటిరోజు మాస్కో విడిచి వెడుతోంది కాబట్టి అందరికీ పార్టీ ఇస్తోంది. "పీటర్ బెఝోకొవ్‌ను చూస్తే చాలా నవ్వొస్తుంది. కాని చాలా మంచివాడు!" అన్నది ఫ్రెంచిభాషలో.

"జరిమానా పడింది! జరిమానా పడింది!" అన్నాడు రక్షకసేన దుస్తులలో ఉన్న ఒక కుర్రవాడు. జూలియా అతన్ని తన రక్షక భటుడని పిలుస్తోంది. ఆ మరుసటిరోజు అతను కూడా ఆవిడతో కలిసి నిజినీ వరకూ వెళ్ళాలి. అన్ని పార్టీలలో లాగా ఆవిడ పార్టీలో కూడా ఫ్రెంచిభాష మాట్లాడకూడదని ఒక ఒప్పందం వుంది. అలా మాట్లాడిన వారల్లా జరిమానా చెల్లించాలి.

"మీరు రెట్టింపు జరిమానా ఇవ్వాలి. మీరు ఒక వ్యంగ్యం మాట్లాడారు, అందు కని!" అన్నాడొక రష్యన్ రచయిత. "మీరు సామెతగా మాట్లాడారు కాబట్టి రెట్టింపు జరిమానా చెల్లించాలి." అన్నాడు.

"సరే, తప్పుచేశాను. జరిమానా చెల్లిస్తాను." అన్నది జూలియా తను ఫ్రెంచి భాష మాట్లాడినందుకు. "ఇక సామెత విషయమంటారా, దానికి బాధ్యురాలిని నేను కాదు. గలిడ్జెన్ రాకుమారుని లాగా నాకు పాఠాలు నేర్చుకోవడానికి డబ్బు, తీరికా రెండూ లేకపోయినాయి. అడుగో! అతను వస్తున్నాడు!"—అంటూ ఆవిడ మరేదో ఫ్రెంచి సామెత చెప్పబోయి నవ్వుతూ మళ్ళీ తన్నుతాను చిక్కబట్టుకుని రష్యన్ భాషలో చెప్పింది. "నన్ను మళ్ళీ పట్టుకోలేం! ఇప్పుడు నీ విషయమే మాట్లాడు కుంటున్నాం. నీ దళం చాలా మంచిదని అనుకుంటున్నాం." అన్నది అప్పుడే అక్కడికి వచ్చిన పీటర్‌తో.

"నా ముందు మాత్రం ఆ మాట చెప్పకండి." అన్నాడు పీటర్.

"నీవే దానికి నాయకత్వం వహిస్తావటగా?" అన్నది మళ్ళీ జూలియా. తరు వాత తన ప్రక్కనున్న కుర్రవాని వంక చూచింది. కాని అతనేమీ ప్రతిస్పందించ లేదు.

"అదేమిటి! అదేం లేదు." అన్నాడు పీటర్ నవ్వుతూ. నేను ఫ్రెంచి వారికి మంచి ఎరయే అవుతాను." అన్నాడు.

"వెంటనే వారి కబుర్లు ఒక విషయంలో నుంచి మరొక విషయంలోకి మారి, రోస్టోవ్‌ల కుటుంబంమీదికి వెళ్ళాయి.

"నీకు తెలుసా ఈ విషయం? వారి పరిస్థితులన్నీ బాగా విషమించాయి. కౌంట్ చూడబొతే వృద్ధుడు. అదీకాక తెలివితక్కువవాడు. రజుమస్కీ ఆయన ఇల్లు,ఎస్టేటు కొంటానని చెప్పాడు. అతను ఎక్కువ ధర అడుగు తున్నాడు కాబట్టి చెయ్యిదాటి పొయ్యేటట్లుగా ఉంది" అన్నది జూలియా.

"బేరం కుదిరేటట్లుగా ఉంది. అయినా ఈ రోజుల్లో ఇళ్ళు కొనడం వట్టి మూర్ఖత్వం." అన్నారు మరొకరు.

"అదేం? నిజంగా మాస్కో ప్రమాదంలో ఉన్నదంటారా?" అని అడిగింది జూలియా.

"లేకపోతే నీవు ఎందుకు వెడుతున్నట్లు?"

"ఏమిటీ ప్రశ్న? అందరూ వెడుతున్నారు కాబట్టి నేనూ వెడుతున్నాను." అన్నది జూలియా.

"కౌంట్ రోస్టోవ్ ఖర్చు తగ్గించుకుంటే ఈ గొడవలేమీ ఉండవు. ఆయన చాలా మంచివాడే కాని ఆయనకు వ్యవహారాలు చూచుకోవడం చాతకాదు...వారు కూడా ఇక్కడ నుంచి వెళ్ళిపోతున్నారటగా?" అన్నాడొక కుర్రవాడు.

"నటాషాకు జబ్బు నయమైందా, కాలేదా?" అని అడిగింది జూలియా.

"వారు కోసక్కుగా సేనలో చేరిన తమ చిన్న కుర్రవాడి (పేట్యా) కోసం ఎదురు చూస్తున్నారు. అతను బిలియా వెళ్ళాడు ఇప్పుడు నా దళంలో చేరబోతున్నాడు. కౌంట్ వెళ్ళేవాడే కాని, కౌంటెస్ మాత్రం కొడుకును చూచేవరకూ కదలనన్నది."

"నేను మూడు రోజుల క్రితం వారిని ఆర్గోవ్‌ల ఇంట్లో కలుసుకున్నాను. నటాషా పూర్వం కంటె ఎంతో అందంగాను, కులాసాగాను ఉంది. పాట కూడా పాడింది...కొందరు ఎంత త్వరలో మరిచిపోతారు!" అన్నది జూలియా.

"ఏమిటి మరిచిపోయేది?" అని అడిగాడు పీటర్. జూలియా మళ్ళీ చిరునవ్వు నవ్వింది.

"కాని నీకో విషయం తెలుసా కౌంట్? నీలాంటి వీరులు మదాం డీసౌజా వ్రాసిన నవలల్లో మాత్రమే ఉంటారు!" అన్నది జూలియా.

"ఎలాటి వీరులు? నా కర్థంకావడం లేదే?" అన్నాడు పీటర్ సిగ్గుపడుతూ.

"బాగా చెప్పావయ్యా: అలా అనకు, మాస్కోకంతా నీ కథ తెలుసు. నాకూ తెలుసులే!" అన్నది మళ్ళీ జూలియా ఫ్రెంచి భాషలో.

"జరిమానా పడింది! జరిమానా పడింది!" అన్నాడు మళ్ళీ కుర్రవాడు.

"ఆ, తరువాత?" అన్నది జూలియా. "ఈ రోజుల్లో మాట్లాడడానికే వీలు లేకుండా ఉంది. కాని నీకు తెలుసు కదా....?" అన్నది.

"నాకేమీ తెలీదు." అన్నాడు పీటర్.

"నాకు తెలుసులేవయ్యా నీవు నటాషాకు స్నేహితుడవని! కాని నాకు వేరా అంటే ఎంతో ఇష్టముండేది."

"అది కాదు. నే నెప్పుడూ నటాషా తరఫున వకాల్తా పుచ్చుకో లేదు. నేను రోస్టోవ్‌లను చూచి కూడా ఒక నెల కావస్తోంది." అన్నాడు పీటర్.

"సరేలెద్దూ" అన్నది జూలియా చిరునవ్వు నవ్వుతూ, వ్రేళ్ళ మధ్య ఊలు తిప్పుతూ. కాని తరువాత ఆ విషయం మార్చి "నిన్న సాయంత్రం నే నెవర్ని కలుసుకున్నానో తెలుసా? పాపం, మేరియా బోల్‌కోన్‌స్కీని కలుసుకున్నాను. ఆవిడ తండ్రి చనిపోయాడు. నీకు తెలుసా?" అన్నది.

"నిజంగానా? ఇప్పుడావిడ ఎక్కడ ఉంది? నా కావిడను చూడాలని ఉంది." అన్నాడు పీటర్.

"రేపు ఆవిడ ఇక్కడ నుంచి బయలుదేర బోతోంది. తన మేనల్లుణ్ణి కూడా తనతో తీసుకెళ్ళబోతోంది.

"ఇప్పుడావిడ ఎలా ఉంది?" అని అడిగాడు పీటర్.

"చాలా విచారంగా ఉంది. కూలిపోయింది. కాని ఆవిడను ఎవరు కాపాడారో తెలుసా? అదొక కథలే. నికోలస్ రోస్టోవ్! ఆవిడను రైతులు చుట్టుముట్టి చంపేసే వారే. సేవకులకు కూడా దెబ్బలు తగిలాయి. అప్పుడు నికోలస్ అక్కడికి వచ్చి ఆవిడను ప్రమాదం నుంచి తప్పించి కాపాడాడు." అని చెప్పింది జూలియా.

"నిజంగా ఈ ప్రణయం చిత్రంగానే ఉంది!" అన్నాడు కుర్రవాడు. "ఈ గొడవలో పెళ్ళికాని మన కన్యల నందరినీ ఎత్తుకుని పొయ్యేటట్లున్నారు, చూడ బోతే! మొదట కాచీని, తరువాత మేరియా రాకుమారిని!" అన్నాడు.

"ఒక విషయం మాత్రం నాకు రూఢిగా తెలుస్తోంది. ఆ అమ్మాయి అ అబ్బాయితో కొంచెం ప్రేమలో పడింది!" అన్నది జూలియా, ఫ్రెంచి భాషలో.

"జరిమానా! జరిమానా! వెంటనే చెల్లించాలి!" అన్నాడు కుర్రవాడు.

"కాని ఈ మాట మరో భాషలో ఎలా చెప్పాలో చెప్పు?" అన్నది జూలియా, ఆ కుర్రాడితో నవ్వుతూ.

# 102

ఆ సాయంత్రం ఇంటికి వెళ్ళేసరికి పీటర్ టేబిల్ మీద రోస్టోప్‌ఛైన్ పంపిన రెండు సర్క్యులర్ నోటీసులున్నాయి. మొదటి దానిలో అందరూ చెప్పుకున్నట్లుగా తను నగరవాసులు నగరం వదిలి వెళ్ళడాన్ని నిరోధించ లేదని చెప్పుకున్నాడు. పెద్ద కుటుంబాల స్త్రీలను, వర్తకుల భార్యలను అతను అక్కడే ఉండమని కోరిన మాట వాస్తవమే. ఎందుచేతనంటే ఇదంతా ఎవరో పుట్టించిన పుకారు మాత్రమేననీ, ఇందులో వచ్చిన భయం ఏమీలేదనీ వారితో చెప్పాడు. ఈ ప్రకటన చూచే సరికి ఫ్రెంచివాను తప్పకుండా మాస్కో వచ్చి తీసతారని పీటర్ అనుకున్నాడు.

రెండవ దానిలో రష్యన్ ప్రధాన కార్యాలయాలు వియజ్మాలో స్థాపితం కావించారనీ, కౌంట్ విట్‌గెన్‌స్టీన్ శత్రువును దెబ్బ తీశాడని, ఆయుధాలు ధరించా లని కోరిక ఉన్న ప్రతి వారికీ తక్కువ ధరల్లో ఆయుధాలు దొరుకుతాయనీ వ్రాశారు. ఈ ప్రకటనలో మాత్రం సాధారణంగా కనిపించే వ్యంగ్యం అట్టే కనిపించ లేదు. పీటర్ మాత్రం తను అనుకుంటోన్న తుఫాను దాపుకు వస్తోందని ఊహించ సాగాడు.

"ఇప్పుడు నేనేం చెయ్యాలి? సేనలో చేరాలా? లేక ఉన్నచోటనే ఉండి

చూస్తూ వూరుకోవాలా?" ఇలా అనుకుని పీటర్, టేబిల్ మీద ఉన్న పేక తీసుకు న్నాడు. "పేషన్స్ ఆట ఆడుతాను... సరిగా వస్తే....అప్పుడు...." అని పేక ముక్కలు కలిపి చూరు వంక చూచాడు.

అతను నిశ్చయించుకునే లోగానే ముగ్గురు రాకుమార్తెలలోను పెద్దావిడ వాకిటి దగ్గరికి వచ్చింది— తక్కిన ఇద్దరు రాకుమార్తెలకూ వివాహాలై వెళ్ళి పోయారు.

"రా, రా! లోపలికి రా!" అని ఆవిడను పీటర్ పిలిచాడు. "పేషన్స్ ఆట సరిగా వస్తే సేనలో చేరతాను." అనుకున్నాడు తనలో తాను.

"నీ పనికి భంగం కలిగిస్తున్నందుకు క్షమించు రాకుమారా, మనం ఏదో ఒకటి చెయ్యాలి. అందరూ మాస్కో వదిలి వెడుతున్నారు. అంతా గందరగోళంగా వుంది. వాతావరణం బాగా లేదు ప్రజలు తిరుగుబాటు చేసేలా ఉన్నారు. మనం ఇక్కడ ఉండడం మంచిదేనా?" అని అడిగింది.

"నాకు మాత్రం అంతా సుముఖంగానే — హాయిగా ఉన్నట్లుగానే ఉంది." అన్నాడు పీటర్.

"హాయిగానా? అదేమిటి? ఇవాళ ఉదయమే బార్బారా ఇవనోవ్నా మన సేనలు ఎలా పురోగమించాయో చెప్పింది. కాని ఇక్కడ మాత్రం ఎవ్వరూ మన మాట వినడం లేదు. నా పరిచారిక కూడా నా మాట వినడం లేదు. ఫ్రెంచివారు తప్ప కుండా వస్తారు. వారు వచ్చే దాకా మనం ఇక్కడ ఎందుకు కాచుకుని కూచోవాలి? నేను మీ బోనపార్టీకి లొంగను. నన్ను మాత్రం పీటర్స్‌బర్గ్ పంపించు."

"ఇదేమిటి నీ వెర్రి? ఇదంతా నీకెవరు చెప్పారు. ఇదీ కాక..."

"ఎవరేం చేసినా నేను మాత్రం ఇక్కడ ఉండను. నేను వెళ్ళాలి.''

"అలాగే, అలాగే! నీవు వెళ్ళడానికి అన్ని ఏర్పాట్లూ చేస్తాను." అన్నాడు పీటర్.

రాకుమార్తె తనకెవరూ పోట్లాడడానికి దొరక్క కుర్చీ చివర కూచుని తనలో తానే ఏదో గొణుక్కుంది.

"నీ కొచ్చిన వార్తలేవీ నమ్మదగినవి కావు. నగరం ప్రశాంతంగా ఉంది. వచ్చిన ప్రమాదమేమీ లేదు. ఇదిగో! ఇది చదువుకో." అంటూ పీటర్, ఆవిడకు ఆ సర్క్యులర్ అందించాడు. "కౌంట్, ఫ్రెంచి వారు మాస్కో రారని చెపుతూ ఉన్నారు చూడు!" అన్నాడు.

"కౌంట్ విషయమా?" అన్నది ఆవిడ కోపంతో. "అతను వట్టి దొంగ! అతనే

ప్రజల్లో ఈ అశాంతినంతా రేకెత్తిస్తున్నాడు. అర్థంలేని మాటలు మాట్లాడుతున్నాడు. వీధిలో ఫ్రెంచి భాష మాట్లాడి నందుకు బార్బరా ఇవనోవ్‌నాను కూడా చంపబో యారు చూచావా?" అన్నది.

"ఇందులో చాలా అతిశయం ఉంది. నీవు మరీ అన్నీ ఎక్కువగా పట్టించు కుంటావు." అని పీటర్, పేకముక్కలు పరవడం మొదలుపెట్టాడు.

పేషన్సు ఆట సరిగానే వచ్చింది. కాని పీటర్ సేనలో చేరలేదు. అతను మాస్కోలోనే ఉన్నాడు. మాస్కో నెమ్మదిగా నిర్జనమైపోతోంది. తను అనిశ్చితంగా ఉన్నా ఒక విధమైన సంతృప్తితో రానున్న ప్రమాదాన్ని చూస్తూ ఉన్నాడు పీటర్. రాకుమారి ఆ మరునటిరోజే వెళ్ళిపోయింది. అతని ఎస్టేటు మేనేజరు ఆయన దగ్గరికి వచ్చి ఒక ఎస్టేటు అమ్మడంవల్ల ఆయన దశానికి తగిన డబ్బు వసూలు కాదని చెప్పాడు. అందువల్ల ఆయన నాశనమైపోతాడని కూడా చెప్పాడు.

"కాని, అమ్మెసెయ్!" అన్నాడు పీటర్ చిరునవ్వు నవ్వుతూ. "నేను మళ్ళీ నా మాట తిరిగి తీసుకోలేను." అన్నాడు.

ముఖ్యంగా తన పరిస్థితులు విషమించే కొద్దీ పీటర్‌కు ఆనందం కూడా మరింత ఎక్కువవుతోంది. అతను ఏదో రానున్న ప్రమాదం కోసం ఎదురుచూస్తూ కూచున్నాడు.

నగరం ఇంచుమించు పూర్తిగా నిర్జనమైపోయింది. జూలియా వెళ్ళిపోయింది. మేరియా రాకుమారి కూడా వెళ్ళిపోయింది. పీటర్ పరిచితుల్లో కల్లా అక్కడ ఉన్న వారు రోస్టోవ్‌లు మాత్రమే. కాని వారిని కూడా అతను వెళ్ళి చూడడం లేదు. ఒక మాటు ప్రక్కనున్న వొరంట్ జోవో గ్రామానికి వెళ్ళి అక్కడ చక్రవర్తి ఆజ్ఞపై లెపిచ్ పర్యవేక్షణ క్రింద కట్టిన ఒక పెద్ద బెలూన్‌ను చూచి వద్దామనుకున్నాడు. జార్ ప్రత్యేకంగా అతన్ని కౌంట్ రోస్టొప్‌చైన్‌కు సిఫార్సుచేశాడని పీటర్‌కు తెలుసు.

అందులోని విషయాలు ఇవి :

"లెపిచ్ సిద్ధంకాగానే కొందరు మేధావులను అతని దగ్గరికి పంపించు. ఒక ప్రత్యేక రాయబారిని ఈ విషయం తెలపడం కోసం కొటొజోవ్ వద్దకు పంపించు. నేనప్పుడే అతనికి అన్ని ఏర్పాట్లూ చేశాను. లెపిచ్ మొదటిసారిగా అక్కడ దిగేట ప్పుడు జాగ్రత్తగా ఉండమనిచెప్పు, లేకపోతే శత్రువుల చేతుల్లో చిక్కుతాడు. అతను ఛీఫ్ కమాండర్‌తో సహకరించడం మంచిది."

వారంట్ జోవో నుంచి తిరిగి వస్తూ ఉండగా పీటర్‌కు ఉరితీసే కూడలిలో ఒక పెద్ద జనసమూహం కనిపించింది. అతను బండి ఆపి దిగాడు. గూఢచారిగా అనుమానించబడిన ఒక ఫ్రెంచి వంటవాణ్ణి కొరడాలతో కొడుతున్నారు. ఉరితీసేవాడు ఆ ఫ్రెంచి వాడి కోటు, లాగులూ విప్పుతూ ఉండగా వాడు పెద్దగా కేకలుపెట్టి ఏడుస్తున్నాడు. పీటర్ కూడా పాలిపోయిన ముఖంతో త్రోవ చేసుకుని అక్కడికి వెళ్లాడు. అంతా ఆనందంతో ఆ దృశ్యం చూస్తున్నారు. పీటర్ అడిగిన ప్రశ్నలకు అక్కడ ఎవరూ సమాధానం చెప్పలేదు.

ఆ ఫ్రెంచివాడు నిటారుగా నిలబడి కోటు విప్పేశాడు. వెక్కి వెక్కి ఏడవ సాగాడు అతని పెదవులు అదురుతున్నాయి. చుట్టూ చేరిన జనసమూహం పెద్దగా అరవసాగింది.

"రాకుమారుని వంటవాడు!" అన్నారు జనంలో నుంచి ఒకరు.

"నే చెప్పేది విను. అది తినడానికి రష్యా వాళ్ళకైతే బాగుంటుంది కాని, ఫ్రెంచివాళ్ళకు చాలా ఘాటుగా ఉంటుంది. నోట్లో పెట్టుకునేసరికి పళ్లు ఇనకరుచుక పోతాయి. అవునా?" అన్నాడు వృద్ధుడైన ఒక గుమాస్తా ఏదో వంటకాన్ని గురించి చెపుతూ, తను మాట్లాడిన ఛలోక్తికి మిగిలిన వాళ్లు ఎలా ఆనందిస్తున్నారో అని చుట్టూ కలయచూచాడు. కొందరు నవ్వుతున్నారు; కొందరు ఆ ఉరితీసే వాడివంక తదేకంగా చూస్తూ, అతను రెండో నేరస్తుణ్ణి పట్టుకుని దుస్తులు ఊడలాగేసరికి, భయంతో పరిశీలించ సాగారు.

పీటర్ పెద్దగా ఎగశ్వాస పీల్చికనుబొమలు ముడుచుకుని హఠాత్తుగా వెనక్కు తిరిగాడు. ఏవో వినీ వినపడని మాటలను గొణుక్కున్నాడు. మళ్ళీ అతను తన బండిలో ఎక్కి కూచున్నాడు. బండిలో వెడుతున్న కొద్దీ బండి కదలికతో పాటు తాను కూడా ఊగిసలాడడం మొదలుపెట్టాడు.

"మనం ఎక్కడికోయ్ వెళ్ళేది?" అని హఠాత్తుగా తన బండివాణ్ణి అడిగాడు పీటర్.

"గరవ్నర్ [illegible]కి తీసుక వెళ్ళమన్నారు కదయ్యా!" అని చెప్పాడు బండివాడు.

"బుద్ధిలేని మొ[illegible] [illegible]బండ వెధవ!" అని అరిచాడు పీటర్ కోపంగా. "నేను నీకు ఇంటికి తోలమని [illegible]దూ చెప్పాను? నేను వెళ్లాలి ఇవాళే ఇక్కడ నుంచి—శీఘ్రంగా వెళ్ళిపోవాలి!" అన్నాడు.

ఈ దృశ్యం చూచేసరికి పీటర్‌కు తక్షణం మాస్కో వదిలి వెళ్ళిపోదామని పించింది. అతను ఇంటికి వెళ్ళగానే బండివాణ్ణి పిలిచి వెంటనే గుర్రపుబగ్గీని సిద్ధం చేయమని చెప్పాడు.

ఆగస్టు 24 వ తారీఖు సాయంత్రం, పీటర్ మాస్కో నుంచి బయలుదేరాడు. కొన్ని గంటల తరువాత పెర్కోవ్‌లో గుర్రాలు మార్చుకోవడం కోసం ఆగాడు. అక్కడ పెద్ద భూకంపమంత యుద్ధం జరిగిందని అతనికి చెప్పారు. కాని ఎవరు గెలిచిందీ అతనికెవరూ చెప్పలేదు. అదే షెవార్డిన్ సమరం.

అతను తెల్లవారేసరికి మొజెస్క్ చేరాడు. అక్కడ ప్రతి ఇంట్లోనూ సేనలు విడిది చేసి ఉన్నాయి. సత్రం పెరట్లో, అతని సేవకుడు, బండివాడు అతని కోసం వేచి ఉన్నారు. కాని అతను విడిది చెయ్యడానికి గదులు చిక్కలేదు. గదులన్నీ ఆఫీసర్లు ఆక్రమించుకున్నారు. దళాలింకా ప్రవాహంలాగా వస్తూనేఉన్నాయి. అన్ని వైపులా పదాతి దళాలు, ఆశ్వికదళాలు, సామాన్ల బండ్లు తప్ప మరేమీ కనిపించడం లేదు. పీటర్ త్వర త్వరగా ముందుకు సాగిపోయాడు. అతను మాస్కోకు దూర మయ్యే కొద్దీ అత నీ సేనా సముద్రంలో కలిసిపోయాడు.మాస్కోలో తొలిసారిగా జార్ వచ్చినప్పుడు ఎలాంటి ఉత్సాహం కనిపించిందో ఇప్పుడూ అంతటా అలాంటి ఉత్సాహమే కనిపిస్తోంది. ఈ క్షణంలో కూడా పీటర్‌కు సాధారణంగా మనం సుఖాలనుకునే విషయాలు; జీవితంలోని సుఖాలు, భోగభాగ్యాలు,- జీవితం; ఇవన్నీ కూడా తనకు దూరంగా కనిపించే ఒక దర్శనంతో పోల్చి చూస్తే అతనికి అన్నీ కూడా చాలా అల్పమైనవిగా కనిపించాయి.ఎవరి కోసం కాని, ఎందుకోసం కాని త్యాగం చెయ్యడమనేదే అతనికి ఒక అనిర్వచనీయమైన ఆనందాన్ని కలుగ చేసింది.

## రెండవ సంపుటం

## -: దండయాత్ర సమాప్తం

# యుద్ధం - శాంతి

విశ్వ సాహిత్యంలో 'యుద్ధం - శాంతి' (WAR AND PEACE) అగ్ర శ్రేణికి చెందిన నవల.

టాల్‌స్టాయ్ తన 36 వ యేట ఈ రచనకు పూనుకుని, ఆరు సంవత్సరాలకు పూర్తి చేయగలిగాడు. ఆతను ఎన్నుకున్న కాలం - నెపోలియన్ యుద్ధకాలం. నెపోలియన్ రష్యాపై దండెత్తడం, మాస్కో నగరాన్ని మంటల్లో ముంచెత్తి, చివరకు సేనంతా మంచుతో పూడుకుని నాశనం కాగా, నెపోలియన్ పరాజితుడై పలాయనం చేయడం ఈ నవలలో ఉత్కర్ష.

ఇతివృత్తం - అభిజాతి వర్గానికి చెందిన నాలుగు కుటుంబాలపై ఆధార పడింది. ఇందులో ఇంచుమించు అయిదు వందల పాత్రలకు పైగా వున్నాయి. ప్రతి పాత్రకూ రచయిత ఒక స్పష్టమైన వ్యక్తిత్వాన్ని ఇచ్చాడు. ఇది సాధించడం సామాన్యమైన విషయం కాదు.

టాల్‌స్టాయ్ స్నేహితుడైన స్ట్రోవ్ అనే విమర్శకుడు ఈ నవలను గురించి చెబుతూ "మానవ జీవన సమరం, ఆ కాలపు రష్యా దేశ చరిత్ర ప్రతిబింబి స్తుంది. ఆనాటి ప్రజల సుఖదుఃఖాలు, మంచిచెడులు, వీటన్నింటి సామూహిక చిత్రమే 'యుద్ధం - శాంతి' అన్నారు.

పాశ్చాత్య సాహిత్యంలో 'మహా భారతాన్ని' పోలిన ఈ నవల చదివినప్పుడు ఒకవైపున యుద్ధము - మరోవైపున శాంతి, ఈ రెంటికీ మధ్య అనేక ఉత్తమ కుటుంబాలు, ఆ కుటుంబాలకు చెందిన మానమర్యాదలు ఏ విధంగా ఊగిసలాడినాయో మనకు గోచరిస్తుంది.

జీవితం నుంచి దూరమై పోవడం వల్ల కాక, జీవితాన్ని అవగతం చేసుకోవడం వల్లనే మనం సత్యం దర్శించిన వారమవుతామని ఆంద్రూ రాకుమారుని ద్వారా టాల్‌స్టాయ్ చెప్పిన మాటలు ఈ నవలకు సందేశం మరియు పరమార్థం.

—*—

ఈ మహోన్నత నవలను మూడు సంపుటాలుగా ప్రచురించాము.